

సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి, జ్ఞాన, ధర్మ ప్రచారార్థం మహానుభావులైన శ్రీ రామకృష్ణ మఠ్ వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన మాసపత్రికలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు.వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. ఈ మాసపత్రికలు క్రొత్తవా లేక పాతవా? అని చూడకుండ, అందులోగల రత్నాలలాంటి విషయాలను తెలుసుకోవటానికి ప్రయత్నం చేయగలరు అని మనవిచేసుకొంటున్నాము..

ఈ మాసపత్రికలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) రామకృష్ణ మఠ్ వెబ్ సైట్: http://www.rkmath.org
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.



**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## రామకృష్ణ మఠ్ వారి వెబ్ సైట్

## http://www.rkmath.org



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# శ్రీ మ ద్భ గ వ ద్గీ త

అనువాదకులు :

శ్రీ నిర్వికల్పానందస్వాములవారు

ఇది మూలశ్లోకములు, ప్రతిపదార్థము, ధారాళమగు అనువాదము, శ్రీధరీయ, టీకాసారము, విశేషాంశములు, సానువాదగీతాపాఠక్రమము, ధ్యానమాహాత్మ్యములు సమభావాత్మకములగు ఉపనిషద్వాక్యసూచిక, వేదాంతసూత్రసూచిక, గీతాశ్లోకసూచిక, శబ్దానుక్రమణిక—ఇన్నిటితో విరాజిల్లుచున్నది.

భక్తులకు సాధకులకు మాత్రమేకాక కళాశాల విద్యార్థులకు సైతము ఉపయుక్తమయిన దివ్యగ్రంథము.

పుటలు : 58+440　　(అందమయిన అష్టమ ముద్రణము)　　వెల : రూ 9.00

# 'మాదివ్యవాణి' గ్రంథమాల

నేడే కొనండి !　　　　పదే పదే చదవండి !!

దివ్యావతారమూర్తుల విశ్వోపజీవ్యములైన అమృత మధుర సూక్తులు సర్వసుగ్రహము హృదయ సన్నిహితమునైన తేటతెనుగున వీనిలో అందజేయబడ్డాయి. ఇందులో ఒక్కొక్కటి నిరుత్సాహులకు ఉత్సాహప్రదం, అశాంతిసంక్షుభితులకు శాంతిదాయకం, సంశయాందోళితులకు సంశయాపనోదకం, జిజ్ఞాసువులకు పరమార్థజ్ఞాన సమర్పకం, అందరికీ శిక్షకం, సంస్కారకం, నిర్వృత్త్యాపాదకం. మువ్వన్నెల మేలి జాకెట్టుతో పాకెట్టుసైజులో చక్కని తయారింపు—

| | | | |
|---|---|---|---|
| శ్రీ రామకృష్ణ ఉవాచ | 0-80 | శ్రీ కృష్ణవాణి | 0-80 |
| శ్రీ శారదాసూక్తి నవనీతము | 0-80 | బుద్ధ ఉవాచ | 0-80 |
| శ్రీ వివేకానంద శంఖారావము | 0-80 | క్రైస్తు సూక్తిమాల | 0-80 |

మహమ్మదు సూక్తిమంజరి　0-80

ఇట్లు వ్రాయుడు :

మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠము, మైలాపూరు, మద్రాసు - 600004.

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౩౧ ౧౯౭౫ - జనవరి : ఆనంద - పుష్యము సంచిక ౮

## విషయసూచిక



## శ్రీ వివేకానందస్వాములవారి 113-వ జన్మదినోత్సవము

తిథిపూజ : 2-2-1975 ఆదివారము : ఉదయము 6 మొ॥ 11 గం॥వఱకు : ప్రత్యేకపూజ, భజన, హోమము మున్నగునవి

ఉదయము 8 గంటలకు మెరీనాబీచ్‌లోని శ్రీ వివేకానందస్వామిజీమూర్తికి పుష్పమాలాలంకరణము.

మఠమున బహిరంగోత్సవము 9-2-1975 ఆదివారము అపరాహ్ణము 3-30 మొ॥ 7-30 గం॥వఱకు

అపరాహ్ణము 3-30 గంటలకు : బ్రహ్మశ్రీ పీదామంగళం కృష్ణమూర్తి భాగవతులుగారిచే
'శ్రీశంకరవిజయము' సంగీతప్రవచనము.

5-30 ,, బహిరంగసభ : అధ్యక్షులు : శ్రీమత్తపస్యానందస్వాములవారు.
ఆంగ్లోపన్యాసకులు : గౌ. న్యాయమూర్తులు : శ్రీ V. సేతురామన్‌గారు.

### ఇతర మహోత్సవములు

26-1-'75 ఆదివారము. శ్రీమత్ తురీయానందస్వాములవారి జయంతి

13-2-'75 గురువారము : శ్రీమత్ బ్రహ్మానందస్వాములవారి జయంతి

15-2-'75 శనివారము : శ్రీమత్ త్రిగుణాతీతానందస్వాములవారి జయంతి

25-2-'75 మంగళవారము : శ్రీ అద్భుతానందస్వాములవారి జయంతి

ఈ ఉత్సవములన్నింటియందు భక్తులెల్లరును పాల్గొని భగవంతుని అనుగ్రహభాగ్యమును బడయగోరుచున్నాము.

అధ్యక్షులు,

శ్రీరామకృష్ణమఠము, మద్రాసు-600004.

‘అఖిలవిభు శరణొందుము, యా క్షణంబ యతనికృప నీదు వసుభూతి కందు వత్స’

—శ్రీ శారదామణి.


# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౩౧ } ౧౯౭౫ – జనవరి : : ఆనంద – పుష్యము { సంచిక ౭


ఓమ్

## త్రిపురసున్దర్యష్టకము

మూలము : శ్రీశంకరభగవత్పాదులు

వ్యాఖ్యాత : అన్నమాచార్య

సకుఙ్కుమవిలేపనా, మలకచుమ్బికస్తూరికాం,
సమోదహసితేక్షణాం, సశరచాపపాశాఙ్కుశామ్,
అశేషజనమోహినీ, మరుణమాల్యభూషామ్బరాం,
జపాకుసుమభాసురాం, జపవిధౌ, స్మరా, మ్యమ్బికామ్॥

సకుఙ్కుమవిలేపనాం = కుంకుమపూలఘుమఘుమని మైపూతగలదియు, అలకచుమ్బికస్తూరికాం = ముంగురులతాకు కస్తూరి (బొట్టు) కలదియు, సమోదహసిత + ఈక్షణాం = సంతోషముతోను చిఱునవ్వు వికాసముతోను గూడిన చూడ్కులు గలదియు, అశేషజనమోహినీమ్ = సకల జీవులను అమోఘముగ మరులుగొల్పునదియు, అరుణమాల్యభూష + అమ్బరాం = ఎఱుపువన్నెమాలలు నగలు వస్త్రములు దాల్చినదియు, జపాకుసుమభాసురాం = దాసనపూల వన్నెవంటి వన్నెతో వెలుగొందునదియు నగు అమ్బికామ్ = త్రిపురసుందరీదేవిని, జపవిధౌ = జపక్రియలో, స్మరామి = స్మరింతును.

“జననీ, ఆనందమయీ, దర్శనము ఒసంగుము, ఒసంగక తప్పదు. ఓ విశ్వేశ్వరీ, ఓ దీనజనప్రపాలినీ, నిజముగ నేను నీమేలుబడిలో నున్న విశ్వమునకు వెలియైన వాడను గాను. నాకు జ్ఞానము లేదు, భక్తి లేదు, ఎట్టి శిక్షణమును లేదు. నేను ఏమియు ఎఱుగను. నీవు కనికరించి దర్శనము ఒసంగవలయును.”

—శ్రీరామకృష్ణుడు.

సంస్కారము స్త్రీపురుషులు తమ జీవితాశయ పరిపూర్తికై కొనసాగించు సహకారోద్యమమునకు ప్రాతిపదిక. వివాహబంధము పవిత్రమైనదనుట ఈ దృష్టితోనే. వివాహము కేవలము వ్యక్తిగతమగు విషయభోగమునకు మాత్రమే యను వాదమును మన సనాతన సంప్రదాయ మెప్పుడును నిరసించును. దంపతులిరువురును ఆధ్యాత్మిక జీవితమున భాగస్వాములు. ఒకే లక్ష్యము నందుకొనుటకై ఇరువురును పరస్పరము సహకరించుకొనుచున్నారు. కనుక పరిశుద్ధాత్ములకు వివాహము ఆత్మల సమ్మేళనమే కాని వేఱు కాదు. దీనికి ప్రత్యక్షనిదర్శనమే శ్రీ శారదారామకృష్ణుల దివ్యజీవనము.

నేటి పాశ్చాత్యమహిళలు, పారమార్థిక దృష్టియే లేనివారు, తమ జీవితమందలి కొఱతను గుర్తించియు దాని నివారణోపాయమును తెలిసికొనలేక పురుషులతో అన్నిరంగములందును సమానహక్కులు కావలెనని పోరాడుచున్నారు. స్త్రీపురుషులు సాంఘికజీవనమున విభిన్నబాధ్యతల నిర్వహింపవలసి యుండుటను వా రంగీకరింపరు. ప్రస్తుతసమయమున భారతీయమహిళలుకూడ నట్టి పాశ్చాత్యుల యడుగుజాడలయందే వ్యామోహితులై నడువజూచుచున్నారు. యుగయుగములుగా వచ్చు గార్హస్థ్య బాధ్యతలను వారు చిన్నచూపు చూచుచున్నారు. 'విశాల' జీవితమును 'స్వేచ్ఛా'జీవితమును గడప నుద్యమించుచున్నారు. ఇది యెంతయు శోచనీయము. "మాకు హక్కులు కావలయును. బాధ్యతలు వలదు" అని కోలాహలముచేయుట యెంతయు దుఃఖదాయకము. ఇట్టి పరిస్థితులలో ప్రపంచ మహిళ లెట్లు భారతీయసంప్రదాయమున జీవించుచునే పరమార్థమును బడయుదురో దృష్టాంతీకరించుటకే శ్రీ శారదాదేవి యాగమనము. ఆదర్శగృహస్థజీవితమును గడపుచునే కొమరితగా భార్యగా కోడలుగా సోదరిగా తల్లిగా తమ బాధ్యతల నద్భుతముగా నిర్వహించుచునే స్త్రీ లెట్లు పురుషుల నుద్బోధితుల జేయగలరో పురుషులవే యని భావింపబడు బాధ్యతలనుకూడ నెట్లు నిర్వహింపగలరో ప్రదర్శించుటకే శ్రీ శారదాదేవి రాక.

మాతృదేవి శ్రీ శారదజీవితమును పరిశీలించునపుడు అందు మనల నాకర్షించు విషయములలో మొదటిది ఆమె గడపిన యతిసామాన్యమైన జీవితము. ఆమె బాల్యస్నేహితురాం డ్రెందరో "మేము బాల్యమునుండియు ఆమెతో నాడుచు పాడుచు తిరుగుచుంటిమి. కాని ఆమెయం దెట్టి ప్రత్యేకాంశములను మేము గాంచలేము. ఇరుగుపొరుగువారి వలెనే ఆమె మాతో మెలగుచుండెడిది" అని యనుచుందురు. శ్రీ యోగానందస్వామి నిర్యాణానంతరము మాతృసేవాభాగ్యము నందిన శ్రీ శారదానందస్వామి యొకసారి ఇట్లనెను. "గురుదేవుల దివ్యత అప్పుడప్పుడు ఏ కొంతయైనను బయటపడుచుండెడిది. కాని ఈ యమ్మనుగురించి మన మేమియు గ్రహింపజాలము. ఆమె కప్పుకొనిన యోగమాయ యను తెర ఎంత దళసరి! ఆమె దివ్యత నెవ్వరును ఏ మాత్రమును గ్రహింపజాలరు." ఒక భక్తు డిట్లు కీర్తించెను. "అమ్మా, పలువురు నిన్ను పలువిధముల కీర్తించుచున్నారు. కాని నీ నిజస్వరూపము నెవ్వరును ఎఱుగరు." ఇది సరియే ఏలన అతడే మరల "తల్లీ, నిన్ను నీవే వ్యక్తము చేసికొననిచో నిన్ను గ్రహించుట కెవరికి సాధ్యము?" అనుచున్నాడు. ప్రేమానంద

స్వామి యొకపరి ఇట్లుత్తరమున వ్రాసెను. "అమ్మ నెవ రెఱుగుదురు? ఎఱుగ నెవరికి సాధ్యము? నీవు సీత సావిత్రి శ్రీరాధవంటి పుణ్యస్త్రీలగురించి వినియుందువు. కాని అమ్మ వీరి నందరిని మించినది. ఆమె తనయందున్న దైవీభావము నే కొంచెమైనను బహిర్గత మొనర్పదు. శ్రీగురుదేవులైనను తరచు సమాధిస్థితి నందెడువారు. అమ్మయం దిదికూడ బహిర్గతము కాదు. తన యద్భుతశక్తుల నిట్లదుపులో నుంచుకొనిన ఆమె మూర్తిమత్వము నేమని వివరింతును? వేలకొలది జను లామె నెల్లప్పుడు పరివేష్టించియుండుటను నీవు చూచుట లేదా? ఆమె యనంతమగు శక్తిని గుప్పిట బట్టియున్నది. సాక్షాత్ జగజ్జనని జయరాంబటియందు పనికత్తెవలె నటించుచుండుట నీవు గమనింపలేదా? ఇల్లూడ్చుట అంట్లుతోముట, వడ్లువంచుట, భక్తుల భోజనానంతరము వారి యెంగిలాకుల నెత్తివేయుట- గురుదేవుల వ్యాధి వారి భక్తుల నందఱిని ఒక సంస్థగా రూపొందించినది. అమ్మ గృహస్థుల కాదర్శమూర్తి యగుటకే ఇన్ని కష్టముల కోర్చినది. ఆహా! ఏమి సహనము! ఎంత దయ! సానుభూతి! ఇంతకుమించి ఎంత వినయము!"

సరిగా ఊహ తెలియని యైదేండ్ల ప్రాయముననే వివాహమైనను ఆపిదప యొకటి రెండు పర్యాయములుమాత్రమే భర్తృదర్శనభాగ్యము కల్గినను, శ్రీ శారదాదేవి తన భర్త యారోగ్యము సరిగా లేదని విని చాల దుఃఖపడుచుండెను. వారి చెంతనుండి సేవల నెప్పుడొనర్తునా యని యుత్కంఠతో భగవంతుని ప్రార్థించుచుండెను. తన సుఖమును గూర్చిగాక భర్తృసౌఖ్యమును గూర్చియే ఆమె యారాటము. శ్రీ శారదాదేవి మనస్సు గ్రహించి ఆమె తండ్రి శ్రీ శారదాదేవిని దక్షిణేశ్వరమునకు గొనిపోయెను. శ్రీరామకృష్ణులును ఆమెను ప్రేమాదరములతో నాహ్వానించిరి. ఆమెయు తన సంశయములన్నియు విడిసిపోగా తన జీవితేశ్వరుని సేవించుటయందు కృతనిశ్చయురాలయ్యెను.

గృహస్థులకు గూడ బ్రహ్మచర్యము సాధ్యమే యని నిరూపించుటకో యన మాతృదేవియు గురుదేవులును ఎనిమిదినెలలు సన్నిహిత జీవనము గడపియు మనోవికారలేశమైనను లేకయుండిరి. వారి జీవితాదర్శములు వారి యన్యోన్యభావము మనల పులకాంకితులజేయును. "మీరు నన్నెట్లు చూచుచున్నారు?" అని అమ్మ గురుదేవులను ప్రశ్నించెను. "ఏల! నిన్ను జగజ్జనని స్వరూపముగనే చూచుచున్నాను" అని వారి యుత్తరము. "నీవు నన్ను మాయలోనికి లాగ నభిలషించుచున్నావా?" అని గురుదేవుల ప్రశ్న. "నే నట్లేల చేయవలెను? తమ యాధ్యాత్మిక జీవనమున తమకు సహకరించుటకే నేను వచ్చియుండుట" అని ఆమె సమాధానము. తన యాధ్యాత్మికజీవనమున అమ్మ పరిపూర్ణసహకారమును మెచ్చుకొనుచు శ్రీగురుదేవులొకపరి ఇట్లనియుండిరి. "ఆమె యంతటి పరిశుద్ధహృదయయే యైయుండనిచో నేను నా నిగ్రహమును కోల్పోయి యుండెడివాడనేమో, ఎవ రెఱుగుదురు?" అందువలననే అభేదానందస్వామి ఆమెను "పవిత్రం చరితం యస్య పవిత్రం జీవనం తథా పవిత్రతాస్వరూపిణ్యై తస్యై కుర్మో నమోనమః" అని స్తుతించెను. శ్రీరామకృష్ణు లామెను సాక్షాత్ జగన్మాతగా విధ్యుక్తముగా పూజించి తన తపఃఫలము నామె కర్పించెనన్న ఆమె యెంతటి

పవిత్రతామూర్తియో వారి దివ్యజీవన మెంత ఫలవంతమో తెలియనగును.

గురుదేవులును శ్రీ శారదాదేవి నెంతో యనురాగముతో జూచుకొనిరి. ఆయన ఆమె నెన్నడును పనికత్తెలను చిన్నపిల్లలను సంబోధించు ఏకవచనముతో పిలువలేదు. ఆమె నొరులు పరుషోక్తు లాడుటను సహింపలేదు. ఆమె మనస్సు నొచ్చున ట్లెన్నడును నడచుకొనలేదు.

మాతృదేవికిని గురుదేవులనిన పంచప్రాణములు. తన ప్రాణేశ్వరుని ఎడతెగనిసేవయే ఆమె జీవితమంతయు నిండియున్నది. గురుదేవుల సౌకర్యములముందు తన సౌఖ్యము నామె తలచినదే లేదు. త్రికరణశుద్ధిగా తన భర్తను సేవించెను. అదియు, కర్తవ్యమాత్రముగా గాక ప్రేమపూర్ణహృదయముతో నొనరించెను. గురుదేవుల యవతారవిశేషము నెఱిగిన ఆమె వారి యాదర్శమునే తన యాదర్శముగా స్వీకరించి వారి కార్యక్రమమునం దండయై నిలిచి గురుదేవుల నిర్యాణానంతరము వారి కార్యవిశేషము నంతయు నిర్వహింప బద్ధకంకణురాలై నిలిచెను. శ్రీ వివేకానందస్వామి మొదలు వారి శిష్యప్రశిష్యగణము నంతటిని పరిరక్షించుచు ఉద్బుద్ధుల జేయుచు గురుదేవుల కార్యశేషమును దక్షతతో నిర్వహించెను.

దక్షిణేశ్వరమున నున్నంతకాలమును మాతృదేవి పతిసేవనే గాక తన యత్తగారిని కూడ నణకువతో సేవించెను. ఆమె ఎన్నడును శ్రీ శారదాదేవిని రెండవసారి పిలువనగత్యము లేకుండెను. గురుదేవుల నిర్యాణానంతరము శ్రీ మాతృదేవి జయరాంబటియందు తన తల్లిని సోదరులను చూచుకొను భారము వహించెను. వృద్ధురాలగు తల్లికి పలువిధముల నుపచరించుచు జ్ఞానశూన్యులు ధనగతజీవులును అగు సోదరులను పిచ్చిదగు సురబాలను రోగిష్ఠియగు నామె కూతును ఎల్లరను భరించుచు, అందఱ నాదుకొనుచు వా రెంత దూషించినను సహించుచు సంసారమున నెట్లు మెలగవలెనో యుదాహరించెను. కని పెంచిన మాతాపితలయందుగూడ కొంత స్వలాభేచ్ఛ కన్పించును. కాని అమ్మయందట్టి స్వార్థము లేశమైనను కన్పింపదు.

పారమార్థికజీవనమునందుగూడ మాతృదేవి ఇట్టి వాత్సల్యమునే ప్రదర్శించెను. మాతృదేవి పారమార్థికశీలముచే నాకర్షింపబడిన వారు అమ్మ సాన్నిధ్యమును వదలి వచ్చిన తరువాత వారిలోని మార్పునకు తారే యాశ్చర్యపడుదురు. పూర్వ మున్న విషయసుఖముల యందలి యాకర్షణ వారి కిప్పుడు లేదు. గమ్యములేని జీవితము గడపువారికి తమ జీవితమున నొక యర్థము ఒక లక్ష్యము గలదను విషయము బోధపడసాగెను. నిద్రించుచున్నవారిని తట్టి లేపినట్లు తమయందలి యాత్మవికాసము మేల్కొల్పబడెనని వారు గమనింతురు. సజ్జనులు దుర్జనులను భేదము పాటింపక తనను కోరినవారి నెల్ల నామె యనుగ్రహించెను. "నేను సజ్జనులకు తల్లిని, దుర్జనులకును తల్లినే" అని యామె యనును. శ్రీ గురుదేవులు ఏ మాత్రపు కళంకచరిత్రులు స్పృశించినను ఆ యాహారమును స్వీకరింప జాలరు. అట్టిది ఒక యపవిత్రచరిత మాతృదేవిని గురుదేవులకు భోజనమును తనను కొనిపోనిమ్మని ప్రార్థింపగా శ్రీ శారదాదేవి తాను కొనిపోవుచున్న పళ్లెము నట్లే ఇచ్చివేసెను. ఇట్టివారి చేతి భోజనము నే నెట్లు స్వీకరింపగలనని గురుదేవు లభ్యంతరమును తెల్ప "అమ్మా యని పిలిచి యగడిన వారికి నే నెట్లు లేదందు" నని అమ్మ వాత్సల్య

మూర్తియై పలికెను! తనకు ప్రాణములకంటె మిన్నయగు గురుదేవులకు కలుగు దుర్భర వేదనను కూడ త్రోసిరాజనునట్టిది ఆ మాతృహృదయము!

శ్రీ మాతృదేవి ఇట్టి యాదర్శమును భారతీయమహిళాసమ్ముఖమున నుంచినది. శ్రీ గురుదేవులిట్టి యాదర్శము నభిమానించి గౌరవించి పూజించిరి.

స్వధర్మము ననుసరించుటయే శ్రేయస్కరమనియు పరధర్మము భయావహమనియు గీతావాక్యము. మహిళాదర్శము సంపూర్ణ మహిళ యగుటయే కాని నకిలీ పురుషుడగుట కాదు. అన్నిరంగములయందును అవసరమున్నను లేకున్నను పురుషులతో పోటీలు పడుట స్త్రీలయందలి యాత్మవిశ్వాసపు కొఱతనే సూచించును. ప్రత్యేకము భారతదేశమందు, శివశక్తితత్త్వమును గౌరవించు భారతదేశమందు, శక్తి లేనిచో శివము శవమగునను భారతదేశమందు ప్రతిపురుషుడును భారతీయమహిళను శీలితో గాంభీర్యముతో వాత్సల్యముతో మెలగు మాతృమూర్తిగా దర్శింప వాంఛించును. ఈ విధముననే స్త్రీలు పురుషుల గౌరవాదరములను చూరగొనగలరు. అట్టి శీలి గాంభీర్యము వాత్సల్యముల రూపకల్పనయే శ్రీ మాతృదేవి.

ఇట్టి దివ్యమాతృభావము పునఃప్రతిష్ఠింపబడనిచో మానవాళికి విమోచనము లేదు. దీనినే శ్రీ వివేకానందస్వామి తన సోదర శిష్యులకిట్లు వ్రాసెను. "నీవు—మీ రెవ్వరును అమ్మ జీవనమునందలి యాశ్చర్యకరమగు నర్థమును గ్రహింపలేదు. కాని క్రమముగా మీరు గ్రహింపగల్గుదురు. శక్తిలేనిదే ప్రపంచమునకు పునరుద్ధారణ లేదు. అద్భుతమగు శక్తిని పునరుద్ధరించుటకే అమ్మ యవతరించినది. ఆమెను కేంద్రముగా గొని మరల దేశమున గార్గులును మైత్రేయులును జన్మింతురు.

తెలిసియో తెలియకయో భారతీయమహిళలు సనాతనధర్మము నింకను అంటిపెట్టుకొనియే యున్నారు. నేటి ప్రపంచమున కిది యెంతేనియు అవసరము. అమ్మ తన జీవితము మూలమున ఈ సనాతనధర్మమునకు జీవము పోసినది. మన సోదరీమణులు మాతలు అమ్మ చూపిన యాదర్శమును గురించి యాలోచించి ధ్యానించి ఆపిదప పాశ్చాత్యమహిళల ననుసరింప యత్నింపవచ్చును. ఇప్పటికే పాశ్చాత్య మహిళల నడవడి ప్రపంచము నెంతయేని గజిబిజి యొనర్చియున్నది. వారి హితమునకును జగద్ధితమునకును అమ్మ మార్గమును చూపియున్నది. దానిని పాటించుటయే మన కర్తవ్యము."

## మాతృదేవి శ్రీ శారదామాయి

బి. యస్. ఆర్. ఆంజనేయులు

యా దేవీ సర్వభూతేషు మాతృరూపేణ సంస్థితా
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమోనమః

శ్రీశారదాదేవి ఆదర్శగృహిణి, ఆదర్శ అవతారవరిష్ఠుడైన శ్రీ రామకృష్ణునితో సన్న్యాసిని, ఆదర్శశిష్య, ఆదర్శగురువునై తాదాత్మ్యభావము గలదై, వారి క్షేమాత్రము

తీసిపోని తన విశిష్టతను ఔన్నత్యమును ప్రక
టించినది. పవిత్రత, త్యాగము, మార్దవము
మాధుర్యములను మాతృత్వముద్వారా స్పందిం
చుచు స్త్రీత్వాదర్శమును ప్రదర్శించుటకై
శ్రీ రామకృష్ణ డను నాణెమునకు రెండవ ముఖ
మైనది. శ్రీగురుదేవునివలె తానును జయరాం
బటి యను పల్లెయందు శిష్టాచారబ్రాహ్మణ
కుటుంబమున పుట్టి, ఆధునికవిద్య నేమాత్రము
అభ్యసింపక పోయినను ఆచరణయే మతమని
తన జీవితముద్వారా నిరూపించినది. ఆమె తన
జీవితములో (22-1-1853 నుండి 20-7-1920
వరకు) పల్లెవాతావరణమున 20 సంవత్సరము
లకు పైగా గడపి శ్రీరామకృష్ణుల సాంగత్య
ములో దాదాపు 12 సంవత్సరములు మాత్రమే
గడపినను, ఆయన యుద్యమమును 35 సంవత్స
రములు 'సుదీర్ఘ ప్రశాంత ప్రార్థనాజీవితము'గా
కొనసాగించినది. ఆమె ఠాకుర్ మణి యని
క్షేమంకరి యని ప్రారంభములో తలిదండ్రు
లచే పిలువబడినను శ్రీ శారదాదేవియని ప్రసిద్ధి
గాంచినది. ప్రతివారికి ఆమె క్షేమమునే కల్గించి
'క్షేమంకరి' యను నామమును సార్థక మొన
రించుకొనినది, 'ఆమె సరస్వతి యవతారము.
ఇతరులకు జ్ఞానమును ప్రసాదించుటకే ఆమె
యుద్భవించినది.' అని శ్రీరామకృష్ణులు చెప్పి
నట్లు ఆయన నిర్యాణానంతరము, ఆమె యోగా
నందస్వామి మొదలగు వారెందరికో జ్ఞానభిక్ష
పెట్టినది.

భగవంతుని మాతృమూర్తిగా నారాధిం
చుట యను నాదర్శమును స్థాపించుటకు శ్రీ
రామకృష్ణ లుద్భవించిరి. తానే ఆయాదర్శపు
సజీవమానవాకృతిగా శ్రీశారదాదేవి రూపు
దాల్చెను.

భగవంతుని తల్లిగ నారాధించుట భారతీ
యుల ప్రత్యేకత. సౌమ్యతనే గాక భీకరత్వ
మునుగూడ 'ప్రేమించి' యారాధించుట వారి
విశిష్టత. అందుచే శ్రీరామకృష్ణులు కాళిని
ఇష్టదేవతగ నారాధించిరి. స్త్రీని గురువుగ
స్వీకరించి వివాహమాడిన స్త్రీయందును దేవిని
దర్శించిరి. తన తల్లిలోను ఆరాధించు కాళీ
మాతలోను తన యర్ధాంగి శ్రీ శారదాదేవి
లోను మాత్రమే గాక సర్వప్రపంచములోను
ఆయన తల్లినే చూచిరి. పరస్పర వైరుధ్యము
లతో పెనగులాడుచున్న వివిధ దేశీయులకు,
వివిధమతస్థులకు అనుభవరూపమైన తన జీవి
తముద్వారా సామరస్యమును చేకూర్చిరి.

శివ-శక్తులు అభిన్నములు. అదేవిధముగ
శ్రీశారదారామకృష్ణులు అభిన్నులు.

శ్రీరామకృష్ణులు దక్షిణేశ్వరాలయములో
సాకారనిరాకారసాధన లన్నింటిని సాగించి పరి
పూర్ణత నొందిన సమయములో శ్రీ శారదా
దేవి దక్షిణేశ్వరమునకు వచ్చెను. ఆమె నిండు
యౌవని. ఆయన సన్న్యాసి. అప్పుడు గురు
దేవుడు తనను ఆమెను పరీక్షింప దలచి,
"నన్ను మాయలోనికి లాగుటకు వచ్చితివా?"
అని ఆమెను ప్రశ్నించెను. ఆమె తత్క్షణమే ఇట్లు
బదులిచ్చెను. "కాదు. మీ యాధ్యాత్మిక
మార్గమున సాయము చేయుటకు వచ్చితిని."
ఏకశయ్యాపై పరుండినను ఆమెలో గాని ఆయ
నలో గాని ఎట్టి మనోవికారపు ఛాయయు
పొడసూపలేదనుట ఆమె పవిత్రతకు మరొక
చిహ్నము.

ఒకసారి వెన్నెలలో కూర్చుండి చంద
మామను చూచుచు, "పరమేశ్వరా, ఈ
చంద్రునిలో నైనను మచ్చయున్నది గాని, నా
శీలములో మచ్చ లేకుండునట్లొనర్పుము" అని
ఆమె ప్రార్థించెను. అట్టి మచ్చలేని శీలము పవి
త్రత లేకుండినచో శ్రీరామకృష్ణులు ఫలహారిణీ
కాళీపూజాదినమున ఆమెకు షోడశీపూజ

గావించి, ఆమెలో జగజ్జననిని దర్శించి యుండెడి వారు కారు. ఆ దివ్యజనని పాదారవిందముల ముందుజపమాలతో తన తపస్సునంతయు సమర్పణ గావించి యుండెడివారును కారు. మీదు మిక్కిలి తన యుద్యమ నిర్వహణబాధ్యత నంతయుఆమెపై బెట్టిరి. "నీచుట్టు నున్నవారు చీకటిలో పారుకాడు పురుగులవలె నున్నారు. నీవు వారి నుద్ధరింపవలె" నని యామెతో చెప్పి యుండిరి. 'మాతృత్వమును' ప్రపంచమునకు ప్రదర్శించుటకే ఆమెను వదలి తాను వెడలి పోయెను. దానికి అనుగుణముగ శ్రీ గురుదేవులయందును ఆమె జగజ్జననిని దర్శించుట చేతనే మహాసమాధి నందినపుడు "అమ్మా, కాళీ, నన్ను వదలి ఎచ్చటకు పోయితి"వని విలపించెను.

శ్రీరామకృష్ణుల నిర్యాణానంతరము వారి యుద్యమమునకు శ్రీశారదాదేవి నిమిత్తోపాదానకారణములు రెండును తానే అయ్యెను. తన బోధలను జగద్వ్యాప్తి చేయుటకై శ్రీ గురుదేవులు నరేంద్రుని నియోగించిరి. ఆ శక్తితోనే వివేకానందుడు భారతదేశమంతయు అనామకసన్న్యాసిగా కాలినడకను తిరిగి కన్యాకుమారి అగ్రమున ధ్యానించుచు భారతదేశోద్ధరణకై తాను విదేశముల కేగవలయు నను విషయమును గ్రహించెను. శ్రీ గురుదేవులు సముద్రముపై నడచిపోవుచు తనను రమ్మని పిలుచుచున్న గుర్వాజ్ఞాదృశ్యమునుకూడ తిలకించెను. కాని బయలుదేర లేదు. ఆయన ప్రయాణ మగుటకు తగిన శక్తిని ప్రసాదించినది శ్రీ శారదాదేవియే. ఆ విషయమును సోదరశిష్యునకు వ్రాయుచు "సోదరా! అమెరికా పోవుటకు ముందు 'నన్నాశీర్వదింపు మని' అమ్మకు వ్రాసియుంటిని. ఆశీర్వచనపూర్వకమైన ఆమె యనుజ్ఞ లభించెను. ఒక్క దుముకులో సముద్రమును లంఘించితిని...నా విషయములో అమ్మ యనుగ్రహము తండ్రి యనుగ్రహముకంటె ఎన్నోరెట్లు అధికము. ఆమె యనుగ్రహము, ఆమె యాశీస్సును నా కత్యంత ప్రధానములు. అమ్మ విషయములో నాకు కొంత మూఢత్వ మున్నది." అని వ్రాసెను. చికాగో సర్వమతమహాసభలో నుపన్యసించుటకుముందు ఆయన సరస్వతీదేవిని ప్రార్థించి యుపన్యసించిరి. ఆ సమయమున వారి నాలుకపై వెలసి ముగ్ధమోహనగంభీరవాక్కులను పలికినది శ్రీ శారదామాతయే కానోపును.

శ్రీ రామకృష్ణమఠము నెలకొనుటకును, సక్రమముగా సాగిపోవుటకును కారకురాలు శ్రీ శారదాదేవి. శ్రీగురుదేవుల నిర్యాణానంతరము ఒక్క శశిమహారాజ్ (రామకృష్ణానంద స్వామి) తప్ప మిగిలిన వారందఱు తలకొక దారిగా వెడలిపోయిరి. అది ఆమె మాతృహృదయమును కలంచినది. ఈ విధముగా నున్నచో శ్రీగురుదేవుల యుద్యమము సాగదని ఆమెకు తెలియును. ఈ విషయమును ఒకసారి ఒక శిష్యునితో ప్రస్తావించుచు ఆమె ఇట్లు చెప్పెను. "గురుదేవుల నిర్యాణానంతరము వారి శిష్యులు సన్న్యసించి, తాత్కాలిక స్థావరమొకటి యేర్పరచుకొనిరి. కొలది రోజులు మాత్రమే కలిసి యుండిరి. తర్వాత ఒక్కొక్కరే అట్లొకరు ఇట్లొకరు ఎవరికి వారు తిరుగ సాగిరి. అది నా కెంతో దుఃఖమును కల్గించెను. "ఓ ప్రభూ! మీరీ భూమిపై నవతరించి కొందఱు శిష్యులతో కొంతకాలము గడపితిరి. మీ నిర్యాణముతో ఇదంతయు నంతరింప వలసినదేనా? అట్లయినచో మీ రవతరించి ఇన్ని బాధల కోర్చిన ప్రయోజనమేమున్నది? కాశీ, బృందావనము మొదలగు క్షేత్రములలో ఎందఱో సాధువులు బిచ్చమెత్తుకొనుచు చెట్లనీడను నివసిం

చుటను చూచితిని. అటువంటి సాధువులకు కొఱత లేదు. కాని మిమ్ము నమ్ముకొని, మీకై సర్వము త్యజించి వచ్చిన మీ బిడ్డలు పట్టెడు కూటికై తిరుగాడుటను నేనుభరింప లేను. మీ కై సన్న్యసించిన వారందఱు కట్టుగుడ్డకు తినతిండికి కఱవు లేకుండునట్లు ప్రసాదింపు మనుటయే నా ప్రార్థన. ఇంతేగాక మీబిడ్డలందఱు కలసిమెలసి ఒకచో నివసించి సంసారతపులై బాధ చెంది తమకడకువచ్చు ప్రాపంచికులకు మీసదుపదేశ ముల బోధించి వారిని సేవచేసి మనశ్శాంతి కల్గించునట్లొనర్పు మని కూడ నా మఱియొక ప్రార్థన.'' ఆ ప్రార్థనాఫలితమే నలుమూలల వ్యాపించిన శ్రీరామకృష్ణమఠ, సేవాశ్రమ ములు. ఎంతో ఆర్తితో విలపించిన ఆ ప్రార్థనా ఫలితమే శ్రీరామకృష్ణమఠ సాధువులయందు గల ప్రేమ. ''ఆ ప్రేమయే శ్రీరామకృష్ణుల ఆధ్యాత్మిక కుటుంబమును ఒకటిగా బంధించి అభివృద్ధి చేసి పెంపొందించినది; పెంపొందించు చున్నది.''

ఆమె కలకత్తా యందున్నను లేక జయరాం బట్టి యందున్నను జ్ఞానదాన మొనర్పవలయు నను శ్రీగురుదేవుల ఆదేశమును నామె సడలింప లేదు. ఏ దినమందైనను భక్తులు రానిచో వారికై ఎంతో విలపించెడిది. కొందఱు మహా పాపులకు ఉపదేశమిచ్చినచో తాను శారీరక ముగా ఎంతో బాధ భరింపవలసి యుండునని తెలిసియు వారియెడ కరుణించుట మానలేదు. దుర్భర బాధను తప్పించుకొనలేదు, అందు చేతనే ప్రేమానందస్వామి ''మేము భరింపలేని విషమును ఆమె సులభముగా జీర్ణించుకొనె డిది.'' అని చెప్పెడివాడు. అనగా ఆయనయు బ్రహ్మానందస్వామియు ఉపదేశమిచ్చుటకు సంకోచించిన సంశయశీలవర్తనులను ఆమెకడ కుపదేశమునకై పంపినపుడు ఆ మాతృహృద యము కరిగి నిస్సంకోచముగా ఆ బిడ్డలకుగూడ కనికరముతో ఉపదేశ మిచ్చియుండెను. తిథి వారము వర్జ్యము స్థలము బీద సాద పిన్న పెద్ద అను విచక్షణయే చూపక ఎందఱికో జ్ఞానభిక్ష పెట్టి యాదరించినది. శ్రీ గురుదేవులు వారి యుద్యమమును నెఱవేర్చుటకు శ్రీ శారదా దేవిని నిలిపి చనినందులకు ఆమె సర్వమానవ కోటికి సర్వకాలములలోను భవతారకమగు మహోపదేశము గావించి కృతకృత్యయైనది. దీనితో ఆమె హృదయము దేశకాలములను దాటి విస్తరిల్లినది. మాతృత్వపు వెల్లువయైనది. ''నే నొక విషయము చెప్పుచున్నాను ... నీకు మనశ్శాంతి కావలయునా? ఇతరుల లోపముల నెన్నకుము. అంతేకాదు. నీ దోషములను చూచుకొనుము. సర్వప్రపంచమును నీ స్వంత ముగా చేసికొనుటను నేర్చుకొనుము. ఈ ప్రపం చమునందే యొక్కరును నీకు పరాయివారు కారు. బిడ్డా! ఈ సర్వప్రపంచము నీదే సుమా!'' అనునదే మాతృదేవి యిచ్చిన మహోపదేశము.

## II

''ఏది శ్రీరామకృష్ణుడో అదే నేను'' అని శ్రీ శారదాదేవి యొకపరి స్పష్టీకరించినది. ఇది యెట్లు సాధ్యము? పై నుదాహరించినట్లు శ్రీ రామకృష్ణులు శారదామాయిని కాళీమాతగా చూచిరి. ఆమెయు వారిని కాళికాస్వరూపము గానే దర్శించెను. ఇరువురకును ఒక కాళీ రూపమే. ఇరువురును, ఒక భగవన్మాతృత్వా దర్శమునే ప్రతిపాదించిరి. ఇరువురును కామ కాంచన పరిత్యాగులు. పవిత్రతామూర్తులు. పరమహంసలు. ఒకే కార్యమును సాధించుట కవతరించిన అవతార వరిష్ఠత్వపు రెండు అంచులు, రెండు ముఖములు.

లక్ష్మీనారాయణమార్వాడీ పదివేలరూపాయలు ఈయ వచ్చినపుడు వారు వేఱు వేఱు స్థలముల యందున్నను ఒకే విధముగ నిరాకరించిరి. "నన్ను ఏ విధముగ చూతురు!" అని శారదామాయి ప్రశ్నింప "నే నారాధించు జగజ్జననిగ" నని శ్రీరామకృష్ణులు సమాధానించిరి. ఆయన నిర్యాణసమయమున "అమ్మా, కాళీ; నన్ను వదలి ఎచ్చటికి పోయితి" వని శారదాదేవి విలపించెను. "ఎవడు రాముడో, ఎవడు కృష్ణుడో వాడే ఈ రామకృష్ణు" డని, శ్రీ గురుదేవులు తమ యవసానకాలమున నరేంద్రుని మనస్సు కనిపెట్టి పలికెను. తాను భగవదవతార మని శ్రీరామకృష్ణు లిట్లు వక్కాణించిరి. రామేశ్వరాలయము దర్శించి రామలింగేశ్వరు నర్చించుచు "ఈ లింగము నేను పెట్టినది పెట్టినట్లే యున్న" దని శ్రీ శారదాదేవి పలికెను. త్రేతాయుగమున సీతాసాధ్విగ ఆమె ప్రతిష్ఠించిన రామలింగేశ్వరుని గూర్చి శారదామాయి రూపమున నున్న భగవతి పల్కినది.

శ్రీరామకృష్ణులు కంఠవ్రణమను వ్యాజమున సహిష్ణుతను ప్రదర్శించియుండ, శారదామాయి నహబత్ నివాసములోను, కామార్పుకూరున ఉప్పైనను లేని యన్నమునే భుజించుట ద్వారాను, పంచాగ్ని మధ్యమున తపముచేతను పిచ్చిమేనగోడలగు రాధు వలని బాధలను సహించుటలోను తన యోరిమిని ప్రకటించినది. "నా శిష్యులు సముద్రముల కవ్వలగూడ నుందురని శ్రీరామకృష్ణు లనియుండ విదేశీ వస్త్రదహన మొనర్చు స్వదేశీయుద్యమసమయమున తాను ధరించిన విదేశీవస్త్రము తన విదేశీయ తనయులు తయారుచేసిన దే యని శ్రీశారదామాయి యనెను. ఒకరు పచ్చికబయలుపై నడువ తన గుండెలపైనే నడచినట్లు బాధ ననుభవించి తన సర్వాత్మభావమును శ్రీరామకృష్ణులు ప్రకటించియుండ, తన మేనగోడలగు రాధు చీమను హింసింపబోవునపుడు వారించు శారదామాయి, శ్రీరామకృష్ణుల నారూపమున చూచుచు సర్వము భగవన్మయముగా దర్శించెను. సమాధ్యనుభవ మిరువురకును సమానమే. దివ్యత యడుగడుగున శ్రీరామకృష్ణుల యందు ప్రస్ఫుట మగుచుండ నివురుగప్పిన నిప్పువలె దివ్యతను దాచి యుంచినది శ్రీశారదారూపము. ఒకరు శివుడు, ఇంకొకరు శక్తి. శివశక్తుల సమైక్యరూపమే శ్రీ శారదా రామకృష్ణులు.

వీరి యావిర్భావముతో ప్రాక్పశ్చిమములు, సనాతన అధునాతనములు విభిన్నమతసంప్రదాయములు సాకారనిరాకారోపాసనలు ఐక్యత నొందినవి. మతమనగా సాక్షాత్కారమే యనియు సర్వభావముల కూడలియైన మాతృత్వారాధనద్వారా అది సుకరము సులభమనియు వారి జీవితాదర్శముద్వారా నిరూపితమైనది. ఆధునిక విజ్ఞానము అత్యంతత్వరితగతిని ప్రపంచపు నాలుగు చెఱగులను మిక్కిలి దాపునకు గొనివచ్చిన ఈ యణుయుగమునకు మతసామరస్యమును బోధించుట కవతరించిన సమైక్యావతారము శ్రీ శారదారామకృష్ణులు.

జననీం శారదాం దేవీం రామకృష్ణం జగద్గురుం।
పాదపద్మే తయోఃశ్రిత్వా ప్రణమామి ముహుర్ముహుః॥

ప్రభాప్రసారము

(సంపాదకీయము)

# నవభారత మహిళ

ఏ జాతియైనను పరిపూర్ణమైన సంయమమును బ్రహ్మచర్యవ్రతాదర్శమును ప్రాపింపగలుగుటకుముందు వివాహము పావన సంస్కారమనియు తన్నియమము అనుల్లంఘనీయము అనియు గ్రహించి మాతృత్వమునెడ మహాగౌరవభావము నేర్పఱచుకొనవలెనని నా యభిప్రాయము. రోమన్‌కాథలిక్కులును హిందువులును వివాహమును పవిత్రము, అనుల్లంఘనీయము నగు సంస్కారముగా పరిగణించియున్న కారణమున అఖండ శక్తిమంతులగు స్త్రీపురుషులను వెలువడజేసి యున్నారు. అరబ్బులకు వివాహ మిచ్ఛానుసారము రద్దుచేసికొనదగిన యొడంబడిక, లేదా బలప్రయోగముచే పొందదగిన 'హక్కు'. అందు పవిత్రకన్యాజీవనాశయముగాని, బ్రహ్మచర్యజీవనాశయముగాని వికాసము నొందినట్లు కనరాదు. ఆధునిక బౌద్ధమతము వివాహపరిణామదశ నొందని జాతుల వశమై సన్న్యాసమును పరిహాసాస్పదము జేసివేసినది. కావున (పరస్పరప్రేమాకర్షణ విషయము నటుంచి) వివాహమునుగూర్చి జపాన్ దేశమున మహాపవిత్రాదర్శము పెంపొందిననేగాని మహనీయులగు సన్న్యాసులును సన్న్యాసినులును నెట్లు వెలువడగలరో నాకు తెలియకున్నది. జీవనౌన్నత్యము బ్రహ్మచర్యమున నిమిడియున్నదని మీకవగతమైన రీతినే సమాజమున నఖండ శక్తిమంతులగు కొందఱిమంది నైష్ఠికబ్రహ్మచారులను బ్రహ్మచారిణులను వెలువడ జేయుచున్న పాతివ్రత్యము ఏకపత్నీవ్రతము నను పాలనీయవిషయములు జనబాహుళ్యమున కత్యావశ్యకములని నాకును తోచుచున్నది.

—వివేకానందస్వామి.

"మన పూర్వులు మిక్కిలి గొప్పవారు" అని సగర్వముగా ప్రకటించుచు మన మింకను గొప్పవారము కావలెనని శ్రీ వివేకానంద స్వామి యుద్ఘాటించెను. పూర్వకాలపు మహర్షుల జీవితమును నవీనయుగపు జీవనసరళిని మేళవించి ఆయన జీవించెను. శ్రీరామకృష్ణులు ఏమియు ననకయే, అడవులలో వానప్రస్థులైన మహర్షులు ఇనుపగోచులు పెట్టి సాధించిన మహత్కార్యమును వివాహితుడై యౌవనవతియగు భార్య సాన్నిధ్యమునందే సాధించి చూపెను. కాని మాతృశ్రీ శారదాదేవి ఎవరికిని తెలియకుండగనే అనసూయవలె ఆర్షజీవితమును జీవించుచు, తన ప్రాణేశ్వరుడు వదలిన కార్యశేషమును దక్షతతో ఆధునికులవలె నిర్వహించియు పాశ్చాత్యులతో వ్యవహరించునపుడు నిరుపమ హృదయవైశాల్యమును ప్రకటించియు నవభారత నారీజీవనవిధానము నుదాహరించి వెడలెను. ఏనాడైనను భారతీయాదర్శములగు కార్యదక్షత, ప్రేమ, సహనము, పట్టుదల, సేవానిరతి, ఆత్మనిగ్రహము, వివేచనము, హృదయవైశాల్యము, ధైర్యము మొదలగు గుణము లామెయందు రూపము దాల్చినవి గదా!

పూర్వాచారములకు పట్టుగొమ్మయు ప్రకృతివిహారభూమియు నగు పల్లెటూరియందు ధార్మికసూత్రనిబద్ధమై యాదర్శవంతమగు కుటుంబమున శ్రీ శారదాదేవి పుట్టిపెరిగెను. స్వార్థత్యాగమును సేవానిరతిని పెంపొందించు పెద్దల సుశిక్షణతో భారతసంస్కృతికి నాట్యరంగములగు పురాణపఠనములు, వీధినాటకములు, యక్షగానములు మొదలగువానితో విజ్ఞానవతియై అనంతర కాలమున పండితులకుసైత ముపదేశింపగలుగు బుద్ధివికాసము నందెను.

శ్రీ మాతృదేవి జీవనమున నడుగడుగునను ఆమె కార్యదక్షత స్పష్టమగుచునే యుండును. చిన్నతనమున తల్లికి తోడ్పడుచు గృహకృత్యములను చాలవఱకామెయే నిర్వహించెడిది. పెద్దయెత్తున నామె వంటచేయగా నన్నపు గూనను దింపుటకు తండ్రి సాయము చేయువాడు. కుత్తుకబంటి నీటిలో దిగి ఆమె ఆవులకు గడ్డికోసెడిది. కూలివాండ్రకు పొలమున కాహారము కొనిపోయెడిది. ఒకపరి పైరు పాడుకాగా ఆమె పొలములు తిరిగి ధాన్యసేకరణము చేయవలసెను. బాల్యమున నిట్లుండగా వివాహమై గురుదేవుల సాన్నిధ్యమున నుండ, వారి దర్శనార్థమై వచ్చు భక్తసంఘమునకు కూడ వండి వార్చెడిది. మిగత పాకములుగాక రెండు మూడు శేర్ల పిండిని చపాతీలు చేయవలయును! ఈ సన్నాహమంతయు ఒకమనిషి సరిగా మెదలుటకు వీలులేని నహబత్తునందే. అదియే ఆమె నివాసస్థలము వంటగదియు పూజామందిరమును. ఇట్లుండియు నిరంతరము వచ్చిపోవు భక్తులకు చాలకాలమువఱకు నహబత్తునం దొక జీవి యున్నదనియే తెలియకుండెను! శ్రీ గురుదేవుల నిర్యాణానంతరము వారి యానతిప్రకారము జీవించి, తన తల్లికి బంధువులకు అండయై నిలిచి, గురుదేవుల శిష్యగణమునకు గురుదేవుల స్థానము వహించి అన్నిరంగములను శ్రీ మాతృదేవి కడుసామర్థ్యముతో నిర్వహించెను.

స్త్రీలకు ప్రస్తుతము వలయు పట్టువలను కూడ నామె జీవితము సూచించును. చిన్నతనమున విద్యాసక్తియయ్యును ఆడపిల్లలకు చదువేల యని తలచు ఆ పల్లెటూరియం దామె చదువు కొనసాగలేదు. స్వీయప్రయత్నమున నామె చదువుచుండగా హృదయు డొకనాడు ఆడపిల్లలకు చదువేమని యదలించి పుస్తకమును లాగివేసెను. ఆమె యేమియును కొంకక ఒక యణా పెట్టి మఱొక పుస్తకమును కొని చదువు సాగించెను. ఆ విద్యాభ్యాస మట్లే కొనసాగి ఆమె ధారాళముగా చదువుటతో నాగెను. పెండ్లయిపోయినది, ఇకనే మని యూరక తాను గోరినది సాధించిన ఆమె దీక్ష యెట్టిదో గమనింపుడు. అదియు నా కాలమున!

శ్రీ మాతృదేవి ప్రేమమూర్తి యనుట కామె జీవితమున నుదాహరణములు లెక్కకు మిక్కిలిగా కల్పించును. అమ్మా యని యడిగినవారికి ఒక్కొక్కప్పుడు అడుగనివారికి కూడ నామె ప్రేమామృతమును వర్షించెడిది. జలధరములకు వలెనే ఆమెకు పక్షపాతము లేదు. ఆచారపరాయణమైన తన గ్రామము నందే ఆమె మహమ్మదీయులను గూడ నాదరించెను. వారి జీవనాధారమగు పట్టుపురుగుల పెంపకము నిలిచిపోగా వారిలో పలువురు దొంగలైరి. శ్రీ మాతృదేవి వారిని తన గృహనిర్మాణమునందు నియమించి వారికి జీవనాధారము కల్పించెను. వారిలో నొకడు కృతజ్ఞతనిండిన హృదయముతో చాలకాలము పిదప గురుదేవుల నిమిత్తమై కొన్ని యరటిపండ్లను భక్తితో గొనివచ్చెను. అమ్జద్ అను నింకొకనికి తానే స్వయముగా భోజనము వడ్డించి తృప్తిపరచి పంపెను.

ఆమె సహనము వర్ణనాతీతము. తనకెంత కష్టము కలిగినను తన బంధువులే పరస్పర విద్వేషులై తన ననేకవిధముల బీడించుచున్నను ఆమె వారినదుమనే యుండి వాని నన్నిటిని భరించుచు వారికి తన శక్తికొలది సేవను ఉపకృతులనే చేసెను. తన సోదరరత్నము లిరువురును నిరంతరము తనను ధనమునకై పీడించుచుండ తన పిచ్చిమరదలిని

ఆమె యర్భకపు గూతును ప్రేమతో ఇంతింతన రాని యోర్పుతో నామె కాపాడెను. దీనికై ఆమెకు లభించిన ప్రతిఫలము తుదివఱకును విరామములేని తిట్లు తిరస్కారములును. మఱి సరిలేని రాధువలన నామె పడిన బాధలకు మితిలేదు. నల్లమందు తినుసలవాటు మానుకొనుమని మందలించినందుల కామె యొకపరి మాతృదేవిపై చేతికందిన వంకాయను విసరగా ఆ దెబ్బ కామె వీపు వాచిపోయెను. వీని నన్నిటిని భరించుచు (తనను సాక్షాద్దేవతను వలె పూజించు శిష్యగణమును వదలి!) ఆమె వారి నడుమనే యుండెననగా ఆమె సహనము సహనమే యగునా!

చిన్నతనమునుండియు ఆమె సేవాతత్పరురాలే. దక్షిణేశ్వరము వచ్చువఱకు తన తలిదండ్రులను ప్రేమతో సేవించెను. పిదప గురుదేవులకును తన యత్తగారికిని పరిచారికవలెనే సేవ చేసెను. ఆమె నప్పుడు చూచినవారికి గురుదేవులపై నామె కత్యంతాధికార మున్న సంగతి తెలియకపోవుటయే గాక, ఈమె కేవలము పలువురిలో నొక సాధారణ భక్తురాలి వలె కన్పట్టెడిది. గురుదేవులు రాత్రియంతయు సమాధిస్థితులై గడపుచుండ నీమె వారిని కనిపెట్టుకొని యుండి నిదురమాని యుండెడిది. అనంతరకాలమున శిష్యులు భక్తులు బంధువులు ఆగంతుకులు ఎల్లరకును వారివారికి కావలసినట్లు సానుభూతితో తోడ్పడెడిది. ఒకనాడు ఆగంతుకురాలగు నొక వనిత మందిరమున వాంతి చేసికొనగా శిష్యులకు తెలిసిన వారామెను నిందింతురని తానే యా ప్రదేశమునంతను శుభ్రము చేసెను!

గురుదేవులకు భోజనము కొనిపోవునపుడే ఆమెకు వారి దర్శనభాగ్యము. తరువాతికాలమున నిరంతరము భక్తులు చుట్టియుండుటచేత గురుదేవుల నామె దర్శించుట కదియే యపురూపము. ఏ రెండుమూడు నెలల కొక పర్యాయమో ఆమె గురుదేవులను దర్శింపగలిగెడిది. అట్టి సేవాభాగ్యమును గూడ భక్తులెవరైన నర్థించినచో శ్రీ మాతృదేవి నవనీతకోమల హృదయము నిరాకరింపజాలకుండెడిది. తన కత్యంతము ప్రియతమము దుష్ప్రాపము అగు సేవాభాగ్యమునుగూడ నొరులు తప్పించుచుండ వారిపట్ల నొచ్చుకొనని స్వార్థరాహిత్యము నేమని చెప్పవలెను!

శ్రీ గురుదేవులు పారమార్థికజీవనము గడపనెంచి తనసహధర్మచారిణి యనుమతిని గోరిరి. ఆమెయు నిశ్శంకముగా నంగీకరించి క్షణమైనను తడబాటులేని యాత్మనిగ్రహముతో తన పతి ననుసరించెను. ఆమె పారమార్థికశీలసంపదను గూర్చి గురుదేవులే ఇట్లని యుండిరి. "ఆమె యంతటి పావనాత్మయే కానిచో నామె ప్రేరణలచే నే నాత్మనిగ్రహమును కోల్పోయి యుండెడివాడ నేమో ఎవరు చెప్పగలరు?" సౌందర్యవతియు యౌవనవతియు నగు నామె తన పతితో నెనిమిదినెలలు వసించియు కామకళంకరహితమైన భగవదర్పితజీవనమును గడపెను. జీవనసహభాగిని సహకారములేక జీవితాశయముల నెవరు సాధింపగలరు?

శ్రీ మాతృదేవికి గల వివేచనాశక్తియు నపారము. నిరంతరము గురుదేవుల యాలోచనల ననుసరించు ప్రయత్నమున నామె వారి యిష్టాయిష్టములను చెప్పకయే గ్రహించెడిది. మార్వాడీ యొకడు పదివేలరూప్యములను గురుదేవుల కర్పింపరాగా వారు తమ కక్కఱ లేదనియు వలయుచో మాతృదేవి గ్రహింపవచ్చుననియు ఆమెకడ కంపెను. ఆమెయు గురుదేవుల యుద్దేశమును గ్రహించి ఆ ధనమెట్లును గురుదేవులకే యుపయోగింపవలసి

వచ్చుటచేత నంగీకార్యము కాదని తిరస్క
రించెను. దక్షిణేశ్వరమునకు కొలదిమైళ్ల దూర
మునందున్న ఫణీహాటీ యను గ్రామమున దేవ
తోత్సవమును దర్శించుటకై గురుదేవు లొక
పర్యాయము బయలుదేరిరి. శ్రీ శారదాదేవి
తానును వెతల నుత్సుకతను జూప, గురుదే
వులు 'ఇష్టమున్న రావచ్చు'నని కబురంపెను.
మాతృదేవియు ఆ మాటలయందలి సంకోచ
మును గ్రహించి తన ప్రయాణము మానివైచి
గురుదేవుల యభినందనలకు పాత్రురాలయ్యెను.

ఆమె హృదయవైశాల్యమునకు మార్గరెట్
నోబుల్ (సోదరినివేదిత) యను పాశ్చాత్యవనిత
నామె స్వీకరించిన రీతియే నిదర్శనము. తా
నిదివఱకు కనివిని ఎఱుగని విషయములనుగూడ
ఆమె యవలీలగా గ్రహించెడిది. సోదరినివేదిత
యొకపరి వారి వివాహదీక్షాప్రతిజ్ఞను ఆమె
కిట్లు వినిపించెను. "మేలుగీడులయందును
కలిమిలేములయందును ఆరోగ్యానారోగ్యముల
యందును—ఆమరణము మనము వియోగము
పొందకుందుము గాత." ఈ మాటలు విని
మాతృదేవి యానందోద్వేగముతో "ఏమి
ధార్మికవచనములు!" అని మెచ్చుకొనెను.

మూర్తీభవించిన స్త్రీత్వమై సహజముగా
లజ్జాశీలయైన శ్రీ శారదాదేవి దుర్గాదేవివలెనే
పరాక్రమింపను గలదు, పరిపూర్ణవిశ్వాస
ముతో కటికగుండెలను కరిగింపను గలదు.
హరీశు డను గురుదేవుల శిష్యునకు మతిచెడి
యొకపరి శ్రీ మాతృదేవిని తఱుముకొనెను.
ఆమెయు భీతితో దాపుననే యున్న గాదె
వెనుకకు పరువిడెను. వాడు విడువక వెన్నం
టగా గాదెచుట్టును ఓపినంతసేపు పరువిడి
చివరకు రౌద్రముతో వానినిబట్టి క్రిందబడ
వైచి గుండెలపై మోకాలూని దౌడలు వాయ
గొట్టెను.

జయరాంబాటినుండి దక్షిణేశ్వరమునకు
పోవు దారిలో తెలొబెలో యను నరణ్య
ప్రదేశ ముండెడిది. ఆ కాలమున నది బందిపోటు
దొంగలకు నిలయము. శ్రీ శారదాదేవి యొక
పర్యాయము బంధుజనులతో కలిసి దక్షిణేశ్వర
మునకు పాదచారిణియై పయనించెను. చీకటి
పడులోపల నరణ్యమును దాటవలెనని
యాతురపడు తన తోడియాత్రికులను సాగి
పొమ్మని, అలసటతో శ్రీ శారదాదేవి వెనుక
బడెను. ఆ చీకటిరాత్రిలో నేమియు దోపక
నామె దిగులుపడుచుండ ఇంకను భీతిగొలు
పుచు 'ఎవరక్కడ' అను కఠోరస్వనము విన
నయ్యెను. చూడగా కాలయమునివంటి
యాకృతిగలవా డొకడు దండధారియై సమీ
పించుచుండెను. వాని వెనుకనే ఇంకొక రూప
మును అనుగమించుచుండెను. భయకంపిత
యయ్యును ధైర్యము కూడదీసికొని శ్రీ శారదా
దేవి ఱాళ్లను కరగించు మృదుమధురస్వర
ముతో నిట్లనెను. "నాయనా, నా తోడివా
రందరు న న్నిక్కడ దిగవిడచి వెళ్లినారు.
చీకటిలో నాకు త్రోవ తెలియకున్నది. దయ
యుంచి నాకు సాయము చేయుము. 'నీ యల్లుడు'
దక్షిణేశ్వరమున కాళికాలయమునందున్నాడు.
నీ వంతవఱకు వచ్చిన నాత డెంతో సంత
సించును." ఇంతలో రెండవవ్యక్తి సమీపింప
ఆమె యతని భార్య యని గ్రహించి ఆమె
చేతిని బట్టుకొని "అమ్మా, నేను నీ కూతును,
శారదను. చాల చిక్కులో నున్నాను. అదృష్ట
వశమున నాయనయు నీవును వచ్చితిరి. లేనిచో
నే నేమి చేసెడిదాననో తెలియదు."

మాతృదేవి మెల్లని పలుకులు, కల్లకప
టము లేని సరళవర్తనము, నిర్భయత్వము,
తమయం దామె పరిపూర్ణ విశ్వాసము ఇవి
యన్నియు నా దంపతుల మనమును గరిగించి

ప్రేమపూరితము చేసెను. వారును శ్రీ శారదా దేవిని తమ కూతును వలె కడుపులో బెట్టుకొని యాదరించి దక్షిణేశ్వరమున పతియొద్ద దించి ప్రేమార్ద్రనయనములతో వీడ్కొనిరి.

ఇట్లు శ్రీ శారదాదేవి గుణవిశేషముల నెన్నింటిని వర్ణించినను తనివి తీరదు. ఆమె సాక్షాద్దేవ్యవతారమనుటకు గిరీశు డామెను ప్రప్రథమమున దర్శించినప్పటి యుదంత మొక యుదాహరణము. అయినను, మానవియై మానవులకు మార్గదర్శినియైన ఆమెను స్తోత్రములు భజనలతో సంతోషపెట్టుదుమా? ఆమె జీవించి చూపిన ప్రేమ, త్యాగము, సేవ, ధైర్యము మొదలుగా గల సుగుణకుసుమములను మన జీవనలతలయందు విరియజేసి వానితో గదా ఆమెను పూజింపవలెను! నవ భారతనారీరత్నపరంపర కామె నాందియే యని నిరూపించిన గదా ఆమెపట్ల భక్తి నెఱపినట్లు!

---

# భక్తిరత్నావళి

మూలము : శ్రీ విష్ణుపురి

వ్యాఖ్యాత : విష్ణుచిత్తుడు

(ప్రథమ విరచనము)

## 22

మోక్షముకంటెను భక్తి శ్రేష్ఠతరమని కపిలుడు వక్కాణించుచున్నాడు.

నైకాత్మతాం మే స్పృహయన్తి కేచిత్ మత్పాదసేవాభిరతా మదీహాః
యేఽన్యోన్యన్తే భాగవతాః ప్రసజ్య సభాజయన్తే మమ పౌరుషాణి. (3-25-34)

నన్ను సేవించుటయందే యనురక్తులై కొందఱు భక్తవరేణ్యులు నాలో నైక్యమందుటను గూడ నిచ్ఛగింపరు. అట్టివా రొకచో సమావిష్టులై నా గుణగణములను కీర్తింతురు. నన్ను స్తుతింతురు.

## 23

అట్టి భక్తు లేమగుదురో కపిలుడు వర్ణించుచున్నాడు.

పశ్యన్తి తే మే రుచిరాణ్యంబ సన్తః ప్రసన్నవక్త్రారుణలోచనాని
రూపాణి దివ్యాని వరప్రదాని సాకం వాచం స్పృహణీయాం వదన్తి. (3-25-35)

మోక్షమునుగూడ తిరస్కరించునట్టి యా భక్తాగ్రేసరులు సుందరవదనములు మనోహరనేత్రములు మృదుమధురకంఠములు గలిగి అభీష్టసిద్ధి నిచ్చు నా వివిధరూపములను దర్శింతురు. వానితో సంభాషింతురు.

## 24

అట్టి సాంగత్యముచేత వారు కోరకున్నను మోక్షము నందుదు రని కపిలుడు నుడువుచున్నాడు.

> తైర్దర్శనీయావయవైరుదారవిలాసహాసేక్షితవామసూక్తైః
> హృతాత్మనో హృతప్రాణాంశ్చ భక్తిరనిచ్ఛతో మే గతిమణ్వీం ప్రయుంక్తే.
> (3-25-36)

కన్నులపండువు సేయు నా రమణీయ రూపములచేతను, లీలలచేతను సమ్మోహనకరములగు మందహాసములచేతను పరవశింపజేయు తీయనిమాటలచేతను ఆకర్షింపబడిన మనః ప్రాణములు గలవారై, ఇచ్ఛలేకున్నను వారు తమ భక్తిప్రభావముచే మోక్షము నందుదురు.

## 25

భగవత్సేవ తప్ప నితరము నొల్లని భక్తులు యత్నములేకయే విభూతులను సకల శ్రేయములను బొందుదురని కపిలు డనుచున్నాడు.

> అథో విభూతిం మమ మాయినస్తామైశ్వర్యమష్టాంగమనుప్రవృత్తమ్
> శ్రియం భాగవతీం వాస్పృహయన్తి భద్రాం పరస్యయే తేఽశ్నువతే తు లోకే.
> (3-25-37)

నా మాయచే సృజింపబడిన అష్టైశ్వర్యములను వారు గణింపరు. వారి తపోమహిమచే వచ్చు అష్టసిద్ధులను వారు తిరస్కరింతురు. సర్వోత్కృష్టమైన వైకుంఠవైభవముకూడ వారి కభీప్సితము కాదు. అయినను శ్రేష్ఠతమమగు నా లోకమందు వా రవ్యవహితానందము ననుభవింతురు.

## 26

సత్కర్మచే నూర్ధ్వలోకముల నందినవారికివలె విష్ణుభక్తులకు సత్కర్మక్షయముచే పతనములేదని కపిలుడు నుడువుచున్నాడు.

> న కర్హిచిన్మత్పరాః శాన్తరూపే నఙ్క్ష్యన్తి నోఽనిమిషో లేఢి హేతిః
> యేషామహం ప్రియ ఆత్మాసుతశ్చ సఖా గురుః సుహృదో దైవమిష్టమ్. (3-25-38)

నాయందే ప్రపన్ను లగువారికి శాంతినిలయమగు నా లోకమునుండి చ్యుతి యుండదు. అమోఘమగు నా కాలచక్రము, నేనే ప్రియతముడననియు తమ ఆత్మననియు పుత్రుడననియు మిత్రుడననియు గురువుననియు ఇష్టదైవముననియు భావించు నా భక్తులను స్పృశింపదు.

## 27—29

నిష్కామమగు భక్తియు వైరాగ్యమును గలిగినవారు అప్రయత్నముగనే మోక్షమును గూడ పొందుదురని కపిలుడు దృఢపరచుచున్నాడు.

ఇమం లోకం తథైవాముమాత్మానముభయాయినామ్
ఆత్మానమను యే చేహ యే రాయః పశవో గృహాః
విసృజ్య సర్వానన్యాంశ్చ మామేవం విశ్వతోముఖమ్
భజన్త్యనన్యయా భక్త్యా తాన్మృత్యోరతిపారయే
నాన్యత్ర మద్భాగవతః ప్రధానపురుషేశ్వరాత్
ఆత్మనః సర్వభూతానాం భయం తీవ్రం నివర్తతే. (3-25-39-41)

ఇహలోకముపట్లను, సాధింపగలుగు నుత్తరలోకములపట్లను వీనిని సాధించు నుపాధియుతమగు నాత్మయందును, భార్యాపుత్రులు గృహములు పశువులు మొదలగు సంపదల యందును, మరి ఇతరములైన భోగభాగ్యములందును, విరక్తినిబొంది యచంచలమగు భక్తితో విశ్వవ్యాప్తుడనగు నన్నే భజించు మానవులను నేను జన్మమృత్యు పునరావృత్తినుండి తరింపజేయుదురు. పరమపురుషుడను జీవాజీవముల కీశ్వరుడను సర్వవ్యాపిని అగు నావలననే తప్ప భీషణమగు జన్మమృత్యు పునరావృత్తి వారింపబడదు.

## 30

భగవద్గుణవిశేషములను గ్రహించుటవలన గలుగు భక్తిని కపిలు డుపదేశించు చున్నాడు.

తస్మాత్త్వం సర్వభావేన భజస్వ పరమేష్ఠినామ్
తద్గుణాశ్రయయా భక్త్యా భజనీయపదాంబుజమ్. (3-32-22)

అందుచేత నతని గుణగణములను గ్రహించుటవలన పెంపొందు భక్తితో పూజార్హములైన పాదపద్మములు గల ఆ పరమేష్ఠినే మనోవాక్కాయములచే భజింపుము.

# మాతృదేవిని గూర్చిన స్మృతులు*

## (ఒక శిష్యురాలు)

శ్రీరామకృష్ణునితో పరిచయమైన కొంత కాలము పిదప నేను దక్షిణేశ్వరము వెళ్ళితిని. తొందరలో భోజనముచేయకయే వెళ్ళితిని. దీనిని విన్న శ్రీరామకృష్ణుడు, "అయ్యో! నీ వింకను భోజనము చేయలేదా? నహబత్తుకు† వెళ్లుము" అనెను. అదియే మాతృదేవితోడి నా ప్రథమసమాగమము. రామునితల్లి‡ మరి కొందరు స్త్రీలు మాతృదేవిని ఒకటిరెండు సార్లు దర్శించి యుండిరి. వారప్పు డచ్చట నుండిరి. వారు మాతృదేవితో నేను భుజింపకయే వచ్చియుండుటను చెప్పిరి. మాతృదేవి తొందరగా, అన్నము, పప్పు, కూరలు నాకు వడ్డించెను. మొదటి దర్శనమునుండియే నే నామెకు చాల సన్నిహితురాల నైతిని. ఆ తర్వాత ఆమె రామలాల్‌దాదా వివాహమునకు కామార్పుకూరు బయలుదేరుచుండగా నే నామెను చూచుటకు దక్షిణేశ్వరము వెళ్ళితిని. ఆమె నిక చిరకాలము చూడ సాధ్యపడదను విషయము నాకు చాల వ్యసనమును కలిగించినది. ఆమె శ్రీరామకృష్ణులయొద్ద సెలవు తీసికొనుటకు వచ్చెను. శ్రీరామకృష్ణుడు తన గదియుత్తరపు వరండాలో నిలబడి యుండెను. మాతృదేవి తన శిరమును గురుదేవుని పాదములపైనుంచి నమస్కరించెను. శ్రీరామకృష్ణుడు, "ప్రయాణమున జాగ్రత్తగా నుండుము. పడవలోగాని, రైలునందుగాని దేనినిగాని విడిచివేయకుము!" అనెను. మాతృదేవి గురుదేవులు కలిసియుండగా చూచుట నా కిదియే మొదటిసారి. ఇట్లు చూడవలయునను సంకల్పము నా కుండినది. మాతృదేవి నెక్కించుకొని పడవ పయనమైనది. కనుచూపు మేరవరకు దానినే చూచుచుండి, తర్వాత నహబత్తుకు మరలితిని. ఆమె ధ్యానించు స్థలమునందు కూర్చుండి చాల సేపేడ్చితిని. ఆమె నహబత్తున కుత్తరమునగల వరండాయందు దక్షిణాభిముఖముగా కూర్చుండి ధ్యానము చేయును. నా ఏడుపును శ్రీరామకృష్ణులు వినిరి. ఆయన తన గదికి మరలివచ్చిన పిదప నాకు కబురంపిరి. నే నాయన గదికి వెళ్ళగా "ఆమె వెళ్ళిపోయినందుకు మీరు చాల వ్యసనపడుచున్నారు. కాదా?" అనిరి. తర్వాత నా ఆసక్తిని మరలించుటకో యన్నట్లు ఆయన తా నొనర్చిన వివిధములగు ఆధ్యాత్మికసాధనల నాతో ముచ్చటించిరి. తర్వాత ఆ రహస్యముల నెవ్వరికీ వెల్లడింపవలదని నన్ను హెచ్చరించిరి. నే నాయన కతిసమీపమున కూర్చుండి, సన్నిహితముగా మాట్లాడుట కదియే ప్రథమము. హిందూకుటుంబమునందు నే నొక లజ్జావతినగు యువగృహిణిగా నున్నందున ఇన్నిరోజులు బిడియపడుచుంటిని. సుమారు పదునెనిమిదినెలల తర్వాత మాతృదేవి దక్షిణేశ్వరమునకు తిరిగివచ్చెను. భోజనవిషయమై తాను చాల కష్టపడుచున్నట్లు శ్రీరామకృష్ణు లామెకు వ్రాసియుండిరి. ఆమె తిరిగి వచ్చిన పిదప గురుదేవు లామెతో, "తఱచుగా నిచ్చటికి వచ్చుచుండు ఆ పెద్దకన్నుల యువతి నిన్ను గాఢముగా ప్రేమించుచున్నది. నీవు దక్షిణేశ్వరము విడిచివెళ్ళిన రోజు నహబత్తునం దామె

---

* వేదాంతకేసరి 1937 నుండి.

† మాతృదేవి నివసించుచుండిన గృహము.

‡ శ్రీరామకృష్ణుని భక్తురాండ్రలో ఒకామె.

నీ కొరకెంతగానో విలపించినది'' అనిరి. మాతృదేవి, ''అవును. ఆమెపేరు యోగేన్'' అనెను. నేను దక్షిణేశ్వరమున కెప్పుడు వెళ్ళినను మాతృదేవి నాతో చాల సహజముగా మాట్లాడును, నా సలహాల నడుగును. నేనామెకు జడ వేయుచుండెడిదానను. ఆ తీరు ఆమెకెంత ప్రీతియనిన నామె స్నానము చేయునపుడు, మూడు నాలుగు రోజుల తర్వాతకూడ తన శిరోజముల తడుపదు. ఆమె ఇతరులతో, ''ఈ జడ యోగేన్ అల్లినది. ఆమె వచ్చిన తర్వాతనే నేను దానిని విప్పుదును'' అనును. సుమారు వారమున కొకసారి నేను గురుదేవుల యొద్దకు వెళ్లెడుదానను. దక్షిణేశ్వరమునుండి వచ్చునపుడు శివపూజకుగాను లేత బిల్వపత్రముల తెచ్చుదానను. అవి వాడిపోయిన తర్వాతకూడ వానితోనే శివపూజ చేయుదానను. ఒకనాడు మాతృదేవి, ''యోగేన్, నీవు వాడిన బిల్వపత్రములతో శివపూజ చేయుచున్నావా?'' అని ప్రశ్నించెను. నేను, ''అవునమ్మా! ఈ విషయము నీ కెట్లు తెలియును?'' అంటిని. మాతృదేవి, ''నేనీ యుదయము ధ్యానము చేయుచుంటిని. ఆ సమయమున నీవు వాడిన బిల్వపత్రములతో శివుని పూజించుచుండుట కానవచ్చినది'' అనెను.

ఒకనాడు మాతృదేవి తాంబూలము తయారించుచుండెను. నేనామె సమీపమున నుంటిని. ఆమె కొన్ని ఆకులయందు వక్కలను సున్నమును మాత్రము వేయుచు, మరికొన్నిటియందు ఏలకికాయవంటి సుగంధద్రవ్యముల వేయుచుండెను. నేను ''అమ్మా! అందులో కూడ ఏలకికాయలు వేయవలదా? మసాలా లేనివానిని తీసికొనువారెవరు? తక్కినవానిని తీసికొనువారెవరు?'' అని ప్రశ్నించితిని. మాతృదేవి, ''యోగేన్, మసాలా తాంబూలములు భక్తులకొరకు. వారిపట్ల శ్రద్ధవలనను, ప్రేమవలనను వారిని నా వారిగా చేసికొనవలెను సుమా! ఈ సామాన్యమైన తాంబూలము గురుదేవులకు; ఆయన ఇప్పటికే నావారు'' అనెను.

సుశ్రావ్యముగా పాడు విధము మాతృదేవి ఎఱుగును. ఒకనాడు ఆమెయు, లక్ష్మమ్మాయియు మంద్రస్వరముతో పాడుచుండిరి. వారాగానమున లీనమైపోయి యుండిరి. శ్రీరామకృష్ణులా పాటల వినిరి. మరుసటిరోజు వారితో, ''నిన్నటి రోజు మీరు పాడుచుంటిరి. బాగున్నది'' అనిరి.

మాతృదేవికి దక్షిణేశ్వరమునందు కొంచెమైనను విరామ ముండెడిది కాదు. ఆమె భక్తులకై ఏడు పౌండ్లు పిండి రొట్టెలు చేయును; లెక్కలేనన్ని తాంబూలముల తయారించును; గురుదేవునకు గట్టి మీగడ ప్రీతికరమగుటవలన ఆయనకై చాలసేపు పాలను కాచును; మరల ఆయనకై కూరలవండును. ఆయన గదిలోనికే భోజనము కొనిపోవును. శ్రీరామకృష్ణుల తల్లి భౌతికదేహమున నున్నంత వరకు, ఆయన భోజనార్థము నహబత్తుకు వచ్చుచుండెను, కాని ఆమె మరణించిన పిదప, ఆయన తన గదియందే తన భోజనము ముగించును. గురుదేవుని యొద్ద భక్తులు లేనప్పుడు మాతృదేవి, స్నానమునకు ముందాయన శరీరమునకు నూనెను రాచెడిది. గోలప్‌మాయి గురుదేవుని యొద్దకు వచ్చిన యొకరోజు ఆమెతో నొక గిన్నెడు అన్నమును తీసికొని రమ్మనెను. అప్పటినుండి ఆమెయే ఆయనకు భోజనము తెచ్చుచుండెను. ప్రతిదినము మాతృదేవి గురుదేవుని గదికి భోజనము తెచ్చు సమయమునందు మాత్రమే ఆమె గురుదేవుని చూడ సాధ్యపడెడిది. కాని

అప్పటినుండి అదికూడ నిలిచిపోయినది. గోలప్ మాయిగురుదేవునితో సాయంసమయము చాల సేపు గడిపెడిది. ఒక్కొక్కప్పుడు ఆమె నహబత్తుకు తిరిగి వచ్చుటకు రాత్రి పదిగంటలగును. మాతృదేవి భోజనముతో గోలప్‌మాయికొరకు చాలసేపు వేచియుండును. ఆమె కది చాల ఇబ్బందిగా నుండెను. "ఏ కుక్కయో, పిల్లియో ఆమె భోజనమును అశుద్ధపరచుగాక! ఇంతకంటె ఎక్కువసేపు నేను వేచియుండలేను," అను మాతృదేవి వాక్యములను గురుదేవుడొకనాడు వినెను. మరుసటిరోజు గోలప్‌మాయితో నాయన, "నీ విచ్చట చాల సమయము గడపుచున్నావు. అది యామెకు అసౌకర్యము కలిగించుచున్నది. ఆమె నీ భోజనమును కనిపెట్టి యుండవలెను సుమా!" అనెను. గోలప్‌మాయి "లేదు, మాతృదేవి నిజముగా నన్ను ప్రేమించుచున్నది. నన్నామె తన కుమార్తెవలె నా మొదటి పేరుతో పిలుచును," అనెను. తన చొరవ వలన మాతృదేవి శ్రీరామకృష్ణుని చూచు నవకాశముల నపహరించితిననిగాని, దానికై మాతృదేవి చాల వ్యసనపడుచున్నదనిగానీ, గోలప్‌మాయి గ్రహింపలేదు. కాని శ్రీరామకృష్ణుడు దీనిని స్పష్టముగా గ్రహించెను.

ఒకనాడు గోలప్‌మాయి మాతృదేవితో, "అమ్మా! మనమోహానుని తల్లి ఇట్లన్నది. 'ఆయనంతటి గొప్ప విరాగి, కాని మాతృదేవియో కమ్మలు మున్నగు నాభరణముల ధరించుచున్నది. అది బాగున్నదా'?" అనెను. మరునాడుదయము నేను దక్షిణేశ్వరము వెళ్ళినపుడు, మాతృదేవి చేతికి రెండు బంగారు కడియములు మాత్రమే యుండినవి. తక్కిన ఆభరణముల నన్నిటిని ఆమె తీసివేసినది. నేను కొంత విస్మయముతో, "అమ్మా! ఇది యేమి?" యని ప్రశ్నించితిని. మాతృదేవి ప్రత్యుత్తరముగా, "నిన్నటి రోజు గోలాప్ చెప్పినది నీవు వినలేదా...?" అనెను. నా పట్టుదలపై ఆమె కమ్మలను, ఒకటి రెండు సామాన్యమైన ఆభరణముల ధరించెను. ఈ సంఘటన తర్వాత గురుదేవుడు వ్యాధిగ్రస్తుడగుటచే మాతృదేవి తన యన్ని యాభరణములను ఆపై నెప్పుడును ధరింపలేదు.

మాతృదేవి మొదటిసారి దక్షిణేశ్వరమునకు వచ్చినపుడు ప్రాపంచికవిషయము లామెకు క్రొత్త. ఆధ్యాత్మిక పారవశ్యమును ఆమె యప్పటి కనుభవించి యుండలేదు. పరిపూర్ణ శ్రద్ధాభక్తులతో జపధ్యానముల ననుష్ఠించుచుండినను, ఆమె సమాధిస్థితి ననుభవించి యున్నట్లు మేము వినలేదు. అది యట్లుండ, శ్రీరామకృష్ణుని సమాధ్యవస్థను చూచి ఆమె భయపడుచు విచారించెడిది. మాతృదేవి మొదటిసారిగా దక్షిణేశ్వరమునకు వచ్చినపుడు శ్రీరామకృష్ణుడామె తన చెంత నుండుట కనుమతించెనని మాతృదేవినోటనే మేము వింటిమి.*

అప్పుడు గురుదేవుడు, మాతృదేవి ఇరువురును ఒకేగది యందే నిద్రించెడివారు. శ్రీరామకృష్ణుడు పెద్దమంచముమీదను, మాతృదేవి చిన్న మంచముమీదను నిద్రించెడి వారు.

ఒకసారి తోతాపురి శ్రీరామకృష్ణునితో, "నీవు ఇంద్రియనిగ్రహము సంపాదించితి వనుటకు ఋజువేమి? నీ సహధర్మచారిణి నీయొద్ద నుండుటకు నీవనుమతించినచో, నీవు చెప్పినది నిజమేనని నేను నమ్మెదను" అనెను. శ్రీరామకృష్ణుడు తన శుచిత్వమును, ఇంద్రియనిగ్రహమును పరీక్షించుటకు, మాతృదేవితో ఆమె మొదటిసారి దక్షిణేశ్వరమునకు వచ్చినపుడు అదే శయ్యపై ఎనిమిది మాసములు నిద్రించెను.

మాతృదేవి, "శ్రీరామకృష్ణులు రాత్రంతయు ఆధ్యాత్మిక పారవశ్యము నం దుండెడి వారు. అందువలన నేను నిద్రించెడిదాననే కాను. భయవిహ్వలితనై, సూర్యోదయమున కాతురతతో ఎదురుచూచెడిదానను. ఒకరాత్రి వారికి చాలసేపటివరకు బాహ్యస్మృతి రాకపోగా, నేను వ్యాకులతతో హృదయునకు దాసితో కబురంపితిని. అతడు గదిలోనికి వచ్చి, వారి చెవియందు భగవన్నామము నుచ్చరించెను. అప్పుడు మాత్రమే వారు బాహ్యస్మృతి నందిరి. మరుసటి రోజు శ్రీరామకృష్ణులు వివిధము లగు సమాధి స్థితులం దుచ్చరింపవలసిన వివిధ దివ్య నామముల నా కుపదేశించిరి" అనెను.

మా పరిచయమైన కొంత కాలమునకు ఆమె నాతో, "వారి (గురుదేవుల) కృపవలన నాకు కొంత పారవశ్యము సిద్ధించుగాక యని వారితో చెప్పుము. గురుదేవులను ఎల్లప్పుడును భక్తులు పరివేష్టించి యుండుటచే, ఈ విషయమును నేనే స్వయముగా వారితో విన్నవించుటకు సమయము దొరకుట కష్టము" అనెను.

ఆమె చెప్పినది సత్యమే ననియు, ఆమె కోరికను తీర్పవలయుననియు నేను తలంచితిని. మరుసటి ఉదయము నేను శ్రీరామకృష్ణుని గదికి వెళ్లుసరికి ఆయన ఒంటరిగా మంచముపై కూర్చుండి యుండెను. నే నాయనకు నమస్కరించి మాతృదేవి ప్రార్థనను విన్నవించితిని. ఆయన దానిని వినెను కాని బదులేమియు చెప్పలేదు. హఠాత్తుగా ఆయన అతిగంభీరు డయ్యెను. ఆయన ఆ భావమున నున్నప్పుడు ఆయన ముందు ఒక్కమాట పలుకుటకుకూడ నెవ్వరును సాహసింపరు. ఆయన ఎదుట కొన్ని నిముసములు నిశ్శబ్దముగా కూర్చుండి, తర్వాత ప్రణామము లాచరించి, నిష్క్రమించితిని. నహబత్తునందు మాతృదేవి తన నిత్యపూజయం దుండెను. ద్వారమును కొంచెముగా తెరచి, తొంగి చూచితిని. ఆమె ముసిముసిగా నవ్వుచుండెను. మరునిముషము ఏడ్చుచుండెను. ఇట్లొకటి విడిచి యొక్కటి కొంతసేపు జరిగెను. కన్నులనుండి ఆనందబాష్పము లెడతెగక ప్రవహించుచుండెను. అట్లు కొంతసేపు గడచిన తర్వాత, నామె చాల ప్రశాంతురా లయ్యెను. ఆమె సమాధియం దున్నదని నేను గ్రహించితిని. ద్వారమును మూసికొని, వెడలిపోయితిని. కొంతసేపటికి ఆమె గదికి మరలి వచ్చితిని. మాతృదేవి నాతో, "గురుదేవుల గదినుండి నీ విప్పుడే కదా వచ్చుచున్నావు?" అనెను, నే నామెతో, "అమ్మా! నీవు ఆధ్యాత్మిక పారవశ్యము ననుభవించుటే లేదని చెప్పెదవేం?" అంటిని. ఆమె లజ్జించి, తర్వాత మందస్మితురా లయ్యెను. ఆ సంఘటన తర్వాత నేను కొన్నిసార్లు దక్షిణేశ్వరమున రాత్రు లామెతో గడపితిని. నే నింకొక శయ్యపై నిద్రింపకోరినను, ఆమె నా కోరిక నాలకింపదు. ఆమె తనయొద్దకు నన్ను లాగుకొనును. ఒక రాత్రి ఎవరో పిల్లనగ్రోవి నూదుచుండిరి, ఆ శబ్దము విని మాతృదేవి సమాధి కేగెను. ఆమె అప్పుడప్పుడు నవ్వుచుండెను. నేను మిక్కిలి సంకోచముతో మంచమం దొక మూల నొదిగి కూర్చుంటిని. నే నొక ప్రాపంచిక స్త్రీగా నున్నందున, ఆ సమయమునం దామె నంటరాదని తలంచితిని. చాలసేపు గడచిన తర్వాత ఆమె మనస్సు సమాధిస్థితినుండి క్రిందికి వచ్చెను.

ఆమె యొకనాడు బలరాంబాబు మిద్దెపై కూర్చుండి ధ్యానము చేయుచు సమాధిస్థితి కేగెను. బాహ్యస్మృతినందిన తర్వాత ఆమె నాతో, "ఆ స్థితియందు నే నొక దూరదేశమునకు వెళ్ళియున్న ట్లగుపించినది. అచ్చటివా రందరును నాతో చాల ప్రేమగా నుండిరి. నా

సౌందర్యము వర్ణనాతీతము. అచ్చట శ్రీరామ కృష్ణులుకూడ నుండిరి. చాల వాత్సల్యముతో వారు నన్ను తమప్రక్కన గూర్చుండ జేసిరి. ఆ పారవశ్యానుభవమును నేను వర్ణింపజాలను. అట్టి ఉన్నతస్థితినుండి మనస్సు కొంత క్రిందకు దిగిన తర్వాత, నా శరీర మచ్చట పడి యుండుటను చూచితిని. 'ఇట్టి వికారస్వరూపము గల శరీరమున ప్రవేశించు టెట్లు' అని తలంచితిని. ఆ శరీరమున ప్రవేశించుటకు నా మనస్సు నొడబరచుట నాకు సాధ్యపడలేదు. చాలసేపు గడచిన వెనుక నా మనస్సు శరీరమున ప్రవేశించినది. తర్వాత శరీరము మరల చైతన్యవంతమైనది" అనెను.

ఒకనాటి సాయంకాలమున బేలూరున నీలాంబరబాబు మిద్దెయందు నేను – మాతృదేవి – గోలప్‌మాయి – అందరము ధ్యానము చేయుచుంటిమి. ధ్యానము ముగిసిన వెనుక, నేను మాతృదేవిని గమనించితిని. ఆమె అదే రీతి ధ్యానమున లీనమై యుండెను. ఆమె శరీరావయవము లేవియు కదలుట లేదు. ఆమె మనస్సు సమాధియందలి పరమానందమున మునిగిపోయి యుండెను. చాలసేపటి కామెకు బాహ్యస్మృతి కలిగినది. వెంటనే, "ఓ, యోగేన్! నాచేతు లేవి? నా పాదము లేవి?" అనసాగెను. నేనామె అవయవముల నొక్కుచు, "ఏమమ్మా! నీ పాదములు, నీ చేతులు ఇచ్చటనే యున్నవి కదా!!" అంటిని. అప్పటికిని, చాలసేపటివరకు ఆమె బాహ్యస్మృతి నందలేదు.

---

ఓం

శ్రీ కృష్ణాయ నమః

# దివ్యదాంపత్యము

## చిలువూరి మాధవకృష్ణ కవి

ఉ॥ శ్రీవిలసిల్లు నేప్రభుని చిన్మయ జన్మము వేదమూల మే
దేవుని దివ్యజీవనము ధీయుతభాష్యము శాస్త్రపంక్తి కే
దేవుని త్యాగ మీ పతిత దీనజనోద్ధరణైక భాగ్య మా
దేవుని రామకృష్ణ గురుదేవునిఁ గొల్చెద మోక్షసిద్ధికిన్.

ఉ॥ శ్రీవిలసిల్లఁ గొల్తు గుణశీలములన్ నిజశిష్య బృందమున్
వావిరిఁ దెల్పఁ గొల్పఁగను బావనజీవన మూని భూరి మా
యావశిఁ బాపి మించు కరుణార్ద్ర హృదంబుజయైన శారదా
దేవినిః రామకృష్ణ గురుదేవుని దేవినిః మాతృదేవినిన్ః

శ్రీమంతం బగు బ్రహ్మాండంబున, మూలమూలల–దేశదేశముల–నెందయినను ఏమాత్రమయినను, ధర్మగ్లాని సంభవించెనేని, జగన్నాటకసూత్రధారి యగు సర్వేశ్వరుడు అంశరూపముననో, పూర్ణరూపముననో యవతరించి యధర్మమును రూపుమాపి ధర్మసంస్థాపనము

గావించుట పరిపాటి. ఇదియే భగవదాదేశము, అభయప్రదానము. ఇందులకు ఆ పరాత్పరుడు తనకు వలయు ననుచరబృందమును దనవెంట గొనివచ్చుటయు పరిపాటి. వీరినే 'ఈశ్వర కోటు'లు, 'అంతరంగికు'లు, 'రసద్దారు'లుగా పెద్దలు వ్యవహరింతురు.

భారత దేశమున పందొమ్మిదవశతాబ్దము ప్రారంభమున భగవానుడు మఱియొకమా రవతరింపవలసి వచ్చెను. నాడు భగవదన్వేష ణమున వివిధాభిప్రాయములు చెలరేగెను. అసమగ్రమగు నాటివిదేశీయ విద్యావిధానము ఈ యభిప్రాయముల నినుమడింపజేసెను. నాటి యాంగ్లవిద్వాంసులలో ననేకులు వేదాది మత గ్రంథము లన్నియు మానవశీల సంరక్షణా ర్థమే-సృష్టింపబడిన వనియు, వానివలన నితర ప్రయోజనము మఱియొకటి లేదనియు, భగవ దన్వేషణమున నివి నిష్ఫలములే యనియు, నిజ ముగా భగవంతు డనువాడొకడు లేడనియు, కలడేని మన కేల కన్పింపడనియు దృఢముగా విశ్వసింపజొచ్చిరి.

ఇట్టి సమయమున భగవంతుడు తన యస్తి త్వమును నిష్పాక్షిక కృపాకటాక్షమును, శర ణాగత సంరక్షణమును స్వయముగా నిరూపింప వలసి వచ్చెను. అందులకే శ్రీరామకృష్ణావ తారము.

శ్రీ గురుదేవుని జనకుడు క్షుదిరాముడు దయార్ద్రహృదయుడు, నిత్య సత్యవ్రతుడు, నిశ్చలదైవభక్తిరతుడు. ప్రథమకళత్రము మర ణించుటవలన నీతడు చంద్రమణీదేవి యను మహాసాధ్విని వివాహమయ్యెను. వారి సంసా రము నిరంతర భగవత్సంసేవనముతో సాగి పోవుచుండెను.

1835-వ సంవత్సర ప్రారంభమున ద్వితీయ తీర్థయాత్రకు బయలుదేరి మార్చినెలలో క్షుది రాముడు గయాక్షేత్రమును జేరెను. అచ్చట భగవానుడు శ్రీ గదాధరుడు స్వప్నదర్శనము నొసగి 'ఈ సారి నీ కుటీరమున బుట్టి నిన్ను నా తండ్రిగా పరిగ్రహింతును' అని అనుగ్రహిం చెను. యాత్రానంతరము క్షుదిరాము డిలుసేరి తన భార్య గర్భచిహ్నముల గాంచి ఆమె కప్పు డపుడు గలుగుచున్న దివ్య స్వప్నములకును గయలో భగవానుడు స్వప్నదర్శనమున సెల విచ్చిన పలుకులకును సమన్వయము గుదిర్చికొని భగవదవతారమును నిర్ధారణ చేసికొని భగవ దాయత్తచిత్తుడై మెలగుచుండెను. 1836-వ సంవత్సరము ఫిబ్రవరి 18-వ తేది ప్రభాతసమ యమున చంద్రాదేవి లోకోద్ధారకుడయిన దివ్య శిశువును ప్రసవించెను. జ్యోతిషశాస్త్రజ్ఞు డగు క్షుధిరాముడు భగవానుడే యీ శిశురూపమున దనయింట నవతరించె నని నిశ్చయించెను. గయాక్షేత్రమున భగవానుడు అనుగ్రహించిన అభయవాక్కు దలచి ఆ శిశువునకు గదాధరు డని నామకరణము చేసెను. ఆయనయే శ్రీరామ కృష్ణపరమహంస యని జగత్ప్రసిద్ధి గాంచెను.

బాల్యమునుండియు శ్రీరామకృష్ణుడు ఆధ్యా త్మిక సాధనలు గావించుచు వివిధ దివ్య భావ ములకు లోనై యొకప్పుడు విలపించుచు మఱి యొకప్పుడు హసించుచు లోకసామాన్య కృత్యములందు దూరీకృతచిత్తుడై వర్ధిల్లు చుండెను. ఆయన దివ్యభావములు లోకుల కున్మత్తప్రలాపములై కన్పట్టసాగెను. ఆయన నిజముగా పిచ్చివా డనియే - ఆయనకు మతి పోయిన దనియే - యెల్లరును శంకింపసాగిరి. ఈ విషయము విని తల్లి చంద్రాదేవి కుమారు నకు వివాహ ప్రయత్నము గావింపసాగెను.

కలకత్తా నగరమునకు పడమట అఱువది మైళ్లదూరమున జయరామవటి యనుకుగ్రామ మున రామచంద్రముఖోపాధ్యాయు డనుమహా

చేయుచు నివసించుచుండెను. సుగుణరత్నాకరుడగు ఆ భక్తవతంసుడు బ్రాహ్మణాదర్శమూర్తి. ఆయన అర్ధాంగి శ్యామసుందరీదేవి ఆయనకు దగిన యిల్లాలు; కల్లకపటము లెఱుగని సత్యకాలపు తల్లి. గొప్ప భక్తురాలు.

ఈ పుణ్యసాధ్వి యొకానొకపుడు జయరాంవటికి సమీపగ్రామమగు సిహోరున జరుగు దేవతోత్సవమునకు వెడలియుండెను. దేవాలయమున కనతిదూరమున విశ్రాంతినిమిత్తమై యామె యొక చెట్టునీడను గూర్చొనియుండగా కొంత గాలి తన శరీరమున ప్రవేశించినట్లు ఆమెకు స్ఫురించెను. ఆ సమయముననే చెంగావి చీరను ధరించిన యొకానొక బాలిక చెట్టు దిగి వచ్చి శ్యామసుందరీదేవిని తన దివ్యహస్తములతో కౌగిలించుకొని "నేను మీ యింటికి వచ్చితిని" అని సెలవిచ్చెను. ఆ బాలిక తనలో ప్రవేశించినట్లు స్ఫురించిన యుత్తరక్షణముననే శ్యామసుందరీదేవి శరీర విస్మృతి నందెను. అచిరకాలముననే శ్యామసుందరీదేవి గర్భము ధరించెను; 1853-వ సంవత్సరము డిసంబరు నెల ఇరువదిరెండవ తేదీని దివ్యశిశువును ప్రసవించెను. ఆమెకు ఆ పుణ్యదంపతులు ఠాకూర్మణి యని నామకరణము చేసిరి. శారద యన్న ముద్దుపేరుననే పిలుచుచు పెంచుచుండిరి. ఆ నామమే జగత్ప్రసిద్ధ మయ్యెను.

శ్రీ శారదాదేవికి రెండేండ్ల ప్రాయమున శ్యామసుందరీదేవి తనపుత్రికతో గూడ సిహోరునందలి దేవాలయోత్సవమునకు జనియుండెను. ఆ యుత్సవమునకు శ్రీరామకృష్ణుడు గూడ వచ్చియుండెను. అచట జేరిన స్త్రీలలో కొందఱు తమ సమీపమున గుమిగూడియున్న బాలురను శారదకు జూపి "ఈ బాలురయం దెవరిని పెండ్లియాడుదువమ్మా?" అని వినోదార్థము ప్రశ్నించిరి. శారదాదేవియు ముద్దులు మూటగట్టు తన చిన్నివ్రేలితో శ్రీరామకృష్ణుని జూపియుండెను.

అనంతరము శ్రీ చంద్రాదేవి శ్రీరామకృష్ణుని పిచ్చికుదుర్చుటకు పెండ్లియే విరుగుడని తలంచి యందులకై విశ్వప్రయత్నములు చేసెను. కాని యెందును సంబంధము కుదిరినది కాదు. ప్రయత్నము విఫలమైనందున తల్లియు నన్నయు చింతింపజొచ్చిరి. వారి మనోవ్యాకులతనుగాంచి శ్రీరామకృష్ణు డిట్లు తెలిపెను: "జయరాంబాటియందు రామచంద్రముఖోపాధ్యాయునింట నాకై నిర్ణయింపబడిన వధువు కలదు." ఇక చంద్రాదేవి ఆ సంబంధమునకు ప్రయత్నించెను. ఆశ్చర్యము! సంబంధము కుదిరెను. శారదామాతృదేవికిని శ్రీరామకృష్ణ గురుదేవునికిని వివాహము వైభవోపేతముగ జరిగెను.

తన యవతారమునుగూర్చి శ్రీగురుదేవుని ప్రవచము: "ఇంతయు నిక్కువంబు వినుమెవ్వఁడు రాముఁడో కృష్ణుఁ డెవ్వఁడో, యెంతయు రామకృష్ణుఁ డన నీ తనువందె నతండె; కాని వేదాంతపుఁ బల్కు గాదిది." ఇఁక మాతృదేవినిగూర్చి: "ఆలయమున నున్న జగన్మాతయు నహబత్తుననున్న ఆమె (శ్రీ శారదాదేవి)యు నొక్కటియే. వారిరువురకును అభేదము...ఆమె జ్ఞానదాయిని. సామాన్యమైనదా. ఆమె నా శక్తి." "నేను జీవించియున్నంతవఱకు నా వాస్తవస్వభావమును ఎవరును దెలిసికోజాలరు"..."నేను రాధను" అని శ్రీ మాతృదేవి స్వవచనము. 'మమ మాయా దురత్యయా' అన్న భగవద్వాక్యమిం దనుసంధేయము. "ఒకప్పుడు ఆమె సాక్షాత్తు లక్ష్మీదేవి, మఱియొకపుడు సీతాదేవి" అని శ్రీ అద్భుతానందవాణి. ఈ "మహావాక్యము"ల పరిశీలించితిమేని 'రాఘవ

త్వేఽభవ త్సీతా రుక్మిణీ కృష్ణజన్మని, అన్యేషు చావతారేషు విష్ణోరేషాఽనపాయనీ' అన్న భక్తవాక్యము-ప్రమాణవచనము-ననుసరించి శ్రీరామకృష్ణుడు పరాత్పరుడనియు శ్రీ మాతృదేవి పరదేవతయనియు దెలియవచ్చుచున్నదిగదా!

ఇక లోకసంగ్రహము విషయమున ఈ దివ్యదంపతు లెట్లు జీవించిరో ఎట్లు జగదుద్ధారణము గావించిరో పరిశీలింతము. 'నన్ను మాయలోనికి లాగుట నీ యభిమతమా?' అన్న గురుదేవుని ప్రశ్నకు తల్లి యొసగిన సమాధానము : "ఏల? పారమార్థికపథమున మీకు దోడ్పడుటకే నేను వచ్చియున్నాను." ఈ సంభాషణమే వారిరువురి జీవితపరమార్థమును ప్రస్ఫుటము గావించుచున్నదిగదా!

శ్రీ మాతృదేవిని ఆచార్యపథమునకు సమర్థను గావించు నిమిత్తము శ్రీగురుదేవుడు ఎంతయో శ్రద్ధవహించి యామె జీవితమును తీర్చిదిద్దెను. శ్రీ మాతృదేవియు శ్రీగురుదేవుని సంసేవనముననే సమస్తపరమార్థమును సమకూర్చుకొనగలిగెను. షోడశీపూజయని ప్రసిద్ధి గాంచిన ఫలహారిణీ కాళీపూజయందు శ్రీగురుదేవుడు మాతృదేవినే ప్రతీకముగ గ్రహించి తాను గావించిన పూజాఫలము సమస్తము ఆమెకే సమర్పించెను. ఈ మహాఫలము కారణముగా ఆ తల్లికి అపూర్వ ఆధ్యాత్మిక సౌభాగ్య మలవడియెను. ఆచార్యపదవికి ఆ మహాదేవి సమర్థయయ్యెను.

ఒక్కచూపుతో, ఒక్కస్పర్శతో, ఒక్కమాటతో శ్రీగురుదేవుడు శిష్యులను పారమార్థికపథమున తీర్చిదిద్దెడివాడు. ఆయన యోగీంద్రనాథున కొసగిన అభయము ఈ విషయమును స్థిరపఱచుచున్నది—"వివాహమైననేమి? నాకు కాలేదా? అంతమాత్రమునకే జంకేల? ఈ తావు (నేను) సుముఖముగా నున్నంతకాలము లక్షవివాహములైన నిన్నేమి చేయగలవు? గృహస్థుడవుగా నుండదలతువేని నీ భార్య నిచటి కొకసారి తీసికొని రమ్ము. నీ ఆధ్యాత్మిక అభివృద్ధికి తోడ్పడునట్లు ఆ బాలిక బుద్ధిని త్రిప్పివేసెదను. లేక గృహస్థువుగా నుండనొల్లవేని నీలోకాసక్తతనంతయు మ్రింగివైతును!"

ఇట్లే మాతృదేవియు శిష్యుల చిత్తచాంచల్యమును-మాలిన్యమును-తృటిలో చక్కబఱచెడిది. ఒకానొక మహావిపత్తునకు గుఱియైన ఒకానొక స్త్రీ తన విపన్నివారణ నిమిత్తము శ్రీగురుదేవు నాశ్రయించెను. ఆయన ఆమెను మాతృదేవియొద్దకు బంపెను. శ్రీ మాతృదేవి పూజాసమర్పితమగు నొక బిల్వపత్రము నామెకనుగ్రహించెను. ఆశ్చర్యము ఆ యువతి జీవిత మద్భుతపరిణామము చెందెను.

ఒకానొకప్పుడు మాతృదేవి జయరాంబాటి నుండి దక్షిణేశ్వరమునకు బయనమయ్యెను. మార్గమధ్యమున తెలోభెలో, కైకల యనునరణ్యప్రదేశముల నిర్గమింపవలయును. అది బందిపోటుదొంగలకు ఉనికిపట్టు. యాత్రికులందఱు చీకటిపడకముందే యరణ్యమును దాటిపోయిరి. మాతృదేవిమాత్ర మొంటరిగా వెనుకబడియుండెను. ఆ సమయమున రూపొందిన యంధకారమోయన నొకానొక భీకర వ్యక్తి ఆమెను సమీపించి 'ఎవరక్కడ?' యని భయంకరముగ గద్దించెను. ఇక జెప్పెడిదేమి! మాతృదేవి నిలువున నీరయ్యెను. మనస్సును కుదుటబఱచుకొని "నాయనా! నాతోడివారందఱు నన్ను విడనాడి వెళ్లిరి. వారిని జేరుటకై నాకు సాయమొనర్పుము" అని వాత్సల్యముట్టిపడ బలికెను. ఇంతలో నాతనిభార్య వీరిని గలిసికొనెను. ఆమె చేతిని బట్టుకొని

"అమ్మా! నేను నీ బిడ్డను. ఈ యరణ్యమును దాటజాలక చిక్కుకొన బడియున్నాను. ఇంతలో నీవును నాయనయు వచ్చితిరి. లేనిచో నే మయ్యెడి వాడనో" అని తన అసహాయతను వెల్లడించెను. క్షణములో వారి మనసు మారిపోయెను. వారిరువురును మాతృదేవిని తమ బిడ్డనువలె ఆదరించిరి. రాత్రంతయు ఆమెను గాపాడిరి. ఉదయముననే ఆమెను తారకేశ్వరమువఱకు తీసికొనివచ్చి తోడివారితో కూర్చి వెడలిపోయిరి. ఒక్కచూపుతో, ఒక్కమాటతో, ఒక్క స్పర్శతో మాతృదేవి దారులు గొట్టు దొంగలనైతము తీర్చిదిద్దినది!

శ్రీ మాతృదేవి హృదయమార్దవమునే కాని హృదయదార్ఢ్యమును బ్రకటింపలేదని భావింపరాదు. ఆమె ధైర్య స్థైర్యము లపారములు. హరీశుడను నున్మత్తుడు ఒకపరి మాతృదేవిని దఱుమజొచ్చెను. అపు డింటనెవరును లేరు. తల్లి ఒంటరియై యుండెను. ఏమిచేయుట? ఆ తల్లి గాదె వెనుకకు బరువెత్తినది. ఆమెను వదలక హరీశుడు గాదె చుట్టును ఆమెను దఱుమ నారంభించెను. ఇక లాభము లేదని తల్లి తన నిజస్వభావమును వెలువరించెను. అతని బట్టికొని క్రిందబడవైచి గుండెలపై మోకాళ్లూని యాతని లెంపలు వాయించెను. ఇట్లే అవసరము కలిగినపుడెల్ల ఆ తల్లి హృదయమార్దవమును, ధైర్యస్థైర్యములను బ్రకటించుచుండును.

ఆచార్యపథమున ఆ తల్లి యనుసరించిన విధాన మనన్య సామాన్యము. "మంత్రోపదేశ మనిన మాటలా? ఎంతటి మహత్తరమైన బాధ్యతను మేము వహింపవలయును? ఎవరి బాధ్యతను మేము వహించియున్నామో వారి బంధ విముక్త్యనంతరమే మాకు మోక్షము" అని ఆమె పలికిన పలుకులే శిష్యుల సంరక్షణమున ఆమె వహించిన బాధ్యత యెట్టిదో విశదీకరించుచున్నవి.

తన స్పర్శవలన మాతృదేవికి బాధ కలుగునేమో యని ఒకానొక శిష్యుడు సంశయించుచుండ పసికట్టి ఆ తల్లి యి ట్లనునయించెను. "నాయనా, భయపడకు; మే మిందులకే జన్మించితిమి. ఆశ్రితుల పాపములను దుఃఖములను మేమే భరింపనిచో నిక నెవరు భరింపగలరు?"

"అమ్మా! మీకు నాయట్టి పుత్రు లెందఱో కలరు. కాని మీయట్టి తల్లి ప్రపంచమున లేదు" అని యెందఱో శిష్యు లాయమ పాదపూజచేసి ధన్యులైరి.

ఇట్లు శిష్యులదుఃఖములను పాపములను భరించినందున మాతృదేవి అవసానకాలమున దీర్ఘవ్యాధులకు గుఱికావలసి వచ్చెను.

ఆ జగజ్జనని లోకమునకు జాటిన చరమ సందేశము :

గీ. సాధ్వి! కోరెదవా మనశ్శాంతి నిదిగో,
వదలు పరనింద నీ దోష పటల మెన్ను
మీ ప్రపంచంబు నీది గావించుకొమ్మ!
అన్యు లెవ్వరు లేరు నీ కందు నిందు.

లోకసంగ్రహము నిమిత్తము-భక్తులముక్తి నిమిత్తము-అవతరించి ఎందఱికో భగవల్లాభము ననుగ్రహించిన యీ దంపతుల పాదపద్మము లాశ్రయించి ఆధ్యాత్మికపథమున మనము పురోగమింతముగాక!

తే.గీ. దివ్యజననిని శారదాదేవి మఱియు; రామకృష్ణ జగద్గురుఁ బ్రేమమీఱ
అమల చరణాంబుజాతము లాశ్రయించి; అహరహంబును సాష్టాంగ మాచరింతు.

# యోగపారబోధిని—18

**శ్రీ జ్ఞానేశ్వరానందస్వామి**

## భక్తియోగము I

తనకంటె మహోత్కృష్టమగు శక్తిని వ్యక్తీకరించు దేవునిపట్ల భక్తి మానవుని హృదయమును సర్వదా ప్రబుద్ధము చేయుచునే యున్నది. అతిమానుషమగు నిట్టి శక్తియందలి ప్రీతితో పూజ్యభావముతో మానవు డెన్నియో రమణీయభావములను వెలిబుచ్చుకొనెను. ఆతని హృదయపులోతులనుండి వెల్లుబికిన ఈ మనోహరభావతరంగములు స్తోత్రరూపముగా వేదములందును ఇతర శాస్త్రములందును కోకొల్లలుగా కన్పించును. భారతదేశమునందు ఇట్టి మానవాతీతశక్తిని బూజించి ప్రేమింపవలయు ననెడి యుత్సుకతయే ఆత్మానుభూతిని పొందుటకొరకు శాస్త్రీయమైన విధానముగా పెంపొందింపబడినది. దీనినే భక్తియోగమందురు.

భక్తియోగమునకు పరమాశయము అనంతప్రేమమూర్తియగు భగవంతుడు. మానవుని యందంతర్గతమగు దివ్యత్వము యొక్క యంశయే మానవసహజమగు ప్రేమించు శక్తియని భక్తియోగము వక్కాణించును. అంతియే కాక ఆ ప్రేమశక్తినే సర్వశక్తివంతమగువరకు పరిశుద్ధము చేయుటనుగూడ నేర్పును. మనయందున్న ఈ ప్రేమలేశమును చక్కదిద్దుకొని పెంపొందించుకొనుట వలన నిరవధికప్రేమస్వరూపి యగు భగవానుని సాక్షాత్కరించుకొనుట వలనుపడును. భగవంతుడే ప్రేమ. ప్రేమయే భగవంతుడు. ప్రేమనుండియే భగవద్రూపము జనించును. ప్రేమయందే రూపమును నిలుపుకొనును. చివరకు ప్రేమయందే అది లీనమగును.

కనుక మానవుని యందంతర్గతమైయున్న ప్రేమభావమును పవిత్రము చేయుటద్వారా పరిపూర్ణతను సాధించు శాస్త్రమును, కళను భక్తియోగ ముపదేశించును. విషయవిజ్ఞానము నొసగునది శాస్త్రము. ఆచరణవిధానమును తెలుపునది కళ.

మనోభావములన్నియు ప్రేమయందే ఇమిడిపోవు నని చెప్పవచ్చును. మానవుని యందంతర్గతమైన పరిపూర్ణత యను శక్తియే వివిధ మనోవికారరూపమున వ్యక్తమగుచుండును. ఆ శక్తియే ఒకవైపున ప్రేమముగాను మరియొకవైపున కామక్రోధాదులుగాను భాసించుచుండును. భక్తిసారస్వతమునందు దేవుని పట్ల మితిలేని వైరమును ప్రకటించి కూడ దైవసాక్షాత్కారము నందిన మహానుభావులు ఎందరో కన్పింతురు. ఇట్టి సందర్భములందు కూడ అహంకారము ఆదర్శమునందే లీనమగుట తప్పదు గదా! అందువలన నిరంతరసాధనచే గాఢమును పవిత్రముగను చేయబడిన ఏ ప్రాథమిక మనోవికారమైనను తన చరమావధియందు మానవునిలో బీజప్రాయమై యున్న దివ్యత్వమును పరిపూర్ణముగా వికసింపజేయు నని భక్తియోగముయొక్క సిద్ధాంతము.

భక్తియోగమునందలి భగవంతుడైనను వేదాంతమునందలి బ్రహ్మమైనను ఏకమును విశ్వవ్యాప్తమును అనంతమును ఐన చైతన్యమునే నిర్దేశించును. కాని భక్తుడు తన ప్రేమ నభివృద్ధి చేసికొనుటకై తనలోని యా చైతన్యమునుండి యొక పూజనీయుడు ప్రీతిపాత్రుడు సాకారుడు అగు దైవమును సృష్టించుకొనును. సావధికమగు ఆ దైవమునే అతడు 'ఇష్టదేవత' యనును. ప్రేమయనగా ఏ వస్తువునందైనను మానవుడు తన అత్యున్నతాదర్శమును గుర్తించుట. మన యాదర్శమును గుర్తింపగనే దాని

నొక వస్తువుపై నారోపించి ఆ వస్తువును ప్రేమింతుము. మానవున కత్యున్నతమగు నాశయము సాకారముగా సృష్టింపబడి వ్యక్తిగతమగు ఆధ్యాత్మికాదర్శమైనచో దానినే 'ఇష్టదైవ' మందుము.

ఇట్లు ఇష్టదేవతగా రూపకల్పన చేసికొనిన దైవమునందలి పరమప్రీతియే భక్తి. నిరతిశయముగా ప్రేమింపదగు ఏ వస్తువైనను మానవుని భక్తి కుపకరణము కాగలిగినను, ఒక అతిమానుషసత్తయే ప్రేమకు లక్ష్యమగుట శ్రేయస్కరము.

మానవుడు తన ప్రేమను సరియగు దారిలో బెట్టి పోషించుకొనుట కొక యాలంబన మవసరము. ఈ ఆలంబనము తనకు ప్రీతిపాత్రములగు జీవనపరమావధులను వ్యక్తీకరింపవలెను. ఇట్టి యవసరమునే భక్తిసిద్ధాంతము ఇష్టదేవతయందు గుర్తించును. భక్తుడు సాకారాదర్శమగు 'ఇష్టము' నంగీకరించి అది తన మనోవాక్కాయములయందు స్పందించునట్లు ప్రేమింపవలెను. అందుచేతనే భక్తుని దైవము ఒక దేవతయైనను మానవభావము నందిన దేవుడు కాడు. మరియు భగవంతుడు తన యాంతరంగికసృష్టి యైనందున భక్తుడు దేవుని తన ప్రతిరూపముగానే చిత్రించుకొనును. విశ్వజనీనమగు తత్త్వమున కది అతనియొక్క వ్యక్తిగతము సాపేక్షము అయిన వ్యాఖ్యానము మాత్రమే. అందువలన దాని నింకొకరి తలపై రుద్దవలసిన యగత్యముగాని ఇంకొకరితో చర్చింపవలసిన యవసరముగాని లేదు.

అనంతమగు నిరాకారచైతన్యమునుండి మలచబడినదే ఇష్టదేవత. స్వభావముచేత వస్తువొకటియే. ఎవరి కిష్టమైన నామరూపములతో వారు దానిని గ్రహింపవచ్చును. భక్తులెందఱుండిన అందఱు ఇష్టదేవత లుండుట కేమియు నభ్యంతరము లేదు. అవి యన్నియు వారి వారి కవగతమైన నిరాకారభావములు. వ్యక్తిగతమగు దైవస్వరూపమును గూర్చి మనలో మనము తగవులాడ పనిలేదు. నా దేవుని నేను సృష్టించుకొందును. నీ దేవుని నీవు సృష్టించుకొనుము. ఈ భగవంతు లందరకును మూలమగు ఆ చైతన్యమున కంతము లేదు గదా!

ఉదాహరణమునకు తండ్రి సోదరుడు భర్త కుమారుడు గల యొక యువతి నూహింతము. తా నొక్కతెయే. అయినను ఈ నల్వురొక్కొక్కరు నొక్కొక్క దృష్టితో నామెను జూతురు. ఒకరు చూచు భావముతో నింకొకరు చూడరు. అయినను ప్రతియొక్కరి దృష్టియు సత్యమే గదా! ఆ యువతియో! తనను ప్రేమించు ఆ నల్వురకును అన్నియు తానే.

కనుక ఎవరి నిశ్చితాభిప్రాయములందు వారికి గల హక్కును గుర్తించి నీ నిశ్చితాభిప్రాయమును మాత్రము వదలక పట్టుకొని యుండవలెను. తమ కెట్టి దృఢనిశ్చయమున్నను ఇతరుల నిశ్చయములను గూడ భారతీయు లొప్పుకొందురు. భారతీయులు ప్రకటించు ఈ సహృదయతయే భారతదేశమున క్రైస్తవమతబోధకుల మతాంతరీకరణ ప్రయత్నమున కడ్డుతగులుచున్నది. భారతదేశము నందలి ముప్పదిమూడుకోట్ల దేవతలును ఇష్టదేవతలే. కాలక్రమమున ప్రతియొక్కటియు సరియగు భావన యని యంగీకరింపబడినవే. ఇట్టి వైవిధ్యము గల ఇష్టదేవత యను భావము మనకు మనోవైశాల్యమును సహనమును ఇచ్చును. (సశేషము)

# పరిప్రశ్న

ప్రశ్న : అవతారపురుషులకు దుఃఖముల ననుభవించు మానవాళిపై కనికరమని చెప్పబడుచున్నది. ఈ కనికరము వా రనుభవించు శారీరకబాధల నుద్దేశించియా, లేక తాము కష్టపడుచున్నామని భావించు వారి అజ్ఞానము నుద్దేశించియా ?

బదులు : మానవుని శారీరకబాధలు మొదలు అన్నివిధముల బాధలయందును అవతారపురుషుడు జాలిగొనును. గౌతమబుద్ధుడు ఒక గొఱ్ఱెపిల్ల ప్రాణముల కాపాడుటకై తన ప్రాణముల త్యజింప నుద్యుక్తుడుగా నుండెనని ఆయన జీవితచరిత్రమున మనము చూచియున్నాము. తీర్థయాత్రకై వెళ్లిన శ్రీరామకృష్ణుడు దారిలో దియోగర్ అను స్థలమందు అచ్చటి ప్రజల యాకలిబాధల గాంచి, జాలిగొని, మథురబాబు వారికి మృష్టాన్నభోజనమున కేర్పాట్లు చేయువరకు అచ్చటినుండి కదలుట కంగీకరింపలేదు.

కాని కేవలము మానవాళియొక్క శారీరకబాధానివారణార్థము ఒక అవతారమూర్తి దిగిరావలసిన పని లేదను విషయమును మన మిచట జ్ఞప్తియం దుంచుకొనవలసియున్నది. సమర్థతతో నిర్వహింపబడు ఏ సంఘమైనను ఆ కార్యము చాలవఱకు కొనసాగింపగలదు. ఇట్టి బాధానివారణకార్యక్రమముల నాచరించుటకు భగవంతునకు అతని మానవప్రతినిధులు గలరు.

ప్రపంచసృష్టి యంతయు భగవానుని అనంతక్రీడావినోదమని వేదాంతసిద్ధాంతము. సృష్టి, స్థితి, సంహారము, తిరోధానము, అనుగ్రహము అను పంచకృత్యముల మూలమున భగవంతుడు తన్ను తాను వ్యక్తీకరించుకొనుచున్నాడని భావన. అందులో 'అవతారమూర్తుల' మూలమున చేయబడు విశిష్ట కృత్యమే 'అనుగ్రహము' లేక జ్ఞానమును ప్రసాదించు భగవత్కృప. కావున మనుజుల సర్వదుఃఖములకు మూలకారణమగు అజ్ఞానమును తొలగించుటయే అవతారమూర్తుల ముఖ్యలక్ష్యమని చెప్పుట పొసగును. మనుజునకు వివిధక్లేశములు, కోరిక లున్నవనుట నిస్సంశయము. ఎట్లైనను, శారీరకక్లేశముల నివృత్తికొఱకు కృషిచేయు పలువ్యక్తులు, ప్రతినిధులు, సంఘములు గలవు. వారినుండి ప్రజలు తమ కష్టముల నివృత్తికై సహాయమును పొందవచ్చును. ప్రాపంచికసమస్యలందు వారి సలహాలను అభ్యర్థింపవచ్చును. కాని అవతారమూర్తుల జీవితములను క్షుణ్ణముగా గ్రహించుటవలనను, వారి బోధలను అనుష్ఠించుటచేతను మాత్రమే మానవులు ఈ సంసారసాగరమును తరించి, ముక్తిమార్గము నెఱుగ సాధ్యపడును.

భాగవతమున శ్రీకృష్ణుని అవతారావశ్యకతకు కారణముగా పలు అభిప్రాయములు సూచింపబడియున్నవి. చెరసాలయందు బంధితులై యున్న దేవకీవసుదేవుల ననుగ్రహించుటకే శ్రీ కృష్ణావతారమని కొందఱును, యాదవకులము కీర్తిని విస్తరింపజేయుటకే శ్రీకృష్ణుడు అవతరించెనని మరికొందఱును, భూభారమును తగ్గించుటకే ఆయన అవతారమని మరికొందఱును చెప్పుదురు. కాని తమ దివ్యకార్యముల ధ్యానించుటవలనను, దివ్యోపదేశముల స్మరించుట మూలమునను మానవుల కొక తరణోపాయమును సూచించుటయే అవతారపురుషుల రాకకు ప్రధానకారణమనికూడ అందు సూచింపబడియున్నది. మానవుల అజ్ఞానము తొలగవలెనన్న, ముక్తికి మార్గము లభింపవలెనన్న అవతారమూర్తులు తప్ప నిక గత్యంతరము లేదు. అవతారమూర్తుల

బోధనలు, భక్తులతోడి వారి ముచ్చటలు, తరతరములవరకును ధ్యేయవస్తువులుకాగలవు. అవతారమూర్తులు తమ శరణొందిన వారి నందఱిని అజ్ఞానవిముక్తులజేసి, జ్ఞానామృతమును అట్టి భక్తుల కందింపజేయుదురు. పాపపంకిలము అజ్ఞానమయము అగు జీవనమునుండి అవతారమూర్తులు తమ శరణాగతుల నుద్ధరింతురు. భక్తులెల్లరు నాస్వాదింపగలుగు ఆధ్యాత్మిక వైభవమును కూడ వారు సృష్టింతురు.

# వార్తలు - విశేషాలు

## శ్రీరామకృష్ణ మిషను సేవాశ్రమము, కనఖల్, హరిద్వారము.

### 73-వ సంవత్సరపు నివేదిక (ఏప్రిలు 73 మొదలు మార్చి 74 వఱకు)

ముఖ్యముగా తమ సర్వస్వమును భగవన్నిమిత్తము త్యజించిన సన్న్యాసులు, ఋషీకేశము మున్నగు మిట్టజిల్లాలయందు వ్యాధిగ్రస్తులయిన కాలమున నిస్సహాయము పరితాపకరమునగు వారి దుఃస్థితిని కండ్లారజూచిన శ్రీ వివేకానందస్వామి తమ శిష్యుడు శ్రీకల్యాణానందస్వామి కిట్లుద్బోధించెను. "నాయనా, హరిద్వారము, ఋషీకేశములందు అస్వస్థతకు గుఱియై బాధపడుచున్న సన్న్యాసుల నిమిత్తము కొంత సాహాయ్యము చేయజాలవా? వారు వ్యాధిగ్రస్తులయిన సమయమున వారికి సేవలొనర్పగల వారెవ్వరును లేరు గదా! పోయి వారిని సేవింపుము." శ్రీకల్యాణానందస్వామి ఈ పలుకుల విన్నంతనే హైందవ పుణ్యక్షేత్రమగు హరిద్వారమునకు విచ్చేసెను. తన గుర్వాజ్ఞను శ్రద్ధాభక్తులతో నిర్వర్తించుటయే తన జీవితపరమావధిగ ఆయన భావించెను. శ్రీ వివేకానందప్రోక్తమగు భగవత్సాక్షాత్కార కళారూపమయిన శ్రీరామకృష్ణ సేవాశ్రమమును స్థాపించెను. అందు శ్రీస్వామిజీ సందేశము రూపు దాల్చెను. 1901-వ సంవత్సరమున అద్దెయింట ప్రారంభింపబడిన ఈ సేవాశ్రమము 1903-వ సంవత్సరమున ప్రస్తుత భవనమునకు మార్చబడియెను; 1901-వ సంవత్సరమున శ్రీరామకృష్ణ (మిషను) సేవాసంఘమున చేర్చబడెను.

ఉదారస్వభావులగు దాతల నిష్కళంక సౌహార్ద్ర సాహాయ్యములవలనను ప్రభుత్వసహకారము వలనను నేడు ఈ 1974-వ సంవత్సరమున ఇది సంస్థాపకుల సుస్థిర కృషికి శాశ్వత చిహ్నమై యలరారుచున్నది. ప్రస్తుతము ఈ సేవాశ్రమము (52 రోగుల పడకలతో గూడి) బాహ్యాంతర శాఖాసంయుక్తమగు సంపూర్ణాభివృద్ధి గాంచిన వైద్యశాలయై శోభిల్లుచున్నది. అనుదినము నిందు వేలకొలది రోగులకు చికిత్స చేయబడుచున్నది. నిస్స్వార్థ సేవాపరాయణులగు సాధువుల పర్యవేక్షణమున సంపూర్ణ వైద్యశిక్షణ పొందిన ఉద్యోగి బృందము ఈ సేవాకార్యమును దక్షతతో నిర్వహించుచున్నది. 1973-వ సంవత్సరమున జూలై నెలయందు ప్రవేశపెట్టబడిన చలనవైద్యశాల (Mobile Dispensary) ఈ సంస్థ చరిత్రయందొక ముఖ్యఘుట్టము. 1974-వ సంవత్సరమున ఇందు నేత్ర చికిత్సాశాఖ ప్రవేశపెట్టబడెను. పండ్రెండేండ్ల కొకసారి వచ్చు "పూర్ణకుంభయోగ" మను ఉత్సవమునకు జనుదెంచిన లక్షలాది యాత్రికుల నిమిత్తము ఈ సంస్థ ప్రభుత్వముతోడను, ఇండియన్ రెడ్ క్రాస్ సొసైటీ

వారితోడను కలిసి వైద్యసాహాయ్య మొన
ర్చెను. 'మేళ' మైదానమునందు 50 పడక
లతో గూడిన తాత్కాలిక వైద్యశాల నెల
కొల్పబడినది. ప్రథమచికిత్సాశాఖ, చలన
వైద్యశాల శాఖలుగూడ అసంఖ్యాకు లగు
యాత్రికుల అస్వస్థతను రూపు మాపుటయందు
అవిరామకృషి సల్పినవి.

ఈ సంస్థయందు రోగులనిమిత్తము గ్రంథా
లయము పఠనాలయము గూడ గలవు. ఇందు
4,503 గ్రంథములు గలవు. 30 మాసపత్రికలు
మున్నగునవియు 6 దినపత్రికలును ఈ గ్రంథా
లయమునకు వచ్చుచుండును.

ఈ సేవాశ్రమ హితులు, మిత్రులు, దాతలు
మున్నగు సహృదయుల సౌకర్యార్థమై అతిథి
గృహముగూడ నిర్వహింపబడుచున్నది.

* * *

**ప్రస్తుత ముఖ్యావసరములు:—**

1. నేడు గల 52 పడకలయం దనేకములు
ఆధారద్రవ్యము లేనివై యున్నవి. ఒక్కొక్క
పడకకు ఆవశ్యకమగు ఆధార ద్రవ్యము
రూ. 10,000.

2. నర్సులకు 2,45,000 రూపాయల విలువ
గల వసతి గృహము (Hostel) నిర్మింపవలసి
యున్నది. ఇందు నిమిత్తము సర్ నెస్ వాడియా
ఫౌండేషన్ వారు దయతో రూ. 50,000
విరాళ మొసగియున్నారు. తక్కిన పైకము
ఆవశ్యకమై యున్నది.

3. దినదినాభివృద్ధి గాంచుచున్న బాహ్య
శాఖావసరములకు ఈ భవనము అత్యంతము
అల్పమని ఋజువగుచున్నది. ఈ భవనమును
విస్తరింపవలసిన అవసర మెంతేనియు గలదు.
అందులకు రు. 5,00,000 కావలసియున్నది.

4. నలువదియేండ్లకు మునుపు నిర్మింపబడిన
నేటి సాధువుల గదులు పైకప్పునను గోడలం
దును బగుళ్లుబారి యున్నవి. వానిని తిరుగ
కట్టింపవలసి యున్నది. ఇందులకు రూ. 75,000
ఆవశ్యకమై యున్నది.

# గ్రంథపరిచయం

## శక్తిపాతము

రచయిత: శ్రీ శ్రీయానందనాథాపర నామ
ధేయులు ఈశ్వర సత్యనారాయణ శర్మగారు.
డబల్ క్రౌన్ 1/16 సైజు 110+XIV పుటలు.
వెల: రూ. 4-00. ప్రాప్తిస్థానము: సాధన
గ్రంథమండలి, తెనాలి, ఆంధ్రప్రదేశ్.

ఇందు శ్రీ శర్మగారు శక్తిపాతమును స్వాను
భవపూర్వకముగ వివరించియున్నారు. తమ
బాల్యమునందు తమ తండ్రిగారు, తమ గురు
వులవారును తమయందు గావించిన శక్తిపాత
ముల విషయమును వెల్లడించియున్నారు.

"శక్తిపాతమను నీ గ్రంథమునందు గురు
వులు శిష్యులకు సంక్రమింపజేయు నాధ్యాత్మిక
శక్తిస్వరూప మెట్టిది? అది యెక్కడ నే విధ
ముగా బుట్టును? శిష్యుని శరీరమునందు ప్రవే
శించి యేమి చేయును? దానివలన నెట్టి యను
భవములు గలుగును?... ఈ యన్నిటి పరిణామ
మెట్టిది? ఈ మున్నగు విషయములనుజర్చించు
ప్రయత్నమే చేయుదము." అని తమరచనా
ప్రణాళికను శర్మగారు సూత్రీకరించియున్నారు.

తమ ప్రణాళికకు అనుగుణముగ వీరు తమ
గ్రంథమునందు దీక్షాభేదములు, మానసీదీక్ష,
ఆనందవికాస లక్షణము మున్నగు విషయము
లకు సప్రమాణముగ గావించిన వివరణములు
సాధకులకు ముముక్షువులకు ఆధ్యాత్మికపథము
నందు కరదీపికలై ప్రకాశించుచున్నవి.

**చిలుకూరి మాధవకృష్ణకవి.**

సంపాదకులు : శ్రీ చిద్ఘనానందస్వామి.

శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-600021) వ ముద్రింపబడి,

శ్రీ చిద్ఘనానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మద్రాసు-600004) నుండి ప్రచురింపబడినది.

# శ్రీమద్భగవద్గీత

అనువాదకులు :

**శ్రీ నిర్వికల్పానందస్వాములవారు**

ఇది మూలశ్లోకములు, ప్రతిపదార్థము, ధారాళమగు అనువాదము, శ్రీధరీయ, టీకాసారము, విశేషాంశములు, సానువాదగీతాపాఠక్రమము, ధ్యానమాహాత్మ్యములు సమభావాత్మకములగు ఉపనిషద్వాక్యసూచిక, వేదాంతసూత్రసూచిక, గీతాశ్లోకసూచిక, శబ్దానుక్రమణిక—ఇన్నిటితో విరాజిల్లుచున్నది.

భక్తులకు సాధకులకు మాత్రమేకాక కళాశాల విద్యార్థులకు సైతము ఉపయుక్త మయిన దివ్యగ్రంథము.

పుటలు : 56+740 (అందమయిన అష్టమ ముద్రణము) వెల : రూ 9-00

---

# 'మా దివ్యవాణి' గ్రంథమాల

**నేడే కొనండి !** పదే పదే చదవండి !!

దివ్యావతారమూర్తుల విశ్వోపజీవ్యములైన అమృత మధుర సూక్తులు సర్వ సుగ్రహము హృదయ సన్నిహితమునైన తేటతెనుగున వీనిలో అందజేయబడ్డాయి. ఇందులో ఒక్కొక్కటి నిరుత్సాహులకు ఉత్సాహప్రదం, అశాంతిసంక్షుభితులకు శాంతిదాయకం, సంశయాందోళితులకు సంశయాపనోదకం, జిజ్ఞాసువులకు పరమార్థజ్ఞాన సమర్పకం, అందరికీ శిక్షకం, సంస్కారకం, నిర్వృత్త్యాపాదకం. మువ్వన్నెల మేలి జాకెట్టుతో పాకెట్టుసైజులో చక్కని తయారింపు—

| | | | |
|---|---|---|---|
| శ్రీ రామకృష్ణ ఉవాచ | 0-80 | శ్రీ కృష్ణవాణి | 0-80 |
| శ్రీ శారదాసూక్తి నవనీతము | 0-80 | బుద్ధ ఉవాచ | 0-80 |
| శ్రీ వివేకానంద శంఖారావము | 0-80 | క్రైస్తు సూక్తిమాల | 0-80 |

మహమ్మదు సూక్తిమంజరి 0-80

---

ఇట్లు వ్రాయుడు :

మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠము, మైలాపూరు, మద్రాసు - 600004.

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౬౧ ౧౯౭౫ - ఫిబ్రవరి : ఆనంద - మాఘము సంచిక ౨

## విషయ సూచిక



## శ్రీ రామకృష్ణ గురుదేవుని 140-వ జన్మదిన మహోత్సవము

తిథిపూజ : 15-3-1975 శనివారము : ఉదయము 6 మొ॥ 11 గం॥వరకు : ప్రత్యేకపూజ, భజన, హోమము మున్నగునవి

మఠమున బహిరంగోత్సవము 16-3-1975 ఆదివారము అపరాహ్ణము 3-15 మొ॥ 7-30 గం॥వరకు

అపరాహ్ణము 3-15 గంటలకు : బ్రహ్మశ్రీ మంజక్కుడి రాజగోపాలశాస్త్రులవారిచే
'ధ్రువచరిత్ర' సంగీతప్రవచనము.

6-15 .. బహిరంగసభ : అధ్యక్షులు : శ్రీమత్తపస్యానందస్వాములవారు.
ఆంగ్లోపన్యాసకులు : శ్రీ హెచ్. ఎస్. రామచంద్రరావుగారు.

ఈ ఉత్సవములకు ధనరూపముగాని వస్తురూపముగాని పంపబడు విరాళములు
కృతజ్ఞతతో స్వీకరింపబడి రశీదులు పంపబడును.

### ఇతర మహోత్సవములు

25-2-'75 మంగళవారము : శ్రీ అద్భుతానందస్వాములవారి జయంతి

11-3-'75 మంగళవారము : మహాశివరాత్రి

27-3-'75 గురువారము : శ్రీ చైతన్యమహాప్రభు జయంతి

30-3-'75 ఆదివారము : శ్రీ యోగానందస్వాములవారి జయంతి

ఈ ఉత్సవములన్నింటియందు భక్తులెల్లరును పాల్గొని భగవంతుని అనుగ్రహభాగ్యమును బడయగోరుచున్నాము.

అధ్యక్షులు,
శ్రీరామకృష్ణమఠము, మద్రాసు-600004.

# శ్రీ శారదాదేవి చరిత్ర

శ్రీరామకృష్ణభగవానుని సతీమణియు, ఆదర్శమాతయు, యోగినియునగు

మహనీయురాలి దివ్యచరిత్ర

రచయిత:

## శ్రీ చిరంతనానందస్వాములవారు

ప్రతి స్త్రీయును పురుషుడును...చదువవలసిన గ్రంథమిది...అమృతకలశము ... అనన్యసామాన్య నీతిమంజరి...తియ్యని తెలుగు...పాలవంటి శైలి...

—ఆంధ్రప్రభ

...నారీలోకమున కేశాక, ఆధునిక వాఙ్మయమునకు ఈ గ్రంథము అమూల్యమైన కానుక; పాఠశాలలలో, కళాశాలలలో పాఠ్యగ్రంథముగా నుండదగిన ఉత్తమ గ్రంథము.

—ఆనందవాణి

246 పుటలు (అయిదవ కూర్పు) వెల: రూ. 2-75

# శ్రీ వివేకానంద జీవితచరిత్ర

(శ్రీ చిరంతనానందస్వామి ప్రణీతము)

ఇందు శ్రీస్వాములవారి జీవితమున నింతకుపూర్వము గ్రంథస్థములుగాని ముఖ్య సంఘటన లెన్నియో శ్రీవారి సోదరశిష్యులవలన విని వ్రాయబడినవి. ఇది శ్రీస్వాములవారి సంపూర్ణ చరిత్ర!

...శ్రీ వివేకానందస్వాములవారి యసమాన వాగ్వైభవమును మంచి నుడికారపు టొడుపుతో శ్రీ చిరంతనానందులు తెలుగున ప్రదర్శించిరి. వివేకానందుల వాఙ్మయ మూర్తికి తెలుగుసేత యలంకృతి...

—వేటూరి ప్రభాకరశాస్త్రి

నిర్దుష్టమైన భాష, అందమైన అచ్చు, ఆకర్షకమైన రూపము.

432 పుటలు (పదవ కూర్పు) వెల: రూ. 4-00

ఇట్లు వ్రాయుడు: మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-600004.

‘అఖిలవిధ శరణొందుమ, యా క్షణంబ యతనికృప నీదు ననుభూతి కందు వత్స’

—శ్రీ శారదామణి.

# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౩౧ } ౧౯౭౫ - ఫిబ్రవరి : : ఆనంద - మాఘము { సంచిక ౨

ఓమ్

## త్రిపురసున్దర్యష్టకము

మూలము : శ్రీశంకరభగవత్పాదులు

వ్యాఖ్యాత : అన్నమాచార్య

పురన్దర పురన్ధ్రికాం, చికురబన్ధసైరన్ధ్రికాం,
పితామహపతివ్రతాం, పటుపటీరచర్చారతామ్,
ముకున్దరమణీం, మణీలసదలఙ్క్రియాకారిణీం,
భజామి, భువనామ్బికాం సురవధూటికాచేటికామ్ ॥

శ్రీ శఙ్కరభగవతః కృతౌ త్రిపురసున్దర్యష్టకమ్ సంపూర్ణమ్.

చికురబన్ధసైరన్ధ్రికాం = కేశపాశము ముడివేయు దాసియైకొలుచు, పురన్దర పురన్ధ్రికాం = దేవేంద్రుని మహిషియగు శచీదేవిని, పటుపటీరచర్చారతామ్ = నేర్పుతో గంధమలదు దాసియైకొలుచు, పితామహపతివ్రతాం = నలువయిల్లాలగు సరస్వతీదేవిని, మణీలసత్ అలఙ్క్రియాకారిణీం = రత్నాలభాసురాలంకారములతో సింగారించు దాసియై కొలుచు, ముకున్దరమణీం = హరిప్రియయగు లక్ష్మీదేవిని, సురవధూటికాచేటికామ్ = పైని పేర్కొన్నరీతిగా దేవకాంతలు పరిచారికలుగాగలదగు, భువనామ్బికాం = జగదంబయగు త్రిపురసుందరీదేవిని, భజామి = ఉపాసింతును.

అన్నమాచార్యాపరనామధేయ భారద్వాజ భక్తవత్సలప్రణీతమగు త్రిపురసుందర్యష్టకవివరణము సంపూర్ణము.

“జగన్మాతయం దొకచుక్క కృష్ణుడుగ నయ్యెను. మఱియొకటి బుద్ధుడై యొప్పెను. వేఱొకటి క్రైస్తవై భాసించెను. జగన్మాత్రంశమును లోకమున మనతల్లియందు లేశమైనను గని యామెను ఆరాధించుచో, మన కది మహత్త్వమును గలుగ జేయును. భక్తిజ్ఞానములు వలయుచో ఆమెను ఆరాధింపుము.”

—శ్రీ వివేకానందస్వామి.

# శ్రీ గురు సూక్తి సుధ

ఒక భక్తుని ప్రశ్న : మేము శాస్త్రములను చదువుచుము. మా కవి ఒంటబట్ట వేల?

శ్రీరామకృష్ణులు : వట్టి చదువువలన నేమి సాధింపగలవు? ఆధ్యాత్మికసాధన యవసరము — తపము. దేవుని పిలువుము. "సిద్ధి, సిద్ధి" యని మరలమరల ననుచుండిన నేమి యుపయోగము? దానిని కొంచెము తినవలెను.

ముండ్లచెట్టును తాకినచో చేయి నెత్తురు కారును. అట్టి మొక్కను తెచ్చి దాని సమీపమున కూర్చుండి "అదుగో! మొక్క కాలిపోవుచున్నది" అని పదేపదే యనుచుందువనుకొందము. అట్లు చేయుట మొక్కను కాల్చునా? ఈ ప్రపంచ మట్టి ముండ్లపొద వంటిది. జ్ఞానమను మంటను రగిల్చి దానితో ముండ్లపొద నంటింపవలెను. అప్పుడే అది తగులబడును.

సాధనావస్థయందున్నప్పుడు కొంత శ్రమ పడవలెను. అప్పుడు మార్గము సుకర మగును. నదివంపుల చుట్టును నావను నడిపింపుము. పిదప దానిని వాలుగాలియందు పోనిమ్ము.

మాయ యను గృహమునందు నీవు జీవించునంత కాలమును, మాయ యనెడు మబ్బు ఉన్నంతవఱకును, జ్ఞాన మనెడు సూర్యుని ప్రభావమును చూడలేవు. మాయ యను గృహము నుండి వెలికి రమ్ము. కామినీకాంచనములను త్యజింపుము. అప్పుడు జ్ఞానమను సూర్యుడు అజ్ఞానమును నిర్మూలించును. ఇంటిలోనుండగా భూతద్దము కాగితమును మండింపలేదు. వెలుపల నిలిచినచో అపుడు సూర్యకిరణములు భూతద్దముపై బడును. కాగితము మండును. అట్లే, మబ్బుగా నున్నచో భూతద్దము కాగితమును కాల్పలేదు. మబ్బు తొలగగానే కాగితము మండును.

[మనస్సునందలి తిమిరము] కామినీ కాంచనములకు కొంత వైదొలగిననే నశించును. అట్లు వైదొలగి కొంచెము తపమును ఆధ్యాత్మిక సాధనను అభ్యసింపుము. అప్పుడు మాత్రమే ఈ అహంకారము అజ్ఞానము అను మబ్బు మాయమగును. అప్పుడు మాత్రమే బ్రహ్మజ్ఞానము లభించును. కామినీకాంచన మను మబ్బు ఒకటియే జ్ఞానసూర్యుని మాటుపరచును.

(మార్వాడీ భక్తునితో) సన్న్యాస నియమములు చాల కఠినమైనవి. కామినీకాంచనములతో నేమాత్రమును సంపర్క ముండుటకు వీలులేదు. తన చేతులతో ధనము గ్రహింపరాదు. దానిని తన సమీపమున నుంచుటకు గూడ ననుమతింపరాదు.

లక్ష్మీనారాయణమార్వారి యను వేదాంతి ఇచ్చటకు చాల తరచుగా వచ్చుచుండెడివాడు. ఒకనాడు నా పడకపై మాసిన దుప్పటిని జూచి "మీ పేర పదివేల రూప్యములను వేసెదను. ఆ వడ్డీ మీ ఖర్చులకు వచ్చును" అనెను. అతడా మాట లనగనే కఱ్ఱదెబ్బ తినినట్లు స్మృతి తప్పి పడిపోతిని. స్పృహవచ్చిన పిదప అతనితో నిట్లంటిని—"మరల నీ విట్టి మాట లనినచో నీ విచ్చటికి రాకుండుటమేలు. ధనమును స్పృశించుట నా కసాధ్యము. దానిని నా సమీపమున నుంచుకొనుటగూడ నసాధ్యమే". అతడు చాల తెలివైనవాడు. "అయిన మీకుగూడ అంగీకారము తిరస్కారము అను భావన యున్నది. అట్లైనచో మీకు పరిపూర్ణ జ్ఞానమునందలేదు." "మహాశయా, నే నింకను అంతదూరము పోలేదు" అని నేనంటిని (అందఱు నవ్వుదురు). అపుడు లక్ష్మీనారాయణ 'ఆ ధనమును హృదయునియొద్ద నుంపగోరెను.' నే నంటిని. "అది పనికిరాదు. నీవు దానిని హృదయునివద్ద నుంచినచో నా యిష్టప్రకారము దానిని ఖర్చుచేయు

మని హృదయము నాదేశింతును. అతడు నా మాట పాటింపనిచో నాకు కోపము వచ్చును. ధనసంపర్కమే చెడుగు. వలదు. నీవు దానిని హృదయమువద్ద నుంచుటకు వీలులేదు.'' అద్దము నొద్ద నుంచిన వస్తువు అందు ప్రతిఫలింపదా?

ఒక యువకుని ప్రశ్న: అయ్యా. జ్ఞాన మన నేమి?

శ్రీరామకృష్ణులు: అది భగవంతుడొకడే సత్యమనియు తక్కిన దెల్ల మిథ్య యనియు తెలిసికొనుటయే. సత్య మగుదానిని బ్రహ్మ మనియు నందురు. దాని కింకొక పేరు గలదు. 'కాలము' ఒక నానుడి గలదు. ''అన్నా, కాలమునం దెన్ని పుట్టుచు, గిట్టుచు ఉండును!''

కాలముతో క్రీడించునదే కాళి. ఆమె ఆద్య శక్తి. కాలము కాళి బ్రహ్మము శక్తి యనున వి అవిభాజ్యములు.

సత్యస్వరూపమగు బ్రహ్మము శాశ్వతము. అది గతమునందును వర్తమానమునందును భవిష్యత్తునందును ఉండును. దానికి ఆద్యంతములు లేవు. దానిని మాటలలో వర్ణింప వీలు కాదు. బ్రహ్మమును గూర్చి చెప్ప గలిగిన దంతయు నేమనగా అది చిత్స్వరూపము ఆనందస్వరూపము అని మాత్రమే.

ప్రపంచము మిథ్య – బ్రహ్మముమాత్రమే సత్యము. ప్రపంచ మింద్రజాలము వంటిది. ఐంద్రజాలికుడు సత్యము. కాని యతని ఇంద్రజాలము మిథ్య.

ఒక భక్తుని ప్రశ్న: స్వామీ, మానవుడు ముక్తుడగుటకు గంగాతీరముననే మరణింప వలెనా?

శ్రీరామకృష్ణులు: అతడు మురికిగుంట యందు గాని గంగాతీరమున గాని ఎచ్చట మరణించినను అధ్యాత్మజ్ఞానము మాత్రమే మోక్షము నిచ్చును. కాని బద్ధజీవికి గంగా తీరము విధింపబడినది.

# భారత నవనిర్మాత వివేకానందస్వామి

బి. యస్. ఆర్. ఆంజనేయులు

'శ్రీ వివేకానందస్వామి రూపుదాల్చిన తేజము. కార్యాచరణ మానవులకు ఆయన ప్రసాదించిన సందేశము' అని రోమారోలా వివేకానందుని గూర్చి వ్రాసియున్నారు: ఈ మహనీయమూర్తి తన మాతృదేశమైన భారత దేశమునకు, యావత్ప్రపంచమునకు పునరుజ్జీవనమును ఎట్లు కల్గించెనో చూతము.

స్వామి సంస్కృతము నందును, ఆంగ్లము నందును నిష్ణాతుడు. తీక్ష్ణ మేధా సంపత్తిచే సనాతనమైన భారతీయ సంస్కృతి నంతయు సంస్కృతము నందును, పాశ్చాత్య సంస్కృతిని ఆంగ్లమునందును కూలంకషముగ గ్రహించెను. అన్ని మతములును, మత శాఖలును ఒకే సత్యమును తెలుపుచున్నవని ఆచరణలో కనుగొనిన శ్రీ రామకృష్ణదేవుడు తన ఆధ్యాత్మిక శక్తి నంతయు వివేకానందునకిచ్చి 'పకీరు' అయ్యెను. ఆ శక్తితో స్వామి భారత దేశము నలుమూలలను కాలినడక చే తిరిగి ధనికుల, పేదల, రాజాస్థానములందలి రాజుల స్థితిగతులను ప్రత్యక్షముగా తెలిసికొనెను. ''ప్రాగ్దేశముల కిచ్చుటకు

బుద్ధునకు సందేశమున్నట్లు, తనకు ప్రాశ్చాత్య దేశముల కిచ్చుటకు సందేశము కలదని గ్రహించెను. భారత జన సామాన్యము తమ వ్యక్తిత్వమునే మరచిపోయి, కూడు గుడ్డకే అలమటించుటను, స్త్రీలు విద్యాగంధమే లేక బానిసలుగా చూడబడుటను మతము అంటరానివారిని సృష్టించుటలోను, వంటకుండలోనికి ప్రవేశించుటను, ఎక్కడ చూచినను బానిసల లక్షణమగు 'అసూయ', 'అనైక్యత' ప్రబలుటను దర్శించెను. దీనిని రూపుమాపి భారత మాతను నిద్రలేపి ఆమెను ఇంతకుముందుకన్న ఉన్నత సింహాసనముపై శోభాయమానముగా ప్రతిష్ఠించుటయే తన లక్ష్యమని ఆయన తెలిసికొనెను. ఆ కార్యసాధనకు అసూయాపూరితమగు మాతృభూమి కేంద్రముగాదనియు విదేశములకేగి ఆర్థిక సాయము బడయుట అవసరమనియు ఆయనకు గోచరించెను. ఈ విషయమునే ఒక రాజ సంస్థాన మండలి ఉన్నతాధికారి స్వామికిట్లు చెప్పెను. "స్వామీజీ ఈ దేశములో మీరు సాధింపగలది చాలాతక్కువ. ఇక్కడ మిమ్ము అభినందించువారు దాదాపు శూన్యము. మీరు పాశ్చాత్య దేశముల కేగినచో అచ్చటివారు మిమ్ము, మీ ప్రతిభను చక్కగా అర్థము చేసికొనగలరు. అంతేగాక మన సనాతన ధర్మమును వారికి బోధించినచో పాశ్చాత్య సంస్కృతికి క్రొత్త వెలుగు కొనిరాగలరు." ఇది స్వానుభవమున స్వామి కనుగొనిన సత్యమే.

తాను బ్రహ్మవేత్త, దైవ ప్రేరిత విశ్వ ప్రవక్త. బుద్ధుడు అద్వైతమును నైతికముగాను, శంకరులు ధీయుతముగాను ప్రపంచమునకు నొక్కి చెప్పియుండ తాను అద్వైతము యొక్క ఆచరణ రూపమును ప్రబోధించెను.

తాను చేసిన ఉపన్యాసముల ప్రభావమును వర్ణించుచు స్వామి యిట్లు చెప్పెను. "నేను సభావేదికపై నిలిచినప్పుడు ఒక మహత్తర శక్తి నన్నావహించును. ఒక్కమాట చేతనే వేలాది ప్రేక్షకుల యందలి 'నేను, నాది' అను అడ్డంకులను బ్రద్దలుచేసి మాయనుండి దాటించగలనను భావము కల్గును."[1] స్వామి నోటినుండి వెలువడునది ఉపన్యాసముగాదు. అది అనుభూతి. దాని ప్రభావమును రామతీర్థస్వామి యిట్లు వర్ణించెను. "సభికులు నిశ్చేష్టులయ్యెడివారు. తామెక్కడ నున్నారో, కాలమెట్లు గడచెనో యను స్పృహయే వారికుండదు. ప్రగాఢమైన వాతావరణము అలముకొనెడిది. అప్పుడప్పుడు జీవాత్మ పరమాత్మల పరిపూర్ణైక్యానుభూతి కొందరికి కల్గుచుండెడిది."[2] ఎచ్చట ఉపన్యసించినను ఉపన్యాసానంతరము సభికులు నూతన తేజముతో, నూతనానుభూతితో, నూతన విశ్వాసముతో వెడలిపోయెడివారు.

చికాగో విశ్వమత మహాసభలో దిగ్విజయముపొందిన తర్వాత స్వామి అమెరికాముఖ్య నగరములన్నింటిలో ఉపన్యసించెను. ఇంగ్లండు, ఫ్రాన్సు, జర్మనీ మొదలగు అనేక దేశములకు ఆహ్వానింపబడెను. అనేకులగు ప్రముఖ వ్యక్తులతోను, సామాన్యులతోను ప్రసంగించెను. వివిధ తరగతుల వారి మనోగతులను అవగాహన చేసికొనెను.

బ్రహ్మానుభూతిని పొందిన మహనీయుడు గాన తాను ఎక్కడికి వెళ్లినను అక్కడివారిలో

1. Life of Swami Vivekananda vol. IV. P. 150.
2. ప్రబుద్ధ భారత, మే 1963, పుట 285.

ఒకడు కాగలిగెను. ఆయన ప్రేమను, ఆత్మీయతను పొందినది ఒక్క అమెరికా, ఇంగ్లండు వాస్తవ్యులే గాదు. ఆయన సగర్వముగా ఇట్లు చెప్పెను. "నేను నా పూర్వీకుడైన శ్వేత వర్ణపు ఆర్యునకు కృతజ్ఞుడనుగా నున్నచో, గౌర వర్ణముగల మంగోలియను పూర్వీకునకు, మరింత కృతజ్ఞుడనుగా ఉన్నాను. అందరికంటె ఎక్కువ నల్లని మేనిచాయగల నా నీగ్రో పూర్వీకునకు, అత్యంత కృతజ్ఞుడనై యున్నాను." స్వామికి వివిధ జాతులవారు అభిన్నులైనట్లే విభిన్న మతములు సమానమే. "హిందువుతో చేరి దేవాలయములో ప్రార్థింతును. నా క్రైస్తవ సోదరునితో శిలువ ముందు మోకరిల్లుదును. నా ముస్లిం భాయితో చేరి మశీదులో నమాజు చేయగలను" అని స్వామి ఒకసారి తన మతసామరస్యమును అభివ్యక్త మొనర్చెను.

పాశ్చాత్యులకు గల ఆత్మవిశ్వాసము, కార్యదక్షత, సంఘీభావము ఆయన తెలిసికొనెను. పాశ్చాత్యులు నిర్మించిన అత్యద్భుత జాతీయ జీవన సౌధములు వారి శౌర్యమను బలిష్ఠ స్తంభములపై కట్టబడుటను స్వామి గ్రహించెను. భౌతిక సంపదలతో తులతూగుచున్నను, ప్రకృతి యివ్వగల భోగములన్నియు వారికి అత్యంతము చేరువగా నున్నను "పాశ్చాత్య దేశములలోని జీవనము పైకి నవ్వుల రవళి వలె నుండును. కాని అడుగున నున్నది విషాదము. అది ఏడ్పులతో ముగియును"[3] అని ప్రత్యక్షముగా తెలిసికొనెను. ఇట్టి వారికి ఆధ్యాత్మిక బోధ భారత దేశము నుండియే రావలయునని స్వామి గ్రహించెను.

భారతదేశము ప్రపంచమునకు ఆధ్యాత్మిక గురువు. కాని అట్టి భారత జాతి నిర్మాణము కావలసియున్నది. ఆ పునరుజ్జీవనమునే స్వామి మొదట చేపట్టెను. 'ఏబది సంవత్సరముల వరకు మీ దైవము భారతదేశము' అని, దాని దాస్యవిముక్తికై పాటుపడుట ఆవశ్యకమని దేశీయులకు గుర్తుచేసెను. "అన్నమో రామచంద్రా యని విలపించు ఆర్తులకు మత బోధ లెందులకు!" అని శ్రీరామకృష్ణుడు వచించి యుండుటచే "భారత జన సామాన్యము కేవలము పశుప్రాయమై జీవించుటకు కారణము అజ్ఞానము, అక్షరజ్ఞాన శూన్యత" అని తెలియజెప్పుచు దేశము ఆర్థికాభివృద్ధి చెందవలయుననియు జన సామాన్యమునకు విద్యగరపుచో వారి సమస్యలను వారే నిర్ణయించుకొందురని విశదపరచెను. భారతీయ మహిళలు అణచివేయబడిన యంత్రములుగా నున్నారని, వారికి విద్యగరపి స్వాతంత్ర్యము నిచ్చినచో వారి విషయములను వారు చక్కపరచుకొందురని, తెలియజెప్పెను. విద్య యనగా విషయ సంగ్రహణము గాదనియు, మానసికశక్తులను కేంద్రీకృతము చేసి ఎవరి కాళ్లపై వారు నిలుచునట్లు చేయునట్టిదనియు, అట్టి విద్యయే ఆవశ్యకమనియు వక్కాణించెను. ఇతర దేశముల నుండి సాంకేతిక విజ్ఞానము మనము నేర్వవలయుననియు, దానికి మారుగ మన ఆధ్యాత్మిక సంపద వారికి పంచిపెట్టవలయుననియు స్వామి ఆశించెను.

మతవిషయములో పూర్వకాలమునుండియు 'బ్రహ్మసత్యం జగన్మిథ్య' అను శ్లోక పాదమునకు ప్రాధాన్యత యివ్వబడినదనియు ఇక నుండి రెండవ పాదమైన 'జీవో బ్రహ్మైవ నాపరః'

---

3. The master as I raw him పుట 114.

అనునది మూలమంత్రము కావలయుననియు సూచించెను. దీనిని అమలులో పెట్టుటకు నూతన సన్న్యాస సంప్రదాయమును కల్పించి వారు ఆత్మమోక్షముతో పాటు జగద్ధితము కూడ చేయవలయుననియు జీవము గల మానవరూపమైన దైవము (అనాథలు) ఎదుట ప్రత్యక్షమైయుండ వారికి సేవ చేయుట మాని అచలమైన దేవతల నారాధించుట, నీటికై గంగా తీరమున బావి త్రవ్వుట వంటిదని చెప్పెను. సోదర శిష్యుడైన అఖండానందస్వామికి వ్రాయుచు 'నీవు 'మాతృదేవోభవ, పితృదేవోభవ' అని తెలిసికొని యున్నావు. ఇకనుండి 'మూర్ఖదేవోభవ, దరిద్రదేవోభవ' అని చెప్పుచున్నాను. వారినర్చించుము'' అనెను. ''మ్లేచ్ఛులను పదము ఏనాడు సృష్టింపబడినదో ఆనాటి నుండియే భారతజాతి శ్రేయము కుంటుపడినదనియు'' అందుచే ''చెప్పులు కుట్టువారు, పాకీవారు ... నా రక్తబంధువులని ప్రకటించు''మనియు స్వామి దేశీయులకు ప్రబోధించెను.

తన జీవిత కాలములోనే తన ఆదర్శములను ఆచరణలోనికి తెచ్చుటకు 'రామకృష్ణమిషన్' అను సర్వసంగ పరిత్యాగులగు సన్న్యాసుల సంఘను ఏర్పరచి బేలూరు మఠమును దానికి కేంద్రస్థానముగా నొనర్చెను. ''ఈ బేలూరు మఠమునకు సంక్రమించిన ఆధ్యాత్మిక శక్తి పదునైదు వందల సంవత్సరములవరకు నుండును... నేనిది ఊహించుచున్నానని తలంపవద్దు, నేను దానిని స్వయముగా చూచుచున్నాను.''[4]

భారతమాత తన నిద్రనుండి మేల్కొనుచున్నట్లు, ఇక ఆమె ఎన్నడూ నిద్రింపనట్లు, ఆమె భవిష్యత్తు అత్యంతము ఉజ్జ్వలముగానున్నట్లు ఈ ప్రవక్త చూచియుండుట చేతనే ''నవీన భారత దేశము ఉద్భవింపనిమ్ము. నాగలి పూనిన రైతు కుటీరముల నుండి, బెస్తవారల గుడిసెలనుండి, చెప్పులు కుట్టువారి, వీధులు ఊడ్చువారి పూరిపాకల నుండి పైకి లేవనిమ్ము, చిల్లర వస్తువులు అమ్మువారి దుకాణముల నుండి, కమ్మరివారి కొలిమినుండి ఆమెను పైకి ఉబుకనిమ్ము కర్మాగారముల నుండి, సంతల నుండి బజార్లనుండి ఆమెను ముందుకు త్రోసుకొని రానిమ్ము. తోటల నుండి, అడవులనుండి, గుట్టలనుండి, పర్వతములనుండి ఆమెను బయటకు రానిమ్ము'' అని ఎలుగెత్తి చాటెను.

భారతీయులకు మతము జీవనాడి. అది విడనాడినచో జాతి నశించును. అందుకై వేదాంత భావములను అందరికి అందుబాటులోనికి గొనివచ్చి వానిని అన్ని రంగములలోని వారిచే ఆచరింపచేసి వ్యక్తులు నిజమైన శీలసంపదగలవారైన నాడు ఫ్యాక్టరీలోని పనిగాని, దేవాలయములోని అర్చనగాని, ఆఫీసులోని పనిగాని, వ్యవసాయరంగములోని కృషిగాని, వీధులూడ్చుటగాని, ధ్యానమొనర్చుటగాని— సమస్తము దైవారాధనగా మారిపోవునని స్వామి అభిప్రాయము. అప్పుడే భారతీయులు తమ ప్రాచీన మత రహస్యములను అవగాహన చేసికొని పాశ్చాత్య దేశములను ఆధ్యాత్మిక భావములతో ముంచివేయగలరు.

ఈ స్థితికై స్వామి అహర్నిశము పనిచేసెను. ''నేను రూపములేని ధ్వనిని.'' ''ఈ దేశములో ఒక కుక్కయైనను అన్నము లేక అలమటించినచో ఎన్ని వేల జన్మల నెత్తుటకైనను సంసిద్ధముగా నున్నాను.'' ''నేను నీ శరీరమును ఒక చొక్కావలె తీసిపారవేసినను నా పని నుండి

4. Reminiscences of Swami Vivekananda పుట 251.

నేను విరమింపను. సర్వప్రపంచము భగవంతున కన్న భిన్నము కాదని తెలియువరకు నేను అన్నిచోట్లలోను మానవులను ఉత్తేజపరతును'' అని స్వామి చెప్పియుండెను.

తానీ శరీరమును చాలించిన తర్వాత భారతదేశములో అనేక రంగములలో వ్యక్తులను అనేకరీతుల ప్రబోధించి తన కార్యమును నెరవేర్చుకొనెను.

గాంధీమహాత్ముడు భారతజాతిపిత. ఆయన వివేకానందుని దర్శించుటకు యత్నించెను. కాని కలువలేకపోయెను. ఒకసారి వివేకానంద జయంతికి బేలూరు మఠమునకు వెళ్లి స్వామి స్మారక చిహ్నముల నన్నింటిని చూచెను. ఆనాడు ఆయన యిట్లు చెప్పెను. ''వివేకానంద రచనలను క్షుణ్ణముగా పఠించి యున్నాను. వానిని చదివిన తర్వాత నా దేశభక్తి వెయ్యిరెట్లు ఎక్కువైనది.'' అస్పృశ్యతా నివారణ, దరిద్రనారాయణ సేవ స్వామీజీ సంకల్పించినవే. వానిని ఆయన మహాత్మునిచే చేపట్టించి ఆచరణలోనికి గొనివచ్చునట్లు చేసెను.

దేశమునకు శౌర్యమును నూరిపోసిన సుభాష్‌చంద్రబోస్‌ను ''ఉక్కునరములు, ఇనుప కండరములు గలవారు, దేశమునకు కావలసి యున్నారు'' అను స్వామీజీ సందేశము ఉత్తేజపరచినది. ఆయనను ఆరాధించునట్లు చేసినది. ''ఆధునిక భారతదేశము వివేకానందుని సృష్టియే'' యని సుభాష్ చెప్పెను.

దివ్యశక్తి భూమికి దిగివచ్చి భూతలము స్వర్గము చేయవలయునని ఆశించిన అరవిందయోగికి స్వామి యెట్లుతోడ్పడెనో అరవిందుని మాటలలో చూతము. ''విజ్ఞాన మనస్సు (Super mind) యొక్క సత్యము నాలో చొప్పించినది వివేకానందుని శక్తియే. విజ్ఞాన మనస్సు వైపునకు మళ్లించు కీలకము ఆయనయే చూపెను. 'విజ్ఞాన మనస్సు' అని ఆయన చెప్పలేదు. 'అది, అది' అని మాత్రమే ఆయన చూపును. సూచించుచు ఉదాహరించును. ఆలిపూరు జైలునందుండగా 15 రోజులు విడువకుండ నాకు దర్శనమిచ్చి......విజ్ఞాన మనస్సు చేరువరకు బోధించెను. నాలోనికి ఆ భావము చొప్పించువరకు నన్ను ఆయన వదలలేదు. నేను ఆయనను కోరలేదు. అయినను ఆయన వచ్చి నాకు బోధించెను. అత్యంత సూక్ష్మ విషయములలో కూడ ఆయన నిశ్చితముగా తుచ, తప్పకుండెను.''

'కర్మయోగి' (12 ఆషాఢ 1316) పత్రికలో వ్రాయుచు అరవిందయోగి ''వివేకానందుడను ధీరాత్మ అవతరించి ఈ ప్రపంచమును తన రెండు చేతులతో మార్పుచెందించునని గురుదేవుడు (రామకృష్ణుడు) గ్రహించెను. ఈ గ్రహింపు భారతదేశము మరల జాగృతమై జీవించుటయే గాక జయశీలి అగునని ప్రపంచమునకు తెలుపు అభివ్యక్తమైన మొదటి సూచన.''

వేకానందుడు ద్రష్ట. ఆయన వచనములన్నియు సత్యమునకభిన్నములు. ప్రస్తుతకాలమున అవినీతి, అరాచకము మొదలగునవెన్నో గోచరించి నిరాశాజనకముగా నున్నను, సముద్ర మథనమున హాలాహలము వచ్చిన తర్వాత అమృతము లభ్యమైనట్లు ఈ గాలిదుమారము కొట్టుకొనిపోయి ఋషివాక్కులు యథార్థమగు దినము, సంప్రాప్తమగు దినము వచ్చునని ఆయన ఈ 113 వ జన్మదినమున ఆశింతము.

# శ్రీ వివేకానంద దివ్యకార్యము

## కేశవ బ్రహ్మచారి

శ్రీవివేకానందస్వాములగూర్చి వ్రాయుటకు మఱియొక వివేకానందస్వామియే కావలెను. ఏలన, "ఈ వివేకానందు డేమియొనర్చెనో, మఱియొక వివేకానందు డుండిన గ్రహించి యుండెడివా"డని మహాసమాధి నొందుటకు ముందు స్వామియే తనలో తా ననుకొనుచుండ శ్రీ ప్రేమానందస్వామి వినియుండెను. తన సందేశమునుగూర్చి స్వామి ఈ రీతినే మఱియొక ప్పుడు, "ఈ శరీర మేమైన నేమి! ప్రజలకు పదునైదువందల సంవత్సరములపర్యంత మాచరించుటకు వలయు సందేశము నొసగి యున్నాను" అని వచించెను.

భారతదేశ భక్తులలో వివేకానందస్వామిని గూర్చి ఎఱుగనివా రుండరు. "నా యార్త నారాయణుని - నా దీన నారాయణుని, సమస్త దేశీయులకెల్ల బీదయగు నా భారతనారాయణుని - నా ఇష్టదేవత నర్చించుటకై యెన్ని జన్మలనైన నెత్తెదను గాక! ఎన్ని బాధలనైన ననుభవింతును గాక!" యని ప్రకటించి అన్నదాన, విద్యాదాన, జ్ఞానదానములచే నేడు అఖండదేశ సేవనే గాక ప్రపంచసేవను సల్పుచున్న శ్రీరామకృష్ణమఠ, సేవాసంఘములను స్థాపించిన దేశభక్తాగ్రగణ్యుడు, విశ్వమానవ ప్రేమపూరితుడు శ్రీ వివేకానందస్వామి. స్వామి సంపూర్ణ సమన్వయ స్వరూపుడు. ప్రాచ్య పాశ్చాత్య విజ్ఞాన వాహినులకు సముద్రుడు. విశ్వమత మహాసభ వేదికపై సనాతన ధర్మ విజయధ్వజస్థాపన మొనర్చి, పశ్చిమఖండమున తన మహోపన్యాస విజయయాత్రను నిరాఘాటముగా సాగించిన సార్వభౌముడు స్వామి వ్యక్తిత్వము అతిమానుషము గదా!

ఇట్టి అఖండమగు పేరుప్రతిష్ఠల గాంచిన స్వామి జీవితమునందలి ప్రథమఘట్టమును పరిశీలించినపుడు వారి జీవితాశయములు, అభిరుచులు వేఱువిధముగా నుండినట్లు కనపడును. స్వామి తన గురువరేణ్యులగు శ్రీరామకృష్ణుల దరిజేరి తన ఆధ్యాత్మికతృష్ణను తీర్చుకొనెను. భగవద్దర్శనమునకై ఆయన ఉత్కంఠ శ్రీరామకృష్ణుల కమితానందము గొలిపెను. అత్యున్నతులగు యోగు లనుభవించు నిర్వికల్ప సమాధి యందలి ఆనంద పారవశ్యమును చవిచూచిన స్వామి సర్వదా నిర్వికల్ప సమాధియందే ఆనంద భరితుడై యుండ నాశించెను.

కాని, స్వామి జననకారణమును గుఱించియు స్వామి నెరవేర్చవలసిన భగవత్కార్యము గురించియు గురుదేవు డెఱుగును. ప్రథమ సమాగమముననే స్వామి దివ్యత్వమును గుర్తించిన శ్రీరామకృష్ణులు, ఆనందపారవశ్యమున కన్నీరు కార్చుచు, "ఎంత కాలమునకు వచ్చితివోయి తండ్రీ! ఇంతవఱకెట్లు నిరాశక్రియను సహించితివోయి!" యనుచు కౌగలించుకొనిరి. "ప్రభూ! నీవు నరుడను సనాతన ఋషివని— మానవకోటి నుద్ధరించుటకై యవతరించిన నారాయణుడవని— నే నెఱుగుదును" అని వచించిరి. నరేంద్రుడు తమ్ము దర్శించుటకు పూర్వమే శ్రీరామకృష్ణులు తమ దివ్యదృష్టిచే నాతని గూర్చిన సమస్త విషయముల నెఱిగి యుండిరి. ఒకప్పుడు సమాధిస్థితియందు వారి మనస్సు సప్తఋషి మండలమునందు చరించుచుండ అచట సమాధి నిష్ఠయందుండు నొక ఋషి, వారి ప్రేరణవలన, భూమండలమున జనించుటకు తన అంగీకారమును తెలిపెను. ఆ మహర్షియే నరేంద్రుడని శ్రీరామకృష్ణుడు

గుర్తించెను. మఱియొకసారి తన భక్తులతో, "చూడుడు. ఈ బాలు డెంత వినమ్రుడో! ఎంత శాంతమూర్తియో!! ఈతడు నిత్యసిద్ధుడు. ఆ జన్మబ్రహ్మజ్ఞాని. ఇట్టివారు ఈశ్వర కోటి లోనివారు. వీరు జగద్గురుత్వము వహించుటకై జన్మించుచుందురు" అని వచించెను.

అందువలననే శ్రీరామకృష్ణుడు నరేంద్రునితో, "వెఱ్ఱివాడా! అంతకంటె ఉత్తమమైన స్థితి గలదని ఎఱుగుము" అనుచు ఆయన నిర్వికల్ప సమాధ్యనుభవమునుగూర్చి, "అమ్మ నీకిప్పుడు సర్వము చూపినది గదా! ధనము పెట్టెలో పెట్టి తాళము వేయునట్లు నీ యీ దివ్యానుభవము తాళము వేయబడును. నీవు చేయవలయు మహాకార్యము కలదు. ఆ కార్యము నెఱవేర్చిన పిదప నీ ధనపేటిక తెఱువబడును" అని పలికెను. మఱియు శ్రీరామకృష్ణుడు తన నిర్యాణసమయమున నరేంద్రుని పిలిచి "నరేంద్రుడు ఇతరులకు బోధించును" అని యొక కాగితముపై వ్రాసి యిచ్చెను. నరేంద్రుడు "నే నట్లు చేయ" నన్నప్పుడు "నీవు చేసి తీరుదు వని" మారు పల్కెను.

స్వామి నిర్వికల్పసమాధియందే ఆనందభరితుడై యుండవలయు నను కోరిక విపరీతమైనది కా నేరదు. సచ్చిదానందసాగరమగ్నులై యుండుటనే గదా సాధకు లాశింతురు. ముముక్షువుల కంతకంటె మహోన్నతాశయములేదు. సమాధిస్థితి నందుటయే పారమార్థిక సాధనలన్నిటికి పరమావధి. కాని స్వామి ఇంతకంటె నుత్తమమగు పురుషార్థమును సాధించుటకై జన్మించెను. కేవలము నిర్గుణావస్థయందు మాత్రమే కాక, అఖిల జగద్రూపమగు సగుణావస్థయందును ఆయన బ్రహ్మసాక్షాత్కారమును బడయవలయును. అందువలననే శ్రీరామకృష్ణుడు స్వామి ఆధ్యాత్మిక ధీశక్తుల మార్గము మార్పించెను. స్వామికి తన భావి జీవిత కార్యక్రమముల చూపించెను. పారమార్థిక సంపద నన్వేషించు వేలకొలది జిజ్ఞాసువులకు, వారి కట్టి సంపద నిచ్చు జగద్గురువుగా నుండ స్వామిని నియమించెను. అంతర్ముఖుడై, సమాధిస్థితియందు, ఆనందానుభవమున నోలలాడు యోగీంద్రుడుగా నుండవలసిన స్వామి, మానవక్లేశముల జూచి జాలిపడు దేశభక్తాగ్రగణ్యుడుగా, తన మానసికాధ్యాత్మిక శక్తులచే లోకము నుఱ్ఱూతలూగించు నీశ్వర ప్రేరిత వక్తగా మారినది అప్పుడే.

మన దేశము క్లిష్టపరిస్థితులందుండు తరుణమున స్వామి అవతరించెను. స్వామికాలమున మన దేశమందలి యుగయుగములుగా వచ్చుచున్న ఆత్మవికాసక మగు మన నాగరికత నిర్మూలిత మగునేమో యన్నట్లుండెను. పాశ్చాత్య నాగరికతా వ్యామోహము భారతీయులం దెల్లెడల పెచ్చుపెరిగెను. సనాతన భారత జాతీయ జీవనము పాశ్చాత్య నాగరికతా ప్రణాళిక ననుసరించి క్రొత్తమార్గము నవలంబింపవలయు నను భావము దేశమందంతటను వ్యాపించెను. భారత జాతీయతయే యంతరించుచున్నట్లు తోచెను. ఇట్టి సమయమున స్వామి సనాతనధర్మమును సంస్థాపింప, మన దేశ పునరుద్ధారణమునకు వలయు సందేశముతో, అవసరమగు ఆధ్యాత్మికానుభవములతో, భగవత్ప్రేరిత వక్తగా, తా నితరులకు బోధించు నధికారము పొంది, నిలిచెను. విశ్వమత మహాసభ వేదికపై, తానొక్కడే, పాశ్చాత్యులు నిందించిన మన మతమును, పాశ్చాత్యుల ఎదుటనే సుస్థిర స్థాపన మొనరించెను. హిందూమతోత్కృష్టతను వారి ముందు చాటెను. ఇచ్చట సోదరి నివేదిత వ్రాసిన

వాక్యములు గమనార్హములు. "......యుగయుగముల నుండియు ఆత్మవికాసకమై ప్రశాంతి నిలయమగు భారతీయ విజ్ఞాన సాగరము వివేకానంద స్వామి సందేశమున పొంగిపొరలినది. యుగయుగములనుండియు ననేక మత సంప్రదాయ ప్రపూర్ణమైన పారమార్థిక ప్రపంచము, మహర్షుల పాదధూళిచే పవిత్రమైన పుణ్యభూమి యగు భారత దేశము, స్వామి సందేశమున ప్రకటితములైనవి."[1] న్యూయార్కు హెరాల్డ్ అను ప్రఖ్యాత పత్రిక ఇట్లు పేర్కొన్నది. "విశ్వమత మహాసభలో వివేకానందుడగ్రగణ్యుడనుట నిస్సంశయము. అతని ప్రవచనముల వినిన వెనుక అట్టి విద్వజ్జన నిలయమగు భారత దేశమునకు మన క్రైస్తవబోధకుల పంపుట ఎంతటి అవివేకమో గ్రహించితిమి."[2]

ఇట్లు పాశ్చాత్యుల వలన ఏకగ్రీవముగా మహావక్త యని అంగీకరింపబడిన స్వామి, మన దేశీయుల దుర్బలత్వమే దేశసమస్యలన్నిటికి కారణమని గ్రహించిన స్వామి, తానొసగిన ఉపన్యాసములన్నిటియందును బలసంపన్నులు కావలయుననియే భారత సోదర సమూహము నుద్బోధించెను. బలమే జీవనము, బలహీనతయే మరణము—కాబట్టి బల సంపన్నులు కండనియే స్వామి బోధ. మనయందు లోపించిన ఆత్మవిశ్వాసమును మేల్కొల్పుడనియేస్వామి ఘోషించెను. దీనినే స్వామి యొక శిష్యునితో, "ప్రకృతిదాస్యమే నేటి మన దుఃస్థితికి కారణము. ప్రకృతి నెదిర్చి నిలుచుటయే మన ధర్మము......నాకు అఖండమైన ఆత్మ విశ్వాసము గలదు. అందువలననే భారతీయులు బలహీనులని నిరసించు పాశ్చాత్యులు నన్ను తమ గురువుగా స్వీకరించుచున్నారు. నీవును అఖండ శక్తి జ్ఞాన సంపన్నుడవని విశ్వసించి వర్తించి నచో నద్భుత కార్యము లొనర్పగలవు. 'లెమ్ము! మేల్కొనుము!! ఈస్వప్నస్థితి చాలింపుము!!! నీలోనున్న దివ్యశక్తిని ప్రకటింపుము!!!!' అని ప్రతి భారతీయునకు తెలుపుము"[3] అని ఘోషించెను. 'మన సాంఘిక పురోభివృద్ధికి మత మొక ఆటంకము, మనము బలసంపన్నులము కావలె నన్న పాశ్చాత్యుల ననుకరింపవలయు" నను భారతీయులను—పాశ్చాత్యుల నాగరికతా వ్యామోహమున పడిన భారతీయులను స్వామి హెచ్చరించెను. ఆ హెచ్చరికయే వేదాంత కేసరి యగు స్వామి నుండి సింహగర్జనగా వెలువడెను. భారత దేశము తన పిత్రీయము అమూల్యము నగు పారమార్థిక శీలమును త్యజించు నేని అది నశించును. ఇంతకాలము ఈ పారమార్థిక శీలమే మన దేశమును నిర్మూలము కాకుండ కాపాడినది. మన దేశము తరతరములుగా వచ్చు తన సనాతనాదర్శమును విడిచి, వేఱు ఆదర్శమును గ్రహించెనేని, మూడేమూడు తరములలో నాగరికతయే లేనిదగునని హెచ్చరించెను.[4]

స్వామి అభిప్రాయము పాశ్చాత్యుల నాగరికతను సర్వవిధముల తిరస్కరింపవలె ననుట కాదు. భారతీయులు పాశ్చాత్య విజ్ఞానమును గ్రహింపవలయుననియే స్వామి పేర్కొనెను. కాని అట్లు గ్రహించుటకు వలయు శక్తి మన సనాతన నాగరికతను మనము శక్తివంతమొనరించుటపైననే ఆధారపడియున్నది. పిత్రీయమగు మన నాగరికతను శక్తివంతము చేయ

---

1. శ్రీ వివేకానంద జీవితచరిత్ర పుట-193. 2. పుట-196. 3. పుట-262.
4. Eternal values for a changing society. P. 316,

నిదే, పాశ్చాత్యుల ననుకరించినచో అందు పెక్కు అపాయములు వాటిల్లునని స్వామి గ్రహించెను. అందుకే స్వామి మన సనాతనమగు నాగరికతను క్రొత్తగా రూపొందించి, శక్తివంత మొనర్చి, ఆధునిక ప్రపంచమునకు మార్గదర్శకముగా నిలుపవలయు నని యుగ్గడించెను. స్వామి దివ్యదృష్టికి గోచరించిన నూతన భారతదేశమునందు పాశ్చాత్యుల సునిశితములైన భౌతిక శక్తుల వినియోగముచే మిరుమిట్లు గొలుపు నవీన విజ్ఞానముతో మన సనాతన భారతదేశమునందు యుగయుగములుగా ఏకైకాదర్శమగు, సహానము, అఖండాధ్యాత్మిక శీలమును ప్రకటించు దివ్యసంప్రదాయములు పూవున తావివలె సమ్మేళనమొందుచుండెను. మనదేశము యావనోజ్జీవనముతో ముందంజవేయు దేశముగా నుండవలయునని ఆశించెను. మనదేశమున జరుపబడు సంఘసంస్కరణములు, వేయేల మన పురోభివృద్ధికై యొనర్చు ప్రతి కార్యము మన దేశమునకు జీవనాడి యగు పారమార్థికతకనుగుణముగనే జరుగవలయును. ఇట్టి సంస్కరణ విధానమునే నేటి ప్రజానాయకులు పాటింపవలసియున్నది. వారికి స్వామియే మార్గదర్శి.

నేడు పలుదేశములు ఆర్థికముగా వైజ్ఞానికముగా అమితపురోభివృద్ధి గాంచియున్నను, వారియందు నాగరికతనే నిర్మూలింపజేయు శక్తులు విజృంభించుచున్నవి. ఇట్టి క్లిష్టపరిస్థితులందు మనదేశము ప్రపంచమున కండయై నిలిచి, తన పారమార్థికశీలమును పంచిపెట్టుచుండుట ప్రపంచచరిత్రలో గననగును. దీనినే స్వామి మనుజుని సుఖశాంతులకు మూలమైనది పారమార్థికశీలమనియు, ఆగమ్యమును సాధించుటకే సాంఘిక, భౌతికసౌఖ్యములు తోడ్పడవలయుననియు పేర్కొనెను.

ఈ ఉన్నతాశయములను మానవకోటికందించుటకును, వారిని ఉద్బుద్ధుల నొనరించుటకును, శాశ్వతఫలదాయక మగు ఈ మహాకార్యమును కొనసాగించుటకును స్వామి శ్రీరామకృష్ణసేవాసంఘమునుస్థాపించెను. (1)విశ్వమానవ కల్యాణమునకై శ్రీరామకృష్ణుడు బోధనపూర్వకముగను, స్వీయజీవితమున నాచరణపూర్వకముగను ప్రకటించిన ధార్మికతత్త్వములను వ్యాప్తిచేయుటయు, (2) ఐహిక ఆముష్మిక శ్రేయములకై ఈ ధర్మముల నాచరింప ఇతరులకు తోడ్పడుటయు, (3) ఏకము, శాశ్వతము నగు సనాతన ధర్మమునే వివిధమతములన్నియు వివిధరీతులుగా బోధించుచున్నవని గ్రహించి, సర్వమత సామరస్యమును ఏర్పరచుటకై శ్రీరామకృష్ణుడు నెలకొల్పిన మహోద్యమమును సక్రమముగా నిర్వహించుటయు - మున్నగు ఉన్నత లక్ష్యములను సంఘకర్తవ్యములుగా స్వామి ఏర్పరచెను.

ఇట్టి సేవాసంఘ కార్యనిర్వహణార్థము స్వామి జగత్ హితార్థము సర్వమును త్యజించిన సన్న్యాసుల నెన్నుకొనెను. ఈ సన్న్యాసులు ఆత్మ మోక్షమునకు చేయు ప్రయత్నముతోపాటు లోకకల్యాణార్థము గూడ పాటుపడవలయునని స్వామి ఏర్పరచెను. లౌకిక వాతావరణములనుండి తప్పించుకొని, నిస్సంగులై తీవ్రజపతపములచే స్వీయమోక్షమును సాధించుటయే ఆనాటి ఋషులామోదించిన ప్రాచీన సంప్రదాయము. కాని సనాతన సన్న్యాసాదర్శ

మునకు నూతనచైతన్యమును, నూతనోత్తేజమును ప్రసాదించిన ఆచార్యశేఖరుడు వివేకానందస్వామి. స్వామి తన సోదరశిష్యులతో, "శ్రీరామకృష్ణుల శిష్యులమగు మనము ఆత్మమోక్షమునకై ప్రాకులాడుట అత్యంత శోచనీయము.[1] 'ఒక్క ప్రాణికి సహాయము చేయజాలినచో వేయిసార్లు కుక్కగా పుట్టుటకు సిద్ధమే' నని గురుదేవుడు వచింపలేదా! ఆ మహనీయునకు ప్రీతిపాత్రుల మగుటయే మోక్షము మనకు కరతలామలక మగుటకు రాజమార్గము. ప్రతి జీవియు సాక్షాద్భగవత్స్వరూపమని గ్రహించి దరిద్రనారాయణుల ఆర్తనారాయణుల పూజించు విధానము లోకమునకు మనము చూపవలసియున్నది. భారతదేశమున నూతన సన్న్యాససంప్రదాయమును స్థాపించుటయే నా జీవితోద్దేశము. జనసామాన్యము నుద్ధరించుటకు జీవితముల ధారపోయుటయే ఈ సన్న్యాసుల ఆదర్శము' అని వచించెను.

స్వామి అప్పుడు నాటిన సేవాధర్మబీజమే నేడు మహావృక్షమై శ్రీరామకృష్ణమఠ, సేవాశ్రమము లనెడు శాఖోపశాఖలతో విలసిల్లుచు ప్రపంచ సేవల సల్పుచున్నది.

1. శ్రీ వివేకానంద జీవిత చరిత్ర. పుట-462.

## మాతృశ్రీ శారదాదేవి మంగళవాక్కు

నరేంద్రునిజన్మము దివ్యము, పవిత్రతాపరిపూర్ణము. అత డొక మహర్షి యని ఠాకూరు (శ్రీరామకృష్ణగురుదేవుడు) చెప్పుచుండెడివారు...వైరాగ్యపూర్ణుడును విశ్వప్రేమభరితుడును బ్రహ్మైక్యనిత్యానందనిమగ్నుడు నైనప్పటికిని లోకశ్రేయమునకై అతడు బాధలు పడెను. లోకసేవకై తనజీవితరక్తమును సమర్పించెను ... తమ మహోన్నతాదర్శములను ప్రచారముచేసి లోకక్షేమమును ప్రజోద్ధరణమును నిర్వహించుటకై ఠాకూరు (శ్రీరామకృష్ణగురుదేవుడు) ప్రత్యేకముగా అతనిని సప్తఋషిమండలమునుండి కొనివచ్చిరి...సప్తఋషులలోను అతడు అగ్రేసరుడైన పరమఋషి. ఋషిశతములలో అత డొక్కడని గురుదేవుడు చెప్పియుండవచ్చునుగాని వాస్తవముగా "సప్తఋషులలోనొక్కడు" అని ఆయన వచించిరి ... నరేంద్రుడు నిర్వహించిన పనులు చిరస్థాయు లుగ నుండగలవు. భగవంతునిపనికై అతడు జన్మించెను. ప్రబుద్ధ జగదాచార్యవరిష్ఠునిగా అతనిని వేలకొలది ప్రజలు పూజించుచుందురు.

# శ్రీ వివేకానంద జీవన సందేశము

> "ఈ నా జీవితములో గురుకటాక్ష మనేక పర్యాయములు నాకు ప్రత్యక్షగోచర మైనది. ఆతడే నా వెనుకనుండి సమస్తకార్యములను జేయించుచున్నాడు. అలసటచెంది యాకలి బాధచే నొక చెట్టుక్రింద గూలబడినపుడు, కటిప్రదేశమును కప్పుకొనుటకు నాకొక గుడ్డపేలికయైన లభింపనపుడు, చేత గాసైన లేకుండ ప్రపంచయాత్ర చేయ నిశ్చయించుకొని బయల్వెడలినపుడు గురుమహాశయుడే కంటికి ఱెప్పవలె నన్ను గాపాడియున్నాడు. మఱియు షికాగో నగరవీథులలో జనులు గుంపులు గుంపులుగా ఈ వివేకానంద దర్శనభాగ్యమునకై తల్లడిల్లినపుడు ఆ మహాత్ముని కటాక్షముచేతనే యట్టి యఖండగౌరవము నంతయు, మఱెవ్వరైన నందు సహస్రాంశముచేతనే యొడలు మఱచిపోవు స్థితిలో, జీర్ణించుకొని యహంభావవశవర్తిని గాకుండ నిల్వగల్గితిని. ఆ భగవాను నమోఘ సంకల్పముచే నే నెచట కరిగిన నచట విజయమే సిద్ధించినది. ఇపు డీ దేశమునకు కొంత సేవ చేయనెంచియున్నాను. మీరు మీ సంశయములను విడిచిపెట్టి నాకు సాయ మొనర్తురా, ఆ పరమపురుషు ననుగ్రహమున మన మద్భుత కార్యముల నొనర్పగలము. .... బ్రహ్మజ్ఞానమునకై నను పరిమితి కనుగొనవచ్చును గాని యగాధమగు మన గురుదేవుని మనస్తత్త్వ మిట్టిదని నిర్ణయింపజాలము. ఆ మహాత్ముని కరుణాకటాక్షవీక్షణ మొక్కటి ప్రసరించిన జాలును. లక్షమంది వివేకానందులిమునములో బయలుదేరగలరు ! ఐన నాతడు నన్ను నిమిత్తమాత్రునిగా జేసికొని నా మూలమున దన కార్యముల నొనర్ప సంకల్పించినచో ఆ సంకల్పము శిరసా వహించెదను."
>
> —శ్రీ వివేకానందస్వామి.

శ్రీ వివేకానందస్వామి యనగా విశ్వమత సమ్మేళన విజేత యనియే ఎల్లరకును తెలియును. పాశ్చాత్యదేశములందు భారతదేశ ప్రతిష్ఠను మరల నిలువబెట్టి రని యుత్సాహముతో జను లానాడు వారికి బ్రహ్మరథము పట్టిరి. ఈనాడు మహానుభావుడని మహాగౌరవముతో వారి ఛాయాచిత్రము నొక గూటిలో నుంచి పూజలు పురస్కారములు చేయుదురు. ఆనాడు గాని ఈనాడు గాని వారి సిద్ధాంతములను ఆలోచనలను అర్థము చేసికొని వారి యాదర్శములందు భక్తి విశ్వాసములతో వారికి బాసటగా నిల్చి వారి యండను నడుము బిగించి ఆత్మోద్ధరణకై భారతదేశ పునరుద్ధరణకై పాటుపడువారు కానరారు గదా!

భక్తవరేణ్యు డగు వివేకానందస్వామి శ్రీ రామకృష్ణులు తలచినచో వారి కటాక్షవీక్షణమువలన వేలకొలది వివేకానందులు పుట్టుకొని వత్తురని యుండెను. శ్రీరామకృష్ణులును "భగవదనుగ్రహ మను మందమారుతము ఎల్లప్పుడును వీచుచునే యున్నది. జీవననౌక ఆ గాలి పోసికొనవలె నన్నచో, అది తన తెరచాపలను దింపుటయే ఆలస్యము——" అని యుండిరి. తెరచాపలు దింపుట యనగా మానవ ప్రయత్న మని యర్థము. శ్రీ వివేకానందస్వామి యవతారమూర్తియే యైనను, వారి జీవనమున ఈ మానవప్రయత్నము శతధా వివరింపబడియున్నది. వారి జీవనము నీ దృష్టితో పరిశీలించి వారు చేసిన ప్రయత్నముల నెల్ల మన జీవితములందు పాటింప ప్రయత్నించుటయే గదా విజ్ఞుల, దేశభక్తుల కర్తవ్యము!

ముప్పదేండ్లకు జగద్విఖ్యాతి నొంది తదుపరి తొమ్మిదేండ్లు మాత్రమే యైనను అవిరామ

ముగా కృషిసల్పి తన గురుదేవుల యుద్యమమునకు శంకుస్థాపనము గావించిన వివేకానందస్వామి, ఆనాటి విద్వాంసశిరోమణులచేతను సాంఘికసంస్కర్తలచేతను పాలకవర్గముచేతను పాలితజనావళిచేతను ముక్తకంఠముతో పొగడొందిన వివేకానందస్వామి, ఆ మొదటి ముప్పదేండ్లయందును ఎట్టి ప్రయత్నము గావించెనో ఎన్ని కష్టముల నెదుర్కొనెనో మన మెఱుగవలెను. మనమును అట్టి ప్రయత్నము చేయుటకును అట్టి కష్టముల నెదుర్కొనుటకును సంసిద్ధులమై యుండవలెను.

శ్రీ వివేకానందస్వామి యవతారమూర్తి యనుటకు శ్రీరామకృష్ణుల వచనములే చాలును. సప్తర్షి మండలమున ధ్యానమగ్నుడై యున్న ఋషిని తాను ప్రీతితో పిలుచుకొని వచ్చినట్లు తన శిష్యవర్గమున కొకపరి వారు వెల్లడించిరి. చిన్ననాటినుండియే ధ్యానమగ్నుడై తలుపులు పగులగొట్టుచున్నను చలింపని సంయమీంద్రుడతడు. ఎల్లరును నిదురించునంత అనాయాసముగ భ్రూమధ్యస్థితజ్యోతియందు మునిగిపోవు ధ్యానసిద్ధు డతడు. ఇట్టి యలౌకికపురుషుని జీవనవిశేషములును అలౌకికము లగుటలో ఆశ్చర్య మేమి!

అయినను ఇట్టి యూహాతీతసన్నివేశములచే సమ్మోహితులము గాక వారి జీవనచరిత్రను పరిశీలింతము గాక.

ప్రప్రథమము నుండియు వారి జీవనమున ప్రస్ఫుటమగు విశేషము వారి కుతూహలము, తార్కికబుద్ధి. ఏ విషయమైనను సమగ్రముగ తెలిసికొనకుండ నుండలేదు. కార్యకారణ విచారణబుద్ధి లేక విశ్వసించినది లేదు. తన తండ్రిగారి కార్యాలయమున వివిధవర్ణ మతస్థులకు ప్రత్యేకముగా హుక్కా లమర్పబడి యుండుటను చూచి దాని కేమి కారణమో యని తెలియ గోరినాడు. ఒక కులము వారి హుక్కా నింకొకరు పీల్చినచో 'వర్ణము' పోవునని విని అన్ని హుక్కాలను పీల్చి ఏమగునో చూచినవాడు. ఈ ప్రవృత్తియే జీవితాంతము వఱకును వారియందు కాన్పించును. సాంఘిక నియమములను, మతసిద్ధాంతములను, జీవన విధానములను ప్రాచ్య పాశ్చాత్యములందు తరచిచూచి సమన్వయించి అన్ని దేశములందును ఒక్కొక్క విశిష్టత గలదని యతడు గుర్తింపగలిగెను. దానిని ఆనందాతిరేకముతో మెచ్చుకొనగల్గెను. అన్నింటిని చూచిన పిదప తన మాతృదేశము నందలి ప్రతిధూళికణమును తన కత్యంత ప్రియతమమైనది పరమ పావనమైనది అని బాష్పపూరితనయనుడై పలికెను.

చిన్ననాటి యట్టి కుతూహలము దినములు గడచినకొలది పక్వమై 'దేవుడన నేమి జీవితోద్దేశ మేమి దేవుని జూచుట యెట్లు?' అను నన్వేషణ యయ్యెను. ఇట్లుండియు అత డెన్నడును తన చదువును గాని వ్యాయామమును గాని గృహనిర్వాహణబాధ్యతలను గాని విస్మరింపలేదు. సమగ్రదృష్టి యనగా నిది. తనపరిశ్రమకొలది దేశచరిత్రలను పాశ్చాత్యతత్త్వశాస్త్రములను క్షుణ్ణముగా చదువుచుండియు తన కాలేజి పరీక్షల నత డెన్నడును తప్పలేదు. వానిని దాటుటకు ఆయనకు మూడునాళ్ల పరిశ్రమయే చాలినచో నితరులకు వత్సరపర్యంతము పరిశ్రమ యవసర మగుగాక. తనశక్తిని ఎదిరిశక్తిని సరిగా తెలిసి యుద్యమించుటగదా బుద్ధిమంతుల లక్షణము! తన కాలేజీ చదువును వేదాంతశాస్త్రమును దేహపరిశ్రమను మాత్రమే గాక ఆయన సంగీతమునందును ప్రజ్ఞ సాధించెను. అన్ని రకముల వాద్య సంగీతములందును నేర్పరి యయ్యెను గాత్ర సంగీతము

నందు అతిశయించెను. సంస్కృత సాహిత్యము నందును వారికి విశేష పాండిత్యము.

శ్రీ వివేకానందుల బాల్యకౌమారములిట్లు గడచినవి. వృథా కాలయాపనము నెన్నడును చేయక తన సమయమును చాతుర్యముతో వినియోగించుకొనుచు వివేకానందస్వామి దైహికముగా మానసికముగా వికసించెను. కేవలము 'పుస్తకాల పురుగు' కాక అన్ని క్రీడావినోదములందును మిత్రుల గోష్ఠులందును ప్రముఖపాత్రనే వహించెను. తుద కతడు ప్రథమమున శ్రీరామకృష్ణులపరిచయము నందినదియు అట్టి యొక గోష్ఠియందే, ఈ వికాసమంతయు వారి భావిజీవితమున నక్కఱకు వచ్చుటలో వింత యేమి! పాశ్చాత్యతాత్త్వికులతో పాశ్చాత్య విజ్ఞానము నాతడు చర్చింపగలడు. ప్రాచ్యవిశిష్టతను ఎత్తిచూపగలడు. సాహిత్యముద్వారా ప్రాచ్యతత్త్వము, భారతావని యణువణువున నెట్లు జీర్ణించియున్నదో అతడు చెప్పగలడు. అహర్నిశమును చేయు ఉద్యమప్రయత్నమునకు వ్యాయామకర్కశమైన శరీరము గాక నింకొకటి తాళగలదా?

శ్రీ వివేకానందస్వామి బాల్య కౌమార దశలు మనకు కావలసిన యాదర్శములు. వీనియందు దుత్తీర్ణులమైన గాని మనకు పురోగతి యుండదు. శాయశక్తుల మన జీవితములందు మనము పారమార్థికవిద్యయు లౌకికవిద్యయు సమగ్రముగా నభ్యసింపవలెను. దృఢముశక్తివంతము అగు శరీరమును నిర్మించుకొనవలెను. సంగీతసాహిత్యములవలన మనస్సునకు మార్దవము సున్నితత్త్వములను సంపాదించుకొనవలెను. జీవితోద్దేశ మగు దివ్యసాక్షాత్కారమునందే మనస్సు నిలిపి కర్తవ్యము లగు సర్వవిధ వ్యాపారములను ప్రమాదము లేక చేయుచుండవలెను.

ఇట్లు తన ప్రయత్న మంతయు పూర్తిచేసి దైవదర్శనమునకై "మీరు దేవుని చూచితిరా? మీరు చూచితిరా?" అని వెదకుచున్న పరిస్థితియందు వివేకానందస్వామి శ్రీరామకృష్ణుల దర్శనభాగ్యమునందెను అయినను ఆ ప్రథమ సమాగమము వివేకానందస్వామి తార్కికబుద్ధియం దెట్టి చలనమును కలిగించినట్లు వినము. తదుపరి శ్రీరామకృష్ణులను దక్షిణేశ్వరమున దర్శింపబోయినపుడు తనపట్ల గురుదేవుల యాదరమును చూచి 'ఇతని కేమి పిచ్చియా?' యని తలచెను. వారి సమాధిస్థితులను చూచి 'ఇది మూర్ఛయా, మరి యేదైన వ్యాధియా?' యని తర్కించెను. కాని గురుదేవుల యాకర్షణ నంగీకరించి మరల వచ్చుటకు నిశ్చయించుకొనెను. మానవ ప్రయత్నము సంపూర్ణమైన పిదప గదా భగవదనుగ్రహమున సద్గురుప్రాప్తియగుట! సద్గురు శిక్షణమున వివేకానందస్వామి సర్వమును బ్రహ్మమే యను ననుభవమును, నిర్వికల్ప సమాధిని, సగుణ బ్రహ్మమే యగు భవతారిణీదేవి దర్శనమును పడయగల్గెను.

శ్రీరామకృష్ణుల సాన్నిధ్యమున వివేకానందస్వామి గడపిన ఆ యారు సంవత్సరములును నిరంతర పరీక్షయు పోరాటముగా గడచినవి. శ్రీరామకృష్ణులపట్ల అత్యంతభక్తిగౌరవములు గలిగినను, శ్రీరామకృష్ణుల దివ్యదర్శనము లన్నియు భ్రమలు, బలహీనమగు మనస్సు యొక్క వికారములు నని వివేకానందస్వామి యభ్యంతరమును తెలుపును. సర్వమును బ్రహ్మమెట్లగును! ఈ కుండయు పాత్రయు బ్రహ్మమేనా యని పరిహసించును. ఈయన నిజముగా కామకాంచనపరిత్యాగియేనా? యని గురుదేవుల పడకగుడ్డలలో రూపాయను దాచును. చివరకు గురుదేవుల యవసాన దశయందును

"ఈయన ఈ సంకటపరిస్థితియందుగూడ తాను దేవుడ ననినచో నొప్పుకొనవచ్చు" నని పరీక్షించెను. అది యట్లుండ పితృమరణముచేతను, వ్యాజ్యములచేతను, నిరుద్యోగముచేతను, గృహకల్లోలములచేతను, వివేకానంద స్వామియు అగ్నిపరీక్షలకు లోనయ్యెను. ఒకప్పుడు ఇరువదిమంది పంక్తిని లేక భుజింపని సంసారమునకు పూట గడచుట కష్టమయ్యెను. అభిమానియగు వివేకానందస్వామి తన కష్టముల నెవ్వరికిని తెలియనీయకపోవుటయే గాక తన మిత్రులను సంతోషపెట్టుటకై వారి వినోదములందు గానము చేయును. తన 'లా' పరీక్షకు చదువుచు, గురుసేవను చేయుచు, వ్యాజ్యము నడపుచు, ఇల్లు గడపుచు వివేకానందస్వామి సాగించిన జీవన సంగ్రామమునకు సాటియేది! ఇట్టి కష్టకాలములందును అతడు తన దైవచింతనను ధ్యానాదులను మానుకొనలేదు గదా! చివరకు శ్రీ రామకృష్ణు లనుగ్రహించి 'నీవు కోరినదెల్ల అమ్మ ఇచ్చు' నని భవతారిణీ దేవి యొద్దకు పంపగా ముమ్మారు భక్తిజ్ఞానవైరాగ్యములను గాక నింకొకటి కోరలేదు గదా! అంతమాత్రముచేత వైరాగ్యమిషమున తనవారిని గంగలో గలుపలేదు. శ్రీరామకృష్ణులను బలవంతముచేసి తనవారికి అన్నవస్త్రములకు లోటు లేకుండునట్లు ఏర్పాటు చేసియే గదా సన్న్యసించెను!

శ్రీ వివేకానందస్వామి జీవితమునందు ఈ అధ్యాయము మనము భరింపవలసిన కష్టనిష్ఠురములను ప్రకటించును. మానవ జీవితమున నెల్లరును వివేకానంద స్వామివలె శ్రీరామచంద్రునివలె అగచాట్లపాలు కాజాలరు. తమకు గలుగు అల్పపు కష్టములకే మానవులు బెగ్గడిల్లి పోకుండుటకై అట్టివారు తమ మానవ జీవితమున నిర్భాగ్యపు టవధులను తడవియు నిబ్బరము చూపుదురు. అట్టివారగుట చేతనే వారు కల్పాంతస్థాయులైరి. వారి నాదర్శముగ గొని మన జీవితములందును పారమార్థికజీవనమునే లక్ష్యముగ గొని మనము నిగ్రహము పాటింపవలదా?

శ్రీ వివేకానందుల జీవితమున మూడవదశయగు పరివ్రాజకదశయందే వివేకానందస్వామి భారతదేశము నలుమూలల పర్యటించి ఐదు సంవత్సరములలో తన దేశపు స్థితిగతులను, వెలుగుచీకటులను, కూలంకషముగ నవగత మొనర్చుకొనెను. తన దేశమే దేశమునకును తీసిపోదనియు, మీదుమిక్కిలి సర్వదేశములకును తన దేశమే పారమార్థిక జీవనాదర్శమనియు నిర్ధారించుకొన గలిగెను. తన దేశము నణువణువును ప్రేమించుచు తన భారతదేశ సముద్ధరణకై తన జీవితమును క్షణక్షణముగ ధారపోసెను. "స్వామి సహజముగ ప్రేమికుడు. అతని హృదయసామ్రాజ్ఞియే భారతదేశము"[1] అని సోదరి నివేదిత పలుకుటలో నాశ్చర్యమేమి?

ఆ పిదప వివేకానందస్వామి భారతదేశ సముద్ధరణకై దేశాంతరముల కేగినదియు, పాశ్చాత్యదేశముల యభిప్రాయముల నెట్లు పునాదులతో గదలించివేసినదియు భారతదేశమునకు మగిడివచ్చి తన సోదరప్రజానీకము నుద్ధరించుటకు చేసిన ప్రయత్నమును—ఇవి

1. The master as I saw him P. 47.

యున్నియు చరిత్రగతములైన విషయములే. కారణజన్మునకు గాక ఇట్టి ప్రయత్న మన్యులకు సాధ్యమా ?

ఇట్టి ఈ మహిత చరిత శ్రవణమునకు సార్థక్యమేమి ? బాలవివేకానందులవలె సర్వ విధముల మనకు సాధ్యమైనంత యభివృద్ధి సాధింప నిర్ణయించుకొని దానిని సాధించుటయే; యువవివేకానందునివలె సకలక్లేశములను చిరు నవ్వుతో భరించి సకల బాధ్యతలను ధైర్య ముగా నిర్వర్తించుటయే: ప్రౌఢవివేకానందుని వలె దేశక్షేమమునకై కొట్టుకొను గుండెతో పరిశ్రమించుటయే.

# భక్తి రత్నావళి

మూలము : శ్రీవిష్ణుపురి

వ్యాఖ్యాత : విష్ణుచిత్తుడు

(ప్రథమ విరచనము)

## 31-32

మహావిష్ణువును మాత్రమే యేల పూజింపవలయునో సునీతి ధ్రువునకు ప్రేమతో చెప్పుచున్నది.

తమేవ వత్సాశ్రయ భృత్యవత్సలం ముముక్షుభిర్మృగ్యపదాబ్జపద్ధతిమ్
అనన్యభావే నిజధర్మభావితే మనస్యవస్థాప్య భజస్వ పూరుషమ్.

నాన్యం తతః పద్మపలాశలోచనాద్దుఃఖచ్ఛిదం తే మృగయామి కంచన
యో మృగ్యతే హస్తగృహీతపద్మయా శ్రియేతరై రంగ విమృగ్యమానయా.

(4-8-22-23)

తండ్రీ! సేవకులయందు ప్రీతిగలవాడును మోక్షకాంక్షులు సేవింప గోరు పాదపద్మ ములుకలవాడును అగు నా పరమపురుషునే శరణుబొందుము. అన్యచింతనలు వదలి, విష్ణు భక్తితో పరిశుద్ధమైన మనస్సునందా పురుషశ్రేష్ఠునే ప్రతిష్ఠించి అతనినే భజింపుము. బ్రహ్మా దులు వెదకు లక్ష్మీదేవియు పూజార్థమై కమలమును చేతగొని ఎవనిని వెదకుచుండునో ఆ కమలనయనుడుగాక నీ దుఃఖనిర్వాపకుడింకొకడు కానరాడు.

## 33-34

లక్ష్మీదేవియు నతనినే యేల వెదకుచున్నదో పృథువు చెప్పుచున్నాడు.

అథో భజేత్వాఖిలపూరుషోత్తమమ్ గుణాలయం పద్మకరేవ లాలసః
అప్యావయోరేకపతిస్పృధోః కలిః న స్యాత్కృతత్వచ్చరణైకతానయోః

జగజ్జనన్యాం జగదీశవైశసం స్యాదేవ యత్కర్మణి నః సమీహితమ్
కరోషి ఫల్గ్వప్యురుదీనవత్సలః స్వ ఏవధిష్ణ్యేభిరతస్య కిం తయా (4-20-27-28)

పురుషోత్తముడవు సకలగుణవిశేషములకు నిధివియు నగు నిన్ను పద్మపాణియగు లక్ష్మీదేవి సేవించుచున్నది. ఆశతో నేనును అట్టి నిన్ను సేవింపబూనినచో నీయందే ప్రాణములు నిల్పిన మా కిరువురకును కలహము సంభవింపదా ?

జగన్మాతయగు లక్ష్మీదేవి నాయందు కినుక బూనిన బూనుగాక, నేను నిన్నే సేవింతును. దీనబంధువుడవైన నీవు అల్పములైనను భక్తుల సేవలను ఘనములుగనే గ్రహింతువు. నిరతమును ఆత్మవిభూతియందే ప్రతిష్ఠితుడవైయున్న నీకు లక్ష్మీదేవి వైభవముతో నేమి !

గమనిక : మహారాజును గొప్పభక్తుడును అగు పృథువు మహావిష్ణువు ననుగ్రహముకొరకై లక్ష్మీదేవితో స్పర్ధించుచున్నాడు. మాతృమూర్తియయ్యును లక్ష్మీదేవి యాగ్రహించునేమో యని భయపడియు శ్రీదేవి యాకర్షణలకంటె దీనుడగు భక్తుడే యతని కిష్టుడని యూరటపడుచున్నాడు.

## 35-36

హరిహరు లిరువురు నొకరే యగుటవలన మహావిష్ణుని శరణు జొచ్చినవాడు తనకును ఇష్టుడే యని రుద్రుడు ప్రచేతసునితో పలుకుచున్నాడు.

యః పరం రహసః సాక్షాత్త్రిగుణాజ్జీవసంజ్ఞితాత్
భగవన్తం వాసుదేవం ప్రపన్నః స ప్రియో హి మే.

అథ భాగవతా యూయం ప్రియాః స్థ భగవాన్ యథా
న మే భాగవతానాం చ ప్రేయానన్యోఽస్తి కర్హిచిత్. (4-24-28-30)

త్రిగుణాత్మకమై జీవులతోగూడియుండు ప్రకృతి కతీతుడైన వాసుదేవభగవానుని యందు ప్రపన్నులైనవారు నాకత్యంతము ప్రియులు. విష్ణుభక్తులారా! విష్ణుదేవునివలెనే మీరందరును నాకు ప్రియులు. విష్ణుభక్తులకును నాకంటె ప్రియతముడు లేడు.

గమనిక : హరిహరు లొకటి యగుటచేత శైవవైష్ణవవిరోధ మనావశ్యకమని స్థిరపరచుటకై రుద్రుని ఈ పలుకు లెన్నుకొనబడినవి.

## 37

దైవచింతనకు సహకరించిననే మానవజీవితము సార్థకమని నారదు డనుచున్నాడు.

తత్కర్మ హరితోషం యత్సా విద్యా తన్మతిర్యయా
హరిర్దేహభృతామాత్మా స్వయం ప్రకృతిరీశ్వరః. (4-29-49)

హరిని సంతుష్టుని జేయునదే కర్మ (లౌకికాభ్యుదయమునకై చేయు కార్యకలాప ములు, పూజావిధులు, కావనుట). హరియందు భక్తిశ్రద్ధలను గల్గించి హరిని దర్శింపజేయునదే విద్య. సకలజీవుల కాత్మయు విశ్వమున కీశ్వరుడును మూలకారణుడును హరియే.

## 38-39

సర్వదేవతాపూజయు, సకలసద్గుణములును కలిగిననే విష్ణుభక్తియనియు, అట్టి భక్తి కలిగినవాడే మహాపురుషుడనియు ప్రహ్లాదు డనుచున్నాడు.

యస్యాస్తి భక్తిర్భగవత్యకించనా సర్వైర్గుణైస్తత్ర సమాసతే సురాః
హరావభక్తస్య కుతో మహద్గుణా మనోరథేనాసతి ధావతో బహిః.

హరిర్హి సాక్షాద్భగవాన్ శరీరిణమాత్మాఝషాణామివ తోయమీప్సితమ్
హిత్వా మహాంస్తం యది సజ్జతే గృహే తదా మహత్వం వయసా దంపతీనామ్.

(5-18-12-13)

అవ్యాజమగు భగవద్భక్తి ఎవనికి గలదో వానియందు సకలసద్గుణములును సర్వదేవతలును సమావిష్టు లగుదురు. విష్ణుభక్తిలేనిచో బహిర్ముఖమైన మనస్సు ఇంద్రియసుఖములకై పరుగులువారుచుండగా వైరాగ్యము విశ్వప్రేమ మొదలుగాగల యుదాత్తగుణము లెందుండి వచ్చును ?

చేపలకు నీరువలెనే భక్తులకు హరియే ప్రాణము. హరి మహాత్వమును గణింపక ప్రాపంచికసుఖాసక్తు లగువారు ఘనులనుట ఎట్లు? గృహస్థులలో వయోవృద్ధులగు దంపతుల ఘనతవలెనే వారి ఘనతయు వయస్సునను మాత్రమే ఆశ్రయించి యుండును గదా!

---

# శ్రీ శంకర వివేకానందులు

వాసా సుబ్రహ్మణ్యశాస్త్రి

శ్రీ శంకర వివేకానందు లుభయులలో చాలవరకు పోలికలు కాన్పించును. ఇద్దరును తమ తమ కాలములలో గురుతరమైన కార్యభారమును నిర్వహించి జనావళిని జ్ఞానమార్గమున కున్ముఖుల జేసినారు. ఇద్దరును అల్పమైన ఆయుఃకాలముననే అనల్పమైనట్టియు, వైవిధ్యయుతమైనట్టియు కార్యపరంపరనుచేపట్టి కృతకృత్యులైనారు.ఇద్దరును సన్న్యాసాశ్రమప్రతిష్ఠ నినుమడింపజేసి భారతీయజనసముదాయముపై మాయని ముద్రను వేసి వెడలిపోయినారు.

శ్రీ శంకరులు క్రీ. శ : 8-వ శతాబ్దిలో దక్షిణాగ్రమున కేరళలో కాలడి గ్రామమున జనన మందినారు. నాటి హిందూసంఘపరిస్థితి చాల సంక్షుభితమై యుండినది. ఎందరో దేవతలు; ఎన్నియో ఆరాధనావిధానములు. ఈ

దేవతాభక్తుల మధ్యను, ఆరాధనావిధానముల మధ్యను ఎన్నో సంఘర్షణలు, స్పర్ధలు, కలహములు చెలరేగినవి. కొన్ని అవైదికమైన, క్షుద్రమైన ఆరాధనావిధానములు, వామాచారములు, చెలరేగి హిందూసంఘమును కలుషిత మొనర్చినవి. బాహ్యముగా గాని, ఆభ్యంతరముగా గాని సమన్వయము, సామరస్యము లోపించిపోయినది. మరియొకవంక వేదప్రామాణ్యము నంగీకరింపని బౌద్ధముయొక్క ప్రాబల్యము కొంత తగ్గినను దాని ప్రభావ మింకను అణగారి పోలేదు. బౌద్ధము గృహస్థాశ్రమ ప్రాముఖ్యమును కించపరచి, సన్న్యాసమున కావశ్యకతాతీతమైన ప్రాముఖ్యము నిచ్చియు, స్త్రీలకు సన్న్యాసాధికారము నొసంగియు, సన్న్యాసాశ్రమము యొక్క పావిత్ర్యమును, ఔత్కృష్ట్యమును మంట కలిపినది. సామాన్యుల కత్యావసరమైన ప్రతీకోపాసనను నిరసించి వారికి దైవారాధన నందుబాటులో లేకుండ జేసినది. భారతదేశమున సమైక్యభావన సమసిపోయినది. ఇట్టి పరిస్థితులలో శ్రీ శంకరుడవతరించినాడు. శంకరుడఖండప్రజ్ఞాశాలి. బాల్యముననే వేదవేదాంగములను షట్శాస్త్రములను పుడిసిలిపట్టినాడు. 'శంకర శ్శంకర స్సాక్షాత్' శంకరుడు సాక్షాత్తు ఆ శంకరుని అవతారమే అని పలువురి నమ్మిక. ఆతడు హిందూసంఘములోని స్థితిగతుల నాకళించుకొన్నాడు. సన్న్యాసమును స్వీకరించినగాని తన స్వేచ్ఛా సంచారమునకు, కర్తవ్యనిర్వహణకు అనుకూలించదని బాలబ్రహ్మచారిగనే సన్న్యాసాశ్రమస్వీకారము చేసినాడు. నిర్విరామముగ దేశసంచారము చేసి, నాస్తికులను, చార్వాకులను, పాషండులను, బౌద్ధులను, వామాచారులను ఎదిరించి, వాదించి వారివారి మతముల ఖండించి వేదప్రామాణ్యముపై అద్వైతమతమును ప్రతిష్ఠించినాడు. బహుదేవతలను సమన్వయించి పంచాయతన పూజా విధానమును గృహస్థులకేర్పరచినాడు. వేదవ్యతిరిక్తమతముల నిరసించి వేదసమ్మతములయిన షణ్మతములను ప్రతిష్ఠించి షణ్మతస్థాపనాచార్యుడైనాడు. కేవల కర్మవాదియగు మండనమిశ్రుని వాదమున నోడించి యాతనిని బ్రహ్మవాదిగా మార్చి తన శిష్యునిగా జేకొనినాడు. ఇట్లు వేదవిరుద్ధమైన మతముల మాయించి, వేదానువిద్ధములైన మతములను ప్రతిష్ఠించి, సనాతన మతమునకు స్థిరత్వమును సాధించినాడు. ఆ పిదప స్తిమితముగా కూర్చొని ప్రస్థానత్రయమునకు భాష్యముల సంతరించి వాని కద్వైతము నెడలనే తాత్పర్యమని సయుక్తికముగ నిరూపించినాడు.

ఇటు వివేకానందుడు కూడ భారతదేశమున అదే విధమైన పరిస్థితులలో నుద్భవమందినాడు. భారతదేశము బానిసతనమున క్రుంగి ఆత్మవిశ్వాసమును కోల్పోయినది. పాలకులు విదేశీయులు, క్రైస్తవులు నగుట వారి ఆచార వ్యవహారములు, వారి మతసూత్రములే ఉత్కృష్టములైన వనెడి భ్రమ నలుగడల వ్యాపింపసాగినది. అధికారధనబలముల నూతగా గొని క్రైస్తవమిషనరీలు దేశము నలుమూలల విజృంభించి పేదరికమున క్రుంగెడి ప్రజానీకమును తమ మతములోనికి పరివర్తనము చేయనారంభించిరి. బ్రాహ్మసమాజము హిందూ మతము నుండియే పుట్టినను సంస్కారము చేయుచున్నానను భ్రమతో – ప్రజలను వేదమతమునకు, దాని మౌలికవిశ్వాసములకు దూరము చేసి, క్రైస్తవమతమునకు సన్నిహితముగా గొనిపోజొచ్చినది. ఇక నార్యసమాజమతము వేదమతమునకు సన్నిహితముగా పోయినను, జ్ఞానోదయమును కల్గింపగల వేదాంతమును లోపింపజేసి శుష్కమైపోయినది. ఇక దివ్య

జ్ఞానసమాజములో జాతిని దుర్బల మొనర్చు లక్షణములే గాని బలిష్ఠ మొనర్చు లక్షణములు గోచరింపలేదు. హిందువులు దుర్బలులై ఆత్మ విశ్వాసమును కోల్పోయి, తమకు గర్వకారణములగు వేదములను, శాస్త్రములను, తామే ఈసడించుకొనసాగిరి. ఇట్టి స్థితిలో శ్రీవివేకానందుడు భారతావనిలో ఉదయ మందినాడు. శంకరుడు గోవిందభగవత్పాదులకు శిష్యుడైనట్లే వివేకానందుడు రామకృష్ణపరమహంస కంతేవాసి యైనాడు. శంకరునివలెనే బ్రహ్మచర్యము నుండియే సన్న్యాసాశ్రమమును స్వీకరించినాడు. శంకరునివలెనే - గురువునాజ్ఞపై ఒకపరి 5 సం॥ల కాలము తాను భారతదేశమునంతను పర్యటించి ప్రజల స్థితిగతుల నారసినాడు. హిందువులలో నెలకొనిన ఆత్మవిశ్వాసరాహిత్యము, న్యూనత్వగండము (Inferiority complex) ఆతనిని కలచివేసినవి. కన్యాకుమారి వద్ద శిలపై కూర్చొనగా నేదో యొక భావావేశము ప్రేరేపింపగా - ఈ దేశము నన్నివిధముల నుద్ధరించవలెనని దృఢదీక్ష వహించినాడు. ఇంతలో 'చికాగో'లో మతమహాసభల వార్త చెవినిబడినది. ఎటులో పలు కష్టముల కోర్చి - చికాగో చేరి హిందూమత ప్రతినిధిగా ప్రసంగించి, యచట సనాతనమతభేరిని మ్రోగించినాడు. తన మతముయొక్క - సహనదృష్టిని, ఔదార్యమును, సమన్వయశీలమును ఉగ్గడించినాడు. క్రైస్తవుల తుచ్ఛమయిన మతాన్తరీకరణచర్యలను నిశితముగా ఖండించినాడు. అద్వైతమతసారమును సభాసదుల కుపదేశ మొనర్చినాడు. సనాతన మతభానుని ముందు అన్యమతములు ప్రభాతనక్షత్రములై వెలవెల పోయినవి. నాడు వేదికపై నెక్కి భాషించుచున్న వివేకానందుని మోములో తొణికిసలాడిన తేజస్సు, స్ఫూర్తి, నిరుపమానమైనదని Annie B:asant వక్కాణించినది. ఆ మూడు నాళ్లు సభాసదుల నందరిని సమ్మోహపరవశుల జేసినది వివేకానందు డొక్కడే అని అందరేక గ్రీవముగా నంగీకరించినారు. అంతటితో నాగక వివేకానందుడు అమెరికా యూరపు ఖండములందంతటను పర్యటించి, ప్రసంగపరంపరల జేసి సనాతనమత దుందుభిని మ్రోగించినాడు. ఆతని విజయములను పత్రికలలో పఠించిన భారతీయులలో నవచైతన్య మంకురించినది. ఆత్మవిశ్వాసము మరల నుద్బుద్ధమైనది. ఇండియాలో పాదరీలు నిర్వ్యాపారులు కాగా వారి రాబడులు పడిపోయినవి.

హిందూమతమున తొలిసారిగా ప్రచారపద్ధతి నవలంబించినది - ఆచార్యశంకరుడు. ఆయన దేశమంతయు తిరిగి విమతస్థుల నోడించి, అద్వైతమును స్థాపించి నాల్గుదిక్కుల అద్వైత పీఠములను నెలకొల్పినాడు. వివేకానందు డొక్కడే యావద్భారతముననే కాక విదేశములకూడ యాత్రను సలిపి, ఉపన్యసించి, సనాతనధ్వజము నెగురవేసినాడు. పలుతావుల గురువుల పేరిట రామకృష్ణమఠములను ప్రతిష్ఠించినాడు. శంకరుడు నెలకొల్పిన పీఠములందువలెనే, ఈ మఠములందును సన్న్యాసులు వసించుచు శ్రీరామకృష్ణవివేకానందుల బోధలను ప్రచార మొనర్చుచున్నారు. శంకరుని వలెనే వివేకానందుడు కూడ గొప్ప ప్రచారకుడే కాక గొప్ప ప్రబంధకుడు (organizer) కూడను. కొన్ని వందల సం॥లు గతించినను శంకర ప్రతిష్ఠితములైన పీఠములు చెక్కుచెదరక పరివ్రాజకపరంపరలో ననూచానముగా వచ్చుచు శాంకరబోధలను ప్రచారించుచున్నవి. అట్లే వివేకానందుడు ప్రతిష్ఠించిన రామకృష్ణ మఠములుకూడ సుదృఢమైన పునాదులపై నిర్మింపబడి సమర్థులగు సన్న్యాసులచే నిర్వహింపబడు

చున్నవి. నేడు రామకృష్ణమిషన్ శాఖలు దేశవిదేశములలో నూటపదికి పైగా నున్నవట. తన కాలమున భారతదేశము పేదరికమున క్రుంగి కృశించుటచేత ఆకలితో మండు కడుపులకు మతబోధలు రుచింపవని గ్రహించి, వివేకానందుడు, దీనజనులకు సేవల నందించుటకై రామకృష్ణసేవాసంఘములను నెలకొల్పి యున్నాడు. ఇవి పేదల కన్నదాన వస్త్రదానములను చేయుటయేకాక - కఱవు, తుఫాను, మున్నగు ఉత్పాతములు వచ్చినపుడు ప్రజలకెంతో తోడ్పడుచున్నవి. ఇంకను రామకృష్ణమిషను, వైద్య విద్యా సదుపాయములు కూడ చేకూర్చుచున్నది.

శంకరునివలెనే వివేకానందుడును దివ్యసుందరవిగ్రహుడు; దృఢదేహుడును. శంకరునివలెనే వివేకానందుడు మహోత్సాహశీలుడు, నిరంతరకార్యదీక్షాపరాయణుడు. శంకరుడు వేదాన్తమార్గమున అద్వైతమును శిఖరాయమాణముగా ప్రతిష్ఠించి ప్రచారము చేయగా వివేకానందుడా అద్వైతమునే అందుకొని తన గురువర్యుడగు రామకృష్ణుని అనుభూతులతో దానిని మేళవించి ప్రచారము చేసినాడు. ప్రాచీనవేదాన్తము నీ కాలమునకు అన్వయింపజేసినచో అనేక సమస్యలు పరిష్కారము కాగలవని వివేకానందుడు నమ్మియున్నాడు. అతడు సిద్ధాన్తవేదాన్తమును - పాశ్చాత్యుల కుపదేశించి ప్రాచ్యుల కాచరణవేదాన్తము నుపదేశించినాడు. శంకర వివేకానందు లుభయులును బౌద్ధికస్థాయిలో తమ ప్రజ్ఞల చూపి ఆధ్యాత్మికస్థాయి కెగసినారు. ఇద్దరును యావద్భారతమును సంచరించి - భారతదేశమున వైవిధ్యములో నేకత్వమును కనుగొన్నారు. ఇద్దరును భారతదేశసమైక్యతకు అఖండమైన కృషి చేసినారు. ఇద్దరును గొప్ప బోధకులే. ఇద్దరును వక్తృశిరోమణులే. ఇద్దరును తార్కికధీవిలసితు లయిన వేదాన్తులయ్యు మధురమంజులమైన కవిత్వమును బోలిన వాక్కులలో తమ బోధల నందించి యున్నారు. శంకరుని భాష్యశైలి కీడైన శైలి మరి సంస్కృతమున లేదందురు. అది మత్తమత్తేభగమనమునుబోలి గంభీర మయ్యు, లలితమై, మధురమై పాఠకుల హృదయముల వశీకరించుకొనును. అది యొక మధురకావ్యము. అట్లే వివేకానందుని ఉపన్యాసధోరణి కానిండు; రచనాధోరణి కానిండు. అది యొక సుకుమారకవితాకళావిన్యాసము. అది బాలగోపాలుని మురళీగానములోని ఒక రవళి. విదేశీయులుకూడ ఆ వాఙ్మాధుర్యమును గ్రోలి పరవశించినారన్న వేర యేమి నిదర్శనము కావలెను? శంకర వివేకానందు లిద్దరును అద్వైతశిఖరము నధిరోహించిన జ్ఞానిశిరోమణులయ్యు - నిరంతరకార్యదీక్షావ్యగ్రులైన కర్మయోగులు; అంతియ కాదు, భక్తి మరంద ధారల గ్రోలి పరవశించు మహాభక్తాగ్రగణ్యులు. శంకరులు, శివానందలహరిలో, సౌందర్యలహరిలో, భజగోవిందస్తోత్రములో, లక్ష్మీనృసింహస్తోత్రములో తమ భక్తిమరందధారలను స్రవింపజేసియున్నారు. అట్లే వివేకానందుడుకూడ కాళీమాతృచరణపల్లవముల నుపాసించి, భక్తియోగమును ప్రవచించిన పరమభక్తశిరోమణి. ఇద్దరును జ్ఞానులయ్యు, నిర్గుణపరబ్రహ్మోపాసకులయ్యు, లోకసంగ్రహార్థము సగుణబ్రహ్మను, సాకారపరమేశ్వరుని కొలిచి యున్నారు. ఇద్దరును నలుబది సంవత్సరములుకూడ నిండని అల్పాయుర్దాయముననే అనల్ప కార్యముల సాధించి సిద్ధినంది యున్నారు. ఇద్దరును మేధావదసాధారణులే. ఇద్దరును తమ గురువుల గౌరవము నినుమడింపజేసి సన్న్యాసాశ్రమ ప్రతిష్ఠను ఉన్నతాకాశమున కెగయించినారు. ఇద్దరును

జారిన భారతజాతి గౌరవమును చక్కదిద్ది, జాతీయులలో నాత్మవిశ్వాసమును రగుల్కొల్పి, సనాతనసంస్కృతియొక్క ఘనతను, సనాతన మతముయొక్క ప్రతిష్ఠను గర్వపర్వతశిఖరముల కధిరోహింప జేసినారు — శంకరుడు సాక్షాత్ శంకరుని అవతారముగా భావింపబడినాడు. వివేకానందుడు చివరి జీవితమున అమరనాథ్ వెళ్లినప్పటినుండి శివుడు తనలో ప్రవేశించినాడనియు, అతడు మరి పోడు అనియు శివాద్వైతమునే భావించుచు వచ్చినాడు. హిమాలయ వింధ్యము లున్నంతవరకు, గంగాగోదావరులు ప్రవహించుచున్నంతవరకు హైందవజాతి శంకర వివేకానందులకు భక్తినమ్రమై నివాళు లర్పించుచునే యుండగలదు.

# హాస్యవివేకానందము

## హరిహరదాసు

గొప్ప వేదాంతియు, జగద్విఖ్యాతిచెందిన ప్రవక్తయు నగు శ్రీవివేకానందస్వామి హాస్యప్రియుడగుట పలువుర కాశ్చర్యమును కలిగించును. స్వామి సమకాలికులే 'స్వామీ సన్న్యాసులగు మీ కింత నవ్వే'మని దిగ్భ్రాంతిచెంది ప్రశ్నించెడివారు. 'నేను సన్న్యాసిని. బ్రహ్మానందమునకు నేను వారసుడను. నవ్వగలుగునది నేనే' యని స్వామి బదులాడెడు వాడు. స్వామి తాను నవ్వుటయేగాక ఎల్లరను నవ్వించును. వారి శిష్యగణమంతయు నేకగ్రీవముగా వారి సాన్నిధ్యము ఆనందామృతపానమే యనిరి. భావగాంభీర్యము హృదయమార్దవము వారి యందు గంగాయమునలవలె సంగమించిపోయినవి.

చిన్ననాటినుండియు వారి వినోదము పలువిధములుగా ప్రసరించెడిది. తన సహపాఠుల కనేకములైన హాస్యకథలు చెప్పి కడుపుబ్బ నవ్వించెడివాడు. వారి సమావేశము లన్నింటికి నాయకుడు ప్రాణమును ఆయనయే. అందఱు బాలురవలెనే వివేకానందస్వామి తన యక్కలను విసిగించి యానందించెడివాడు. వారు కోపముతో తరుమగా పారిపోయి జలదారిలో నిలిచి 'రండు, ఇప్పుడు రండు' అని వెక్కిరించెడివాడు. వా రెంత కోపములోనైనను ఇట్టి మురికిబాలుని ముట్టుకొనరని యతనికి తెలియును.

మాటకు మాట సమయస్ఫూర్తితో చెప్పుట నరేంద్రునకు వెన్నతో బెట్టిన విద్య. ఒకపరి క్రైస్తవమతబోధకు డొక డుపన్యసించుచు 'గుడిలోనున్న మీ దేవుని నా చేతికఱ్ఱతో కొట్టిన నతడేమి చేయు'నని ప్రశ్నించెను. ఇట్టి యసందర్భపు ప్రశ్నల కేమి యుత్తరమని శ్రోత లూరకుండగా, ఆ దారిని బోవుచున్న నరేంద్రు డాగి 'మీ దేవుని నేను దూషించినచో నేమి చేయు'నని మారుప్రశ్నించెను. అతడు కోపించి 'నీ మరణానంతరము నిన్ను శాశ్వతనరకమున బడవేయు' ననగా 'మా విగ్రహముకూడ నీ మరణానంతరము నిన్నట్లే చేయు'నని శ్రోతలకు కర్ణపేయముగ బలికెను.

శ్రీరామకృష్ణులు ఆటలలోనైనను అబద్ధములు చెప్పిరో లేదో కాని వారి శిష్యసత్తము

డగు వివేకానందుని వినోదార్థమై వల్లమాలిన యబద్ధములను చెప్పును. వారికి పదునొకం డేండ్ల ప్రాయమున కలకత్తారేవున కొక యుద్ధనౌక వచ్చెను. దానిని జూచుటకు తన మిత్రబృంద ముత్సహింపగా అనుమతిపత్రము తెచ్చుటకై నరేంద్రుడు పోయెను. కాని యచటి ద్వారపాలకుడు బాలురకు వీలులేదు పొమ్మనెను. ఓటమి ఎఱుగని నరేంద్రుడు చుట్టును చూచి మేడ వెనుకప్రక్క నున్న మెట్లెక్కిపోయి అధికారియొద్ద ననుమతి పత్రము గొని వెలికి వచ్చెను. అతనిని చూచి ద్వారపాలకుడు బిమ్మరపోయి నీ వెట్లు లోనికేగితి వని ప్రశ్నింపగా 'నేను మంత్రవేత్త' నని నరేంద్రుడు గంభీరముగా పలికెను.

బాల్యమునుండియే స్వామి పాకశాస్త్రమున నిష్ణాతుడు: అందఱు బాలురచేతను ధనము వెచ్చింపజేసి తానును కొంతధనము వెచ్చించి నరేన్ చిత్రవిచిత్రపదార్థములను తయారుచేసెడివాడు. అతని సంభాషణము వలెనే అవి చాల రుచిగా నుండుటయేగాక పచ్చిమిరపకాయల ఘాటుతో చుఱ్ఱుమనిపించెడివి.

బాల్యమున తన మిత్రులకు నరేంద్రుడు చెప్పిన కథలలో నొకటి: ఒక ముసలమ్మకొక మేక యుండెడిది. ఒకనా డొక పెంకె వాడు దానిని దొంగిలించి వండుకొని తిని వేసెను. పాప మా ముసలమ్మ తన మేకకై ఆతురతతో వెదుకుచుండ నా పెంకెవాడు 'నీ మేక న్యాయాధికారిగా మారిపోయినది. ఫలానా న్యాయస్థానమున తీర్పు లిచ్చుచున్న' దని ఆ యవ్వతో చెప్పెను. ముసలమ్మ అది నిజమే యని నమ్మి పోయి చూచెను. ఆ న్యాయాధికారి మేకవలెనే సన్నని పొడవైన మొగము పీచుగడ్డము కలిగియుండి ముసలమ్మ మేకవలెనే నల్లగా నుండెను. ముసలమ్మ గంపెడు సంతసముతో న్యాయాధికారిని చేరబోయి 'ఓ నా మేకా బంగారు మేకా ఇంటికి పోదమురా' యని లాగజొచ్చెను. న్యాయాధికారి కోపముతో 'నన్ను మేక యందు వేమ'ని గద్దించుటయు ముసలమ్మ 'నీవు నా మేకవే' యని యూరడించుటయు నొక ప్రహసనము కాగా చివరకెట్లో పెంకెవాడు చేసిన యల్లరి బయటపడెను.

పరిచయమైన పిదప ఆధ్యాత్మికసాధనలు తీవ్రముగా చేయుచున్నప్పుడుకూడ స్వామి ఇట్లే యానందించెడివాడు. ఒకనాడు మహిమాచరణు డను శ్రీరామకృష్ణుల భక్తుడు పెద్దపండితునివలె నుపన్యసించుచు అనేకములగు సద్గ్రంథములను ప్రమాణముగా పేర్కొనుచుండెను. నరేంద్రుడతనితో వాదమున నెగ్గలేడేమోయనిపించెను. చివరకు నరేంద్రుడు 'అయ్యా, మీరు ఈ గ్రంథముల నన్నింటిని చదివితిరా లేక వాని పేర్లను మాత్రము వినియుంటిరా' అని యడుగ మహిమాచరణుడు బిత్తరపోయెను. అంతలో నాగక 'మీరీ పుస్తకములను పూర్తిగా జదివితిరా లేక పుటలు తిరుగవేసితిరా' యని మరియు ప్రశ్నింపగా అతడు నట్టుచు 'నిజముగా నేను వానిని పూర్తిగా జదివితి'నని చెప్పెను. వాదమును ఆపె నిక సాగలేదు.

సన్న్యాసస్వీకారానంతరము స్వామి యొకనాడు గిరీశఘోషు నింటికి పోయెను. ఆ సమయమున గిరీశుని బుద్ధచరితమను నాటకము విజయవంతముగా నడచుచుండెను. గిరీశునింట స్వామి కాళ్లు బారచాపి వార్తాపత్రిక చదువుచుండెను. బుద్ధవేషధారియు నచ్చటనే యుండెను. ఇంతలో గిరీశుని పరిచయస్థుడు, గొప్ప పండితుడ ననుకొను నొక మున్సబు

వచ్చి తన పాండిత్యము వెళ్ళబోయుటకు 'చూడు గిరీశ్ బుద్ధుడు నాస్తికుడు గదా. నే నెన్నో ఆంగ్లగ్రంథములను చదివితిని. అన్నియు బుద్ధుడు నాస్తికు డనియే చెప్పుచున్నవి' అని యనసాగెను. గిరీశు డతనికి పాఠము నేర్ప దలచి 'ఇదిగో ఈ సన్న్యాసి నడుగుము తెలియు' ననెను. మున్సబునకు స్వామి పరిచయము లేదు. 'ఎవరిత'డని అత డడుగ 'అత డొక భిక్షుకుడు. ఈ పూట భోజనమునకు వచ్చినా'డని గిరీశుడు బదులిచ్చెను. అట్టి మురికిభిక్షుకునితో మాటలాడుటకు పస్తాయించి చివరకు మున్సబు 'ఇదిగో బుద్ధుడు నాస్తికుడో కాడో చెప్పగలవా' యని నరేంద్రుని ప్రశ్నించెను. అతడు పరిహాసముగా బుద్ధవేషధారిని జూపి 'బుద్ధు డిచటనే యున్నాడు గదా అతనినే యడుగు' మనెను. ఆ వేషధారికి స్వామి తెలియును. అతడు చేతులు జోడించి 'నాకేమియు తెలియదయ్యా. నేను వట్టి బుద్ధిలేని వేషగాడను' అని మొఱపెట్టెను. గిరీశుడు నవ్వుచు ఈ ప్రహసనమును చూచుచుండ మున్సబునకు కోపము పెరిగి 'నీకు తెలిసినదేమో చెప్పు'మని స్వామిని గద్దించెను. అతడును "నిజమే. బుద్ధుడు నాస్తికుడని 'హాయ్ రే మజా ఖనిబార్' పత్రికయందు ప్రకటించి"రని ప్రత్యుత్తర మిచ్చెను. నిజమునకు అట్టి పత్రిక ఏదియు లేదు. త్రాగుబోతులకు ప్రియమైన పాటలో మొదటి చరణ మది. బుద్ధుడు నాస్తికు డనుట త్రాగుబోతులకు తగియున్నదని స్వామి సున్నితముగా సూచించెను. అచట నున్నవా రందఱు నవ్వుచుండ మున్సబు కోపముతో బుసలు కొట్టుచు వెడలిపోయెను.

ఇతరుల నాటపట్టించుట యన స్వామి కదొక ముచ్చట. గోపాల్ కవిరాజ్ అనునతడు గొప్పవైద్యుడు. కాని యతనికి చతురంగపు పిచ్చి. చతురంగములో పడి యతడు తన రోగులు పిలిచినను పోవుకాడు కాడు. నరేంద్రున కతడనిన ఇష్టము. అప్పు డప్పు డతనిని పిలువనంపెడివాడు. కాని ఆ భిషగ్వరుడు తైలములు రసాయనములు తయారు చేయుటలో మునిగి ఒక్కొక్కప్పుడు ఆహ్వానమును తిరస్కరించెడి వాడు. అప్పుడు నరేంద్రుడు 'చతురంగపుటాటగాడు వచ్చియున్నాడు. నీతో ఆడవలె ననుచున్నా' డని కబురంపును. వెంటనే తైలములు రసాయనములను మూలకు త్రోసి గోపాలుడు వచ్చి తాను మోసపోయితి నని సభికుల నవ్వులవలన తెలిసికొనును.

శ్రీ రామకృష్ణుల వృద్ధశిష్యు డగు అద్వైతానందస్వామి కూడ వీరి యాగడమున కెఱ యయ్యెను. వారికి నల్లమందు తిను నలవాటు. నరేంద్రుడును గంగాధరుడును కలసి ఆ నల్లమందు మాత్రలను సంగ్రహించి వాని స్థానమున నల్లమందు పూతపూసిన క్వైనినుమాత్రల నుంచిరి. పాపమా స్వామి యట్లే రెండు దినములు నల్లమం దనుకొనుచు క్వైనిను మాత్రలనే మ్రింగుచుండెను.

ఇతరులకు వారి యజ్ఞానమును విషయబోధనమును కూడ స్వామి హాస్యమును జోడించియే చేయును. వివేకానందస్వామి వారి మిత్రులలో నుండ నొక స్వయంభావితపండితుడు వచ్చి తన పాండిత్యమును ప్రదర్శింపసాగెను. వానిగర్వము అజ్ఞానము ఎల్లరకును సంకటముగా నుండ చివరకు స్వామి 'అవునవును. నీవు చెప్పునది నిజమే. మీ తండ్రి 'దాతాకర్ణ'ను అధ్యయనము చేసినవాడు గదా. నీవును బోధోదయమును చదివితివి' అని మెచ్చుకోలుగా పలికెను, దాతాకర్ణ, బోధోదయము అనునవి పసిబాలుర పుస్తకములు. దీనితో ఎల్లరును నవ్వుచుండ ఆ మిథ్యాపండితుడు చల్లగా జారుకొనెను,

శరీరము నెండగట్టు 'తపము' స్వామి కెంత మాత్రమును అంగీకార్యము కాదు. దానిని ప్రకటించుటకై స్వామి ఈ కథను చెప్పెడివాడు. స్వామి యొకనాడొక మిత్రుని ఇంటికి బోవ నచ్చట నొక బాలుడు ఊరకుక్క నొకదానిని బట్టుకొని దాని పొట్ట బిగలాగి కట్టుచుండెను. తండ్రీ ఏల దానిని బాధించుచున్నావని స్వామి యడుగ దీనిని గ్రేహౌండును (Grey hound) చేయుచున్నానని యా బాలుడు నమ్మకముతో చెప్పెను. గ్రేహౌండులు వెన్నంటుకొని యుండు పొట్టలు గలిగి మిక్కిలి సన్నముగా పొడవుగా నుండును గదా. ఈ యూరకుక్క నట్లు చేయు ప్రయత్నమున ఆ బాలుడు రోజున నొక పిడచ యన్నము మాత్రమే దానికి పెట్టుచుండెను. ఆ నిర్భాగ్యపు కుక్క ఎముకలు బైటబడి చివర కట్లే చనిపోయెను. ఉపవాసముల చేతనే మహర్షుల మగుదుమని భావించెడి వారికి స్వామి ఈ కథను వర్ణించెడివాడు.

స్వామి ఘజీపూరున కొంతకాల ముండెను. అచ్చట వారు శ్రీష్ చంద్రబోస్ అను మున్సబునకు అతిథి. వారి ఇంటికి దాదా యను నొక వృద్ధుడు వచ్చుచుండెడివాడు. ఒకనాడాతడు వచ్చి స్వామిని వేదపారాయణము చేసి వ్యాఖ్యానింపుడని ప్రార్థించెను. స్వామి కతని సంగతి తెలియును. తన కేమియు తెలియక పోయినను చాల తెలిసినట్లు నటించుట అతని యమాయిక దంభము. స్వామి శ్రద్ధతో గంభీరముగా 'కస్మిన్ శ్చిత్ వనే...' అని హితోపదేశమును రాగయుక్తముగా చదువదొడగెను. ప్రతి చిన్న బాలునకును హితోపదేశము నీతికథల సంపుటి యని తెలియును గదా, కాని ఆ వృద్ధుడు అది వేదమే యను భ్రమలో బిగ్గరగా నేడ్వదొడగెను. ఆ పిదప స్వామి ఆ వేదమును వ్యాఖ్యానించుచు తాను చదివిన 'వేదము' వంటి తలయును తోకయును లేని వ్యాఖ్యానము నందుకొనెను. శ్రీష్ బోసు ఈ ప్రహసనమును విని ప్రక్కలుపడ నవ్వుచుండ స్వామి తైక్ష్ణ్యము నటించుచు 'మేము వేదాధ్యయనము చేయుచుండ మీరేల యభ్యంతర పెట్టుచున్నారు? మీ రిటనుండి వెడలిపొం' డనెను. శ్రీష్ బోసు వెడలిపోయిన వెనుక స్వామి చాలసేపు తన వేదపారాయణముతో ఆ ముసలివాని నేడ్పించెను. (మతగ్రంథములను వినునపు డేడ్వవలయునని యా వృద్ధుని యూహ.)

స్వామి విశ్వవిఖ్యాతు డైనప్పుడుగూడ తన శిష్యులను శిష్యురాండ్రను తన హాస్యోక్తులచే నవ్వించెడు వాడు. థౌసండ్ ఐలెండు పార్కునందు ప్రత్యేకశిక్షణ నిచ్చినప్పుడుగూడ వారి కెంత గహనములగు విషయములను తెల్పెనో అంత హాస్యరసమును గూడ ప్రవహింపజేసెను. వానిని గ్రంథస్థము చేయువారు లేకపోవుట మన దురదృష్టము. అచ్చటి యుదంతములలో నొకటి: డాక్టర్ వైట్ కేంబ్రిడ్జి యూనివర్సిటీ విద్యాంసుడు. పసివానివలె స్వచ్ఛమగు మనస్సు కలిగిన అతడు స్వామి యుపన్యాసమును తన్మయుడై వినును. చివర ఆ భావోత్కర్ష యందు తేలుచు 'అయినచో స్వామీ నేను ఏకము అనంతము అగు బ్రహ్మము నగుట నిశ్చయమే గదా' యని యమాయికముగా ప్రశ్నించును. స్వామియు వాత్సల్యముతో 'అగును, నీవు బ్రహ్మమవే. సత్యస్వరూపమైన బ్రహ్మమే నీ యసలైన తత్త్వము' అని యూరడించును. ప్రతిదినమును ఈ ప్రశ్నోత్తరములు నిత్యనూతనముగా నడచుచు ఎల్లర నానందపూర్ణుల జేసెడివి. ఒకనాడు డాక్టర్ వైట్ భోజనశాలకు ఆలస్యముగా వచ్చెను. స్వామి యతనిని చూచినదే, 'ఇదిగో బ్రహ్మము వచ్చుచున్నది. ఇప్పుడు మన నడుమ అనంతమగు బ్రహ్మము నిలిచియున్నది' అని

గాంభీర్యము నటించుచు పలికి నవ్వుల తుఫానును పుట్టించెను.

తననుగూర్చియు స్వామి చెణుకులు విసరును. వారు నిరంతర ప్రయాణము చేయుచు దినమునకు మూడు సుదీర్ఘోపన్యాసముల నిచ్చుచుండిన కాలమున నొకనాడు ఉపన్యాసార్థమై స్వామి యొక చిన్న పట్టణమును చేరెను. ప్రయాణములో నలిగి యలసిపోయిన స్వామి విశ్రమించుటకై ఆ యాహ్వానమండలి కార్యదర్శిని యొక్క పేలుకుర్చీని చూపెను. దురదృష్టవశమున కొంతసేపటికి ఆ కుర్చీ నడిమిభాగము పిగిలిపోయి స్వామి అం దిరుకుకొని పోయెను. స్వామి బయటపడుట కెంత ప్రయత్నించిన నంతగా ఇరుకుకొని పోసాగెను. వారి దుస్తులును చినిగిపోవునట్లుండ స్వామి యట్లే కదలక మెదలక యుండవలసివచ్చెను. చాల తడవైన పిదప ఉపన్యాస సన్నాహములన్నియు పూర్తిచేసి ఆ కార్యదర్శిని "స్వామీ, సభాసదులు మీకై వేచియున్నా" రనుచు వచ్చెను. స్వామియు వారికి సహజమగు హాస్యధోరణిలో "తల్లీ, నన్నీ దుర్భరస్థితినుండి నీ వుద్ధరింపనిచో వారు కల్పాంతమువరకు వేచియుండవలసినదే" యని చమత్కరించెను.

స్వామికి హాస్యకథలు వినుటయు చాల ఇష్టము. వారికి ప్రీతిపాత్రమైన కథ యొకటి: కెనడా దేశమందలి చెంచులలోనొకడు తనభార్య చనిపోగా నామెనిమిత్తము ప్రార్థనలు చేయుటకై క్రైస్తవాచార్యుని పిలువవచ్చెను. ఆయన కార్యాంతరమున నున్నందున అతని వంటకత్తె తలుపు తెరచెను. ఆమెను చూడగనే చెంచుతా నామెను పెండ్లాడ గోరుచున్నా నని తెలిపెను. ఆమె తిరస్కరించుట సహజమే. చనిపోయిన పెండ్లమును పూడ్చిపెట్టక మునుపే మరొక పెండ్లిప్రయత్నము ఆమెకు అసహ్యమనిపించెను. అది వీని కెట్లు తెలియును! మరునటి ఆదివార మతడు 'శోభాయమానముగా' అలంకరించుకొని వారి ఇంటికి వచ్చెను. రంగురంగుల దుస్తులను ధరించి తలపై నీకలతురాయి నమర్చెను. తలకు నూనెను దట్టముగా పట్టించుటచేత నది బుగ్గలవెంబడి కారుచుండెను. నిస్సంశయముగా నతడు తాను రూపజితమన్మథుడ ననియు వంటకత్తె బుద్ధిహీనురాలగుట చేతనే తనను తిరస్కరించె ననియు భావించుకొని యుండును.

ఈకథ వినిన పిదప స్వామి తైలవర్ణ చిత్ర మొకటి తయారగుట తటస్థించెను. తన మిత్రగణము బలవంతము చేయగా స్వామి దానిని చూచుటకు పోయెను. అది తైలచిత్ర మగుట చేత చిత్రమునందు స్వామి బుగ్గలపై నూనె ప్రస్ఫుటముగా నుండెను. దానిని చూచి వెంటనే "ఓహో, ఇతడెవరో వంటకత్తెను పెండ్లాడబోవుచున్నా" డని పలికి నవ్వసాగెను.

ఎంత పేరుప్రఖ్యాతులు వచ్చినను స్వామికి కొంటెతనము వదలలేదు. వీధిలో పోవుచున్న యువతీయువక సందోహమును చూచుచు స్వామి బెంగాలీపద్యము నొకదాని నాశువుగా చదివెను. దాని భావ మిది. 'తలపై టోపీలతోను చేతులలో గొడుగులతోను యువతీమణులు సంచరించుచున్నారు. ముఖములపై వారు బుట్టలకొలది పిండిని మోయుచున్నారు.' చెంగటనున్న మహేంద్రనాథుడు నవ్వు నాపుకొనలేకుండగా స్వామి కారదానందులతో 'చూచితివా, ఈ లలనామణు లెంత పౌడరు పులిమికొనిరో! దానిని పారలతో నెత్తవచ్చును గదా!' యని ప్రశ్నించెను. ఉపన్యాసమునకు పోవుచున్నంతసేపును ఒకరి నొకరు గిల్లుకొనుచు పొడుచుకొనుచు పిల్లచేష్టలు

చేయుచునే యుండిరి. ఉపన్యాసమంటపమును చేరగనే స్వామి యత్యంతగంభీరు డైపోయెను. తేరిచూడరాని ప్రకాశముతో నద్భుతముగా స్వామి యుపన్యసించెను. ఇంత గంభీరముగా నుపన్యసించి స్వామి లోనికి వచ్చెను. వారి వెనుకనే వచ్చిన శారదానందస్వామి ఒక గ్లాసెడునీరు గటగట త్రావెను. స్వామి తన వెంటనున్న స్టర్డీ మహాశయుని ముల్లరుకన్యను చూచి 'ఈ తమాషా చూడుడు. ఉపన్యసించినది నేను కాగా ఇతనికి దాహము వేసినది' అని యాశ్చర్యపడుచు మరల నెల్లరను నవ్వింపసాగెను.

చిన్ననాటి సద్యస్స్ఫూర్తియు స్వామియందు వర్ధిల్లినది. ఒక స్కాచ్‌మన్ తన తెలివిని ప్రదర్శించుచు "స్వామీ బాబూకును బాబూనుకును భేదమేమి" యని ప్రశ్నించెను. బెంగాలీ బాబులకును బాబూనులకును (పెద్ద కోతులు) భేదము లేదని యతని వ్యంగ్యము. స్వామియు నిదానముగా "పెద్ద తేడా ఏమియు లేదు. స్కాట్ (Scot) కు సాట్ (Sot) కు గల భేదమే. ఒక యక్షరము" అని ప్రత్యుత్తరమిచ్చెను. స్కాట్‌లు (స్కాచ్‌మన్) సాట్‌లు (త్రాగుబోతులు) ఒకటే యని స్వామి చెణుకు.

ఒక పర్యాయము హోమ్ ఆఫ్ ట్రూత్ సంస్థ స్వామిని విందున కాహ్వానించెను. అచ్చట పొగత్రాగుట నిషిద్ధము. స్వామి కిది తెలియక తన పైపు తీసి యంటించి పొగపీల్చసాగెను. తక్కిన యతిథులు ఇట్టి నియమోల్లంఘనమునకు దిగ్భ్రాంతులైరి. ఇంతలో సంస్థకార్యదర్శిని యటకు వచ్చి స్వామి పొగపీల్చుటను చూచి మండిపడెను. "మనుష్యుడు పొగ త్రాగుట సహజమే యైనచో దేవుడు వాని తలపై పొగగొట్టము నమర్చడా" యని క్రోధావేశముతో బలుక స్వామి యనునయముగా నవ్వుచు "కాని పైపును కనిపెట్టగల మెదడు నమర్చెను గదా" యని చమత్కరించెను. కార్యదర్శినిసహితముగా నెల్లరును గొల్లుమని నవ్వగా ఆ ప్రమాదకర సన్నివేశము హాస్య సన్నివేశముగా మారిపోయెను.

తమ మిత్రులను నవ్వించుటకై స్వామి ఎన్నియో హాస్యకథలను చెప్పెడివాడు. వానిని మరియొకసారి ముచ్చటించుకొందము

# యోగసారబోధిని–19

## శ్రీ జ్ఞానేశ్వరానందస్వామి

ఇష్టదేవత జన్మజన్మములందును అనుస్యూతముగా వచ్చునని నమ్మిక. కనుకనే భక్తుని ఇష్టదేవతను నిర్ణయించుటకు గురువుయొక్క ఆవశ్యకత యేర్పడును. గురువే భక్తుని ఇష్టదేవతను కనుగొని తనను నోరార పిలుచుటకు నామమంత్రము నొకదాని నుపదేశించును. పిదప భక్తుడు భక్తిశ్రద్ధలతో ఇష్టదేవతా మంత్రమును పునశ్చరణ చేయును. ఇట్లు మంత్రజపము చేయుకొలది భక్తున కెన్నియో విషయములు గోచరించును. అత్యున్నతమగు నాత్మానుభూతి క్రమముగా నతనికి సులభసాధ్యమగుచుండును. ఉదాహరణకు: నీ రత్నమంజూష యొకటి సముద్రములో బడిపోయినదనుకొనుము. దాని నెట్లు కనుగొందువు? నీ వలనకాదు. దానిని కనుగొనవలె నను ఉత్కంఠ నీలో నిజముగా నేర్పడగానే గురువు

తనంతట తానే వచ్చును. అత డిట్టి కనుకొని నటయందు నిపుణుడు. సాగరములోనికి దూకి అతడు రత్నమంజూషను వెదకి దాని కొక గొలుసును తగిలించును. అందుండి వెలువడి గొలుసు రెండవ చివరను నీ కిచ్చును. "లాగుచునే యుండుము, నీ మంజూషను పొందగలవు" అని యతని యుపదేశము. మంత్రమును పునశ్చరణ చేయుటవలన, అనగా గొలుసులోని కొక్కెముల నొక్కొక్కటిగా లాగుటవలన ఆత్మానుభూతియను రత్నమంజూష నీకు క్రమముగా సన్నిహిత మగును. అట్లింతకాలము లాగవలెనో నీకు తెలియదు. కాని భక్తిశ్రద్ధలతో గాఢమగు ప్రీతితో మరు నటి కొక్కెమే చివరిదేమో యను నాశతో నీవు కొక్కెములను లాగుచునే యుండుదువు.

శిష్యుని ఇష్టదేవతను నిర్ణయించుటకు గురువు అతని పూర్వసంస్కారములను గమనించును. అతని సహజగుణములను చూచును. శిష్యునితో సంప్రదించియు, పరీక్షించియు, ధ్యానము చేసియు గురువు శిష్యునికి తగిన ఇష్టదేవతను కనుగొనును.

ఇష్టదేవతపట్ల ఏకాగ్రమగు భక్తి భక్తున కత్యంతావశ్యకము. దీనినే ఇష్టనిష్ఠ యందుము. వేదాంతము పాండిత్యము హేతువాదము తర్కము మొదలగున వన్నియు ఏనుగునకు దంతములవలె ఆత్మరక్షణార్థము, అలంకారార్థమును మాత్రమే. ఏనుగునకు తన పలువరుస, ఆహారమును నమలి జీర్ణించుకొనుటకును తద్వారా ఆత్మపోషణము చేసికొనుటకును ఎట్లుపయోగించునో అట్లే భక్తున కిష్టనిష్ఠయు తన పారమార్థిక చింతనను పోషించి బలిష్ఠము చేసికొనుట కుపయోగపడును. వేదాంతమును పాండిత్యమును తప్పక సంపాదించుకొనవలసినదే. వానినిగూర్చి గర్వింపవలసినదే. కాని జీవనపరమార్థము ఆత్మతత్త్వమును బలవత్తరము చేయుటయే యని మాత్రము మరువకుము.

# పరిప్రశ్న

(7-4-72 వ తేది శ్రీ రామకృష్ణమఠము, మద్రాసునకు విచ్చేసిన (Chapman College) (U. S. A.)—World Campus Afloat అమెరికా విద్యార్థుల శ్రీమత్తపస్యానందస్వాముల తోడి ప్రశ్నోత్తరము లిందు పొందుపరుపబడినవి.)

ప్రశ్న : తమ మఠమునందలి పూజామందిరమున ఇతరదైవములకు బదులుగా, శ్రీరామకృష్ణుల ఛాయాచిత్రము నుంచుట ఏల?

బదులు : ఈ మఠపు పూజామందిరములు సన్న్యాసుల దేవాలయములు. ముఖ్యముగా సంస్థయందలి సన్న్యాససభ్యులకొఱకును, శ్రీరామకృష్ణు నొక అవతారపురుషునిగా ఆరాధించువారికొఱకును ఉద్దేశింపబడినవి. 19 వ శతాబ్దమున ఒక ఏసుక్రీస్తు ఉండగలుగుట పలువురికి వింతగా నున్నను, ఏసుక్రీస్తువలె శ్రీరామకృష్ణుడు తన అనుచరులచే ఒక అవతారమూర్తిగా పరిగణింపబడుచున్నాడు. అట్టి పురుషునకు దివ్యగౌరవము నర్పించుటలో వింత ఏమియు లేదు.

హిందూమతము ప్రకృతికిని, పరమప్రకృతికిని (Super Nature) పూర్ణవిభేదము పాటింపదు. పరమపురుషుని శక్తియొక్క వ్యక్తీకరణమే ఈ ప్రకృతియంతయు. ప్రకృతియందలి ఎద్దానినైనను దైవచిహ్నముగా గ్రహించి, భగవ

త్సాన్నిధ్యమును అం దావాహ్వానించి సమంత్రక ముగా ప్రతిష్ఠింపజేసి పూజింపవచ్చును. ఇట్టి చిహ్నము లన్నిటియందును ఉత్తమోత్తమము, సహజతమము నగు చిహ్నమే దయా ప్రపూర్ణుడు, అమితపరిశుద్ధుడు, ప్రేమజ్ఞానములు గల ఒక సత్పురుషుడు. శ్రీరామకృష్ణుడు తన బోధామృతమున పేర్కొనినట్లు సత్పురుషుని హృదయము భగవంతుని దర్శనగృహము. (ఇందలి భావ మేమన ఒక భవనమునకు వెళ్లి ఆ ఇంటి యజమానితో కలిసి మాట్లాడదలచిన యొకడు, ఆ యజమానికై వేఱు స్థలములందు గాక, ఆతని దర్శనగృహముననే వేచియుండి కలిసికొనునట్లు, ప్రకృతియం దెచ్చటనైనను భగవంతుని వ్యక్తీకరించుకొన సాధ్యమైనను, సత్పురుషుని హృదయమున నాతడు వ్యక్తతముడై యుండును. కాబట్టి భగవంతునికొఱకచ్చటనే వెదుకవలెను.) ప్రధానముగా సత్పురుషు డొకడు ఒకరి ఆధ్యాత్మిక గురువైనచో, హిందూధర్మము ప్రకారము, శిష్యుడాయనను దేవునితో సమానముగా చూడవలయును. మఱి గురువు ఒక సాధారణ గురువుగా గాక, సర్వులకును గురువుగా, జగద్గురువుగా, అవతారమూర్తిగా నుండ తటస్థించినచో, ఆయనకు వినీతులగు వారందరికిని, ఆతడు ఆరాధ్యదైవ మగుచున్నాడు. శ్రీరామకృష్ణుడు ఒక సాధారణాధ్యాత్మిక గురువునకును, జగద్గురువునకును గల భేదమును వెదురుబొంగునకు, స్టీమరునకు గల భేదముతో పోల్చుచున్నాడు. ఒక వెదురుబొంగుతో ఒకడు మాత్రము నదిని దాటగల్గును. మఱి స్టీమరునందైననో, పెక్కుమంది సర్వకాలములందును నదిని దాటవచ్చును. శ్రీరాముడు, శ్రీకృష్ణుడు, బుద్ధభగవానుడు, ఏసుక్రీస్తు, శ్రీరామకృష్ణుడు మున్నగు అవతారమూర్తులు మానవుల ముక్తి కట్టి సాధనములు. దివ్యానుగ్రహము, విమోచకప్రేమలకు వారు వ్యక్తీభావములు. కాబట్టి మనము భగవంతుని గుర్తించి, పూజింపనగు ఉన్నతోత్తమ చిహ్నములుగా వారు నిలిచియున్నారు. శ్రీరామకృష్ణుల అనుయాయులు ఆయనను ఒక వ్యక్తికి గురువుగా గాక, జగద్గురువుగా స్వీకరించుటచే, మేము ఆయనను సాక్షాదవతారమూర్తిగా, పూజార్హుడుగా చూతుము. మఱియు శ్రీరామకృష్ణునకు తన ఆధ్యాత్మికసాధనల ప్రగతియందు ఒక విశిష్టమైన ఆధ్యాత్మికానుభవము కలిగినది. హిందూమతములోని శాఖలగు వైష్ణవ, శైవ, శాక్తమతముల ఆధ్యాత్మికసాధనల నన్నిటిని ఆయన అనుష్ఠించెను. క్రైస్తవ, ఇస్లాము మతములకు చెందిన ధ్యానములకూడ ననుష్ఠించెను. ఇట్టి సర్వమతానుష్ఠానము తుట్టతుదను, ఆయన కొలిచిన దైవస్వరూపములన్నియు, ఆయన దృక్పథమున సాక్షాత్కరించి, తుద కాయనయందే లీనములగుటను గాంచెను. కాబట్టి మానవు లారాధించిన సర్వేశ్వరుని సర్వస్వరూపములు, భావము లన్నియు ఆయనలో మూర్తీభవించి యున్నవి. అందువలననే మానవు లందరికిని, వారేదైవముల నారాధించుచున్నను, వారి కతడు ఆరాధ్యదైవ చిహ్న మగుచున్నాడు. ఉండు దైవ మొక్కటే. ఆ సర్వేశ్వరుడు, శ్రీరామకృష్ణు డాదిగా గల ఆతని స్వరూపములు, అన్నియు, భక్తుడు తన ముందున్న అనంతము, సర్వవ్యాప్తము, మనోహరము నగు దివ్యతనుగాంచుటకు కిటికీల వంటివి.

# వార్తలు - విశేషాలు

## మాతృశ్రీ శారదాదేవి 122-వ జన్మదినోత్సవము

పవిత్రమాత శ్రీ శారదాదేవి 122-వ జన్మదినోత్సవము మద్రాసు శ్రీ రామకృష్ణ మఠమున భక్త్యుత్సాహములతో జరుపబడెను. 4-1-1975 శనివారమునాడు ఉదయము 5 గంటలకు మంగళహారతితో తిథిపూజ ప్రారంభ మయ్యెను. ఈ పవిత్ర మహోత్సవమున కనుగుణముగ మఠావరణమంతయు మంగళతోరణములతో నలంకరింపబడెను. నాదస్వరసమ్మేళనమును దేవాలయమునందలి మంగళహారతియు ఉత్సవోత్సాహమును ఇనుమడింప జేసెను. భక్తుల భజనకీర్తనలు ప్రాంగణ మంతయు మఠావరణమును భక్తిపూరితము గావించెను. దేవాలయమున తిథిపూజ బ్రహ్మాండముగ జరిగెను. మఠావరణమున ఉన్న ఆసనమున గంభీరముగ నలంకరింపబడిన పవిత్రమాత శ్రీ శ్రీ శారదామణిదేవి పటము ముందు మధ్యాహ్నము హోమము వేల్వ బడెను. ఉత్సవమున పాల్గొనిన భక్తుల కెల్లరకు ప్రసాదము పంచిపెట్టబడెను.

సాయంకాలము హారతి తరువాత అసంఖ్యాక భక్తసమూహములు మాతృశ్రీ జీవితమును గూర్చియు, సందేశమును గూర్చియు రెండుపన్యాసముల శ్రవణభాగ్యమును బడసెను. శ్రీమత్ శ్రీరంగానందస్వాములవారు తమిళమున ఉపన్యసించిరి. శ్రీవారు మాతృదేవి శిశూచితామాయికత్వమును, నిష్కాపట్యమును సూచించు సంఘటనలను ఆమె వాత్సల్యమును, అనుగ్రహమును, మాతృత్వమును స్పష్టముచేయు సంఘటనలను వివరించిరి. శ్రీమత్ తపస్యానందస్వాములవారు ఆంగ్లమున విరివిగా నుపన్యసించిరి. మూర్తిదాల్చిన మాతృదేవి నిష్కాపట్యము, నిరాడంబరత్వము, ఆధ్యాత్మికమహత్త్వము మున్నగు సుగుణములను సోదాహరణముగను విపులముగను వివరించిరి

5-1-1975 ఆదివారమునాడు బహిరంగోత్సవము జరుపబడెను. బ్రహ్మశ్రీ చిత్తూరు వీ. అప్పన్న భాగవతులుగారు శ్రీ త్యాగరాజ స్వాములవారి జీవితమును హరికథగా జెప్పిరి. అనంతరము శ్రీ శారదా భజనమండలివారు ఒకగంటసేపు భక్తిరంజకమగు తమ గానముతో ప్రేక్షకులను తన్మయులగావించిరి.

నాటి బహిరంగసభకు శ్రీమత్ తపస్యానందస్వాములవారు ధ్యక్షము వహించిరి. శ్రీ శారదాదేవి జన్మదిన సారస్వత పోటీపరీక్షలయందు గెలుపొందిన బాలికలకు పుస్తకములు బహూకరించిరి. ఉపన్యాసప్రారంభమున శ్రీ అమృతానందస్వాములవారు వేద పారాయణము గావించిరి.

డాక్టరు కే. శ్రీనివాస అయ్యంగారు శ్రీ శారదాదేవి జీవిత వైభవమును మనోజ్ఞతను గూర్చి విపులముగ ఆంగ్లమున నుపన్యసించిరి. వారి ఉపన్యాస సారాంశము: మాతృశ్రీ శారదాదేవి వాత్సల్యము సమస్త ప్రపంచ పరిరంభణసమర్థము. ఆమె సమస్త ప్రజానీకమును తన అనుగ్రహభాగ్యమునకు గురిచేసినది. ఆమె దైవికముగను, భౌతికముగను ఎల్లరకును తల్లియే. భారతదేశమున స్త్రీ మాతృమూర్తియే; భగవానుడుగూడ మాతృమూర్తియే. శిశువునకు ప్రప్రథమమును ఉత్తమోత్తమమునగు గురువు తల్లియే. అనంత ప్రేమకును పరిపూర్ణత్వమునకును ఆమె పెట్టినది పేరు. భగవంతునియందలి మాతృభావము ఆధ్యాత్మిక ప్రభావోద్దీపనము. మాతృపదాబ్జ ధ్యానము గొప్ప ఆధ్యాత్మికసాధన. మానవ రూపము దాల్చిన పరాశక్తియే శ్రీ శారదా

దేవి. వివిధరంగములందు ఆమె జీవించిన జీవనము — గ్రామీణ గృహస్థజీవనము, భర్తృసంసేవనము, గురుదేవుని యనంతరము ఆయన లోకసంగ్రహకార్యదీక్ష — ఈ సమస్తము — నిజముగా ఇతిహాసమే. శ్రీ రామకృష్ణ గురుదేవుని ఆధ్యాత్మిక సంతానమునకు ఆమె నిజముగా మాతృమూర్తియే. ఆమెకును దీక్ష నందినవారును దీక్షారహితులును నగు శిష్యప్రశిష్యులు — పుత్రపౌత్రులు అసంఖ్యాకులు గలరు. వారెల్లరును ఆ దేవి యనుగ్రహమునకు పాత్రులే. మహాసాధ్వియు, పుణ్యస్వరూపిణియు అగు ఆమె పవిత్రతాపరావతారమే. శ్రీ మాతృదేవి జీవితోపదేశములు మనకు ఆధ్యాత్మికపథమున నిర్భయత్వమును సౌభాగ్యమును గలిగింపగలవు.

పిమ్మట శ్రీమతి కోకిలా కాలహస్తిగారు తమిళమున నుపన్యసించిరి. ఆమె యిట్లు వివరించిరి శారదాదేవి క్షమాస్వరూపిణియయిన సీతాదేవి నిస్మరణకు దెచ్చును. ఆమె యెట్టి అమానుష సూచకక్రియలను ఒనర్పలేదు; భారతదేశపు సామాన్య స్త్రీవలె జీవించెను. కాని ఉన్నతోన్నతమును ఉదాత్తమును నగు అనుగ్రహమును వర్షింపగల ఉచ్చస్థితి నందుకొనగలిగెను. సాధ్వీమణులకెల్ల సాధ్వియయ్యు ఆమె సన్న్యాసినియై జీవించెను. బాధ్యతవహించిన గృహిణియయ్యు ఆదర్శవంతమగు త్యాగవైరాగ్యమూర్తి. నిరక్షరాస్యయయ్యు ఆధ్యాత్మికవిషయములయందు కూలంకషప్రజ్ఞగల ధీనిధి. అత్యంత ఉదారహృదయ. సనాతన అధునాతనయుగములు రెండును ఆమెయందు సమైక్యమందెను. 'పవిత్రమాత' అన్న సమాసమే ఆమె గుణగణములను మహత్త్వమును వెల్లడించుచున్నది. రూపుదాల్చిన త్రికరణశుద్ధియే ఆమె. జాలిగుండె గలిగినదయ్యు నామె అవసరము కలిగినపుడు శౌర్యమును ప్రదర్శించి మించెను. పరుషవాక్కు ఒక్కటయినను ఆమె వదనమునుండి వెలువడలేదు. తన అవసరముల నయితము మానుకొనియు ఇబ్బందులకు లోనయ్యు ఆమె యితరుల క్షేమసౌభాగ్యముల నిమిత్తము పరిశ్రమించెడిది. ఇతరులయెడ దోషారోపణముచేయుట ఆమె శీలమునకు విరుద్ధము. కాలకంఠునివలె పాపుల పాపహాలాహాలమును ఆమె గ్రహించి భరింపగలదు. శ్రీ గురుదేవుడు ఆమెయందు ఆనందమయియగు జగన్మాతను సాక్షాత్కరించుకొనెను. భౌతికసంతానరహితయయ్యు ఆమె వేలకొలది ఆధ్యాత్మిక సంతానమును గన్న తల్లి. ఆమెను జూచిన "దొంగనాయన, దొంగతల్లి" వలె ఆమె సమక్షమున దౌష్ట్యము తన కఠోర స్వభావమును మార్దవము గావించుకొనును.

శ్రీమత్ తపస్యానందస్వాములవారు తమ అంతిమోపన్యాసమున శ్రీ రామకృష్ణ గురుదేవునియందు మాతృభావము ప్రస్ఫుటమయిన విధమును, అవతారము ప్రేమకును శక్తికిని కేంద్రమగు విధమును వివరించిరి. మరియు నిట్లు ప్రవచించిరి : ఈ ప్రపంచమున మాతృశ్రీ జీవించిన పవిత్రజీవనము మానవస్మృతిపథమునకు ఉత్సాహప్రదమై భాసిల్లుచున్నది. ఈ ఉత్సాహము ఉత్తరోత్తర సుస్థిరము కాగలదు.

ఆ రాత్రి శ్రీ రామకృష్ణమఠ భజనబృందము వారిచే భగవన్నామ సంకీర్తనము గావింపబడెను.

సంపాదకులు: శ్రీ చిద్ఘనానందస్వామి.

శ్రీ ఎస్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-600021) న ముద్రింపబడి,

శ్రీ చిద్ఘనానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మద్రాసు-600004) నుండి ప్రచురింపబడినది.

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౩౧ ౧౯౭౫ - మార్చి : ఆనంద - ఫాల్గుణము సంచిక ౯

## విషయసూచిక

'అఖిలవిభు శరణొందుము, యా క్షణంబ యతనికృప నీదు ననుభూతి కందు వత్స'

—శ్రీ శారదామణి.

# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౩౧ } ౧౯౭౫ - మార్చి : : ఆనంద - ఫాల్గునము { సంచిక ౯

ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ!

## ప్రార్థన

## శ్రీరామకృష్ణ కర్ణామృతము

శ్లో॥ అజ్ఞానశార్వరహరో విషయోన్ముఖానాం। స్నేహామృతాశనరతో నిజసేవకానాం
నిర్భాసకో నిఖిలయోగమహాపథానాం। దేదీప్యతే భువి గదాధర ధర్మదీపః॥

తే. గీ. వివిధవిషయోన్ముఖాజ్ఞాన విస్తృత తిమి, రాపహము। సర్వయోగమహాపథోజ్జ్వ
లనము। సేవకస్నేహతైలమున వెలయు, వరగదాధర ధర్మదీపంబు ధరణి.

వ్యాఖ్య :- ఉత్తమోత్తమమయిన గదాధర ధర్మదీపము ఈ ప్రపంచమున వెలుగుచున్నది. అది వివిధవిషయోన్ముఖులయిన లౌకికుల హృదయముల నావరించియున్న అజ్ఞానమను మహాంధకారమును పటాపంచలుచేయును. స్వీయసేవకజనస్నేహమను తైలమున ప్రజ్వలించుచు (జీవబ్రహ్మైక్యసంధానసమర్థములగు) సకల యోగమార్గముల నెడి రాచబాటలను ప్రకాశవంతముగ జేయుచున్నది.

శ్లో॥ నిష్కృష్టతత్త్వ మఖిలోపనిషద్గణానాం। నిష్కించనప్రియ మహేతుకృపానికేతం
నిష్కల్మషం భవవినాశి గదాధరాఖ్య। ముత్కృష్యతే భువనమంగళ ధర్మదైవం॥

తే. గీ. ఉపనిషత్తత్త్వసర్వస్వ మురువిరాగి, జనమహాప్రియ మమలము సకలభువన
పావనంబు నిర్హేతు కృపానికేత, మవరపాపహరంబును భవహరంబు
వరగదాధర ధర్మదైవంబుఁ గొలుతు। (పంచపది)

వ్యాఖ్య :- రూపుదాల్చిన ధర్మదైవమును, సకలభువనములకును మంగళము కలిగించువాడును, సర్వోపనిషత్తుల సారసర్వస్వమును, పరమవిరాగులకు మిక్కిలి ప్రియుడును, అకారణ దయాసింధువును, నిర్మలుడును, పాపములను పరిహరించువాడును, భవహరుడును అగు శ్రీ గదాధరుని సేవింతును.

# శ్రీ గురుసూక్తిసుధ

ఒక భక్తుని ప్రశ్న: భగవంతుడు సాకారుడా లేక నిరాకారుడా?

శ్రీరామకృష్ణులు: భగవంతుడు సాకారుడు అంతేగాక నిరాకారుడును. ఒకప్పుడొక సన్న్యాసి జగన్నాథాలయమునందు ప్రవేశించెను. ఆ పావనభగవన్మూర్తిని చూచుచు, భగవంతుడు సాకారుడా నిరాకారుడా యని తనలో తర్కించుకొనెను. తన దండము విగ్రహమును తాకునేమో చూచుటకు దండమును ఎడమప్రక్కనుండి కుడిప్రక్కకు చాపెను. దండమున కేమియు తగులలేదు. తనముందు ఏ మూర్తియు లేదని తెలిసికొని, అతడు భగవంతుడు నిరాకారుడని నిశ్చయించుకొనెను. ఆపిదప దండమును కుడినుండి ఎడమకు చాపెను. అది విగ్రహమునకు తగిలెను. భగవంతుడు సాకారుడని ఇప్పుడు ఆ సన్న్యాసి తెలిసికొనెను.

కాని దీనిని తెలిసికొనుట మిక్కిలి కష్టము. సహజముగనే మనస్సునందనుమానము కలుగును: భగవంతుడు నిరాకారుడైనచో అతనికి రూప ముండుట ఎట్లు? అందుపై అతడు సాకారుడైనచో ఇన్ని యాకారము లేల?

డాక్టర్ సర్కార్: భగవంతుడు ప్రపంచమున నిన్ని యాకారములను సృజించెను. అందువలన ఆయనకును ఆకారము గలదు. అట్లే ఆయన మనస్సును సృజించెను. కనుక ఆయన నిరాకారుడు. సర్వమును అగుట భగవంతునకు సాధ్యమే.

శ్రీరామకృష్ణులు: ఈ విషయములు భగవత్సాక్షాత్కార మగువఱకు స్పష్టములు కావు. తన భక్తుల నిమిత్తమై అతడు వివిధ రూపముల దాల్చును, పలురకములుగా సాక్షాత్కరించును. ఒకడు ఒక తొట్టియందు ఒక అద్దకపు ద్రావకము నుంచెను. తమ వస్త్రములకు రంగు వేయించుకొనుటకు అతని కడకు చాలమంది వచ్చిరి. అతడొకని నడుగును: నీ వస్త్రమున కే రంగు వేయు మందువు? బేరగానికి ఎఱుపురంగు కావలసినచో అతడు వస్త్రమును తొట్టియందు ముంచి "ఇదుగో ఎఱ్ఱరంగు వేయబడిన నీ వస్త్రము" అనును. ఇంకొక బేరగాడు తన వస్త్రమునకు పసుపుపచ్చ రంగు కోరినచో అతడా వస్త్రమును ఆ తొట్టియందే ముంచి "ఇదుగో పసుపుపచ్చని రంగు వేయబడిన నీ వస్త్రము" అనును. మరియొకడు తన వస్త్రమునకు నీలవర్ణము కోరినచో దానిని ఆ తొట్టియందే ముంచి "ఇదిగో నీలవర్ణము వేయబడిన నీ వస్త్రము" అనును. అట్లు అన్ని గుడ్డలను ఒకే తొట్టియందు ముంచుచు తన బేరగాండ్ర వస్త్రముల కతడు భిన్నవిభిన్న వర్ణముల నద్దుచుండెను. ఒక బేరగాడు దీనినంతయు నాశ్చర్యముతో గమనించెను. అద్దకపువాడు అతని నడిగెను. "ఏమి? నీ వస్త్రమున కే రంగు కావలెను?" బేరగా డిట్లనెను. "అన్నా నీ తొట్టియందే రంగు గలదో నా వస్త్రమున కా రంగు వేయుము."

ఒకప్పు డొకడు అడవిలోనికి బోయి చెట్టుమీద నొక యందమైన ప్రాణిని చూచెను. తరువాత నతడు దానిగూర్చి తన మిత్రునకు చెప్పెను. "సోదరా అడవిలో నొకానొక చెట్టుమీద నే నొక ఎఱ్ఱని ప్రాణిని చూచితిని." మిత్రు డిట్లు ప్రత్యుత్తర మిచ్చెను. "నేను కూడ దానిని చూచితిని. దాని నెఱు పందు వేల? అది ఆకుపచ్చగ నున్నది." తృతీయు డిట్లనెను. "అయ్యో! కాదు కాదు! దాని నాకుపచ్చ యందువేమి? అది పసుపుపచ్చగ నున్నది." ఇక ఇతరులు ఆ జంతువును ఊదా

యనియు నీల మనియు నలుపనియు అనేక విధములుగ వర్ణింపసాగిరి. త్వరలోనే వారందరు రంగునుగూర్చి వివాదపడసాగిరి. చివరకు వారా చెట్టును చేరబోయి, దానిక్రింద కూర్చుండియున్న పురుషు నొకనిని చూచిరి. వారి ప్రశ్నల కాతడిట్లు సమాధానము చెప్పెను. "నే నీ చెట్టుక్రిందనే నివసింతును. ఆ ప్రాణిని బాగుగా నెఱుగుదును. దానిగూర్చి మీలో ప్రతియొక్కరు చెప్పినదియు సత్యమే. ఒకప్పు డది ఎఱ్ఱగ నుండును. మరియొకప్పుడు ఆకుపచ్చగ మరియొకప్పుడు పసుపుపచ్చగ ఇంకొకప్పుడు నీలముగ వివిధ వర్ణములతో నుండును. అంతియకాక కొన్నిసార్లు దాని కే వర్ణమును లేకుండుటనుకూడ చూతును."

భగవంతునిగూర్చి నిరంతరముగ చింతించువాడే అతని నిజస్వరూపమును తెలిసికొనగలడు. వివిధరూపములతో వివిధరీతులలో భగవంతుడు సాక్షాత్కరించు ననియు, గుణములున్న వనియు అట్లే ఏ గుణములును లేవనియు, అతనికిమాత్రమే తెలియును. ఆ చెట్టుక్రింద నివసించు మానవునకుమాత్రమే ఊసరవెల్లి ఎన్నియో రంగులు దాల్పగలదనియు ఒకానొక్కప్పుడు ఏ రంగును లేకుండు ననియు తెలియును. ఇతరులు పూర్ణసత్యము తెలియక పోవుటచేత తమలోతాము వివాదపడి బాధపడుదురు.

అవును. భగవంతుడు సాకారుడు. అట్లే నిరాకారుడును. అది ఎట్లో తెలియునా? బ్రహ్మము, నిర్వికారసచ్చిదానందము, అపార సాగరము వంటిది. సముద్రమునందు అచ్చటచ్చట శైత్యతీవ్రతచే నేర్పడిన మంచుగడ్డలు కన్పించును. అట్లే దాని యారాధకుల భక్తి యను శైత్యప్రభావముచేత అనంతము సాంతముగ మారి సాకారబ్రహ్మముగ సాధకుని మ్రోల ప్రత్యక్ష మగును. అనగా భగవంతుడు తన భక్తులకు మూర్తిమంతుడై సాక్షాత్కరించును. సూర్యోదయము కాగనే సముద్రమునందలి మంచు కరిగిపోయినట్లే జ్ఞానోదయము కాగనే మూర్తిమంతుడైన భగవంతుడు మరల అనంతము నిరాకారము అగు బ్రహ్మములోనికి కరిగిపోవును.

డాక్టర్: అవును. ప్రొద్దెక్కగనే మంచు కరుగును. మీదుమిక్కిలి సూర్యుని తాపము నీటిని కనుపింపని యావిరిగా మార్చును.

శ్రీరామకృష్ణులు: అవును. అది నిజమే. బ్రహ్మము మాత్రమే సత్యము. జగము మిథ్య అను వివేచన ఫలితముగా సాధకుడు సమాధిగతు డగును. అప్పుడు అతనికి భగవంతుని రూపములు గుణములు పూర్తిగ నదృశ్యమగును. అప్పు డతడు భగవంతు నొక వ్యక్తిగా భావింపడు. అప్పు డతడు భగవంతుడన నేమో మాటలలో వర్ణింపజాలడు. దానిని వర్ణించువా డెవడు? ఎవడు వర్ణింపవలెనో అతడు లేనేలేడు– అతడు ఇక తన "నేను"ను కనుగొనజాలడు. అట్టి వ్యక్తికి బ్రహ్మము నిర్గుణము. అట్టి స్థితిలో, మానవుని గహనాంతఃకరణములో, భగవంతుడు 'చిత్తు'గ మాత్రమే అనుభూతు డగుచున్నాడు. అతడు మనస్సునకును బుద్ధికిని గోచరుడు కాడు.

కనుక, జనులు భగవద్భక్తిని చంద్రుని కాంతితోను, జ్ఞానమును సూర్యుని తీక్ష్ణకిరణములతోను పోల్తురు. ఉత్తరధ్రువమునందును దక్షిణధ్రువమునందును సముద్రములు గలవని వినియున్నాను. అచ్చట సముద్రమును గడ్డకట్టించు చలిగాలులు వీచును. అచ్చటికి ఓడలు పోజాలవు. అవి మంచుగడ్డలచే నడ్డగింపబడును.

# శ్రీ రామకృష్ణ జగద్గురువరేణ్యుడు

కేశవ బ్రహ్మచారి

''శ్రీరామకృష్ణుల జీవితము వారి యుపదేశములకంటెను సహస్రగుణాధికముగా ఉపనిషత్తులపై సజీవ భాష్యము; మానవరూపము దాల్చిన ఉపనిషత్సారమే యాతడని చెప్పనోపును. అట్టి నిరుపమాన పరిపూర్ణత, సర్వజీవులపైనను ప్రసరించునట్టి అద్భుతమైనదయ, సంసారబద్ధులగు మానవులయందు అట్టి గాఢ సానుభూతియు ఈ ప్రపంచమున మరెచ్చటను గానరావు......ప్రాచ్య, పాశ్చాత్య నాగరికతాసమ్మేళనమును గొనివచ్చుటకే వారు ఆవిర్భవించినది. గడచిన అనేకశతాబ్దములందు ఇంతటి మహనీయుని — ఇట్టి యద్భుతధర్మసమన్వయాచార్యుని — భారతమాత కనియుండ లేదు......ఈ నవయుగధర్మము ప్రపంచమున కంతకును - ముఖ్యముగా భారతదేశమునకు-విశేషకల్యాణహేతుభూతము; ఈ నవయుగధర్మప్రవర్తకుడగు శ్రీరామకృష్ణ భగవానుడు ప్రాచీనమతస్థాపనాచార్యుల పునస్సంస్కృతమూర్తి!

ఋషులును అవతారమూర్తులును నిజముగా దేనిని బోధింపనెంచిరో, ఆ తత్త్వముల నన్నిటిని వీరు తమ జీవితమున, అనుభవపూర్వకముగా ప్రకటించిరి. ఈ పురుషుడు తన ఏబదియేండ్లలోనే పంచసహస్రవర్ష పర్యంతమగు భారతజాతీయ పారమార్థికజీవనము నంతయు జీవించి భావిసంతతికి ఆదర్శమై యొప్పెను''—అని వారి శిష్యులలో అగ్రగణ్యుడగు శ్రీ వివేకానంద స్వామి లోకమునకు మేలుకొలుపులనదగు తన లేఖలలో వ్రాసియున్నాడు.

ఇట్టి శ్రీ రామకృష్ణ భగవానుడు సాక్షాత్ జగద్గురువే! ఆయనజీవితమును పరిశీలించినచో, ఆయనయందు సద్గురువరేణ్యుని లక్షణములు పొడగట్టును. బాలసూర్యునిబోలు నాతని దివ్యమూర్తి, ఆయన ప్రేమమయ ప్రవర్తనము, ఆయన ధీవైభవము జనుల నద్భుతరీతి నాకర్షించెను. ఆయన లౌకికవిద్యల నభ్యసింపలేదు. కాని ఆయన ధారణాశక్తియు, అసమాన ధీవైభవమును ఈ లోటును పూర్తిగా దీర్చివేసినవి. పండితులచే జరుపబడు పురాణ పఠనములను, శాస్త్రవ్యాఖ్యానములను నాతడాలకించి భారతీయవిజ్ఞానఖనులగు భారత, భాగవతాది గ్రంథములసారమును పూర్తిగా గ్రోలెను. జీవుల స్వభావవర్తనములను పరిశీలించి — ప్రకృతియను గ్రంథము నాతడు ఆమూలాగ్రముగా పఠించి, యందలి తత్త్వమును కరతలామలక మొనర్చుకొనెను.

అనేకులకు ఈ బాలశుకుని పలుకులు జ్ఞానప్రదీపకములై భాసించెను. కాలక్రమేణ ఈ శక్తి వికసింపసాగెను. దక్షిణేశ్వరాలయ నిర్వాహకర్తలగు రాసమణీ, మథురనాథుల యెడ ఆయ నెన్నడును సేవకభావము వహింపలేదు. సరికదా, సామాన్య బహిఃప్రజ్ఞయందు వారి యాప్తుడుగను, దివ్యభావములందు ఇలవేలుపుగను వర్తించెను. ఆయనకు బోధింప వచ్చిన గురువులు ఆతనికి నేర్పిన దానికంటె, వారే విశేషము నేర్చుకొని వెడలిరి. భైరవీ బ్రాహ్మణి యాతని సాంగత్యముచే తన శీలమునందలి లోపముల సవరించుకొని యఖండవైరాగ్యము నలవరచుకొనెను. ఆయన కద్వైత జ్ఞానము నుపదేశించిన తోతాపురియు తనకపూర్వమగు భక్తిరహస్యముల నాతనినుండి గ్రహించెను. మఱియు 1870 వ సం॥న ఆయన మథురనాథునితో తీర్థయాత్రకు వెడలునపుడు అనేకు లాయన సంసర్గమున ధన్యులైరి. విశే

షము – వివిధసాంప్రదాయములకు చెందిన సాధకులును, సన్న్యాసులును వందలకొలది దక్షిణేశ్వరము వచ్చి యాతని దివ్యోపదేశామృతమును గ్రోలసాగిరి. పండితు లాతని వచనసుధ నాస్వాదించి ముగ్ధులైరి. వైష్ణవచరణుడు, పద్మలోచనుడు, నారాయణశాస్త్రి, గౌరీపండితుడు, శశధరతర్కచూడామణి, కేశవచంద్రసేనుడు, ప్రతాపచంద్ర మజుందారు, విజయకృష్ణ గోస్వామి, నాగమహాశయుడు మున్నగు మహనీయులు ఆ యమృతాస్వాదన భాగ్యమును బడసి తన్మయులై శ్రీరామకృష్ణుడు సాక్షాద్భగవదవతారమూర్తి యని భావింపసాగిరి.

శ్రీ రామకృష్ణుని సాధనసమయమున ఆయనను వెదకుకొని వచ్చినభైరవీ బ్రాహ్మణియను మహాయోగిని, ఆయనకు సమస్త తాంత్రికరహస్యముల వెల్లడించెను. అరువదినాలుగు శాక్తేయ తంత్రములందును గల ప్రధానసాధనల నన్నిటిని శ్రీరామకృష్ణు డీమె శిక్షణమున నభ్యసించెను. ఈ సాధనలు సామాన్యసాధకుల కసాధ్యములు; మీదుమిక్కిలి ప్రమాదకరములు. కాని జితేంద్రియచక్రవర్తియు, జగజ్జనని ముద్దులబిడ్డడు నగు శ్రీరామకృష్ణుడు వీని నన్నిటిని అవలీలగా సాధించెను. ఆతని ప్రతిభాతిశయమును గాంచి, ఆ మహాయోగిని, పండితసభాసమక్షమున శ్రీ రామకృష్ణుడు సాక్షాద్భగవదవతారమూర్తి యని శాస్త్రప్రమాణములతో నిరూపించెను.

తర్వాత శ్రీరామకృష్ణు డచిరకాలముననే వైష్ణవసాధనల నన్నిటిని విజయవంతముగా నభ్యసించెను. పిమ్మట అద్వైతవేదాంతియు, యతివరేణ్యుడు నగు శ్రీతోతాపురి, శ్రీరామకృష్ణుల కలిసికొని, ఆయనకు సన్న్యాసదీక్ష నొసగెను. శ్రీతోతాపురి శిక్షణమున ఆయన నిర్గుణ నిరాకారబ్రహ్మధ్యానమున నుత్తీర్ణుడై అఖండ బ్రహ్మసాక్షాత్కారమును బడసెను. ఏఅద్వైత సిద్ధిని పొందుటకు శ్రీతోతాపురి నలుబది సంవత్సరములు కఠినసాధనలు చేయవలసివచ్చెనో, అట్టి నిర్వికల్పసమాధి మూడుదినములలో శ్రీ రామకృష్ణునకు కరతలామలకమయ్యెను. ఎచ్చటైనను మూడుదినములకంటె ఎక్కువగా నిలువని పరివ్రాజకోత్తముడగు శ్రీతోతాపురి శ్రీ రామకృష్ణుని యఖండప్రతిభచే నాకృష్టుడై ఇంచుమించు ఒక సంవత్సరము నాతని సాంగత్యమున గడపెను. ఇట్లే ఇతర మతములగు ఇస్లాము, క్రైస్తవము మున్నగు మతసాధనల సమగ్రముగా నభ్యసించి, అతి స్వల్పకాలమున విజయోపేతుడై, విభిన్నమతము లన్నియు ఒకే లక్ష్యము కలిగియున్నవని అనుభవపూర్వకముగా గ్రహించెను. బ్రహ్మానందతేజము బహువిధముల ప్రకాశితమై సర్వమతసామరస్యమాతనియందు రూపుదాల్చెను. భక్తి, జ్ఞాన, కర్మాది యోగములును, ద్వైతాద్వైత విశిష్టాద్వైతాది మతములును శ్రీరామకృష్ణజీవితమను కుసుమమాలికయందలి వివిధకుసుమరాజములై విలసిల్లెను. అందలి దివ్యసౌరభము దేశమంతటను వ్యాపింప, వారి వచనామృతము నాస్వాదించుటకై ముముక్షుజనసమూహము లరుదెంచెను.

శ్రీరామకృష్ణుల జగద్గురుత్వము బాల్యము నుండియే ప్రారంభమైనను, 1875 వ సం॥న నాతడు బ్రహ్మసమాజనాయకు డగు కేశవ చంద్రసేనుని కలిసికొనిన నాటినుండి, యాతని యుపదేశామృతము లోకమునవిచ్ఛిన్నముగా ప్రవహింపసాగెను. ఆయన అద్వితీయమగు ఔన్నత్యమును, అసమానప్రతిభను గూర్చి కేశవచంద్రసేనుడు తన మహోపన్యాసములచే, రచనములచే లోకమునకు జాటసాగెను. అంతట కలకత్తా పౌరులు, ముఖ్యముగా విద్యార్థికులు

ఆబాలవృద్ధము తీర్థప్రజవలె శ్రీరామకృష్ణ సందర్శనార్థమై రాసాగిరి.

ఇటు లాతనిని దర్శించిన ముముక్షువులలో ననేకులు క్రమముగా నొక భక్తబృందమై వెలసిరి. కాలాంతరమున వీరే శ్రీరామకృష్ణ సందేశమును ప్రపంచము నలుమూలలకును వ్యాపింపజేసిన ధన్యాత్ములు. గృహస్థులు, కామినీకాంచనములం దింకను తగుల్కొనని యువకులు, విద్యార్థులు—ఇటు లీ బృందమున నిరుతెగలవారుండిరి. ఈసమయమున శ్రీవివేకానందస్వామి అనబఱగిన నరేంద్రనాథదత్తు నాయకత్వమున ఈ యువకులే కాలాంతరమున శ్రీ రామకృష్ణాశ్రమసన్న్యాసులై గురుదేవుల దివ్యసందేశమును వ్యాపింపజేసిన యతీంద్రులు. ఈ బాలశిష్యబృందమునందు నరేంద్రుడు శ్రీ రామకృష్ణుల కత్యంతప్రీతిపాత్రుడు, ఈ మహానీయుడే గురుసందేశమును ప్రాక్పశ్చిమఖండములందంతటను వ్యాప్తినొనర్చెను. ఈ మహానీయుడే తన యఖండసేవలచే నవీనభారతదేశమున నూతనోత్తేజమును, నూతనచైతన్యమును ప్రభవింపజేసిన దేశభక్తాగ్రగణ్యుడు.

ఈ భక్తబృందమునకు బోధించుటకై, వారల జీవితవిధానమును మహోన్నతాదర్శదీపిత మొనర్చుటకై—శ్రీరామకృష్ణుడు తన జీవితశేషము నంతయు వినియోగించెను. శిష్యుల కతడు అత్యంతప్రీతిపాత్రుడు. గురుదేవుల యట్టి నిస్వార్థప్రేమయే తమ ఆకర్షణకు కారణమని శ్రీవివేకానందస్వామి పలుకువారు. శిష్యుల కాతడు ఆప్తబంధువు; సన్నిహితమిత్రుడు. ఆయన యెప్పుడును తాను గురువని తలంచి ఎఱుగడు. తన్ను ఎవరైనను గురువని పిలిచినను సహింపడు. తాను కేవలము నిమిత్తమాత్రుడ ననియు, జగజ్జననియే ఈ కార్యముల నన్నిటిని చేయించుచున్నదనియు ఆయన యెఱుగును. జగజ్జననియెడ ఆతని ఇట్టి సంపూర్ణ శరణాగతి వలననే ఆతనియందు ఆచార్యశక్తి అఖండముగా ప్రకాశితము కాసాగెను. ఆతని సాన్నిధ్యము సర్వమును పవిత్రము, మహనీయముగా నొనర్చెను. పరుసవేది తాకున నినుము బంగారమగునట్లు పతితు లాతని సంసర్గమున పావనులైరి.

శ్రీరామకృష్ణుల యందలి ప్రత్యేకత—ఆయన కఠినపరీక్షలయందు కడతేరనిదే శిష్యులుగా గ్రహించువాడు కాడు. తన శిష్యులు మానవులకు ఆదర్శప్రాయులై యుండవలెననియే వారి ప్రధానాశయముగా నుండెను. శిష్యుల శారీరకలక్షణములను, ప్రవర్తనములను పరిశీలించుటలో ఆయన అతి నిపుణుడు. శిష్యులు అజాగ్రత్తగా నున్నప్పుడు వారి చర్యలను అతిజాగ్రత్తగా పరిశీలించును. ప్రశ్నలు వైచి వారి మనోభావముల గమనించును. ఒక్కొక్కప్పుడు ఒక విధమైన సమాధిస్థితి కలిగించి వారిచే తమ హృదయాంతర్గత రహస్యముల ప్రకాశింపచేయును. వారి మనస్తత్త్వము ననుసరించి, వారికి అనువగు సాధనపద్ధతిని సూచించును. వారి బోధనావిధాన మత్యద్భుతము. వర్తకులు నాణెములను పరీక్షించుచందమున తన బోధనల పరిపూర్ణముగా బరీక్షింపనిదే స్వీకరింపవల దనును. శిష్యులతో నాతడెన్నడును తర్కమునకు దిగడు. ఒక్కమాటచే, స్పర్శచే, కటాక్షముచే—నాతడు బోధించును. మహోన్నతాధ్యాత్మికతత్త్వములను వింతలతో, వినోదములతో, ఆటలతో, పాటలతో బోధించును. శిష్యుల దైనందిన కార్యక్రమములు పరిశీలించి, క్రమవిరహితమగు ఎట్టి స్వల్ప విషయమునైనను వారిచే గుర్తింపచేసి, సరియైన మార్గము చూపించును. ఇవియే కదా జగద్గురు లక్షణములు!

ఆతని సంభాషణము లొకప్పుడు కడుపు చెక్కలగునట్లు నవ్వించును. మఱి యొకప్పుడు శ్వాసలు కట్టువడ నిశ్చేష్టుల నొనరించును. ఒకపరి భక్తిపరవశుడై జగజ్జనని నామము నుచ్చరించుచు, కీర్తనలతో నృత్యము చేయును— పిమ్మట భగవానుని సగుణనిర్గుణరూపముల సమన్వయమువంటి వేదాంతరహస్యములను సహజసరళరీతి నత్యద్భుతముగా బోధించును. ఇట్టి మహోన్నతమగు ఆధ్యాత్మికభావముల నుండి అవలీలగా వ్యావహారిక విషయములలోనికి దిగి ప్రపంచమున వర్తింపవలసిన విధమును నేర్పును; నిరంజనునకు తన దుడుకుతనము మానుకొన సూచించును; స్త్రీలను ద్వేషించు హరికి, వారియెడ పూజ్యభావము నలవరచుకొన నేర్పును, ఆలుబిడ్డలయెడ నలక్ష్యము చూపుచుండిన నొకనిని చీవాట్లు పెట్టును. భక్తి, వేదాంతము, లోకవర్తనము—దేనినిగుఱించి బోధించినను ఆతని బోధనలు మనోహరదృష్టాంతములతో, హాస్యచమత్కారములతో, అత్యంత సులభశైలిలో, నీతికథారత్నములతో, మృదుమధురస్వరమున అలరారుచుండును.

శ్రీశారదాదేవిని గృహిణిగా గ్రహించి గృహస్థులకు ఆదర్శజీవితమును గడపు విధానమును ప్రత్యక్షముగా నాచరించి చూపెను. గృహస్థజీవనము కేవలము కామవాంఛల తీర్చుకొనుటకు కాదనియు, అది చాల పూజనీయమైనదనియు, జీవితలక్ష్యమగు ఆత్మసాక్షాత్కారమున నొక మైలుతాయి యనియు, అట్టి లక్ష్యమును చేరుటకు ఒకరికొకరు సహకారులనియు, అది కేవలము ఆత్మల సంపర్కమనియు బోధించెను. గృహస్థులకుకూడ ఆత్మసాక్షాత్కారము సాధ్యమే యను విషయమును విస్పష్టముగా బోధించెను.

ఆయన జితేంద్రియత్వము, కామినీకాంచన విజయము వర్ణనాతీతము. యుక్తవయస్కురాలగు భార్యతో కొన్ని నెలలు కామకళంకము లేక ఒకే గదిలో గడిపె ననిన ఆయన జితేంద్రియత్వమునకు వేఱు నిదర్శనము కావలెనా? తన జీవితసహభాగినియగు శ్రీశారదాదేవినే జగజ్జననీ స్వరూపముగ గాంచి పూజించిన ఆ మహాత్ముడు స్త్రీల నందఱిని మాతృస్వరూపిణులుగానే గాంచె నని వేర పేర్కొనవలయునా?

ఆతని కాంచనవిజయ మన్ననో అత్యద్భుతము. కేవల మొక నాణెమును తాకినను, వారి శరీరము ముడుచుకొని పోవును. చేతులు మెలికలు తిరుగును.

ఇట్టి సద్గుణరూపదివ్యమూర్తియగు శ్రీరామకృష్ణుని జీవితమే వారి శిష్యుల సంతతి గొప్ప మహనీయులుగా నొనర్చె నన్న అందు అతిశయోక్తి ఏ మున్నది? ఈ దివ్యమూర్తియే తన అంత్యకాలమున నవీనభారతమున కుత్తేజకర్తయగు శ్రీవివేకానందులకు తన దివ్యతపశ్శక్తి నంతయు ధారపోసెను. తన్మూలమున స్వామి మహాకార్యముల సాధించెను.

ఇది యంతయు సరియే. అప్పటికాలమున తన శిష్యులను దిద్దుట కన్ననో శ్రీరామకృష్ణు డుండెను. నేటి వారి గతి ఏమి? అని ప్రశ్నింపవచ్చును. నేడు శ్రీరామకృష్ణుడు తన భౌతికదేహమున లేకున్నను, వారొసగిన అమూల్యబోధనలు, వారి అద్భుతజీవితము మనముందు నిలిచియున్నవి. వానిని మనము అనుసరింపవచ్చును కదా! వారి యనుగ్రహపాత్రులము కావచ్చును కదా!

# ఆధునికయుగమునకు శ్రీరామకృష్ణుని ఆవశ్యకత*

వక్త:
పూజ్య శ్రీమత్ తపస్యానందస్వామి

అనువక్త:
బి. యస్. ఆర్. ఆంజనేయులు

మీలో అనేకులు భగవాన్ శ్రీరామకృష్ణ, శ్రీ వివేకానందస్వామి, శ్రీ శారదాదేవి పేరులను వినియుందురు. కొందరు వారి జీవితములను పైపైన చదివియుందురు. మిగిలినవారిలో ఏ కొలదిమంది యైనను వారి జీవితములను కూలంకషముగా పఠించియుందురు. శ్రీరామకృష్ణ— వివేకానందుల జీవితములను శ్రద్ధాభక్తులతో అధ్యయనముచేయు అవకాశము లేని అనేకులకు ఒక ప్రశ్న ఉత్పన్న మగుచుండును. ఈ కాలమునకు, ఆ వ్యక్తులకు గల సంబంధమేమి? ఈ దేశము నలుమూలల ఎందఱో సాధుసత్తములు మహాత్ములు గలరు. అంతయేల— ప్రతి రాష్ట్రములోను, ప్రతి జిల్లాలోను ప్రతి తాలూకాలో సైతము ఎందఱో మహాత్ములు ఇదివరకు పుట్టియున్నారు, ఇప్పుడును పుట్టుచున్నారు. ఈ ముగ్గురు వ్యక్తులు ఎంత గొప్పవారైనను, ఎంత పూజార్హులైనను, దూరమందున్న వంగదేశములో పుట్టిన వీరు, ఈ ప్రాంతములోను, భారతదేశమందలి ఇతర చోట్లను, ప్రపంచమందలి వివిధప్రాంతముల లోను గౌరవముతో ఏల చూడబడవలయును, దాదాపు దేవతలవలె ఏల పూజింపబడవలెను? అను ఈ ప్రశ్న ఇతరుల మనస్సులలో కూడ పొడసూపును.

దీనిని నేనొక సాదృశ్యముతో వివరించెదను. ఒక గొప్ప మామిడిచెట్టు కలదు. ఆ చెట్టున ఒకానొక కొమ్మకు కొన్ని చాల పెద్దవైన మధురఫలములు గలవు. నిజమునకు ఈ పండ్లు ఆ ఒక్క కొమ్మయందే ఉన్నవి. కాని అవి ఆ కొమ్మకు మాత్రమే చెందవలసిన అగత్యము లేదుకదా! అవి ఆ మొత్తము చెట్టునకు సంబంధించినవి. ఆ చెట్టు తీసికొను పోషక పదార్థములు ఆకులుగాను, పూవులుగాను, ఈ కొమ్మయందు కన్పించు పండ్లుగాను మార్చబడుచున్నవి. అందుచే అవి ఈ కొమ్మకు మాత్రమేగాక మొత్తము చెట్టునకు సంబంధించినవి. అదేవిధముగా శ్రీరామకృష్ణ, శ్రీ వివేకానందస్వామి, శ్రీ శారదాదేవి అను ఈ ముగ్గురు వ్యక్తులును దూరమున వంగదేశమునందు ఉద్భవించినను, వారు భారతదేశమను మహావృక్షమున — ఈ భారతదేశముననే గాదు — ప్రపంచపు ఆధ్యాత్మిక సంస్కృతి అను మహావృక్షమున ఫలించిన అత్యద్భుత మధుర ఫలములు. ఈ ముగ్గురు వ్యక్తులు అందొక శాఖయందు ఫలించినను వారు ఆ కొమ్మకు మాత్రమే గాక, యావత్ప్రపంచమునకు, అన్ని ప్రాంతములకు, అన్ని రాష్ట్రములకు, జీవితములో ఆధ్యాత్మిక ఆకాంక్షయున్న మనలో ప్రతిఒక్కరికి, చెందుచున్నారు.

ఇంతేగాక వారు మనకు అత్యంత సామీప్యములో అనగా ఒకశతాబ్దికి పూర్వమే యుండిరను ముఖ్యవిషయమును గ్రహింపవలెను. వారి దాపునకు వచ్చిన విద్యాధికులు, వారి సమక్షములో వారి జీవితములను విమర్శక దృష్టితో పరిశీలించి, వారి గొప్ప ఆధ్యాత్మికానుభూతులందు విశ్వాసము కలిగిన తర్వాతనే విమర్శనాత్మకముగాను, వైదుష్యముతోను వానిని గ్రంథస్థ మొనర్చియున్నారు. ఇదియొక ప్రత్యేకత. ఈ దేశములో అనేకులు

---

* బాపట్ల భావనారాయణస్వామి ఆలయములో 19-3-74 న శ్రీరామకృష్ణ సేవాసమితివారు ఏర్పరచిన సభలో ప్రసంగించిన ఆంగ్లోపన్యాసపారము.

మహాపురుషులు, సాధుసత్తములు శతాబ్దముల నుండి ఉన్నప్పటికిని విమర్శనాత్మకమైన పరిశీలన ఈ దేశమున అభివృద్ధి చెందియుండలేదు. అందువలననే పురాణములలోని శ్రీరామ శ్రీకృష్ణాదుల విషయములోను తర్వాతివారి విషయములోను చరిత్రాత్మక విషయములు అనేకమైన అతిశయోక్తులతోను, ఊహలతోను కలగాపులగమై యుండుటవలన విజ్ఞాని, చారిత్రాత్మికుడు, కళావేత్త అయిన 20 వ శతాబ్దపు విమర్శకుడు నిజానిజములను ఈ ఊహాపోహాలనుండి వేరుచేయుటకు కష్టపడుచున్నాడు. మొన్న మొన్ననే కలకత్తా వంటి మహానగరమున జీవించిన శ్రీరామకృష్ణుని విషయములో కొందఱు శిష్యులుగా గాక, విమర్శకులుగా దగ్గరజేరి వారి జీవితవిధానమును విమర్శనాత్మకముగా పరిశీలించి గ్రంథస్థము చేసియుండుటచే, ఆ విషయములు మన కెక్కువ విశ్వసనీయము లగుచున్నవి. నిక్కముగా సత్యాన్వేషకులైన పలువురు భగవాన్ శ్రీరామకృష్ణుని జీవితముచేతను, బోధలచేతను ముగ్ధులగుచున్నారు.

అంతేకాక రామకృష్ణుని జీవితము, ఆయన బోధలు హిందువునే కాక ఏ ఇతర మతస్థుని గూడ అతనిని తన మతమునుండి ఆధ్యాత్మిక సాంప్రదాయములనుండి వేరుచేయుట లేదు. ఈ శతాబ్దిలో పుట్టిన మనకందరకు కొన్నికొన్ని ప్రత్యేక ఆధ్యాత్మికభావములు, సంప్రదాయములు కలవు. వైష్ణవులు భగవంతుని నారాయణునిగాను, శ్రీకృష్ణునిగాను తలంచుచు శ్రీరామ శ్రీకృష్ణాది అవతారములుగ అర్చించుచున్నారు. అది వైష్ణవసంప్రదాయము. అట్లే శైవసంప్రదాయ మున్నది. పరమేశ్వరుని వారు ప్రమథగణములు హిమాలయములలో పరివేష్టించియున్న శివునిగా తలంతురు. వారి అర్చావిధానము వైష్ణవమునకు పూర్తిగా భిన్నమై యున్నది. శక్త్యుపాసన వేరొకటి. శక్తిఉపాసకులు భగవంతుని పురుషునిగా గాక స్త్రీగా భావించి, దివ్యజననియొక్క అనేక రూపములను ఆరాధింతురు. ఈవిధముగా మన దేశములో విభిన్నమత సంప్రదాయములు ప్రబలియున్నవి.

సంప్రదాయ మనునది ఒక ఉత్తుంగ పర్వతమునుండి దిగుచు దారిలోనున్న వండలి సారమునుగొని సముద్రాభిముఖమై పారు మహానది వంటిది. అదేవిధముగా ఈ దేశములో ఆధ్యాత్మిక సంప్రదాయము పరమాత్మయను మహాశిఖరమునుండి పారుచు, పరిసరములను సారవంత మొనర్చి తన ప్రవాహముతో ప్రజలను పరబ్రహ్మామువైపునకు గొనిపోవుచున్నది. శ్రీరామకృష్ణుని జీవితముతో సంప్రదాయము లేవియు సంఘర్షణపడక అవియన్నియు చేరి ఆయనలో ఐక్యమగుచున్నవి. శ్రీరామకృష్ణునియందు వైష్ణవుడు, శాక్తేయుడు, శైవుడు, అద్వైతి, క్రైస్తవుడు, ముస్లిమ్ ఎల్లరును కలరు. ఈ దేశమందు ఉద్భవించిన సంప్రదాయములన్నియు అతనియందు ఒక కూడలిస్థానమును పొందుచున్నవి. శ్రీరామకృష్ణుని అనుభూతులు, బోధలు ఈ కాలమున అనగా విభిన్నమతములవారు, వర్గములవారు, సంస్కృతులవారు కలసి నివసించవలసిన ఈ సమయమునకు చాల అనువుగా ఉన్నవి. ముఖ్యముగా విభిన్న సంప్రదాయవర్గములకు చెందిన హిందువులమైన మన మందరము ఒక మహావ్యక్తియందు ఒకటిగా కలసియుండనిచో, ప్రపంచమున (హిందువులమైన) మనకు భవిష్యత్తే అనునది ఉండనే ఉండదు. శ్రీరామకృష్ణునియందుగల ఈ విశ్వవ్యాపకత్వ మనునది భారతీయులే కాక ప్రపంచమందలి వివిధప్రాంతముల

వారందరు ఆయనను అంగీకరించి గౌరవించుటకు అర్హమైన మరియొక ప్రత్యేకత.

శ్రీరామకృష్ణుని శిష్యులలో ముఖ్యుడైన అభేదానందస్వామి, ఈభావమునే ఒక మనోజ్ఞమైన సంస్కృత శ్లోకములో వర్ణించియున్నారు.

శ్లో॥ శాక్తైః శివేతి శివ ఇత్యపి శంభుభక్తైః
కృష్ణావతార ఇతి వైష్ణవ శేఖరైశ్చ
జ్ఞానీతి యః పరమహంస ఇతీవ ధీరైః
సంజ్ఞాయతే హరే భజ రామకృష్ణః॥

శాక్తైః శివఇతి: శాక్తుడనగా శక్తిసంప్రదాయమునకు చెందినవాడు. దానిలో దేవి 'సౌమ్య', 'రౌద్ర' రూపములలో త్రిపురాంబికగానో, సరస్వతిగానో, పార్వతిగానో, మహాకాళిగానో అర్చింపబడుచున్నది. శ్రీరామకృష్ణుడు ఈ మూడురూపములలోను, శాక్తేయ గ్రంథములలో చెప్పబడిన రూపము లన్నింటిలోను దేవిని అర్చించి సిద్ధిని బడసెను. కావున శాక్తేయు డెవరైనను ఆయన దగ్గరకు వచ్చినపుడు అతడు ఆయనను శివస్వరూపునిగా దర్శించెను. శివుడు దేవీభావమే. అతడు శ్రీరామకృష్ణుని దివ్యజననిగా దర్శించెను.

శివ ఇత్యపి శంభు భక్తైః: ఇతర విధానములకు చెందిన భక్తులు శ్రీరామకృష్ణుని కలసినప్పుడు—(శివభక్తులు విష్ణుని దర్శింపరని, వైష్ణవులు శివుని ఊరేగింపును సహింపరని మనకు తెలియును.) ఆయనలో శివశక్తి ఆదర్శములనేగాక, వైష్ణవ ఆదర్శముగూడ చక్కగా సమ్మిళితమైనట్లు కనుగొందురు.

కృష్ణావతార ఇతి వైష్ణవశేఖరైశ్చ: వైష్ణవుని భాగవతము 'భాగవతోత్తమునిగా' వర్ణించినది. శ్రీరామకృష్ణుని జీవితము చదివినచో 'జటధారి', 'గోపాలుని తల్లి', భైరవీబ్రాహ్మణి, కృష్ణానుచరులైన అనేక ఇతర వైష్ణవులు ఆయన దగ్గరకువచ్చినట్లు కనుగొందుము. వారు శ్రీరామకృష్ణుని శ్రీకృష్ణస్వరూపునిగానే దర్శించిరి.

జ్ఞానీతి యః పరమహంస ఇతీవ ధీరైః: ధీరుడనగా అద్వైతసిద్ధి నందినవాడు. శ్రీరామకృష్ణుని జీవితములో ఆయన భగవంతుని దేవిగా ఉపాసన చేయుచుండగా 'తోతాపురి' యను నగ్నసన్యాసి వచ్చెను. ఆయన దిగంబరి. సర్వము ఆయనకు బ్రహ్మమే. ఆయన దక్షిణేశ్వరమునకు వచ్చినప్పుడు శ్రీరామకృష్ణుని అద్వైతసాధన చేయుటకు అత్యంతము పాత్రుడైనవానినిగా కనుగొని అద్వైతోపదేశము చేసినంతనే అతడు నిర్వికల్ప సమాధి చెందెను. శ్రీరామకృష్ణుడు భక్తిస్వరూపము— ఆయనే కృష్ణుడు, రాముడు, దివ్యజనని మొదలగున వన్నియు. ఏ రూపమును భావింపక భగవంతుని సర్వవ్యాపకుడైన నిరాకార, నిర్గుణ పరబ్రహ్మముగా భావించు అద్వైతసాధకులు, ఆయన దగ్గరకు వచ్చినప్పుడు వారు ఆయనను ధీరునిగా, పరమహంసగా, జ్ఞానిగా దర్శించిరి. ధీర యను పదము భాగవతములో వర్ణించిన కృష్ణుని మన స్మృతిపథమునకు తెచ్చును. శ్రీకృష్ణుడు సభారంగమున ప్రవేశింపగనే కంసుడు ఆయనను కాలస్వరూపునిగా చూచెను. భక్తులు అత్యంతారాధ్యదైవముగా దర్శించిరి. స్త్రీలు సౌందర్యరాశిగా కనుగొనిరి. అదేవిధముగా బహువిధాధ్యాత్మికానుభూతులను తనలో తాదాత్మ్య మొనర్చుకొనిన శ్రీరామకృష్ణుడను ఆధునిక శ్రీకృష్ణుడు మనముందు నిలచియున్నాడు.

మరొక్క విషయము ప్రస్తావించి ఈ ఉపన్యాసమును ముగించుచున్నాను. ఇంతవరకు శ్రీరామకృష్ణుని అద్వితీయవ్యక్తిత్వముగూర్చి,

ప్రత్యేకాకర్షణనుగూర్చి ముచ్చటించితిని. వ్యక్తుల జీవితములకు సంబంధించిన ఆయన బోధలలోని ఒక్క విషయమును మాత్రము ప్రస్తావింతును. మనమందరము భగవంతుని యందు విశ్వాసమునకై ప్రయత్నించుచున్నను ప్రతివారి మనస్సునందు భగవంతుని అస్తిత్వ మునుగూర్చి సందేహము ఉండనేయుండును. శ్రీరామకృష్ణుని జీవితమును పరిశీలించితిమేని ఈ సందేహము కొంతవరకు నివృత్తి కాగలదు. శ్రీరామకృష్ణుని జీవితము చదివిన ప్రతివారికి సందేహము పూర్తిగా నివృత్తి కాకపోయినను సందేహనివృత్తి మార్గములో అతడు అడుగిడును. "తల్లి పనిలో మునిగియున్నప్పుడు ఆటలో నిమగ్నమైన బిడ్డవలె మానవుడున్నా" డని ఆయన చెప్పెను. ఆటవస్తువులన్నియు బిడ్డముందు వైచి తల్లి పని చూచుకొనబోవును. బిడ్డ బొమ్మల ధోరణిలోపడి ఆడుకొనుచున్నంత సేపు తల్లి కనిపింపదు. అమ్మ లేనే లేదా అని పించును. కాని ఆటలో విసుగెత్తి ఆకలిచెందిన బిడ్డ ఏడువ మొదలుపెట్టును. కాని తల్లి రాదు. మామూలు ఏడుపు ఆమెదృష్టిని మరల్పదు. ఆకలితో అలమటించిన బిడ్డ నిజముగా ఏడ్చును. "అప్పుడు ఎక్కడినుండియో తెలియదు. తల్లి వచ్చి బిడ్డను చంక కెత్తుకొను"నని శ్రీరామ కృష్ణుడు చెప్పెను. ఇది కట్టుకథ గాదు. ఆకలి గొన్న ప్రతి బిడ్డ కథ ఇంతే. అన్నమునకై అలమటించినట్లు, నీటికై దప్పికగొన్నట్లు నీవు భగవంతునకై ఆధ్యాత్మికక్షుధా బాధితుడ వైనచో నీకు ఈ ఆకలిని తీర్చి తృప్తి, ఆనంద ములతో నిన్ను పరిపూర్ణుని చేయునట్టి చైతన్య నిధి, ఒక మహాశక్తి, ఒక అనుభూతి కలదు. అది ఏకైకసత్. శ్రీరామకృష్ణుని జీవితము దీనిని నిరూపించినది. 'మహాశయా! మీరు దేవుని చూచితిరా?' అని ప్రశ్నించిన సంశయాళులడగు వివేకానందుని సూటి ప్రశ్నకు "అవు"నని సమాధానము చెప్పినవ్యక్తి శ్రీరామ కృష్ణు డొక్కడే. "నిన్ను చూచినంతటికంటె భగవంతుని ఎక్కువ విస్పష్టముగా చూచు చున్నా"నని ఆయన చెప్పెను. దేవునిగూర్చి వచించుటకు వీలులేని వానికి ఇట్టి సమాధానము ఇచ్చినది ప్రపంచ చరిత్రలో అత డొక్కడే. భగవంతునియొక్క అస్తిత్వమునుగూర్చి తెలిసి కొనగోరువారికి భగవాన్ శ్రీరామకృష్ణుని జీవితసందేశములకన్న ఉత్తమ పరిష్కారము మరొకటి లేదు. మహనీయుడైన గాంధీ మహాత్ముడు శ్రీరామకృష్ణ జీవితమునకుమున్నుడి వ్రాయుచు "రామకృష్ణుని జీవితము ధర్మాను ష్ఠాన చరిత్ర. భగవంతుని ముఖాముఖ దర్శించుటకు ఆయన సాయపడును. భగవంతు డొక్కడే సత్యమనియు, మిగిలినది మిథ్యా మాత్రమని ఆయన జీవితము మనకు నిరూ పించును. ఆయన జీవితసందేశములు లేనిచో సంశయవాదము నాస్తికవాదములచే అనేకులు నశించెడివారే. కాని ఎందఱికో ఆ సందేశ ములు శాంతినిచ్చినవి." గాంధీమహాత్ముడు వ్రాసిన ఈ కొద్ది వాక్కులకంటె ఎక్కువ రామకృష్ణబోధలను గూర్చి చెప్పుట కష్ట సాధ్యము. ఈ వాక్యములను నేను మీకు సిఫారసు చేయుచున్నాను. నేను తెలిపిన ఈ కొద్దిభావములు మీకు తృప్తికల్గించినచో రామకృష్ణ జీవితసందేశములను ఈ మహా వ్యక్తుల వ్యక్తిత్వములను కూలంకషముగా తెలిసికొనిన మన జీవితములు ధన్యతగాంచును. జీవిత లక్ష్య సిద్ధిమార్గమున మన జీవితము పురోగమించును.

ప్రభాప్రసారము
(సంపాదకీయము)

# అవతారవరిష్ఠుడు

> నా గురుదేవుడు "ఆధ్యాత్మికశక్తి - సంపన్నుడవు కమ్ము. అపరోక్షానుభూతిని బడయుము." అని మనుష్యలోకము నుద్బోధించుచున్నాడు. ఆయన మీనుండి అపేక్షించునది సోదరమానవుల నిమిత్తము అపారత్యాగము. సహోదరప్రేమ ప్రసంగముల నాపి ఆ ప్రేమమును కార్యరంగమున ప్రదర్శింపు డనియే ఆయన మీకు జెప్పునది. త్యాగ మొనర్పవలయు తరుణ మాసన్న మైనది. సాక్షాత్కారానుభవమును బడయదగు సమయ మాసన్న మైనది. నీయందు త్యాగము, అనుభూతియును నెలకొనినయెడల ప్రపంచమునందలి సర్వమతములలోను ఓతప్రోత భావమున వెలయుచుండిన సమన్వయ సూత్రమునే పరిలక్షింపగలుగుదువు. వ్యర్థములగు వివాదముల కాస్కారములేదని గ్రహింపగలుగుదువు. గ్రహింపగలిగిన యెడలనే నీవు మానవకోటిని సేవింప సంసిద్ధుడ వగుదువు. సర్వధర్మసమన్వయ సత్యమును జగత్తునకు ప్రకటించి పరిస్ఫుట మొనర్చుటయే నా గురుదేవుని జీవితోద్దేశము. ఇతరమతాచార్యు లందఱును స్వనామాంకితములగు విశేషమతములను ప్రచార మొనర్చియుండిరి. కాని ఈ యుగాచార్యుడు తన శ్రేష్ఠతను ప్రకటింప బూనలేదు. అత డే మతమును నిందింపలేదు. బుద్ధిభేదమును సృష్టింపలేదు. ఏలయన, వాస్తవమున కీ మతములన్నియు ఆ సనాతనమతాంతర్గతములు అను మహాసత్యము నతడు గ్రహించియుండెను.
>
> —శ్రీ వివేకానందస్వామి.

'యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజామ్యహమ్' అని శ్రీకృష్ణభగవాను డభయ మిచ్చియున్నాడు. కాని ఇది యెట్లు సంభవము? శ్రీరాముని ఎదుట శ్రీకృష్ణస్తవము చేయనగునా? శ్రీకృష్ణునియం దేమైన ఎల్ల దేవతలును ఆవహించియుందురా? ఎవరినిపిలిచిన వారు పలుకుటకు? ఇట్టి ప్రశ్నలకు సమాధానములు శ్రీరామకృష్ణచరితమునందు లభించును.

తండ్రియగు క్షుదిరాముడు గయాక్షేత్రమున నుండ గదాధరుడగు మహావిష్ణువు కలలో దర్శన మిచ్చి 'నీకు కుమారుడ నగుదు' నని అయాచితముగ ననుగ్రహించెను. తల్లియగు చంద్రాదేవి కామార్పుకూరున శివాలయమునకు బోవ అచ్చట ఆమె శివతేజము తనయందు ప్రవేశించుటను గని స్మృతిని కోల్పోయెను. జన్మమునందే ఇట్లు శివవిష్ణువుల సమ్మేళనమైన శ్రీరామకృష్ణుడు దినములు గడచు కొలది సకలదేవతలను తనయం దావిష్కరించుకొనెను.

చిన్నతనమునుండియే దైవభక్తితత్పరుడగు శ్రీరామకృష్ణుడు అనేక దివ్యదర్శనములను సమాధిస్థితులను పొందుచుండినను నిరంతర భగవత్సాక్షాత్కారమునకై పరితపించుచుండెను. పదునేడేండ్ల ప్రాయముననే 'పొట్టకూటి చదువు' తన కక్కఱలేదను దృఢనిశ్చయమునకు వచ్చెను. రాణీరాసమణీదేవి కట్టించిన భవతారిణీదేవ్యాలయమున పూజారియైనది మొదలు ఈ భగవద్దర్శనకాంక్ష ఎంత తీవ్రతర మైనదనగా అతనికి బాహ్యప్రపంచ మంతయు వట్టి నీడలుగా కన్పించుచు భవతారిణీదేవిస్మరణయే సత్యపదార్థ మయ్యెను. చివర కతడు తన సాధనసాఫల్యమును బడసి తాను

పిలిచినపుడెల్ల భవతారిణీదేవి పలుకునట్లును దేవాలయమున గల విగ్రహము స్థానమున సాక్షాద్దేవియే అతని పూజల నందుకొను నట్లును చేసికొనగలిగెను. అతని సాక్షాత్కార మెంత నిక్కువమైన దనగా, బాలురు ఏ చిన్న కష్టము సమస్య వచ్చినను తమ తల్లులకడ కెట్లు పరుగిడుదురో అట్టి చనవుతో శ్రీరామ కృష్ణుడు తన దైనందిన కార్యములను సమస్య లను తన 'అమ్మ'తో మురిపెములు గుడుచుచు చెప్పుకొనెడివాడు.

శ్రీరామకృష్ణుని కులదైవము శ్రీరఘువీరుడు. బాల్యమున గాఢసమాధి నందినది శివరాత్రి నాడు శివవేషధారి యైనపుడు. పూజారియైనది కాళికాలయమున. కేవలము తన భగవద్దర్శన కాంక్షాతీవ్రతవలననే చివర కతడు భవతారిణీ దేవిని తన తల్లిగా బడయగలిగెను. ఏ రూప మున భగవంతు నారాధించిన ఆ రూపముననే భగవంతు డనుగ్రహించును గదా!

శ్రీరామకృష్ణుడు శ్రీరాముని సాక్షాత్క రించుకొనగోరి హనుమంతునివలె శ్రీరాముని భజింపదొరకొనెను. ఒకనా డాయన పంచ వటియందు కూర్చుండియుండ, ఏ జపధ్యాన ములు చేయకయే, సీతాదేవి సాక్షాత్కరించి తనవంకకు వచ్చుచుండుటను చూచెను. భ్రమ యనుకొనుటకు వీలులేదు. పంచవటి, చెట్లు, గంగ, కోతి, కన్పించినట్లే సీతాదేవియు కన్పించుచుండెను. ప్రేమమయి దయాస్వరూ పిణియు అగు సీతాదేవి శ్రీరామకృష్ణుని సమీ పించి తన చిఱునగవు నతని కిచ్చుచున్నానని పలికి అతనియందు లీనమయ్యెను. శ్రీరామ కృష్ణుని శరీరగృహమున దేవతలందఱును వసింపవచ్చుట కిదియే మొదలు.

భవతారిణీదేవి యాదేశానుసారము శ్రీరామకృష్ణుడు హిందూమతమునగల సాధన విధానముల నన్నింటిని అనుష్ఠించి సిద్ధిని బడ సెను. ప్రథమమున భైరవీబ్రాహ్మణి గురుత్వ మున తాంత్రికవైష్ణవసాధనల నన్నింటిని అవ లీలగా సాధించెను. గోపికాభావమున శ్రీకృష్ణుని ప్రార్థింప శ్రీ రాధాదేవి సాక్షాత్కరించి అతని శరీరమున ప్రవేశించెను. ఆ పిదప శ్రీకృష్ణుడును ప్రత్యక్షమై శ్రీరామకృష్ణ శరీరమున లీన మయ్యెను. పిదప తోతాపురినుండి సన్న్యాస స్వీకారము చేసి ఆరునెలలు అద్వైత సమాధి స్థితియందు మునిగిపోయెను. సాధనాంతమున మహమ్మదీయమతమును క్రైస్తవమతమును కూడ ననుష్ఠించి వానియందును సిద్ధినందెను. ఇట్లు ఏ ఏ దేవతలను జనులు ప్రత్యేకముగా వారే ఏకైకదేవతలుగా భావించి పూజింతురో ఆ యా దేవదేవతాగణ మంతయు, నవీనమత ములగు క్రైస్తవ మహమ్మదీయ మతాదర్శము లతోకూడ, శ్రీరామకృష్ణునియందు లీనమగుట చరిత్రగతవిషయముగా స్పష్టమగుచున్నది.

శ్రీకృష్ణుడు పురాణకల్పితపురుషుడని, ఒక ప్పుడు శ్రీ వివేకానందస్వామియు ననుమాన పడెను. అట్టి యనుమానముల కే యవకాశ మును లేకుండునట్లు ఇప్పటికి నూరేండ్లకు పూర్వమే శ్రీరామకృష్ణుడు సాధనయను నెప మున సర్వదేవదేవతామూర్తియై ప్రకాశిం చెను. మానవరూపముననే భగవంతు డిట్లు సర్వదేవదేవతాస్వరూపియై యుండ నిరాకారు డగు భగవంతుడు కోరినవారిని కోరినరూప మున ననుగ్రహించుటయం దాశ్చర్య మేమి!

భక్తు లట్లనుగ్రహింప బడిరనుట కూడ శ్రీరామకృష్ణుని జీవితమునందే కననగును.

ప్రప్రథమమున సీతాదేవి దర్శనమైన పిదప కొన్నాళ్లకు భైరవీబ్రాహ్మణి శ్రీరామకృష్ణు లకు గురుత్వము వహించుటకు వచ్చెను. ఆమె

శ్రీ రఘువీరుని పూజించెడిది. ఒకనా డామె పూజాసమయమున నైవేద్య మర్పించి ధ్యానించుచుండగా భావసమాధిగతుడైన శ్రీరామకృష్ణుడు పూజాస్థలమున నుపవిష్టుడై నైవేద్యమును స్వీకరింపసాగెను. భైరవీ బ్రాహ్మణి కనులు తెఱచి ధ్యానమున తనకు శ్రీ రఘువీరుడు దర్శనమిచ్చినట్లే ప్రత్యక్షముగా శ్రీరామకృష్ణుడు నైవేద్యస్వీకారము చేయుటను చూచి పరమానందభరితయై నేటికి నా పూజ సార్థకమైన దనుచు తన సాలగ్రామమును గంగార్పణము చేసెను. ఈమెయే మరి కొంతకాలము పిదప విద్వత్సభ నేర్పాటు గావించి శ్రీరామకృష్ణు నవతారపురుషునిగా నుద్ఘాటించెను.

పండితప్రకాండులగు వైష్ణవచరణుడను శ్రీ చైతన్యభక్తుడును గౌరీకాంతుడను దేవ్యుపాసకుడును శ్రీరామకృష్ణుని శ్రీగౌరాంగునిగా కాళికాదేవిగా దర్శించిరి. వైష్ణవచరణుడు తన శిష్యవర్గమును కూడ శ్రీరామకృష్ణ దర్శనమునకై ప్రోత్సహించెను. ప్రథమముననే శ్రీరామకృష్ణుడు వారి పూజామందిరమును దర్శింప నేగినపుడు అచటి సంకీర్తనప్రభావమున సమాధిగతుడై శ్రీచైతన్యులకని యుద్దేశింపబడిన యాసనముపై నిలిచి తనకును శ్రీచైతన్యులకును గల యభేదమును సూచించెను. బాహ్యస్మృతి కలిగిన పిదప శ్రీరామకృష్ణుడు తన ప్రవర్తనకు తానే నొచ్చుకొనినను, ఆ భక్తులెల్లరును అతనిని శ్రీచైతన్యమహాప్రభువుగనే దర్శించి పూజించి ధన్యులైరి. ఈ సందర్భమున నొకనాడు శ్రీరామకృష్ణుడు గౌరీకాంతునితో "వైష్ణవచరణుడు నన్ను భగవదవతార మనుచున్నాడు నీ వేమందు" వనగా అతడు "అతని కింతియేనా తెలిసినది? మీరు సాక్షాత్ భగవత్ స్వరూపులే" యని వినయదీపితుడై పలికెను. అత డట్లనుట భక్త్యావేశముతో గాదనియు స్పష్టముగా భగవద్దర్శనము చేయుటవలననే యనియు చెప్పుట పునరుక్తియే గదా!

మరియొకసారి శ్రీరామకృష్ణుడు తనగది వసారాయందు పచారు చేయుచుండగా మథురనాథు డతనిని తనగదియందుండి చూచుచుండెను. ఇంతలో శ్రీరామకృష్ణస్వరూపము మాయమై అతనికి వసారాయందు కాళికాస్వరూపము వచ్చుచు కననయ్యెను. దిగ్భ్రాంతుడై ఇదియేమని చూడగా పోవుచు శివస్వరూపము కననయ్యెను. ఏమి! కలగనుచున్నానా యని యద్భుతపడుచు కన్నులు నులిమి చూడగా ప్రతిపర్యాయమును అట్లే కాళికాదేవియు శివుడును కన్పింపసాగిరి. ఇక నతడు భక్త్యాశ్చర్యములు ముప్పిరిగొనగా పరుగిడివచ్చి శ్రీరామకృష్ణుని పాదములపై బడెను. ఇట్లే మరియొకసారి మథురనాథునింట దుర్గాపూజను బాహ్యశరీరమున చూచుచు హృదయునకు సూక్ష్మశరీరమున అతని యింట దుర్గాదేవి సన్నిధిని దర్శనమిచ్చెను.

ఇట్లొకరిని శ్రీరఘువీరునిగాను, మరొకరిని శ్రీచైతన్యులుగాను, ఇంకొకరిని కాళికాదేవిగాను, వేరొకరిని బాలరామునిగాను అనుగ్రహించిన శ్రీరామకృష్ణుడు అఘోరమణి యను బాలవితంతువును బాలకృష్ణునిగా కటాక్షించెను. ఆమె శ్రీరామకృష్ణుని తన ఇష్టదైవమగు బాలకృష్ణునిగా భావించి పలురకముల తినుబండారములను గొనివచ్చి పసిబాలుని వలెనే శ్రీరామకృష్ణుని బుజ్జగించి తినిపించెడిది. బాలగోపాలు డామె సందిటబిడ్డయై రెండునెలలు ఆమెతోడనే గడపెను. పిదప ఆ అద్భుతదృశ్య మదృశ్యముకాగా శ్రీరామకృష్ణు డామె నోదార్చెను. అప్పటినుండియే

అఘోరమణిదేవి గోపాలేర్‌మా (గోపాలుని తల్లి) యని ప్రసిద్ధిగాంచెను.

దుష్టులను శిక్షించుటకును శిష్టులను రక్షించుటకును ప్రతియుగమునను ఉద్భవింతునని భగవంతుడు ప్రకటించియే యున్నాడు. అనాది కాలమునుండియు అట్లే వివిధరూపముల నవతరించుచు ఒక్కొక్కయంశద్వారా ఇట్టి శిక్షయు రక్షయు భగవంతుడు ప్రసాదించుచునే యున్నాడు. ఆధునిక కాలమున వివిధ మతావేశములతో ఛిన్నాభిన్న మగుచున్న దేశమున ప్రపంచమునకు భిన్నత్వములోని ఏకత్వమును సూచించుటకు సర్వదేవతలను తనయందే ఆవిష్కరించుకొనుచు శ్రీరామకృష్ణ డవతరించెను. భగవదవతారము లిప్పటివరకును దుష్టశిక్షణను శిష్టరక్షణను నిర్వర్తించినవి. శ్రీరామకృష్ణావతారముమాత్రమే దుష్టశిష్టవిభేదములేక ఎల్లరకును రక్షనే ప్రసాదించినది. ఇట్టి యవ్యాజకరుణాసముద్రు డగుటచేతనే శ్రీరామకృష్ణ డవతారవరిష్ఠుడని కీర్తింపబడుచున్నాడు.

తన నవతారమూర్తి యని జనులు ప్రస్తుతించుట శ్రీరామకృష్ణునకు నచ్చదు. ఒకప్పుడు గిరీశ్ ఘోషు, రామచంద్రదత్తు అనుభక్తులు తన నవతారమూర్తి యని ప్రచారము చేయుచున్నారని విని యతడు, "జీవితమంతయు భగవదన్వేషణలోనే గడపిన పండితవరేణ్యులగు వైష్ణవచరణుడు గౌరీకాంతుడు పూర్వకాలముననే నన్ను అవతారపురుషుడని యుండిరి. వీరికేమి తెలియును? ఈ మందులిచ్చువారు నన్నవతారమూర్తి యని నాకేమి గౌరవము చేయుచున్నా"రని విసుగుకొనెను. ఈయన దేవుడే యని యొక నమస్కారము పెట్టి యూరకుండుటకన్న నిజముగా భగవత్సాక్షాత్కారమునకై జనులు ప్రయత్నింపజూచుట తనకు ప్రీతికరమని శ్రీరామకృష్ణుని యుద్దేశమై యుండవచ్చును.

కనుక, అట్టి శ్రీరామకృష్ణ ననుగ్రహము నర్థించుచు మన ఇష్టదేవతా సాక్షాత్కారమునకై ద్విగుణీకృతయత్నమును చేయుదముగాక.

---

# భక్తిరత్నావళి

మూలము : **శ్రీవిష్ణుపురి**

వ్యాఖ్యాత : **విష్ణుచిత్తుడు**

(ప్రథమ విరచనము)

## 40

శ్రీహరి యొక్కడే పూజార్హుడని రమ యనుచున్నది.

స వై పతిః స్యాదకుతో భయః స్వయం సమన్తతః పాతి భయాతురం జనమ్
స ఏక ఏవైతరథా మిథో భయం నైవాత్మలాభాదధిమన్యతే పరమ్. (5-18-20)

శ్రీహరి యొక్కడే ప్రభువు. అతడు స్వభావముచేతనే దేనివలనను భయములేనివాడు. సకలవిధముల భయములచే నావరింపబడిన వారి నతడే రక్షించును. అద్వితీయుడగు

నతనికి భీతిగొల్పువా డెవడును లేడు. ఆత్మానందముకంటె నతనికి సంతోషముగూర్చునది మరియొకటి లేదు.

## 41-42

ఎల్లరును శ్రీహరిని భజింపవచ్చును. ఆభిజాత్యము పాండిత్యము మొదలగు నర్హతల నాతడు పాటింప డని హనుమంతు డనుచున్నాడు.

సురోఽసురోవాప్యథ వానరోనరః సర్వాత్మనా యః సుకృతజ్ఞమీశ్వరమ్
భజేత రామం మనుజాకృతిం హరిం య ఉత్తరాననయత్కోసలాన్దివమ్

న జన్మ నూనం మహతో న సౌభగం న బుద్ధిర్నాకృతిస్తోషహేతుః
తైర్యద్విసృష్టానపి నో వనౌకసశ్చకార సఖ్యే వత లక్ష్మణాగ్రజః. (5-19-7-8)

దేవదానవులైనను, నరులైనను నరులకంటె నధములైనను మానవాకృతినున్న భగవంతుడగు శ్రీరాముని ప్రాణములకంటె మిన్నగా భజింతురుగాత. ఆ శ్రీరాముడు జనుల సుకృతముల దెలియువాడు. ఉత్తరకోశలులను వైకుంఠము జేర్చినవాడు.

ఆభిజాత్యముగాని యైశ్వర్యముగాని వాగ్ధాటిగాని బుద్ధివైభవముగాని సుందరాంగములుగాని లక్ష్మణాగ్రజుడగు శ్రీరాముని కృపాకటాక్షమును బడయలేవు. చూడుడు! వానియం దేదియు లేకున్నను అడవుల దిరుగు వానరములమైన మాతో మైత్రి నెఱపి యనుగ్రహించెను గదా!

## 43

భగవద్భక్తులలో నిష్కాములైనవారు పరమార్థము నందుదురని దేవతలు నుడువుచున్నారు.

సత్యం దిశత్యర్థితమర్థితో నృణాం నైవార్థదో యత్పునరర్థితా యతః
స్వయం విధత్తే భజతామనిచ్ఛతామిచ్ఛాపిధానం నిజపాదపల్లవమ్. (5-19-27)

అర్థిజనులగు భక్తులకు కోరినవెల్ల నిచ్చుననుట సత్యమే. కాని ప్రాతకోరికలు దీర క్రొత్తకోరికలు మొలచు నీయభీష్టసిద్ధికి సార్థక్య మేమి? కోరికలు లేనివారై ప్రేమతత్పరతతో పూజించు భక్తులకు శ్రీహరి కోరికల నిర్మూలించు తన పాదాబ్జముల నడుగకయే యొసగి కటాక్షించును గదా!

# అవతారమూర్తి శ్రీపరమహంస

శిష్ట్లా లక్ష్మీనారాయణ

## అవతారం అంటే ?

యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత!
అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహం!!
భగవద్గీత, IV-7

ఈ సృష్టి అనంతమైనది. దీనిలో పరిణామ క్రమం అవ్యవహితమైనది. ఆ పరాత్పరుడు ధర్మం గతి తప్పినప్పుడు మనుష్యరూపం దాల్చి వ్యక్తిలో మూర్తీభవిస్తాడు. సృష్టిలోని ప్రతి అణువూ ఆ పరమేశ్వరమయమే. అయితే ఏం! అవతారంలో ప్రత్యేకమైన, నిర్దిష్టమైన ప్రయోజనం, గమ్యం ఉన్నాయి. అదీ కాక అప్పుడప్పుడు తన విభూతులనుకూడ పంపుతాడు. ఆ పరాత్పరుడు ఈ మనుష్యరూపంలో అందరిమధ్య ఉంటూ, ఈ పాంచభౌతికశరీరంలోనే వ్యక్తి ఎంత పరిణతి సాధింపవచ్చు అన్న విషయాన్ని అందరికీ తేటతెల్లం చేస్తాడు. ఇదే అవతారం యొక్క స్థూలమైన ప్రయోజనం. ఎందరో మహానుభావులు దైవాంశతో పుట్టి ఈ పరిణామగతిని తీవ్రతరం చేస్తారు. ఆ పరమేశ్వరుడే ఎప్పుడైతే మనిషిరూపంగా అవతరించి పరిణామక్రమాన్ని ముందుకు తీసుకుపోతాడో అట్టి వ్యక్తినే మనం అవతారమూర్తి అంటాము. ఇట్టి మహామనీషే శ్రీరామకృష్ణ పరమహంస.

## మహాఋషి శ్రీ పరమహంస

ఈ యుగంలో శ్రీరామకృష్ణపరమహంస మహాఋషి. ఋగ్వేదకాలంనుండి ఇంతవరకు వస్తున్న ఆధ్యాత్మిక సంపదను పుణికిపుచ్చుకొన్న మహాతేజస్వి. రొమేన్ రోలెండ్ పరమహంసను కొనియాడుతూ 'వారిలో ముప్పది కోట్ల ప్రజలయొక్క రెండువేల సంవత్సరాల ఆధ్యాత్మికజీవనం వెల్లివిరిసింది' అంటాడు. పరమహంస ప్రతివిషయాన్ని తమ ఆధ్యాత్మిక అనుభవాన్నుండే చెప్పారు. వారి సందేశం గతాన్ని ప్రతిఫలింపచేస్తూ, వర్తమానాన్ని ఆకళించుకొని భవిష్యత్తుకు వెలుగుబాటలు వేసేదిగా ఉంటుంది. వారి ప్రతివాక్యం విశ్వజనీనమైన మతంలోని అనంతమైన సత్యాన్ని ప్రపంచానికి చాటిచెపుతుంది. సత్యం ఒకటే. ఈ జగత్తు సత్యంనుంచే ఉద్భవిస్తుంది, దానిలోనే లయమౌతుంది. ఈ సత్యమే సృష్టికి మూలం......

సత్యవ్రతం సత్యపరం త్రిసత్యం
సత్యం చ యోనిం, నిహితం చ సత్యే!
సత్యస్య సత్యమృత సత్యనేత్రం
సత్యాత్మకం త్వాం శరణం ప్రపన్నాః!!

ఇటువంటి సత్యాన్ని దర్శించిన వారు కాబట్టే మానవాళి శ్రీ పరమహంసను సత్యద్రష్టలుగా పరిగణిస్తుంది, పూజిస్తోంది.

## సర్వమతసమైక్యత

ఆధునికయుగంలో సనాతనధర్మం (హిందూమతం)యొక్క పునరుజ్జీవనానికి నాంది పలికింది. శ్రీరామకృష్ణపరమహంస వారు ఏ బడిలోనూ, కళాశాలలోనూ చదవలేదు. అయినా ఇతరులు చెప్పినదాన్ని స్వానుభవం అనే గీటురాయిపై పరీక్షించకుండా ఎప్పుడూ నమ్మలేదు. అన్ని మతాల్ని, అన్ని మార్గాల్ని స్వయంగా ఆచరించి, పరీక్షకు నిలిచిందాన్ని మాత్రమే శ్రీ పరమహంస స్వీకరించారు. తాంత్రికపద్ధతి, వైష్ణవపద్ధతి, వేదాంతమార్గం—అన్ని ఆధ్యా

త్మికమార్గాల్ని ఆచరించి అన్నిటినీ సమన్వయ పరచి, విశ్వజనీనమైన మతంయొక్క మూల సూత్రాలకి అనుగుణమైన మార్గాన్ని వారు అనుసరించారు. మహమ్మదీయ, క్రైస్తవ సాంప్రదాయాలను అర్థం చేసికొని అన్ని మతముల ఐక్యతను మానవాళికి చాటారు. వారు "ప్రపంచంలోని అన్ని మతములు పలురకము లైన మార్గాలు. ప్రజలు ఈ మార్గాల్లో పయనిస్తూ చివరకు ఒకే భగవంతుణ్ణి చేరుకుంటున్నారు" అన్నారు. భక్తుడు శ్రద్ధతో భగవంతుణ్ణి ఏ రూపంలో పూజించినా ఆదిమధ్యాంత రహితుడైన ఒకే భగవంతుణ్ణి చేరుకుంటాడు. ఈ విషయాన్నే గీతలో శ్రీకృష్ణభగవాన్ ...

> యేప్యన్యదేవతా భక్తా యజంతే శ్రద్ధ
> యాన్వితాః !
> తేపి మామేవ కౌంతేయ యజ
> న్త్యవిధిపూర్వకమ్ !!
> IX-23

ప్రతివారు పూజించేది ధ్యానించేది ఒక భగవంతుడినే. జీసస్ అంటాడు.

> Thou shalt worship the Lord thy God
> and Him only shalt thou serve.
> Thou shalt not tempt the Lord thy
> God.

శ్రీరామకృష్ణులు ప్రతి మతానికి హృదయం వ్యక్తిగత ఆధ్యాత్మిక అనుభవమేనని పదేపదే చెప్పారు. బాహిరమైన పూజావిధానం, ఉత్సవాలు, వేడుకలు భజనలే మతం కాదు. అవి స్వచ్ఛమైన వెలుగువైపుకు దారితీసే మార్గాలు మాత్రమే. ఏ నమ్మకమైనా, విశ్వాసమైనా, మతమైనా ఒకే లక్ష్యానికి దారిచూపాలి. అదే ఆధ్యాత్మికానుభూతి. భగవంతుడు సర్వజీవరాసుల్లో ఉన్నాడు. ఆయనను (ఆశక్తిని) అన్నిటిలో చూడగలిగిన వ్యక్తి అరిషడ్వర్గాదులకు అతీతుడై జీవన్ముక్తుడౌతాడు. దీనికి పరమహంసే నిదర్శనం. ఈశావాస్య ఉపనిషత్తులో ఈ విషయాన్నే చెప్పారు.

> యస్తు సర్వాణి భూతాని ఆత్మన్యేవాను
> పశ్యతి !
> సర్వభూతేషు చాత్మానం తతో న విజు
> గుప్సతే !!

ఇటువంటి అనుభవం, సాక్షాత్కారం కలిగిన వ్యక్తి ద్వంద్వాతీతుడు. అటువంటి మహనీయుడు అన్ని జీవరాసులయెడ ప్రేమతోనూ, ఆదరంతోనూ ఉంటాడు. 'సర్వభూతహితే రతాః' పరమహంస అన్ని మతాలు ఒకటే నని చెప్పటంలో అంతరార్థం ఇదే. అవి కేవలం మహాయోగుల మాటలు కావు. అనుభవసారపు ధారలు. ఒక మతం తక్కువ, వేరొక మతం ఎక్కువ అనుకోవటం కేవలం అజ్ఞానం.

శ్రీరామకృష్ణపరమహంస మనోవాక్కాయ కర్మల పవిత్రతనుగూర్చి పదేపదే చెప్పారు. ఈ విషయంలో బుద్ధుని బోధల్ని, ఏసుప్రభువు సూక్తుల్ని మనకు గుర్తుకు తెస్తారు. ప్రపంచంలో బౌద్ధమతము, క్రైస్తవమతము నీతి ప్రధానమైన మతాలుగా పరిగణింపబడతాయి. ఈ దేహము ఒక దేవాలయం, ఆత్మ దేవుడు, ప్రతి అవయవము దేవాలయంలోని భాగము. కాబట్టి కేవలము బాహిరమైన పవిత్రతే కాకుండా, మనస్సు, వాక్కు, చేతలు పవిత్రంగా ఉంచితే పరమేశ్వరుడు ఈ దేవళంలో (శరీరంలో) స్థిరంగా ఉంటాడు. అందుచేతనే శ్రీశంకరులు 'శివానందలహరి'లో మనస్సనెడి కారడవిలో అరిషడ్వర్గాలనే భయంకరమృగాలున్నాయి. పరమేశ్వరా ఈ మృగాలన్నిటినీ వేటాడి నా మనస్సులో స్థిరనివాసం ఏర్పరుచుకో అని ప్రార్థిస్తాడు...

మాగచ్ఛ స్త్వమితస్తతో గిరిశ భో
మయ్యేవ వాసం కురు
స్వామి న్నాదికిరాతక మామక మనః
కాంతారసీమాంతరే
వర్తంతే బహుశో మృగా మదజుషో
మాత్సర్య మోహాదయ
స్తాన్హత్వా మృగయావినోదరుచితాం
లాభంచ సంప్రాప్స్యసి.

'ఒక సూర్యుండు సమస్తజీవులకు తా నొక్కొక్కడై తోచు' అన్నట్లు సచ్చిదానంద మగు బ్రహ్మ ఒక్కటి అయ్యూను పలువురికి పలువిధములుగా దర్శన మిస్తుంది. కుమ్మరి చేసే ప్రతి వస్తువులోనూ పదార్థం మట్టి మాత్రమే. అట్లాగే సర్వమతములు తలచి, కొలిచే శక్తి ఒకటే. పేర్లలో భేదం ఉండచ్చు. ఆశక్తే అన్ని జీవరాసులకు మూలం. భగవద్గీతలో శ్రీకృష్ణుడు అంటాడు...

యచ్చాపి సర్వభూతానాం బీజం తదహం
అర్జున X-39

అన్ని మతములు ఆ శక్తిని చేరుకునే వేర్వేరు మార్గములు. శ్రీపరమహంస ఈ సత్యాన్ని అనుభవంలోకి తెచ్చుకొన్న అవతారమూర్తి. అందుచేతనే ఎన్నో మతముల వారు వారి వద్దకు స్వేచ్ఛగా వెళ్ళి ఎన్నో విషయములను చర్చించేవారు. వివిధమతములు ఒక పెద్ద రేవుకు ఉండే అనేకమైన చిన్న రేవులు. అందుచేతనే శ్రీపరమహంస 'నిర్మలచిత్తముతో ఏ రేవులో స్నాన మొనర్చినా బ్రహ్మానందమును పొందగలవు' అని చెప్పినారు.

శ్రీపరమహంసకాలమున బ్రహ్మసమాజముయొక్క కార్యక్రమాలు ఎక్కువగా ఉండేవి. ఒకరు శ్రీవార్ని హిందూమతము, బ్రహ్మసమాజములపై మీ యభిప్రాయ మేమని యడుగగా వారు 'ఈ యుభయపక్షములవారి మూలమునను ఆ జగజ్జనని తన కార్యములను సాగించుకొనుచున్నట్లు నాకు కన్పించుచున్నది' అన్నారు. ఆ జగజ్జననిని గాంచిన ఈ మహనీయునకు అన్ని మాటలు, అన్ని ప్రార్థనలు, అన్ని నోములు, వ్రతములు ఒకే పరమలక్ష్యమునకు చేరుకునే త్రోవలు. ఇటువంటి మహనీయులు సామాన్యులను తమ శానికలుగా చేసుకునే సుఖదుఃఖాలకు అతీతులు. సంసారసాగరంలోని సుఖదుఃఖాలనే అలలలో కూడా వీరు ఆ పరమేశ్వరుని లీలనే దర్శిస్తారు. అందుకనే శ్రీశంకరులు 'శివానందలహరి'లో...

క్రీడార్థం సృజతి ప్రపంచమఖిలం, క్రీడా
మృగాస్తేజనాః

అంటారు.

ఏ రూపములో భగవాను నర్చించినను ఒకే భగవంతుడు కలడను నమ్మకముతో సాధన చేయు వారెల్లరును భగవానుని దర్శింతురు. భక్తులు వారివారి భావనావిశేషముల ననుసరించి భగవంతుని వేర్వేరుగా అభివర్ణించు చుందురు. ప్రతివ్యక్తి ఆ భగవంతుని స్వరూపమే. కాబట్టి బాహిరమైన ఆచారవ్యవహార భేదముల ననుసరించి వారిని వేర్వేరుగా చూచుట చాలా తప్పిదము. ఇది శ్రీపరమహంస ఆచరించి నిరూపించిన నిత్యసత్యము. ఇదే ఈనాటి మానవాళికి మార్గదర్శకము. ఎన్నో సంకుచితధోరణులు మానవులలోని మానవత్వాన్ని మంటగల్పుతున్నాయి. అందుచేతనే శాంతి లోపించింది. ఎంతో విలువైన మానసిక, శారీరక, శక్తి మారణాయుధాల తయారీలో వృథా అగుచున్నది. ప్రతివారు మానవత్వం గల ఒక మానవునిగా మనుచూ,

తోటివార్ని మానవులుగా చూచి ఆదరించి ప్రేమించడంకన్నా ఈనాడు కావాల్సింది, చేయగల్గింది ఏమీ లేదు.

నిజమైన ఆధ్యాత్మికజీవనం నైతికప్రవర్తన మీదే పూర్తిగా ఆధారపడియుంటుంది. ఆధ్యాత్మికత అన్నది అప్పుడప్పుడు ధరించే అలంకారవస్త్రము కాదు. నైతికవర్తనం వ్యక్తిలో అహంకారాన్ని పెకలించి అన్ని జీవులలో సత్యం వెలిగే ఒకే పరమేశ్వర రూపాన్ని దర్శించేటందుకు దోహదం చేస్తుంది. ఇటువంటి వ్యక్తికి తనకూ, తనచుట్టూ ఉన్న ప్రపంచానికి మధ్య భేదం కనబడదు. వ్యక్తిలో ఎప్పుడైతే అహం — ''నేను'' నశిస్తుందో అప్పుడే నిజమైన ప్రేమ ఉదయిస్తుంది. మానవతావాదానికి మూలం సృష్టినంతను తనలో ఇముడ్చుకోగల భావనాచైతన్యం—ఎల్లలులేని మతం అనవచ్చు— నుండే ఉద్భవిస్తుంది. ఈ సత్యాన్నే మహాత్మాగాంధికూడా చెప్పారు. ఒకసారి ఒక భక్తుడు శ్రీపరమహంసను 'నేను ఎన్నడు మోక్షాన్ని పొందగలను' అని అడిగాడట. అప్పుడు శ్రీవారు చిరునవ్వుతో ఆ 'నేను' అన్నది ఎప్పుడు మాయ మాతుందో 'అప్పుడే' అన్నారట. శ్రీరామకృష్ణపరమహంస ఎన్నడూ 'ఈ శరీరము అపవిత్రమైనది, ఇది ఆధ్యాత్మిక అనుభవానికి అడ్డు' అని చెప్పలేదు. పరమహంస శిష్యులు శ్రీవివేకానంద స్వామి ఇటువంటి విశ్వజనీనమైన దృష్టిని ఆకళించుకొని ఆధ్యాత్మికామృతంకోసం అలమటిస్తున్న పశ్చిమ దేశాలకు సందేశాన్ని ఇచ్చారు. ఈ దృష్టి మానవతను, మానవతా దృక్పథాన్ని శిఖరాగ్రాలకు ఎత్తి మానవాళి, మానవతతో, దైవత్వంతో మనగలగడానికి పునాదిని వేసింది. ఇదే శ్రీపరమహంసవాణిలోని విశిష్టత.

పరమహంస, వివేకానందులు గతశతాబ్దంలో ఉండి మానవాళిని మేల్కొలిపారు. అట్లాగే ఈ శతాబ్దంలో శ్రీఅరవిందమహర్షి తమ మానసిక ఆధ్యాత్మిక శక్తితో జాతీయ పునరుజ్జీవనానికి, మానవజాతి పురోగతికి ఎంతో దోహదం చేశారు. అతి చిన్నవయస్సులోనే పశ్చిమదేశాల్లో విద్వత్తును పుణికిలి పుచ్చుకొని, స్వదేశానికి వచ్చి దాదాపు దశాబ్దకాలం రాజకీయరంగంలో ఉండి తమదేశవాసుల్ని మేల్కొలిపి, తరువాత ఆధ్యాత్మిక శిఖరాగ్రాలనుండి మానవజాతికి అత్యుత్తమ గమ్యాలను చూపారు.

సృష్టిపరిణామక్రమం నేటి మానవునిలో మానసికస్థాయి చేరుకుంది. దీనిని అధిగమించి అధిమనస్సు (Supermind) స్థాయి చేరుకొని సృష్టివికాసానికి మానవుడు తోడ్పడాలి. ఇది శ్రీఅరవిందుల దివ్యదృష్టి. ఈ స్థాయే దివ్యజీవనానికి మూలసోపానం. శ్రీరామకృష్ణపరమహంస మహాజ్ఞాని. వారికి పాండిత్యముతో పని లేకపోయినది. వారి జ్ఞానవాహినిలో మానవాళి కొత్తగమ్యాలను కాంచింది.

ఈవిధంగా శ్రీపరమహంస, వారి శిష్యులు శ్రీవివేకానందులు అనంతంగా వస్తున్న మహర్షి సంప్రదాయంలో అగ్రేసరులై అవతారరూపాలై మానవాళికి ఈ సృష్టిలో అనుస్యూతంగా ఉన్న ఆధ్యాత్మిక వెలుగును చూపి, ఆ దిశగా క్రొత్తబాటల్ని వేశారు.

సహనావవతు, సహనౌభునక్తు
సహవీర్యం కరవావహై, తేజస్వి నావధీతమస్తు
మా విద్విషావహై.

# శ్రీరామకృష్ణుల గురించిన పవిత్ర స్మృతులు

## శ్రీ అఖండానందస్వామి

అది 1883-84 సం॥పు వేసవికాలము. నేను సుమారు 15, 16 యేండ్ల బాలుడను. మొట్ట మొదటి రోజు నేను శ్రీరామకృష్ణుని దర్శించుటకు వెళ్ళినప్పుడు, ఆయన ప్రేమతో, చిరునగవుతో నన్నాహ్వానించి తనప్రక్కన కూర్చుండబెట్టుకొని, "నీ వింతకుముందు నన్ను చూచియున్నావా!" అని యడిగెను. "నేను తమరి నొక భక్తుని ఇంట చూచియుంటిని. అప్పుడు నేను పసిబాలుడను." అని బదులిచ్చితిని. (ఒక చిన్న ఉత్సవసందర్భమున ఆయన భావోన్మత్తుడై ఒకటి, రెండు మాటలతో సమాధిస్థితి నందుచుండుటను గమనించితిని. నాడి కొట్టుకొనుట లేదు. కన్నులు అనిమేషములుగా నున్నవి. శరీరము కొయ్యబారినది. భగవంతుని గూర్చిన భావమును అందు కనువగు నామముతో 'ఓం' అను అక్షరమును ఆయన చెవియందుచ్చరించినప్పుడే మరల అతని మనస్సు సమాధిస్థితినుండి క్రిందికి వచ్చును; కాని వెను వెంటనే మనస్సు తిరిగి సమాధిస్థితియందు లగ్నమగును.) శ్రీరామకృష్ణుడు దరహాసముతో గోపాల్దాతో నిట్లనెను. "వినుము–అత డేమనుచున్నాడో! అతడు చిన్న బాలుడుగా నున్నప్పుడు నన్ను చూచినాడట!"

అతని కోరిక ప్రకారమా రాత్రి దక్షిణేశ్వరమునందే గడిపితిని. సాయంసమయమున ఆతడు నన్ను విష్ణు, కాళి దేవాలయములను దర్శించిన తర్వాత పంచవటికి వెళ్లుమనెను. సాయంకాలము గురుదేవుని గదికి తిరిగి వచ్చితిని. అప్పుడు హారతిగంటలు మ్రోగుచుండెను. వానితో కాళీబారి ప్రతిధ్వనించుచుండెను. ధూపము వేయబడి యుండెను. గురుదేవుని గది ఆయన కనుపించకుండునంతటి చీకటిగా నుండెను. ఆయన బాహ్యస్మృతినంతయు కోల్పోయి నిశ్చలుడుగా కూర్చుండియుండెను. మరునాడుదయము నేను సెలవు తీసికొనినప్పుడు, ఆయన చిరునగవుతో, "శనివారముల మరల రమ్ము" అనెను.

అది శనివారము. నేను తిరిగి వెళ్లుట కాతడంగీకరింపలేదు. సాయంకాలపు హారతి ముగిసిన వెనుక, ఆయన నా కొక చాప నందించి, క్రింద పరుపుమనెను. తర్వాత నాతడు శయనించుచు తన ముద్దుబిడ్డతో తల్లివలె, "సౌఖ్యముగా నుండు ఆసనమున కూర్చుండి నీవు ధ్యానము చేయుము" అనెను. మఱియు "ఏ తీరుననైనను నీముందు సిద్ధముగా నున్న ఆహారమును తీసికొనుము. అది నీ ఆకలి తీర్చును."—అదియే నా కతడు మంత్రదీక్ష నొసగిన రోజు. తర్వాత ఆయన తన పాదములను నా ఒడిపై చాపి, నన్ను పాదముల నొత్తుమనెను. నే నప్పటికే యొక మల్లుడుగా నున్నందున కొంత బలముతో పాదముల నొత్తితిని. వెంటనే ఆయన, "నీ వేమి చేసితివి! ఏమి చేయుచున్నావు! నా కాళ్ళు నలిగి విరిగిపోవును. మృదువుగా, మెల్లగా నొత్తుము" అనెను. అతని పాదము లెంత మృదువైనవో అప్పుడు నేను గ్రహించితిని. అతని శరీరము వెన్నతో చేయబడినట్లుండెను.

అప్పుడు నేను పెక్కు నియమనిష్ఠల పాటించుచుంటిని. స్వయంపాకము—గంగానదియందు నాలుగుసార్లు స్నానము—దువ్వని పొడుగగు కేశములు, ఉంచుకొని యుంటిని. ఒకనాడు గురుదేవుడు నన్ను చూచి, "నీవు చిన్న బాలుడవు, ఇంత పూర్వాచారపరాయణుడవుగా

నుండెదవేల? ఇంత ఎక్కువ నిష్ఠ మంచిది కాదు'' అనెను.

గురుదేవుని యొద్దకు వెళ్ళుటకు పూర్వమే నేను ప్రాణాయామము చేయుచుంటిని. అప్పటికే నేను కంపన, చెమటపట్టుట మున్నగు ననుభవముల నందు సంపాదించి యుంటిని. ప్రతిదినము గంగయందు మునిగి కొంతసేపు శ్వాసను బిగపెట్టెడివాడను. గురుదేవు డీ విషయములను విని నన్ను వానినుండి విరమింపజేసెను. ఏలన అట్టి అభ్యాసములవలన అనివార్యములగు వ్యాధులు కలుగవచ్చును. ''ప్రతిదినము గాయత్రిని జపింపుము'' అని ఆత డనెను.

నేను నియమనిష్ఠలు గలవాడ ననియు, ఆచారవంతుడ ననియు ఆయన ఎఱుగును. నేను స్వయంపాకమునే భుజింతు ననియు, అందువలననే ప్రతిదినముమధ్యాహ్న సమయములందే ఆయనను చూడవచ్చి, ఆ రాత్రియంతయు అచ్చటనే గడపి, మరుసటి యుదయము తిరిగి పోయెడి వాడ ననియు నెరుగును. నా నియమనిష్ఠల తగ్గించి, నన్ను విశాలహృదయునిగా చేయుటకుగాను, ఆయన యొక యుదయము నేను తిరిగివెళ్లుట కనుమతింపలేదు. నా సంకోచము నాతనితో చెప్పితిని. అందుల కాతడు, ''జగన్మాతకు నివేదించిన భోజనమును తీసికొనుము. అది మిక్కిలి పవిత్రమైనది. అంతేగాక అది గంగాజలముతో వండబడినది'' అనెను. తుదకు మాతృప్రసాదమును గ్రహింప నంగీకరించి బయలుదేరితిని. కొంత దవ్వేగిన పిదప, వెనుకకు తిరిగి చూచుసరికి, గురుదేవుడు నేను కాళీదేవాలయమునకు పోయెదనా, లేక విష్ణుదేవాలయమునకు పోవుచున్నానా యని గమనించుచుండెను. జగన్మాతకు నివేదించిన వానిలో శాకాహారముల గ్రహించి తిరిగివచ్చుసరికి గురుదేవు డొక తమలపాకును తనచేతియందుంచుకొని నాకై వేచియుండెను. నాకు తాంబూల మలవాటు లేదు. కాని మరల ఆయన నన్ను వదలక, ''దీనిని తీసికొనుము. ఎల్లప్పుడును భోజనమునకు తర్వాత ఒకటి రెండు తినుట మంచిది, నోటిలోని చెడువాసనల నన్నిటిని ఇది తొలగించును. దీనిని తినిన నీకు గలుగు చెడుగేమి? నరేంద్రుని చూడుము—అతడు వందలకొలది తమలపాకుల తినును. అతడు దొరికిన వన్నిటిని తినును. కాని అంతమాత్రమున నేమి? అతని పెద్ద కన్నులెప్పుడును అంతఃర్ముఖములుగానే యుండును. అతడు కలకత్తా వీథులలో పోవునపుడు అచ్చటి ఇండ్లు, వాహనములు మున్నగున వన్నియు నారాయణునితో (దేవునితో) నిండినవిగా చూచుచున్నాడు. ఆతని నొకసారి గలసికొనుము.''

అటులనే మరుసటి రోజాతనిని కలిసికొంటిని. అప్పు డాతడు అచ్చటి వెలుపలి గదిలో ప్రక్కమీద 'బుద్ధగయ' యనునొక పెద్ద గ్రంథమును చదువుకొనుచుండెను. గదియు, పరుపును చెల్లాచెదరుగా నుండెను. కాని గంభీరదృక్కులతో దివ్యమైన యాకారముతో చిరుగడ్డము గల నరేంద్రుని మూర్తిమత్త్వము నన్ను ముగ్ధుని చేసినది. నే నాతనితో, ''గురుదేవుడు నిన్ను కలసికొనుమనె'' నని పలికితిని. ఆతడు నన్ను కూర్చుండుమనెను. తర్వాత నాతడు లోనికి వెళ్ళి తిరిగి వచ్చుచు, ''నీవు గురుదేవునియొద్దకు వెళ్ళియుంటివా? మరొకసారి రమ్ము'' అనెను.

గురుదేవుడు నన్ను ''నీవు నరేంద్రుని వద్దకు వెళ్లితివా?'' యని ప్రశ్నించెను. ''అవును. తమరు చెప్పిన దంతయు అక్షరాలా సత్యమే'', అంటిని. ''ఆతని నొక్కసారి చూచుటతోనే ఇన్ని విషయముల నీవెట్లు

గ్రహించితివి?'' "ఆతని విశాలనేత్రముల చూచితిని. ఆతని మనస్సు బహిర్ముఖముగా లేదు, అత డీ ప్రపంచమున నున్నట్లే అగపడ లేదు. ఆతడు పెద్ద పెద్ద ఆంగ్లగ్రంథములను చదువు చుండెను. గదియంతయు చెల్లాచెదరుగా నుండెను.'' గురుదేవుడు నాతో "ఆతని వద్దకు మరల పొమ్ము, ఆతని సాంగత్యముతో వీలైనంతవరకు గ్రహింపుము'' అనెను.

నే నొంటరిగా నున్నప్పుడు, "నా నియమ నిష్ఠల నెల్లను త్యజింపవలసినదేనా ఏమి?'' అని తలంచితిని. ఒక మధ్యాహ్నము కొందరు భక్తులు గురుదేవునితో "ఆర్యా, ఈ బాలురు ప్రాపంచికజీవితముల వదలి, సర్వసంగపరిత్యాగు లగుటకు మీ దరి చేరుచున్నారు. ఇది శ్రేయస్కరమైనదా?'' అనిరి. గురుదేవుడు, "నీవు వారి ప్రస్తుతజీవితములను మాత్రమే చూచుచున్నావు. కాని వారు తమ పూర్వజన్మములందే వానినంతయు సంపూర్ణముగా ముగించియుండుటను నీ వెరుగవు. ఒక తల్లికిగల నలుగురు కుమారులలో, ముగ్గురు ప్రాపంచిక భోగములకై పిచ్చివారివలె తిరుగుచున్నారు. కాని ఒకడు మాత్రము సర్వసంగపరిత్యాగి యగుట కువ్విళ్లూరుచున్నాడు. ఆ బాలుని చూడుము. సత్త్వగుణస్వభావమువలనవచ్చు సంస్కారము లటువంటివి'' అనెను. గురుదేవుని పై వాక్యములు నా భక్తిని, నియమనిష్ఠలను ద్విగుణీకృత మొనర్చినవి.

"జపధ్యానములను శనివారమునను, మంగళవారమునను అధికముగా నొనర్పుము.'' శనివారము మధువారము (వంగభాషయందు శనిబార్-మధుబార్) అని వా రనుచుందురు.

ఒకప్పుడు గురుదేవుడు తన భక్తబృందముతో సంభాషించుచుండుటను చూతును. మరియొకప్పు డాయన తీవ్రముగా నేడ్చును. ఒకప్పుడు కీర్తనల పాడుచు నాట్యము చేయును, ఒకప్పుడు ఆనందపారవశ్యమున మునిగియుండును, మరొకప్పుడు గాఢసమాధిస్థితియం దుండును. కన్నుమూసి తెరచు నంతలో, త్వరితగతిని కాలము గతించుచుండెను.

ఆయన మమ్ము ధ్యానస్థితియం దాసీనుల జేసి, తర్వాత "ప్రార్థించునపుడు నీ కన్నుల నుండి ధారలుగా కన్నీరు వచ్చుచున్నదా?'' అని ప్రశ్నించును. నే నొకసారి 'నిజమే' నంటిని. ఆయన ఇంత సంతోషపడెను. "పశ్చాత్తాపమువలన కలుగు కన్నీరు ముక్కునకు దగ్గరగల కన్నుల మూలలనుండి స్రవించును. ప్రార్థనావిధానమును నీ వెరుగుదువా?'' అని వివరించెను. పసిబాలునివలె రెండుకాళ్లను చాచి బిగ్గరగా, "ఓ జగన్మాతా! నాకు జ్ఞానము నిమ్ము. ప్రేమపూర్వకమైన భక్తి నిమ్ము. అమ్మా- నాకు మరొండు వలదు. తల్లీ, నిన్ను విడిచి నేను జీవింపజాలను'', అని ప్రార్థించెను. ఆతని పంచెముడి యూడిపోగా, ఆత డచ్చముగా పసిబాలునివలె నుండెను. ఆనందబాష్పములు ధారలై ప్రవహించుచుండ నాతడు గాఢసమాధిస్థితి నందెను. గురుదేవుడు నాకొరకే ఇట్టి ప్రార్థనల నన్నియు నొనర్చెనను భావన నా కప్పుడు దృఢముగా స్ఫురించెను.

స్వప్నములగురించి యొకప్పు డాతడు, "స్వప్నమందు ఎవరేనియు జ్యోతులను క్రమముగా నొక్కొక్కటిగా వెలిగించుచున్నట్లును, లేక అగ్ని రగుల్కొనుసట్లును, లేక తన పేరును తానే పిలిచినట్లును, చూచిన—యవి యన్నియు మంచివే. కడపటిది ఉత్కృష్టమైన చిహ్నము.''

దివ్యజ్ఞాన సమాజమునకు సంబంధించిన కర్నల్ ఆల్‌కాట్ అను అమెరికాదేశస్థుడు, తన సర్వస్వమును వదలి, హిందూమతమును స్వీకరించెనని ఎవరో గురుదేవునివద్ద ననిరి. ఈ విషయ మాతనికి సంతోషము కలిగించినదేమో నని మే మాతని ముఖమును గమనించితిమి. ఆతడు విసుగుతో, "ఆతడు తన మతము నెందుకు వదలెను!" అని అడిగెను.

ఒకసారి ఆయన ఇట్లనెను, "చిన్నబాలురు అన్నిటినీ సజీవములుగా చూతురు. గాలికి ఆకు లాడుచుండెనేని, 'నిలువుడు, నేనా మిడుతను పట్టుకొనెద' నని బాలు డనును. ఆకసమున మెరుపులు మెరిసిన, 'చూడు. చూడు. చెకు ముకిరాయినుండి నిప్పు మెరయుచున్న' దనును.

ఒకనా డుదయము (క్రిందటి రాత్రి ఆత నితో గడపితిని) గురుదేవుడు నన్ను కాళీ దేవ్యాలయమునకు తోడ్కొనిపోయి, (ఇంతకు ముందు నేనందు ప్రవేశించి యుండలేదు) అచ్చటి శివలింగమును చూపించుచు, "చూడుము, ప్రాణము పోసికొనియున్న శివు డిదియే" అనెను. శివుడు శ్వాసించుచున్నట్లు నా కనిపించినది. గురుదేవుడు మరల, "చూడుము, చైతన్యము అచేతనమువలె నెట్లు పడియున్నదో," అనెను. నేను నిశ్శబ్దముగా మంత్రముగ్ధుడనై అట్లే భావించితిని. ఇంతవర కది ప్రతిచోటనుగల సాధారణవిగ్రహమనియే తలంచుచుంటిని. కాని ఇది ఏమి? ఇది సజీవ ముగా నున్నదే! ఎంతటి గొప్ప ఆనందముతో గురుదేవుడు నా హృదయము నుద్వేలము చేసినాడు! దీనిని వర్ణింపసాధ్యమా! అనుభ వించియే చూడవలెను.

ఆతర్వాత గురుదేవుడు జగన్మాత ఆభరణ ముల నన్నిటిని వాని యథాస్థానమున నుంచు చుండగా తన గడ్డ జారిపోయెను. గురుదేవుడు తప్పుత్రాగిన వానివలె నగుపడెను. చాల కష్ట ముతో ఆయనను తన గదికి చేర్పగలిగితిని. ఆయన అచ్చట చాలసేపు సమాధిస్థితియం దుండెను. ఆ రోజు గడచుటెట్లో నే నెరుగను— గురుదేవుడు సూచించినట్లు సర్వదా ధ్యాన నిమగ్నుడనై యుంటిని. గురుదేవుడు మన స్సెదేని ఆంతరంగిక విషయమున మునుగు చుండ నెన్నియో కీర్తనముల పాడెను.

చీమయందైనను, ఏనుగయందైనను, సర్వ మందును బ్రహ్మమే నిండియున్నదను ద్విపద నొక సాధువువద్ద నేర్చితిని. దీనిని గురుదేవు నితో చెప్పగా, నాతడు చిరునగవుతో, "కాని చీమయందును, ఏనుగునందును గల శక్తి సమానము గాదు కదా! బ్రహ్మ మొక్కటే గాని బహిర్గతమగు శక్తియందు తారతమ్య ములు లేవా?" అనెను.

దక్షిణేశ్వరమునం దొకనాటి సాయం కాలము. గురుదేవు డంతర్ముఖుడగు మన స్సుతో, మధ్యమధ్య మాటలాడుచు, "ఆత్మయే ఇష్టదేవత. ఇష్టదేవతా సందర్శనమే ఆత్మ సాక్షాత్కార" మనెను.

ప్రాతఃకాలసమయమున గురుదేవుడు తన గదియందు 'ఓం ఓం ఓం' అను మంత్రము నుచ్చరించుచుండెను. గదియంతయు సమాధి గత మైనట్లుండెను. బాహ్యాభ్యంతరములందు భగవత్సాక్షాత్కార మగుచున్నట్లుండెను.

ఒకనా డొక భక్తునింట గురుదేవుడు జగ న్మాతతో, "అమ్మా! నీవే మనోప్రాణము లైనపుడు, నా మనోప్రాణముల నీ కర్పించు టెట్లు?" అనుచు అర్ధనిమీలితనేత్రుడై తనలో తానిట్లనుకొనెను. "ఛీ, ఛీ, కామినీ కాంచనా సక్తు లెట్టి నిర్భాగ్యులో కదా! తల్లీ! వారికి

మరేదియు లభింపదు.'' అనుచు తన అరచేతిపై ఉమ్మివేయ నారంభించెను. దానితో ఆతని మెత్తకూడ తడసి పోయెను. అట్టి సన్నివేశమునందలి అద్భుతభావము లన్నియు నా మనస్సున గాఢముగా నాటుకొని నా జీవితమున కంతటికి పునాదియైనది.

ఇంకొక రోజు, గడచిన రాత్రి ఆతనితోనే యుంటిని. ఉదయమున ఆతడు సందర్శింప వచ్చిన వారందరితోను చాలప్రీతితో మాట్లాడెను. నేను దేవళములందు తిరుగాడుచుంటిని. 'నమః శివాయ శాంతాయ' మున్నగు శ్లోకముల స్మరించుచు ప్రతిశివలింగము ముందటను నమస్కరించితిని.

నేను తిరిగివచ్చిన వెనుక, ఆతడు నన్ను గంగాస్నానమునకు తనతో రమ్మనెను. దేవస్థానపు తోటగుమాస్తా, ఒక పాదమును గంగాజల మందును, మరొక పాదమును మెట్లపైనను ఉంచి, తన పగిలినపాదమును రుద్దుకొనుచుండెను. గురుదేవు నాతడు కన్నెత్తియైనను చూడలేదు. గురుదేవుడు మెల్లగా గంగలోనికి దిగి, తొడలు మునుగు నీటియందు నిలిచి, తలపై గంగాజలమును ప్రోక్షించుకొని, కొంచెము నీటిని నోటిలో పోసికొని, ఉమ్మిలించి, ఆ నీటిని తన హస్తములతో గ్రహించెను. ఈ సంఘటనవలన నేను ఆతనికి గంగపైగల, "గంగాబారి బ్రహ్మబారియే'' అనగా గంగాజలము బ్రహ్మజలమే అను విశ్వాసమును ప్రత్యక్షముగా చూడగలిగితిని. గంగాజలమును తన పాదములతో తాకుటకూడ ఆతనికి బాధాకరమేమో అనిపించుచుండెను.

అంతలో నొక మోటువాడు వేగముగా వచ్చి అచ్చటి గుమాస్తాను గుంటయందలి చేపల సంఖ్య, పండ్లతోటయందలి ఫలములు, ఖరీదు మున్నగు వివరముల నడిగెను. గురుదేవుడు తన ముఖమున కొంత కోపమును కనబరచుచు, ప్రక్కకు తిరిగి ఆతనిని చూచెను.

స్నానము ముగిసిన తర్వాత ఆతని గది చేరితిమి. కొంచెము గంగాజలమును నేనాతని పాదహస్తులపై చల్లిన వెనుక వాని నతడు ధరించెను. పిదప కొంత ప్రసాదమును స్వీకరించెను.

అంతలో నొకడు కొన్ని పైసల యాచింప, గురుదేవుడు నాతో "ఆ బీరువాపై నున్న నాలుగుపైసల నాతని కిమ్ము'' అనెను. వాని నాతని కిచ్చివేసిన తర్వాత గురుదేవుడు నాతో "గంగాజలముతో నీ చేతుల కడుగుకొనుము'' మనెను. నే నట్లే చేసితిని. తర్వాత జగన్మాత కాళీచిత్రమువద్దకు నన్ను పిలుచుకొని పోయి చాలసేపు 'హరిబోల్ - హరిబోల్' - అను నామము నుచ్చరించుచు చప్పట్లు కొట్టునట్లు చేసెను. గురుదేవుడుకూడ అట్లే యొనరించెను. ఈ సంఘటన మూలమున ఆతడు, "మట్టికి, మలమును మనము అసహ్యించుకొనుటకు మించి డబ్బును ఛీత్కరింపవలె'' నను విషయమును నా మనస్సున బాగుగా నాటుకొనునట్లు చేసెను. అప్పటినుండి నేను 14 సం॥లు ప్రయాణము చేసియు, ఒక పైసనుకూడ ముట్టుకొనలేను. ఇప్పుడుకూడ డబ్బనిన వెనుదీయుచున్నా ననిన, అందుకు కారణ మానాటి సంఘటనయే. ఆతడు నా శ్రేయస్సుకై యింత చేసెనని నాకిప్పుడు బోధపడుచున్నది. లోకసంగ్రహమునకై, స్వయముగా శరీరబంధముల నతడు కల్పించుకొనెను. అందులకే మాకోస మాతఁ డంత శ్రమపడెను.

గంగానదిమెట్లనుండి ఆ మోటుమనిషి వచ్చి, "అక్కడ హారీషున్నాడా? హారీషు!'' అని ప్రశ్నించెను. ఆతని ప్రశ్నకు సమాధాన

మిచ్చుటకు బదులు గురుదేవు డతనితో, “నీ వొక బ్రాహ్మణుడవు. మూడుపాళ్ళ జీవితమును వ్యయించిన వాడవు. అంతకుపైగా ఇది పవిత్రగంగాతీరము. ఇచ్చటనైన నీకు నీ ఇష్టదేవత గుర్తునకు రాలేదా? కొలనులోగల చేపలగూర్చియు, తోటలోగల పండ్లు, వీనివలన మొత్తపులాభమునుగూర్చియు మాట్లాడుచున్నావు! ఛీ ఛీ పొమ్ము” అనెను. ఆ బ్రాహ్మణుడు పశ్చాత్తాపమునొందుటకు బదులు కోపముతో వెళ్ళిపోయెను. ఆతడు నిలిచియుండిన స్థలముపై గంగాజలమును చల్లుమని గురుదేవుడు నాతో చెప్పెను.

# యోగసారబోధిని—20

## శ్రీ జ్ఞానేశ్వరానందస్వామి

అర్హత గలిగిన సాధకునకు “అధికారి” యని యోగపరిభాష. శ్రీమద్భగవద్గీతయందలి 12-వ అధ్యాయమున 13 నుండి 20-వ శ్లోకము వరకు భక్తియోగమున కధికారి వర్ణింపబడెను. భక్తుని ముఖ్యలక్షణము లేవన పరిశుద్ధత దేవుని పట్ల భక్తివిశ్వాసములు స్వతస్సిద్ధమయిన ప్రీతి శ్రద్ధ యనునవి. భక్తి ప్రీతి అనునవి అవ్యాజముగాను మనఃపూర్వకముగాను ఉండవలెను. అధికారులు మరియు మూడు రకములు. ఉత్తమ, మధ్యమ, అధమ అధికారులని. ఉత్తమాధికారి గురూపదేశముల, శాస్త్రవిధుల యుద్దేశములను చెప్పకుండగనే గ్రహించును. ఉపదేశము చేయగనే విషయ మతనికి గ్రాహ్యమైపోవును. మధ్యమాధికారి ఉపదేశమును మరల మరల వివరించినచో గ్రహించుకొనును. అధమాధికారికి ఎంత బోధించినను చిరకాలమునకు గాని యుపదేశములు బోధపడవు. ముగ్గురును శ్రద్ధావంతులే. ముగ్గురును పురోగతికై యత్నించువారే. ఇట్లున్నను వారి వారి యధికారభేదము ననుసరించి ఒకరికంటె నొకరు ఎక్కువ ప్రయత్నము చేయవలసి యుండును.

మానవులు సమానశక్తి సామర్థ్యములతో జన్మింపరు. వారికి సమానావకాశము లుండవలె ననుట న్యాయమే కాని జన్మతః మానవులు సమానులు కారు. వారి వారి సంచిత కర్మయే వారి ప్రస్తుత జీవనపథమును నిర్ణయించును. మానవుని సహజగుణములు గ్రహణశక్తి ప్రతిభ మొదలగువానిద్వారా ఈ సంచిత కర్మము వ్యక్తమగుచుండును. ఎండిన కట్టె వెంటనే రాజుకొనును. అట్లే కొంద రధికారులుపదేశముల నితరులకంటె సులభముగా నర్థము చేసికొని జీవితమునం దాచరింపగల్గుదురు. ఎవరైనను అరటిచెట్టును మండింపలేరు గదా! అది యూరకనే రగులుచూ పొగ వేయును. శ్రీరామకృష్ణు లొకపర్యాయమిట్లనిరి. “నేనేమి చేయుదును? అత డరటిబోదె వంటి వాడు. ఎంత ప్రయత్నించినను దానికి నిప్పంటించలేము. అది యూరకనే రగులుచు పొగబారును. మండునవి అతని కన్నులు నా కన్నులు మాత్రమే.”

మానవప్రకృతి సత్త్వరజస్తమోగుణముల మిశ్రమము. అందొకటియో రెండో మానవుని శీలమునందు ప్రాధాన్యతను వహించును. బుద్ధిమాంద్యము, అలసతగా తమస్సు ప్రకటీకృతమగును. స్పర్థ, మితిమీరిన యుత్సాహము ఇత్యాదులు రజస్సును సూచించును.

పారమార్థిక విలువలను గ్రహించు శక్తి సూక్ష్మగ్రహణము శాంతదాంతములు మొదలగు వానిద్వారా సత్త్వము ప్రస్ఫుటమగును. ఏ లక్షణములున్నను సాధకుడింకొకరి ననుకరించుట పనికిరాదు. తన స్వభావము ననుసరించి తన మార్గముననే పురోగమింపవలెను. ఆధ్యాత్మికజీవనమునందు, ఇంకొకరితో సమానముగా నుండవలసిన యగత్యమే లేదు. అతడేమి చేయుచున్నాడో ఎంతవరకు వచ్చెనో యను నాలోచనలు పట్టి కాలహరణమును మాత్రమే సాధించును. కొందరు భక్తులు హఠాత్తుగా గాఢమైన భక్త్యావేశమును బొందినను త్వరలో దానిని గోల్పోవుటను గమనింతుము. అట్టివారు ఒక్కరోజుననే వికసించి వాడిపోవు పూవుల వంటివారు. ఇతరులు టేకుచెట్టువలె నిదానముగా పెరిగినను ఎప్పటికిని పెరుగుచునే యుందురు. భక్తిని త్వరపెట్టుటకు రసాయనపు టెరువు లేవియు లేవు గదా. దాని స్వాభావికమగు పెరుగుదలను నిరోధించు నాటంకములను తొలగించుచు ఏపుగా పెరుగుట కవకాశమును కలుగజేయుటయే సాధకుని కర్తవ్యము.

ఇష్టదేవతనుగూర్చి సుస్థిరము అచంచలము నగు అభిప్రాయమేర్పడిన పిదప స్వాతిచినుకును గ్రహించిన ముత్యపుచిప్పవలె అధికారి సాధన సాగరములో మునిగిపోవును. అచ్చట నిదానముగా నిరంతరప్రయత్నముతో తన భక్తిభావమను ముత్యమును రూపొందించుకొనును. సాధన యనగా నభ్యాసము, నియమనిష్ఠలు. భక్తిసారస్వతమునందు భావ మనగా ఇష్టదైవముపట్ల సాధకునకు గల నిరంతర సంబంధము. పరిపూర్ణతను వ్యక్తము చేయునట్లు నీ అత్యున్నతాశయమునకు రూపకల్పన చేయ గలిగితి వనుకొనుము. అప్పుడది ఏ దృష్టితో నీకు ప్రీతిపాత్ర మగునో ఆ దృష్టియే నీ భావ మగును.

నీ భక్తిభావము నీ వరకే పరిమితమైన దని గుర్తుంచుకొని దానిని గోప్యముగా నుంచుకొనవలెను. అంతే గాక ఇతరులను గూడ నీ యుద్దేశములతోను ఆశయములతోను బాధింపరాదు. కొన్ని సందర్భములలో మొగ్గనుండి పూవు వికసించునట్లు భావ మొక స్థాయినుండి ఇంకొక స్థాయి నందుకొనును. ఎట్లైనను పారమార్థిక పరిణతికి మిక్కుటమైన సాధన అభ్యాసమును అవసరము. ఊరకనే కాలయాపనము చేసిన నేమియు లాభము లేదు.

భక్తిభావము లనేకములైనను వాని నీ క్రింది విధముగా విభజింపవచ్చును.

1. శాంతభావము : సర్వశక్తిసంపన్నుడైన పరమేశ్వరునిపట్ల ప్రగాఢమగుభయభక్తులును అనురాగమును శాంతభావ మనబడును.

2. దాస్యభావము : యజమానునిపట్ల సేవకున కుండు భావము. అట్టివాడు వినయముతో దూరముగ నుండియే సకలసేవలను శ్రద్ధతో జేయును.

3. తాతభావము : దేవునిపట్ల మాతృభావము లేదా పితృభావము. భక్తియోగమునందు భక్తుడు భగవంతుని స్త్రీపురుష భేదములతో నూహింపవచ్చును.

4. సఖ్యభావము : స్నేహితునివలె జూచుట.

5. వాత్సల్యభావము : తల్లిదండ్రులకు తమ బిడ్డలయం దుండు భావము.

6. మధురభావము : ప్రేమికుల కొండొరులపై గలుగు భావము. ఇచ్చట దైవమేదియో అతిమానుషశక్తి యని గాక తమ వంటి వాడే యని ప్రేమభావము తోచును. (సశేషము)

# పరిప్రశ్న

[మద్రాసు శ్రీరామకృష్ణ మఠమున 16-4-72 వ తేది జరిగిన అంతర్యోగమున శ్రీమత్ తపస్యానందస్వాములవారితోడి ప్రశ్నోత్తరావళి ఇచ్చట పొందుపరుపబడినది.]

ప్రశ్న: ''తమ అంత్యజన్మమును జీవించుచున్నవారు ఇచ్చటికి రాగల'' రనియు, ''ఒక్కసారి యైనను మనఃపూర్వకముగా భగవంతునికై ఆరాటపడినవారు ఇచ్చటికి వచ్చియే తీరవలయు''నని శ్రీరామకృష్ణులు పేర్కొనినట్లున్నది. ఈ వాక్యముల నెట్లు మన మర్థము చేసికొనవలెను?

బదులు: తమ అంత్యజన్మమున నున్నవారిలో పలువురు ఆయనయొద్దకు పోవుదు రనియే ఈ వాక్యమున కర్థము. అట్టి వారందరును ఆయనవద్దకు వచ్చియే తీరవలయునని అందు కర్థము కానేరదు. ముక్తికి పలు మార్గము లున్నవని బోధించిన ఆయన సిద్ధాంతమునకే అది విరుద్ధ మగును. ఒక అవతారమూర్తి అవతరించియుండు కాలమున యోగారూఢులు పలువురు తమంతట తామే వారి యొద్ద కాకర్షింపబడుదురు. శ్రీరామకృష్ణుల విషయమున నిది అక్షరాల నిజము. బహిరంగత నాతడు నిరసించినను; శిష్యులను సంపాదించుటకును మతాంతరీకరణము చేయుటకును ఆయ నెచ్చటికిని ప్రయాణములు చేయకుండినను, ఆయన అఖండాధ్యాత్మిక శక్తిచే ఆకర్షింపబడి ఉన్నతతమ ఆధ్యాత్మికాధికారులు తమకు తామే ఆయనవద్ద కరుదెంచుటను ప్రత్యక్షముగా మనము చూచుచున్నాము. ఇట్టి వృత్త పరిధి కావలగూడ ఇతర యోగారూఢులు నిశ్చయముగా ఉండియుండవచ్చును.

ఇక ఆయన రెండవ వాక్యము—పరిశుద్ధులగు ఆత్మసాధకు లందరిని ఆయన జీవితము, బోధనలు ఆకర్షించుననుఅర్థమును మాత్రమే ఇచ్చును. సాధారణముగా జనులు ఒక సత్పురుషుని మహత్వమును అతని మిరుమిట్లుగొలుపు ఆకర్షవంతమైన రూపమును బట్టియు, అతడు హస్తగతమొనరించుకొనియుండు అద్భుతశక్తులనుబట్టియు, ఉన్నతస్థానమున నుండు ధనవంతులను తన శిష్యులుగా చేసికొను సామర్థ్యము మున్నగు వానిని బట్టి అంచనా వేయుదురు. ఇందులోని గుణగణములేవియు శ్రీరామకృష్ణుని యందు లేవు. ఆయన విశిష్టత, ఆయన యందలి గర్వరాహిత్యము, వారి అహంకారశూన్యత, అఖండసర్వసంగపరిత్యాగము, అసామాన్యమైన పరిశుద్ధత, సాటిలేని అకుంఠిత భక్తి — యందున్నది. ఇట్టి గుణసంపదల గడింప నభిలషించువారే ఆయన మహత్వమును మెచ్చుకొనగలరు. కాబట్టి వా రాతనిని పరివేష్టింతురు. అట్టి పరిశుద్ధులగు ఆత్మసాధకులు ఆతనివద్దకు తక్షణమే ఆకర్షితులగుదురు. మానవుని పారమార్థికమూల్యమునకు ఆయన గీటురాయి యని చెప్పవచ్చును.

ఆయన నిర్యాణానంతరముకూడ ఈ వాక్యములు విలువ కలిగియున్నవను విషయమును మనము గుర్తింపవలయును. ఒక అవతారమూర్తి జీవనము వారి సమకాలికులకు మాత్రమే కాదు. శ్రీరామకృష్ణుల జీవితకాలమున వారిని దర్శింపవెళ్లినవారు వారి భౌతిక సాంగత్యముచే లాభము పొందినట్లు, వారిని గూర్చి తర్వాత తెలిసికొను వారలుకూడ ఆయనతో పారమార్థికముగా సంభాషింపవచ్చును. ఒక యవతారమూర్తి పరమేశ్వరేచ్ఛయొక్క వ్యక్తీభావమగుటవలన, సాధారణమానవులరీతి వారు నిర్యాణమొందరు. వారి

భౌతికశరీరము గతించినను, దివ్యానుగ్రహము నందించు పారమార్థికశరీరమున నిలిచియుండి, వారు భౌతికకాయమున నున్నప్పుడు ఏర్పరచిన ఆస్తియగు ఆధ్యాత్మిక సంప్రదాయము వలన నాకర్షింపబడి, వారి అండ జేరదలచు భక్తులను ఉద్ధరించుచుందురు. కావున, ఈ దినమునను, ప్రపంచము నలుమూలలనుండి అధికసంఖ్యాకులగు ఆత్మసాధకులు శ్రీరామకృష్ణులచే ఆకర్షింపబడుచుండుటను గాంచుచున్నాము.

---

# వార్తలు - విశేషాలు

## శ్రీ వివేకానందస్వామి జన్మదినోత్సవము

శ్రీ వివేకానందస్వాములవారి 113-వ జన్మదినోత్సవము మద్రాసు శ్రీరామకృష్ణమఠమున భక్త్యుత్సాహములతో కొనియాడబడెను. 2-2-1975 ఆదివారమునాడు ఉదయము 5 గంటలకు మంగళహారతితో ఈ ఉత్సవము ప్రారంభమయ్యెను. పవిత్రమహోత్సవమున కనుగుణముగ మఠావరణమంతయు మంగళతోరణాలంకృతమయ్యెను. భక్తుల భజనకీర్తనలు మఠావరణమును భక్తిపూరితము గావించెను. దేవాలయమున తిథిపూజ శ్రద్ధాభక్తులతో బ్రహ్మాండముగ జరిగెను. మఠావరణమున ఉన్న ఆసనమున గంభీరమగు శ్రీ వివేకానందస్వాముల వారి పటము పుష్పమాలలతో పూజార్హముగ అలంకరింపబడెను. పూజ, హోమము జరిగిన యనంతరము 11 గంటలకు భక్తులెల్లరు భక్తిపూర్వకముగ ప్రసాదమును స్వీకరించిరి.

ఉదయము 8-15 గంటలకు మెరీనాయందు గల శ్రీస్వాములవారి విగ్రహమును పుష్పమాలలతో అలంకరించిరి. శ్రీరామకృష్ణమఠమునకు జెందిన ఉద్యోగిబృందము మఠసంబంధములగు పాఠశాలల ఉపాధ్యాయవర్గము, విద్యార్థులు, భక్తులు లేడీవిల్లింగ్టన్ ట్రెయినింగ్ కాలేజి సిబ్బంది, విద్యార్థినులు మున్నగువారు దాదాపు 500 సహృదయులు భక్త్యుత్సాహములతో నచట సమావేశమయి పూజలు సలిపి శ్రీ స్వాములవారియెడ తమకుగల మహద్భావమును వ్యక్తపఱచిరి. అచట ఆరాత్రికము జరిగిన పిదప ట్రెయినింగ్ కాలేజి ప్రిన్సిపల్ గారు శ్రీమతి షణ్ముఖసుందరంగారు సదస్సునకు స్వాగత వాక్కును పలికిరి. "ఈ కళాశాలావరణమున ప్రతిష్ఠింపబడిన భారతదేశాభిమానియగు శ్రీ స్వాములవారి విగ్రహము ఈ కళాశాలయందుగల ప్రతివ్యక్తికి భగవద్భావప్రేరకముగా నున్నది" అని ఆమె వక్కాణించిరి. శ్రీమత్ శ్రీరంగానందస్వాములవారు తమిళమున నిట్లు పలికిరి : "ఇనుపకండరములు, ఉక్కునరములు గల మహాసత్త్వసంపద కుదాహరణముగ శ్రీ స్వాములవారిచట మూర్తీభవించియున్నారు. నిజమయిన సత్త్వసంపద ఆర్థికరాజకీయాభివృద్ధుల మూలమునగాక ఆధ్యాత్మిక త్రికరణశుద్ధివలననే లభింపగలదు." తదనంతరము శ్రీమత్తపస్యానందస్వాముల వారి ట్లుపన్యసించిరి : శ్రీ స్వాములవారి సందేశము సార్వకాలికము, సార్వజనీనము; ప్రపంచమునందలి సర్వప్రజలకును అనుష్ఠానయోగ్యము. ప్రతిదశయందును హృదయసారళ్యమునే కాని వైరళ్యమును జూపరాదని ప్రబోధించిన స్వామిజీపట్ల ఏమార్గమున నయి

నను ఎందయినను సంకోచమునొందుట మహాప
రాధముగా భావింపవలయును. శ్రీస్వాముల
వారు మహామహిమాత్మకముగ ఆచరించి
చూపిన హృదయసారళ్యమును ఔదార్యమును
మనము మన నిత్యజీవితమునందు అనుష్ఠాన
యోగ్యము గావించుకొనుటయే మనము శ్రీ
వారికి జేయగల ఆరాధన. శ్రీ వివేకానంద
కళాశాల ప్రిన్సిపల్ డాక్టర్ N. వేంకట సుబ్ర
హ్మణ్యముగారు సదస్సునకు వందనసమర్పణము
గావించిరి. ప్రేక్షకులు సభ్యులు భక్తులు-ఎల్ల
రును హృదయపూర్వకముగ పాల్గొనిన జాతీయ
గీతము – జనగణమన – దివ్యగానముతో ఆ
కార్యక్రమము సమాప్త మయ్యెను.

సాయంకాలము ఆరాత్రికానంతరము
శ్రీమత్ శ్రీ రంగానందస్వాములవారు తమిళ
మునను శ్రీమత్తపస్యానందస్వాములవారు ఆంగ్ల
మునను మతావరణమున సమావేశమయిన
భక్తులగోష్ఠియందు శ్రీ స్వాములవారియందు
సనాతన పారమార్థిక విజ్ఞానమును అధునాతన
భౌతికవిజ్ఞానమును సమ్మేళనమొందిన ఐక్య
విధానమును గూర్చి యుపన్యసించిరి.

9-2-1975 ఆదివారము అపరాహ్ణము 3-30
గంటలు మొదలు 5-30 గంటల వఱకు శ్రీ
స్వాములవారి జన్మదిన బహిరంగోత్సవము శ్రీ
వివేకానంద భవనమున జరుపబడెను. బ్రహ్మశ్రీ
నీడా మంగళము కృష్ణమూర్తి భాగవతార్
గారు 'శంకరవిజయము' హరికథా కాల
క్షేపము గావించిరి.

నాటి బహిరంగసభకు శ్రీమత్తపస్యానంద
స్వాములవారు అధ్యక్షత వహించిరి. పద్మ
భూషణ శ్రీ T. S. అవినాశలింగముగారు తమిళ
మున శ్రీ స్వాములవారి సందేశమును గూర్చి
యుపన్యసించిరి. వారి యుపన్యాస సారాంశము:

దేశభక్తవతంసులు, ఋషిపుంగవులు నగు శ్రీ
స్వాములవారు తమ రచనలవలనను, ఉప
న్యాసముల వలనను సామాన్య మానవలోక
మున స్తబ్ధమై యున్న ఆధ్యాత్మిక దివ్యశక్తిని
ప్రబుద్ధము చేసిరి. శ్రీవారి సంపూర్ణగ్రంథా
వళి—వివిధ దేశభాషలలోనికి అనువదింపబడి
శ్రద్ధాభక్తులతో పఠింపబడుచున్నది. శ్రీ
స్వాములవారు శుష్కపాండిత్యమునకు గాక
అనుష్ఠాన వేదాంతమునకే ప్రాముఖ్యము నొస
గెడివారు. ఆదియందు పండితులు, భక్తులు,
మహనీయులు అని పేరుగాంచినవారి నెల్లరను
'మీరు దేవుని జూచితిరా?' యని ప్రశ్నించెడి
వారు. ఆ ప్రశ్నకు ఎవరును సరియైన సమా
ధానము నొసగరైరి. కాని శ్రీ దక్షిణేశ్వర
యోగీశ్వరుడు — శ్రీ రామకృష్ణ గురుదేవుడు
మాత్రము 'నేను జూచితిని, నీకును జూపగలను'
అని ప్రత్యుత్తరమునొసగి అందలి గాంభీర్యము,
సరళసత్యమును అర్థము చేసికొని శ్రీ స్వాముల
వారు ఆయన శిష్యు డయ్యెను. శ్రీ గురుదేవుని
వలన ఆధ్యాత్మికశక్తిని బడసిన పిమ్మట—
గురుదేవుని నిర్యాణానంతరము ఆయన శ్రీరామ
కృష్ణమఠ, సేవాసంఘములను స్థాపించి లోక
సంగ్రహము గావింప సంకల్పించెను. భారత దేశ
పరిశీలనార్థము ఆయన ఆ సేతుహిమాచలము
కాలినడకను యాత్ర సాగించెను. కన్యాకుమా
ర్యగ్రమునందు భారత దేశ భవిష్యత్తునుగూర్చి
యొకానొక దివ్యదర్శనమును గాంచెను. భారత
దేశపు బానిసత్వమును బాపుటకై చికాగో
యందు జరిగిన మతమహాసభలో పాల్గొని మత
సామరస్యమును మానవునియందలి దివ్యత్వ
మును ప్రకటించెను. ప్రపంచమంతట సనాతన
మతమునకు గౌరవము ఆదరణ కలిగించెను.

గౌ. న్యాయమూర్తి శ్రీ వి. సేతురామన్ గారు ఆంగ్లమున ఉపన్యసించిరి. వారి ఉపన్యాస సారాంశము : శ్రీ వివేకానందస్వాముల వారు లోకసంగ్రహము నిమిత్తము అవతరించిరి. ఆయనయందు శ్రీ గురుదేవులు 'శివుని' గుర్తించిరి. బుద్ధదేవునివలెనే శ్రీ స్వాములవారును ప్రజాబాహుళ్యము కష్టనష్టములకు లోనగుట గుర్తించి కన్నీరు గార్చిరి. యోగీశ్వరేశ్వరుడయినను శ్రీ స్వాములవారు ఆత్మమోక్షార్థము హిమాలయములయందలి గుహలలో కూర్చొనక జగత్కల్యాణము నిమిత్తము భారతదేశమున ప్రజల మధ్య సంచరించిరి. ఆయన సమదర్శి. రాజాస్థానములందును కుటీరములందును సమభావమును జూపిరి. భారతదేశమునకే గాక సమస్త ప్రపంచమునకును జెందిన వ్యక్తియై ఆయన సమస్తమానవోద్ధరణమునకును కంకణము గట్టుకొనెను. భక్తికి ఆయన పెట్టినది పేరు. భారతీయ సంస్కృతికి ఆయన శాంతిదూత.

శ్రీమత్తపస్యానందస్వాములవారు తమ అధ్యక్షోపన్యాసమున నిట్లుద్బోధించిరి: శ్రీ వివేకానందస్వామిని గూర్చి ఎవరెంత చెప్పినను అది నిత్యనూతనముగనే యుండును. ఆయన అంతటి మహనీయుడు. భావినూతన భారతదేశమునుగూర్చి ఆయన గాంచిన దివ్యానుభూతి వర్ణనాతీతము. భారతీయులెల్లరు అభివృద్ధికరమగు ఉన్నతజీవనమును గడుపవలయుననియు భారతీయులకు స్వాభావికము లయిన ఆధ్యాత్మికత ఆత్మసంస్కృతి కలిగి యుండవలయుననియు శ్రీ స్వామిజీ ఉద్బోధించిరి. శ్రీ కృష్ణపరమాత్మని బోలిన ఆయన దివ్య సౌందర్య సర్వస్వము, రూపొందిన పావిత్ర్యము, భారతీయ ఆధ్యాత్మిక శక్తికి సాంస్కృతికనిధికి ప్రతినిధి. సంకుచితత్వమను కారాగృహమునుండి ఆయన భారతదేశమును విముక్తను గావించెను. భారతీయ ఆచార్యులయందు దేదీప్యమానమయిన తేజోమూర్తి ఆయన. సర్వప్రపంచమునందును ఆయన భారతదేశమునకు ఆధ్యాత్మికముగ గురుస్థానమును గల్పించెను. నేటి మన యువతీయువకులెల్లరు ఆయన గ్రంథావళిని పఠించి ఆయన భావముల సాధ్యమయినంత వఱకు గ్రహించి అనుసరించి అభివృద్ధి గాంచుట కర్తవ్యము.

దేవాలయమునందలి శ్రీరామకృష్ణ భజన బృందమువారి భజనానంతరము భక్తులకు మిఠాయిలు పంచిపెట్టబడెను; నాటి కార్యక్రమము మంగళాంతముగ పరిసమాప్తమయ్యెను.

# గ్రంథపరిచయం

## మోక్షసాధన రహస్యము

రచయిత : శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారు. డబల్ క్రౌన్ 1/16 సైజు VII+685 పుటలు. వెల : రూ. 10-00. ప్రాప్తిస్థానము : శ్రీశుకబ్రహ్మాశ్రమము, శ్రీకాళహస్తి, చిత్తూరుజిల్లా, ఆంధ్రప్రదేశ్.

శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాములవారు శ్రీ శుకబ్రహ్మాశ్రమ సంస్థాపకులు : వీరు ఆంధ్రదేశమునందు గీతాయజ్ఞములు జరుపుచు, గీతోపన్యాసములు గావించుచు ఆధ్యాత్మిక విద్యాప్రచారము గావించుచున్న యతిపుంగవులు.

ఈ మోక్షసాధనరహస్యమునందు 'మోక్షమనగా నేమి? మోక్ష విజ్ఞాన సర్వస్వము, మోక్షోపాయములు, యోగసాధనలు, అనుష్ఠాన వేదాంతము, మోక్షమును గూర్చిన శాస్త్రప్రమాణములు మున్నగు విషయములు విపులముగ వివరింపబడియున్నవి. ఈ విషయమున వీరి రచనావిధానము పండితపామరజన రంజకము. భాష సులభసుందరమగు గ్రాంథికము.

మన ప్రాచీన మహర్షులు యోగీశ్వరులు, ఆచార్యులు, అవతారపురుషులు మున్నగు మహనీయులు మోక్షసామ్రాజ్యపథమున పురోగాములై లోకమునకు ప్రవచించిన యనుభవసర్వస్వము విపులముగ వివరింపబడియున్నది. ముఖ్యముగా ఉపనిషదృషులు గీతాచార్యులు మున్నగువారి ప్రమాణ శ్లోకములు మున్నగునవన్నియు సతాత్పర్యముగ నుల్లేఖింపబడియున్నవి.

ఈ గ్రంథము ముముక్షువులకు సాధకులకు అత్యంత ముపయోగకరము.

—చిలుపూరి మాధవకృష్ణకవి.

---

## FORM IV

(*See* Rule 8)

Statement about ownership and other particulars about the Sri Ramakrishna Prabha (according to Form IV Rule 8, circulated by the Registrar of Newspapers for India).

1. Place of Publication ... : Madras-600004.
2. Periodicity of its Publication ... : Monthly.
3. Printer's Name ... : M. Balasundaram.
   Nationality ... : Indian.
   Address ... : Freedom Press, 138-A, T.H. Road, Madras-600021.
4. Publisher's Name ... : Swami Chidghanananda.
   Nationality ... : Indian (Hindu Monk).
   Address ... : Sri Ramakrishna Math, Mylapore. Madras-600004.
5. Editor's Name ... : Swami Chidghanananda.
   Nationality ... : Indian (Hindu Monk).
   Address ... : Sri Ramakrishna Math, Mylapore, Madras-600004.
6. Name & Address of individuals who own the newspapers and partners or shareholders holding more than 1% of the total capital. : Sri Ramakrishna Math, Mylapore, Madras-600004.

I, Swami Chidghanananda, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

(Sd) SWAMI CHIDGHANANANDA,
*Signature of The Publisher.*

Date: 4-3-1975.

# శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-600004

## 1975-వ సంవత్సరము, ఏప్రిల్‌మాసమున జరుగనున్న

## ఉత్సవ కార్యక్రమము

శ్రీరామనవమి

20-4-75 ఆదివారము అపరాహ్ణము 5-30 గంటలకు బహిరంగోపన్యాసము

అధ్యక్షులు : శ్రీమత్తపస్యానందస్వాములవారు

ఉపన్యాసకులు : డాక్టర్ ఎన్. వీథినాథన్‌గారు (తమిళము)

ఆదివారములందు సత్సంగ సమావేశములు

అపరాహ్ణము 4-00 మొ॥ 4-20 వరకు శ్రీలక్ష్మీసహస్రనామ పారాయణము (13-4-75)

,, శ్రీవిష్ణుసహస్రనామ పారాయణము (6-4-75; 27-4-75)

4-20 ,, 4-30 ,, ధ్యానము

4-30 ,, 5-30 ,, తమిళమున ఉపన్యాసములు :—

శ్రీమద్భాగవతము : శ్రీ 'అణ్ణా' ఎన్. సుబ్రహ్మణ్యముగారు (6-4-75)

శ్రీవిష్ణుసహస్రనామము : శ్రీ వి. కల్యాణసుందరశాస్త్రిగారు (13-4-75)

శ్రీశివానందలహరి : డాక్టర్ టి. ఎం. పి. మహాదేవనుగారు (27-4-75)

5-35 ,, 6-30 ,, ఆంగ్లోపన్యాసములు :—

శ్రీమద్భగవద్గీత : శ్రీమత్తపస్యానందస్వాములవారు (6-4-75; 13-4-75)

రాజయోగము : శ్రీమత్ గోలోకానందస్వాములవారు (27-4-75)

ప్రత్యేకోపన్యాసములు

5-4-75 శనివారము 5-45 శ్రీమద్రామాయణపఠనము (యాగసంరక్షణము) శ్రీ పి. రామకృష్ణన్‌గారు,
[ఐ. పి. యస్. (రిటైర్డు)

12-4-75 ,, ,, జైనమతము : డాక్టర్ టి. ఎం. పి. మహాదేవనుగారు

26-4-75 ,, ,, శ్రీమద్రామాయణము : డాక్టర్ ఎన్. వీథినాథన్‌గారు

ఇతర వారములందు ఉపన్యాసములు : అపరాహ్ణము 5-45 గంటలకు

సోమవారములు : నారదభక్తిసూత్రములు (ఆంగ్లము) శ్రీమత్ వీతమోహానందస్వాములవారు

మంగళవారములు : అధ్యాత్మరామాయణము (ఆంగ్లము) శ్రీమత్ గభీరానందస్వాములవారు

బుధవారములు : శ్రీమద్భాగవతము (ఆంగ్లము) శ్రీమత్తథాగతానందస్వాములవారు

గురువారములు : అముదమొழి (తమిళము) శ్రీమత్ శ్రీరంగానందస్వాములవారు

శుక్రవారములు : ఆత్మబోధ (తమిళము) శ్రీ ఆర్. రామకృష్ణన్‌గారు

27-4-1975 ఆదివారము : అంతర్యోగ సాధన

ఉభయ ఏకాదశులయందు సాయంకాలిక ఆరాత్రికానంతరము శ్రీరామనామభజన (7-4-75; 22-4-75)

శుక్రవారములందు సాయంకాలము 6-30 గంటలకు తిరువళ్లిక్కేణియందలి దక్షిణమాడవీథియందు 18-వ నంబరుగల శ్రీరామకృష్ణమందిరమున శ్రీమత్ గోలోకానందస్వాములవారి భగవద్గీతోపన్యాసములు.

ఈ ఉత్సవములన్నింటియందు భక్తులెల్లరును పాల్గొని భగవంతుని అనుగ్రహభాగ్యమును బడయగోరుచున్నాము.

అధ్యక్షులు,

సంపాదకులు : శ్రీ చిద్ఘనానందస్వామి.

శ్రీ ఎమ్. శాంతసుందరంగారిచే శ్రీరాక్ ప్రెస్, (మద్రాసు-600021) న ముద్రితము.

శ్రీ చిద్ఘనానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము మద్రాసు-600004) నుండి ప్రచురింపబడినది.

# శ్రీమద్భగవద్గీత

అనువాదకులు :

శ్రీ నిర్వికల్పానందస్వాములవారు

ఇది మూలశ్లోకములు, ప్రతిపదార్థము, ధారాళమగు అనువాదము, శ్రీధరీయ టీకాసారము, విశేషాంశములు, సానువాదగీతాపారక్రమము, ధ్యానమాహాత్మ్యములు సమభావాత్మకములగు ఉపనిషద్వాక్యసూచిక, వేదాంతసూత్రసూచిక, గీతాశ్లోకసూచిక, శబ్దానుక్రమణిక—ఇన్నిటితో విరాజిల్లుచున్నది.

భక్తులకు సాధకులకు మాత్రమేకాక కళాశాల విద్యార్థులకు సైతము ఉపయుక్తమయిన దివ్యగ్రంథము.

పుటలు : 58+440 (అందమయిన అష్టమ ముద్రణము) వెల : రూ 9-00

# 'మా దివ్యవాణి' గ్రంథమాల

నేడే కొనండి ! పదే పదే చదవండి !!

దివ్యావతారమూర్తుల విశ్వోపజీవ్యములైన అమృత మధుర సూక్తులు సర్వసుగ్రాహము హృదయ సన్నిహితమునైన తేటతెనుగున వీనిలో అందజేయబడ్డాయి. ఇందులో ఒక్కొక్కటి నిరుత్సాహులకు ఉత్సాహప్రదం, అశాంతిసంక్షుభితులకు శాంతిదాయకం, సంశయాందోళితులకు సంశయాపనోదకం, జిజ్ఞాసువులకు పరమార్థజ్ఞాన సమర్పకం, అందరికీ శిక్షకం, సంస్కారకం, నిర్వృత్యాపాదకం. మువ్వన్నెల మేలి జాకెట్టుతో పాకెట్టుసైజులో చక్కని తయారింపు—

| | | | |
|---|---|---|---|
| శ్రీ రామకృష్ణ ఉవాచ | 0-80 | శ్రీ కృష్ణవాణి | 0-80 |
| శ్రీ శారదాసూక్తి నవనీతము | 0-80 | బుద్ధ ఉవాచ | 0-80 |
| శ్రీ వివేకానంద శంఖారావము | 0-80 | క్రైస్తు సూక్తిమాల | 0-80 |

మహమ్మదు సూక్తిమంజరి 0-80

ఇట్లు వ్రాయుడు :

మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠము, మైలాపూరు, మద్రాసు - 600004.

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౩౧ — ౧౯౭౫ - ఏప్రిల్ : రాక్షస - చైత్రము — సంచిక ౧౦

## విషయసూచిక

'అఖిలవిభు శరణొందుము, యా క్షణంబ యతనికృప నీదు ననుభూతి కందు వత్స'

—శ్రీ శారదామణి.


# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౩౧ } ౧౯౭౫ - ఏప్రిల్ : : రాక్షస - చైత్రము { సంచిక ౧౦


ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ !

## ప్రార్థన

## శ్రీ రామకృష్ణ కర్ణామృతము

శ్లో॥ పాపాటవీ ప్రదహనే హుతభుక్సమానం । మోహాంధకారదళనే హరిదశ్వకల్పం
సంతాప నాశనవిధౌ శరదిందు తుల్యం । జ్యోతిశ్చకాస్తి కిమపి క్షుదిరామ గేహే.

తే. గీ. దహనుఁ డనఁగఁ బాపాటవీ దహనమందుఁ, దరణి యన మోహతామిస్ర దళనమందు
ఆర్తి సంతాపహరణాన నబ్జుఁ డనఁగఁ, బ్రజ్జ్వలించు దీపము క్షుదిరాము నింట.

వ్యాఖ్య : పాపారణ్య దహనమందు అగ్నివలెను, మోహాంధకారమును నశింపజేయుటయందు ప్రభాకరునివలెను, ఆశ్రితుల సంతాపమును హరించుటయందు (శరత్కాలపు) చంద్రునివలెను క్షుదిరాముని గృహమునందు ఒకానొక దీపము ప్రకాశించుచున్నది.

శ్లో॥ యోగీశ్వరైర్మనసి చింతిత పుణ్యమూర్తిః । భక్తోత్తమై స్సరసగీత పవిత్రకీర్తిః
సందగ్ధ సర్వశరణాగత దుస్సహార్తిః । కశ్చిద్విభాతి భువనత్రయభాగ్య పూర్తిః.

తే. గీ. అదియె రంజిల్లు లోక భాగ్య ప్రపూర్తి, భూరియోగులు ధ్యానించు పుణ్యమూర్తి.
సర్వ శరణాగతార్తి సంహరణ కీర్తి, భక్త బృందంబు కీర్తించు భవ్యగీతి.

వ్యాఖ్య : (పవిత్రమును దివ్యమును నగు) ఆ మహా ప్రకాశమే సమస్తలోకముల సౌభాగ్య (హృదయ) పూరణము. మహాయోగీశ్వరులు (నిశ్చలముగ) ధ్యానించు పుణ్యమూర్తి. సమస్త శరణాగతుల కష్టము లన్నింటిని హరించుటయందు కీర్తి గాంచినది. భక్తు లెల్లరును కీర్తించు పరమపావన గీతము.

# శ్రీ గురుసూక్తిసుధ

ఈశానుని ప్రశ్న: స్వామీ తమరేల సన్న్యసించితిరి? ప్రపంచమునం దేల విరక్తి జెందితిరి? శాస్త్రములు గృహస్థజీవనము శ్రేష్ఠతమమని యుద్ఘోషించుచున్నవి గదా!

శ్రీరామకృష్ణులు: ఏది మంచియో ఏది చెడుగో నా కంతగా తెలియదు. భగవంతుడు నాచేత నేమి చేయించునో అది చేయుదును. అత డేది పలికించునో అది పలుకుదును.

ఈశానుడు: ప్రతియొక్కరును సన్న్యసించినచో వారు భగవదిచ్ఛకు వ్యతిరేకముగా నడతురు.

శ్రీరామకృష్ణులు: ప్రతియొక్కరును ఏల సన్న్యసింపవలెను? అదిగాక ఎల్లరును కామినీకాంచనములందు కుక్కలు నక్కలవలె మునిగి తేలవలెనని భగవదిచ్ఛ కాగలదా? అతనికి వేఱు కోరికయే లేదా? ఆయన ఇచ్ఛకు అనుకూలముగా నుండున దేదియో ప్రతికూలముగా నుండున దేదియో నీకు తెలియునా?

ప్రతియొక్కరును ప్రాపంచికజీవనము గడపుట భగవదిచ్ఛ యని నీ వనుచున్నావు. కాని నీ భార్యాపుత్రులు మరణించినపుడు అదియు భగవదిచ్ఛ యని ఏల తెలియవు? బీదరికమందును, తినుటకు కమికెడన్నము లేకుండుట యందును భగవదిచ్ఛ నేల చూడవు?

మాయ మనలను భగవదిచ్ఛను తెలియనీయదు. దైవమాయవలన అసత్తు సత్తుగాను సత్తు అసత్తుగాను తోచును. ప్రపంచము మిథ్య. ఈ క్షణమున నది యుండును, మఱు క్షణమున మాయమగును. కాని ఆయన మాయవలన అది సత్తుగా తోచును. అహంకారము కర్తగా తోచునది ఆయనద్వారానే. అంతియగాక మనుజుడు తన పిల్లలను, తోబుట్టువులను, తలిదండ్రులను, ఈ మాయవలననే తన స్వంతముగ భావించును.

మాయకు రెండంశములు గలవు: విద్య, అవిద్య. అవిద్య ప్రాపంచికబుద్ధిచేత మోహపరచును. విద్య—అనగా జ్ఞానము భక్తి సాధుసాంగత్యము అనునవి—మానవుని భగవంతుని యొద్దకు గొనిపోవును.

భగవత్కృపవలన మాయాతీతుడైనవాడు విద్యను అవిద్యను రెండింటిని సమముగా జూచును. ప్రాపంచికజీవనము భోగజీవనము. నిజమునకు కామినీకాంచనములందు సుఖించుట కేమి గలదు? మధురభక్ష్యము గొంతు దిగగనే అది తియ్యగా నుండినది, పుల్లగా నుండినదియు జ్ఞప్తి యుండదు.

కాని ఎల్లరును సన్న్యసించు టేల? కాలపరిపక్వతయందు తప్ప సన్న్యాసము సాధ్యమా? భోగానుభవపుటంతు చూచినపుడు సన్న్యాసమునకు సమయము వచ్చును. ఎవరైనను బలవంతముగా సన్న్యసింపగలరా? 'మర్కటవైరాగ్య'మని యొకరకపు వైరాగ్యము గలదు. సంకుచితబుద్ధి గలవారు మాత్రమే దాని నభ్యసింతురు. తండ్రిలేని బాలునొకనిని దీసికొందము. అతని తల్లి నూలు వడుకుచు జీవనభృతి సంపాదించును. ఆ బాలుని యనాకానీ యుద్యోగ మూడును. దానితో నతడు వెంటనే వైరాగ్యసాగరమున మునిగిపోయి సన్న్యాసికాషాయమును గప్పుకొని కాశికి బోవును. కొన్నిరోజుల పిదప 'నెలకు పదిరూపాయల యుద్యోగము సంపాదించితి'నని ఇంటికి కుత్తరము వ్రాయును. ఇంతలో బంగారుంగరములను జరీగుడ్డలను కొనజూచును. తన భోగవాంఛ నత డెట్లు నొక్కివేయగలడు?

ప్రపంచమునందు తన కర్తవ్యము నిర్వర్తించుట మిక్కిలి కష్టము. ఎక్కువ వేగముగా గుండ్రముగా తిరిగినచో తల తిరుగును. మూర్ఛ వచ్చును. ఒక రాటను పట్టుకొనినచో అట్టి భయము లేదు. నీ కర్తవ్యమును నీవు చేయుము. కాని దేవుని మఱువకుము.

'ప్రాపంచికజీవన మంత కష్టమైనచో నికి మార్గమేమి' యని నీవడుగ వచ్చును. నిరంతరమైన యభ్యాసమే మార్గము. కామార్పుకూరునందు వడ్రంగుల యాడువారు వడ్లువంపుటను చూచితిని. రోకలి తమ ప్రేళ్ళను పచ్చడి చేయు నని వారు భయపడుచునే యుందురు; అట్లే తమ బిడ్డలకు పాలు కుడుపుచునే యుందురు. బేరములు చేయుచునే యుందురు. ''మా కీయవలసినది ఇచ్చి మరి పొం'డని బేరగాండ్రతో నందురు.

నీతిమాలిన యాడుది తన ఇంటిపనుల నన్నింటిని చేయుచునే యుండును. కాని అనుక్షణమును తన ప్రియునిగూర్చియే తలపోయు చుండును.

కాని అట్టి మనస్స్థితి సంపాదించుటకు ఆధ్యాత్మిక సాధన యవసరము. అప్పుడప్పుడు ఏకాంతమున దేవుని ప్రార్థింపవలెను. భగవంతునిపట్ల ప్రీతిని సంపాదించినపిదప లౌకిక విధులను నిర్వర్తించుట సాధ్యమే. పనస పండును కోసినచో చేతికి ఆ జిగటపా లంటుకొనును. ముందే చేతులకు నూనె రాచుకొనినచో అది జరుగదు.

గిరీశుని ప్రశ్న : స్వామీ, ఏది బుద్ధిమంతమైనది? పరితపించుచు సన్న్యసించుటయా, గృహస్థజీవనము జీవించుచు దైవమును ప్రార్థించుటయా?

శ్రీరామకృష్ణులు: నీవు భగవద్గీతను చదువలేదా? నిస్సంగముతో లౌకికవిధులను నిర్వర్తించినచో, అంతయు మిథ్య యని గుర్తించిన పిదప ప్రపంచమున జీవించినచో తప్పక భగవత్సాక్షాత్కార మగును.

పరితపించుచు సన్న్యసించువారు క్రింది తరగతివారు.

గృహస్థుడగు జ్ఞాని ఎట్లుండునో నీకు తెలియునా? అతడు గాజుటింటియందు నివసించు వాని వంటివాడు. అతడు లోపలను వెలుపలను కూడ చూడగలడు.

# భవతారణమగు భక్తియోగము

## వాసా సుబ్రహ్మణ్యశాస్త్రి

సేవించుట అను నర్థముకల 'భజ్' ధాతువునకు 'క్తిన్' ప్రత్యయము చేర్చగా భక్తియైనది. ఈశ్వరసేవ భక్తి అని యర్థము. 'సా పరా అనురక్తిరీశ్వరే' అని శాండిల్య సూత్రములలో భక్తి నిర్వచింపబడినది. ఈశ్వరునియందు చూపు విశేషమగు అనురాగమే భక్తి అని దీని అర్థము. 'అనన్యమమతా విష్ణోః మమతా ప్రేమసంగతా ... భక్తిరిత్యుచ్యతే' ఏ ఇతరవస్తువులయందు లేనట్టిదియు, విష్ణువునందే కేంద్రీకృత మగునట్టిదియు నగు ప్రేమమిశ్రమమగు మమకారమే భక్తి యని 'భక్తిరసామృతసింధువు' చెప్పుచున్నది. 'పామరులకు ఇంద్రియసుఖములపై నే వ్యామోహ ముండునో అట్టి మోహము

నీయెడల సదా నాకుండు గాక!' అని ప్రహ్లాదుడు విష్ణువునకు నివేదించుకొన్నాడు.

'భగవానునిగూర్చి నిక్కము, నిష్కళంకము నగు అన్వేషణమే భక్తియోగము. ఇది ప్రేమమున జనించి, ప్రేమలో వికాసము నొంది ప్రేమమున లయించును'' అని శ్రీవివేకానంద స్వామి చెప్పియున్నారు. అట్టి భక్తి లభించిన మానవుడు అన్నిటిని ప్రేమించును. దేనినీ ద్వేషింపడు. ఆతడు నిత్యసంతుష్టుడు. 'నాకాత్మసర్పణము చేసినవాని కింద్రాసనముపై గూడ ఆశ యుండదు' అని శ్రీకృష్ణపరమాత్మ భాగవతములో చెప్పియున్నాడు. అయినను లౌకికవిషయవాంఛలు క్షీణించిన గాని ఈ భగవత్ప్రేమ దృఢము కానేరదు. ''కర్మము కంటెను, జ్ఞానముకంటెను, యోగము కంటెను భక్తి యధికతరము— ఏలయన— భక్తి దాని కదియే ప్రతిఫలము; అదే సాధనము, సాధ్యమును'' అని వివేకానందు లభిప్రాయపడిరి.

మానవునికి పరమావధిని చేరుటకు భక్తి అత్యంతము సహజము సులభము నైన మార్గము.

''తేషాం సతతయుక్తానాం
భజతాం ప్రీతిపూర్వకమ్ ।
దదామి బుద్ధియోగం తం
యేన మాముపయాన్తి తే॥''

'నాయం దాసక్తులై ప్రీతితో నన్ను భజించు వారికి మత్ప్రాప్తి హేతువగు బుద్ధియోగమును నేనే ఒసగెదను.' అని భగవానుడు గీతలో చెప్పియున్నాడు.

ఈ భక్తిని మొదట రెండు విధములుగా విభజింపనగును. 1. వైధీ. 2. అహైతుకీ. కోర్కెలతో ప్రారంభమైనది వైధీభక్తి. ధ్రువుడు తండ్రియంకమున స్థానమును బడయు కోర్కెతో తపమునకు దొరకొనినాడు. భక్తి వైధీతో నారంభమై అహైతుకీదశకు వెళ్లినది. విష్ణువు సాక్షాత్కరించి నీ కేమి కావలె నన్నప్పు డాతడు—

'కాచం విచిన్వన్ సమవాప్య రత్నం,
స్వామిన్ కృతార్థోస్మి వరం న యాచే.'

'గాజుముక్కను వెదుకబోవ నాకు రత్నమే లభించినది. ఇక నా కేమియు నక్కర లేదు' అనినాడు. ప్రహ్లాదునిది అహైతుకీభక్తియే. వివేకానందుడు సంసారపుచిక్కులలో తగుల్కొనినపుడు గురువర్యుడగు రామకృష్ణ పరమహంస కాళీమాతను చిక్కులను విడదీయ ప్రార్థింపుమనెను. కాళీమాత నిజముగా సాక్షాత్కరించి ఏమి కావలెనని యడిగినపుడు స్వామి 'నాకు భక్తిజ్ఞానవైరాగ్యములు ప్రసాదించు తల్లీ' అనినాడు.

'మందారమకరందమాధుర్యమున దేలు
మధుపంబు వోవునే మదనములకు.'

గుణములనుబట్టి మరల భక్తి మూడువిధము లగుచున్నది.

1. సాత్త్వికీ 2. రాజసీ 3. తామసీ అని.

1. సాత్త్వికీ: సుఖాకాంక్షల దృష్టి లేక ఆనందముకొఱకు చేయు భక్తి. ఏకాన్తసేవ, సరళము నిరాడంబరమునైన పత్రపుష్పాదుల తోడి అర్చన ఇందుండును.

రాజసీ: ఇహసుఖములను, శత్రువిజయములను కోరి చేయునది. తిలకరుద్రాక్షపీతాంబర ధారణము, దేవతాగృహప్రదర్శనము వంటి ఆడంబరము లిందుండును.

3. తామసీ: దొంగతనము, వ్యసనములు మున్నగునవి పారుటకై చేయు భక్తి. ఇందు

దేవుని వత్తిడిచేయుట యుండును. భక్తి తామసీనుండి ప్రారంభమై రాజససాత్త్విక స్థాయుల కెక్కవచ్చును. మూడు రకముల వారు దేవుని భజించుచుందురట. అనగా అధికారమును బట్టి భక్తులు ముప్విధములుగా నుందురు. ఆర్తుడు: ఏదేని తీవ్రమైన బాధలో నుండి తన్నివృత్తికై మొరపెట్టుకొను భక్తుడు. 'లావుల్ దప్పెను మూర్ఛవచ్చె తనువున్ డస్సెన్ శ్రమం బయ్యెడిన్, రావే ఈశ్వర! కావవే వరద! సంరక్షింపు భద్రాత్మకా!' అని మొరపెట్టు గజేంద్రుడు ఆర్తభక్తుడగుచున్నాడు. జిజ్ఞాసువు: ఈశ్వరగుణములను మహిమను తెలిసికొను నిచ్ఛతో భజించువాడు. అర్జును డిట్టివాడు. అర్థార్థి: ఒక నిశ్చిత వాంఛతో భజించువాడు. ధ్రువు డుదాహరణము.

అర్హాతలు: సంసారవిరక్తి పూర్తిగా కల్గక అట్లని ఆసక్తియు లేక యుండువాడును, ఈశ్వర ప్రేమ జనించినవాడును అర్హుడని భాగవతమున ఏకాదశస్కంధములో చెప్పబడినది. ఇక నీ భక్తికి జాతివర్ణవయోలింగభేదాదు లేమియును లేవు. ధనికదరిద్రభేదమును లేదు. గుహుడు నిషాదజాతికి అనగా చండాలజాతికి చెందినవాడు రామభక్తుడైనాడు. శబరి ఆడది, కురూపి, ఆటవికజాతిది. ఆమె యిచ్చిన ఫలములను రాము డారగించినాడు. ధ్రువుడు ఏడేండ్ల పసిబాలుడు. దిగంబరుడై తపము నారంభించెను. కుచేలుడు— పరమదరిద్రుడు, శ్రీకృష్ణు నారాధించి సంపదల బడసెను. శ్రీరామకృష్ణపరమహంస చదివిన చదు వేమియును లేదు. కాళీమాతను సేవించి సాక్షాత్కారమును బడసెను. మన కిచ్ఛామాత్ర మున్నచో భగవంతుడు మనల నాకర్షించుకొనును. భక్తుడు, లోభము, భగవంతు డయస్కాంతము. భక్తుడు మర్కటకిశోరన్యాయమున భగవంతుని పట్టుకొనినచో ఆయన మార్జాలకిశోరన్యాయమున భక్తుని పట్టుకొని విడకుండును.

'సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ' అని భగవానుడు చెప్పుచున్నాడు. కామక్రోధాహంకారాదులు భక్తికి తీవ్రమగు ఆటంకము లగుచుండును. స్వచ్ఛహృదయము భక్తికి చక్కని క్షేత్రము. త్రిలింగస్వామి, పోతన, రామకృష్ణపరమహంస ఇట్టివారే. సత్సంగము, భజన, పురాణశ్రవణము, నామకీర్తనము, క్షేత్రాటనము, ప్రకృత్యోపాసన భక్తి కుద్దీపకములు. అంతటను ఆతనినే చూచుట, 'తస్య భాసా సర్వమిదం విభాతి' ఆతని ప్రభతోనే అంతయు వెలుగొందుచున్నది అను భావనయు భక్తికి పోషకములు.

''ఇందు గలడందు లేడని
సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన
నందందే గలడు దానవాగ్రణి వింటే!''

అని ప్రహ్లాదు డనుచున్నాడు. విశుద్ధహృదయము భక్తికి ముఖ్యము. కాని పరికరములు కావు.

'మార్గావర్తితపాదుకా పశుపతే
రంగస్య కూర్చాయతే'

ఒక వ్యాధు డడవిని బోవుచూ బూజుపట్టిన శివలింగమును జూచి వ్యథ జెంది, తన చెప్పుతో దాని బూజును దులిపినాడు. పుక్కిలిబట్టిన నీటితో నభిషేకముచేసెను. తాను తినగా తోలుసంచిలో మిగిలిన మాంసఖండమును నైవేద్యము పెట్టెను. 'అహో వనచరో భక్తావతంసాయతే' ఆ వనచరుడు భక్తాగ్రగణ్యుడైనాడట. విదురుడు అరటిపండ్లు ఒలిచి కృష్ణున

కీయబోయి తొక్కల నీయసాగెను. ఆ భక్త పరతంత్రుడును వానినే మైమఱచి యాస్వాదించెనట. కుచేలు డిచ్చిన ముక్కిపోయిన అటుకులనే రుచిమీర మెక్కినాడట కదా! శబరి యుచ్ఛిష్టమైన పండ్ల నా శ్రీరాముడు సంతోషముతో స్వీకరించెను గదా! ఆతని కరుణగల్గిన మనకు లేని శక్తులు వచ్చును. మూర్ఖుడు పండితు డగును. కుంటివాడు గిరులను లంఘించును. విష్ణుచిత్తుని స్వామి పాండ్యరాజు సభలో వాగ్వాదము చేయుమనినాడు. పాండిత్యగంధము లేని పెరియాళ్వారు భయముజెంది 'గృహసమ్మార్జనమో, జలాహరణమో, శృంగారపల్యంకికావహనమో మరేదియో సేవలు చేయు మనిన చేయగల గాని నా కేలనయా! ఈ వాగ్వాదములు. నన్నేల రచ్చ కీడ్చెదవు' అనినాడు స్వామితో. కాని స్వామి వదల లేదు. స్వామి యాదేశముపై పెరియాళ్వారట్లే పోయి యద్భుతముగా వాక్యార్థము చేసి విజయ మందినాడు. మూకుడను కామాక్షీభక్తాగ్రగణ్యుడు కామాక్షిపై పంచశతిని వ్రాసి మూగవాడగుట చదువుటకు వీలు లేకపోయెనే యని పరితపింప నాతనికి నోరు వచ్చినదట. ఆతడు నోరార చదివి ఆ పంచశతి నామె కంకితము జేసెనట.

మన దేశము భక్తుల గన్నతల్లి. యుగయుగమున, ప్రాన్తప్రాన్తమున భక్తశిరోమణు లుదయించి భక్తిసుధావాహినులతో భరతసీమను ముంచెత్తించినారు. తులసీదాసు, సూరదాసు, తుకారాం, నామదేవ్, రామదాసు, ఏక్‌నాథ్, నానక్, విద్యాపతి, చండీదాసు, జయదేవుడు, చైతన్యుడు, రూపగోస్వామి, మీరాబాయి, గోపన్న, పోతన్న, త్యాగయ్య, క్షేత్రయ్య, పురందరదాసు, ఆళ్వారులు, నాయనారులు—ఇంకెందరో భక్తిభరితులై బ్రహ్మసాక్షాత్కారమును బడసినారు.

భక్తిలోని రీతు లైదు విధములుగా నున్నవి.

1. శాంతభక్తి: విషయస్పృహను త్యజించి నిజానందమున వెలయుట శమము. ఋషులు, సనకసనందనాదులు శాంతభక్తి నుపాసించిరి. ఉపనిషచ్ఛ్రవణము, ఏకాన్తసేవనము, దీని కుద్దీపనములు. తీక్ష్ణత, ఉన్మాదము లేక ప్రశాన్త సరోవరమువలె వర్తించు భక్తులు దీని నుపాసింతురు.

2. దాస్యభక్తి: భక్తుడు తనను భగవంతునికి సేవకునిగా భావించును. ఆతని ప్రసాదము, పాదధూళి ఉద్దీపనలు. హనుమంతు డుదాహరణము.

3. సఖ్యభక్తి: భగవానుని మిత్రునిగా భావించుట—ఆతనితో ఆడుట పాడుట అర్జునుడు, కుచేలుడు ఉదాహరణము. ఇందు భగవానుడు భక్తునికి క్రీడాసఖుడు. ఇం దరమరికలు లేవు. ఇందు భక్తభగవానులమధ్య సమాన ప్రేమ రాజిల్లును.

4. వాత్సల్యభక్తి: పరమాత్మను శిశువుగా, పుత్రునిగా భావించుట. యశోదానందులు శ్రీకృష్ణుని పుత్రునిగా కొలిచి తరించిరి. బాలముకుందునిమందహాసబాల్యక్రీడాదులుద్దీపనలు.

5. మధురభక్తి: ఇందు భక్తుడు ప్రేయసి-భగవానుడు ప్రియుడు. మురళీధ్వని, ఆతని కటాక్షమందహాసాదు లుద్దీపనలు. రాధ, గోపికలు, మీర, ఆండాళ్ ఈ మధురభక్తితో భగవంతుని భజించిరి. ఇది మధురాతి మధురమైనది పూర్వరాగ మిళనవిరహాదులు ఇందులో బహుధా వర్ణనయోగ్యము లగును.

వైదికబౌద్ధకాలములలో శాంతభక్తి వర్ధిల్లినది. రామాయణ, భారత కాలములలో దాస్యసఖ్యభక్తు లాదరణీయము లైనవి. భాగవత యుగమున వాత్సల్యమధురభక్తు లుద్దీపించినవి.

చైతన్యయుగమున అన్నియు పుష్టి నందినవి. శంకరులు శాంతభక్తిని, మధ్వరామానుజులు దాస్యభక్తిని, వల్లభాచార్యులు వాత్సల్యమును, చైతన్యులు సఖ్యమును, మీరా జయదేవులు మాధుర్యమును ప్రచార మొనర్చిరి. బాలబాలికలకు శాంతసఖ్య భావములు, యువకులకు మాధుర్యము, ప్రౌఢులకు దాస్యవాత్సల్యములు ఉపయోగించును.

'పురుషస్స పరః పార్థ !
భక్త్యా లభ్య స్త్వనన్యయా'

ఆ పరమపురుషుడు అనన్యభక్తిచేతనే పొందదగియున్నాడు.

'శ్రవణం, కీర్తనం విష్ణోః
స్మరణం పాదసేవనమ్ ।
అర్చనం, వందనం, దాస్యం,
సఖ్యమాత్మ నివేదనమ్ ॥'

అని నవవిధములు భక్తిమార్గములు.

'క్లేశోధిక తర స్తేషా
మవ్యక్తాసక్త చేతసామ్'—

అవ్యక్తబ్రహ్మ నుపాసించు మార్గము అత్యంతము క్లిష్టమైనది. అందుచే—

''తేషామహం సముద్ధర్తా
మృత్యు సంసార సాగరాత్ ।
భవామి నచిరాత్పార్థ !
మయ్యా వేశిత చేతసామ్ ॥''

నాయందు మనస్సును లగ్నము చేసిన వారిని సంసారబంధమునుండి యుద్ధరింపగల నని శ్రీకృష్ణపరమాత్మ అభయ మిచ్చియున్నాడు.

'మయ్యర్పిత మనోబుద్ధి
ర్యోమద్భక్తస్సమే ప్రియః'

నా భక్తుడు నా కెంతయు నిష్టుడు, అని చెప్పుచున్నాడు పరమాత్మ. భక్తుడు లోకమునుండి యుద్వేగము చెందడు. లోక మాతనినుండి యుద్వేగము చెందదు.

ద్వేషరహితుడు, మైత్రుడు, కరుణాళువు, మమకార-అహంకారములు లేనివాడు, సమదుఃఖసుఖుడు, శుచి, దక్షుడు; ఉదాసీనుడు, వ్యథారహితుడు, శత్రుమిత్రులయందు, మానావమానములయందు శీతోష్ణములయందు సముడు, నిస్సంగుడు, స్థిరబుద్ధి, సంతుష్టుడు, భక్తియుక్తుడు—అయినవాడు నా కిష్టుడు అని శ్రీకృష్ణుడు చెప్పినాడు. నిజమైనభక్తి గలవానిలో పై లక్షణములు వాటంతటవియే అంకురింపగలవు.

'కౌన్తేయ! ప్రతిజానీహి
న మే భక్తః ప్రణశ్యతి'

అర్జునా! ఢంకా కొట్టి చెప్పుము, నా భక్తుడు నశింపడు' అని భగవానుని అభయము. భగవానుడు భక్తుని యోగక్షేమముల నారయును. నిత్యము భజించు భక్తునికి భగవంతుడు ఋణపడిపోవును. ఆ ఋణమును తీర్చుకొన నాతడు సదా భక్తుని యోగక్షేమములను కనిపెట్టి కాపాడుచుండును. భక్తుడు ఇది కావలెను అది కావలెను అని కోరరాదు. అల్పజ్ఞుడగు మానవుడు తన హితము నెరుగనేరడు. సర్వజ్ఞుడగు భగవానుడే భక్తుని కేది హితమో దానిని చేకూర్చును. అచంచలము శ్రద్ధాయుతమునైన భక్తి ఆవశ్యకము. 'నజ్ఞానేన వినా మోక్షః' జ్ఞానము లేనిదే మోక్షము లేదు. అను సూక్తి వినబడుచుండును. మరి కేవలభక్తి ముక్తి సాధనమగునా? అని ప్రశ్న. అవసరమైనచో భక్తపక్షపాతియగు భగవానుడే జ్ఞానావకాశమును భక్తునికి గల్గించును. మార్గము నాతడే సుగమము జేసి తగు సాధనల నొసంగగలడు. రామకృష్ణపరమహంస చదివిన చదువేమాత్రము? ఆయనకు గల జ్ఞాన మెవరికి గలదు?

వట్టి శుష్క-శాస్త్రజ్ఞానము జ్ఞానము కాదు. అనుభూతికి వచ్చు జ్ఞానమే జ్ఞానము. నిజమునకు భక్తుడు జ్ఞాని యగుచున్నాడు. జ్ఞాని భక్తుడు నగుచున్నాడు ఉన్నతపరిధికి పోయి చూచిన భక్తజ్ఞానులకు భేదమే లేదు. శంకరునివంటి మహాజ్ఞాని లక్ష్మీనరసింహా స్తోత్రమును, భజగోవిందస్తోత్రమును గానము చేసినాడు. కాళీమాతకు మహాభక్తుడగు రామకృష్ణుడు పరమ జ్ఞానామృతమును వెదజల్లినాడు. జ్ఞానవాహినిలో భక్తివాహిని గంగలో సరస్వతివలె అంతర్లీనమై యుండును. అట్లే భక్తివాహినిలోను జ్ఞానవాహిని అంతర్గతమై యుండును. ఉన్నతదశలో ఈ రెండును పరస్పరము సంవలితములై పోవును.

జ్ఞానయోగాధ్యాయములో శ్రీకృష్ణపరమాత్మ అర్జునునితో ననుచున్నాడు కదా!

'స ఏవాయం మయా తేఽద్య
యోగః ప్రోక్తః పురాతనః।
భక్తోఽసి మే సఖా చేతి
రహస్యం హ్యేతదుత్తమమ్॥'

నీవు నాకు భక్తుడవు, సఖుడవు కాన నీకీ జ్ఞానయోగరహస్యమును చెప్పినాడను అని. ఇదే సాక్ష్యము, భగవంతుడు తన భక్తునికి జ్ఞానమును కల్గించు ననుటకు.

'శ్రద్ధావాన్ లభతే జ్ఞానమ్'

శ్రద్ధ భక్తికి పర్యాయపదము. భక్తిగలవాడు జ్ఞానమునంది తరించును.

# "నీవల్ల గుణదోష మేమి"

## శ్రీ అమృతానందస్వామి

కొన్నిరోజులక్రితం ఏదో పనిగా సౌత్ బీచ్ రోడ్డుమీద వెళ్లుతున్నాను. ఉన్నదిఉన్నట్లే పెద్దగా వర్షించడం ఆరంభిస్తే దగ్గరున్న ప్రెసిడెన్సీ కాలేజి మహాద్వారందగ్గర నిలబడ్డాను ఆశ్రయానికి. రేడియోపాట కాబోలు వినిపిస్తూంది. "నీవల్ల గుణదోష మేమి శ్రీరామ, నావల్లనే గాని నళినదళనయన..." త్యాగరాజకృతి. ఇదివర కెన్నోసార్లు విన్నా నీ పాట కాని ఈ రోజేదో వింతగా వినిపిస్తూంది. సంగీతం సుశ్రావ్యంగా ఉందే కాని అర్థం సరిగ్గా బోధపడటం లేదు.

శ్రీత్యాగరాజస్వాములు మంచిచెడ్డలన్నింటికీ తామే కారణులనియు తమ ఆరాధ్యుడైన శ్రీరామచంద్రుడు వాటి కేమాత్రము కారణుడు కాలేడనియు అంటున్నారు. కాని భావమేమి? విసుగుతో అంటున్నారా? లేక మరేమీ తోచక "ఇవన్నీ నా కర్మఫలమే స్వామీ? నిన్ను దూషించిగాని భూషించిగాని నాకేం లాభం?" అని నిట్టూర్పు విడుస్తున్నారా?

వర్షం తగ్గలేదు. అలాగే నిలబడి మనసులో ఈ పాటను నెమరువేస్తున్నాను. ఈలాంటి పాటలు మరికొన్ని స్మృతిపథానికి వచ్చాయి. బంగాళదేశంలో రామప్రసాదసేన్ గొప్ప కాళికాదేవి భక్తుడు. మాతృసంగీతమను విశిష్ట సంగీతశాఖకు సృష్టికర్త. అతడు నొక చోటన్నాడు. "దోష్ కారో నామ్ గోమా, అమి స్వఖాత సలిలే డుబి మరి శ్యామా!" "తల్లీ, మరెవ్వరిదీ దోషం లేదు. నేను త్రవ్వి తెచ్చు

కొన్న నీటిలో నేనే మునిగి చస్తున్నా" నన్నాడు. ఇదేమి నిస్సహాయుని దీనాలాపమా లేక తన్నుతానే ఓదార్చుకొనడమా? లేక మనం పరిష్కరించడానికి ఒక సమస్య నివ్వడమా?

ఇదే ధోరణిలో మరొకపాట స్మృతికి వచ్చింది. భక్తశిరోమణి పురందరదాసులు, "నా మాడిద కర్మ బలవంతవాదరే, యారేను మాడువరో హరీ", "నే చేసినకర్మ ప్రబల మయితే ఎవరేం చెయ్యగలరు ప్రభూ," అన్నారు. వీరందరు మహానుభావులు. భగవంతునికై తను సర్వస్వమును త్యజించి, భగవత్సాక్షాత్కారానికై తహతహలాడిన భాగవతోత్తములు. అలాంటి వారికి ఈ వైరాగ్యం తగునా? "నీవల్ల గుణదోష" మేమియు లేకపోతే నిన్ను ఆరాధించడ మెందుకు? త్యాగరాజస్వాములు "నావల్లనే గాని నళినదళనయన" అని భగవంతుని ఆరాధన వదలుకో లేదు గదా.

ఇక మరోవైపు చూద్దాం. భగవంతుడు అణు, రేణు, తృణకాష్ఠ పరిపూర్ణు డంటారు. "తేన వినా తృణమపి న చలతి" అతని ఇచ్ఛ లేనిదే ఒక తృణంకూడ కదల దంటారు. అతను సృష్టి, స్థితి, ప్రళయకర్త, మరియు ఆయన అంతర్యామి రూపంగా అందరిలోనుండి సమస్త జీవవ్యవహారానికి కారణంగా ఉంటాడు. "భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా", యంత్రములో త్రిప్పినట్లు నేను అన్ని జీవజంతువులనూ ఈ సంసారచక్రంలో త్రిప్పుతున్నాను అని స్వయంగా శ్రీకృష్ణభగవానుడే భగవద్గీతలో చెప్పుకొన్నాడు గదా! కనుక అన్ని ప్రాపంచిక వ్యవహారములూ భగవదిచ్ఛాపూర్వకమై ఉండాలి.

ఇపుడు మరొక ప్రశ్న, అంటే జీవునికి ఏమీ అధికారం, స్వేచ్ఛా లేవా? జీవుడు వట్టి పరతంత్రుడేనా? పైన చెప్పిన భాగవతుల భావోద్గారమునకు అర్థమేమిటి? జీవుడు తన సుఖదుఃఖభోగమునకు తానే తన కర్మఫలమూలంగా కారణమైతే భగవంతుని అవసరమేమి? అతన్నెందుకు కొలువాలి? మంచి కర్మవలన మంచి, చెడ్డకర్మవలన చెడు, గలుగుననియు అందరికీ తెలిసిందే, అలాగైతే అందరూ సత్కర్మచేసి సౌఖ్య మనుభవించాలి. దుఃఖ మెందుకు? "నావల్ల" గుణాలే ఉండాలి. దోషా లెందుకు?

ఈ జన్మలో అనుభవించేదుఃఖమునకు పూర్వజన్మలోని దుష్కర్మ కారణమైతే ఆ దుష్కర్మ ప్రవర్తనకు కారణం? ఈలాగ ఎంతదూరం వెళ్ళడం? ఈ గొడ వెందుకనే శాస్త్రకారులు జన్మ అనాది అన్నారు అంటే మొదటి జన్మ అనేది లేదు. కాని అంత్యజన్మ మున్నది, భగవత్సాక్షాత్కారముచే. మరింత లోతుగా వెళ్ళితే చిక్కు.

జన్మజన్మాంతరముల సంచితమైన కర్మఫలం ఉపభోగంవల్ల నశిస్తూ, మళ్ళీ క్రొత్తకర్మను ప్రేరేపిస్తూ ఆ కొత్తకర్మలవల్ల పెరుగుతూ వుంటే, ఎప్పుడు ఏ కర్మ ఏ రీతిగా పక్వమయి ఫలమిస్తుంది అన్న ప్రశ్నకు సమాధానం చెప్పడం చాల కష్టం. "గహనా కర్మణో గతిః" అని భగవద్గీతకూడ చేతులు దులుపుకుంటుంది. ఇక్కడే శాస్త్రకారులంటారు. ఈ అసంఖ్యమానవరాశియొక్క కర్మ ఎప్పుడు ఎవరికి ఏలాగ ఫలిస్తుందో లెక్కలేని ఆయా జీవులకు ఆయా జీవితాల్లో అనుభవించవలసిన కర్మఫలం ఎంతో నిర్ణయించి పెట్టడానికి నిర్దిష్టమైన ఒక మహాచైతన్యశక్తి అవసరం. ఈ మహాశక్తియే ఈశ్వరుడు.

సరే ఈశ్వరుడు సర్వసమర్థుడు కదా. ఈ కర్మ, కర్మఫలం ఈ గొడవంతా ఎందుకు? స్వేచ్ఛతో జీవుణ్ణి నియంత్రిస్తాడు అంటే అప్పుడు ఈశ్వరునికి పక్షపాతదోషం వస్తుంది. ఒకరిని సుఖగాను, మరొకరిని దుఃఖగాను చేసినదోషము మరి జీవులు కష్టపడుతూంటే చూస్తూ, వారిపైన దయ లేకుండ ఉండుటయూ ఈశ్వరుని వవుతాయి, వీటినే వైషమ్యా, నైర్ఘృణ్యా దోషా లంటారు. ఈశ్వరుడు దోష రహితుడు. ''నిర్దోషం హి సమం బ్రహ్మ'' అంటారు. అందుచేత జీవుల కర్మఫలాన్నే వారికి ఏర్పరచిపెట్టి దాని సహాయంచేత అంత ర్యామిగా జీవుణ్ణి ప్రాపంచిక వ్యవహారాల్లో ప్రేరేపిస్తూవుంటా డనుకోవాలి.

అయితే జీవుని స్వాతంత్ర్యం ఎంతవరకు? ఈశ్వరేచ్ఛ అన్నది ఎంతవరకు? ఈ సమస్యకు భగవాన్ రామకృష్ణపరమహంస లీ రీతిగా సమాధానం చెప్పారు. ఒక రాటకు గట్టిన ఆవుకు కట్టిన త్రాడు ఎంత పొడుగో అంత దూరం స్వాతంత్ర్యం ఉంది కదా! దానికి బయట రావాలంటే పారతంత్ర్యమే. అలాగే జీవునికికూడ తానిదివరకు చేసిన కర్మ బంధించి నప్పటికీ చేయబోయే కర్మ గురించి స్వాతంత్ర్యం తప్పకుండా ఉంది. భగవదా రాధనతో ఆధ్యాత్మికజీవితం దృఢమైనకొద్దీ, భగవంతునిపైన భక్తినిర్భరత పెరుగుతూ అహంకారమమకారాలు క్షీణిస్తాయి. అహం కారం తగ్గినకొద్దీ కర్మఫలముయొక్క తీవ్రత తగ్గిపోతుంది. దీనినే జగన్మాత శారదాదేవిగా రిలా అన్నారు. ''ఎంత ప్రబలమైన కర్మఫల మైనా భగవద్భక్తుణ్ణి ఏమీ చేయలేదు. చిన్నగా స్పర్శించి తేలిపోతూ వుంటుంది. భక్తుడు సాధారణమానవునిలాగే ఒక్కొక్క సారి తన దుష్కర్మగురించి విలపించినా, అది క్షణికం, దీర్ఘకాలం అతని మనస్సులో అశాంతి, నిస్సహాయత లుండవు.

భక్తుల జీవితంలో గూడ చాల కష్టాలు రాగలవు. కాని వీటివల్ల భక్తుడు సాధారణ మానవునివలె క్రుంగిపోడు. అతని భగవద్భక్తి మరింత గాఢ మవుతుంది. కష్టాలు భక్తుణ్ణి తాత్కాలికంగా విచలితుణ్ణి చేస్తాయి కాని అతనికి నైరాశ్యం కల్పించవు. దుఃఖాలూ కష్టాలే లేకపోతే మానవుడు భగవంతునిగురించి ఎప్పటికీ చింతించడు. మహాభారతంలో కుంతీ దేవి శ్రీకృష్ణుని ప్రార్థిస్తుంది తనకు కష్టమే ఇమ్మని—కష్టంద్వారా శ్రీకృష్ణస్మరణ లభి స్తుంది కదా. ఇది నా కర్మఫల మగుటచేత దీన్ని ధైర్యంగా అనుభవించి ఇకపైన కొత్త కర్మఫలం రాకుండా ప్రయత్నించే సామర్థ్యం గూడ నాదే అయివుండాలి. ఈ పురుషకారం పెరిగిన కొలదీ భగవత్కృప కూడ తోడుపడు తుంది. అప్పుడు పురుషకారం వేరు, భగవ త్కృప వేరు అన్న జ్ఞానం పోయి మంచిచెడ్డ లన్నియూ భగవత్కృపావిశేషంగా భావిస్తాము.

ఈ కర్మపాశంనుండి తప్పించుకోవడానికి దారి ఒక్కటే—సమస్తకర్మమును భగవదా రాధనారూపంగా చూస్తూ, చేస్తూ కర్మఫల మంతా భగవంతుని కర్పించడమే. దీనినే నిష్కామకర్మ యని భగవద్గీత ఉపదేశిస్తుంది. అప్పుడే అది కర్మయోగ మవుతుంది. అప్పటి దాకా అది కర్మభోగమే. ఇలాంటి కర్మ యోగము గురించే భగవద్గీత ''యోగః కర్మసు కౌశలం'' — ఈ కౌశలాన్నే భక్తుడు భక్తి తోనూ, జ్ఞాని జ్ఞానంతోనూ సంపాదింప గోరు తాడు. మరొకమారు—ఈశ్వరుని అహైతుక దయాసింధువు అంటారు. ఏమి కారణమూ లేకనే అతనిదయ అందరిపై వర్షిస్తూ వుంటుంది. ఈ కౌశలం వస్తేనే భగవంతుడు అహైతుక

దయాసింధువు అన్న మాటకు అర్థం బోధ పడుతుంది. అప్పుడే జీవుడు స్వేచ్ఛ, ఈశ్వరేచ్ఛలకు భేదం చూడడు. అంతయూ అతనికి ఈశ్వరేచ్ఛే, అయినను ఒక్కొక్కప్పుడు భక్తుడు తన కష్టాలకై తననే నిందించుకొనును గాని భగవంతుని గురిచెయ్యడు. తన కష్టానికి తన ప్రియతము న్నెందుకు నిందించడం? ఇదొక మనస్థితి.

భగవంతుడు అహైతుక దయాసింధువైనను మన కలా బోధపడటం లేదే అంటే భగవాన్ శ్రీరామకృష్ణపరమహంస ఈలాగన్నారు—జీవితనౌక భగవంతుని దయ అనే ఎల్లప్పుడు వీచే గాలి పోసుకోవాలంటే తన పురుషకారమనే తెరచాపలు విప్పుకోవడమే ఆలస్యం. విప్పుకోగానే వీచుతూ వుండే గాలినే పోసుకుంటుందే గాని కొత్త గాలి రాలేదు. గదిలో చిమ్మచీకటి. నీకు వెలుతురు రాలేదని ఏడిస్తే ఏం లాభం? లేచి కిటికీలు తెరిస్తే ఉన్న వెలుతురే లోపలికి వస్తుందే గాని, వెలుతురును కొత్తగా ఎవరో సృష్టించలేదు.

పాట ఎప్పుడో ముగిసిపోయింది. వర్షం ఆగింది. వెళ్ళదలచుకొన్న పనికి ఆలస్యమయిపోయింది. "నీవల్ల గుణదోష మేమి" వర్షం ఆగేవరకు నిలబడదాం అని అన్నీ మరచిపోయింది నా దోషమే కదా శ్రీరామ? కాని ఈ సమయంలో ఆ పాట వినిపించడం నీ గుణమేనా?

---

ప్రభాప్రసారము
(సంపాదకీయము)

# విద్యావిషయము

ప్రతిజీవియు విద్యాభ్యాసము చేయుచునే యుండును. పిల్లిపిల్లలు తమ తల్లి తోకతో నాడుకొనుచు ఎలుకలను పట్టుట నభ్యసించును. పులి తన పిల్లలకు శ్రద్ధతో వేటాడుటను నేర్పును. అవి యుత్సాహముతో తమ విద్యను నేర్చుకొనుచుండగా జీవకోటికి శిరోమణియగు మానవుడు మాత్రము బలవంతముచేతనే విద్య నభ్యసించును. కనీసము ప్రస్తుతసమాజపరిస్థితియందీ భావము తోచును. ఇట్టి విద్యాభ్యాసమునైనను మొక్కు తీర్చుటకో యనునట్లు ముగించునే కాని జీవితముపై నతని విద్యాప్రభావ మేమియు నున్నట్లు కన్పింపదు. విమర్శింపగా ప్రస్తుతము బోధింపబడు విద్యయే లోపభూయిష్ఠమని యనుమానము కల్గును.

విద్యయనగా మానవునిదివ్య ప్రకృతియొక్క ఆవిష్కారము. త్రిప్పి చెప్పినచో భౌతిక, మానసిక, ఆధ్యాత్మిక, సంపూర్ణవికాసము. దీనిని సాధించుటయే విద్యయొక్క ఉద్దేశము. మానవుడు సర్వతోముఖాభివృద్ధి పొందుట కిట్టి విద్యే పునాది కావలెను. విద్యాభ్యాసకాలమందు, ప్రత్యేకము చిన్నతనమందు, ఇట్టి విద్యారంభము చేసినచో నియమితకాలములో గురువులవద్ద నభ్యసించు విద్య పూర్తియైనను జీవితపర్యంతము స్వేచ్ఛగా ఆసక్తితో అతడు తన విద్యాభ్యాసమును కొనసాగించుకొనును.

సాధారణమానవుడు తన యానందమును తనవాంఛ యానందమును సాధింప నెంచును. దీనితో సంఘముపట్ల అతనికిగల బాధ్యతలు

శికొనును. ఇవి రెండునుగాక బుద్ధి ఇంకొంచెము వికసించిన మానవుడు ప్రపంచమునందలి యసంఖ్యాకములగు వైరుధ్యములకు, తన జీవనావశ్యకతలకు, గమ్యములకు సమాధానములను వెదకును. ఈ మూడింటిని వారివారికి తగినట్లుగా సమన్వయపరచి ప్రతివ్యక్తియు తాను సంతుష్టుడై సంఘసేవకుడై ఆత్మోన్నతిని సాధించు పరిపూర్ణమానవునిగా చేయు నుద్దేశించునదియే విద్య.

పూర్వకాలమున గురుకులము లుండెడివి. విద్యార్థులు, విద్య నభ్యసింపగోరువారు, బీద బ్రాహ్మణుడైనను రాజపుత్రుడైనను అడవిలోని గురుకులమునకు బోయి పది పండ్రెండేండ్లు విద్యాభ్యాసదీక్షను స్వీకరించి పిదప ప్రపంచములోనికి మరలెడువారు. వారి గురువర్యులే వారు నేర్చు విద్యకు ప్రత్యక్షప్రమాణములు. తపోనిధులు జ్ఞానమూర్తులు, ఆదర్శపురుషులు నగు వారు తమ శిష్యులు, శక్తి గలిగినచో, అందుకొనగలుగు ఔన్నత్యశిఖరములవలె నుండిరి. వారి శిష్యులును గురువులచే ప్రీతితో బోధింపబడి తామును గురువులంతటివారు కాగల్గిరి. అంత శక్తి లేనివారు సమాజమునందు గౌరవనీయులై తమ సంతోషమును సాధించుకొనుచు సంఘక్షేమమునకై యత్నించిరి. ఇది ప్రాచీనగాథ.

విద్యాభ్యాస మిప్పుడును జరుగుచున్నది.

కాని విద్యార్థి యర్హతలుగాని గురువులయర్హతలుగాని నేర్పబడు విద్యగాని ఏ యొక్కటియు శ్రద్ధతో విమర్శింపబడి పాటింపబడుచున్నట్లు కన్పింపదు. గురుకులమునందు విద్యార్థి పండ్రెండేండ్లు బ్రహ్మచర్యదీక్ష వహింపవలెను. కఠిననియమబద్ధుడై జీవింపవలెను. గుర్వాజ్ఞకు లోబడి యుండవలెను. రాజపుత్రుడైనను శిక్షార్హుడైనచో శిక్షింపబడును. లేదా గురుకులము వదలి పోవలెను. అంతేయుగాని వాని తలిదండ్రులు వానిని రక్షింపవచ్చునో, వారికి భయపడి గురువు శిక్షాపాతము చూపుటయను ప్రశ్నయే లేదు. గురువు ప్రీతితో తన శిష్యులను తన బిడ్డలవలెనే పెంచుకొనును. ప్రస్తుతసమయమున కావలసినవియు ఈ దీక్ష, నియమబద్ధ జీవనము, గురువుల పట్ల విధేయతలే. గురువులకును జ్ఞానాన్వేషణ తపోమయజీవనము శిష్యుల పట్ల ప్రీతి ప్రేమ అనునవియే. ఇవి కలిగినచో విద్యాభ్యాసంగము ఎక్కువ శ్రమలేకయే సక్రమముగా కొనసాగును. కాని ఆధునికసమయమందు విద్యార్థిదశయే జీవితమందు సుఖాన్వేషణ చేయదగిన సమయమని ఎల్లర నిశ్చితాభిప్రాయము!

విద్యకు భౌతిక, మానసిక, ఆధ్యాత్మిక, విమయము లంశములని చెప్పితిమి కదా! అందు భౌతికవిద్య ప్రథమమున సాధింపదగినది. శరీరము కొంతకాలమువరకే పెరుగును. పిదప కొంతకాల ముపయోగకరముగా మాత్రముండును. ఆపిదప క్రమముగా శిథిలించిపోవును. సమ్యగ్జీవనమును సాధింపగోరు మానవుడు శరీరము పెరుగు వయస్సునందే అది సక్రమముగాను బలిష్ఠముగాను పిదప ఉపయోగకరముగాను ఉండునట్లు సిద్ధపరచుకొనవలెను. ఐహికసుఖముల ననుభవించుటకైనను ఆముష్మికప్రయత్నమును చేయుటకైనను శరీరమే కదా ముఖ్యసాధనము! కావుననే ప్రొద్దుననే లేచుటయును చలినీటి స్నానములును ఆయుధపరిశ్రమ మొదలగు శారీరకనియమములును ప్రాచీనుల కావశ్యకములైనవి. అట్లే ప్రస్తుతసమయమునందును శారీరకవిద్యను దృష్టిలో నుంచుకొని విద్యార్థులు దీక్షాపరులై శ్రమింపవలెను.

ప్రొద్దుటనే లేచుటవలన నుపయోగింపగలుగు సమయ మెక్కువ లభించును. చలినీటి

స్నాన మహిమ ఎల్లరకును తెలిసినదే. ఆయు రారోగ్యవర్ధనమునకు దానిని మించిన యౌషధము లేదు. ఇక వ్యాయామమును గూర్చియు విశేషసాహిత్యము గలదు. ప్రతివారును తమ కిష్టమైన శాఖయందు పరిశ్రమింపవచ్చును. వివిధరకములగు నాటలు కుస్తీలు శరీరవిన్యాసములు ఇతరకళలు ఎన్నియున్నను వాని ప్రథమోద్దేశము శారీరకబలవర్ధనమే. కనుక వీనియందే యవకాశమును లేనివారు మాకీ యవకాశము లేవియు లేవని యూరకుండక దండెములు బస్కీలు మొదలగు ధనవ్యయము లేని వ్యాయామము నియమముతప్పక అభ్యసింపవలెను. వ్యాయామమువలన బ్రహ్మచర్యము సుకరమగును.

యోగాసనములు ప్రాణాయామముల నభ్యసింప గోరువారు ఆధ్యాత్మికాదర్శములతో నియమబద్ధమైన జీవనమును అవశ్యము గడపవలెను. పట్టి యోగశక్తులకొరకో వ్యాయామదృష్టితోనో అభ్యసించినయెడల వానివలన శారీరకశక్తులు విజృంభించినపుడు వాని కూర్ధ్వగతిని జూపలేకయు ఆత్మనిగ్రహము సాధ్యము గాకయు నభ్యాసకు లధోగతి పాలగుదురు.

నియమబద్ధమగు జీవన మెట్లు చూచినను ఆవశ్యకము. ప్రతిజీవికిని దైనందిన జీవితమునందొక లయయుండును. దివసము ప్రారంభమున అతని శక్తి పోటులోనుండును. క్రమముగా నా శక్తి వికసించుచు రోజునందు కొంతకాలము మనుజుడు తన యత్యున్నతశక్తితో పనిచేయుచుండును. పిదప నది క్రమముగా తగ్గుచు రాత్రి యగుసరికి నిద్రాసమయమునకు శరీరము సరియగు విశ్రాంతి నందుటకు సిద్ధముగా నుండును. త్వరగా నొక నియమితకాలమున లేచుటవలన ఈ దైనందినమగు లయ సుస్థిరమై శరీరము యొక్క ఉపయోగకరమగు కాలము నెక్కువ చేయును. శరీరదార్ఢ్యము చిరకాలము బెసగ కుండును.

మరియు నియమబద్ధమగు జీవనము శారీరక శక్తుల నేకోన్ముఖములుగా చేసి మానసికాధ్యాత్మిక విద్యాభ్యాసములను సులభసాధ్యములనుగా చేయును.

మానసికవిద్యా పరిశ్రమయందు ముఖ్యముగా సాధింపదగినది మనోబలము. వ్యాయామముచే శరీర మెట్లు దృఢమై యుపయోగకరమగునో అట్లే మనస్సును ఏకాగ్రత నభ్యసించుటచేత బలవత్తరమై యుపయోగకరమగును. శరీరబల మెట్లు వివిధమానవులందు భిన్నముగా నున్నదో అట్లే మనస్సు నేకాగ్రము చేయగలుగు శక్తియు భిన్నమానవులందు భిన్నముగా నుండును. మానవులయందలి వ్యత్యాసము ముఖ్యముగా ఈ శక్తి ననుసరించియే యేర్పడును. శరీరబలమువలెనే మనోబలమును ఏకాగ్రత యను వ్యాయామముతో పెంపొందించుకొనవచ్చును. ఏ విషయమునందైనను మనస్సును ప్రయత్నపూర్వకముగా నిలిపియుంచుటయే, మనస్సు చెదరినపుడెల్ల విడువక మరల దానిని సమీకరించుటయే ఏకాగ్రత యొక్క అభ్యాసము. మానవు డెంత ఏకాగ్రతను సాధించిన నంత బలవంతమగు మనస్సు గలిగిన వాడగును.

ఇట్లేకాగ్రమైన మనస్సు గలిగిన మానవుడు ఏ విద్యనైనను సులభముగా నేర్చుకొనగలడు. మానసికవిద్యయందు ఆధునికశాస్త్రవిజ్ఞానము యొక్క అన్ని శాఖలుమాత్రమే గాక మనస్సునకు పరిశ్రమనిచ్చు మన శాస్త్రవిజ్ఞానము కూడ నవశ్యము నేర్వతగినది. ఆధునికశాస్త్రవిజ్ఞానము భౌతికసుఖములను సాధించు మార్గములను తెలుపును. హిందూశాస్త్రములు జీవనము నెట్లు చక్కదిద్దుకొనవలయునో తెలుపును. పట్టి

విషయసేకరణము మాత్రమే గాక మానసిక విద్య విషయగ్రహణమునం దాసక్తి చూపవలెను. అనగా నేర్చిన విద్య అంతతో నాగిపోక స్వతంత్రముగా ఆ విద్య నుపయోగించి నూతన విషయములను కనుగొనుటకు సామర్థ్యమును కలుగజేయవలెను. అప్పుడే విద్యాభ్యాసము సార్థక మగును.

ప్రస్తుతసమాజమునందు విద్యాభ్యాసము కేవలము విషయసేకరణ మాత్రమై విద్యార్థులకుగాని సమాజమునకు గాని ఉపయోగము లేకున్నది. చదువు ముగించిన పిదప సిద్ధముగా గుమాస్తాగిరి కాని మరి ఇతర 'ప్రభుత్వోద్యోగములు' కాని ఉండవలయునందురే కాని తాము స్వయంకృషి చేయు నూహ గాని సామర్థ్యము గాని ఎవ్వరియందును కన్పట్టదు. కాగా వణిక్శ్రేష్ఠులు పారిశ్రామికులు మరి ఇతర సమాజ నాయకులు చూడ నాధునికవిద్యను పెద్దగా నభ్యసింపనివారే కన్పింతురు. కనుక విద్యార్థులు విషయసేకరణను మాని తాము సమర్థులగుటకు విషయగ్రహణమునందు శ్రద్ధ చూపవలెను. ఏకాగ్రత లేనిచో విషయగ్రహణము సాధ్యమే కాదు గదా! ఈ ఏకాగ్రతను సాధించుటకును జీవితోద్దేశమును స్పష్టము చేయుటకును హిందూ శాస్త్రము లత్యంత ముపకరించును.

మరియొక ముఖ్యవిషయ మేమన విద్యాగ్రహణము సంపాదించిన విద్యను జీవితమునందు జీవించుటను సూచించును. యుక్తాయుక్త వివేకము విద్యవలన కలుగును. కలిగియు యుక్తాయుక్తములను పాటింపనిచో ఆ విద్యకు ఫలమేమి? వానికంటెను విద్య నభ్యసింపనివాడే నయ మనిపించును. 'విద్యా'వంతుడు తెలిసియు అకార్యములు చేసినచో విద్యావిహీనుడు తెలియకమాత్రమే అకార్యముల జేయును. అకార్యములు చేయుటచేత నిరువురు సములే అయ్యెను, అందు విద్యావిహీనుడే యుత్తముడని చెప్పక తప్పదు. ఇప్పటికైనను ప్రయత్నపూర్వకముగ సక్రమమగు విద్యాభ్యాసము చేసిననే తప్ప వ్యక్తికిగాని సమాజమునకుగాని పురోగతి లేదు.

ఇక ఆధ్యాత్మికవిద్యయనునది అనంతమైనది. అందు ప్రాథమికవిషయములే సత్యము దయ శాంతము క్షమ అహింస ధైర్యము బ్రహ్మచర్యము ప్రియభాషణము మొదలగునవి. ఇవి యన్నియు శారీరక మానసిక విద్యాభ్యాసమునకు మిక్కిలి తోడ్పడును. జీవనమును సుఖశాంతులతో నింపును. సంఘక్షేమమును సాధించును. శారీరక మానసిక విద్యలద్వారా ఆధ్యాత్మికవిద్యయందలి ప్రాథమికవిషయములనైనను జీవింపగలిగిననే మానవుడు మానవుడుగా జీవింప ప్రారంభించును. శక్తి గలిగినచో ఆసక్తి యున్నచో ఆధ్యాత్మికవిద్యయే మానవుని పరిపూర్ణమానవునిగా దివ్యునిగా రూపొందించును:

---

జీవనసంరంభమునకు జనసామాన్యమును సమర్థము చేయజాలని విద్య—శీలమును, లోకహితకాంక్షను, సింహసాహసమును వెలువరింపజాలని విద్య—విద్యయనదగునా? దేనివలన శీల మేర్పడునో, మనోబల మభివృద్ధి చెందునో, బుద్ధి వికసించునో, స్వశక్తిపై నిలుచుటకు మానవు నెయ్యది సమర్థుని జేయునో—అట్టి విద్యయే మనకు వలయునది. మనలను ధీరుల నొనర్చుటయే సమస్త విద్యాభ్యాసమునకును, సమస్త శిక్షణమునకును బరమప్రయోజనమై యుండవలయును. దేనివలన నిచ్ఛావాహినియు తత్ప్రకటనమును స్వాధీనమై ఫలప్రదమై యొప్పునో అదియే విద్య.

—శ్రీ వివేకానందస్వామి.

# భక్తిరత్నావళి

మూలము :
శ్రీవిష్ణుపురి

వ్యాఖ్యాత :
విష్ణుచిత్తుడు

(ప్రథమ విరచనము)

## 44

మహానుభావులును ప్రాపంచిక భోగార్థులై భగవంతు నర్చించుచున్నట్లు తోచును. కాని అట్టివారు నిజముగా మహానుభావులు కారు. వైరాగ్యము కలిగిననే భక్తి సుస్థిర మగు నని ప్రహ్లాదు డనుచున్నాడు.

తత్సాధు మన్యేఽసురవర్య దేహినాం సదా సముద్విగ్నధియామసద్గ్రహాత్
హిత్వాత్మపాతం గృహమంధకూపం వనం గతో యద్ధరిమాశ్రయేత్. (7-5-5)

రాక్షసోత్తమా! ప్రాపంచికవిషయములందు తగుల్కొని ఎల్లప్పుడు పరిభ్రమించు మతిగలుగువారు పతనకారణమును అంధకారకూపమును అగు గృహమును పరిత్యజించి యడవికి బోయి శ్రీహరి నాశ్రయించుటయే శ్రేష్ఠము. అదియే వారి పారమార్థికోజ్జీవనమునకు మార్గము.

గమనిక : భక్తిమార్గావలంబకు లెల్లరు నడవులబడి పోవలెనని యుద్దేశము గాదు. ప్రాపంచిక వాతావరణమునుండి దూరమునకు జనుటయు సాధుసాంగత్యమును భక్తి పెంపొందుట కావశ్యకములని భావము.

## 45

సకలగుణములును భక్తిని పెంపొందించుటవలననే సార్థకము లగును. గుణములవలె గాక భక్తియే పరమార్థమనియు యముడు వచించుచున్నాడు.

ఏతావానేవ లోకేస్మిన్పుంసాం ధర్మః పరః స్మృతః
భక్తియోగో భగవతి తన్నామగ్రహణాదిభిః (6-3-22)

భగవన్నామశ్రవణ సంకీర్తనములచేతను మరి ఇతర భక్తిసాధనలచేతను భక్తి నభివృద్ధి చేసికొనుటయే పరమధర్మమని శాస్త్రములు విధించుచున్నవి.

## 46

భగవదాశ్రయముచేత తప్ప సంసారసంతాపము తరింప నసాధ్యమని దేవతలు నుడువుచున్నారు.

అవిస్మితం తం పరిపూర్ణకామం స్వేనైవ లాభేన సమం ప్రశాన్తమ్
వినోపసర్పత్యపరం హి బాలిశః శ్వలాంగులేనాతితితర్తి సింధుమ్. (6-9-22)

మహాత్త్వమున నతనిని మించినవాడు లేడు. కనుక నతని కైశ్వర్యాతిశయమును గొల్చువాడెవ్వడును లేడు. విశ్వవ్యాపకమగు నాత్మ లాభమున నత డానందమూర్తి. కనుక నతని కానందదాయక మింకొకటి లేదు. అత డవికారుడు, శాంతస్వరూపుడు. అట్టి శ్రీహరిని పోద్రోచి భవసాగరతరణమున కితరుల నాశ్రయించువాడు కుక్కతోకను బట్టి సాగరము నీదగోరువానివలె బుద్ధిహీనుడు గదా!

---

# శ్రీ రామాయణము

చైత్రమాసము సంవత్సరమందలి నెలల వరుసలో తాను మొదటిది అగుటే కాక శ్రీ రామచంద్రుడు అవతరించిన నెల యగుటచేత మఱింత ధన్యతమమైనది. మనము ఆరాధించెడి యవతారమూర్తులలో శ్రీరాముడును శ్రీ కృష్ణుడును మిక్కిలి ప్రశస్తి నందినవారు. పరమహంస శ్రీరామకృష్ణునినామమున 'రామ' 'కృష్ణ' శబ్దములు కలయిక నొందినట్లే ఉభయ వైభవములును ఆయనవైభవమున మేళన మును పొందినవి. అందు శ్రీరాముని ప్రశంస మనకు ప్రకృతము.

శ్రీరామునిచరిత్రము లోకమున 'రామాయణము' అని ప్రసిద్ధమై యున్నది. రామాయణము అనగా ఏమి ? రామ=రాముని, అయనము=చరిత్రము అని అర్థము చెప్పుట కలదు. అయనము అనగా 'మార్గము' అనునర్థమొకటి కలదు. రామ=రాముని, అయనము=మార్గము అనియు అర్థము చెప్పవచ్చును. సీతను పరిణయ మగుటకు విశ్వామిత్రునితో బోవుట, పరిణయానంతరము సీతతో గూడి వనవాసమున కేగుట, వనములో సీతను గోల్పోయి ఆమెను వెదకుచు బోవుట, ఉన్నచోటును కనుగొనుట, ఆచోటికి సైన్యసమేతుడై పోవుట, రావణుని సపరివారముగ హతమార్చి సీతను జేకొని పుష్పకవిమానారూఢుడై, వచ్చిన దారినే మరల అయోధ్యకు జేరుకొనుట—ఇవి రాముని యయనమునకు వివరణములు. వీనిని ప్రతిపాదించు గ్రంథము రామాయణము.

రాముని చరితమును రచించిన మహర్షులు ఎందఱో కలరు. వారిలో వాల్మీకికిని వాల్మీకి రామాయణమునకును గలిగినంత ప్రశస్తి, ఇక నెవరికిని ఎవరి రామాయణమునకును గలుగ లేదు. వాల్మీకి శ్రీరామునకు సమకాలికుడు. శ్రీరామరాజ్యము చేయుచుండిన కాలమున—

'రామో రామో రామ' ఇతి
ప్రజానా మభవన్ కథాః
రామభూతం జగ దభూత్
రామే రాజ్యం ప్రశాసతి ॥

రాముడు రాముడు రాముడు అని ప్రజలు సదా కీర్తించుచున్నందున, జగమంతయు రామ ప్రశంసామయముగను రామమయముగను ఐనదట. ఆ కాలమున ఉండిన వాడు వాల్మీకి అంతే కాదు, ప్రజానురంజనపరుడై, రాముడు నిండు చూలాలైన సీతాదేవిని అడవిలో విడిచినప్పుడు, వాల్మీకి ఆమెను తన యాశ్రమమునకు జేర్చుకొని ఆమెను సదా ఆరాధించుచు, తదనుగ్రహామున తన్మహిమను ప్రత్యక్షముగ అనుభవించుచు,

శ్రీ రామకృష్ణప్రభ మే 1956 నుండి.

తచ్చరితమును రచించెను. అట్లు స్వానుభవ పరీవాహముగ వెలువడిన రచనయే కానికల్పితము కానందుచేతనే దానికి అంతటి ప్రశస్తి కలిగినది. భారతీయుల సనాతన శాశ్వత లక్ష్య సర్వస్వము వాల్మీకి వాక్కుల రామాయణముగ రూపొందినందున, ఆ రామాయణమునకును సనాతనత్వ శాశ్వతత్వములు కలిగినవి. ఆ శాశ్వతత్వమును వాల్మీకి స్వయముగ నిట్లు ఉద్ఘాటించినాడు—

> యావత్ స్థాస్యన్తి గిరయ
> స్సరిత శ్చ మహీతలే,
> తావద్ రామాయణ కథా
> లోకేషు ప్రచరిష్యతి.

భూతలమున కొండలును నదులును ఉన్నంత కాలము, రామాయణ కథకు ప్రచార ముండు నన్నాడు. అనగా శాశ్వత ప్రచార ముండు ననియే అర్థము. భూకంపాదులచే నదీపర్వతములకైనను భావాభావములు, వృద్ధిహ్రాసములు, మున్నగునవి కలుగవచ్చునే కాని, శ్రీరామాయణ ప్రశస్తి ప్రచారములకు క్షతి యొక్కనాడును కలుగదు.

ఆ గ్రంథమునకు రామాయణము అనియు పౌలస్త్యవధ మనియు 'సీతాయా శ్చరితం మహత్' అనియు నామాంతరములు ప్రసిద్ధములైనవి. అందు మొదటి పేరునకు చెప్పదగిన యర్థములను పైని జెప్పితిమి. రెండవది పౌలస్త్యవధ మను పేరు. పౌలస్త్యుడు అనగా పులస్త్య బ్రహ్మ మనుమడు, రావణుడు. అతడు ఈ గ్రంథమున ప్రతినాయకుడు. ప్రతినాయకుని గొప్పతనమును వర్ణించుటచేత, అతని కెదురు కాగలిగి అతనిని మించిన నాయకుని గొప్పతనమునకు మఱింత తళుకు కూర్చుట కవుల కొక పద్ధతి. ఇందు రావణుని సర్వవిధములైన గొప్పతనములు ఎంతగా వర్ణింపబడియున్న వనగా, అతనికి ప్రతిస్పర్ధి యగుటచేతనే రాముడు అంత గొప్పవా డైనాడేమో అనిపించునంతగా వర్ణింపబడియున్నవి. రావణుని జూడగనే హనుమంతుడు ఇట్లు అనుకొనెనట!

> అహో! రూప! మహో! ధైర్య!
> మహో! సత్త్వ! మహో ద్యుతిః!
> అహో! రాక్షస రాజస్య
> సర్వలక్షణ యుక్తతా ॥
> యద్యధర్మో న బలవాన్
> స్యా దయం రాక్షసేశ్వరః
> స్యా దయం సురలోకస్య
> స శక్ర స్యాపి రక్షితా ॥

"ఏమి రూపము! ఏమి ధైర్యము!! ఏమి సత్త్వము!!! ఏమి తేజము!!!! ఈ రాక్షసరాజు సర్వలక్షణయుక్తుడు. ఇతడు అధర్మమును అవలంబించినాడు. అధర్మము ఎంతటి వానినైనను నాశ మొందించును. అంతటి బలము అధర్మమున కున్నది. అట్టి యధర్మ మితని కొద్ద లేకుండెనేని, ఇతడు రాక్షసులకే కాక, ఇంద్రాది దేవతలకు సైతము రక్షకుడు కాగలడు. ఆ రావణుని యుద్ధరంగమున తొలిసారి ఎదుర్కొన్నప్పుడు శ్రీరామచంద్రుడు, అంతటి గొప్పవానితో తనకు ప్రాతిపక్ష్యము ఒనగూడినందులకు ఎంతగా మురిసిపోయెనో మహాకవి కాళిదాసు ఇట్లు వర్ణించినాడు—

> జేతారం లోకపాలానాం
> స్వముఖై రర్చి తేశ్వరమ్
> రామ స్తులిత కైలాస
> మరాతిం బహ్వమన్యత ॥

ఈ రావణుడు లోకపాలురను గెల్చినవాడు. తన తలలను నఱికి హోమమున వేల్చి పరమశివుని ఆరాధించినవాడు. కైలాసపర్వతము నెత్తి

ఉద్ఘాత లూపినవాడు. అంతటి వానిని శత్రువుగా బడయగనుట తన మహాభాగ్య మనుకొనెనట. రావణునియొక్క యంతటి గొప్పతనమును వర్ణించి అధర్మాచరణముచే అతడు ప్రాపించిన వధమును ప్రతిపాదించుటచే, ఈ గ్రంథమునకు పౌలస్త్యవధ మను పేరు సరిపోవుచున్నది.

మూడవపేరు "సీతాయాశ్చరితం మహత్" "సీతయొక్క గొప్ప చరితము." ఏ గొప్పతనమును తీసికొన్నను అందు శ్రీరామునకు పైమెట్టు సీతది. (1) దివ్య పయశ్చరు ప్రభావమున కౌసల్యాదుల గర్భములనుండి పుట్టువొందినవారు రామాదులు. సీత నాగంటిచాలున అయోనిజయై అవతరించినది. (2) రాముని సౌందర్యము మగవారినిగూడ మరులు గొలుపునది. సీతయొక్క దివ్యసౌందర్యము విశ్వమును పాదాక్రాంతము చేసికొనగలది. ఆ సౌందర్యమును సేవించి నప్పుడు నిత్యబ్రహ్మచారియైన హనుమంతు డిట్లు అనెను.

> దుష్కరం కురుతే రామో
> య ఇమాం మత్తకాశినీం
> సీతాం వినా మహాబాహు
> ర్ముహూర్త మపి జీవతి ॥
> యది రామ స్సముద్రాన్తాం
> మేదినీం పరివర్తయేత్
> అస్యాః కృతే జగచ్చాపి
> యుక్త మిత్యేవ మే మతిః ॥
> రాజ్యంవా త్రిషు లోకేషు
> సీతా వా జనకాత్మజా—
> త్రైలోక్య రాజ్యం సకలం
> సీతాయా నాప్నుయాత్ కలామ్ ॥

ఈమత్తకాశినినివిడిచి శ్రీరాముడు ముహూర్తకాలమైనను జీవించియుండుట దుష్కరము. ఈమెకుగా రాముడు సముద్ర పర్యంతమైన భూమినంతటిని సమస్తలోకములను తలక్రిందులు చేసినను యుక్తమే యని నా తలంపు. త్రైలోక్య రాజ్యము హెచ్చా? జనకపుత్రియైన సీత హెచ్చా? అని యోచించితిమేని త్రైలోక్య రాజ్యమంతయును సీతలో ఒక పదునాఱవ పాలేనియు గాదు." (3) శ్రీరామునిలో సర్వ కల్యాణగుణపరిపూర్తి గలదు; ఈమెలోను గలదు. ఆయన ఆదర్శపురుషుడు. ఈమె ఆదర్శ మహిళ. ఆయన లోకముల తండ్రి. ఈమె లోకముల తల్లి. 'పితుర్దశ గుణం మాతా' 'తల్లి తండ్రికంటె పదిమడుగులు హెచ్చు'. ఆయన ఏకపత్నీవ్రతుడు. ఈమె ఏకపత్ని. హనుమంతునకు తోకకు రాక్షసులు అంటించిన నిప్పు ఈమె మాటలచే మంచుగడ్డలవలె చల్లనైనది. ఇక ఆ నిప్పులోనే ఈమె తన పాతివ్రత్య ప్రదర్శనార్థము ప్రవేశించినపుడు ఆ యగ్నికి, ఈమెను శిరసావహించి శ్రీరామున కర్పించుటకే గాని, దహించుటకు యోగ్యత యెక్కడిది! మహిళలకు పాతివ్రత్యాది గుణపాఠముగ సీత అనుగ్రహించిన దివ్యసూక్తులలో ఒక్కదానిని చిత్తగింపుడు.

> నాతంత్రీ వాద్యతే వీణా,
> నాచక్రో వర్తతే రథః,
> నాపతి స్సుఖ మేధేత,
> యా స్యా దపి శతాత్మజా ॥

"తంతిలేక వీణ పలుకదు, చక్రము లేక రథము నడువదు, నూర్గురు కొడుకు లున్నను భర్త పోవునేని స్త్రీకి సుఖము లేదు." (4) ఇక శ్రీరామావతారమున సర్వేశ్వరుడు తనవ్రతము నొకదానిని ప్రకటించినాడు—

> సకృ దేవ ప్రపన్నాయ
> త వాస్మీతి చ యాచతే,

అభయం సర్వ భూతేభ్యో
దదా మ్యేతద్ వ్రతం మమ॥

"'స్వామీ, నేను నీ వాడను' అని ఒక్కసారి నన్ను యాచించిన జాలరను; అట్లు యాచించిన వానికి అభయమును (మోక్షపదవిని) ఒసంగుట నా వ్రతము." దీనిని చిత్తగించియే శ్రీ వేదాంత దేశికులవారు రఘురాముని "సకృత్ ప్రపన్న జనతా సంరక్షణైక వ్రతీ" "ఒక్కసారి శరణుగోరిన చేతనులను కాపాడుటే ముఖ్య వ్రతముగ గలవాడు." అని కొనియాడినారు. ఆ వ్రతాచరణములో, సీతాదేవి శ్రీరామునకు సహధర్మిణి యగుట మాత్రమే కాదు, అందును ఆయనకన్న పైమెట్టుననే నెలకొన్నది. సీతను రాక్షసస్త్రీలు రావణాజ్ఞచే నానాహింసలు పెట్టినారు. ఆ రాక్షసస్త్రీలను చిత్రవధ చేయుటకు తన కుత్తరు విమ్మని హనుమంతుడు సీతను కోరినప్పుడు ఆమె ఇట్లన్నది—

పాపానాం వా శుభానాం వా
వధార్హాణాం ప్లవంగమ
కార్యం కరుణ మార్యేణ
న కశ్చి న్నాపరాధ్యతి॥

చంపదగినవాడు పాపి యగునుగాక, అపాపి యగుగాక, వానిపట్ల కరుణ చూపుటే ఆర్య ధర్మము—తప్పు చేయనివాడు ధరణి లేడు—అన్నది. శరణాగతులను రక్షించు రాము డెక్కడ! తన్ను హింసించుచున్న వారిని కాపాడబూనిన సీత యెక్కడ!! ఈ తారతమ్యమును, శ్రీ గుణరత్నకోశ మను గ్రంథమున, భట్ట— శ్రీ పరాశరులు ఇట్లు కొనియాడినారు—

మాతర్మైథిలి, రాక్షసీ స్త్వయి తథై
వా ర్ద్రాపరాధా స్త్వయా
రక్ష న్త్యా పవనాత్మజా ల్లఘుతరా
రామస్య గోష్ఠీ కృతా
కాకం తం చ విభీషణం శరణ మి
త్యుక్తి క్షమౌ రక్షతః
సా న స్సాన్ద్ర మహాగస స్సుఖయతు
క్షాన్తి స్త వాకస్మికీ॥

"అమ్మా మైథిలి, కాకాసురుడును విభీషణుడును "శరణు" "శరణు" అని వాపోవగా, వారిని శ్రీరాముడు కాపాడినాడు, హనుమంతుని బారినుండి నీవు కాపాడిన వారెవరు? నిరంతరము నీపట్ల మహాపచారములు చేసిన రాక్షసాంగనలు, వారి యా యపరాధము లింకను తడియారకుండగనే కాపాడితివి. శరణాభ్యర్థన వ్యాజము ఉండినప్పుడు మాత్రమే కాపాడువాడు రాముడు, నిర్వ్యాజముగ కాపాడుదానవు నీవు. అట్టి నీ క్షాంతి, సదా అపచారములు చేయువారమగు మాకు సుఖమును గూర్చుగాక."

ఇకను ఈ విషయముగూర్చి శ్రీ వివేకానందస్వాములవారు సెలవిచ్చిన దివ్యవాక్యములను గనుడు—"లోకములో ఇప్పటి కున్న వాఙ్మయమును అంతటిని ఇకముందు ఏర్పడబోవు వాఙ్మయమును అంతటిని గాలించినను మీకు సీతకు సాటి మహిళ కానరాదు. సీత అద్వితీయురాలు. అట్టి శీలము ఒక్కపరి సీతగా మూర్తీభవించినది. నాటికిని నేటికిని ఆమెయే. రామునివంటి పురుషులు పెక్కురు లుండవచ్చునేమో! కాని, సీతవంటి మహిళ లేనే లేదు. కలితిలేని భారతీయమహిళకు ఆమెయే సరియైన లక్ష్యము. ఉత్తమ భారతీయ మహిళాదర్శము లెల్ల ఆ సీతాదేవి జీవిత చరిత్ర మొక్కదాని నుండియే ఏర్పడినవి. వేలకొలది సంవత్సరముల నుండి ఇప్పటివఱకు ఈ యార్యావర్త మంతటను మగవారిచేతను మగువలచేతను శిశువులచేతను ఆమె ఆరాధింపబడుచున్నది. పవిత్రతకన్న పవిత్రురాలును, క్షమానిధియు, శ్రమసహాయు

మహోజ్జ్వలురాలైన యీ సీత ఇల్లే ఎల్లప్పుడును ఉండగలదు. విసుగు గొణుగు లేక అన్ని ఇక్కట్టులు అనుభవించినదియు అవిచ్ఛిన్న పాతివ్రత్య పవిత్రతలు గల సాధ్వియు, మానవులకును దేవతలకును సైతము ఆదర్శభూతురాలును, మన దేశ దేవతయు, మహానుభావురాలును, అగు సీత శాశ్వతముగ ఉండవలయును. మన పురాణము లన్నియు మాయమైన నగు గాక, మన వేదములు సైతము పోయిన పోవును గాక, మన సంస్కృతభాష పునరావృత్తి లేక అంతరించును గాక, ఐదుగురు భారతీయులైనను జీవించియుందురేని, తాము అతి నీచ గ్రామ్యవాక్కు గలవారుగ ఉన్నప్పటికిని వారు సీతాచరిత్రమును అనుసంధించుచునే ఉందురు''— పూర్వోక్తవివర మంతయు ఈ గ్రంథమునకు గల ''సీతాయా శ్చరితం మహత్'' అను పేరు ఎంత సార్థకమో ఋజువు చేసినది.

ఇది మనకు అత్యంత ప్రాచీనగ్రంథములలో ఒకటి, కావ్యములకెల్ల, ఇది ఉత్తమ లక్ష్యము. ఇందు చరిత్ర మున్నది, ఆత్మతత్త్వప్రతిపాదన మున్నది, ఉత్తమ వృత్తోపదేశము ఉన్నది. ఈ తూరి చైత్రవినోదముగను, నవమీ పూజగను, రామాయణప్రాశస్త్యమును కొంత కొనియాడితిమి. ''ప్రశస్తి స్స్వా రాజ్ఞః యదపిచ పురీ కోశ కథనమ్.'' ''రాజ్యమును కొనియాడినను కోశమును కొనియాడినను రాజును కొనియాడినట్లే''—అను న్యాయమున శ్రీరామాయణప్రశంసయే శ్రీ సీతారామగుణప్రశంసయై శ్రీ సీతారాముల పరమానుగ్రహమునకు మనలను పాత్రులం జేయుగాత.

# భగవాన్ శ్రీ రామకృష్ణ

## సర్వేపల్లి రామారావు

సంభవామి యుగే యుగే అని మహాపురుషులు ధర్మమును పునరుద్ధరించుటకు పుట్టుచుందురు. అట్టివారిలో శ్రీరామకృష్ణ పరమహంస ఒకరు. ఆయన జన్మించునప్పటికి యుగయుగములుగా వచ్చుచుండిన భారతీయుల ఆత్మవికాసము నశించునో యనునట్లుండెను. దీనికి ముఖ్యకారణము పాలకులు విదేశీయులగుట, క్రైస్తవులగుట. క్రైస్తవమిషనరీలు అధికారధనబలముల నూతగా గొని వారి మతసూత్రములే ఉత్కృష్టములని, భారతీయుల ఆచారములు మతప్రవృత్తులు అనాగరకములని ప్రచారము చేయసాగిరి. ఈ మతాంతరీకరణగమ్యమును సాధించుటకు మిషనరీలు దారిద్ర్యపీడితులగు ప్రజలకడ కేగి ధనసహాయముచేతను, విద్యాసహాయముచేతను, వైద్యసహాయముచేతను, ఉద్యోగముల నిప్పించుటచేతను కృషి చేయుచుండిరి. మరొకప్రక్క హానిసలక్షణము లగు స్పర్థలు అంతఃకలహములు మతవిధానములమధ్య చెలరేగుచుండెను. దేశజీవనమున సమన్వయము సామరస్యము లోపించియుండెను. విదేశీయ పరిపాలనవలని హానిసత్త్వమువలన భారతావనియందు ఆత్మవిశ్వాసము ఆత్మగౌరవము అడుగంటియుండెను. అట్టి సంక్షుభితసమయమున దేశ మెల్లెడల నంధకార మలముకొనియుండగా శ్రీరామకృష్ణ భగవానుడు ఉదయించెను. చూడగలిగినవారు వివేకవంతులు ఆ వికాసమును చూచి ధన్యులైరి. అట్టివారిలో పరమహంస పరావతారమై, వెనుక వెనుక శ్రీరామ

కృష్ణపరివ్రాజకసంస్థలను లోకమంతట స్థాపించి వేదాంతగర్జనమును మూలల మూలల ప్రతిధ్వనింపజేసిన శ్రీ వివేకానందస్వామి అగ్రగణ్యులు.

పాశ్చాత్యభావదాస్యమునుండి దేశమును కాపాడి సనాతనమును ప్రీతియమును అమూల్యమును అగు అఖండాధ్యాత్మికశీలమును పునరుద్ధరించిన శ్రీరామకృష్ణుడు క్రీ. శ. 1836 సం॥న ఫిబ్రవరి 18-వ తేదీన క్షుదిరామ్ చంద్రమణీ దేవులకు దేవకీవసుదేవులకు శ్రీకృష్ణుడు వలె జన్మించెను. వంగదేశమున నొక కుగ్రామమున జన్మించి జన్మమాదిగా ఆత్మవికాసము దినదిన ప్రవర్ధమానమగుచుండ శ్రీరామకృష్ణుడు చెంతనున్నవారి హృదయములను అయస్కాంతమువలె నాకర్షించుచుండెను. ఏడేండ్ల బాలుడగునప్పటికే అతడు గ్రామమున కెల్ల గారాబుబిడ్డడయ్యెను. శ్రీరామకృష్ణుని క్రీడాసఖులును ఆయనను విడిచి క్షణమైన నుండజాలకుండెడివారు.

ప్రప్రథమమున శ్రీరామకృష్ణునకు దివ్యానుభూతి ఆరుసంవత్సరముల ప్రాయమున కలిగెను. ఈ విషయము నాయనయే తన శిష్యుల కిట్లు చెప్పెను. "...నా పెద్ద బుట్టికలో నుండిన మరమరాలు తినుచు ఒకనాడు ఉదయము వరిపొలముల గట్లమీదుగా నడచుచుంటిని. అది జ్యేష్ఠమో ఆషాఢమో అయియుండును. ఆకాశమున నొకవైపున దట్టని యొక కాలమేఘము కనపించెను. దానిని చిలకించుచు మరమరాలు తినుచుంటిని. అట్టెట్టె యా మేఘము ఆకసము నంతయు గ్రమ్ముకొనుచుండ పాలవలె తెల్లనైన కొంగలబారు ఆ కాలమేఘమున కెదురుగా నెగురసాగెను. (విలక్షణమైన తారతమ్యముచే) ఇంతింతనరాని సుందరమై భాసించినది ఆ దృశ్యము! ఆ మనోహరదృశ్యము నవలోకించుచు అపూర్వభావమున తన్మయుడనైతిని. బాహ్యస్మృతి తప్పిపోయినది. క్రింద బడిపోతిని. మరమరాలు నల్దిక్కులను చెదరిపోయినవి. ఆ యవస్థలో నన్ను కొందఱు కనుగొని యెత్తుకొని ఇంటికి జేర్చిరి. భావసమాధిస్థితిచే బాహ్యస్మృతి కోల్పోవుట కదియే నాకు మొదటి సారి."[1]

క్రీ. శ. 1855 సం॥న దక్షిణేశ్వర దేవాలయమున శ్రీ పరమహంస కాళికార్చనకు నియమితుడాయెను. పండ్రెండు కఠినసంవత్సరములు నిద్రాహారములను త్యజించి సాధనచేసి శ్రీరామకృష్ణుడు అఖండజ్ఞానచైతన్యస్వరూపిణి యగు విశ్వేశ్వరి కాళికామాత పాదపల్లవములను సాక్షాత్కరించుకొనెను. క్రీ. శ. 1861 సం॥న భైరవీబ్రాహ్మణి దక్షిణేశ్వరమునకు వచ్చి శ్రీరామకృష్ణునియెడ మాతృవాత్సల్యమును జూపి గురుస్థానము వహించి ఆయన మహాభావములు పిచ్చియు వ్యాధియు కాదని సంశయము బాపి తాంత్రికసాధనలను సమగ్రముగా నభ్యసింపజేసెను. శ్రీ పరమహంసను అద్వైతపరమగమ్యమగు నిర్వికల్పసమాధిస్థితుని జేసిన గురువర్యుడు తోతాపురి. వీరిరువురేగాక ఎందఱో సాధుపుంగవుల పండితుల సాంగత్యమును శ్రీరామకృష్ణుడు వడసియుండెను. అట్టివారిలో క్రైస్తవ మహమ్మదీయ మతములకు చెందినవారుకూడ కలరు. శ్రీరామకృష్ణునితోడి ఈ గురుశిష్యసంబంధములో నొక విశేషము గలదు. వారు జానెడిచ్చిన ఆయన బారెడుగా ఆధ్యాత్మికవృత్తియందు ముందంజవేయుచు గురువును మించిన శిష్యుడాయెను.

1. శ్రీరామకృష్ణుని జీవితచరిత్ర పుట 27.

కట్టకడపటిపరిపూర్ణదశలో శ్రీరామకృష్ణుడు దివ్యతేజోవికాసమున, కుశాగ్రబుద్ధిలోను, జీవాత్మ పరమాత్మల ఐక్యసంధాయక మగు అద్వైతసిద్ధియందును శ్రీ శంకరభగవత్పాదులను, ఆర్ద్రహృదయమున సంఘసమదర్శనమున భక్తిపారవశ్యమున శ్రీరామానుజచైతన్యులను స్ఫురింప జేయుచుండెను.

## శ్రీరామకృష్ణుని బోధనామృతములోని కొన్ని విశేషములు

నవయుగ విశ్వగురువగు శ్రీరామకృష్ణుని స్వానుభవప్రకాశితములగు పరమసత్యములలో అతిముఖ్య మయినది భగవత్సాన్నిధ్యవాస్తవికత. పారమార్థికవిశ్వాసశూన్యమగు నీ యుగమున శ్రీరామకృష్ణునినిశ్చల భగవద్విశ్వాసము తత్సాన్నిధ్యానుభూతియు దివ్యౌషధప్రాయములు; తాపత్రయవిదారకములు. శ్రీ రామకృష్ణుని ఆస్తికతయందు ఒక విశేషము గలదు. సనాతనసంప్రదాయసిద్ధ మగు నీ యాస్తిక ధర్మము మతాంతరీకరణవాదుల చిత్తవృత్తులకు వ్యతిరేకముగా నున్నది. ''ఏకం సత్ విప్రా బహుధా వదన్తి'' యనునది ఆయన మతము: పరమతములయెడ సహనము వాని యెడల నౌదార్యము వానినుండి గ్రహణీయములగు సత్యములను స్వమతమున సమన్వయించుట ఆయనకు నైజగుణము. రెండవది సనాతనమతధర్మములను ఆచారములను నూతన సంఘపరిణామములకు అనురూపమగునట్లు తీర్చి దిద్దుట. మూడవది, వ్యక్తిగతభేదముల ననుసరించి ఆయా వ్యక్తుల సంస్కారానుగుణముగా ఏ వ్యక్తికి ఏ మార్గము భగవత్సాన్నిధ్యమునకు సులువో దానినే బోధించుట. అవి ద్వైతమో అద్వైతమో భక్తియో జ్ఞానమో తంత్రమో ఏదైనను సరియే. ఇది శ్రీ రామకృష్ణుడు వచించిన వైదికమతములోని విశేషము. మరియే ఇతరమతమును ఇట్టి సత్యమును గ్రహింపలేకపోయినది. పిట్టకథలను జెప్పి శ్రీరామకృష్ణుడు సత్యమును బోధించెను. వేరువేరు బిడ్డలకు వారి వారి శారీరకస్థితినిబట్టి రుచులనుబట్టి తల్లి వంటకములను చేయును గదా!

'ఆకాశాత్పతితం తోయం యథా గచ్ఛతి సాగరం' అన్నట్లు ఏ విధముగా నుపాసించినను భగవంతుని జేరవచ్చునని యాయన యభిప్రాయము. వారిలో భక్తులు గమ్యస్థానమును చేరినపిదప పవమానసుతుడు ప్రహ్లాదుడు గజేంద్రుడు మొదలగు భక్తాగ్రేసరుల కోవకు చెందగలరు. అట్టివారికి అసాధ్యమైన పనులేవియును లేవు. లంకకు బోవుటకు శ్రీరామచంద్రునకు సేతుబంధన మావశ్యక మాయెను. హనుమంతున కట్టి యగత్యము లేకపోయెను. ఆ పుణ్యుడవలీలగా సముద్రమును లంఘించెను.

భక్తియోగులకు తదితరులవలె జీవయాత్ర క్లేశదాయకము గాదని శ్రీరామకృష్ణుని యభిప్రాయము. చేతులకు నూనె రాచుకొని పనసకాయను కోయుచో పనసపాలు చేతి కెట్లంటుకొనవో అట్లే 'నిజదారసుతోదరపోషణార్థము' కృషి చేయు గృహస్థులు భగవద్ధ్యానము నవలంబించి కృషి చేయుచో సంసారమునందలి లంపటత్వము వారి నంటదు. భక్తి కుదిరినయెడల జీవితపు విలువలు సమన్వయింపబడును. ఇచ్చట గూడ నిత్యజీవితములోని యుదాహరణము నిచ్చి శ్రీరామకృష్ణుడు విషయమును సులభగ్రాహ్యముగ చేసెను. దాది యజమాని పిల్లలను ''బాబూ చిట్టితల్లీ'' యని పిలుచుచు ప్రేమతో లాలించును. అయినను ఎప్పుడెప్పుడు ప్రొద్దు గ్రుంకునా, ఇంటికిపోయి తన బిడ్డల నెత్తుకొందునా యని తహతహపడుచుండును. అట్లే

గృహస్థుడు ధర్మార్థకామములకై యత్నించుచున్నను మోక్షదాయకమగు భగవన్నామము నందే సక్తుడై యుండవలెను. "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ" అను భగవదాజ్ఞను శిరసావహించి తదర్పణముగా సర్వకర్మల నొనర్పవలెను.

శ్రీరామకృష్ణుని బోధలలో ఇంద్రియనిగ్రహమునకు ఉన్నతస్థానమే కలదు. నిష్ఠ వైరాగ్యములు మానవతకు అత్యావశ్యకములని ఆయన అభిప్రాయము. అవి లేనియెడల అష్టైశ్వర్యములు కలిగియుండినను పురుషుడు చిత్తశాంతిని కోల్పోవును. కామక్రోధాదులకు గురియగును.

'సమలోష్టాశ్మకాంచనః' అని, మట్టిని బంగారమును అరచేతులలో బెట్టుకొని తూచితూచి వాని విలువల యాథార్థ్యమును గుర్తెరిగి కడపట సమానములని గంగలో వైచెను.

తన జాత్యభిమాన లేశమునైనను నిలువ నీయక తుడిచివేయుటకై నీచ (మని భావింపబడు) కృత్యములను చేయువాడు.

భారతీయాధ్యాత్మికతకు పుంభావమగు పరమహంసజీవితము వారి వాక్కులు స్వానుభవప్రకాశకము లగుటచే పాఠకులకు హృదయంగమములై అనుభూతిదాయకము లగును. నాస్తికత ప్రపంచమంతట వ్యాప్తమగుచుండు నీ సమయమున శ్రీరామకృష్ణుని జనన మొక సూర్యోదయము. అది భారతదేశమునకే గాక ప్రపంచమంతటికిని ఒక మహోదయము.

# అర్జునుని విషాదము - అది తొలగిన విధము

"భక్తప్రియ"

యుద్ధమొనర్ప నమితోత్సాహముతో రణరంగమున కేగిన అర్జునుడు సంగ్రామమున తమ ప్రాణములను సైతము అర్పించుట కుద్యుక్తులైయున్న తన బంధువులను, పితామహులను, ఆచార్యులను, మేనమామలను, పుత్రపౌత్రులను, మిత్రులను గాంచి సంమోహితుడయ్యెను. తన బంధువులను జంపవలయునను విషాదము ఆతని నావరించెను. దుశ్శకునములు కనుపించెను. ఆతనికి కర్తవ్యము బోధపడలేదు. అమితవిషాదముతో అర్జునుడు, "కృష్ణా, యుద్ధార్థ మరుదెంచిన నా బంధువులను జూడ, నా అవయవము లన్నియు పట్టుతప్పిపోవుచున్నవి, నోరు ఎండుచున్నది, నా శరీరమున వణకు పుట్టుచున్నది, చేతినుండి గాండీవము జారిపోవుచున్నది, చర్మము మండుచున్నట్లున్నది, అపశకునములను గాంచుచున్నాను. ఈ యుద్ధము నాకు వలదు. యుద్ధమున జయించుటవలన పొందు సుఖభోగములు నాకనవసరము. బంధువుల జంపుట పాపమే యగును. అందువలన వంశనాశము ఏర్పడును. కులధర్మములు నశించును. కులస్త్రీలు చెడుదురు. వర్ణసంకర మగును. ఇట్టి దోషములవలన మనకు నరకమే ప్రాప్తించును. కావున ఇట్టి పాపకార్యముల నేను చేయ జాలను." అని పలికి, తన గాండీవమును విడిచి, శోకాకులచిత్తుడై రథమున కూర్చుండెను.

ఇట్లు సాయుధపాణియై, అమితోత్సాహముతో యుద్ధరంగమునకు వచ్చిన అర్జునుడు

శోకాకులచిత్తుడై, కర్తవ్యమును గానక, కర్తవ్యభ్రష్టుడు కానున్న సందర్భమున, భగవానుడు ఆతనికి కర్తవ్యనిష్ఠను బోధింపవలసి వచ్చెను. ఆతనికి గలిగిన అజ్ఞానసమ్మోహమును తొలగింప, నాత్మవిషయికమగు స్మృతిని కలుగజేయవలసి వచ్చెను. అందుకై శ్రీకృష్ణ భగవానుడు అట్టి తరుణమున అర్జునునకుపదేశించిన దివ్యవాణియే 'భగవద్గీత'.

శ్రీభగవానుని పలుకులను గమనింపుడు. భగవానుడిట్లనుచున్నాడు,

> క్లైబ్యం మాస్మ గమః పార్థ నైతత్త్వయ్యుపపద్యతే ।
> క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప ॥ (2 అ-3 శ్లో)

“అర్జునా! కాతరతను పొందకుము. ఇది నీకు తగదు. శత్రువుల తపింపజేయువాడా! తుచ్ఛమగు ఈ హృదయ దౌర్బల్యమును త్యజించి, యుద్ధ మొనర్ప సంసిద్ధుడవు గమ్ము. లెమ్ము.”

అర్జునుడు తాను యుద్ధము చేయనని చెప్పుటకు ఆతని దౌర్బల్యమే కారణము. కాని తన దౌర్బల్యమును మరుగుపెట్టుటకై ఆతడు జ్ఞానివలె మాట్లాడుచున్నాడు. “ఇట్లు బంధువుల జంపుటకంటె బిచ్చమెత్తి జీవించుట మేలు”-మున్నగు వైరాగ్యపు పలుకుల బలుకుచున్నాడు. తన్ను తాను సమర్థించుకొన జూచుచున్నాడు. కాని అతడు కృష్ణుని మోసగింపలేడు గదా! కృష్ణుడు పరమాత్మ-భగవంతుడు! అర్జునుని దౌర్బల్యమును, తన్ను తాను సమర్థించుకొనుచుండుటయు ఆతనికి తెలిసిపోయినది.

మన కందరకు ఈ లోకమున జీవితమనగా ఎడతెగని పోరాటమే. అందు మన పిఱికితనమును, మన దౌర్బల్యమును, క్షమాశీలముగా వైరాగ్యముగా వ్యాఖ్యానించుకొను సందర్భములనేకములు వచ్చును. బిచ్చగాడు దేనిని త్యజింపగలడు? బలహీనుని నిగ్రహమున కేమి విలువ? ఉన్నవాడు త్యాగము చేసినచో అందు విలువ గలదు. దెబ్బకొట్టగల సామర్థ్యమున్నవాడు నిగ్రహము చూపినచో అందు విలువ గలదు. మన సోమరితనము వలనను, పిఱికితనము వలనను మనము మన జీవిత రణరంగమునుండి విరమించుకొని, శూరులమని ఆత్మవంచన చేసికొనుటకు ఎన్నిసార్లు ప్రయత్నింతుమో మన మెఱుగుదుము.

అర్జునుని హృదయమున ఆతని భావోద్వేగమునకును, నిర్వహింపవలసిన కర్తవ్యమునకును సంఘర్షణ జరిగినది. పశువులవలెనే మనము భావావేశమున కధీనులమైయున్నాము. తన లేదూడకై ఆవు తన ప్రాణముల నర్పింపగలదు. ఆ పని ప్రతిజంతువుకూడ చేయగలదు. పశుపక్ష్యాదులకు సహజమగు ఈ అంధోద్రేకము కాదు మనలను పరిపూర్ణత్వమునకు చేర్చునది! ఆత్మసాక్షాత్కారమును పొందుటయే మానవజీవిత లక్ష్యము. అందు భావోద్వేగమునకు స్థానము లేదు. భావపరతకు గాని, ఇంద్రియములకు సంబంధించిన దేనికి గాని అందు స్థానము లేదు. అక్కడ నుండునది కేవలము నిర్మల వివేకజ్యోతియే. అట్టి దశయందు మానవుడు కేవలము ఆత్మస్వరూపి.

అర్జును డిప్పుడు భావావేశవశుడైయున్నాడు. ఆతడు ఆత్మసంయమము కలిగి, ప్రబోధము నంది, వివేకమనెడు నిత్యజ్యోతిలో ప్రవర్తించు యోగిగా లేడు. హృదయము భావోద్వేగవశమైనది. తన దౌర్బల్యమును ఈ సమయమున ప్రేమ మున్నగు పేర్లతో కప్పిపుచ్చుకొన జూచుచున్నాడు.

ఈ విషయమును గ్రహించియే శ్రీకృష్ణుడు అర్జునునకు ఆత్మతత్త్వమును క్షుణ్ణముగా బోధించెను. ఏలన ఆత్మవిస్మృతి వలననే ఆతనికీ శోకము దాపురించినది. శ్రీకృష్ణు డిట్లనెను: "శోకింప దగని వారిని గురించి నీవు శోకించుచున్నావు. అయ్యో, జ్ఞానివలె భాషించుచున్నావు. జ్ఞానులు మరణించిన వారిని గురించిగాని, జీవించియున్న వారిని గురించిగాని దుఃఖింపరు. (2-11). చావు నీకును లేదు, నాకును లేదు. దేహికి ఈ దేహమున కౌమారమునుండి యౌవనమునకును, యౌవనమునుండి వార్ధక్యమునకును మార్పు గలుగునట్లే, దేహాంతరములోనికి మారుటయు ప్రాప్తించును. అంతమాత్రమున ధీరులు మోహమునకు లోబడరు." ఇట్టి శ్రీభగవానుని బోధల వలన అర్జునునకు ఆత్మస్మృతి లభించినది.

ఇచ్చట మనము గ్రహింపవలసిన దేమన, అర్జునుని శోకమునకు ఆతని ఆత్మవిస్మృతియే కారణమైనట్లు, మన మందర మనుభవించు దుఃఖముల కన్నిటికిని మూలకారణము మనము ఆత్మతత్త్వ మెరుగకుండుటయే. ఈ అజ్ఞానము వలననే మనము బలహీనులముగా నున్నాము. బలహీనతయే సర్వదుఃఖహేతువు. కాబట్టి మనము దుఃఖనివృత్తులము గావలసిన ఎడల, మనల నావరించియుండు అజ్ఞానమును నిర్మూలింపవలెను. అందుకు ఆత్మతత్త్వము నెరుగవలయును. చీకటి నావరించిన గదిలోనికి వెలుతురు తెచ్చిన తత్క్షణము చీకటి పటాపంచలగును గదా! ఇది యొక్కటియే మార్గము.

ఇంకొక ప్రశ్న: భగవానుని ఆత్మతత్త్వోపదేశమువలన అర్జునుని ఆవరించియుండిన మోహము నశించినదా? భగవద్గీత నుపదేశించిన పిమ్మట భగవానుడు ఇట్లు ప్రశ్నించెను. "కచ్చిదజ్ఞానసమ్మోహః ప్రణష్టస్తే"- "నీ అజ్ఞానసమ్మోహము తొలగినదా?" — అందుకు అర్జునుని యుత్తరము—

"నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదా
న్మయాఽచ్యుత ।
స్థితోఽస్మి గతసందేహః కరిష్యే వచనం
తవ ॥ (18-73)

"అచ్యుతా! నీ కృపవలన నాకు పరమాత్మ విషయికమగు స్మృతి లభించినది. నా మోహము నశించినది. సందేహరహితుడ నైతిని."

ఎప్పు డాతనికి ఆత్మస్మృతి లభించినదో అప్పుడే ఆతని నావరించి యుండిన మోహము నశించినది. హృదయదౌర్బల్యము నశించినది. ఆతని సంశయములు తొలగినవి. సందేహరాహిత్యమును, భయరాహిత్యమును ముక్తపురుషుని ముఖ్యలక్షణములు. ఈ విషయమునే ఉపనిషత్తులు,

"భిద్యతే హృదయగ్రంథిః ఛిద్యంతే
సర్వసంశయాః ।
క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే
పరావరే ॥ (ముం. ఉ. 2-21)

అనుచున్నవి. సందేహరహితుడైనవాడు అభయస్థితిని పొందగలడను విషయము, మొదట భయగ్రస్తుడై యుద్ధమొనర్ప ననిన అర్జునుడు 'కరిష్యే వచనం తవ' అని యుద్ధ మొనర్చి నందువలన తెలియగలదు.

# యోగసారబోధిని–21

## శ్రీ జ్ఞానేశ్వరానందస్వామి

నిరంతరాయమైన మరి ఏ ఇతరదృష్టియైనను భక్తుని తన గమ్యమునకు గొని పోవును. భావము సుస్థిరము అచంచలము కాగనే భక్తునకు భగవద్దర్శనము లభించును. ఇట్లగుటచేత భక్తునియొక్క భావము అతని నిత్యజీవనమును ప్రభావితము చేయుచునే యుండును.

భావము నభివృద్ధి జేసికొనుటకు భక్తు డవలంబించు నభ్యాసములే సాధన లనబడును. మొదట సాధన కంతరాయము కల్గించు శక్తులతో పోరాడి గెలిచిన పిదప సాధన ప్రారంభమగును.

ఇట్లంతరాయమును కల్గించు శక్తు లేవి? చాలవఱకు నివి అహంకారము వలన నేర్పడును. భక్తియోగము సంపూర్ణమైన ఆత్మార్పణ బుద్ధిని బోధించును. మానవ సహజమగు స్వాత్మ ప్రేమను ఆత్మపారిశుద్ధ్యమునందు సోపానరీతిగా భక్తియోగము కొనిపోవును. అది ద్వైతభావములో మొదలైనను, పర్యవసానమున 'త్వమేవాహం' మను అద్వైతసాక్షాత్కారమును కలుగజేయును.

ప్రేమ ఇట్లు పావనమై సమగ్రమైనప్పుడు ప్రేమస్వరూపి యగు భగవానుడు ఇష్టదైవమునందు ప్రత్యక్ష మగును. ప్రేమ యనున దొక మానసిక వ్యాపారము. దాని నత్యున్నత స్థాయికి గొనిపోయినప్పుడు దివ్యత్వము సహజముగా ప్రకాశించును. నిన్ను నీ పరమాదర్శము లగు సత్యశివసుందరములకు గొనిపోవు రహదారియే ప్రేమభక్తి.

భగవంతుని జేరుటకు సామాన్య వ్యవహారములందు స్వార్థపరమైన ప్రేమను దివ్య భక్తిగా జేయవలెను. అట్టి నిస్స్వార్థమైన పరాభక్తిని జేరుటకు గావలసిన సాధన సంపత్తిలో మొదటిది ఉత్కంఠ. ప్రగాఢమగు పరితాపము ఉత్కంఠ లేనిదే ఏ పురోగతియు సిద్ధింపదు. రెండవది అభేదభావను. ఈ యుత్కంఠ దేని కొరకు? భక్తుడు పరమేశ్వరునియందు లీన మగుట కొరకే. మూడవది స్వాత్మబుద్ధి. తాను వేరు భగవంతుడు వేరు అను బుద్ధి యున్నంత వరకు భక్తునకు ద్వైతభావమే భాసించును. ఇట్టి స్వాత్మబుద్ధిని నిర్మూలించుటకే సకల కార్యకలాపములు సాధనలు భక్తున కుద్దేశింప బడినవి. నాల్గవది భగవదనుభూతి. భక్తియోగ సాధనల కిది పరాకాష్ఠ.

సాంకేతికముగా జూచినచో భావము సుస్థిరమై భగవత్సాక్షాత్కారమును బడయుటకు ముందు భక్తుడు మూడు మజిలీలను దాటవలెను. అందు,

వైధీభక్తి: విధి యను సంస్కృత పదము నుండి ఏర్పడిన 'వైధీ' యను పదము నియమములను శాసనములను సూచించును. ఇందు సాధకుడు పెక్కు విధినిషేధములకు లోబడి ప్రవర్తింపవలెను. పూజాకలాపములు సాధనలు మొదలైనవి విధినిషేధములను కొంచెమైనను వైదొలగక పాటించుట ఈ మజిలీ యొక్క లక్షణము.

రాగానుగభక్తి; ఇచ్చట భగవంతునియం దనురాగముతో గూడిన భక్తి కలుగును. అనేకములగు కోరికలతో భక్తుడు భగవంతుని దరియును.

ప్రేమభక్తి: ఈ స్థితియందు ఆత్మనిరసనము సంపూర్ణ మగును. భక్తుడు తనను పూర్తిగా విస్మరించి భగవంతుని యందలి ప్రేమయందే నిలచును. ఈ ప్రేమయే భక్తిపరమావధియగు భావసమాధికి భక్తుని గొనిపోవును.

వైధీభక్తి యందలి నియమనిష్ఠలు విధినిషేధములు దారిప్రక్క నుండు మొలకకు వేయు కంచెతో బోల్పనగును. మొలకను రక్షించుటయే తప్ప అది పెరుగుటకు కంచె ఏ కొంచెమైనను దోహదము చేయజాలదు. మీఁదు మిక్కిలి కంచె తనను గప్పివేయుచున్నదని యా మొలక భావించు నవకాశము గలదు. ఆ మొలక మాటలాడ గలిగినచో కంచెను తీసివేయుడని తప్పక కోరెడిది. అయినను నియమనిష్ఠలు విధినిషేధము లను కంచె సాధకులకు ప్రప్రథమమున అత్యంతావశ్యకము.

గుమ్మడితీగ మొదట పూలు పూయును. పూవు వాడిపోవుటయే కాయ ఏర్పడుటను సూచించును. అట్లని కాయకొరకై పూవును త్రుంచివేయరాదు గదా! అట్లే విధినిషేధములు పూవులైనచో భక్తి కాయ వంటిది. ఓపికతో భగవద్భక్తి లభించువరకు ఈ విధినిషేధములను శ్రద్ధతో పాటించుచునే యుండవలెను.

ఈ పూజావిధుల చాటున భగవంతునియం దనురాగము జనించును. ఈ యనురాగమే భగవద్భక్తిని కల్గించును. క్రమముగా వైధీభక్తి రాగానుగభక్తిగా పరిణమించును. ఇప్పుడు పూజాపురస్కారములు విధినిషేధములు తమ ప్రాధాన్యమును కోల్పోవును. భగవంతుని యందలి యనురాగమే పూజ్యభావమే భక్తునిచే పూజాకలాపములను నిర్వర్తింప జేయును. ప్రథమమున విధినిషేధములే గదా పూజాకలాపములకు కారణములు!

సాధారణభక్తి ఈ వైధీ, రాగానుగ భావములుగా కన్పించును. కాని ప్రేమభక్తి కన్పింపదు. మనభక్తి తగినంత గాఢముగా లేకపోవుటయే దానికి కారణము. ఆత్మార్పణ మసంపూర్ణముగుటచేతనే, అహంకార మింకను మిగిలి యుండుటచేతనే ప్రేమభక్తి మన కందదు. ఈ కారణముచేతనే ప్రాపంచికప్రేమలలో మాతృప్రేమనే పరమోత్కృష్టముగా నెన్నుదురు.

(సశేషము)

# పరిప్రశ్న

[మద్రాసు శ్రీరామకృష్ణమఠమున 16-4-72వ తేది జరిగిన అంతర్యోగమున శ్రీమత్ తపస్యానందస్వాములతోడి ప్రశ్నోత్తరావళి ఇచ్చట పొందుపఱుపబడినది.]

ప్రశ్న : కర్మయోగముచేతనే ఆత్మసాక్షాత్కారమును బడయవచ్చునని వినుచున్నాను. పర్యాలోచన లేని 'కర్మ' మూఢమని నాకు తోచుచున్నది. దీని నొప్పుకొనినచో కర్మయోగముకంటె పర్యాలోచనయొక్క విశిష్టత నంగీకరింపవలసి వచ్చును. ఈ విషయముపై తమ యభిప్రాయ మేమి?

ఉత్తరము : పర్యాలోచనలేని కర్మ వట్టి యాంత్రికకర్మ అగును. అది కర్మయోగమే కానేరదు. ఏలన కర్మయోగమున కర్థము కర్మద్వారా అనుసంధానము అని. అనుసంధానము ఎప్పుడును పర్యాలోచనమునే ధ్వనించును.

మానవునకు పరిచితములైన వివిధకర్మలను గమనించినచో విషయము స్పష్టమగును. యంత్రములద్వారా చేయు కర్మ కలదు. ఇందు పర్యాలోచనయే లేదు. యంత్రముపై అరుగుట-విరుగుటతప్ప, కర్మయొక్క వేఱు ప్రభావ మేమియు లేదు. దీనికంటె యున్నతమైన కర్మలు పాశవికకర్మ, బానిసకర్మ. ఇచ్చట సాధనములు

ప్రాణము కలిగియున్నను వానియందు చొరవ స్వాతంత్ర్యము లేవు. పూర్తి నిర్లిప్తత వాని లక్షణము. పని చేయుటకు వానికి గల ప్రోత్సాహ మంతయు కొరడావలని భయము మాత్రమే. దీనికంటె శ్రేష్ఠమైన కర్మ లాభముపొందు నుద్దేశముతో చేయు కర్మ. మానవులు చేయు కర్మ కిది సామాన్యమైన భూమిక. మానవ నాగరికత యని మన మనునదంతయు ఈ ప్రోత్సాహమువలననే చోదితమైనది. ఇందు పర్యాలోచన ప్రభావము చాలవరకు ఉన్నది. కాని అది పూర్తిగా వ్యక్తిగతమైన లాభము లకై యుద్దిష్ట మగుచున్నది.

నిజమగు కర్మయోగము ప్రారంభమగున దెప్పు డనగా, ఈ స్వచ్ఛమైన వ్యక్తిగత లాభము అను ప్రోత్సాహము నికృష్టమైనదిగా భావింపబడి వ్యక్తిగతము కానిమరియొక ప్రోత్సాహము కర్మచోదనముగా వెదుకబడినప్పుడే. మానవుడు తన సంకుచిత స్వార్థమునకై జీవించుట నికృష్ట కార్యమని భావించినపుడే అతడు అవ్యక్తికములైన దేశభక్తి, సాంఘిక సముద్ధరణము మొదలగు ఆశయములను కర్మచోదనములుగా వెదకికొనును. ఇచ్చట పర్యాలోచనము చింతన అనునవియే మానవుని ఇట్టి యున్నతతర జీవన భూమికకు ఉద్ధరించును. ఇట్టి ఆశయములతో చేయు కర్మ బాహ్యప్రపంచముపై నిశ్చయముగా ఫలితము చూపుచుండియు కర్తపైకూడ శ్రేయస్కరమగు ఫలితమును కలుగ జేయును. ఒక అవ్యక్తిక కారణముతో తాదాత్మ్యము పొందుటవలన అతని ఆత్మ లేక వ్యక్తిత్వము విస్తృతమై, వర్ణము జాతి దేశము మానవకోటి మొదలగు, ఉన్నతతరము ఘనతరము అగు 'సమిష్టి'తో తాదాత్మ్యము పొందును. ఈవిధముగా ఇట్టి సమిష్టులతో ఒక రకమైన అనుసంధానమువలన యోగము సిద్ధించుచున్నది. ఈ తాదాత్మ్యము పరిపూర్ణము త్రికరణశుద్ధము అయినప్పుడు అట్టి వ్యక్తులు ఆ సమిష్టులయందలి ఉద్దేశశక్తి ప్రకటనకు వాహికలగుదురు. గొప్ప దేశభక్తులయందును, సాంఘిక విప్లవకారులయందును ప్రకటిత మగుచున్న శక్తికి జన్మస్థానము భావమునందును పర్యాలోచనయందును ఇట్టి తాదాత్మ్యమే.

ఆధ్యాత్మికగమ్యమునకు కర్మయోగము స్వతంత్రముగనే స్వయంసమృద్ధమైన యొక మార్గమని ప్రవచించి కర్మయోగసిద్ధాంతమునకు ఒక నూతన దృక్పథము నిచ్చినది శ్రీవివేకానందస్వామియే. పూర్వకాలమున అది పరోక్ష సాధనముగ మాత్రమే అనుషంగికసహాయముగనే భావింపబడినది. శ్రీ శంకరభగవత్పాదుల సిద్ధాంతములో కర్మయోగము లేక నిష్కామకర్మ చిత్తశుద్ధిని కలుగజేయును. జ్ఞానమార్గమును లేదా జీవాత్మపరమాత్మల ఐక్యమును అభ్యసించుటకు చిత్తశుద్ధి యనునది విధాయకమైన మానసిక పూర్వరంగము. భక్తి సిద్ధాంతమునందు అట్టి కర్మ భగవద్భక్తి సాధనయందొక భాగ మగును. కర్మలు భగవన్నివేదనములుగా చేయబడును. పరిపక్వమైన భక్తి భక్తులకు భగవత్కటాక్షమును లభింపజేయును.

ఒక స్వయంసమృద్ధమైన మార్గముగా శ్రీవివేకానందస్వామి వారి కర్మయోగప్రవచనము ఏవిధమైన వైదిక, పారలౌకిక పిడివాదమును గాని ప్రశ్నింతలకెత్తుచున్నట్లు కన్పింపదు. క్రమముగా ఘనతరములగు సమిష్టులతో తాదాత్మ్యమును పొందుటవలన మన సంకుచితాత్మలను విశాలము చేయు శిక్షణయే కర్మయోగము. 'ప్రవృత్తి' 'నివృత్తి' యను రెండు శాస్త్రీయ ప్రయోగములకు స్వామివారిచ్చిన వినూతన వ్యాఖ్య వారి దృష్టిని స్పష్టము చేయును.

సాంప్రదాయికముగా ప్రవృత్తిమార్గము ప్రాపంచికవిలువలకై కర్మసంక్లిష్టమగు జీవనమును వర్ణించును. నివృత్తిమార్గము మోక్షసాధనకై సర్వకర్మపరిత్యాగమును అభివర్ణించును. శ్రీ వివేకానందస్వామి ఈ పదములను వాని ధాతురూపముల ద్వారా వ్యాఖ్యానించుచు వానికి నూతనార్థము నిచ్చిరి. స్వార్థప్రధానమైన జీవనమునకు 'అభిముఖు' లగుట ప్రవృత్తి యనియు 'విముఖు' లగుట నివృత్తి యనియు వారి యభిప్రాయము. స్వార్థప్రాధాన్యమే ఆద్యపాపము. దానినుండి విడివడుటయే నిక్కమగు మోక్షము. ఇచ్చట భేదనము ప్రాపంచికజీవనము ప్రాపంచిక కర్మత్యాగజీవనముల మధ్య కాదు. ఈ దృష్టియందు మనము స్వార్థప్రాధాన్యము నెంత తగ్గించుకొనిన ఆధ్యాత్మికముగా అంత ఉన్నతుల మగుదుము. ముందే చెప్పబడినట్లు, మన యల్పపు వ్యక్తిత్వము లేక ఆత్మ — అవ్యక్తిక కారణములతో — క్రమముగా ఘనతరములగు సమిష్టులతో, తాదాత్మ్యమును పొందుట కర్మయోగము ద్వారా కలుగు ఆధ్యాత్మిక ప్రగతిని సూచించును. దేవుడు, ఆత్మ, పరలోకముల గూర్చి మానవున కెట్టి సిద్ధాంతములును లేకున్నను వైయక్తిక విలువలను అతడు పూర్తిగా వదలివేసి ఘనతర సమిష్టులతో తాదాత్మ్యమును పొందగలిగినచో అతడు నిత్యసత్యము స్వతస్సిద్ధముగా ప్రకాశించునట్టి చిత్తశుద్ధిని సాధింపగలడు.

కర్మయోగమునట్లు ఈ యభిప్రాయము వినూత్నమైన యభిప్రాయమే యైనను, పారలౌకిక సిద్ధాంతములు, దైవభావసిద్ధాంతములు రుచింపకపోయినను వ్యక్తిగతవిలువలకై పరిశ్రమించుట అవమానకరముగా నీచముగా భావించు పౌరసంఘములకు ఇది అంగీకార్యమగును. ఇచ్చటకూడ కర్మ, అది యోగమగుటకు, పర్యాలోచనపై ఆధారపడును. గీత యనునట్లు— "సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే."

# వార్తలు - విశేషాలు

## శ్రీరామకృష్ణ పరమహంస జన్మదినోత్సవము

శ్రీరామకృష్ణ పరమహంస దేవుని 140-వ జన్మదినోత్సవము 15-3-1975 శనివారము నాడు మద్రాసు శ్రీరామకృష్ణమఠమున భక్త్యుత్సాహములతో జరుపబడెను. భక్తులును విద్యార్థులును తండోపతండములుగ ఉత్సవమందు పాల్గొనిరి. ప్రాహ్ణమునందు భజనలు, వేదముల, ఉపనిషత్తుల, గీత, చండీ—పారాయణము మఠావరణమున పవిత్రవాతావరణమును గల్పించెను. దేవాలయమున ప్రత్యేక పూజయు, మఠావరణమున ఉన్నతపీఠమున పుష్పమాలాలంకృతము గావింపబడిన శ్రీరామకృష్ణ పరమహంస దేవుని పటము నెదుట హోమమును జరుపబడెను. మధ్యాహ్నము భక్తులకు ప్రసాదము పంచిపెట్టబడెను.

సాయంకాలిక ఆరాత్రికానంతరము శ్రీమత్ శ్రీరంగానంద స్వాములవారును శ్రీమత్తపస్యానందస్వాములవారును మఠావరణమున సమావేశమయిన భక్తులయెదుట శ్రీ గురుదేవుని గూర్చి తమిళమునను ఆంగ్లమునను ఉపన్యసించిరి.

శ్రీమత్ శ్రీరంగానంద స్వాముల వారు 'అవతారవరిష్ఠుడు' అన్న శ్రీరామ కృష్ణ గురుదేవుని అన్వర్థనామము పర మార్థమును విపులముగ నిట్లు వివరించిరి. 'పిచ్చి పూజారి' యని పిలువబడుచుండిన ఆ మహా త్ముడు సుస్థిర ఆరోగ్యవంతుడును, సౌమ్యమన స్థితి గలవాడునై వరలెను. ఆయన భగవత్పరి తాపమునందలి అసమానతీవ్రత, ఆయన భగ వత్సాక్షాత్కార ఉత్కంఠత-సమస్తము-గంభీ రము, పరిపక్వము మరియు పరిపూర్ణము. ఆయన ఆధ్యాత్మికదివ్యానుభూతులు అద్వితీయ ములు. ఆయనయందు మానవత్వము సంపూర్ణ ముగ మటుమాయమై దైవత్వమే ప్రకాశించు చుండెను. నిజముగా ఆయన జీవనసర్వస్వము జయంతియే—మానవత్వము వలని ఉదాత్త భగవద్విజయమే.

అనంతరము శ్రీమత్తపస్యానందస్వాముల వారు ఆంగ్లమున నుపన్యసించిరి. శ్రీరామకృష్ణ తత్త్వ వైవిధ్యము ప్రజాసమూహమును వశ పఱచుకొన్న విధానమును శ్రీవారు విపులముగ వివరించిరి. శ్రీరామకృష్ణగురుదేవుడొక్కడే— ఆయన నిజముగా స్వామిజీకి చెప్పినట్లు—నేను చూచుచున్న యీ యితరవిషయము లన్నిటి కంటె సుస్థిరముగ దేవుని జూచుచున్నాను అని ధైర్యముగ చెప్పగలిగినవాడు. తన సన్నిధి కేతెంచిన ప్రతివ్యక్తియందును భగవదస్తిత్వ మును - ఆస్తికత్వమును - ఆయన సృజించి పెంపొందించెను. నిజముగా ఆయన సమస్తభగ వద్వైభవమును బడసినను జ్ఞానమును వైరాగ్య మును మాత్రమే సమకూర్చి పెట్టుకొనుచుం డెను. శారీరకానందము, కీర్తిప్రతిష్ఠలు, అధి కారము మున్నగు లౌకిక వాంఛలయందు ఆయ నకు ఆసక్తి అణుమాత్రము లేకుండెను. ఆధ్యా త్మిక శక్తియే ఆయనకు యథార్థము. ఆధ్యా త్మిక కేంద్రీకరణమే ఆయన ఆత్మాభిమానము. సర్వమత సమన్వయమూర్తి ఆయన. ''భగవ త్సేవకునిగా నిన్ను నీవు తలంచుకొని త్రికరణ శుద్ధిగా ఆయనను సేవింపుము'' అనునదియే ఆయన మానవుల కొసగిన సందేశము.

16-3-75 న బహిరంగోత్సవము జరుప బడెను. అపరాహ్ణము 3-30 నుండి 5-30 వఱకు బ్రహ్మశ్రీ ప్రవచనరత్నాకర మంజక్కుడి రాజ గోపాలశాస్త్రిగారు ధ్రువచరిత్రమును గూర్చి ప్రవచించిరి.

శ్రీమత్తపస్యానంద స్వాములవారు నాటి బహిరంగోత్సవమునకు అధ్యక్ష్యము వహించిరి. శ్రీమత్ వీతమోహానందస్వాములవారు ప్రార్థన గావించిరి. అనంతరము ఈ జయంతి సందర్భ ముగ సారస్వత పోటీలలో విజయమునందిన విద్యార్థులకు బహుమతులు పంచిపెట్టబడెను.

ఆ పిమ్మట డాక్టర్ సంజీవిగారు తమిళమున ఉపన్యసించిరి. వారి ఉపన్యాస సారాంశము : శ్రీరామకృష్ణ పరమహంస దేవుని మాహాత్మ్య మును గూర్చి ప్రశంసించిన రచయితలలో ముఖ్యులయిన మ్యాక్స్‌ముల్లరు, రోమేరోలాల రచనలు పరమహంసదేవుని అసమాన జ్ఞానాం జన శలాకలై భాసించుచున్నవి. గతశతాబ్ద మందలి భారతదేశ పునరుద్ధరణ ఝంఝా మారుతము శ్రీ పరమహంసదేవుని ప్రభావమున —ఆయన భారతీయ పవిత్ర హైందవ సంస్కృ తికి ప్రతినిధి యగుట వలన—మనోల్లాసకర మయిన మలయమారుతముగ రూపొందెను. శ్రీ రామకృష్ణ గురుదేవుని ప్రభావము నాస్తికు లను సైతము తన వైపునకు ఆకర్షింపగలిగి యుండెను. ఆయన ఆధ్యాత్మికదివ్యశక్తి అంతటి

సుసంపన్నము, నిరాఘాటము. అనుభూతియే ఆయనవిజ్ఞానము. సిద్ధులవెంట పరువులెత్తవలదనియు, స్వల్పములగు శక్తులకై చేతులుచాపవలదనియు పరిపూర్ణ భగవదస్తిత్వమునందే చిత్తమును ఏకాగ్రము కావింపుడనియు భగవదన్వేషకులకు—సాధకులకు—ఆయన బోధించెను. ఆయన ఆచరణవిధానము పరిపూర్ణమయినది. భగవంతునిగూర్చి హృదయపూర్వకముగ విలపించినచో, ప్రార్థించినచో భగవత్కృపావతరణము నిశ్చయమని ఆయన నొక్కి-వక్కాణించెను.

పిమ్మట ప్రిన్సిపల్ శ్రీ హెచ్. ఎస్. రామచంద్రరావుగారు ఆంగ్లమున నుపన్యసించిరి. ఆధునిక వైజ్ఞానిక యుగమునందు, ఆధ్యాత్మిక దివ్యానుభూతు లన్నిటియందును వైవిధ్యము ప్రబలుచున్న కాలమున, ఏతత్ దివ్యానుభూతు లన్నింటికి - మతశాఖ లన్నింటికి - పరిపూర్ణ మూర్తియైన శ్రీ గురుదేవుని అవతారము నాటి-కాలపరిస్థితుల నన్నింటిని ఏకైకగమ్యము గావించిన విధానమును ఆయన విపులముగ వివరించిరి. మఱియు నిట్లు తెలిపిరి : శ్రీ గురుదేవుడు రక్తమాంసములతో గూడిన సాక్షాత్ వేదపురుషుడు, మూర్తీభవించిన పరాశక్తి శ్రీ కాళియే ఆయన అనుటయే దీనికి తగిన వ్యాఖ్య. వేదాది పవిత్రగ్రంథముల వాక్యము లన్నింటికి ఆయనయే మూర్తీభావము. ముముక్షుత్వమునకును పరమవ్యాకులతకును ఆయనయే ఉత్తమోత్తమమయిన లక్షణము లక్ష్యమును. నిరక్షరాస్యుడయ్యును ఆయనయే నిజముగా మహావిద్వాంసుడు. పరిపూర్ణతాశక్తిసమన్వితుడయిన దివ్యశిశువు ఆయన. ఆయన సాధనలు అనుభూతులు—సమస్తమతములను సజీవములు గావించెను. అధునాతన యుగమునకు ఆయనయే ధ్రువతార. వాత్సల్యపూర్వకమయిన ఆయన ఆహ్వానమునకు చెవియొగ్గి ఆయనను పరివేష్టించి సన్మార్గమున సుస్థిరులమై ప్రోత్సాహమునొంది ఆధ్యాత్మికపథమున విజయము నందుదము గాక !

శ్రీమత్తపస్యానందస్వాములవారు తమ అధ్యక్షోపన్యాసమున సంగ్రహముగ నిట్లుద్బోధించిరి: శ్రీరామకృష్ణ గురుదేవుని జీవితోపదేశములను ఏకాగ్రముగను, విశ్వాసపూర్వకముగను పఠింపుడు. అవియే ఆధ్యాత్మిక పథమున విజయోన్ముఖములు, హృదయంగమములు కాగల సద్భావములు, సద్వైఖరీ సంస్కారకములు.

ఆ రాత్రికానంతరము దేవాలయమున భజనగానముతో నాటి కార్యక్రమము సమాప్తమయ్యెను.

# గ్రంథపరిచయం

## గృహస్థ ధర్మావళి

రచయిత : శ్రీ చిన్మయరామదాసు. డబల్ క్రౌన్ 1/16 సైజు. IV+112 పుటలు. వెల : రూ. 1-75. ప్రాప్తిస్థానము : శ్రీ సిద్ధాశ్రమము, తాడేపల్లి పోస్టు, (వయా) కొడాలి, దివి తాలూకా; కృష్ణాజిల్లా, ఆంధ్రప్రదేశ్.

ఈ గ్రంథమున గృహస్థులు అనుసరింపదగిన సమస్త ధర్మములు వివరింపబడియున్నవి.

ఇందలి ప్రతి అధ్యాయము పఠనీయమే. అనేక శాస్త్రములనుండి ప్రమాణవాక్యములు సతాత్పర్యముగ నిందు పొందుపఱుపబడి యున్నవి. అంతియకాక నేటి యుగపురుషులు శ్రీ గాంధీ మహాత్ముడు అరవిందయోగి మున్నగు మహానీయులు ఉపదేశించిన ధర్మములుగూడ నిందు వివరింపబడియున్నవి. ఇందలి భార్యాభర్తల సంవాదము, స్కాందపురాణమునందలి గృహస్థాశ్రమ ధర్మనిరూపణము, మహానిర్వాణ తంత్రము అష్టమోల్లాసమునందలి గృహస్థధర్మ వివరణము, యోగవాసిష్ఠమునందు శ్రీరామచంద్రునకు వసిష్ఠమహర్షి బోధించిన గృహస్థ ధర్మములు, పఠనీయములు, మననీయములు, అనుసరణీయములు. సత్సంతానార్థమే గార్హస్థ్యమనుటయు, గృహస్థులు అనుసరింపదగు మోక్షోపాయములును సుప్రసిద్ధాచార్య మతానుసారముగ నిందు వివరింపబడియున్నవి. దాంపత్యజీవనమునందు దంపతు లనుసరింపదగు సదాచారమును 'భార్యాభర్తల సంవాదము' 'గృహస్థ బ్రహ్మచర్యము' అను ప్రకరణములు వివరించుచున్నవి. ఇందలి భాష సులభసుందరము. అందందు గనుపించు వ్యాకరణ దోషములు చంద్రునియందలి మచ్చవలె అంతగా పాటింపదగినవి కావు. ఈ గ్రంథ పఠనమున గృహస్థులెల్లరును తమ్ము తాము తీర్చి దిద్దుకొనవచ్చును.

## కాలవాహిని

రచయిత: శ్రీ గోనుగుంట బ్రహ్మయాచార్య. డబల్ క్రౌన్ 1/16 సైజు. (132+xxxiii) పుటలు. వెల: రూ. 3-00. ప్రాప్తిస్థానము. ఎ. వి. సుబ్బారావు, బి. పి. ఎమ్. కే. ఎం; మన్నేటికోట P.O. (via) ఉలవపాడు, ప్రకాశంజిల్లా, ఆంధ్ర. మరియు, దుర్గా బుక్ డిపో, మెయిన్ రోడ్, ఒంగోలు, ప్రకాశం జిల్లా, ఆంధ్ర.

ఇందు గ్రంథకర్తగారు కృతయుగాది కలియుగము వఱకు గల ధర్మముల వివరించియున్నారు. ఇందలి రామరాజ్యము, దాని ప్రభావము మున్నగు విషయములు పఠించినచో ఈ గ్రంథపఠనమున ఆకాలవృద్ధము మన దేశమునందు శ్రద్ధాభక్తులు చూపగలరని వచింపదగును. దేశీయ నాయకులు దేశమునకు గావించిన మంచి, నాయకంమన్యులు గావించుచున్న చెడు ప్రస్తావించుచు, పూర్వకాలపు నాయకులు దేశోద్ధరణము గావించిన విధానము పురాణములనుండియు ఇతిహాసముల నుండియు ఉదాహరణము లొసగుచు విపులముగ వివరింపబడియున్నవి. సనాతన ఋషీశ్వరులు, రాజులు, మహాయోగులు అనుష్ఠానపూర్వకముగ లోకమునకు జాటిన ధర్మములు, సౌభ్రాత్రము, సౌశీల్యము మున్నగు సద్గుణ గోములు కథలమూలమున నిందు పొందుపఱుపబడియున్నవి. అధునాతన కాలపరిస్థితుల కూర్చి మహనీయులభావము లిందు విశదీకరింపబడియున్నవి. 'బ్రహ్మము'గారి 'కాలజ్ఞానము' నుండియు కాలపరిస్థితుల వివరణము జరిగినది.

ఈ గ్రంథపఠనమున ప్రజలు తమ గుణముల తీర్చి దిద్దుకొనగల అవకాశ మెంతేనియు గలదు.

—చిలువూరి మాధవకృష్ణకవి.

# శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-600004

## 1975-వ సంవత్సరము, మే మాసమున జరుగనున్న

## ఉత్సవ కార్యక్రమము

**శ్రీ శంకర - రామానుజ జయంతి**

15-5-75 గురువారము : తిథిపూజ

18-5-75 ఆదివారము : అపరాహ్ణము 5 గంటలకు బహిరంగోపన్యాసము

అధ్యక్షులు : శ్రీమత్తపస్యానందస్వాములవారు

ఉపన్యాసకులు : శ్రీ వి. కల్యాణసుందరశాస్త్రిగారు (తమిళము)

ప్రొఫెసరు ఎస్. ఎస్. రాఘవాచారిగారు (ఆంగ్లము)

**శ్రీ బుద్ధ జయంతి**

25-5-75 ఆదివారము అపరాహ్ణము 5 గంటలకు బహిరంగోపన్యాసము

అధ్యక్షులు : శ్రీమత్తపస్యానందస్వాములవారు

ఉపన్యాసకులు : శ్రీ 'అణ్ణా' ఎస్. సుబ్రమణియముగారు (తమిళము)

**ఆదివారములందు సత్సంగ సమావేశములు**

అపరాహ్ణము 4-00—4-20 వఱకు శివానందలహరీ పారాయణము (4-5-75)

,, ,, ,, శ్రీ విష్ణుసహస్రనామ పారాయణము (11-5-75)

4-20—4-30 ,, ధ్యానము

4-30—5-30 ,, తమిళమున ఉపన్యాసములు :—

శివానందలహరి : డాక్టర్ టి. ఎం. పి. మహాదేవనుగారు (4-5-75)

శ్రీమద్రామాయణము : డాక్టర్ ఎన్. వీళ్ళినాథన్‌గారు (11-5-75)

5-35—6-30 ,, ఆంగ్లోపన్యాసములు :—

శ్రీమద్భగవద్గీత : శ్రీమత్తపస్యానందస్వాములవారు (11-5-75)

శ్రీమద్భగవద్గీత : శ్రీ గభీరానందస్వాములవారు (4-5-75)

6-30—8-00 ,, ఆరాత్రికము - భజన

**ప్రత్యేకోపన్యాసములు**

3-5-75 శనివారము : 5-45 శ్రీమద్రామాయణ పఠనము (యాగసంరక్షణము) శ్రీ పి. రామకృష్ణన్‌గారు, ఐ.సి.ఎస్. (రిటైర్డు)

10-5-75 ,, ,, బౌద్ధమత ప్రారంభము : డాక్టర్ టి. ఎం. పి. మహాదేవనుగారు

17-5-75 ,, ,, శ్రీమద్రామాయణము : డాక్టర్ ఎన్. వీళ్ళినాథన్‌గారు

31-5-75 ,, ,, రాజయోగము : శ్రీ గోలోకానందస్వాములవారు

**ఇతర వారములందు ఉపన్యాసములు : అపరాహ్ణము 5-45 గంటలకు**

సోమవారములు : నారదభక్తిసూత్రములు (ఆంగ్లము) శ్రీమత్ వీతమోహానందస్వాములవారు

మంగళవారములు : అధ్యాత్మరామాయణము (ఆంగ్లము) శ్రీమత్ గభీరానందస్వాములవారు

బుధవారములు : శ్రీమద్భాగవతము (ఆంగ్లము) శ్రీమత్ గోలోకానందస్వాములవారు

గురువారములు : అముదమొళ్ళి (తమిళము) శ్రీమత్ శ్రీరంగానందస్వాములవారు

శుక్రవారములు : ఆత్మబోధ (తమిళము) శ్రీ ఆర్. రామకృష్ణన్‌గారు

25-5-75 ఆదివారము : అంతర్యోగ సాధన

ఉభయ ఏకాదశులయందు సాయంకాలిక ఆరాత్రికానంతరము శ్రీరామనామ భజన (7-5-75; 21-5-75)

శుక్రవారములందు సాయంకాలము 6.30 గంటలకు తిరువళ్ళిక్కేణియందలి దక్షిణమాడవీధియందు 13-వ నంబరుగల రామకృష్ణ మందిరమున శ్రీమత్ గోలోకానందస్వాములవారి భగవద్గీతోపన్యాసములు.

ఈ ఉత్సవము లన్నింటియందును భక్తులెల్లరును పాల్గొని భగవంతుని అనుగ్రహభాగ్యమును బడయగోరుచున్నాము.

అధ్యక్షులు,

సంపాదకులు: శ్రీ చిద్ఘనానందస్వామి.

శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-600021) న ముద్రింపబడి,

శ్రీ చిద్ఘనానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మద్రాసు-600004) నుండి ప్రచురింపబడినది.

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౩౧ ౧౯౭౫ - మే : రాక్షస - వైశాఖము సంచిక ౧౧

## విషయసూచిక

'అఖిలవిభు శరణొందుము, యా క్షణంబ యాతనికృప నీదు వనుభూతి కందు వత్స'

—శ్రీ శారదామణి.

# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౩౧ } ౧౯౭౫ - మే : : రాక్షస - వైశాఖము { సంచిక ౧౧

ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ!

## ప్రార్థన

## శ్రీ రామకృష్ణ కర్ణామృతము

శ్లో॥ శుభ్రద్యుతిః శ్రుతిమనోహర శుద్ధగీతిః । స్వచ్ఛంద సాధుగతి రాత్మమృణాళభోజీ
కచ్చి ద్యులోకవిరళః కలరాజహంసో । భక్తాంతరంగ కమలే విజరీ హరీతి ॥

తే. గీ. శుభ్రరుచి వెల్గు దివినేని శోధ్యమద్ది, రాగభక్తాంతరంగ నీరజ విహారి
రాజహంసంబు శ్రుతిమనోహర సుగీతి, నవనవోన్మీలితాత్మ మృణాళభోజి
సాధు సంఘానుసరణీయ సరససుగతి. (పంచపది)

వ్యాఖ్య :- ఒకానొక రాజహంస మంగళకరమయిన తెల్లనికాంతితో ప్రకాశించుచున్నది. స్వర్గమునందయినను అట్టిది కనిపింపదు. అది రాగ భక్తుల హృదయపద్మములందు విహరించును. దాని వాక్కు వేద (గాన) మువలె మనోహరము. అప్పుడప్పుడే చిగిరించుచున్న (మోక్షాసక్తి రేకెత్తుచున్న ముముక్షువుల) ఆత్మయనెడి తామరతూండ్లే దాని యాహారము. సాధుబృందము ననుసరింపదగు సరళ సన్మార్గమే దాని గమనము.

శ్లో॥ మూష్ణన్ దిగంత దురితం స్వయశోవితానైః । పుష్ణచ్యుతి స్మృతిగణాన్ స్వవచో విలాసైః
ఆశ్వాసయన్న శరణాన్ స్వకృపా కటాక్షైః । శ్రీరామకృష్ణభగవా నవభాతి లోకే ॥

చ. అమృతవచో విలాసమున నట్టె శ్రుతిస్మృతులన్ వెలార్చుచున్
విమలయశోవితానమున విడ్చి దిగంత దురంత మద్భుతా
సమ కరుణాకటాక్షమున సచ్ఛరణార్థుల నాశ్వసించుచున్
యమమున రామకృష్ణభగవానుఁడు శోభిలుఁ దత్త్వమూర్తియై.

వ్యాఖ్య :- అమృతమయమయిన తన వాగ్విలాసమున శ్రుతిస్మృతులను (వ్యాఖ్యానరూపమున) బయలుపఱచుచు; నిర్మలమయిన తన యశోవితానమున (తమోమయమయిన) దిగంతపాపమును పరిహరించుచు, (శరణార్థివిషయక) శరణార్థులను అద్భుతమును అసమానమును నగు స్వకీయ కృపాకటాక్షమున (అనుగ్రహించి ధైర్యముగొలిపి) ఊఱడించుచు, అహింసామయమును, అనుష్ఠానపూర్వకమును నగు సౌశీల్యములో రూపుదాల్చిన ఆధ్యాత్మికతత్త్వమై శ్రీరామకృష్ణభగవానుఁడు ప్రపంచమునఁ బ్రకాశించుచున్నాఁడు.

శ్యామబాసు ప్రశ్న : స్వామీ దేవుడే సర్వమును చేయుచున్నచో ఆయన పాపములకు మానవుడు శిక్షింపబడు టేల?

శ్రీరామకృష్ణులు : ఎంత కంసాలితనముగ మాటలాడుచున్నావు!

నరేంద్రుడు : అనగా శ్యామబాబు గడుసరి మనసు గలవాడు. కంసాలివలె తన సున్నితపు త్రాసునందు విషయములను తూచును.

శ్రీరామకృష్ణులు : నేనందును, మూర్ఖ బాలకుడా, మామిడిపండును తినుము. సంతోషముగ నుండుము. పండ్లతోటలో ఎన్ని వందల చెట్లున్నవో ఎన్ని వేల కొమ్మలున్నవో ఎన్ని లక్షల ఆకు లున్నవో లెక్కలు వేయుటవలన నేమి ఫలము? మామిడిపండ్లను తినుటకు పండ్లతోటకు వచ్చితివి. వానిని తినుము. అంతతో తృప్తినొందుము.

(శ్యామ్‌తో) దేవుని పూజించుటకై నీ వీ ప్రపంచమున మానవజన్మము నెత్తితివి. అందువలన ఆయన పాదపద్మములయందు ప్రేమను సంపాదించుటకు యత్నింపుము. ఇతర విషయములను నూరింటిని తెలిసికొనుటకు నీవు శ్రమపడనేల? ''తత్త్వము''ను గూర్చి చర్చించుట వలన నీకు కలిగెడు లాభ మేమి? ఇటుచూడుము. నీకు మత్తెక్కించుటకు పుడిసెడు కల్లు చాలును. సత్రమునం దెన్ని పీపాల కల్లుగలదో తెలిసికొన ప్రయత్నించుట వలన నీ కేమి ప్రయోజనము?

డాక్టర్ సర్కార్ : అది యట్లే. మీదు మిక్కిలి దేవుని సత్రమునందలి ద్రాక్ష సారాయిని కొలుచుట సాధ్యమే కాదు. దానికి పరిమితి లేదు.

శ్రీరామకృష్ణులు : (శ్యామ్‌తో) నీవకాలతునామా దేవున కీయరాదా? నీ బాధ్యతలన్నింటిని ఆయనపరము చేయుము. నీ బాధ్యతల నొక నిజాయితీపరున కప్పగించినచో అతడు నీపై అతని యధికారమును దుర్వినియోగము చేయునా? నీ పాపములకు శిక్షింపవలసినది లేనిది దేవునకు మాత్రమే తెలియును.

శ్యాముని ప్రశ్న : సూక్ష్మశరీరమునుగూర్చి ఎంతయో విందుము. దానిని మాకు ఎవరైన చూపగలరా? మానవుడు చనిపోయినపుడు సూక్ష్మశరీరము స్థూలశరీరమును వదలి వెడలిపోవునని ఎవరైన ప్రదర్శించి చూపగలరా?

శ్రీరామకృష్ణులు : నిజమగు భక్తులు నీ కీ విషయములు చూపుట కేమియు లక్ష్యపెట్టరు. ఒక కుంఠఘరానాపురుషుడు వారిని గౌరవించినను గౌరవింపకపోయినను వారి కేమి లెక్క! ఒక ఘరానాపురుషుని తమకు వశవర్తిగ చేసికొనవలెననెడి ఆలోచనయే వారి మనసున కెక్కదు.

శ్యాముని ప్రశ్న స్థూలశరీరమునకు సూక్ష్మశరీరమునకు గల భేదమేమి?

శ్రీరామకృష్ణులు : స్థూలములగు పంచభూతములతో కూడినది స్థూలశరీరము. సూక్ష్మశరీరము మనస్సు అహంకారము బుద్ధి చిత్తము అనువానితో కూడినది. కారణశరీరము కూడ ఒకటి కలదు. దానితో మానవుడు దివ్యానందము ననుభవించును, దేవునితో అనుసంధానము చేయును. తంత్రశాస్త్రము దానిని భగవతీ తనువు అనును. వీని నన్నింటిని అతిక్రమించి మహాకారణము ఉన్నది. దానిని మాటలలో వ్యక్తము చేయలేము.

ఊరక నేమాటలు వినుటవలన నేమి ప్రయోజనము? ఏదోయొకటి చేయుము. సిద్ధి యను పదమును ఊరకనే వర్ణించుటవలన నేమి సాధిం

తువు? అది నీకు మత్తెక్కించునా? ఆ సిద్ధిని లేహ్యముగా చేసి ఒడలంతయు పూసికొనినను నీకు మత్తెక్కదు. దానిని కొంచెము తినవలెను. నూలులోని నంబరు భేదములను, నలుబదవ నంబరు నూలు నలుబది యొకటవ నంబరు నూలు అను భేదములను, ఒకడు ఆ వ్యాపారమునందున్ననే తప్ప, ఎట్లు గుర్తింపగలడు? నూలు వ్యాపారము చేయువారు ఒకపోగును ఫలానా నంబరు అని చెప్పుట కేమాత్రమును శ్రమ పడరు. అందువలన నేను చెప్పున దేమన, కొంత ఆధ్యాత్మిక సాధన నభ్యసింపుము. అప్పుడు నీవు వీని నన్నింటిని తెలిసికొందువు— స్థూలము సూక్ష్మము కారణము మహాకారణము. దేవుని ప్రార్థించునపుడు ఆతని చరణాబ్జములయందు ప్రేమను మాత్రమే కోరుము.

రాముడు అహల్యకు శాపవిమోచనము చేసినపుడు ఆమెతో ఇట్లనెను. "నీ వొక వరము కోరుకొనుము." అహల్య యనెను: "ఓ శ్రీరామా! నాకు వర మనుగ్రహింతువేని, నేను పంది జన్మము నెత్తినను నీ పాదపద్మములనే నిరతము ధ్యానింపవలెననెడి నా కోరికను తీర్చుము."

నేను దివ్యమాతను ప్రేమకొఱకు మాత్రమే ప్రార్థించితిని. ఆమె చరణారవిందముల కడ పుష్పముల నర్పించి అంజలి ఘటించి ఇట్లంటిని. "తల్లీ, ఇదిగో నీ జ్ఞానము. ఇదిగో నీ యజ్ఞానము. రెంటిని తీసికొనుము. నాకు నీ యందు స్వచ్ఛమగు ప్రేమ నిమ్ము. ఇదిగో నీ పవిత్రత. ఇదిగో నీ అపవిత్రత. రెంటిని తీసికొని నాకు నీ యందు స్వచ్ఛమగు ప్రేమను మాత్ర మిమ్ము. ఇదిగో నీ పుణ్యము. ఇదిగో నీ పాపము. ఇదిగో నీ మంచి. ఇదిగో నీ చెడుగు. వీని నన్నింటిని తీసికొని నీపట్ల స్వచ్ఛమగు ప్రేమనుమాత్రమే నాకిమ్ము. ఇదిగో నీ ధర్మము. ఇదిగో నీ యధర్మము. రెంటిని తీసికొని నాకు నీ యందు స్వచ్ఛమగు భక్తిని మాత్ర మిమ్ము.

ధర్మమనగా సత్కార్యములు దానము వంటివి. నీవు ధర్మము నంగీకరించినచో అధర్మమును కూడ అంగీకరింపవలసి వచ్చును. పుణ్యము నంగీకరించినచో పాపమును కూడ అంగీకరింపవలసి వచ్చును. జ్ఞానము నొప్పుకొనినచో అజ్ఞానమును కూడ ఒప్పుకొనవలసి వచ్చును. నీవు పవిత్రత నంగీకరించినచో అపవిత్రతను కూడ అంగీకరింపవలసి వచ్చును. అది మానవునకు వెలుతురు తెలియుట వంటిది. అప్పుడు అతనికి చీకటికూడ తెలియవచ్చును. మానవునకు ఏకము తెలిసినచో అనేకములు కూడ తెలియును. మంచి తెలిసినచో చెడు కూడ తెలియవచ్చును.

దేవుని చరణకమలములందు ప్రేమను నిలుపుకొనినచో, పందిమాంసమును తినినను అతడు మహాభాగ్యశాలియే, కాని లౌకిక విషయలంపటుడైనచో ఉడకవేసిన కూరగాయలు మాత్రమే తినినను అతడు పట్టి నిర్భాగ్యుడే!

# యజ్ఞము

## హరిహరదాసు

యజ్ఞదాన తపఃకర్మ నత్యాజ్యం
కార్యమేవ తత్
యజ్ఞోదానం తపశ్చైవ పావనాని
మనీషిణామ్॥ (18-5 గీ)

శ్రీకృష్ణభగవానుడు యజ్ఞము దానము తపము అనునవి వదలుకొనతగినవి కావు, అవశ్యము పాటింపదగినవని నిష్కర్షగా చెప్పివేసెను. మానవుల నివి మూడును పావనులుగ చేయుననియు చెప్పెను. ఈ సందర్భమున యజ్ఞములన వేదవిహితములగునవి యనియు, అవి ఎల్లరకును సాధ్యములా యనియు, సాధ్యములైనను ఈకాలమున కాలము సెల్లవానికై వినియోగించుట ఎట్లనియు, భగవదాదేశమని వినియోగించినను ఈలోకమున వానివలన నేమి యుపయోగమనియు భగవదాదేశమును పాటింపగోరువారికి అనేకములుగా ప్రశ్న లెదురగును. ఇట్లే ధర్మరాజువలెను కర్ణునివలెను దానములు చేయగలమా? ధ్రువునివలె విశ్వామిత్రునివలె తపము చేయగలమా? అని నిరాశపొడమును. ప్రస్తుతమునకు యజ్ఞమన నేమో విచారింతము.

"యజ్ఞో వై విష్ణుః" అని తైత్తిరీయ సంహిత. అనగా యజ్ఞమే ఈశ్వరుడు పరాత్పరుడు అని భావము. కనుక యజ్ఞకర్మయనగా యజ్ఞముకొఱకు— ఈశ్వర ప్రీత్యర్థమై— చేయుకర్మ. ఈ భావమునే భగవానుడు కర్మయోగమున స్పష్టము చేసినాడు.

యజ్ఞార్థాత్ కర్మణోఽన్యత్ర లోకోఽయం
కర్మబంధనః. (3-13 గీ)

ఏకర్మ యజ్ఞార్థమై చేయబడుచున్నదో అదియే శ్రేయస్కరము. ఇతర కర్మలు బంధహేతువులగును. కనుక వేదములందు జ్యోతిష్టోమము అశ్వమేధము మొదలుగా గలయజ్ఞములు చెప్పబడియున్నను అవి యుద్దిష్టఫలము నాశ్రయించియే, స్వర్గాది భోగముల నాశ్రయించియే ప్రవర్తిల్లుచుండుటచేత ఇవిమాత్రమే భగవాను డుద్దేశించిన యజ్ఞములు కాజాలవు. కనుక ఇట్టి యజ్ఞములనుమాత్రమే మనము చేయవలయునని నిర్బంధములేదు. యజ్ఞలక్షణ మేమనగా అది ఈశ్వర ప్రీత్యర్థమగుటయే ఫలాకాంక్ష లేకుండుటయే.

ఎల్లర శక్తిసామర్థ్యములకు తగునట్లుగా భగవానుడే పలువిధములైన యజ్ఞములను బ్రహ్మముఖతః చెప్పినాడు. దైవమేవాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే (4-25 గీ.) నుండి 'ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణోముఖే' (4-32 గీ.) వఱకు వివిధములైన యజ్ఞములను ప్రకటించినాడు. శేషమేమియు లేకుండునట్లు 'కర్మజాన్విద్ధి తాన్సర్వానేవం జ్ఞాత్వా విమోక్ష్యసే' అని కూడ నిర్ధారణచేసి చెప్పుచున్నాడు.

పర్యవసానమున శ్రీకృష్ణభగవానుడు చెప్పిన యజ్ఞదానతపః కర్మలలో యజ్ఞమనునది పరమేశ్వర ప్రీత్యర్థమై చేయబడు కర్మయనియు అది విషయభోగరూపమునగాని ఇంద్రియ నిగ్రహరూపమునగాని స్వాధ్యాయ రూపమునగాని ప్రాణాయామాదులు కావలసిన యోగరూపమునగాని సర్వేంద్రియ ప్రాణకర్మ రూపమునగాని ఎవ్విధమున నైన నుండవచ్చుననియు కర్మ ఈశ్వరార్పితమైన చాలుననియు తేలుచున్నది.

ఇట్టి యజ్ఞకర్మను సనాతనధర్మము నాలుగాశ్రమములయందును నియమించి మానవ

జీవితమే ఒక యజ్ఞముగా నిర్వహింపబడునట్లు చేసినది. బ్రహ్మచర్యాశ్రమమున స్వాధ్యాయ యజ్ఞమును గృహస్థాశ్రమమున సాంఘిక బాధ్యతలను విషయసుఖములను నిర్వహించుట యజ్ఞార్థముగను వానప్రస్థమున యోగాది సాధనలచేతను సన్న్యాసాశ్రమమున సకల కర్మలను త్యజించి విశ్వమునే బ్రహ్మమను అగ్నిగను తమ మనస్సులనే హవిస్సులుగను వ్రేల్చుచు జనులు యజ్ఞనిష్ఠులైరి.

రఘువంశపు రాజుల ఘనతను వర్ణించుచు కాళిదాస మహాకవి ఈ విషయమునే ఇట్లు చెప్పెను.

యథావిధి హుతాగ్నీనాం యథా
కామార్చితార్థినామ్
యథాపరాధ దండానాం యథాకాల
ప్రబోధినామ్॥
త్యాగాయ సంభృతార్థానాం సత్యాయ
మితభాషిణామ్
యశసే విజిగీషూణాం ప్రజాయై
గృహమేధినామ్॥

వారు నిత్యనైమిత్తిక కర్మలను శాస్త్రోక్తముగా చేసిరి. అర్థిజనులను వారి యభీప్సితములను దీర్చి తృప్తిపరచిరి. అపరాధములు చేసినవారిని తగిన రీతిగా దండించిరి.

త్యాగముచేయుటకే (విరివిగా నిచ్చుటకే) వారు ధనసంచయము చేసిరి. సత్యమును పాటించుటకే వారు ఏకొలదియో మాట లాడిరి. వంశప్రతిష్ఠను కోరియే వారు జయింప నుత్సుకులైరి. సంతానార్థముమాత్రమే వారు గృహస్థులైరి.

అనగా ఏకార్యమునుగూడ వారు స్వలాభ మునుకోరి చేయలేదు. ధనసంచయమును వారు సుఖించుటకై చేయలేదు. ఇతరులకిచ్చుటకుమాత్రమే చేసిరి. తమ పాండిత్యమును ప్రకటించి తాము పెప్పుపొందుటకు మాట లాడలేదు. సత్యమును వచించుటకుమాత్రమే పల్కిరి. రాజ్యకాంక్షవలన లోభముచే యుద్ధము చేయలేదు. ధర్మనిర్వహణమువలన కలుగు యశస్సుకొఱకుమాత్రమే జయింప నిచ్ఛించిరి. చివరకు వారు వివాహితులైనదియు వారు సుఖపడుటకుగాక వంశాభివృద్ధిని ధర్మ రక్షణమునుకోరి దానికి సాధనమైన సంతానార్థముమాత్రమే.

అట్టివారి జీవితమెట్లు గడచినది?

శైశవేఽభ్యస్త విద్యానాం యౌవనే
విషయైషిణామ్
వార్ధకే మునివృత్తీనాం యోగేనాంతే
తనుత్యజామ్॥

బాల్యమున సకలవిద్యలను శ్రద్ధతో నేర్చిరి. యౌవనమునందు సకల భోగములను ధర్మ బద్ధులై యనుభవించిరి. వానప్రస్థమున మునివృత్తి నవలంబించిరి. కడపట యోగారూఢులై దేహత్యాగము చేసిరి.

ఇట్లు ప్రాచీనులు యజ్ఞతత్పరులై ఈశ్వరార్పణముగ సకల కర్మలను చేసి ఇహపరము లను సాధించిరి.

యజ్ఞశిష్టామృత భుజోయాన్తి
బ్రహ్మసనాతనమ్
నాయం లోకోఽస్త్యయజ్ఞస్య కుతోఽన్యః
కురుసత్తమ॥ (4-౩౧ గీ.)

యజ్ఞశేషమును అనగా యజ్ఞకర్మఫల మును అనుభవించువారు ఇహసుఖములను బడయుటయేకాక మోక్షమునుకూడ నందుదురు. యజ్ఞముచేయనివానికి ఈలోకమువనే

సుఖము లేదు. పరలోకముమాట చెప్పెడిదేమి? యనుచున్నాడు.

పై విషయములను విచారింపగా యజ్ఞము సర్వజనసాధ్యమని మాత్రమే కాక ఎల్లరకును అవశ్యకర్తవ్యమని కూడ ఏర్పడుచున్నది.

ఇట్టి యజ్ఞకర్మవలన పరలోకసుఖమే కదా లభించునది ఇహలోకముమాట చెప్పుడను వారికి

కాంక్షన్తః కర్మణాం సిద్ధిం యజన్త ఇహ దేవతాః
క్షిప్రంహి మానుషేలోకే సిద్ధిర్భవతి కర్మజా॥ (4-12 గీ.)

అని పరలోకమును సాధించుటయే కష్టము. ఇహలోకమును గోరిచేయు యజ్ఞము త్వరితముగ ఫలదాయకమగునని చెప్పుచున్నాడు.

కనుక ఈలోకమున సుఖింపవలెనన్నను పరలోకమున చిరకాలము సుఖింపవలెనన్నను మోక్షమునే కోరినను, యజ్ఞమే— ఈశ్వరార్పితమగు కర్మయే— సాధనమగుచున్నది.

ఇట్టి యజ్ఞమును ప్రస్తుత దేశకాల పరిస్థితులలో సాధింపగలమా యను ప్రశ్న యవశిష్టమగును.

ప్రస్తుతపరిస్థితి చూచినచో ఎచ్చట చూచినను యజ్ఞదృష్టితో సర్వకార్యములను చేయు నవకాశమే కన్పించును. విద్యార్థులు పాఠశాలలకు పోయినచో తాము చదివెడు చదువను హవిస్సును తమ మేధయనెడి యగ్నియందు శ్రద్ధతో వ్రేల్చుచు ఈశ్వరార్పణ బుద్ధితో యజ్ఞము చేయనగును. అధ్యాపకులు తాము చెప్పెడి చదువులే హవిస్సుగా విద్యార్థుల బుద్ధివికాసమే అగ్నిగా యజ్ఞభావన చేయనగును. ఉద్యోగస్థులెల్లరును తమ విధినిర్వహణమును ఈశ్వరార్పితముగ చేయుచు తమకడకు ధర్మబద్ధముగా కార్యార్థులై వచ్చు జనులే యగ్నిగా తాముచేయు విధివిహితమైన సహకారమే హవిస్సుగ యజ్ఞము ననుష్ఠింపనగును. బస్సునడుపుట యను యజ్ఞమును ప్రయాణీకులే యగ్నిగను వారి సౌకర్యమే హవిస్సుగను భావించుచు ఈశ్వరార్పణబుద్ధితో నిర్వహింపనగును. వ్యాపారస్థులు వ్యాపారము చేసినచో జనసామాన్యమే యగ్నిగను వారికి నికరమగు సరకును సరసమగు ధరల కందించుటే హవిస్సు అనియు నారాయణప్రీత్యర్థమై యజ్ఞము చేయనగును. అట్లే పదవులయందున్న యధికారులు పాలితజనుల శ్రేయమునే యగ్నిగను తాము సాధింపగలుగు సాంఘిక పురోగతినే హవిస్సుగను యజ్ఞభావనచేసి ఈశ్వరార్పణముగ తమ బాధ్యతలను నెరవేర్పదగును.

సంగ్రహముగ ధర్మబద్ధమైన ఇతరుల శ్రేయము సంతోషమే వారియందున్న నారాయణుని ప్రీతియనియు కర్తవ్య నిర్వహణమే అగ్నియనియు స్వార్థత్యాగమే హవిస్సు అనియు భావించుచు ఏరంగమున నున్నను మానవుడు యజ్ఞనిర్వహణమును సర్వదేశకాలములందును చేయనగును కదా.

'న అయం లోకోఽస్తి అయజ్ఞస్య' అందువలననే ఎల్లరును యజ్ఞనిష్ఠులైననాడు రత్నగర్భమైన భారతదేశము; ఈకాలమున యజ్ఞదృష్టియే లేని బలహీనుల పాలబడి నిర్భాగ్యపు దేశమైనది.

ఇట్టి దయనీయ స్థితిని గాంచియే వివేకానందస్వామి దరిద్రనారాయణసేవ మూర్ఖనారాయణసేవయని ఎల్లరకును వారివారికి

కావలసినది ఇచ్చు ప్రయత్నము చేయుడని ప్రతియొక్కరిని ఉద్బోధించెను. ప్రతియొక్కరును తమగురించి కాక ఇతరుల మేలును గురించియే ఆలోచించు దేశమున, ప్రతిమానవునియందును విష్ణువునే చూచి పూజించి తృప్తిపరచు దేశమున సౌభాగ్యము వర్ధిల్లుననుట కేమి సందేహము? తమ దైనందిన జీవితమున ప్రతి కార్యమును భగవదర్పితముగ సాటిమానవుల సేవయనెడు యజ్ఞముగా నిర్వర్తించుటగదా ప్రస్తుతకాలమున యజ్ఞనిర్వహణము! ఇట్టి యజ్ఞముచేతగదా మనకు మోక్షమును జగమునకు హితమును చేకూరును!

# దైవసాక్షాత్కారమునకు సాధనవిధానము

[పరమపూజ్య శ్రీమత్ స్వామి వీరేశ్వరానందజీ మహారాజ్ వారు 30-3-'5 సా॥ 7 గం॥లకు రాజమండ్రి, రామకృష్ణమఠ ఆవరణమందు మంత్రదీక్ష తీసికొన్న భక్తులను, ఇతర సభికులను ఉద్దేశించి ఇచ్చిన దివ్య సందేశము.]

మతము (ధర్మము) అనగా నేమి? సాధారణముగా మతమునుగూర్చి మన కొక నిర్దిష్టమైన అభిప్రాయము లేదు. అది కొన్ని మూఢాచారముల ఆచరణయని, కొన్ని నమ్మకములు కలిగియుండుట యని, వానిని పాటించుట వలన తాము ధార్మికులమని, తమ విధానముల నవలంబింపని వారందరు అధార్మికులని తలంతురు. ఈ దురభిమానము ఒక్క హిందూ మతములోనే గాక అన్ని మతములందు ఉండుటచే మతవిద్వేషమునకు, తీవ్ర అపార్థమునకు, సంకుచిత దురభిమానమునకు దారి తీసినది. ఇది సరికాదు.

అంతేగాక మహాత్తులు చూపువారి వెంట బడుచు అవి గొప్ప మత విషయము లనియు, ఉన్నత ఆధ్యాత్మిక స్థితులను సూచించుననియు తలంచుచున్నాము. ఇది కూడ సత్యదూరము.

ఇట్టి నమ్మకములు ఒకవైపుండగా, మరొకవైపు పాశ్చాత్య శాస్త్ర నిష్ణాతులై తర్కము మీదనే ఆధారపడు ఆధునిక విద్యావేత్తలున్నారు. దైవము ప్రత్యక్ష నిరూపణకు అసాధ్యము అగుటచే తాము కేవలవిశ్వాసముమీద నమ్మకము లేనివారగుటచేతను వారు దైవముయొక్క ఆస్తిక్యతనే నిరసించుచున్నారు. మతమును గూర్చి నేటి కాలమున ప్రబలియున్న అభిప్రాయములలో నిది మరొకటి.

మానవాళి మహద్భాగ్యమా యనునట్లు భగవంతుడప్పుడప్పుడు భూమిపై అవతరించి ధర్మమును నిరూపించి, మానవులను ఆ మార్గమున పెట్టుచున్నాడు. గీతలో దీనినే కృష్ణపరమాత్మ ప్రవచించెను. అదేవిధముగా ఈ ఆధునిక కాలమునకు రామకృష్ణ వివేకానందులనువారు అవతరించి నేటి విద్యాధికులు ఆశించు విధానములో మతముయొక్క నిజస్వరూపమును ప్రస్ఫుటమొనర్చియున్నారు. "భగవత్సాక్షాత్కారమే జీవిత పరమావధి. మనకు కనుపింపకున్నను భగవంతుడున్నాడు. కొన్ని సాధనలాచరించి ఆయనను సాక్షాత్కరించుకొనవచ్చును" అని శ్రీరామకృష్ణుడు చెప్పియున్నాడు. నేటి శాస్త్రవేత్తలు వేయుప్రశ్ననే వివేకానందులు "అయ్యా! మీరు దేవుని చూచినారా?" అని అడిగినప్పుడు "చూచినాను. ఆయనతో మాట్లాడినాను. నీవు కూడ సాక్షాత్కరించుకొనునట్లు చేయగలను" అని ఆయన

సమాధాన మిచ్చెను. ఇదే నేటి విద్యార్థులు, మతావలంబకులనుండి ఆశించు శాస్త్ర నిరూపణ.

మతమనగా సాక్షాత్కారమే యని వివేకానందస్వామి నిర్వచించినారు. అది భగవదనుభూతి. మనము సహజముగా తలంచు విషయములు మతము కాదు. ఆయన మరొకవిధముగా నిర్వచించియున్నారు: "ప్రతి జీవి భగవదంశమే. బాహ్యాంతర ప్రకృతులను నిగ్రహించి ఈ దివ్యత్వమును అభివ్యక్త మొనర్చుటే పరమావధి. దీనిని కర్మవలనగాని, భక్తివలనగాని, యోగమువలనగాని, జ్ఞానమువలన గాని — ఒకటి లేక అనేకముల వలనగాని సాధించి ముక్తినొందుము. ఇదే మత సర్వస్వము. సిద్ధాంతములు, కర్మకలాపములు, గ్రంథములు, దేవాలయములు, ప్రతీకములు రెండవ తరగతికి చెందినవే."

ముక్తికారకములగు ఈ చతుర్విధ యోగమార్గములను శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీతలో విస్పష్టముగా ప్రతిపాదించియున్నాడు. చివరలో ఈ యోగముల ద్వారా ఉత్తీర్ణుడైన పూర్ణపురుషుని కూడ వర్ణించియున్నాడు. మనము జాగరూకతతో పరిశీలించినచో ప్రతి మార్గము ఒకే గమ్యమును చేర్చుననియు, వర్ణనలలో భేదమున్నట్లు కనిపించినను, పొందినస్థితి ఒకటే యనియు గ్రహించగలము. కావున ఎవరు ఏ యోగము ననుసరించినను, మిగిలిన మార్గముల ననుసరించినవారు పొందు గమ్యమునే చేరుదురనియు విస్పష్ట మగును.

కావున మనము ఈ మార్గములలో దేని ననుసరించియైనను ముక్తి చెందవలయునని వివేకానందస్వామి చెప్పియున్నారు. దేని నుండి విముక్తి? బంధముల నుండి. బంధ మనగా నేమి? అజ్ఞానము. జ్ఞానమును ఈ అజ్ఞానము ఆవరించుటచే మనము అనేక యాతనల ననుభవించుచున్నాము. జాగ్రత్తగా పరిశీలించి చూచినచో మనము బద్ధులమై యున్నామనియు, దానినుండి విముక్తి చెందుటయే గమ్యమనియు, మతము లన్నియు — హిందూ మతము, క్రైస్తవ మతము, ఇస్లాం మతము, బౌద్ధమతము మొదలగునవన్నియు వక్కాణించుచున్నవని స్పష్టమగును. కావున అన్ని మతములలోని మూల సిద్ధాంతము ఒకటే. అందుచే మతవిషయములలో సంఘర్షణపడి ఒకరితోనొకరు పోరాడుట మాని అందరును ఒకే వేదికపై సమైక్యముగ నిలిచి, ప్రపంచపు అంచులన్నింటినుండి మహామారివలె ఆవరించి వచ్చుచున్న ప్రాపంచికతపై పోరాటము సల్పవలసియున్నది.

భాగవతములో శ్రీకృష్ణపరమాత్మ ఉద్ధవునకు సందేశమిచ్చుచు మానవులందరకు వైరాగ్యము లేనందున జ్ఞానమార్గము ననుసరింపలేరనియు, అట్లని భగవద్భక్తిశూన్యులుగారనియు, చెప్పుచు భక్తితోపాటు ప్రాపంచిక భోగేచ్ఛ యుండుటచే జనసామాన్యమునకు భక్తిమార్గము నిర్ణయించెను. భక్తిమార్గములో మొదటిమెట్టు ద్వైతోపాసన. అందుచే మన మొక దేవతామూర్తిని కల్పించుకొని, అర్చనలో వివిధ కర్మకలాపముల ననుసరించి దేవతానుగ్రహము సాధించుటకై యత్నింతుము. ఈ అర్చనవలన భగవన్నామమునందు రుచి కలుగగా జపస్థితిలో అడుగుపెట్టుదుము. జపము కొనసాగిన కొలది మనస్సు ధ్యానమువైపున కాకృష్టమగును. ధ్యానాభ్యాసమువలన పరమ గమ్యమును చేరగలము.

ఇక జప మనగా నేమి? మంత్రోచ్చారణమే జపము, మంత్ర మనగా నేమి? మనస్సును బాహ్యవస్తువుల నుండి మరల్చి భగవత్సా

దారవిందములవైపు చేర్చునది మంత్రము. మంత్ర జపము వలన బాహ్యప్రపంచమునుండి వెను దిరిగి మనస్సు భగవత్పాదముల యందు మరలు గొనుటచే, మనము ఆధ్యాత్మికముగా పురోగమింతుము.

యోగశాస్త్రములో పతంజలి మహర్షి అష్టాంగయోగమును ప్రతిపాదించి, సమాధిని చరమ స్థితిగా పేర్కొని యున్నారు. ఈ స్థితి ప్రణిధానము వలన గూడ సుసాధ్యమని, ఈశ్వరునకు ప్రతీకమగు ప్రణవమును జపించుటచే సమాధి కలుగునని వక్కాణించి యున్నారు. ఈశ్వరునకు బీజమంత్రము ప్రణవమైనట్లే ఈశ్వరుని ఖండాంశలగు శివ, నారాయణ, దుర్గ మొదలగు దేవతామూర్తులకు కూడ ప్రత్యేక బీజ మంత్రములు కలవు. ఈ దేవతామూర్తులు కూడ ఈశ్వరుని పూర్ణావిర్భావములే. ఈ బీజ మంత్రములు ఆయా దేవతలను ఆవిర్భవింప చేయగల శక్త్యాత్మకములగుట వలన, ఆయా దేవతామూర్తుల నామములలో ఈ బీజమంత్రములను చేర్చి జపించుట వలన మనలో ఆధ్యాత్మిక శక్తులు ఉత్పాదితములై ఆయా దేవతా రూపసాక్షాత్కారము వైపునకు మనలను జేర్చుచున్నవి. ఆవగింజంత పరిమాణము గల మఱ్ఱివిత్తనములో మఱ్ఱివృక్షమంతయు అంతర్గతముగా నున్నట్లే చిన్నదగు బీజమంత్రమునందు దేవత నావిర్భవించు శక్తి యిమిడి యున్నది. భూమిని పదునుచేసి, తోటమాలి దానిలో విత్తనమునుంచి, నీరుపోసి, ఎరువువేసి, గొడ్డుగోదములనుండి కాపాడినచో ఆ చిన్న విత్తనము, తోటమాలి సహాయము, భౌతిక ప్రకృతుల కలయిక వలన, సువిశాల మహావట వృక్షమై విజృంభించుచున్నట్లు, మనము దేవతా బీజమంత్రమును జపించుటవలన మన సాధన, బీజమంత్రములో స్వతఃసిద్ధముగా గల దేవతాసాక్షాత్కారము చేయు శక్తి మేళవించి, దైవమును మనకు సాక్షాత్కరింప చేయును.

మాతృదేవి (శ్రీ శారదామాయి) 'జపము వలననే సిద్ధి కలుగును' అని చెప్పియున్నది. కాని జపధ్యానములను అభ్యసింప నుపక్రమించిన వారికి మనోనిగ్రహము కఠిన సమస్య అనిపించును. అర్జునునివంటి యోధాగ్రేసరుడు కూడ మనోనిగ్రహము సుదుష్కరమని కృష్ణ పరమాత్మతో చెప్పినప్పుడు ఆయన ఒప్పుకొనలేదు. "అర్జునా! మనోనిగ్రహము కష్టమే కాని, అది అభ్యాసవైరాగ్యములచే సాధ్యము" అని బదులు చెప్పెను.

యోగసూత్రములలోకూడ 'అభ్యాసవైరాగ్యాభ్యాం తన్నిరోధః' అని చెప్పబడినది. దీనినే కృష్ణుడు గీతలో "అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే" అని వక్కాణించెను. ఈ అభ్యాస వైరాగ్యముల రెంటిమూలముననే మనోనిగ్రహము సుసాధ్యము.

అభ్యాస మనగా నేమి? అభ్యాసమనగా నిరంతర ప్రయత్నము. ఒక నిర్ణీత కాలమున ప్రతినిత్యము మనము జపధ్యానముల నభ్యసింపవలెను. ధ్యానించు దేవతామూర్తినుండి చలించి బయటకు పోయిన మనస్సును, బలాత్కారముగా వెనుకకు లాగి ధ్యానవస్తువుపై నిలుపవలెను. అది ఎప్పుడెప్పుడు బయటకు పోవునో అప్పుడంతయు ఇట్లు చేయవలెను. ఇది అటు నిటు బలముతో నీడ్చు ఆటవంటిది. ఇట్లు చేయుగా చేయుగా మనస్సు చల్లబడి నెమ్మదిగా స్వాధీన మగును. తాను ఏమరుపాటులో నున్నప్పుడు పిల్లవాడు పుస్తకములను వదలి ఆటలకు పోయినప్పుడు, ఉపాధ్యాయుడు నెమ్మదిగా వాని చేయిపట్టుకొని పుస్తకము దగ్గరకు తెచ్చి చది

వించినట్లు, మనము కూడ మన మనస్సుతో ప్రవర్తింపవలసి యున్నది.

ఇక వైరాగ్య మనగా నేమి? ప్రాపంచిక విషయములయందు ఆశ లేకుండుట వైరాగ్యము. ప్రాపంచిక విషయములయందు వికారము తగ్గినచో కోరికలు అదుపులోనికి వచ్చును. కోరికలు నిగ్రహింపబడినచో మనస్సు చల్లబడి స్వాధీనమగును. మనస్సునకు సంచలనము కల్గించునవి కోరికలే.

గాలివీచుటచే అలలు లేచుచున్న సరోవరపు ఉపరితలముపై చంద్రబింబము ప్రతిఫలింపదు. నీరు మురికిగా నున్నను గోచరింపదు. అట్లుగాక వాయుసంచలనము లేక ప్రశాంతముగా నున్న నిర్మలోదకములో చంద్రబింబము విస్పష్టముగా గోచరించును. అదేవిధముగా కోరికలను అలలచే సంక్షోభము చెందిన మానససరోవరములో దైవదర్శనము గాదు. కాని మనస్సు నిర్మలమై, కోరికలు లేక నిశ్చలమై యున్నచో అట్టి పవిత్ర, ప్రశాంత, నిర్మలమగు మనస్సునందు పరమాత్మ ప్రతిఫలించి విస్పష్టముగా సాక్షాత్కరించును.

ఇట్టి మానసిక స్థితి సులభముగా లభ్యమగునది గాదు. అది 'దీర్ఘకాల నైరంతర్య అభ్యాస' ఫలము. అనగా ఎన్నో సంవత్సరములు విడువకుండ ధ్యాన మభ్యసించినచో మనస్సు కొంత వరకు స్వాధీన మగును. గీతలో కూడ ఈ యోగము 'అనిర్విణ్ణ చేతసా' అనగా తొట్రుపాటు పడని, విచారగ్రస్తమై క్రుంగిపోని మనస్సునకు మాత్రమే లభ్యమగును. కావున, అనేక మాసములు, కాదు, అనేక సంవత్సరములు— బహుశః జీవితాంతము వరకో లేక కొన్ని జన్మల కాలమో — ఈ అభ్యాసము సాగించవలయును. వేరొక గతి లేదు. నిరంతర సాధన సాగించియే తీరవలయును.

మాతృదేవిని సమీపించి మా మానసికస్థితిని గూర్చి చెప్పుకొనినప్పుడు "నాయనా! ఋషులు, మునులు జీవితముల పర్యంతము కఠినసాధనలు చేసి సాధించిన స్థితి, నీవు క్షణములో లభించునని కోరుచున్నావా? బిడ్డా! అది సాధ్యమగు విషయమా?" ఇట్లు చెప్పి మరల ధైర్యము గొల్పుటకై "శ్రీ రామకృష్ణుని అవతరణతో సాధన సుసాధ్యమైనది. మానవులు కొలదిగా సాధన చేసినచో గమ్యమును పొందగలరు" అనెను.

ఆధ్యాత్మిక జీవితము, ప్రారంభములో చాల వెగటుగ నుండును. అభ్యాసము చేయుట కిష్టముండదు. ఏదో సాకులుచెప్పి తప్పించుకొన చూతుము. ఆసనముపై కూర్చుండి కళ్లు మూసికొనగానే భగవద్దర్శనము అగునని ఆశింతుము. అనేకులు అట్లే తలంతురు. కాని ఒకటి రెండు సంవత్సరముల వరకు మనకు గోచరించునది చీకటి మాత్రమే. అందుచే ప్రారంభమున నిరాశ, నిస్పృహ చెందుదుము. కామెర్ల వ్యాధిగ్రస్తునకు అన్ని వస్తువులు చేదుగా నుండును. చివరకు ఆ వ్యాధికి ఔషధమగు కలకండ కూడ చేదుగ తోచును. కాని పట్టుదలతో తినుచుండినచో, వ్యాధి తగ్గినకొలది, దాని మాధుర్యము అనుభవ మగును. అదేవిధముగా ప్రాపంచికత యను కామెర్ల వ్యాధిపీడితునకు, దాని ఔషధమగు జపధ్యానములు కూడ వెగటుగా తోచి సేవించుట కష్టమగును. కాని పట్టుదలతో జపధ్యానములు సాగించుచూ రాగా ప్రాపంచికత దూరమై వానియందు మాధుర్యము గోచరించి ఆ జపధ్యానమధురాస్వాదనను విడువలేని స్థితి కలుగును. కాఫీ, టీ మొదలగు పానీయములకు అలవడినవారు, ఉదయమే వానిని సేవించకుండ ఏపనియు చేయలేనట్లు,

మనము ప్రభాతమున భగవన్నామామృతమును గ్రోలకుండ ఏమియు చేయజాలము.

దీనికి శ్రీరామకృష్ణుడు ఒక ఉదాహరణ నిచ్చెను. జన్మతః వ్యవసాయదారుడుగా జన్మించినవాడు, కొన్ని సంవత్సరములు అనావృష్టి సంభవించినను వ్యవసాయము విడువడు. కాని, ఆషామాషిగానో లేక వేరొక వ్యాసంగముగానో వ్యవసాయ మారంభించిన వారు, ఒకటి రెండు సంవత్సరములు వానలు లేనిచో ఆ కృషినుండి విరమింతురు. మొదటి రకము వ్యవసాయదారుడు, విడువని తన ప్రయత్నమువలన, కాలక్రమమున అధిక ఫలసాయము పొందునట్లు, నిజమైన భగవద్భక్తులు ప్రారంభములోనే అనుభూతులు కలుగకున్నను, ఆధ్యాత్మిక సాధన సాగించుచు, చివరకు ప్రతిఫలము పొందుదురు. అదేవిధముగా మనము నిత్యము జపధ్యానములను సాగించవలయును.

మన శరీరము, మనస్సు స్వస్థతగా నుండవలయునని శరీర విషయములో అత్యంత జాగ్రత్త వహింతుము. మంచి ఆహారమిచ్చి పోషింతుము. దేనికొరకు? ఆహారమివ్వనిచో శరీరము బలహీనమగునని, వ్యాధులపాలై మంచము పట్టునని మనకు తెలియును. అందుకే మనము అనేకములగు ఇబ్బందులలో చిక్కుకొన్నప్పుడుగాని, పని ఒత్తిడిలో తీరిక లేక పోయినప్పుడుగాని, ప్రయాణములో వీలు కలుగనప్పుడుగాని ఏదో అంగడి ప్రక్కన నిలబడియైనను ఏదో ఆహారము తీసికొని శరీరమును ఆరోగ్యముగాను, బలిష్ఠముగాను ఉంచుకొందుము. అదేవిధముగా మనస్సునకు కూడ ఆహారము అవసరము. జపధ్యానములే దానికి ఆహారము. ఆ ఆహారమివ్వనిచో మనస్సు దుర్బలమై రోగపూరితమగును. ప్రస్తుతము మన మనస్సు రోగగ్రస్తముగానే యున్నది. కాని అది జబ్బుగా నున్నదను విషయమే మనకు తెలియదు. కారణము? ఆరోగ్యవంతమైన మనస్సు మనకెన్నడు అనుభవములో లేదు. కావుననే మన ప్రస్తుత మానసికస్థితి బాగున్నదనుకొందుము. అది యథార్థము గాదు. అసూయ, ద్వేషము అను అనేక వ్యాధులకు నిలయమై యున్నది. అందుచే దానికి జపధ్యానములను ఔషధసేవ చేయవలెను.

జపధ్యానములు చేయుటకు మనము చెప్పు మరొక ఆటంకము సమయము లేదని. అది సమర్థనీయమైన వాదము గాదు. అన్నిపనులు చేయుటకు మనకు తీరిక యుండునుగాని జపధ్యానములు చేయుటకు తీరిక యుండదు. మనము మన మానసిక స్థితిని గ్రహించి, జపధ్యానముల ప్రాముఖ్యతను గుర్తించితిమేని యిట్లు చెప్పము. గీతలో శ్రీకృష్ణపరమాత్మ అర్జునునకు బోధించుచు "తస్మాత్ సర్వేషు కాలేషు మా మనుస్మర యుధ్య చ" అని చెప్పెను. అనగా ఎల్లప్పుడు నన్ను తలచుచుండుము. యుద్ధము కూడ చేయుము." 'ఎల్లప్పుడు తలంచుట' యనగా మన దైనందిన విధులను విస్మరింపమని అర్థము గాదు. అర్జునుడు సేనానాయకుడు, యుద్ధోన్ముఖుడు, ఘోరరణ మొనర్పవలసినవాడు. అట్టివానికికూడ, భగవంతు నెల్లప్పుడు తలంచుట, తోడ్తోడనే యుద్ధము చేయుట, సాధ్యమని కృష్ణుడు భావించి యుండగా దానితో పోల్చినచో మనకు గృహకృత్యములు నెరవేర్చుచు జపధ్యానములు సాగించుట అత్యంత సులభసాధ్యములు. కావున విడువకుండ విధికృత్యములతోపాటు సాధనకూడ సాగించుట అవసరము.

ఈ జీవితములో మనకు ఎప్పుడూ చేయవలసినదేదో యుండనే యుండును. మనము సహజముగా ఈ పని ముగించిన తర్వా

ఆధ్యాత్మికసాధన చేయవచ్చునని తలంతుము. అట్లైన్నటికిని సంభవింపదు. ఒకపని వెనుక మఱొకటి సంసిద్ధముగానే యుండును. దాని వెనుక నింకొకటి. ఆ పనులు ముగిసిన తర్వాత సాధన చేయదలచినచో మనము సాధన చేయనే చేయలేము. సముద్రతీరమున కూరుచుండినవాడు 'ఈ అలలు సమసిపోయిన తర్వాత స్నానముచేయుదును' అని తలంచుచున్నచో అలలు ఆగుటగాని వాడు స్నానము చేయుటగాని సంభవింపదు. కాని రెండు అలల మధ్యమునక వేసినవాడు ఏవిధముగా స్నానము చేయుచున్నాడో, అదేవిధముగా మన విధికృత్యముల మధ్యనే భగవన్నామస్మరణ చేయవలయును. అప్పుడే మనము క్రమసాధన చేసినవారమగుచున్నాము. అట్లుగాక వాయిదా వేయసాగితిమేని జపధ్యానములొనర్చుట కష్టసాధ్యమగుట మాత్రమేగాక, అసాధ్యము కూడ అగుచున్నది.

చివరగా శ్రీరామకృష్ణుని అభయ వాక్యమును జ్ఞప్తిచేయుచున్నాను. ''భగవంతుని వైపునకు ఒక్క ముందడుగు వేసితిమేని ఆయన పది అడుగులు మనదాపునకు వచ్చును.'' కావున మనము కొలది ప్రయత్నము చేసితిమేని సాయపడుటకు ఆయన మనవద్దకు వచ్చును. ఈ అభయ వాక్యములతో పాటు శారదాదేవి యిచ్చిన అభయము కూడ గలదు. ''శ్రీరామకృష్ణుని అవతరణతో ఆయన అనుగ్రహముచే ఆధ్యాత్మిక సాక్షాత్కారము సుకరమైనది. మనము కొలదిసాధన చేసితిమేని జీవిత పరమావధిని చేరగలము.''

శ్రీ శారదారామకృష్ణుల యీ అభయ వాక్యములు, మనలను ఉత్సాహపరచుటకు తగియున్నవి. ఈనాడు పైన ఉదహరించిన కష్టములు ఆధ్యాత్మికమార్గములో ఎన్నియున్నను, ఈ రెండు అభయవాక్యములు మన ఈ జీవితములోనే దైవసాక్షాత్కారము బడయుటకు చేయు ప్రయత్నములో తగిన శక్తిని ప్రసాదించును. శ్రీ శారదారామకృష్ణుల అనుగ్రహమున ఈ శరీర పతనాత్పూర్వమే, ఈ జీవితములోనే, మనము సత్యమును లేక భగవంతుని సాక్షాత్కారమును పొందగలమని ఆశించుచున్నాను. వారిరువురి అనుగ్రహము మనపై ప్రసరించుగాక యని వారిరువురిని ప్రగాఢముగా ప్రార్థించుచున్నాను.

# సుఖము - శాంతి

> వర్తమాన ప్రపంచమునకు శ్రీరామకృష్ణుదొసగు సందేశ మేమన: "సిద్ధాంతములు మతవాదములు సంప్రదాయములు ఉపాసనా మందిరములు దేవాలయములు మున్నగు వానిని గురించి భావింపకుము; మనుష్యహృదయమున దీపించుచున్న ఆత్మవస్తువుతో సరిపోల్చి చూచిన యెడల ఇవి ఎందులకును కొఱగావు. ఈ ఆత్మవస్తువే ఆధ్యాత్మికశక్తి. ఈశక్తి ఎంతగ అభివృద్ధినందిన, మనుష్యునియందు జగన్మంగళకర మగు శక్తి అంతగ అభివృద్ధి గాంచును. మొదట ఈ శక్తిని సముపార్జింపుము, దీనినే పొంద ప్రయత్నింపుము. ఇతర ధర్మములను నిందింపకుము. ప్రతిమతమునను ప్రతిసిద్ధాంతమునను ఏదియో కొంత మంచియుండును. ధర్మము మాటలలోను సంప్రదాయములలోను దాగియుండదని నీ జీవయాత్రవలన ప్రదర్శింపుము. సాక్షాత్కారానుభవమును బొందినవారే సత్యమును గ్రహింపగలరు. ఆధ్యాత్మికశక్తిని సముపార్జించినవారే ఇతరులకు దానిని అనుగ్రహింపగలరు; ఇట్టివారే జగద్గురు పట్టమున కభిషిక్తులగుదురు. జ్ఞానజ్యోతిని ప్రసాదించు శక్తికేంద్రములు వీరే." ఇట్టి సిద్ధపురుషు లేదేశమున నెంతగ జన్మించుచుందురో ఆ దేశమున కంతగ అభ్యుదయ నిశ్శ్రేయసములు చేకూరగలవు. ఇట్టి ఆత్మవేత్త లేదేశమున కలికమునకైన లభింపకుందురో, ఆ దేశము యొక్క వినాశ మవశ్యంభావ్యము. దాని నెవ్వరును ఉద్ధరింపజాలరు.
>
> —శ్రీవివేకానందస్వామి.

సకలజీవులును సుఖమును శాంతిని నిరంతరాయముగ ననుభవింపవలెనను కోరికతో సర్వకాలములందును ప్రయత్నించుచుండును. ఐనను ప్రపంచమున సుఖశాంతులు లేకపోవుట ఏల? సుఖశాంతులని భ్రమించి జీవులు తదితరములకై దేవులాడుటవలననే యని తోచును.

మానవుడు మానసిక పరిణతినందని కాలమునందు ఇతరజంతువులవలెనే తన శారీరకసుఖమే సుఖమనియు దానిని సాధింపగలుగు పరిస్థితియే శాంతి యనియు భావించెను. జంతువులవలెనే తన సుఖమును సాధించుటకొఱకు ఇతరుల సుఖము నేమాత్రమును లక్ష్యపెట్టలేదు. కొంత కొంత బుద్ధివికాసము కలుగునప్పటికి తన సుఖము తన సన్నిహితుల సుఖముపై నాధారపడియున్న దనియు వారి సుఖమే తన సుఖమనియు మానవుడు భావింపసాగెను. ఇదియే సంసారజీవనము. మానవుడు తన భార్యాపుత్రుల సుఖమునకై తన సుఖమును వదలుకొనవలెననియు వారి సుఖమే తన సుఖమనియు గ్రహించి అట్లే నడచుకొనసాగెను. వారి సుఖమును సాధించుటకై ఇతర సంసారముల సుఖమును అతడు నిస్సంశయముగ భగ్నము చేయగలిగెను. గమనింపగా మానవుడు తన సుఖమును మాత్రమే చూచికొనినపుడు అతని స్వార్థము తన వరకే పరిమితమై యుండె ననియు అందువలన అట్టి స్వార్థతీవ్రతయు గణనీయము కాకుండిన దనియు తోచును.

మానవుడు తన సంసార సుఖమును సాధింప ప్రారంభించినప్పటినుండి స్వార్థము తననుండి విస్తృతమై తన సంసారమును కూడ కలుపుకొనినది. తన సుఖమును గూర్చియే గాక తన వారి సుఖ

మును గూర్చియు అతడు పాటుపడసాగెను. ఇట్లు స్వార్థము విస్తృతమైనట్లే స్వార్థతీవ్రతయు పెరిగినది. ఎట్లైనను తనవారిని సుఖింపజేయుటకు ఇతరు లెంతటి కష్టములపాలైనను అతడు దానిని లక్ష్యపెట్టలేదు. బుద్ధి మరికొంత వికసించు నప్పటికి తన సంసారపు సుఖశాంతులు తనతో నివసించు ఇతర సంసారముల సుఖశాంతులతో అవినాభావ సంబంధము కలిగియున్నవని మానవుడు గమనించెను. సంఘము సమాజము అను వాని అస్తిత్వమును అంగీకరించెను. సంఘపు సుఖశాంతులపైనే తన, తన సంసారపు సుఖశాంతులు ఆధారపడి యున్నవని గుర్తించెను. సంఘము సుఖశాంతులతో పరిఢవిల్లిననే తనకును సుఖము శాంతి అను భావము అతని హృదయమునందు నెలకొనెను. ఇప్పుడు మానవుని స్వార్థము మరింత విస్తృతమైనది. సంఘస్వార్థమునకై అతడు తన వ్యక్తిగత స్వార్థమును బలిచేయును. ఇట్టి విస్తృతస్వార్థము ఇతర సంఘముల సుఖశాంతులను నిరాకరించును. ఇతర సంఘములను వాని సుఖశాంతులను నిర్మూలించి యైనను వాని సర్వనాశమును సాధించియైనను తన స్వార్థమును తన సంసార స్వార్థమును తన సంఘస్వార్థమును సాధింపవలెనను కోరిక తీవ్రతరమగును. సంఘస్వార్థముతో పాటు ఇతర సంఘములతోడి వైరమును అట్లే అభివృద్ధినందెను. స్వార్థమును కోరగనే పరార్థములతోడి వైరము మొదలగును కదా!

మానవుని బుద్ధివికాసము ఇంకను పెంపొందినది. ఇప్పుడు సంఘస్వార్థమునే కాక మానవుడు దేశస్వార్థమును సాధింపజూచును. ఇతర దేశములతోడి వైరమును పెంచుకొనును. ఇతర దేశముల నణగద్రొక్కి తన దేశమును నిత్యకల్యాణము పచ్చతోరణముగ చేయ నాలోచించును.

ఇట్లు స్వార్థముతో సుఖశాంతులను కోరిన యెడల వైరమే పెరుగుచుండును. ఇక శాశ్వతము అప్రత్యవాయము అగు సుఖమును శాంతిని సాధించు మార్గమే లేదా?

అనాదికాలము నుండియు అట్టి మార్గమును కూడ మానవుడు అవలంబించుచునే యున్నాడు. అదియే ప్రపత్తి. ఏ శక్తివలన ఈ ప్రపంచము ఇంత నియమబద్ధముగ నడచుచున్నది? అసంఖ్యాకములైన ఈ నక్షత్రములు ఏశక్తియాధారముగ తమతమ స్థానములు తప్పకున్నవి? ఏ శక్తియాధారముగ పరస్పరవైరముతో మెలగు ప్రాణిసమూహములు సైతము ఏకకాలముననే వర్ధిల్లుచున్నవి? ఏ శక్తి యాధారముగ నా మనస్సు బుద్ధి ప్రాణములు ప్రవర్తిల్లుచున్నవి? అట్టి ఆ శక్తి నాకు నిరంతర శాంతి నీయరాదా? అని మానవుడు మొదటినుండియు అన్వేషించుచునే యున్నాడు. ఆ శక్తికే అతడు వివిధములైన పేర్లను పెట్టియు అనేకవిధములైన ఆలయములను కట్టియు ప్రపన్నుడగుచున్నాడు. చివరకు ఆశక్తి ఎల్లయెడలను కలదనియు తనయందే కలదనియు సకలచరాచరములందే కలదనియు తెలియుచున్నాడు.

మానవుడిప్పుడు తన సుఖశాంతులను సర్వవిశ్వముయొక్క సుఖశాంతులలో కనుగొనవలెను. ఎన్ని రకముల ప్రపత్తులు కలిగినను ఎన్ని రకముల స్వార్థములున్నను ఎన్నిరకముల వైరములు కలుగుచున్నను అన్నిటియందును తనయందున్న ఆ శక్తియే ప్రకాశించుచున్నదని గుర్తింపవలెను. తనయందున్న ఇట్టి ఈ శక్తిని గుర్తించుటయే పరిపూర్ణముగ అభివ్యక్తము చేసికొనుటయే తన సుఖమును తన వారి సుఖమును తన సంఘసుఖమును తన దేశ సుఖమును విశ్వశాంతిని ఒనగూర్చును. ఇట్లభివ్యక్తము చేసికొనిన మానవుడే అవతార పురు

షుడుగ కీర్తింపబడుచున్నాడు. అతని వలననే జగన్మంగళము చేకూరుచున్నది. అతని దేశ మభ్యుదయమును చెందుచున్నది.

మానవులెల్లరు పశువులవలె తమ తమ స్వార్థమును మాత్రమే చూచుకొనిన నాటినుండి ప్రస్తుతకాలపు మానవ సమాజ మెంతయో పురోభివృద్ధి గాంచినది. ఎందరో మహాచరిత్రులు అవతారమూర్తులుగ కీర్తింపబడిరి. విశ్వశ్రేయమును వారు వర్ధిల్ల జేయుచునే యుండిరి.

అయినను ప్రస్తుత సమాజమున తన సుఖమునకై తన భార్యాపుత్రుల సుఖమును కూడ బలిచేయు నరరూపపశువులు గలరు. తన సంసారపు సుఖశాంతులకై ఇరుగుపొరుగువారి సుఖశాంతులను లక్ష్యపెట్టని ఆటవికులును గలరు. తన సంఘపు శ్రేయమునకై ఇతరసంఘములను పీడించు సంకుచితమనస్కులును గలరు. తమ దేశాభివృద్ధికై ఇతరదేశములను నేలమట్టము చేయు మానవ ప్రబువులును గలరు.

కనుక ఇప్పుడు మనము మన సుఖశాంతులను సాధించుట ఎట్లు? సకలచరాచరములందును ప్రకటితమగుచు విశేషముగ మానవులందు ప్రకటిత మగుచున్న ఆ విశ్వవ్యాప్త శక్తిని సంపూర్ణముగ నభివ్యక్తము చేసికొని మనము ప్రతియొక్కరము దేశసౌభాగ్యమునకు జగన్మంగళమునకు కారణభూతుల మగు ప్రయత్నము వలననే కదా? అట్లాశక్తి నభివ్యక్తము చేసికొను మార్గమును తన జీవితమునందే జీవించి చూపి శ్రీ వివేకానందాదులచే జీవింపజేసి జగన్మంగళకారకులైన శ్రీరామకృష్ణుల యనుగ్రహము గలుగ, మనము దాని నేల సాధింపలేము?

# భక్తిరత్నావళి

మూలము : **శ్రీ విష్ణుపురి** — వ్యాఖ్యాత : **విష్ణుచిత్తుడు**

(ప్రథమ విరచనము)

## 47-48

పురుషోత్తముడగు నారాయణునికై అన్యదేవతాపూజల నుపేక్షించిన భక్తులు వారి యాగ్రహమునకు వెఱవరని రుద్రుడు స్పష్టము చేయుచున్నాడు.

నారాయణ పరాః సర్వే న కుతశ్చన బిభ్యతి
స్వర్గాపవర్గ నరకే ష్వపి తుల్యార్థ దర్శనః
వాసుదేవే భగవతి భక్తి ముద్వహతాం నృణాం
జ్ఞాన వైరాగ్య వీర్యాణాం నేహ కశ్చి ద్వ్యపాశ్రయః. (6-17-28,31)

నారాయణాశ్రితులకు భయకారణమనునది లేదు. సర్వదేశములందును సర్వావస్థలయందును నారాయణునే గనుటచేత స్వర్గనరకములను మోక్షమును వారు సమదృష్టితో జూతురు.

వాసుదేవునియందు ప్రేమార్ద్రమగు భక్తిగలుగువారికి జ్ఞానవైరాగ్య జనితమగు బలము పెంపున నితరుల యాశ్రయ మనావశ్యకము గదా!

## 49-50

అట్లగుచో నెల్లరును విష్ణుభక్తులు కాకుండుటకు కారణమేమని ప్రహ్లాదుడు వివరించుచున్నాడు.

మతిర్న కృష్ణే పరతః స్వతో వా మిథోభి పద్యేత గృహవ్రతానామ్
అదాన్త గోభిర్విశతాం తమిస్రం పునః పునశ్చర్విత చర్వణానామ్
నతే విదుః స్వార్థగతిం హి విష్ణుం దురాశయా యే బహిరర్థమానినః
అంధా యథాంధై ఉపనీయ మానా వాగీశ తన్త్ర్యా మురుదామ్ని బద్ధాః. (7-5-30,31)

నిగ్రహము లేక ఇంద్రియములకు వశులై నరకప్రాయమగు నజ్ఞానమునబడి ప్రాపంచికులగు మానవులు చర్విత చర్వణముగా విషయసుఖముల ననుభవించుచు జన్మపరంపరల బొందుదురు. విషయాసక్తులగు నిట్టి మానవులందు భగవద్భక్తి స్వయముగా గాని ఇతరుల బోధవలనగాని జనింపదు. (తమ యట్టి లౌకికుల సాంగత్యము నే కోరుట చేత భక్త్యుత్పాదకమగు భక్తజన సంసర్గము వీరికి లభింపదనుట.)

ఇంద్రియ సుఖములయందలి ఆసక్తిచే వంచితులై, అట్టి సుఖములయందు విరక్తులైన వారు తప్ప హరి నెఱుగలేరని తెలియక, వీరు తమ జీవితపరమార్థమును తమయందే బడయగోరుదురు. తుల్యబుద్ధులగు వైదికగురువులచే బోధింపబడి సుఖదాయకములగు వైదికకర్మలందే నిబద్ధులైన వీరు గ్రుడ్డివాండ్రు దారి చూపగా నడచు గ్రుడ్డివారిని బోలుదురు.

## 51

కనుక మానవుడు బాల్యమునందే భక్తజీవనము నవలంబింపవలెనని ప్రహ్లాదుడు ప్రోత్సహించుచున్నాడు.

కౌమార ఆచరే త్ప్రాజ్ఞో ధర్మాన్ భాగవతానిహ
దుర్లభం మానుషం జన్మ తద ప్యధ్రువ మర్థదమ్. (7-6-1)

ధీమంతులు బాల్యమునుండియే భక్తి నలవరచుకొనవలెను. మోక్షసాధనమగు మానవజన్మము దుర్లభము. జీవనపరిమితియో, స్వల్పము. అదియు నస్థిరము. (దీపముండగనే ఇల్లు చక్కబెట్టుకొనవలెననుట.)

# ఆధ్యాత్మిక జీవనము

ఆధ్యాత్మికానుభవము ఆధ్యాత్మికసాధనల వలననే తప్ప సాధ్యము కాదు. ఆధ్యాత్మికసాధనలు కొంతపరిణతి చెందిన మనస్సులకే ఉపయోగకరములు అర్థవంతములు అగును. ఈ పరిణతి, బహుకాలము చిత్తశోధనము నైతికనిష్ఠను అభ్యసించి దేవుని గూర్చి ఆరాటమును పెంపొందించుకొనగలిగినప్పుడే లభించును. ఈ కారణముచేతనే గురుదేవుల యుపదేశములందు వేదాంతగంభీరములైన వచనములే గాక, దైవముపట్ల ఉత్కంఠను ఆసక్తిని పెంచు నైతిక నియమములు సాంఘికజీవనము మరి ఇతర ప్రాథమికసాధనలు కూడ తటస్థపడుచుండును. ఇట్టి సాధనలు అభ్యసించుటచేతనే దైవము కొరకు మిక్కుటమైన ఉత్కంఠ జనించును.

నియమనిష్ఠలు, పూజాపురస్కారములు, సాంఘిక మతాచారములు, మొదలైనవి ఆధ్యాత్మికాభివృద్ధికి ఎంతవరకు దోహదకరములు అనునది సాధకులకు ఎదురగు సర్వసాధారణమైన ప్రశ్న. గురుదేవుల యభిప్రాయములో అవి యన్నియు ధాన్యమునకు పొట్టువలెనే ఆవశ్యకములు. ధాన్యము మొలకెత్తుటకు పొట్టు ఎంతమాత్రమును ఉపయోగింపదు. అయినను మొదటనే పొట్టు లాగివేసినచో ధాన్యము మొలకెత్తు నవకాశమే లేదు కదా! ధాన్యము మొలకెత్తిన పిదప పొట్టు దానంతటదియే రాలిపోవునట్లు విధులు నిషేధములు కూడ, మనస్సు పరిపక్వమైన పిదప, వాటంతటవియే జారిపోవును. నిష్ఠాగరిష్ఠము మాత్రమే అయిన జీవనము ఆధ్యాత్మికజీవనము కాదు. అయినను ప్రారంభదశయందు సాధకుని అది ఎంతో రక్షించును, సహాయపడును కూడ.

మన దేశములో పాటింపబడు కులధర్మములు జాతిధర్మములు వాని నియమములు ఇత్యాదులన్నియు ఆధ్యాత్మికజీవన ప్రారంభదశలో రక్షణకై యుద్దేశింపబడినవే. ఆధ్యాత్మిక ప్రగతి ఏర్పడిన పిదప సాధకుడు ఈ నియమములను సహజముగానే దాటిపోవును. కాని మొదటనే వానిని త్రోసివేసి, గొప్ప తాత్త్వికుని వలె నటించుటవలన నేమియు లాభము లేదు. అట్టివాడు పిందెలోనే మాగవేసిన కాయవలె నుండును.

నియమనిష్ఠలలో పూజ, తీర్థయాత్రలు ప్రముఖస్థానము వహించును. చిత్తైకాగ్రతను సాధించుటకు మొదట రూపములపై ప్రతీకములపై మనస్సును కేంద్రీకరించుట యలవరచుకోవలెను. వ్రాత నేర్చునప్పుడు పెద్ద యక్షరములతో గదా మొదలుపెట్టుదుము! అంతే గాక నిజమైన భక్తి వృద్ధి యగుకొలది దైవప్రతిమయే దైవసాన్నిధ్యముయొక్క అనుభూతిని స్పష్టముగా కలుగజేయును. అందుచేత ప్రతిమపూజ సాధారణముగా ఆధ్యాత్మిక సాధకులకు తప్పక యవసరము.

తీర్థయాత్రలు హృదయమునందు కొంచెమైనను భక్తి యున్నవారికి మాత్రమే ఉపకరించును. గురుదేవులు సాధారణముగా ఉటంకించునట్లు ఆధ్యాత్మికచింతన ఇక్కడ (మనసులో) ఉండిననే అక్కడ (తీర్థములయందు) లభించును. శ్రద్ధతో తీర్థయాత్రలు చేయదలంచువారికి గురుదేవులు ఇచ్చు మరొక ఉపదేశము : "కడుపార మేసిన యావులు ఒక చోట తీరికగా విశ్రమించి నెమరువేయును గదా! అట్లే ఒక తీర్థమును దర్శించిన పిదప ఒక ఏకాంతప్రదేశమునందు కూర్చుండి ఆ దివ్యభావములలో లీనమగునట్లు పర్యాలోచన ధ్యానము చేయవలెను. అంతేగాని తీర్థము కనుచాటు కాగానే ప్రాపంచికసుఖములను వెద

కుచు మనసులో నున్న దివ్య భావములను తరిమి వేయరాదు."

గురుదేవులు యోగసిద్ధు లనెడు వలను గూర్చి సాధకులను మరియు హెచ్చరించుచును. యోగసిద్ధులకై మనసు పడువారు అచ్చటనే చిక్కుకొనిపోయి అంతకంటె ఉన్నతమైన ఆధ్యాత్మిక స్థాయిని సాధింపలేరు. మరియు యోగసిద్ధులు నిస్సారమైనవి ఒకడు 14 సం॥ సాధన చేసి నీటిపై నడచు శక్తిని సాధించెను. పడవ వానికై నాలుగు కాసుల వ్యయముతో పోవు పనికి 14 సం॥ మానవజీవితము ప్రయత్నము ఖర్చు! యోగసిద్ధులు ప్రమాదకరములు కూడ. ఆత్మనిగ్రహము చాలినంత లేనివారు వానిని తప్పక దురుపయోగము చేసి భ్రష్టులగుదురు. గురుదేవులు తామెత్తు ప్రభావముతో అదృశ్య శక్తిని పొందిన యొకనిని గూర్చి చెప్పుచుందురు. పిదప నతడు కామాసక్తుడై పతితుడయ్యెను.

అదిగాక ఆధ్యాత్మికసాధకుడు యోగసిద్ధులకై ప్రాకులాడుట బుద్ధిలేనితనము గదా. గుమ్మడికాయ కోరుటకై ఎవడు చక్రవర్తిదర్శనము చేయును?

అధ్యాత్మమార్గములో మరియొక యవరోధము మతదురభిమానము సంకుచితత్వమును. మతదురభిమానము మిక్కిలి గ్రుడ్డిది. శునకము తన యజమానిని ఏ వేషమందైనను గుర్తించును. కాని మతదురభిమాని దేవుని తన మతపు వేషభాషలలో తప్ప వేరెచ్చటను గుర్తింపజాలడు. అల్లా దైవము విష్ణువు ఏ పేరైననేమి, అన్ని మతములును సచ్చిదానందమునే ఉద్దేశించును. ప్రతి మతమును దేవుని యొద్దకు దారియే. నదియొడ్డున అన్ని రేవులును ఒకే నీటికి దారితీయును గదా! వేరువేరు దేశకాలములందు వేరువేరు మతములకు మతబోధకులకు జీవము పోయునది ఒక దైవమే. మతదురభిమానమునకు కారణమే మనగా, దైవతత్త్వమును గూర్చిన మిడిమిడి జ్ఞానము. కాబట్టి అధ్యాత్మసాధకుడు వాని తత్త్వమును గూర్చి కీచులాడక అన్ని మతములను గౌరవించుచు, తన మార్గమును వదలకయుండుటయే సరియైన పద్ధతి. గురుదేవులు చెప్పునట్లు ఉమ్మడి కుటుంబములోని కోడలు అత్తమామలను బావమరదులను గౌరవించుచున్నను తన భర్తపట్ల ప్రత్యేకమైన యభిమానమును గౌరవమును పాటించును గదా. కనుక ఆధ్యాత్మిక సాధకుడు తన మతము ఇష్టదైవము పట్ల అచంచలమైన భక్తిశ్రద్ధలు గలిగి యుండవలెను. అంతియగాక, ఇతరమతములను నిరసించుటయు పనికిరాదు.

దానధర్మములు చేయుట ఆధ్యాత్మిక జీవనమునకు దోహదము చేయును. పాత్రత నెరిగి చేసినచో మరియు శ్రేష్ఠము. కాని ఇట్టి ధర్మకార్యమును అహంకారముతో గాని 'దయగారి పోవు'చు గాని చేయరాదు. ఆధ్యాత్మిక సాధకుడు హీనాతిహీనునియందును దైవమే యున్నాడని జ్ఞప్తియందుంచుకోవలెను. అందుచేత ఎవరికి ఏవిధమైన సేవయు సహకారమును చేసినను అట్టిచో తగు వినయముతోను పుచ్చుకొనువానియందు ఈశ్వరభావముతోను చేయవలెను. సాధకుడు సహనమును అలవరచుకోవలెను. అందుకు కమ్మరివాని దాగలియే యాదర్శము. సమ్మెటలతో ఎంత మొత్తినను అది కదలక మెదలక యుండును గదా! మరియు నతడు మితభాషిత్వము నలవరచుకోవలెను. తన నమ్మకములను అభిప్రాయములను తనవరకే పరిమితము చేసికోవలెను. తన సాధనలను ఎవ

రుని చూడకుండునట్లు గోప్యముగా చేయవలెను.

సాధకుడు అహంభావమును దర్పమును పూర్తిగా వదలవలెను. వినయము, అణకువయే నిజమైన జ్ఞానమునకు చిహ్నములు. విరుగ గాసిన చెట్టు వంగి నేలను తాకుచుండును గదా! అట్లే నిజముగా ఆధ్యాత్మిక సాధనను చేయువాడు అణగియుండును. సాధువై యుండును. అట్లని వినయము పేరిట ఆత్మాభిమానము ఆత్మగౌరవమును వదలుకొనరాదు. తన్ను కించపరచుకొను వినయము వినయమే కాదు. అట్లే ఆత్మయొక్క దివ్యత్వమును ప్రకటించు 'గర్వము' గర్వమే కాదు.

నిజమైన సాధకుడు కల్మషములేని మనస్సు కలిగియుండవలెను. అప్పుడే ఆధ్యాత్మిక సాధనలు బాగుగా దున్నిన పొలమునందు నాటిన గింజలవలె ఫలవంతము లగును. దీక్షతో వ్రత నియమములను పాటించుట వలననే సాధకునకు చిత్తశుద్ధి లభించును. చిత్తశుద్ధి కలిగిన వారికే దైవసాక్షాత్కారము సాధ్యపడును. ఈ విషయముపట్ల గురుదేవులిట్లు హెచ్చరించెడివారు. "మీరు భక్తులు, నిష్కల్మషులుగా నుండవలెను. అట్లని బుద్ధిమాంద్యమును అభ్యసింపరాదు."

సాధకుడు తన కుటుంబముపట్ల ఉదాసీనతనుగాని అజాగ్రత్తనుగాని చూపరాదు. దేవతలకు ఋషులకు సంఘమునకేగాక తలిదండ్రులకు భార్యకు బిడ్డలకు కూడ మానవుడు ఋణపడి యుండును. మిక్కిలి ముఖ్యమైనది తలిదండ్రుల ఋణము. వారు సంతోషించిననే గాని ఏ భక్తిసాధనయును ఉపయోగకరము కాజాలదు. శ్రీ చైతన్యమహాప్రభువుకూడ తాను సన్యాసము పుచ్చుకొనుటవలన తన తల్లి బాధపడకుండునట్లు జాగ్రత్తపడినాడు. శ్రీశంకరాచార్యులు తన తల్లి యనుజ్ఞ పొందిగాని సన్న్యసింపలేదు.

తల్లిదండ్రుల జీవితపర్యంతము వారికి శ్రద్ధాభక్తులతో సేవ చేయవలెను. వారు స్వర్గస్థులైన పిదప శక్తికొలది ఉత్తరక్రియలు చేయవలెను. భార్యకు బిడ్డలకు తగిన జీవితావసరములు సమకూర్పవలెను. ఇవి యన్నియు సాధారణసాధకునకు విధాయకములు. సకృతుగా ఎవడైనను దేవునికొరకు తన ప్రాణములనైనను వదలుకొన సిద్ధపడినచో అట్టివానిని భార్యాపుత్రాదులు ఇతరబంధములు ఎట్లును అడ్డగింపలేవు గదా! దేవునియందు మిక్కిలి ఉత్కంఠను పొందిన వానికి తల్లి ఎవరు? తండ్రి ఎవరు? మరి భార్య ఎవరు? అతనికి దైవోన్మాదము పూర్తిగా పట్టును. అట్టివానికి బాధ్యతలు లేవు. ఋణములు లేవు. అట్టి స్థితి నందినవాడు ప్రపంచమును పూర్తిగా మరచును. అసలు తన శరీరమునందే ధ్యానముండదు.

దేహాభిమానమును దానియందు అనురాగమును సాధకుడు తొలగించుకొనవలెను. దేహము యొక్క చంచలత, పనికిమాలినతనము స్పష్టముగా కన్నులకు కట్టినట్లు గుర్తింపవలెను. అయినను ఆధ్యాత్మికసాధనమయిన శరీరమును ఉదాసీనతతో పాడుచేయక తగిన జాగరూకతతో సిద్ధముగా నుంచుకొనవలెను. ఆధివ్యాధులు కలిగినచో సహనముతో భరింపవలెను. గృహస్థు ఇంటిబాడుగ చెల్లించినట్లే శరీరమునం దుండుటకై ఆత్మ ఆధివ్యాధుల రూపమున బాడుగ చెల్లించును. అదియును గాక కష్టములు మనస్సును శుభ్రపరచును. ఇనుమును బాగుగా కాల్చి సమ్మెటలతో బాదిననే కదా అది ఉక్కు అగును? సాధకుడు కష్ట

నష్టములయందు కాల్చబడి దుఃఖపరంపరలచేత
మొత్తబడి నిగ్గుతేలును. పరిశుద్ధమనస్కుడు,
వినయశీలియునై దైవసాన్నిధ్యమును అనుభ
వించుటకు తగిన అర్హతను సంపాదించుకొనును.

నిజమైన సాధకుడు ఇంద్రియములను జయిం
చుటకును, వాని ఆకర్షణల బారినుండి తప్పించు
కొనుటకును శాయశక్తులా ప్రయత్నింపవలెను.
ఎవడు జీవించునపుడే జడుడో, అనగా ఎవని
శరీరమునందు కామక్రోధాదుల యుద్రేకము
శవమునందువలె నిర్మూలింపబడినవో అతడే
నిజమైన మనుష్యుడు. ఈ అరిషడ్వర్గములను
జయించుటను గూర్చి గురుదేవు లిట్లనిరి:
"శారీరకములైన ఉద్రేకములు ఇంద్రియసుఖ
ములపై ప్రసరించినచో అవి శత్రువులవలె
నడచుకొనును. కాని వానిని దైవోన్ముఖము
చేయగలిగినచో మానవున కవియే ప్రాణ
మిత్రములు. ఏలన అవి యతనిని దేవునియొద్దకు
గొనిపోవును. ప్రాపంచికవిషయము లందలి
కామము దైవమునందు గాఢమైన కాంక్షగా
మారవలెను. ఇతరులపట్ల కలుగు క్రోధము
తనకు ప్రత్యక్షముకాని దేవునిపై త్రిప్పవలెను.
ఇట్లే మిగిలినవానిని గూడ చక్కబెట్టవలెను.
వీనిని నిర్మూలింప లేము కాని సరియగు దారిలో
పెట్టగలము." ఇంకను తగిన ఆత్మనిగ్రహము
సాధింపనివారు ఇంద్రియవిషయముల ఆకర్షణ
లకు ఎంతదూరముగా నున్న నంత మంచిది.

గురుదేవులు మోమాటములేక నొక్కి
వక్కాణించు రెండు గుణములు: సత్యము,
బ్రహ్మచర్యము (వీర్యధారణము). ఆధ్యాత్మిక
సాధనయన సత్యస్వరూపమగు దేవుని వెదకుట.
అందుచేత సత్యమునే పలుకుట సర్వథా
వ్రతమువలె నవలంబించినగాని ఆధ్యాత్మిక
పురోగతి యుండదు. సత్యముద్వారా దైవ
సాక్షాత్కారమును పొందవచ్చును. సత్యమే
తపస్సు. పరులకు అపకారము చేయనిదైనను
కపటవేషమువలన త్రికరణశుద్ధి పాడగును.
ఇందుమూలమున క్రమముగా మిథ్యాచారము
పెరిగి చివరకు ఎట్టి తప్పులు చేయుటకైనను
సంకోచమే లేకపోవును. దాని ఫలితము నిశ్చ
యముగా ఆధ్యాత్మికపతనమే. ఆధ్యాత్మిక
జీవనమునందు సాధింపవలసిన ముఖ్యకార్య
మేమన మనోవాక్కాయములచే ఒక్క
విధముగానే నడచుకొనుట.

సత్యవ్రతమునకు ఎంతమాత్రమును తీసి
పోనిదే బ్రహ్మచర్యమును. వీర్యము నష్టమగుట
వలన మనస్సు మకిలపట్టును. శక్తిసామర్థ్య
ములు చిదురుగంపలో పోసిన నీటివలె వ్యర్థ
మగును. కాముకజీవితము గడపువాని మనస్సు
దైవధ్యానము చేయు శక్తిని కోల్పోవును.
ఏలయన ఇంద్రియలోలుపత్వముచేత మనో
దార్ఢ్యము నశించును. ఉన్నతభావముల
నధిరోహించుటకు శక్తి చాలదు. ఇందుచేతనే
అకుంఠితమైన బ్రహ్మచర్యము అవసరమైన
సన్న్యాసము, ఆధ్యాత్మికజీవనమును తీవ్ర
ముగా నభ్యసింపగోరువారికి ఉపదేశింపబడి
నది. ఇట్టి కష్టమైన సాధన చేయలేనివారికి
కూడ, ఆధ్యాత్మికప్రగతిని కోరినచో గృహస్థ
జీవనమునందు కొంతనిగ్రహము మిక్కిలి
యవసరము.

ఈ మానసిక శారీరక సాధన లన్నియు
ఆధ్యాత్మికజీవనమునకు గట్టి పునాదుల వంటివి.
భక్తిప్రపత్తులు, ప్రార్థన మిక్కిలి యావశ్యక
ములు. దైవము సాకారమా నిరాకారమా
ఇంకొకటియా యని నిర్ధారణ లేదే యని
ప్రార్థనచేయు నలవాటును వాయిదా వేయ
నక్కరలేదు. దైవస్వరూపమును గూర్చి ఎట్టి
నిశ్చయమును లేనివారికి గురుదేవులు ఇట్టి
ప్రార్థనను ఉపదేశించెడివారు. "దేవా, నీవు

రూపమున్నదో లేదో నాకు తెలియదు. నీవు ఎట్టివాడవైనను నాపట్ల దయగలిగియుండుము. నాకు గోచరుడవు కమ్ము.'' సంఘమునందున్న దైవమునుగూర్చిన నమ్మకములన్నియు ఊహాగానములని తలచినను, చరాచరప్రపంచమునకంతను సృష్టిస్థితిలయకారణమగు దివ్యశక్తినిగూర్చి నిండుహృదయముతో పరితాపముతో ''దేవా నీ నిజస్వరూపము నాకు తెలియదు. అనుగ్రహించి నీ నిజరూపముతో నాకు సాక్షాత్కరింపుము'' అని ప్రార్థించినచో చాలును. దైవము తన కృపావర్షమును కురిపించును. ఇట్లు భక్తిప్రపత్తులను పెంపొందించుకొనినచో ఆధ్యాత్మిక సాధకునకు భయమే లేదు. దిక్సూచిముల్లు ఉత్తరదిశకు వలె, మనస్సు నిరంతరము దైవమునే చూచుచుండినచో జీవననౌక ఒడిదుడుకులులేక సాగిపోవును.

# విశ్వజనీనమతము - కలయా, నిజమా?*

సత్యాన్వేషణ సత్యస్వరూపము ఆశయములుగా గల వ్యవస్థలన్నిటిలో మతవ్యవస్థయొక్కటియే అవిరామముగా నిశ్శంకముగా తన యాధిపత్యమును వక్కాణించుచున్నది. కొందరాధునిక తత్త్వవేత్తలు మతమునందలి మూలసూత్రములు యథార్థములు కాకపోయినను మానవుల మానసికారోగ్యమునకు మతమావశ్యకమగుటచే మతమును పరిరక్షింపవచ్చునని యభిప్రాయపడుదురు. అయినను, తన సిద్ధాంతమునందలి సత్యమును నిరూపించుటకంటె మతమునకు వేరొక యావమానము లేనందున మతమునుగురించిన తమ యభిప్రాయములను వారు స్పష్టముగా చెప్ప సంకోచింతురు.

మతవాదు లెంత తీవ్రముగా దృఢనమ్మకముతో ఘోషించుచున్నను ప్రపంచమునందలి ప్రముఖులైన యాలోచనాపరులు పెక్కురు మతముయొక్క సత్యస్వరూపము నొక ముఖ్యాంశముగా చర్చించుట కెట్టియుత్సాహమును చూపలేదు. సాధారణముగా సత్యమగు విషయమునకుండు లక్షణములను వివిధమతసిద్ధాంతములు సర్వదా భగ్నము చేయుచుండుటవలన మతము సత్యస్వరూపము కాజాలదని వారి యభిప్రాయము. శాస్త్రమునకు మతమును పోల్చిచూచినచో నీ విషయము స్పష్టమగునని వారందురు.

సత్యమున కితర సాంకేతిక నిర్వచనము లెట్లున్నను సాధారణదృష్టికి అది స్పష్టముగా కన్పించుచు తప్పనిసరిగా ఎల్లరదృష్టిని తనవైపునకు మరల్చుకొనును. అందుచేత నిజముగా సత్యవంతమైన విషయము క్రమముగా మానవుల యావేశకావేశములనుండి వెలువడి తుదకెల్లరచేతను ముక్తకంఠముతో నంగీకరింపబడును. శాస్త్రవిజ్ఞానవిషయమున నిదియే జరిగినది. దేశకాలములతో నిమిత్తము లేక మానవజాతి ముంగట కొన్ని శాస్త్రసిద్ధాంతములు సప్రమాణముగా ప్రదర్శింపబడినవి. వాని నెల్లరును అంగీకరించిరి. కొన్ని విషయములందు శాస్త్రవేత్తలు భేదాభిప్రాయములను గల్గియుండుట నిజమే. కాని విచారణ కొనసాగుకొలది, ప్రయోగములు సమగ్రము లగుకొలది ఈ యభిప్రాయభేదములు సమసిపోయి

* వేదాంతకేసరి సెప్టెంబరు 1937.

విషయమును గూర్చి ఏకీభావ మేర్పడుచున్నది. మతములగూర్చి ఈ మాట చెప్పనగునా? శతాబ్దములు తరబడి మతములు వర్ధిల్లుచున్నను వారి యభిప్రాయభేదము లప్పు డెంత తీవ్రముగా నుండెనో ఇప్పుడును అంతే తీవ్రముగా నున్నవి. మతములగూర్చి తులనాత్మకచింతన మెంత యభివృద్ధిగాంచినను గమ్యమును గురించిన యొకవిధమగు నేకీభావము తప్ప సాధింపబడిన దేమియు లేదు. అన్ని మతముల వారును ఏకకంఠముతో నంగీకరించు ప్రాథమిక సిద్ధాంతములను సాధనలను ఎవ్వరును ఏర్పరుపలేకపోయిరి. శాస్త్రీయదృష్టితో నాలోచించు తత్త్వవేత్తలదృష్టిలో నసమానాస్పదమైన దీ విషయమే.

మతమునం దేమాత్రమును సత్యము లేదను భావము బలపడుట కింకొక కారణము వివిధమతములు తమ యభిప్రాయభేదములపట్ల వ్యవహరించిన రీతియే. శాస్త్రజ్ఞుల కభిప్రాయభేదము వచ్చినచో వారు దానిని తమ సిద్ధాంతముల యందలి లోపముగా భావించి, దానిని మరింత శ్రద్ధతోను జాగ్రతతోను పరీక్షించి తుదకు సమైక్యతను సాధింతురు. మతవాదులు ప్రపంచమునం దెల్లెడలను అట్టి సందర్భములలో పరస్పరదూషణమును వీలైనచో యుద్ధము రక్తపాతము చెప్పరాని దౌష్ట్యములను మాత్రమే ప్రదర్శించిరి. హేయమగు నిట్టి దురభిమానము పక్షపాతము రెమ్మలు వేయు చోట నిష్కల్మషసత్య మంకురింప జాలదని సంస్కారవంతుడగు నాలోచనాపరుడు భావించినచో నది సహజమే కదా! సత్యాన్వేషణవరకు శాస్త్రవిజ్ఞానమునం దిట్టి ద్వేషము కల్లోలము కన్పింపదు. అందువలన నతడు సహజముగానే సౌహార్ద, సమన్వయ, జ్ఞానోదయములు సత్యమునకు దారి యనియు, ఉద్రేకము పక్షపాతము దౌర్జన్యము అజ్ఞానమార్గములనియు నిశ్చయించును.

మానవుడు కోరు మతసమన్వయమును సుకరము చేయుటకు మతమునందలి ప్రాథమిక సత్యములు, సత్యాన్వేషణకు శాస్త్రీయపద్ధతియు ముఖ్యవిషయములని మానవజీవితమునకు మతావశ్యకతను విశ్వసించువారికి తోచును. విశ్వజనీనమగు మతము సమస్య పండితుల కాలక్షేపమునకు మాత్రమే యనియు సామాన్యుని మతజీవనమునకు దానితో నేమియు సంబంధము లేదనియు నింకొక వాదమున్నను విమర్శనపై ఈ భావన నిరాధారమని తేలును. సాధారణమానవుడు మతమునుగూర్చి శ్రద్ధతో నాలోచింపకపోవుటచేతనే మూలభావములను విస్మరించి అవాంతరవిషయములపై తమ శక్తిని వ్యయించుకొను దుఃస్థితి ఏర్పడినది. కనుక ప్రపంచసమైక్యతవలెనే విశ్వజనీనమతమును సజీవసమస్యగనే యున్నది.

మతముయొక్క విశ్వజనీనతను రెండు విభిన్నసిద్ధాంతములు ప్రతిపాదించుచున్నవి. క్రీస్తు ఇస్లాము సిద్ధాంతము లొక విధముగను హిందూసిద్ధాంతము లింకొక విధముగను మతవిశ్వజనీనతను ప్రకటించుచున్నవి. క్రీస్తు ఇస్లాము మతముల విశ్వజనీనత లెక్కలవలె నిశ్చితముగ కన్పించుచు కొంత చరిత్రాత్మకతనుగూడ ప్రదర్శించును. నాలుగు కావలసినచో రెండునకు రెండే కలుపవలయును గదా మరే సంఖ్యయు పనికిరాదు. అట్లే 'పాపి' యగు మానవుడు క్రీస్తుమతముద్వారా తప్ప ఉత్తమగతిని పొందలేడు! కనుక వీరి మతసత్యములు, వీరి మతము బోధించు పరమార్థము మాత్రమే ఎల్లరకును కావలయును. వారి మతము నంగీకరించినవారు మాత్రమే పరమార్థమును సాధింపగలరు. ఇతరులు ఘోర

నరకమున బడి తీరుదురు. చారిత్రకముగా దేవుని యాజ్ఞనట్లు మానవుని 'ఆదిపితల' యవిధేయతతో మానవుని పతనము పాపస్వభావము మొదలైన దనియు నీ పాపము మానవజాతికి వారసత్వముగా సంక్రమించినదనియు దానిని వదలించుకొనుటకు క్రీస్తు శిలువ వేయబడుట యనెడు పరిహారమునందు విశ్వాసమే మార్గమనియు వారందురు. ఈ సంఘటనలును మానవజీవితపరమార్థమునకు వాని సంబంధమును ప్రకృతిసత్యములవలె యమోఘములైనచో వీరి మత మొక్కటియే సత్యమగును.

ఇట్లు నిష్కర్ష చేసి చెప్పుటచేత నవి మాయిక బుద్ధుల కిది ఆమోదయోగ్యముగా కన్పించినను ఆలోచనాపరుల కిందేదో లోపమున్నట్లు తోపకమానదు. ప్రప్రథమమున అట్టి మనోదౌర్బల్యములకు లోబడినవారికి తప్ప ఇంకెవరికిని ఇట్టి వాదమునందలి యాథార్థ్యము స్ఫురింపదు. ఈ కారణముచేతనే ఇట్టి మతములను వ్యాపింపజేయుటకు శాస్త్రీయసత్యముల కక్కఱలేని దౌర్జన్యము మరి ఇతర లోపాయకారి విధానములును అవసరములైనవి. రెండవ సంగతి యేమన చారిత్రకవిషయమగుటచే వీనియం దెప్పుడును అపనమ్మక ముండనే యున్నది. ఒకవేళ యొప్పుకొనినను, శ్రద్ధాళువులగు నాచారవంతులు చెప్పునట్లుమాత్రమే గాక వాని కేవిధముగానైనను అర్థము చెప్పుకొనవచ్చును. గమనార్హమైన విషయమేమన వారి 'విశ్వజనీన' సిద్ధాంతముల కిట్టి యనాచారపు టర్థములను ఎల్లప్పుడూ వారి వ్యతిరేకపక్షమువారు మాత్రమే ప్రకటింపలేదు. వాని యాధ్యాత్మిక ప్రాముఖ్యము నంగీకరించు ఆచారపరాయణులే వారి మూలసూత్రములకు వేరొక యర్థమును ప్రతిపాదించుచుండిరి. వారి మతవిశ్వజనీనతను నిరసించుటకు వారియందుగల మతశాఖల వితరణము పరస్పరానంగీకారము మాత్రమే చాలును. కనుక ఆలోచించి చూచినచో ఇట్టి మతములందుగల లోపము గ్రాహ్యమగును. వారు ప్రకటించు మతతత్త్వమే నిర్దుష్టముగా గ్రహింపబడలేదని తోచును.

హిందూమత ముపదేశించు విశ్వజనీనమత సిద్ధాంతము అన్ని మతములు సత్యములే అవి పరమార్థసాధకములే యని యుద్ఘాటించును. ఇప్పటివరకు పరీక్షింపబడిన మతసిద్ధాంతములకు ఈ సిద్ధాంతమునకు గల వ్యత్యాసము తెల్లమే. మొదటి సిద్ధాంతములోని లోపములే లేకపోయినచో ఈ సిద్ధాంతము నట్టి హాస్యాస్పదమని తోచు నవకాశము కూడ గలదు. కాని మతయాథార్థ్యమును గూర్చి సమ్యగ్విమర్శ చేసినచో మతముయొక్క విశ్వజనీనతకే యభిప్రాయమే సవ్యమని దృఢపడును.

మతమును విమర్శనాత్మకముగా జూచినచో నందు తత్త్వవిచారము, ఇతిహాసము, మానవున కొక విశిష్టమైన యనుభవమును కల్గించు కార్యకలాపములు, ఆ యనుభవముదృష్ట్యా జీవితముపట్ల నొక వైఖరి— ఇవి యన్నియు కలిసి యుండుటను జూతుము. ఇంకొకవిధముగా చెప్పినచో నివి జీవితమునకు మూలసత్యములగు ననుభవములకు ప్రతీకలు. అందుచేతనే ఇవి సత్యములైన భావనలు. ఈ విషయమున గణితశాస్త్ర సూత్రములకు ఈ ప్రతీకల సత్యస్వభావమునకు గల భేదము స్పష్టముగా కన్పించును. రెండు రెండ్లు నాలుగనినచో దాని భావ మంతియే. వేరేమియు స్ఫురించుట కవకాశము లేదు. కాని మతప్రతీకల సత్యస్వభావము ప్రతీకమాత్రముతో నాగిపోక దానియందలి విశిష్టమైన రసాత్మికానుభవములను స్ఫురింపజేయును. దాని ఘనత యట్టి

సూచకశక్తియందే గలదు. అందువలననే రసానుభవము చాలవరకు సంప్రదాయముపై నాధారపడియుండును. రసవిమర్శకున కిట్టి సంప్రదాయములు చక్కగా తెలిసియుండి అవి సూచించు భావముల ననుభవింపగలుగు శక్తి యుండుట యవసరము.

సాధారణముగా కర్ణాటకసంగీతము నాస్వాదించువారికి పాశ్చాత్యసంగీతము విచిత్రముగా విన్పించును. అట్టిదికూడ సంగీతమా అది యొక యానందమా యని వా రాశ్చర్యపడుదురు. కారణ మేమన వారికి పాశ్చాత్యసంగీత సాంప్రదాయములతో పరిచయము లేకపోవుటయే. ఆ కారణముచేత ఆ శబ్దప్రతీకలు సూచించు ననుభవమును పొందలేకపోవుటయే. ఆ వ్యక్తియే కొంతకాలము పాశ్చాత్యసంగీతమును శ్రద్ధతో నాలకించినచో వానియందలి రసానుభవశక్తి మేల్కొనును. ఇంతకుముం దాశ్చర్యజనకమైన విషయమే ఇప్పు డాతని కానందదాయక మగును.

దీనివలన స్పష్టపడున దేమనగా అనుభవ మొకటియైనను వానికి ప్రతీకలు భిన్నములుగా నుండవచ్చును. పాశ్చాత్యసంగీతప్రతీకలు సరిగా నర్థము గాకపోవుట వలన వానియం దెట్లు దురభిప్రాయ మేర్పడుచున్నదో అట్లే వివిధమతప్రతీకలు సరిగా నర్థము గాకపోవుట వలన వానియందు నిరసనయు తేలికభావమును నేర్పడును.

మతముయొక్క విశ్వజనీనత నీ దృష్టితో చూచినచో హైందవాదర్శమగు సర్వమత ప్రామాణ్యము బోధపడును. ప్రథమమున మతముయొక్క ముఖ్యోద్దేశమును గమనింపవలెను. యాంత్రికముగా కన్పించు విశ్వము వెనుక నొక విజ్ఞానమయచైతన్య మున్నదని ఈ మానవునిచే గుర్తింపజేయుట వానియందు మానవున కాత్మార్పణబుద్ధిని కల్గించుట, అచంచలమైన యానందము శాంతి జ్ఞానము అభయముల యనుభవము నొసగుట యనునవి ప్రతిమతమునకును ఆదర్శములే కాని స్వర్గ నరకముల సఖ్యయు వాని వర్ణనము అచ్చటి సుఖదుఃఖములు అందలి ప్రాణులు మొదలైన విషయములు అవాంతరమాత్రములు.

పర్యవసానమున మతమునందలి తత్త్వమే గాని ఇతిహాసమే గాని కర్మకలాపమే గాని మానవునియం దట్టి యనుభవమును కల్పించుట కుద్దేశింపబడిన ప్రతీకల సముదాయము. అట్టి ప్రతీకలు భిన్నమతములకు వారివారి సంప్రదాయములనుబట్టి భిన్నములుగా నుండవచ్చును. అవి ఇతరులకు చాలవర కర్థరహితములుగ నుండవచ్చును. కాని అవియన్నియు కల్గించు మతానుభవము, భిన్నసంప్రదాయముల సంగీత మొసగు ఆనందమువలెనే, ఒకటిగా నుండగలదు. అట్లుగాక మతము లన్నియు నొకే విషయము నొకే రీతిగ చెప్పవలెనని యాశించుట, అన్నిరకముల సంగీతము లును ఒకేరీతిగ నుండవలయు ననుటవలెనే హాస్యాస్పదము.

మతములందు ఒక మతసిద్ధాంతమే సత్యమనియు ఇతర మతసిద్ధాంతము లసత్యము లనియు ననుటవలన ఇతర శాస్త్రీయసత్యము లకువలెనే దీనికిని ప్రమాణములను చూపవలసి వచ్చును. అట్టి ప్రమాణము లే మతమునకును లేవు గదా! అదియుగాక వారి సిద్ధాంత మవలంబించినవారి యనుభవమే ఇంకొక సిద్ధాంతము నవలంబించినవారు సాధించుటవలన వారి వాద మసత్య మని తేలిపోవును. కనుక హేతుబద్ధముగా; ఒక సమాజములోని వారికి కొన్ని యాధ్యాత్మికానుభవములను కలిగించుట కేర్ప

రచిన సాంస్కృతిక సాంప్రదాయిక ప్రతీకముల సముదాయమే వారిమతమనియు ఇట్టియనుభవములను కల్గించుటచేత నన్ని మతములును సత్యములే యనియు నిశ్చయింపవచ్చును.

మతసిద్ధాంతములు ప్రతీకామాత్రము లని నిరూపించుటకు కొన్ని యుదాహరణముల జూతము. ప్రతీకములు అవిసూచించుభావముల ననుభవింప గలిగిన వారికి మాత్రమే యర్థవంతము లనియున్నాము గదా. క్రైస్తవుల మతానుభవమునకు శిలువవేయబడిన క్రీస్తు బొమ్మ యతిముఖ్యము. కాని తమ ముక్తికి స్వీయప్రయత్నముపై నాధారపడు హిందువు గాని బౌద్ధుడుగాని తనను తాను రక్షించుకొనలేని క్రీస్తు ఇతరుల నెట్లు రక్షించునని యడిగినచో నాశ్చర్యపడ నక్కరలేదు. అట్లే హిందువులు శతాబ్దుల తరబడి దైవస్వరూపునిగా నారాధించిన శ్రీకృష్ణుని, క్రైస్తవులు ప్రపంచ మతములందలి యవినీతిపరులలో మొదటివాడనినచో దానికి వింతపడనక్కరలేదు. నగ్నమును మానవశీర్షాలంకృతమును అగు కాళి శాక్తేయులకు దైవత్వ సాక్షాత్కారము కావచ్చును కాని వైష్ణవాచారపరునికది భీకరమును జుగుప్సాకరమును మాత్రమే యగును. అతనికి పిల్లనగ్రోవియు పుష్పమాలికలును గల శ్రీకృష్ణుడే ఆధ్యాత్మిక భావప్రకాశకుడు. ఇట్లే ప్రతిమతానుయాయులును వారి గ్రంథములందేమి, ప్రార్థనాలయములందేమి, ప్రతీకముల సముదాయమునందేమి, వారి సంప్రదాయములను బట్టియే యర్థములను కనుగొనజాలుదురు. వారి తత్త్వనిర్ణయమునందుగూడ ఇట్టి ప్రవృత్తినే కానవగును. వేదాంతుల నిర్గుణబ్రహ్మమును, క్రైస్తవుల ట్రినిటీయు, బౌద్ధుల శూన్యమును, ముస్లిముల అల్లాయు వారివారికి మాత్రమే యర్థవంతము లగుచు ఇతరులలో హేళనను తిరస్కారమును జనింపజేయుచున్నవి.

కనుక వచ్చిన కష్టమెచ్చట ననగా మతావలంబకులు తమ మతములకు ఇతర భౌతిక శాస్త్రముల యాథార్థ్యమువంటి యాథార్థ్యము నాపాదించుటలోనే. భేదబుద్ధి భౌతిక శాస్త్రముల కత్యంతావశ్యక మైనను ఆధ్యాత్మిక విషయములందది నిరర్థకము. పరస్పర విరుద్ధములైన ప్రతీకములు వారివారిదృక్పథములనుబట్టియొకే యాధ్యాత్మికానుభవమును కల్గింపజాలుచున్నవి. కనుక మతసిద్ధాంతముల ప్రతీకభావము నంగీకరించినచో, కొన్ని ప్రతీకములచే ఇతరసంప్రదాయములవారుద్బోధితులు కాజాలక పోయినను, వాని ప్రామాణ్యము నంగీకరింపగలము. ఈ దృష్టిచేతనే మతవిశ్వజనీనత యొక్క ప్రామాణ్యము నిలుచుచున్నది. అట్లుగాక ఒక మతసిద్ధాంతమే ఎల్లరకంగీకార్యము కావలెనన్న విశ్వజనీనమతము నిరవధికముగా దూరమగుచునే యుండును.

నవీనయుగమున శ్రీరామకృష్ణులుమాత్రమే ఈ తీరున నాలోచించుటయే గాక, దాని ననుసరించి వివిధమత సాంప్రదాయిక జీవనములను జీవించి వాని యన్నిటి యనుభవసారూప్యమును నిరూపింపగల్గిరి. అందువలననే వా రధికారపూర్వకముగా ఎన్నిమతములో అన్ని మార్గము లనగల్గిరి. ఈ మాటల ననునపుడు వారు గౌరవనీయములగు మతములనే గాక అవినీతికరము లనిపించుకొను మతములను గూడ నుద్దేశించిరి. వీనిని వారు పాకీవాని ద్వారము లనిరి. ఈ ద్వారముగుండా కూడ భవనములోనికి పోవచ్చును కాని మర్యాదస్థు లెవరును దాని నుపయోగింపరు.

అట్లే ఆధ్యాత్మిక ప్రగతిని సాధించినవారిలో, వారు సామాన్యనైతికజీవనమును భంగపరచి

రని నీతిశాస్త్రతత్పరులు తప్పు లెన్నినపుడు వారికి శ్రీ రామకృష్ణు లిట్లు సమాధానము చెప్పెడివారు, "వారిని నిందింప నగత్యము లేదు, వా రవలంబించిన మార్గము దైవసాక్షాత్కారమునకు గొనిపోవునని వారికి దృఢవిశ్వాస మున్నది. దైవసాక్షాత్కారము నిచ్చునను ఏ దృఢనమ్మకమునందును తప్పు లెన్నరాదు. ఏ సాధకుని దృక్పథమును నిరసింపరాదు. ఏలన శ్రద్ధతో పాటించినచో ప్రతి దృష్టియు అన్ని దృక్పథముల సమిష్టియగు దేవునియొద్దకు గొని పోవును. ఎవరిపద్ధతిలో వారు దేవుని ప్రార్థించుచునే యుండవలెను. ఇతరులలో తప్పు లెన్న రాదు. వారిపద్ధతిని స్వీకరింపను రాదు."

విశ్వజనీనమతమున కిది యొక మహత్తరమైన పాఠము గదా!

# యోగసారబోధిని—22

## శ్రీ జ్ఞానేశ్వరానందస్వామి

భక్తి యనునది సహజముగ పరిణతి చెందవలసినదే కాని దానిని త్వరపెట్టుట సాధ్యము కాదు. అది స్వాభావికముగనే వికసించి ఫలింపవలెను. మనము హృదయపూర్వకముగ భక్తి సఫల మగువరకు వేచియుండవలె ననుటకు శ్రీ రామకృష్ణు లీ కథను చెప్పెడివారు.

దేవర్షి యగు నారదుడు దేశసంచారము చేయుచు స్వర్గమునకు బోవుచుండెను. మార్గ మధ్యమున నత డొక తపస్విని చూచి పలుకరించెను.

నారదుడు స్వర్గమునకు బోవుచున్నాడని తెలిసి ఆ తపస్వి భగవత్సాక్షాత్కారమునకు తా నింకెంత కాలము వేచియుండవలెనో కనుగొనుమని నారదుని ప్రార్థించెను. నారదు డట్లే యని సాగిపోయెను. కొంతసేపటిలో నారదుడు శాంతారాము డను భక్తుని గృహమును జేరెను. భగవంతునిపట్ల నిస్స్వార్థమగు ప్రేమతో శాంతారాముడు ఆనందముగా నాడుచు పాడుచుండెను. ఇతడుగూడ నారదుని తా నెంతకాలము నిరీక్షింపవలెనో కనుగొనుమని ప్రార్థించెను. కొంతకాలము పిదప నారదుడు మరల నా మార్గముననే వచ్చెను. అప్పటికి తపస్వి శరీరమునంతయు చెదపుట్టలు కప్పివేసినవి. ఆతురతతో నతడు భగవంతు డేమనెనని యడిగెను. నీ కింకను మూడు జన్మలు గలవని భగవంతు డనెనని నారదుడు ప్రత్యుత్తర మిచ్చెను. 'అయ్యో! ఇంకను మూడు జన్మములా! ఇట్టి వైరాగ్యముతో నింత ధ్యానతపములు జేసినను ఇంకనూ మూడు జన్మలా!' అని యతడు విలపించెను.

శాంతారాము నింటికి పోయి నారదుడు "శాంతారామా! ఆ చింతచెట్టునం దెన్ని యాకులు గలవో నీ వన్ని జన్మల నెత్తవలె నని భగవద్వచన" మని చెప్పెను. అది విని శాంతారాము డానందముతో గంతువేసెను. "అంత త్వరలోనా! భగవంతు డెంత దయామయుడు!" భగవంతు డాతని భక్తికిని సహనమునకును మెచ్చి వెంటనే సాక్షాత్కరించెను. తన భక్తిసాధనల ఫలముకొరకై నిరీక్షించుట కొడబడుటయే గదా అతని భగవత్సాక్షాత్కారమునకు కారణము!

## వైధీ భక్తి

భక్తియోగమునందు ఉత్తీర్ణుడగుటకు భక్తుడు మొదట వీనిని సాధింపవలెను.

1. నియమము : రాజయోగమునందు చెప్పబడిన నియమములే భక్తియోగమునందు కూడ వర్తించును. సుకుమారమైన ప్రేమలతను రక్షించుటకై దాని చుట్టును వేయు కంచె వంటిదే నియమము.

2. నిష్ఠ : ఎట్టి అవాంతరములు వచ్చినను కొన్ని నియమములను వదలక అనుష్ఠించుటనే నిష్ఠ యందురు. నియమములు దృఢతరములైనచో నవియే నిష్ఠ యనిపించుకొనును. నిష్ఠ ఒక విధమగు మొండిపట్టుదల. సాధన నిరంతరాయముగా సాగవలెనన్న అట్టి పట్టుదల ఉండియే తీరవలెను. ఇదియే చివరకు గమ్యమును చేర్చగలదు.

3. ఉపాసన : పూజకు లక్ష్యభూతమగు దాని సమీపమున నుండుటయే ఉపాసన. అన్ని కార్యకలాపములను నిర్వర్తించుచు కూడ ఉపాసనను అభ్యసింపవచ్చును. వైధీభక్తి యందు ఉపాసన ముఖ్యముగా నాలుగు సాధనలుగా నుండును. అవి పూజ, జపము, స్మరణము, ధ్యానము అనునవి.

ఇష్టదేవతను విధ్యుక్తముగా నర్చించుటయే పూజ. భగవంతుడు నిజముగనే ఎదుట కూర్చుండి యున్నట్లే పూజాకలాపములను నిర్వర్తింపవలెను. ఇష్టదేవత నిజముగా నీ కుటుంబములోని వాడే యని భావించుచు పూజింపవలెను. సేవింపవలెను. నీ యజమాని యని భావించుచు అతని సకలకార్యములను నిర్వర్తింపవలెను.

జపమనగా ఇష్టదేవతనామమగు మంత్రమును పునశ్చరణ చేయుట. మంత్రపునశ్చరణ అపారమగు చిత్తశుద్ధిని కలిగించును. దానినెంత తరచుగా జేసిన నంత మంచిది. సాంప్రదాయికముగా కొన్ని అక్షరప్రతీకములు కొన్ని ఉద్దేశములను నిర్దేశించినవి. నిరంతరముగా ఉపయోగించుటవలన నవి శక్తివంతములైనవి. నీవు మంత్రపునశ్చరణము చేయునప్పుడు నీ చుట్టును అట్టి శక్తివంతమైన ఆధ్యాత్మిక వాతావరణమేర్పడును. భక్తియోగము సఫలమగుటకు భగవన్నామ పునశ్చరణము మిక్కిలి ఆవశ్యకము.

స్మరణమనగా నిరంతరమైన చింతన. ఏ పని చేయుచున్నను అప్పుడప్పుడు దానిని కొంత తడవు నిలిపి భగవంతుని దలచుకొనుచుండవలెను. కాలక్రమమున నది నిరంతరమై నీ జీవనశక్తు లన్నిటిని సమన్వయపరచి నీ జీవనమున నంతర్వ్యాపిని యగును. దిక్సూచి ముల్లు ఎప్పుడును ఉత్తరధ్రువమునే సూచించును. భగవన్నామమునే నీ జీవనమునకు ఉత్తరధ్రువముగా చేసికొనుము. నీ చిత్తమునే దిక్సూచి ముల్లువలె నుండనిమ్ము. అదియే స్మరణ.

వివాహమహోత్సవము లందు దీపము లన్నియు వెలుగుచుండునట్లు చూచుట కొకడు నియమితుడగును. ఒక దీపమునుండి మరియొక దీపమునకు నడచుచు అవసరమైనచోట్ల కొంచెము నూనెను పోయుచుండును. ఎప్పుడైన నతడు అతిథులతో మాటలాడుచున్నను, అతని చిత్తము సర్వదా దీపములయందే లగ్నమై యుండును. అట్టిది స్మరణము.

దాది యజమానుని పిల్లలను మిక్కిలి ప్రేమతో బంగారుకొండా అనుచు లాలించును. అయినను తన మనస్సు దూరగ్రామమునందున్న తన బిడ్డలయందే యుండును. అదియే స్మరణము.

ఒకనికి పంటి తీపున్నది. అతడు తన వ్యవహారము లన్నిటిని చక్కబెట్టుకొనుచునే యుండును. అయినను అతని మనస్సు తన పంటితీపునందే తగుల్కొని యుండును. అదియే స్మరణము.

ఇష్టదేవతయం దట్టి స్మరణము నలవరచుకోవలెను.

ధ్యానము తదేకచింతనము. స్మరణము పక్వమైనచో ఇష్టదేవతపై చక్కగా ధ్యానము కుదురును. నీ ఇష్టదైవమునుగూర్చి నీ హృదయకమలమునందుగాని, గురూపదేశము ప్రకారముగాని ధ్యానింపుము. మనోవ్యాపారముల నన్నింటిని ఇష్టదైవముపై కేంద్రీకరింపుము. ఇష్టదేవతాశోభతో నీ జ్ఞాననేత్రము నకుపండువు చేయుము. అట్టి భక్తికి లక్ష్యభూతమగు దానిపై ధ్యానము ప్రేమను పావనము చేయును. ధ్యానమునకు లక్ష్యభూతమైన వస్తువు లక్షణములే భక్తునకు క్రమముగా కలుగును.

# పరిప్రశ్న

[మద్రాసు శ్రీ రామకృష్ణ మఠమున 14-5-72 వ తేది జరిగిన అంతర్యోగమున శ్రీమత్తపస్యానందస్వాములతోడి ప్రశ్నోత్తర సంగ్రహము.]

ప్రశ్న : శ్రీరామకృష్ణు లొకపర్యాయము తనకు ముక్తికంటె భక్తియే వరణీయ మని యుండిరి. ఇట్లనుటలోని నిజమగు ఉద్దేశమేమి? భక్తి ముక్తికి సాధనము మాత్రమే కాదా?

ఉత్తరము : ఈ ప్రశ్నను రెండు దృక్పథములనుండి విచారింపవచ్చును. ఒకవైపున భక్తిసిద్ధాంతము భక్తియే సాధనము సాధ్యము కూడ నని నిర్ధారించును. రెండవ వైపున అద్వైతసిద్ధాంతము భక్తి ప్రాథమిక సాధనము మాత్రమే యనియు అది చిత్తశుద్ధి కలుగజేసి సాధకుని జ్ఞానమున కర్హునిగ చేయుననియు జ్ఞానమార్గమే మోక్షదాయకమనియు ఉద్ఘాటించును. కాని భక్తి సంప్రదాయానుసారము సాధనమాత్ర మగు భక్తి గౌణము. అది భక్తిసాధనలగు జపము ధ్యానము పూజ పారాయణము ఈశ్వరార్పిత మగు కర్మ మొదలగువానిని సూచించును. గమ్యము సాధ్యము అగు భక్తి ఎల్లెడలను సకల పదార్థములందును గోచరించు భగవంతుని సేవయును ప్రేమపారవశ్యమును అగును. ఈ విధమగు భక్తియే మానవునకు భగవంతు డనుగ్రహించు శ్రేష్ఠతమ మగు వర మనియు, అతడు సాధకులకు ముక్తిని ఉదారముగ ననుగ్రహించు ననియు, కాని తానే ఇట్టి పరభక్తునకు దాసుడు కావలసి వచ్చుటచే భక్తిని సకృతుగా తప్ప ననుగ్రహింప డనియు భక్తిసిద్ధాంతము వక్కాణించును. భాగవతమునందు (౫-6-18) "రాజా, శ్రీకృష్ణుడు మీ పాండవులకు యాదవులకు ప్రభువు గురువు ఆరాధ్యదైవము ప్రియమిత్రుడు, కొన్ని పర్యాయములు సేవకుడును అయ్యెను. తనను పూజించువారికి భగవంతుడు మోక్షము నిచ్చును గాని భక్తి నీయడు. (ఏలన భగవంతుడే నిక్కమగు భక్తునకు క్రిందగును.)

శ్రీరామకృష్ణులు రెండు రకముల ఆధ్యాత్మిక సాధకులను వివక్షింతురు—జ్ఞానులు, విజ్ఞానులు. జ్ఞాని పరివర్తనశీల మగు ప్రపంచము

నంతను ఆభాసమాత్రముగ జూచును. "ఇది కాదు ఇది కాదు" అనను—ద్వైధీభావమే లేని సమాధియందే నెలకొనగోరును పర్యవసానమున జ్ఞాని నిర్వికల్ప సమాధిగతు డగును. అట్టి స్థితియందు ఇరువదియొక్క దినము లున్న పిమ్మట అతని శరీరము నష్టమగును. లేదా అతడు ద్వైతభావమును తెలిసినచో అస్పష్టమైన కాల్పనిక వ్యక్తీకరణముగ అతనికి తోచును. విజ్ఞాని ఈ విధమగు పరిపూర్ణతకు ప్రతిద్వంది. భగవత్కృపవలన అతడును సకల జగత్తునందలి ఏకత్వానుభవమును అనుభవించును. కాని అతడు తన అహంకారమును, భగవద్బాంధవ్యమువలన పరివర్తించిన దానిని, తిరిగి పొందును. అటుపై అతడు ప్రపంచమునందు తాను భగవత్పుత్రుడ నను భావముతో జీవించును. విశ్వమంతయు పరమాత్ముని వ్యక్తీకరణమే, ఆ చిదానందమునుండి యావిర్భవించిన లీలయే, మాయామాత్రము కాదు, అని గుర్తించును. ఈ విధముగ విజ్ఞాని సకల ప్రపంచముయొక్క పరమాత్మునియందలి యైక్యమును తెలియును. అంతియగాక తన పరివర్తితాహంకార ప్రభావమున భగవంతునితో అత్యంత ప్రియబాంధవ్యము ననుభవించుచు భగవల్లీలయందు తనను భాగస్వామిగ భావించుకొనును. అజ్ఞానము భవబంధముల నుండి జీవులను రక్షించు భగవత్కార్యమునందు భగవంతుని ప్రతినిధిగ భగవత్సేవ, పరవశము నిష్కామము అగు భగవత్ప్రేమ, విజ్ఞానికి ముఖ్య లక్షణము లగును.

ఇందలి యుద్దేశమును అర్థము చేసికొనుటకు భాగవతము నందలి కొన్ని యుదాహరణములు ఉపయోగకరములు కావచ్చును.

1. కపిలవచనము (3-25 : 32-33) : ఇంద్రియములు బాహిరమగు విషయ విజ్ఞానము నిచ్చును, వైదికము లౌకికము అగు కర్మల యందు ప్రవృత్తములై యుండను. ఆధ్యాత్మిక సాధన ద్వారా వానిని పరిశుద్ధము చేసినపుడు అవి ఏకీకృతమై పరమాత్మ నిష్ఠితమైన మానసిక స్థితిగ ప్రకటితము లగును. అట్టి మానసిక స్థితి స్వభావగుణమువలె సహజముగ ఇతర వాంఛారహితమై వెలయును. అట్టి మానసిక స్థితినే భక్తియందురు. అది ముక్తికంటెను శ్రేష్ఠమైనది. అగ్ని సకల వస్తువులను దహించినట్లే అట్టి భక్తి ఆత్మయొక్క అజ్ఞానకోశములను దహించును.

2. రుద్రవచనము (6-17-28) : పరాత్పరుడగు నారాయణునందే ప్రపన్నులైనవారు సకల భయములనుండియు నివృత్తులగుదురు, స్వర్గము నరకము మోక్షము మొదలగు వానిని వారు సమదృష్టితో జూతురు. ఏలన అన్ని యవస్థలందును ఎల్లెడలను వారు నారాయణునే చూతురు.

3. సూతవచనము (1-7-10) : అహంకారము మొదలగు హృదయగ్రంథులను ఛేదించినట్టియు నిరంతరము ఆత్మానందనిష్ఠులైన వారును అగు మహామునులుకూడ పరాత్పరుని యందు నిష్కామభక్తిని కలిగియుందురు. శ్రీహరి గుణవిశేషము లట్టివి.

4. శ్రీకృష్ణవచనము (11-20. 32-24) : నాయందు భక్తి గలిగి నిరంతరము నాయందే మనస్సు నిలిపిన సాధకుడు భక్తివలననే ఉన్నతతమ మగు ఆధ్యాత్మిక సాక్షాత్కారమును బడయును. అతడు ప్రత్యేకముగా జ్ఞానమును వైరాగ్యమును సాధింపబనిలేదు. వేదకర్మలచే గాని తపము జ్ఞానము వైరాగ్యము యోగములచేగాని దానము మొదలగు ఇతర సాధనములచేగాని సాధింపదగిన పరమార్థమేదైనను దేవ

లోకమో మోక్షమో వైకుంఠమో—అవి యన్నియు భక్తిమార్గమున నా భక్తు డనాయాసముగ పొందును. కాని దృఢచిత్తులగు ఈ పుణ్యపురుషులు నాయందలి తదేకమైన భక్తిచే, నేనే స్వయముగ అనుగ్రహించినను జననమరణ రహితమైన మోక్షమును కూడ వాంఛింపరు.

5. అత్యున్నత శ్రేణియందలి భక్తుల యౌన్నత్యమును గూర్చి శ్రీ కృష్ణు డిట్లనుచున్నాడు. (9-4-63-68): మహర్షీ! నా భక్తులకు వశుడనై యుండుటచేత నేను స్వతంత్రుడను కానట్లే. నా హృదయము వారి యధీనమై యున్నది. నన్నే పరంధామముగ స్వీకరించిన ఈ పుణ్యపురుషులను తిరస్కరించి, నన్నే అననేల, నిరంతరము నా సన్నిధినే యుండు శ్రీదేవినైనను నేను గణింపను. వారి ఇల్లు వాకిండ్లను బంధుమిత్రులను భార్యాపుత్రులను చివరకు జీవితేచ్ఛను సైతము త్యజించి నన్నే శరణుజొచ్చిన నా భక్తులను నేనెట్లు పోద్రోతును? నాయందు ప్రగాఢమగు ప్రేమగలిగి, అన్నిటియందును నన్నే చూచు పావనచరితులు పతివ్రత యగు భార్య ధర్మవర్తనుడైన భర్తను వలెనే నన్ను గెలిచికొందురు. నా సేవచేత జీవనసార్థక్యమును బడసి, నా సేవ చేయుట చేతనే వారికైన సాలోక్యాది చతుర్విధ మోక్షములనే వారు గణింపరు. ఇక నశ్వరములైన ఈ ప్రాపంచిక భోగములన వారి కేమి లెక్క? నిజముగ అట్టి పుణ్యమూర్తులే నా హృదయము. నేనే వారి హృదయమును. వారు నన్నే తప్ప నితరము నెఱుగరు. నేనును వారినే తప్ప నితరము నెఱుగను.

---

# వార్తలు - విశేషాలు

## శ్రీ రామకృష్ణ శారదాశ్రమము

### (పొన్నంపేట, కూర్గు, కర్ణాటకము)

1972-74 సంవత్సరముల నివేదిక.

పొన్నంపేట యందలి శ్రీరామకృష్ణ శారదాశ్రమము 1927-వ సంవత్సరమున బేలూరు మఠము శాఖగా ప్రారంభింపబడెను. నిత్యపూజాభజనలును, ప్రతివారము మతసంబంధముల కుతరగతులును ఆశ్రమమునందు జరుపబడుచున్నవి. ఉభయ ఏకాదసులయందును శ్రీరామనామసంకీర్తనము ఆధ్యాత్మిక ముఖ్యాంగముగ ఆశ్రమమున పాటింపబడుచున్నది. శ్రీ రామకృష్ణ గురుదేవుడు, శ్రీ శారదాదేవి, శ్రీ వివేకానందస్వామి—వీరి జన్మదినోత్సవములు ప్రత్యేకపూజ, భజన, ఉపన్యాసములుమున్నగు నంశములతో కొనియాడబడుచున్నవి. విద్వాంసుల హరికథాకాలక్షేపములు మున్నగు నంశములతో గూడిన సాంవత్సరిక మహోత్సవములు కూర్గునందలి వివిధ ప్రాంతీయులను తండోపతండములుగ ఆకర్షించుచున్నవి. ఇంతియేకాక శ్రీకృష్ణజయంతి, వినాయకచతుర్థి, దసరాపండుగలయందు దుర్గాపూజ, గీతాజయంతి, శ్రీరామనవమి మున్నగు పవిత్ర మహోత్సవము లన్నియు కొనియాడబడుచున్నవి. ఆశ్రమమునందలి స్వాములు, ఇతర ప్రాంతములందు ఆధ్యాత్మికోపన్యాసము లొసగుచున్నారు.

### గ్రంథాలయము :

శ్రీరామకృష్ణ మఠ మిషనుల 9-వ సర్వాధ్యక్షులు శ్రీమత్ మాధవానంద స్వాముల వారిచే శ్రీరామకృష్ణ గ్రంథాలయమును, పఠన మందిరమును 1958-వ సంవత్సరమున నెలకొల్పబడినవి. ఇందు కన్నడము, హిందీ, సంస్కృతము, ఆంగ్లము, బెంగాలీ, మలయాళము మున్నగు భాషలలో 2,500 గ్రంథములు గలవు. వార్తాపత్రికలు, మాసపత్రికలు, పక్షపత్రికలు మున్నగునవియు కొలదిగా గలవు.

### శ్రీరామకృష్ణ సేవాశ్రమ వైద్యాలయము :

1942-వ సంవత్సరమున మలేరియాతో బాధపడుచున్న ఈ ప్రాంతీయులగు రోగుల అవసరములను దీర్చు నిమిత్తము హోమియోపతి వైద్యశాఖ స్థాపింపబడెను. 1947-వ సంవత్సరమున అది అలోపతిక్ వైద్యశాలగా రూపొందింపబడెను. అనంతరము స్థానిక చికిత్సావసరములను గుర్తించి 1958-వ సంవత్సరమున ప్రస్తుత వైద్యశాల నిర్మింపబడెను. ఇందు బాహిరచికిత్సాశాఖయు గలదు ప్రసవచికిత్సా శాఖయు, ఎక్స్‌రే శాఖయు, ఔషధ శాలయు నిందు గలవు. రోగుల పడకలు 50 గలవు. శస్త్రచికిత్సయు జేయుబడుచున్నది.

కూర్గునందలి ఉదారమహాశయుల సాహాయ్యమున ఈ సంస్థ దినదినాభివృద్ధి నందుచున్నదని విన్నవించుటకు సంతసించుచున్నాము. ప్రజాబాహుళ్యమునకు సేవ యొనర్చుటయందు మాకు చేయూత నిచ్చిన మహాశయులందరకు మా కృతజ్ఞతాభివందనములు.

### శ్రీ విజ్ఞానానంద కుటీర భవన ప్రతిష్ఠాపనము

శ్రీరామకృష్ణమఠము, ముతిగంజ్, అల్లాహాబాదు

శ్రీరామకృష్ణ గురుదేవుని సాక్షాచ్ఛిష్యులును, అల్లాహాబాదు కేంద్రసంస్థాపకులును అగు శ్రీమద్విజ్ఞానానందస్వాముల వారి 107-వ జన్మదినోత్సవమున, శ్రీస్వాములవారు ముప్పది సంవత్సరములుగ నివసించియుండిన నివాసభవనము పునరుద్ధరింపబడి, శ్రీరామకృష్ణ మఠ మిషనుల సర్వాధ్యక్షులు, పరమపూజ్యులునగు శ్రీమద్వీరేశ్వరానందస్వాముల వారిచే 28-11-74 ఉదయము 7 గంటలకు ప్రతిష్ఠింపబడియెను. పూజ్యస్వాములవారు సభికులనుద్బోధించుచో శ్రీమద్విజ్ఞానానందస్వాముల వారి దివ్యజీవితమునందలి మనోహరములగు ఘట్టములను, సంభవములను వివరించిరి.

ప్రస్తుత మీ కేంద్రాధ్యక్షులయిన శ్రీమద్వ్యోమానంద స్వాములవారు అల్లాహాబాదు కేంద్రము పుట్టుపూర్వోత్తరములను సంగ్రహముగ దెలియజేసిరి. శ్రీమద్విజ్ఞానానందస్వాముల వారి ఆధ్యాత్మికశక్తి నిరంతరము తమకు మార్గదర్శకమగుచున్న విధమును వివరించిరి. ముఖ్యముగా గౌరవ ఇంజనీయరు శ్రీ హెచ్. డి. భాటియా, న్యూఢిల్లీకి చెందిన వాస్తుశాస్త్రజ్ఞులు, శ్రీ జి. ఆర్. రనడే, తదితరులగు ఇంజనీయరులను సూచించుచు, ఈ భవన నిర్మాణ పరిపూర్ణతకు కారకులయిన సహృదయులకెల్లరకు వందనసమర్పణము గావించిరి. శ్రీ ఎస్. పి. కోలే, డాక్టర్ ఆర్. సి. మజుందార్, దాస్ సురేశ్ మరియు తక్కిన దాతలందఱకును తమ కృతజ్ఞతను వెల్లడించిరి.

ఈ పవిత్ర కార్యక్రమము మంగళహారతితో ప్రారంభమయి, వేదపారాయణము, ప్రత్యేక పూజా హోమములతో దినమంతయు మహోత్సవముగ జరిగెను. శ్రీమద్విజ్ఞానానంద స్వాములవారినిగూర్చి శ్రీమద్వ్యోమానంద స్వాములవా రుపన్యసించిరి. సాయంకాలిక ఆరాత్రికానంతరము శ్రీ అనిల్‌బోస్ బృందము వారు కాళీకీర్తన గావించిరి. వందలకొలది భక్తులు, మిత్రులు, ఈ కార్యక్రమమున

ప్లాని ఆ పవిత్రవాతావరణమున శ్రీమద్వీరేశ్వరానందస్వాములవారి పవిత్ర సన్నిధానమున ఆధ్యాత్మికముగ తా ముద్ధారణ గాంచినట్లు అనుభవము నందిరి.

నవంబరు 29-వ తేదీన శ్రీ విజ్ఞానానంద కుటీరమున శ్రీమ దపూర్వానంద స్వాముల వారును, అభ్యాగత స్వాములును కలిసి శ్రీరామ నామ సంకీర్తనము గావించిరి.

---

# గ్రంథపరిచయం

## శ్రీ మట్టపల్లి మాహాత్మ్యము

### (బుఱ్ఱకథ)

రచయిత : శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ కేశవతీర్థ స్వాములవారు. డిమ్మి 1/8 సైజు. (28+6) పుటలు. మూల్యము: ఒక రూపాయి. ప్రాప్తిస్థానము : శ్రీ రామతీర్థ సేవాశ్రమము, పిడుగురాళ్ల, గుంటూరుజిల్లా, ఆంధ్రప్రదేశ్.

నిజముగా పామరజనాంగమునకు మహదాశయములు బోధించుటకు మనపూర్వులచే నేర్పఱుపబడినవే బుఱ్ఱకథలు. జానపదగీతములు, గేయకథలు అనియు వీనికి నామాంతరములు. లంకాయాగము, ఊర్మిళాదేవి నిద్ర, కాటమరాజు కథ, బాలనాగమ్మ కథ మున్నగునవి యీ కోవకు జెందినవి. వీనిని జంగమకథలు అనియు వ్యవహరింతురు.

విశాలాంధ్రమున నల్లగొండజిల్లాలో, హుజూర్ నగర్ తాలూకాలో కృష్ణానదీతీరారణ్యమునగల శ్రీ మట్టపల్లి క్షేత్రము శ్రీనృసింహ క్షేత్రము. ఈ క్షేత్ర మాహాత్మ్యమునే శ్రీ స్వాములవారు బుఱ్ఱకథగా రచియించిరి. ఇందు మట్టపల్లి శ్రీనృసింహస్వామి వెలసిన విధానము, ఈ క్షేత్రప్రతిష్ఠాపనమునకు కారకుడయిన పిచ్చిరెడ్డి నామాంతరముగల మాచిరెడ్డికి భగవానుడు స్వప్నదర్శనము అనుగ్రహించి లోకసంగ్రహము చేయించిన విధానము రసవంతముగ వివరింపబడి యున్నది.

పిచ్చిరెడ్డి పెద్దకోడలు భవనాశనీదేవి జంగమ జేవరలకు తన ఒడిలోనున్న అనపవిత్తనములు దానముచేసి, మట్టినే విత్తి, బంగారపు అనుముల పండించిన కథను పఠించిన పాఠకులకు హృదయములందు భక్తిబీజము లంకురించుట తథ్యము.

ఇందలి రచనావిధానము అత్యాకర్షకము. దీనిని బుఱ్ఱకథగా నయినను పాడుకొనవచ్చును. పద్యకావ్యమువలె నయినను పఠింపవచ్చును. ఇది తమ సాధనక్షేత్రాధీశుడు, ఇష్టదైవము నయిన శ్రీనృసింహస్వామి క్షేత్ర మగుటవలన ఈ గ్రంథ రచనమున శ్రీ స్వాములవారి భక్తి ఉప్పొంగి, కవితాధార గంగాప్రవాహమువలె గంభీరముగను, ధారాళముగను సాగినది ఇందలి భాష మృదుమధురము. పదగుంఫనము హృదయంగమము. ప్రజాబాహుళ్యమునకు భక్తిని ప్రబోధించుటయే యిందలి ఇతివృత్త మగుటయు శ్రీ స్వాములవారు అందులకే జీవితము నంకితము చేసినవా రగుటయు శ్రీవారి అభీప్సితము సఫలీకృత మయినది.

శ్రీ స్వాములవా రిట్లే తమ లోకసంగ్రహమువలన ప్రజాబాహుళ్యము నుద్ధరింతురని ప్రార్థించుచున్నాము.

చిలుకూరి మాధవకృష్ణ కవి.

# శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-600004
## 1975-వ సంవత్సరము, జూన్ మాసమున జరుగనున్న
## ఉత్సవ కార్యక్రమము

ఆదివారములందు సత్సంగ సమావేశములు

అపరాహ్ణము 4-00—4-20 వఱకు శివానందలహరీ పారాయణము (1-6-75, 15-6-75, 29-6-75)
,, ,, ,, శ్రీ విష్ణుసహస్రనామ పారాయణము (8-6-75, 22-6-75)
4-20—4-30 ,, ధ్యానము
4-30—5-30 ,, తమిళమున ఉపన్యాసములు :—
శ్రీమద్భాగవతము : శ్రీ అణ్ణాగారు (1-6-75)
విష్ణుసహస్రనామము : శ్రీ వి. కల్యాణసుందరశాస్త్రిగారు (8-6-75, 29-6-75)
శ్రీమద్రామాయణము : డాక్టర్ ఎస్. వీర్రినాథన్‌గారు (15-6-75, 22-6-75)
5-35—6-30 ,, ఆంగ్లోపన్యాసములు :—
శ్రీమద్భగవద్గీత : శ్రీమత్తపస్యానందస్వాములవారు (1-6-75, 8-6-75, 15-6-75, 29-6-75)
శ్రీమద్భగవద్గీత : శ్రీమద్గభీరానందస్వాములవారు (22-6-75)
6-30—8-00 ,, ఆరాత్రికము - భజన

ప్రత్యేకోపన్యాసములు

7-6-75 శనివారము : 5-45 శ్రీమద్రామాయణ పఠనము : శ్రీ పి. రామకృష్ణన్‌గారు, ఐ.సి.ఎస్. (రిటైర్డు)
21-6-75 ,, 5-30 శ్రీరామకృష్ణగురుదేవుడు (సంగీతప్రవచనము) శ్రీ హెచ్. రామచంద్రరావుగారు
28-6-75 ,, 5-45 శ్రీమద్రామాయణము : డాక్టర్ ఎస్. వీర్రినాథన్‌గారు

ఇతర వారములందు ఉపన్యాసములు : అపరాహ్ణము 5-45 గంటలకు

| | |
|---|---|
| సోమవారములు : | విష్ణుసహస్రనామము (ఆంగ్లము) శ్రీమత్ వీతమోహానందస్వాములవారు |
| మంగళవారములు : | అధ్యాత్మరామాయణము (ఆంగ్లము) శ్రీమత్ గభీరానందస్వాములవారు |
| బుధవారములు : | శ్రీమద్భాగవతము (ఆంగ్లము) శ్రీమత్ గోలోకానందస్వాములవారు |
| గురువారములు : | అముదమొళ్ళి (తమిళము) శ్రీమత్ శ్రీరంగానందస్వాములవారు |
| శుక్రవారములు : | ఆత్మబోధ (తమిళము) శ్రీ ఆర్. రామకృష్ణన్‌గారు |

22-6-75 ఆదివారము : అంతర్యోగ సాధన

ఉభయ ఏకాదశులయందు సాయంకాలిక ఆరాత్రికానంతరము శ్రీరామనామ భజన (5-6-75; 19-6-75)

శ్రీ ఫలహారిణీ కాళీపూజ (9-6-75 సోమవారము) ఆరాత్రికానంతరము

శ్రీ స్నానపూర్ణిమ (23-6-75 సోమవారము)

శుక్రవారములందు సాయంకాలము 6-30 గంటలకు తిరువళ్ళిక్కేణియందలి దక్షిణమాడవీధియందు 18-వ నంబరుగల రామకృష్ణ మందిరమున శ్రీమత్ గోలోకానందస్వాములవారి భగవద్గీతోపన్యాసములు.

ఈ ఉత్సవము లన్నింటియందును భక్తులెల్లరును పాల్గొని భగవంతుని అనుగ్రహభాగ్యమును బడయగోరుచున్నాము.

అధ్యక్షులు,
శ్రీరామకృష్ణమఠము, మద్రాసు-600004.

సంపాదకులు: శ్రీ చిద్ఘనానందస్వామి.

శ్రీ ఎస్. శాంతముకసుందరంగారిచే శ్రీదస్ ప్రెస్, (మద్రాసు-600021) న ముద్రితమై,

శ్రీ చిద్ఘనానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మద్రాసు-600004) నుండి ప్రచురింపబడినది.

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౩౧ ౧౯౭౫ - జూన్ : రాక్షస - జ్యేష్ఠము సంచిక ౧౨

## విషయసూచిక

ఫోన్ : 71231 పోస్టు బాక్సు : 635

మా మాసపత్రికలు

# వేదాంతకేసరి

తత్త్వశాస్త్ర - మత - సంస్కృతివిషయకంగా 1914-వ సంవత్సరంనుండి వడపబడుతుండే ఆంగ్ల మాసపత్రిక

| | ఇండియాలో | శ్రీ లంకలో | అమెరికాలో | ఇతర విదేశాలలో |
|---|---|---|---|---|
| సాలు చందా : | 8 రూపాయలు | 10 రూపాయలు | 4 డాలర్లు | 1 పౌను |
| జీవిత చందా : | 150 ,, | 200 ,, | 70 ,, | 18 పౌనులు. |

# శ్రీ రామకృష్ణ విజయం

మత - సాంస్కృతికవిషయకంగా 1921-వ సంవత్సరమునుండి ప్రచురింపబడుతున్న తమిళ మాసపత్రిక

| | ఇండియాలో | శ్రీ లంకలో | అమెరికాలో | ఇతరవిదేశాలలో |
|---|---|---|---|---|
| సాలు చందా : | 7 రూపాయలు | 9 రూపాయలు | 3 డాలర్లు | £ 0-70 |
| జీవిత చందా : | 100 ,, | 150 ,, | 50 ,, | 12-పౌనులు. |

# శ్రీ రామకృష్ణ ప్రభ

1944-వ సంవత్సరంనుండి ప్రచురింపబడుతూ విశ్వోపజీవ్యమైన ఆధ్యాత్మిక విజ్ఞానామృతమును వెదజల్లే తెలుగు మాసపత్రిక

| | ఇండియాలో | శ్రీ లంకలో | అమెరికాలో | ఇతరవిదేశాలలో |
|---|---|---|---|---|
| సాలు చందా : | 7 రూపాయలు | 9 రూపాయలు | 3 డాలర్లు | £ 0-70 |
| జీవిత చందా : | 100 ,, | 150 ,, | 50 ,, | 12-పౌనులు. |

1. చందాదారులు ఉత్తరప్రత్యుత్తరాలలో తమ 'చందాదారు సంఖ్య' నుదాహరిస్తూ విలాసాలను స్పష్టంగా వ్రాయాలి.
2. పత్రిక అందకపోతే మాసాంతానికి మాకు తెలుపాలి.
3. చందాదారులకు మేము ప్రచురించిన గ్రంథాలను $6\frac{1}{4}\%$ తగ్గింపు ధరలకు అందజేస్తాం. వివరాలకు క్రింది విలాసానికి వ్రాయండి.
4. ప్రముఖ సంస్కృతి కేంద్రాలలో ప్రచారంలో ఉన్న యీ ఆధ్యాత్మిక విజ్ఞాన పత్రికలు అడ్వర్టైస్మెంట్లకు చక్కని సాధకాలు. రేట్లకు వ్రాయండి.
5. సమీక్షకు గ్రంథాలు పంపేటప్పుడు రెండేసి ప్రతులు పంపవలసినదని గ్రంథకర్తలకు ప్రకాశకులకు మా ప్రార్థన.
6. ప్రజారంజకములైన మత - తత్త్వశాస్త్ర - సంస్కృతివిషయిక స్వతంత్ర వ్యాసాలను రచయితలు అందజేస్తే సంపాదకులు కమ్మిల కద్దుకొని ప్రచురిస్తారు.
7. పత్రిక స్పెసిమెన్కాపి కోరేవారు 75 పైసల పోస్టేజి పంపాలి.

ఇంకా వివరాలు కావలసినవారు :

మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠం, మైలాపూరు, మద్రాసు-600004

అనే విలాసానికి వ్రాయండి.

'అఖిలవిధు శరణొందుము, యీ క్షణంబ యతనికృప నీదు వనుభూతి కందు వత్స'

—శ్రీ శారదామణి.


# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౩౧ } ౧౯౭౫ - జూన్ :: రాక్షస - జ్యేష్ఠము { సంచిక ౧౨


ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ!

## ప్రార్థన

## శ్రీ రామకృష్ణ కర్ణామృతము

శ్లో. పౌరస్త్య పశ్చిమ పరిష్కృతి సింధుయుగ్మమ్। సంధాయ సర్వవిధ ధర్మనదీః ప్రవాహ్యా
గౌర్యా స్వదేహ కృతిరైష సుతోపి భాతి। భూమండలస్య సకలస్య చ మానదండః.

తే. గీ. ప్రాచ్య పాశ్చాత్య సంస్కృతీ వాహినీద్ధ, సంగమము సర్వవిధధర్మ సరిదమోఘ
మూలమును సర్వమంగళాపుత్త్రుఁడు నగు, రామకృష్ణుండు హిమవంతు రమణ దివ్య
మానదండమై వెలయు భూమండలమున. (పంచపది)

వ్యాఖ్య :- ప్రాచీ ప్రతీచీ సంస్కృతులను నదీద్వయమునకు పవిత్ర సంగమస్థానమును, సమస్త ఆధ్యాత్మిక ధర్మనదులకు మూలమును, సర్వమంగళా పుత్త్రుడును అయిన శ్రీరామకృష్ణ గురుదేవుడు హిమవంతుని వలె సమస్త భూమండలమునకును పవిత్రతా మానదండమై ప్రకాశించుచున్నాడు.

శ్లో. న విద్యతే యస్యగుణేషు సంగో। న లిప్యతే కర్మ శుభాశుభైర్యః
య స్సర్వ భోక్తాఽఖిల కర్మకర్తా। జగద్గురు ర్భాతి స రామకృష్ణః.

తే. గీ. పొంగు ప్రకృతి గుణాళి నసంగుఁడెవఁడొ!, యిఁక శుభాశుభకర్మల నెవఁ డలిప్తుఁ
డల గదాయి! జగద్గురుం డఖిలకర్మ, భోక్తయును కర్తయునుగాఁగ భువిని వెలయు.

వ్యాఖ్య :- ఏ మహాత్ముడు ప్రకృతిగుణగణములయం దసంగుడో, సమస్త శుభాశుభకర్మలయం దేపుణ్యాత్ముడు అలిప్తుడో, ఆ శ్రీరామకృష్ణ జగద్గురుడు సమస్త విశ్వమునకును భోక్తయును కర్తయునై ప్రకాశించుచున్నాడు.

# శ్రీ గురు సూక్తి సుధ

స్వయంకృతమైన ప్రశ్న : భగవంతుడు అవతారముగ ఏల అవతరించునో నీకు తెలియునా ?

శ్రీరామకృష్ణులు : మానవశరీరముద్వారా ఆయన మాటలను మానవుడు వినవచ్చును గనుక. దానిద్వారా భగవంతుడు క్రీడించును. అతడు మానవశరీరముద్వారా బ్రహ్మానందము ననుభవించును. కాని అతని ఇతర భక్తుల ద్వారా భగవంతుడు తనయొక్క చిన్న యంశమును మాత్రమే వ్యక్తీకరించును. భక్తుడనగా చాలసేపు పీల్చగా ఏ కొంచెపు రసమునో ఇచ్చు వస్తువులవంటివాడు—చాలసేపు పీల్చగా ఒక బొట్టు తేనె నిచ్చు పూవువంటి వాడు.

స్వయంకృతమైన ప్రశ్న : కాని నేనెవరను ?

శ్రీరామకృష్ణులు : అంతయు ఆయనయే. నేను యంత్రమును. ఆయన యంత్రి—యంత్రమును నడపువాడు. (తన శరీరము నుద్దేశించుచు) ఇందుండునది భగవంతుడే. అందువలననే ఇందఱు జనులు దానివైపునకు అధికాధికముగ ఆకర్షితులగుచున్నారు. వారి యాధ్యాత్మిక తను జాగరితము చేయుటకు ఒక స్పర్శమాత్రము చాలును, ఈ ఆకర్షణ ఈలాగుండుట భగవంతుని ఆకర్షణయే. మరి యెవ్వరిదియు కాదు.

బెల్ఘారియా వాస్తవ్యుడగు తారక్ దక్షిణేశ్వరమునుండి ఇంటికి పోవుచుండెను. ఒక జ్యోతివంటిది (తన శరీరము నుద్దేశించుచు) దీనినుండి వెలువడి అతని ననుసరించెను. కొన్ని దినముల పిమ్మట తారక్ దక్షిణేశ్వరమునకు తిరిగి వచ్చెను. ఈ శరీరమున నివసించువాడు సమాధి అవస్థలో తన పాదమును తారక్ రొమ్ముపై నుంచెను,

సరి, ఇటువంటి యువకులు ఇంకను గలరా ?

మ : మోహిత్ చాల మంచి బాలుడు. ఒకటి రెండు పర్యాయములు అతడు మిమ్ము చూచుటకు వచ్చెను. రెండు విశ్వవిద్యాలయ పరీక్షలయందు ఉత్తీర్ణుడగుటకు చాలినన్ని పుస్తకములను చదువుచున్నాడు. దేవునికొఱకు అతని కొంతయో ఆరాటము.

శ్రీరామకృష్ణులు : కావచ్చును. కాని అతడు ఉన్నతస్థాయికి చెందినవాడు కాడు. అతని శారీరకలక్షణములు అంత మంచివి కావు. అతనిది చప్పిడిముఖము. కాని ఈ ఇతర యువకులు ఉన్నతస్థాయికి చెందినవారు.

భౌతిక శరీరమున జన్మించుట ననుసరించి ఎన్నియో కష్టనష్టములు వచ్చును. అంతియగాక అతడు శపింపబడినచో ఏడు పర్యాయములు జన్మింపవలసి రావచ్చును. మానవుడు చాల జాగ్రత్తగ నుండవలెను. ఏ కొంచెపు కోరిక యున్నను మానవుడు మానవశరీరమును మరల పొందవలసివచ్చును.

ఒక భక్తుని ప్రశ్న : భగవదవతారములగు వారి కేమి కోరిక లుండును ?

శ్రీరామకృష్ణులు : (చిరునవ్వుతో) నా కోరికలు నేను వదలించుకొనలేదని తెలిసికొనుచున్నాను. ఒకపరి ఒక మహాత్ముని శాలువను చూచితిని. అటువంటి దానినే ధరింపవలెనని నాకు కోరిక కల్గెను. ఇప్పటికిని నాకా కోరిక కలదు. దానికొఱకై నేను మరల జన్మింపవలెనేమో నాకు తెలియదు.

బలరామ్ : (చిరునవ్వుతో) మరి ఆ శాలువ కొఱకు మాత్రమే మీరు మరల జన్మింతురా ?

శ్రీరామకృష్ణులు : దానినే ధ్యానించుచు శరీరత్యాగము చేయుటకై ఒక మంచి కోరిక

నుంచుకోవలెను. సాధువులు దర్శింపవలసిన నాలుగు పుణ్యక్షేత్రములు కలవు. వారు మూడింటిని దర్శించి ఒక దానిని వదలుదురు. జగన్నాథుని ధ్యానించుచు శరీరత్యాగము చేయ గలుగుటకై చాలమంది పూరిని జగన్నాథక్షేత్రమును వదలిపెట్టుదురు.

డాక్టర్ సర్కార్ ప్రశ్న: కాని పరిపూర్ణ జ్ఞానమును శాశ్వతముగ నుంచుకొన గలుగునా? అంతయు భగవంతుడని మీరందురు. అయినచో మీరీ పరమహంస ఉద్యోగము నేల చేబట్టితిరి? ఈ జనులు మీ సేవ చేయుట ఏల? మీరేల మాటలాడక కూర్చుండరు?

శ్రీరామకృష్ణులు: నిశ్చలముగ నున్నను కదలుచున్నను తరంగితమగుచున్నను నీరు నీరే.

నేను నీకింకొక విషయము చెప్పవలెను. మావటి నారాయణుడు చెప్పునది నేనేల వినరాదు? శిష్యునకు అంతయు నారాయణుడే అని గురువు బోధించెను. ఒక పిచ్చిపట్టిన ఏనుగు శిష్యునివైపు వచ్చుచుండెను. కాని అతడు గురు వచనములను నమ్మి అటనుండి కదలి పోలేదు. ఈ ఏనుగు నారాయణుడే అని తలచెను. మావటి 'తొలగు తొలగు' మని యరచెను. కాని శిష్యుడు కదలలేదు, ఏనుగు వాని నెత్తి విసరివైచెను. శిష్యుడు పూర్తిగా చావలేదు. ముఖముపై నీరుచల్లిన పిమ్మట స్మృతి కల్గెను. ఏల తొలగి పోలేదని యొకరడుగగా నేనేల తొలగవలెను? గురువుగారు అంతయు నారాయణుడే అని చెప్పిరి గదా! అని శిష్యుడనెను. ''కాని నాతండ్రీ, మావటి నారాయణునిమాటలను నీవేల వినవైతివి?'' అని గురువు పల్కెను.

లోపల పరిశుద్ధచిత్తముగను స్వచ్ఛముగు బుద్ధిగను వసించునది భగవంతుడే. నేను యంత్రమును అతడు చోదకుడు. నేను గృహమును అతడు గృహమునందుండువాడు. భగవంతుడే మావటి నారాయణుడైనాడు.

డాక్టరు: నన్నొక ప్రశ్న నడుగనిండు. మీ జబ్బును కుదుర్చుమని నన్నేల యడిగెదరు?

శ్రీరామకృష్ణులు: అహంకారమను కుండ స్మృతియందున్నంతకాలము నేనట్లు మాటలాడుదును. అంతులేని సముద్రమునీరు నలుదిక్కులను నీటితోనిండియుండు దానినిగూర్చి యాలోచింపుము. దానియందొక కుండ మునచబడినది కుండ లోపలను వెలుపలను కూడ నీరు కలదు. కాని కుండ పగిలిననే కాని ఆ నీరు ఒకటి కాజాలదు. ఈ అహంకారమను కుండను నాలో ఉంచినది భగవంతుడే.

# భక్తిరత్నావళి

మూలము: **శ్రీవిష్ణుపురి**

వ్యాఖ్యాత: **విష్ణుచిత్తుడు**

(ప్రథమ విరచనము)

## 52-53

పసిబాలురకైనను భక్తి సులభసాధ్యమని ప్రహ్లాదుడు విశదము చేయుచున్నాడు.

**నహ్యచ్యుతం ప్రీణయతో బహ్వాయాసోఽసురాత్మజాః**
**ఆత్మత్వాత్సర్వభూతానాం సిద్ధత్వాదిహసర్వతః.** (7-6-19)

కోఽతి ప్రయాసో ఽసురబాలకా హరేరుపాసనే స్వేహృది ఛిద్రవత్సతః
స్వస్యాత్మనః సఖ్యు రశేష దేహినాం సామాన్యతః కిం విషయోపపాదనైః. (7-7-38)

రాక్షసపుత్రులారా! అచ్యుతుని ప్రీతుని జేయుటయందు శ్రమయే లేదు. సర్వజీవుల కతడంతర్యామి యగుటచేత నెల్లరకును సన్నిహితుడు.

బాలులారా! ఆకాశమువలె సర్వవ్యాపియగు శ్రీహరియందు భక్తి నెఱపుట కష్టముకాదు. అతడు ప్రాణములకు ప్రాణము. ఆత్మకాత్మ. సకలప్రాణుల కతడు హితుడు. అట్టి యతనిని వదలి పశుపక్ష్యాదులు సైత మనుభవించు విషయసుఖములను గోరిన నేమి ప్రయోజనము?

## 54-55

అందువలన క్షణికములగు ప్రాపంచిక విషయములను వదలి శ్రీహరిని గొలువుడని ప్రహ్లాదు డుద్బోధించుచున్నాడు.

రాయః కలత్రం పశవః సుతాదయో గృహామహీ కుంజర కోశభూతయః
సర్వేఽర్థ కామాః క్షణభంగురాయుషః కుర్వన్తి మర్త్యస్యకియత్ ప్రియం చలాః
ఏవం హి లోకాః క్రతుభిః కృతా అమీక్షయిష్ణవః సాఽతిశయాన నిర్మలాః
తస్మాదదృష్ట శ్రుతదూషణం పరం భక్త్యైక యేశం భజతాత్మలబ్ధయే. (7-7-39,40)

ధనకనక వస్తువాహనములు భార్యాపుత్రులు మిద్దెలు మేడలు భూములు పశు సంపదలు మొదలుగాగల క్షణిక విషయములు అల్పమును క్షణభంగురమును అగు జీవితమున మానవునకేమి సత్యమగు నానందము నొడగూర్పగలవు!

అట్లే కామ్యకర్మలగు యజ్ఞయాగాదికములచే సాధ్యములగు నుత్తరలోకములు గూడ ననిత్యములు, కల్మషదూషితములు సవికారములు. కనుక పరాత్పరుడును అక్షరుడును నిష్కల్మషుడును అగు శ్రీహరిని మోక్షార్థమై ప్రీతిపూర్వకమగు భక్తితో నర్చింపుడు.

## 56

స్వార్థకామములు లేక భక్తితో అతనియం దనురాగముతో భగవంతు నర్చింప వలెనని ప్రహ్లాదు డనుచున్నాడు.

తస్మా దర్థాశ్చ కామాశ్చ ధర్మాశ్చా యదపాశ్రయాః
భజతానీహ యాత్మానమనీహం హరి మీశ్వరమ్. (7-7-48)

కనుక స్వార్థరహితులై నిస్స్వార్థుడును పరాత్పరుడును అగు శ్రీహరి నర్చింపుడు. ధర్మార్థ కామప్రాప్తి యతని ఇచ్ఛ ననుసరించియే యుండును.

గమనిక : స్వార్థమును వదలి శ్రీహరి నర్చించువానిపై అడుగకయే ప్రాపంచిక భోగములనుగూడ అతడు వర్షింపవచ్చునని యభిప్రాయము. భక్తుడు తనకేది శ్రేయస్కరమో శ్రీహరికి తెలియునను విశ్వాసముతో నుండవలెను.

# వైరాగ్యము - సాంఘికజీవనము

## శ్రీ రామకృష్ణానందస్వామి "గీతావాణి" సంపాదకులు
## అధ్యక్షులు - అఖిల ఆంధ్ర సాధుపరిషత్తు

ఈనాడు భారతజాతికి యేర్పడిన పతన దశకు భారతీయుల వైరాగ్యపద్ధతియే హేతువని ఆధునికులు కొందఱు విమర్శించుట కలదు. బుద్ధుని వైరాగ్యము శ్రీ శంకరులవారి సంన్యాసము సాధువుల ఔదాసీన్యపద్ధతి భారతజాతి యొక్క ఉన్నతికి అభిశాపమై సోమరితనానికి ఆలవాలమై పరదాస్యమునకు పాల్పడ జేసినదని కొందఱి విమర్శ. అందువలన వైరాగ్యము సాంఘికజీవనమునకు అనావశ్యకమే కాదు; అనర్థకరమని కూడ వారి అభ్యూహ.

సత్యమును దుర్వినియోగము చేసుకొను వారెప్పుడును నున్నారు. అంతమాత్రమున సత్యమును గర్హించుట బుద్ధిమంతుని లక్షణము కాదు. ఇంటిలో ఎలుకలున్నవని యింటికి నిప్పంటించువాడు వివేకి కాలేడు. యోగ్యవస్తువైనను అనధికారి పాలబడి తన యోగ్యతలో న్యూనతను బొందుట సహజము. అందుకయ్యే అధికారినిచూచి వస్తువును ఇవ్వవలెనని పదింబది శాస్త్రములు ప్రబోధించుటలో తాత్పర్యము.

ఈ విషయమును పురస్కరించుకొని శ్రీ రామకృష్ణప్రభా సంచాలకులు వైరాగ్యమును సాంఘిక జీవనమును సమన్వయించి ఆధునిక యుగమునకు ఒక సమాధానమును అందించుచున్నారు. పరమ వైరాగ్యమూర్తి కామ కాంచన త్యాగమునకు పరాకాష్ఠస్థితినొందిన పరమహంస శ్రీ రామకృష్ణదేవుడే తన జీవితముద్వారా యీ సమన్వయమును లోకమునకు అందించి యున్నాడు. శ్రీ వివేకానంద స్వాములవారు తన ప్రబోధముల ద్వారా సనాతనులకును ఆధునికులకును మధ్యభావసమన్వయసేతువును నిర్మించియున్నారు.

"రాగము - రోగము; విరాగము - ఆరోగ్యము" అని శ్రీరామతీర్థస్వాములవారి సందేశము. నిజమగు లోకసేవ విరాగవంతుడు చేయగలడు కాని రాగవంతుడు చేయలేడు. స్వార్థపరుని సేవ కసాయివాడు గొఱ్ఱెకుచేయు సేవ వంటిది. "శివాజీ! నీ రాజ్యములో భిక్షావృత్తిని అధికము చేయు"మని సమర్థరామదాసస్వామి తన శిష్యుడగు ఛత్రపతి శివాజీ మహారాజుకు ఆదేశమొసంగినాడట. "తీసుకొనుట కొంచెము; ఇచ్చుట అధికము" ఈ పద్ధతికే భిక్షావృత్తి యని పేరు.

లోకములో బ్రతుకు తెరువుకు వృత్తులు మూడు. మొదటిది భిక్షావృత్తి; రెండవది వ్యాపారవృత్తి; మూడవది చోరవృత్తి. తీసుకొనినవానికి సమానముగ నిచ్చుట వ్యాపారవృత్తి. ఇది లోకనీతికి అనుకూలమైన వృత్తి. ఎక్కువ తీసుకొనుట తక్కువ యిచ్చుట, లేదా యిచ్చుటనునదే లేక తీసుకొనుట మాత్రమే కావలెనను పద్ధతి చోరవృత్తి. ఈ వృత్తి లోకానికి అనర్థకరమైనది. ఇక సర్వోత్తమమైనవృత్తి భిక్షావృత్తి. అల్పము తీసుకొనుట అధికము ఇచ్చుట, యిదియే భిక్షావృత్తి యను మాటకు అర్థము.

తిరుపతిలో జరిగిన విశ్వహిందూపరిషత్తు మహాసభలో ఉడిపి శ్రీ విశ్వేశతీర్థస్వాములవారు క్రింది విధంగా సెలవిచ్చినారు: "సమాజము కొలనువంటిది; సాధువులు చేపలవంటి వారు. చేపలు తిరుగుటలో కొలను శుభ్ర

మగును; సాధువులు సంచరించుటతో సమాజము శుద్ధినొందును.''

వైరాగ్యమనిన ఒక వేషముకాదు. చిత్తమందు రాగము లేకపోవుటే వైరాగ్యము. రాగము చిత్తమాలిన్యము; విరాగము చిత్తశుద్ధి. సరళజీవనము ఉన్నతవిచారము నిర్విషయానందము వైరాగ్యవంతుల లక్షణము. అట్టివారే సాధువులు. అట్టి సాధువులతో సమాజమునకు ఉత్తమప్రేరణ ఉన్నతాదర్శము లభించగలదు. అట్టివారే ఉత్తమసేవకులు. ఉత్తమసేవ యనిన కొంచెము తీసుకొని గొప్ప యిచ్చుట. కావుననే ''గో బ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యం'' అని మనము నిత్యమును పఠించుచున్నాము. గోవులు గడ్డితిని పాలను యిచ్చును; బ్రాహ్మణులు అనగా త్యాగులు అల్పము తీసుకొని అధికము నిత్తురు; అన్నమునకు బదులు అమృతము నొసంగుదురు.

''కౌపీనవంతః ఖలు భాగ్యవంతః'' అని శ్రీ శంకరాచార్యులవారు చెప్పిన మాటలోని సత్యమును గ్రహించిన వారెందరున్నారు? కౌపీనవంతుడను మాటకు గోచిపెట్టుకొను వాడని అర్థముకాదు. అవసరములు తగ్గించుకొనువాడని అర్థము. ఇంద్రియములను జయించినవాడని అర్థము. అవసరములు పెంచుకొనుట భోగసంస్కృతి; అవసరములను తగ్గించుకొనుట త్యాగసంస్కృతి. త్యాగులు యెక్కువైనచో అదే కృతయుగము; భోగులు యెక్కువైనచో అదే కలియుగము.

శ్రీమన్నారాయణ అగర్వాల్ అమెరికా వెళ్లినాడట. మీ దేశములోని విశేషమేమని అమెరికావాసులు ఆయనను అడిగినారట. ''ఈ కాలములో కూడా కామకాంచనముల ఆకర్షణకు లోబడని త్యాగులు మా దేశములో ఉన్నారు. అదే మా దేశముయొక్క విశేష'' మని ఆయన సమాధాన మొసగినారట. ఈ మాటను శ్రీ అఖండానందసరస్వతీస్వామివారు తమ నారదభక్తిసూత్రముల వివరణములో సెలవిచ్చియున్నారు.

''వైరాగ్యమేవాభయం'' — అభయజీవనమునకు వైరాగ్యము ఆధారభూమియని భర్తృహరి మహాకవి సెలవిచ్చియున్నాడు. ఆకాశమువలె ఆదిత్యప్రకాశమువలె వైరాగ్యవంతుని జీవితము సంఘమునకు ఆదర్శమూ ఆరోగ్యదాయకమూనై యున్నది. అట్టి వైరాగ్యమును సరిగా అర్థము చేసికొనలేక భోగవాసనాలంపటులు పాశ్చాత్యసంస్కృతీవిదగ్ధులు అర్ధదగ్ధులూనైన మన్యంమన్యులు సాంఘిక జీవనానికి వైరాగ్యము పనికిరానిదిగ భావించుచున్నారు.

శ్రీరామకృష్ణమఠమువారు వైదిక సంస్కృతికి పట్టుగొమ్మ లయిన త్యాగవైరాగ్యముల గొప్పతనమును సాంఘిక జీవితమునకు దాని యొక్క ఆవశ్యకతను తమ నిర్మాణాత్మక కార్యక్రమములద్వారా నిరూపించుచునే యున్నారు. మా సాధుపరిషత్తుకూడ ఆ రంగును హృదయములకు రంగరించుకొని ''సత్రాభోజన్ మఠ నిద్ర'' అనే అపవాదును నిర్మూలించుటకు ప్రయత్నింతురని ఆశించుచున్నాను.

''సబ్ కో సన్మతి దే భగవాన్''

ప్రభాప్రసారము

(సంపాదకీయము)

# వైరాగ్య దృష్టి

శరీరపోషణకై మన మే కార్యమును జేయ రాదని కాదు వైరాగ్యముయొక్క తాత్పర్యము. వైరాగ్యమనునది ముఖ్యముగా మనస్సంబంధమైనది. 'నేను' 'నాది' యనునవి మానసిక పాశములు. ఈ పాశములచే శరీరముతోడను ఇంద్రియములతోడను బంధింపబడనియెడల మన మెచ్చటనున్నను ఏమిచేయుచున్నను విరక్తులమే. ఒకడు రాజ్యాధిపతియైయుండియు పరమవిరక్తుడుగను మఱియొకడు చింపిగుడ్డలను గట్టుకొనియు పరమరక్తుడుగను ఉండవచ్చును. మొట్టమొదట మనము వైరాగ్యమును సంపాదించి పిమ్మట కర్మాచరణ దక్షులము గావలయును. వైరాగ్యము కష్టసాధ్యమనుట వాస్తవమే. వైరాగ్యసాధనకు రెండు మార్గములు కలవు. ఇందొకటి భగవంతునియందుగాని మఱియెట్టి బాహ్యసాహాయ్యమునగాని నమ్మకము లేనివారలకై ఉద్దిష్టమగు మార్గము. "నేను విరక్తుడను గావలయును" అను దృఢనిశ్చయమును బూని వారు తమ మనోబలముతో వివేకబలముతో కృషిచేయవలసియున్నది. భగవంతునియందు విశ్వాసముగలవారు తమ కర్మఫలములను భగవంతునకు సమర్పించి సంగరహితులై కర్మమొనర్తురు. మన మే కర్మమొనర్చినను దాని వలన స్వలాభమునుగాని పరులచే స్తుతినిగాని ఆశింపకుందుముగాక. సర్వమును భగవంతునిదే, కర్మఫలమును భగవంతునికే సమర్పింపుము. ఆత్మార్పణము మనకు అలవాటగువరకు అనుక్షణము మన శరీరమంతయు ఆత్మార్పణభావమున కఠినమగు పర్యంతము రేయింబవళ్లు భగవానునకు మనలను మనము సమర్పించుకొందముగాక.

—శ్రీవివేకానందస్వామి.

ఎల్లరును ఆనందమునే కోరుదురు, దుఃఖమును కోరరు. అయినను అందరును దుఃఖమును కల్గించు కార్యములందే నిమగ్నులై యుందురు! ఇది ఆశ్చర్యకరమైన విషయము కదా. దీని గమనించిన బుద్ధిమంతులు దుఃఖము నుండి తప్పించుకొని ఆనందానుభవమునకై ప్రయత్నింతురు.

ప్రపంచమునగల సుఖదుఃఖములను గమనించినచో అవియన్నియు ఆభాసము లేయనియు నిజమైనవి కావనియు ఏర్పడును. ఆకలివేసినచో అది దుఃఖము. అన్నము తినినచో అప్పుడు సుఖము. మంచి భోజనమే యైనను ఆకలిలేనిచో అదియే దుఃఖకరమగును. శ్రావ్యసంగీతము చాల ఆనందము కల్గించును. కాని ఎంతసేపును అదే సంగీతమును వినుచుండినచో చివరకు విసుగెత్తును. పారిపోవలయు ననిపించును. పుత్రుడు చెప్పినమాట విని కీర్తిదాయకుడైనచో పరమానందము. దుష్టుడైనచో ఆక్రోశము. ఇట్లే ఏ విషయమైనను స్వచ్ఛముగా సుఖమని గాని దుఃఖమని గాని ప్రపంచమున లేదు. పరిస్థితిని బట్టి సుఖమో దుఃఖమో భాసించుచుండును.

ఈ పరిస్థితి ఏది? నేను అను భావన నాది అను భావన అందు తగిలియుండుటయే ఈ సుఖదుఃఖములను కల్గించు పరిస్థితి. స్కూలులో ఒక బాలునకు జ్వరము వచ్చినదయ్యా అనినచో అయ్యో పాపము అని చప్పరించును. ఆ బాలుడు మీ యబ్బాయే నయ్యా అనినచో అయ్యయ్యో యని యార్చుచు వేగముగా పరుగెత్తును. మీ క్లాసులో పన్నెండు ఫస్టుక్లాసులు వచ్చినవోయీ అనినచో నిజమా! అనును. నీకు కూడా వచ్చినదోయీ అనినచో కన్నులు

మెరసిపోవును. ఎగిరి గంతువేయును. కనుక ఏ సంఘటన మైనను 'ఇతరులకు' తటస్థించినచో అది 'మనకు' సుఖముగాని దుఃఖముగాని కలిగింప లేదు. 'మనకు' తటస్థించిననే అది సుఖమునో దుఃఖమునో కలిగించును.

మరి సుఖదుఃఖములు లేక కొయ్యవలె పడియుండవలెనా యనినచో అక్కఱలేదు. మానవుని స్వతస్సిద్ధమగు స్వభావమే ఆనందము. తక్కిన సుఖదుఃఖము లన్నియు దుఃఖములే. పసిబాలుడు సాధారణముగా ఆనందముగా నుండును. ఆకలివేసిననో ఎవరైనను గిల్లిననో క్యారుమనును. కనుక ఆగంతుకము లైన ఈ ప్రాపంచిక సుఖదుఃఖములను తొలగించుకొనగలిగినచో మనము నిజముగా ఆనందము ననుభవింపగలము. ఈ విషయమును గుర్తించిన మానవుడే దీనినుండి తప్పించుకొన ప్రయత్నించును. అన్ని కార్యములను ఈ దృష్టితో చూచుచు కార్యనిర్వహణమును అత్యంత శ్రద్ధతో చేయుచునే అందు 'నేను' చేయుచున్నాను దీని ఫలము 'నాది' అను భావములను తొలగించుకొనుటను వైరాగ్యదృష్టి యనుచున్నాము.

'నేను' చేయనప్పుడు ఇక ఏ పనిమాత్రము ఎట్లు జరుగును ? అందరును 'నేను' దుఃఖమును కోరను. అన్ని పనులు బాధ్యతలు దుఃఖములే కదా. కనుక ఏమియు చేయను అనినచో నెట్లు ? అను ప్రశ్న వచ్చును.

దైవమును నమ్మువారికి పెద్ద కష్టములేదు. అన్నియు భగవంతుడే చేయించుచున్నాడు అని త్రికరణశుద్ధిగా భావించుచు సంగమున తగులక వారు అన్ని కర్మలను నిర్వర్తింపగలరు, తామరాకుమీది నీటిబొట్టువలె. కాని దైవము నంగీకరింపనివారికి అత్యంతము నిశితమైన మేధాశక్తియున్ననే తప్ప వైరాగ్యము మెట్టవేదాంతముగా మారి పోవును. 'నేను' చేయుట యనగా నా శరీరము చేయును, నా మనస్సు చేయును లేదా నా బుద్ధి చేయును. అన్నియు—శరీరము మనస్సు బుద్ధి అన్నియు 'నావి'యే గదా ఇక నే నెవరు? ఈ ప్రశ్నకు సమాధానము దొరకువరకు ఇతడు త్రికరణశుద్ధిగా పనులను వదలలేడు. కనుక సర్వ కర్మలను ధర్మము తప్పక ఆచరించుచు అహర్నిశము నే నెవరు అని ఇతడు విచారించు కొనుచునే యుండవలెను.

కనుక నిజముగా వైరాగ్యదృష్టి కలిగినచో అన్ని పనులును నిర్దుష్టముగా జరిగిపోవును. ఆ పనులయొక్క ఫలితములందు లోభముగాని పనులు 'నేనే' చేయవలెనని కామము గాని చేయ వీలుపడనందుకు క్రోధముగాని నేను చేయుచున్నానని మదముకాని నావలన కానిది మరియొకరు చేయుచున్నారని మాత్సర్యము కాని పనులను బాధింపక పోవుటచేత పనులు దోషరహితము లగును. ఎప్పుడు మానవుడు తన సుఖమునుగూర్చి చింతించుట మరచిపోవునో అప్పుడు ఇతరుల సుఖము దానంతట అదియే సాధింపబడును. వ్యక్తిగతముగా వైరాగ్యదృష్టి ఇది. ఎప్పుడు నిరంతరము ఇతరుల సుఖమునే చింతించుచుండునో అప్పుడు 'నేను, నావి' అను భావములు మాలబడును. సాంఘికముగా వైరాగ్యదృష్టి ఇది.

వ్యక్తుల అభిరుచులనుబట్టి ఏవిధముగనైనను వైరాగ్యదృష్టి నవలంబింపవచ్చును. సాధారణముగా నుండు 'నేను, నా సంసారము, నా సంపద' అను భావము తొలగినచో వైరాగ్యదృష్టి క్రమక్రమముగా విస్తృతమై లోకకల్యాణమును స్వీయమోక్షమును సాధించును. ఇట్టి విరాగులు కాషాయాంబరధారులు కానక్కఱలేదు. ఇల్లు

వాకిలి వదలి పారిపోవ నక్కర లేదు. రెప్ప వేయక నోరువిప్పక జడభరతునివలె కూర్చుండనక్కఱ లేదు. ఈ విరాగులు కర్మాగారమున కార్మికులు కావచ్చును. విద్యాశాలయందు విద్యార్థులు కావచ్చును. గృహమేధులు కావచ్చును. రాజ్యతంత్ర నిర్వాహకులు కావచ్చును. ఎవరైనను హృదయాంతరాళమునందు ధర్మము ధర్మము అని ప్రతిధ్వనించు చుండినచో ఇది దైవ కార్యము నావలన ఇది చెడరాదు అను దృష్టి కలిగినచో అతడు చేయు సకల కార్యములును వైరాగ్యపూరితములై జగన్మంగళకరములై ఆత్మోద్ధారకములై వెలయును.

# రాగము - విరాగము

## నోరి నరసింహశాస్త్రి

వైరాగ్యమునకు-సాంఘిక జీవనమునకు విరోధము ఉన్నదని సర్వసామాన్యముగా భావిస్తూ ఉంటారు. కాని వైరాగ్యమంటేఏమిటో సరిగా తెలియక ఆ భ్రాంతి కలుగుతుంది.

రాగము ప్రధానముగా మూడు రకాలుగా ఉంటుంది. భార్యమీద, పుత్రులమీద, ధనము మీద రాగము సంసారులకు సర్వసాధారణముగా ఉంటుంది. రాగమంటే మమత్వముతో కూడినప్రేమ; వీటినే వేదాంతులు ఏషణాత్రయము అంటారు. విరాగము అంటే మమత్వముతో కూడిన రాగము వదిలిపెట్టటము. నా ప్రియురాలు, నా ప్రియపుత్రుడు, నా ధనము అని మమత్వముతో ఉండటము. లోకములో స్త్రీలంతా నా తల్లులు, పురుషులంతా నా పుత్రులవంటివారు, ధనసంపదంతా లోకులకు ఉపయోగపడవలెననే భావము విస్తరించవలెను. అప్పుడు రాగము, విరాగ మాతుంది.

గీతలో ఈ చిత్రమైన అశ్వత్థ వృక్షమును

> "అసంగ శస్త్రేణ దృఢేన ఛిత్వా,
> తతః పరం తత్ పరిమార్గితవ్యమ్,
> యస్మిన్ గతాన నివర్తంతి భూయః"

అని భగవానుడు చెప్పినాడు. సంగమంటే మమకారము. అసంగమంటే వైరాగ్యము. ఈ విధముగా చూస్తే అసంగమంటేను, వైరాగ్యమంటేనుమన ప్రేమ విశ్వవిస్తృతమౌతుంది. సాంఘిక జీవనములో సర్వవ్యాప్త మౌతుంది. చివరకు బ్రాహ్మణ గృహస్థులకు ప్రధానమైన శిఖ,యజ్ఞోపవీతము,అంబరము వదిలి వేస్తారు,కర్మలు వదిలి పెడతారు. సర్వభూతములకు అభయ ప్రతిజ్ఞ చేస్తారు. వారికి అహింస పరమధర్మ మౌతుంది. మమత్వముతో కూడిన రాగము వదిలిపెట్టినపుడు సాంఘిక జీవనములో సర్వవ్యాప్తముగా సర్వసంపదను వినియోగిస్తారు. ప్రేమపవిత్రమై సర్వవ్యాప్తమౌతుంది.

ఇటువంటి వైరాగ్యముకంటే సాంఘిక జీవనమునకు ప్రధానద్రవ్యము ఇంకొకటి లేదు. అటువంటి విరాగులు భగవంతునికి ఈ లోకములో ప్రతినిధులు. వారు జగత్ కుటుంబులు. వైరాగ్యమే సాంఘిక జీవనమునకు పునాది. వైరాగ్యమంటే ద్వేషముతో కూడికొనునది కాదు. మమత్వము విడిచి జగత్ వ్యాప్తమైనప్రేమ.

విరాగము రాగము విగతమగుట అని సాధారణముగా అర్థము చెపుతారు. వైయాకరణులు ఒప్పుకొంటారో లేదో కాని విరాగమంటే విశిష్టమైన రాగము. అనగా విశ్వవ్యాప్తమైన రాగము.

# సంఘజీవనమున వైరాగ్యావశ్యకత

బులుసు వెంకటేశ్వర్లు

మానవజీవితము - అనగా మానవవ్యక్తిత్వములోని యర్థము- ఇది తెలిసినచో నిక తెలియవలసిన దేమియు మిగులదు. మానవుడు మూలములో దేవుడే; అజ్ఞానాచ్ఛాదితుడైన దేవుడే మానవుడు. జ్ఞానసిద్ధుడైన మానవుడే దేవుడు.

మానవవ్యక్తిత్వములో వివిధ భాగము లున్నవి. 1. స్థూలదేహము, 2. సూక్ష్మదేహము, 3. కారణదేహము, 4. ఆత్మ. మానవునిలో నాత్మచైతన్యము దేహత్రయమునకు చైతన్యమిచ్చి తత్తత్కార్యక్రమములు నడపుచున్న అనంతశక్తి. ఆత్మ ఏకము, అద్వితీయము; ఆత్మేతరము విశ్వప్రపంచరూపము, నానాత్వములో నిండియున్నది. ఆత్మేతర ప్రపంచము ఆత్మచైతన్యశక్తి వినా లేనిదే. ఏకమనేకముగా సృష్టి కల్పింపబడెను. బ్రహ్మేతరము ప్రకృతి జగత్తు మాయ అను నామములతో బిలువబడినది.

సహజాత్మచైతన్యము సర్వశక్తి జ్ఞాన ఆనందస్వరూపము. త్రిగుణాత్మిక ప్రకృతి - ప్రపంచము- అశాంతి అసుఖము దుఃఖములకు కారణము. నేను దేహత్రయముల అనగా స్థూలసూక్ష్మ కారణదేహముల సంపుటియగు వ్యక్తినని అహంభావముకలిగి జీవభావము నొంది, దుఃఖభాజనుడ నగుచున్నాను. నేను నిజముగా నాత్మస్వరూపినే యని యెరిగి స్వచ్ఛ ంపూర్ణానందము ననుభవింపగలను.

రాగద్వేషములు దేహత్రయసంబంధులు. ఆత్మ కవిలేవు. ఆత్మ అనగా భగవానుడే. మానవుడు శ్రుతులు చెప్పు మహావాక్యముల నెరిగి నిత్యము అనిత్యమునైనవానిని విడదీసి అనిత్యములను క్రమాభ్యాస బలముచేత విసర్జించి నిత్యమగు పరమాత్మ నారాధించి సకలదుఃఖ విముక్తుడు కావలెను.

సంఘమనగా ననేకవ్యక్తుల సముదాయము. ప్రతివ్యక్తియు పరిశుద్ధచిత్తుడు గావలెను. పరిశుద్ధచిత్తమనగా సత్యము నెఱుగగోరు చిత్తము. సత్యమనగా భగవానుడే. భగవంతు నెఱుగగోరు చిత్తమే పవిత్రమైనది. ఏలన సకలదుఃఖనివారణము భగవంతు నాశ్రయించుటవలననే జరుగును. భగవంతుడు మార్పులేని సంపూర్ణ సుఖమూర్తి. దేహము లోకము, వస్తువులు వ్యక్తుల సంబంధములు నిరంతరము మారుచుండుట అదృశ్యములగుట అందుచే వియోగముచే దుఃఖము నిచ్చుట స్వభావముగా గలవి.

చెడినశించు పదార్థములను నమ్మకుండు వాడే యుక్తమైన బుద్ధిగలవాడు. ఏలన చెడు పదార్థములను నమ్మి మనమును చెడుదుము. చెడనిపదార్థము ఆత్మవస్తువు లేక పరమేశ్వరుడే కావున చెడనివస్తువును నమ్మి చెడకుండుట నేర్వవలయునని యెరుగుటవలదా!

నశించు పదార్థములపై కాంక్షలు పెట్టికొని మితిమీరిన వ్యామోహములోబడి రాగద్వేషములకు బాల్పడి దుఃఖసాగరమగ్నుల మగుటలో మన బుద్ధిశక్తి యేమియు పనిచేయుట లేదని స్పష్టము. ప్రాచీన భారతీయ మహర్షుల మహోపదేశము ననుసరించి దేవునినమ్మి జీవిత ముఖ్యావసరములకై స్వల్పశక్తికి సాధ్యములైన పదార్థములను సంపాదించి సంతృప్తినంది ధర్మసత్య దైవారాధనములలో జీవనము గడపుటవలన నిహపర సౌఖ్యములు సుసాధ్యములని యెకదా మనము వినియుంటిమి. వేదశాస్త్ర

ములు భోగవైముఖ్యమును యోగాభిముఖ్యమును బోధించియుండలేదా? భారతీయులు నేడు పాశ్చాత్యుల ననుకరించి భోగలాలసులై కోర్కెలను పెంచికొని రాగద్వేషవశులై దుఃఖము లనుభవించుట జరుగుచున్నది.

నేటి పశ్చిమనాగరికత నిముసములో నశించు నిహలోకవస్తువులపై భోగలాలసతకు ప్రాధాన్యమిచ్చి విశ్వసమాజమును నిరంతర విపత్పరంపరలలోనికి ద్రోయుచున్నది. మితిలేని ధనమార్జించుట దానికొరకై నీతివిరహిత వ్యాపారములకు దిగుట తద్రక్షణమునకై సైన్యములు ఆయుధములు సామ్రాజ్యములు సమకూర్చుకొను నాద్యంతములులేని తుచ్ఛ కాంక్ష; ప్రకృతిశాస్త్రము సంపూర్ణ సత్యమును జూపగలదను మూఢవిశ్వాసము; దేశములయెడ పరస్పర స్పర్థలు ద్వేషములు యుద్ధభీతి—ఇది నేటి నాగరికత. మూడవ ప్రపంచ యుద్ధముతో నీనాగరికత స్మశానధూళిలో గలసిపోవుట తప్పదు. ఈ దుఃస్థితి లోకమునకు పట్టకుండ హితముపదేశించు శక్తి భారతదేశమున కొక్కదానికే యున్నది. కాని దుర్విధి వశమున భారతీయనాయకులు— ప్రజలు— పశ్చిమ నాగరికతయను నంటువ్యాధికి వశులై దేశము నపమార్గము పట్టించుటకు ప్రయత్నించుచున్నారు.

వైరాగ్యమనగా మితిమీరిన వస్తువ్యామోహమును తృణీకరించి నిరాడంబర సాత్త్విక జీవనమునకు మరలించు లక్షణము. దైవసేవ లోకసేవ ధర్మభీతి దైవభీతి ఇవి మన దేశములో పెంపొందినపుడే దేశమునకు లోకమునకు రక్షణమార్గ మేర్పడును. ఇది భారతీయుల సంప్రదాయమగు వైదిక మతధర్మము. వివేకానందస్వామివా రెన్నడో బ్రహ్మతేజస్ఫూర్తితో బలికిన రీతిగా భారతదేశము వైరాగ్యము నాశ్రయించి బ్రదుకగలదు; మత వైరాగ్యములను భగవంతుని విడిచి భోగకాంక్షతో విహరింపబూనునా, పతనము వినాశము తప్పదు. దానితోబాటు జగత్తును ఒక అరణ్యభూమియై భూతప్రేత పిశాచనిలయమై విలసిల్లును. భారతీయులారా! స్వధర్మమును విడిచి నశింపకుడు!

# సాంఘికాదర్శము - వైరాగ్యప్రామాణ్యము

విష్ణుభొట్ల విశ్వనాథశాస్త్రి

కాలము మారినది. మారుచున్నది. మారగలదు. సృష్ట్యాదినుండి నేటివఱకు కాలములో నెన్నెన్ని మార్పులు వచ్చినవో యితిహాసపురాణములు మనకు చెప్పుచునే యున్నవి. కాలప్రభావమునుగూర్చి పోతనమహాకవి తన ప్రతిభాసమున్మీలితకవితాకుంచికతో నెట్లు చిత్రించెనో చూడుడు.

వాయువశంబులై యెగసి వారిధరంబులు
మింట గూడుచుం
బాయుచునుండు కైవడిఁ బ్రపంచము
సర్వముఁ గాలతంత్రమై
పాయుచుఁ గూడుచుండు నొకభంగిఁ
జరింపదు కాల మన్నియుం
జేయుచునుండు గాలము విచిత్రము
దుస్తర మెట్టివారికిన్

కాలము మారుట యనగా మానవ మనస్తత్వ ప్రవృత్తులు మారుటయే. మానవుల మనుగడకు కొలతబద్దవంటిది కాలము. కృతయుగమువలె త్రేతాయుగము లేదు. త్రేతాయుగమువలె నితరయుగములు లేవు. ఆ యా యుగములందలి మానవుల పరిస్థితులనుబట్టియే అతీంద్రియద్రష్టలగు మహర్షులు భిన్నభిన్న యుగములయందు భిన్నభిన్నధర్మములను విధించిరి. ఈ క్రింది పరాశరస్మృతి వాక్య మీ విషయమును దార్కాణించును.

కృతేతు మానవా ధర్మాః
 త్రేతాయాం గౌతమాస్మృతాః
ద్వాపరే శంఖలిఖితాః
 కలౌ పారాశరాస్మృతాః.

ఇతిహాస పురాణములను బరిశీలించినచో కృతయుగమునుండి రానురాను మానవులకు ఆముష్మికమునందు విశ్వాసము సన్నగిల్లుటయు ఐహికభోగములయందాసక్తి వృద్ధియు స్పష్టముగా కనుపించును. ఐహికభోగములకు ప్రాధాన్య మిచ్చుట యనగా ఇంద్రియలోలత్వమునకుఁ బట్టము గట్టుటయే.

రఘువంశపురాజులను వర్ణించుచు కాళిదాసమహాకవి యిట్లు చెప్పెను.

ప్రజానాం వినయాధానా ద్రక్షణా ద్భరణాదపి
సపితా పితరస్తాసాం కేవలం జన్మహేతవః.

ప్రజలను వినయవంతులనుగాఁ జేయుటవలనను రక్షించుటవలనను పోషించుటవలనను ఆ దిలీపుడు ప్రజలకు తండ్రి యయ్యెను. ఆ ప్రజల తండ్రులు ఆ ప్రజల కేవలజన్మమునకు కారణభూతులు. ఇట్టిదే కదా శ్రేయోరాజ్యము! కాలక్రమమున రాజులయందీ భావము నశించి రాజ్యసంపదను తమ భోగములకే వినియోగించుచు రాజ్యాధికారమును రాజ్యములను విస్తరింపఁజేయుట కుపయోగించుచు వచ్చిరి.

పూర్వము వేదబోధితమైనదే ధర్మమనియు అది మానవులకు స్వబుద్ధ్యనుసారము నిర్ణయింపఁ దగనిదనియు విశ్వాసముండెను. కావుననే జైమినిమహర్షి "చోదనా లక్షణో ఽర్థో ధర్మః" అని ధర్మమును నిర్వచించెను. అట్లే శ్రీకృష్ణపరమాత్మ యర్జునునకు గీతోపదేశము చేయుచు "తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య వ్యవస్థితౌ" అని కార్యాకార్య నిర్ణయమున శాస్త్రమే ప్రమాణమని చెప్పెను. ఇచ్చట శాస్త్రమనగా వేదము. కాని యీనాడిట్టి విశ్వాసములు నశించుచున్నవి. సంఘములోని జనులయందు తమ కేది హితకరమో తామే నిర్ణయించుకొనఁగల మను విశ్వాసము ప్రబలుచున్నది. మన ప్రాచీను లిదివఱకే చెప్పియుండిరి కదా! "సంఘే శక్తిః కలౌయుగే" యని.

ఈనాడొక వ్యక్తి యెంత విజ్ఞానవంతుఁడైనను ఎంత ధర్మశాస్త్రవేత్తయైనను అతని మాటలకు సంఘములో విలువ లేదు. "పదుగురాడుమాట పాటియై ధర జెల్లు" ననునదే యీకాలపు సాంఘికనీతి.

సంఘమునందు బహుజనాభిప్రాయ మెప్పుడు నొకతీరుగా నుండునని చెప్పలేము. సంఘమునందలి నాయకులు స్వార్థప్రేరితులై సంఘమును బాగుచేయుదు మనియు సంఘశ్రేయస్సే తమ శ్రేయస్సనియు స్వలాభములను బొందుచుందురు. సంఘసంస్కర్తలు రాజకీయనాయకులు శ్రుతిస్మృతులను మన మీనాడు ప్రమాణముగాఁ గైకొనరాదని నుడివిరే కాని దేనిని ప్రమాణముగా గైకొనవలెనో చెప్పరైరి.

తత్త్వదృష్టితో విమర్శించినచో సంఘజీవనమున ఈనా డుద్భవించిన కష్టముల కన్నింటికి మానవులందు ప్రబలిన కామక్రోధములే కారణమని స్పష్టము కాకపోదు. ఈనాడు సంఘజీవనమున శాంతి మృగతృష్ణికాప్రాయమైనది. ధనాశాపీడితులై పాపపుణ్యములను సరకు చేయక స్వేచ్ఛాజీవితలంపటులుగా జనులు జీవయాత్రను సాగించుచున్నారు. ఈనా డే యంత స్థనకుఁ జెందినవారైనను, ఏ వృత్తిచే జీవించువారైనను తమ మనస్సు ప్రేరేపించినటులే ప్రవర్తించుచున్నారు. ఉపాధ్యాయులు విద్యార్థులు, యజమానులు సేవకులు తల్లిదండ్రులు వారి పుత్రు లొకరియం దొకరికి విశ్వాసము లేక అస్తవ్యస్తజీవితమును గడుపుచున్నారు. ఎదుటివారి కష్టము నవగాహనము చేసికొను స్వభావమే మృగ్యమైనది.

బీదవారు నిత్యజీవితమును గడుపుటకే సతమత మగుచుండ సంపన్ను లింకను తమ సంపదను వృద్ధి చేయుటకై తాపత్రయ పడుచున్నారు.

ఇట్టి యశాంతిగ్రస్తమగు సంఘజీవనమునందు మానవునకు శాంతి నొసంగునది వైరాగ్య మొక్కటియే. శంకరభగవత్పాదులు సర్వవేదాంతసిద్ధాంతసారసంగ్రహమునందు వైరాగ్యము నిట్లు నిర్వచించిరి.

శ్లో॥ ఐహికాముష్మికార్థేష్వ
నిత్యత్వేన నిశ్చయాత్
నైస్పృహ్యం తుచ్ఛబుద్ధ్యా య
త్తద్వైరాగ్యమితీర్యతే ॥

ఐహికవిషయములందు ఆముష్మికములైన స్వర్గాదులయందు నిత్యములు కావను నిశ్చయముతో వానియందు హేయభావము నలవరచుకొని అవి తుచ్ఛము లను భావముతో వానిని కోరకుండుటయే వైరాగ్యము. ఈ వైరాగ్యమలవడుటకు నిత్యానిత్యవస్తువివేకమే కారణమని భగవత్పాదు లా గ్రంథమునందే యిట్లు చెప్పిరి.

శ్లో॥ నిత్యానిత్యపదార్థవివేకాత్పురుషస్య
జాయతే సద్యః
స్రక్చందనవనితాద్యా సర్వత్రానిత్య
వస్తుని విరక్తిః ॥

పరమపురుషార్థమగు మోక్షమునకు వైరాగ్యమే మొదటి మెట్టగును. ఈ విషయమునే భగవత్పాదు లిట్లు చెప్పిరి.

శ్లో॥ మోక్షస్య హేతుః ప్రథమో నిగద్యతే
వైరాగ్య మత్యంత మనిత్యవస్తుషు ॥

ముఖ్యముగా మానవుఁడు కామక్రోధముల నడంచిన గాని వైరాగ్యము సాధ్యము కాదు. మన మొక వస్తువును గోరి అది లభించినచో తృప్తులమగుదు మనుకొనుట పొరపాటు. ఆ వస్తువు లభించినతర్వాత నంతకంటె గొప్ప వస్తువును సాధింప యత్నింతుము. కావుననే మహర్షులు,

శ్లో॥ న జాతు కామః కామానా ముప
భోగేన శామ్యతి
హవిషా కృష్ణవర్త్మేవ భూయ
ఏవాభి వర్ధతే ॥

మన మొక వస్తువును కోరినపుడు కోరిన వస్తువు లభింపనిచో నా లభింపమికి కారణ మన్యు లని తలచి వారిపై కోపించుదుము. క్రోధమువలన యుక్తాయుక్తవివేకము నశించును. క్రోధమువలని కీడును వాల్మీకి మహర్షి హనుమద్వాక్యములలో నిట్లు చెప్పెను.

శ్లో॥ ధన్యాస్తే పురుషశ్రేష్ఠా
యే బుద్ధ్యా కోపముత్థితమ్
నిరుంధంతి మహాత్మానః
దీప్తమగ్నిమివాంభసా ॥

క్రుద్ధః పాపం న కుర్యాత్ కః
క్రుద్ధో హన్యాత్ గురూనపి
క్రుద్ధః పరుషయా వాచా
నరస్సాధూ నధిక్షిపేత్ ॥

వాచ్యావాచ్యం ప్రకుపితో
న విజానాతి కర్హిచిత్
నాకార్యమస్తి క్రుద్ధస్య
నావాచ్యం విద్యతే క్వచిత్
య స్సముత్పతితం క్రోధం
క్షమయైవ నిరస్యతి
యథోరగ స్త్వచం జీర్ణాం
స వై పురుష ఉచ్యతే.

గీతాసారమనదగు నీయుపదేశరత్నమును భగవంతుఁడిట్లు బోధించెను.

శక్నోతీహైవ యస్సోఢుం
ప్రాక్శరీర విమోక్షణాత్
కామక్రోధోద్భవం వేగం
స యుక్తస్ససుఖీ నరః ॥

కామక్రోధములు మానవుని నాశమున కెట్లు దారితీయునో యీక్రింది విధమునఁ జెప్పఁబడినది.

సంగాత్సంజాయతే కామః
కామాత్క్రోధోభిజాయతే
క్రోధాద్భవతి సమ్మోహః
సమ్మోహాత్స్మృతివిభ్రమః
స్మృతిభ్రంశాత్ బుద్ధినాశః
బుద్ధినాశా త్ప్రణశ్యతి ॥

ఫలితార్థమేమన కామక్రోధములు సర్వానర్థములకు మూలములు. కామక్రోధముల నడంచుట వైరాగ్యమువలననే సాధ్యమగును.

వైరాగ్యముకలవాఁడు సంఘమునుండి పలాయితుఁడు కా నవసరములేదు. వైరాగ్యము సంఘజీవనమున కెంతమాత్రము ప్రతిబంధకము కాదు సరికదా సంఘజీవనము నానందమయముగాఁ జేయుటకు తోడ్పడును.

పూర్వము వైరాగ్యముతో రాజ్యములనే యేలిరి. రాజర్షులని కీర్తిగాంచిరి. అట్టిచో వైరాగ్యము సంఘజీవనమున కెట్లు ప్రతిబంధకమగును? రఘువంశమున మహాకవికాళిదాసు దిలీపమహారాజు నిట్లు వర్ణించెను.

జుగోపాత్మానమత్రస్తః
భేజే ధర్మ మనాతురః
అగృధ్నురాదదే సోఽర్థ
మసక్తస్సుఖ మన్వభూత్ ॥

ఆ దిలీపుడు భయమునకునది లేకయే శరీరమును రక్షించుకొనెను. (శరీరమాద్యం ఖలు ధర్మసాధన మ్మనికదా ఆ మహాకవియే చెప్పెను). అతడు ఆధివ్యాధిపీడితుఁడు కాకయే ధర్మమాచరించెను. లోభములేకయే ధనమార్జించెను. సంగములేకయే సుఖ మనుభవించెను.

వైరాగ్యము సంఘజీవనమునకు ప్రతికూలము కాదనుటకు ఆదికాలమునందు పరమజ్ఞానియగు జనకుడు మొదలగువారు, కలియుగమున శ్రీరామకృష్ణపరమహంస స్వామివివేకానందులు మొదలగువారు తార్కాణము. దేవీభాగవతమున శుకజనకుల సంభాషణ మిట్లు గలదు శుకుఁడు జనకు నీ విధమున ప్రశ్నించును.

శ్లో॥ చింత్యసే వివిధాకారం
నానారాగ సమాకులమ్
ధంభోఽయమితి తే భాతి
విముక్తోఽస్మీతి భావసే
కదాచి చ్ఛత్రుజా చింతా
ధనజా చ కదాచన
కదాచిత్సైన్యజా చింతా
నిశ్చింతోఽసి కదా నృప
తవ వంశసముత్థానాం విదేహా ఇతి భూపతే
కుటిలం నామ జానీహి నాన్యథేతి కదాచన.

ఇట్లు శుకుఁడు ప్రశ్నింపగా జనకుఁ డిట్లు సమాధాన మిచ్చెను.

పితుస్సంగం పరిత్యజ్య
త్వం వనం గంతుమిచ్ఛసి
మృగైస్సహ సుసంబంధో
భవితా తే న సంశయః
మహాభూతాని సర్వత్ర
నిస్సగః క్వ భవిష్యసి
ఆహారార్థం సదా చింతా
నిశ్చింతస్స్యాః కథం మునే
దండాజినకృతా చింతా
యథా తవ వనేపిచ

తథైవ రాజ్యచింతా మే
చింతయానస్య వా న వా
వికల్పోపహత స్త్వం వై
దూరదేశ ముపాగతః
న మే వికల్పస్సందేహో
నిర్వికల్పోఽస్మి సర్వథా
సుఖం స్వపిమి విప్రాహం।
సుఖం భుంజామి సర్వదా
న బద్ధోఽస్మీతి బుద్ధ్యాహం
సర్వదైవ సుఖ మునే
త్వం తు దుఃఖే సదైవాసి
బద్ధోఽహ మితి శంకయా
ఇతి శంకాం పరిత్యజ్య సుఖే సమాహితః
దేహోఽయం మమ బంధోఽస్తి
నమ మేతి కదాచన
తథా ధనం గృహం రాజ్యం
న మమేతి చ నిశ్చయః
తచ్ఛ్రుత్వా వచనం తస్య
శుకః ప్రీత మనోఽభవత్ ॥

నీ వనేక రకములైన చింతనలయందు మగ్నుడవై యుందువు. పలువిధములగు రాగములు నిన్ను ముప్పిరిగొని యున్నవి. ఒకప్పుడు ధనసంబంధమైన చింత మరియొకప్పుడు శత్రువులగూర్చి చింత మరియొకప్పుడు సైన్యమును గూర్చిన చింత. విదేహులను మీవంశనామము నిరర్థకమైనదని ఎంచుచున్నానని శుకుడనగా జనకు డిట్లు సమాధానించెను. తండ్రిని వదలి వనమునకు బోగోరుచున్నావు. నీకు అచ్చటి మృగములపట్ల రాగము నిస్సంశయముగ కలుగును. ఎల్లెడలను పంచమహాభూతము లుండగా నీవు ఎచ్చట నిస్సంగుడ వగుదువు? ఇక నీకు వనమునందు ఆహారమును గూర్చి చింత దండాజినమందుచింత ఎప్పుడును ఉండును. నా రాజ్యచింతయు నట్టిదే. దూర దేశములకు పోయి నీవు వికారముల పాలగుచున్నావు. నాకు వికారములు లేవు సందేహములు లేవు. అదియుంగాక నేను బద్ధుడను కానని తెలిసికొని నేను ఎప్పుడును సుఖముగా నుందును. నీవో, బద్ధుడనను అనుమానముచే ఎప్పుడును దుఃఖించుచుందువు. బంధములగు ఈ దేశము రాజ్యము ఏవియు నావి కావు. ఇట్టి జనకవచనములను విని శుకుడు ప్రీతుడయ్యెను.

పై సంభాషణమువలన వైరాగ్య మెంత మాత్రము సంఘజీవనమునకు ప్రతిబంధకము గాదని స్పష్టమగును— ఇట్లే శ్రీ రామకృష్ణ పరమహంసల జీవితము వివేకానందస్వామి జీవితము వైరాగ్యము సంఘజీవనమునకు విరుద్ధము కాదని స్పష్టము చేయును.

కావున నానాసంకటములచే నశాంతి పీడితమైన నేటి సంఘజీవనమున ''వైరాగ్య మేవాభయమ్'' అని భర్తృహరి చెప్పినటుల వైరాగ్య మలవరచుకొని మానవులు శాంతిని పొందుదురు గాక!

# వైరాగ్యచర్చ

## హరిహరదాసు

వైరాగ్య మనగానే మనకు 'కాషాయాంబర బహుకృతవేషులు' జ్ఞప్తికి వత్తురు. ఇల్లు వాకిలి వదలి వేగముగా అడవులకో కొండలకో పరుగెత్తుటయే వైరాగ్యమని మన సాధారణాభిప్రాయము. లేదా కాషాయము కప్పుకొని బిచ్చమెత్తుట యనియో. కాని తరచి చూచినచో మనకు వైరాగ్యముయొక్క నిజస్వరూపము తెలియును. బ్రహ్మవిద్యను తెలిసికొనుట కధికారిని నిర్ణయించుచు శంకరభగవత్పాదులు సాధనచతుష్టయములో వైరాగ్యమును పేర్కొనిరి. ''ఇహాముత్రార్థ ఫలభోగవిరాగః'' ఇహలోకమునందుగాని పరలోకములందుగాని అనుభవింపగలుగు భోగభాగ్యములయందు విముఖతయే వైరాగ్యము. ఇహలోకసౌఖ్యములు చెప్ప బనిలేదు. స్వర్గాదిలోకములందు లభించు సౌఖ్యములందు గూడ విరాగికి ఇచ్ఛ యుండరాదు. శ్రీ శంకరులే బ్రహ్మాదిలోకములను గూడ విరాగి 'కాకిరెట్ట'తో సమానముగా జూడవలె ననిరి. అనగా వానియం దట్టి నిరర్థకతను ప్రత్యక్షము చేసికొనవలెను. ఇట్టిది గదా వైరాగ్యము! ఇట్టి వైరాగ్య మున్ననే మోక్షమున కధికారము.

ఇట్టి వైరాగ్యము తాటిపండువలె చేతికి దొరకునా? తత్త్వగ్రంథములు చదువుకొలది, అందలి తత్త్వచింతన చేయుకొలది, సాధుసాంగత్యబలిమికొలది, క్రమముగా మనస్సు పరిణతి జెందును. యథాకాలమున పరిపూర్ణ వైరాగ్యమును అటుపిదప మోక్షమును బడయును. అందుచేత వైరాగ్యమనగా నొకరిచ్చు బహుమాన మనిగాని మన భుజబలము బుద్ధిబలములచే సాధించు నొక యుద్యోగ మనిగాని భ్రమపడరాదు.

వైరాగ్యము నింకొక విధముగా జెప్పినచో నహంకార మమకారములను వదలుకొనుట యని చెప్పవచ్చును. శ్రీ శంకరులు ''కాతే కాన్తా కస్తే పుత్రః'' అనిగదా యనిరి! 'నీ' భార్య ఎవరు? 'నీ' పుత్రు లెవరు? ఇట్టి భ్రమను వదలుకొను మని యుపదేశించిరి. ఈ 'నా' త్వమునే మమకార మందురు. నా ఇల్లు, నా పుత్రులు, నా సుఖము ఇత్యాదు లన్నియు మమకారములే. ఇట్టి మమకారము వలననే 'నా' పుత్రులు బాగుపడినచో ఆనందము, చెడిపోయినచో దుఃఖము ననుభవింతుము. 'పరాయి' పుత్రులు బాగుపడినను చెడిపోయి

నను మన మనస్స్వాస్థ్య మెంతమాత్రము కలత
కారదు గదా! కనుక 'నా' భార్యను 'నా'
పుత్రులను తుదకు 'నా' శరీరమును నా బుద్ధిని
గూడ పరాయి వస్తువు లను దృష్టితో జూడ
గలుగుటే మమకారమును వదలుకొనుట.
అప్పుడు మనస్సు సుఖదుఃఖములకు లోనుగాక
నిశ్చలముగా నుండుట కనుమానమేమి? మమ
కారము వదలిన నహంకారము దానంతట
నదియే జారిపోవును. ఈ 'నా' అను భావము
నకు కర్తయగు 'నేను' అను భావమే అహం
కారము. 'నా' దనునది ఏదైన నున్నగదా
'నేను' దానికొఱకై ప్రయత్నించుట. నా దను
నదియే లేని యవస్థయందు 'నేను' మాత్ర
మెచ్చటనుండి వచ్చును? ఈ వైరాగ్యము
కూడ నభ్యాసముచే తప్ప సాధ్యము కాదు.
దీని నభ్యసించుటకే ఇప్పటివరకు విరాగులు
ఇల్లువాకిలి వదలిపోవుచు, అడవులయం దేకా
కులుగా నివసించుచు ప్రయత్నించిరి.

హిందువుల జీవితపరమార్థము మోక్ష
మును సాధించుటయే. అందులకు సాధనము
వైరాగ్యమే. అందువలననే భారతదేశమునం
దెల్లెడలను సన్న్యాసులు, ఆశ్రమములు
లెక్కకు మిక్కిలిగా కన్పించును. వారియందు
గూడ మిశ్రమ ముండుట సహజమే. జీవనము
జరుగక కాషాయమును గప్పుకొనిన బిచ్చ
గాండ్రు మొదలుకొని సకలశాస్త్రములను
పాశ్చాత్యవిజ్ఞానమును అధ్యయనము చేసి
యున్నతపదవులంది వానినిగూడ చిన్నతనము
నందే వదలి 'కరతలభిక్ష' సన్న్యాసులైన
వారివరకు అన్నిరకముల సన్న్యాసులును విరా
గులలో కన్పింతురు. పరిస్థితు లిప్పటివరకును
కొంత మెరుగుగనే యుండినవి. దేశమునం
దిప్పటివలె క్షామము లేదు. కష్టములు కడ
గండ్లు లేవు. ప్రజలయం దాస్తికత దైవభక్తి
యుండెడివి. అడవులలో కావలసినన్ని ఫల
వృక్షములు తేటనీరు లభించెడివి. తత్త్వచింతన
చేయు సన్న్యాసికి కమికెడన్నమునకు కొదువ
లేకుండెడిది. ఇప్పు డన్ననో? ఆస్తికత, దైవ
భక్తి, మాట ఎట్లున్నను ఫలవృక్షములు గల
యడవులైనను సమృద్ధిగా లేవు. నిరుద్యోగము,
చాలీచాలని జీతములు, నిత్యావసరముల
కఱవు వీనితో గృహస్థులకు తమ జీవనమే
వెళ్లమారుట కష్టముగా నున్నది గదా! ఇట్టి
పరిస్థితులలో సన్న్యాసులు తమ భోజనసౌఖ్య
మునకై గృహస్థులను యాచించుట ఏమి
సబబు? అను ప్రశ్న యుదయించును. ఇల్లు
వదలిపోవు సన్న్యాసమే మోక్షదాయక
మైనచో గృహస్థుల గతి ఏమి? అనునది
రెండవ ప్రశ్న. విజ్ఞానవంతులు అయిన
వారు సంఘమును వదలి తమ మోక్షమునకు
మాత్రమే ప్రయత్నించుచో సంఘము గతి
యేమి? దేశాభివృద్ధి యగుట ఎట్లు? అనునది
మూడవ ప్రశ్న.

వైరాగ్యమునకు మనము చెప్పుకొనిన
రెండర్థములను (నిజమునకు రెండునూ ఒక
టియే) మనస్సు నందుంచుకొని ఈ ప్రశ్నలకు
సమాధానమును వెదకుదము.

ఇహాముత్రఫలభోగములయందలి ఇచ్ఛను
వదలిన సన్న్యాసి తన నిత్యావసరములకై
గృహస్థులను యాచింపడు. దైవముపై
పూర్తిగా నాధారపడి తన యాకలి తీరువరకు
మాత్రమే గ్రహించును. రెండవపూటకైనను
అతడు సంగ్రహించి దాచుకొనడు. ఈ కార
ణమువలన నత డొక్కొకసారి రెండుమూడు
రోజులు నిరాహారిగానే యుండవలసి
వచ్చును. దీని కంతయును సన్న్యాసి చింతిం
పడు. అతని మనస్స్వాస్థ్యము చెడదు. గృహ
స్థుల నతడు యాచింపడు. వారే ఇచ్చిన

గ్రహించును. ఇందుగురించిన వివేకానంద స్వాముల కథ ఎల్లరకును తెలిసినదే. రైలు ప్రయాణమునందత డెట్లుపవాసము చేసినది, మార్వాడీ యతని నెగతాళి చేసిన విధానము తుదకు కలలో శ్రీరామచంద్రునిచే ప్రబోధింప బడిన మిఠాయివర్తకు డెట్లురుకులు పరుగులపై వచ్చి స్వామికి భోజనాదికము లర్పించినది జగద్విదితమే.

ఆధునిక సమయములందుగూడ గృహస్థుల యాదరమును సన్న్యాసుల నిరీహతయు కన్పించు సన్నివేశములు తటస్థపడుచునే యుండును. నాకు తెలిసినస్వామి యొకసారి బీహారునందు పాదచారులై పోవుచుండిరి; వారి యొద్ద కొంచెము ధన ముండినను దైవముపైనే భారము వేయదలచి అంతకుముందే దానిని గూడ నెవరికో ఇచ్చివేసిరి. ఆ దినమంతయు గడచిపోయెను. దేవు డేమియు చేయలేదు. మరుసటి దినము తెల్లవారెను. మధ్యాహ్నము గూడ గడచిపోయెను. స్వామి యలసటతో నొక బావిచెంత గూర్చుండెను. ఇంతలో నొక బీదగృహస్థు స్వామిని జూచి యటకు వచ్చి "బాబాజీ! భోజన మైనదా?" యని యడిగెను. స్వామి లేదనెను. అతడు కలవరపడుచు "అయ్యో, మధ్యాహ్నము దాటిపోయినదే! ప్రొద్దున నేమి భుజించితి" రని యడిగెను. ప్రొద్దునగూడ నేమియు తినలేదని స్వామి బదులు చెప్పెను. అతడు దుఃఖముతో "అయ్యయ్యో, పోనీ నిన్న నైన నేమయిన భుజించితిరా" యని ఆత్రుతతో ప్రశ్నించెను. స్వామి 'నిన్న' గూడ సంపూర్ణోపవాసమే నని తెలిసికొని ఆ బీదగృహస్థు తన బిడ్డడే రెండు రోజులనుండి తప్పిపోయి ఉపవసించినట్లు విల పించుచు ఇంటికి పరుగెత్తుకొనిపోయి బొరు గులు బెల్లము కొనివచ్చి స్వామిచేత తిని పించెను. పిదప వారి నింటికి దీసికొనిపోయి స్నానాదికము లమర్చి భోజనము పెట్టి పంపెను. "అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే తేషాం నిత్యాభియుక్తానాం యోగ క్షేమం వహామ్యహం" (9-22) అని గదా గీతావాక్యము! భిక్షుకులై నేలబడి పొరలుచు, పొట్టజూపుచు శ్వానమువలె ననేకకష్టములు బడు 'సన్న్యాసులు'ను గలరు. మావటివానిచే లాలింపబడు మత్తగజేంద్రమువలె ఠీవిగా తమ కయాచితముగా లభించిన దానితో కాలము గడపు సన్న్యాసకుంజరులును గలరు. కనుక సన్న్యాసి యగువాడు గృహస్థులకు భారమని యనుకొనవలసిన నక్కఱ లేదు. ఇష్టమైనవారు పెట్టుదురు. కష్టమైనవా రూరకుందురు. సన్న్యాసి ఉన్నచో తినును. లేనిచో నూరకుండును. దైవసాక్షాత్కారమును బడయలేని ఈ శరీర మున్ననేమి యూడిన నేమి యని తలచు సన్న్యాసులు గృహస్థుల దయాధర్మములపై నాధారపడియున్నా రనుట యసంగతమైన మాట గదా!

ఇక గృహస్థుల మాట యేమనిన, వారికిని వైరాగ్యము సాధ్యమే. కాని తమ భార్యాబిడ్డలను వదలుకొను తీవ్రవైరాగ్యము వారికి సాధ్యము కాదు. కాని సంఘమునందలి ఇతరులను గూడ తనవారుగనే భావించినచో వారికి తగిన వైరాగ్య మేర్పడు నవకాశము కలుగును. ఎంతసేపును తమ లాభము, తమ పురోగతి, తమ యౌన్నత్యము గురించియేగాక కొంచమైనను ఇతరుల సుఖసంతోషములను గుర్తించి వారితో సహకరించుట గృహస్థులు సాధింపదగు కనీసవైరాగ్యము. తమకు రేడియోలు కార్లు మిద్దెలు మేడలు అని యుప్పొంగుట మమకారము. పొరుగువారికి మూడు పూటల భోజనమైనను లేదని గమనించి, దానికి

పరితపించి తమ కెంత ఇబ్బందిగా నున్నను వారి కష్టములను పంచుకొనుట వైరాగ్యము. తమ సుఖముల నీ విధముగా న్యూనదృష్టితో చూచుటయే గృహస్థుల కనువగు వైరాగ్యము. ఇట్లు తమ యోగక్షేమములపై మమకారము క్రమముగా తగ్గించుకొనగలిగినచో ఎల్లరును ఇతరులకై పాటుపడుటచేత దేశము సుభిక్షమగును.

పైనుదాహరించిన సంఘటనలోని గృహస్థు బీదవాడే. అయినను ఇంకొకనిని పిలిచి భోజనము, పంచభక్ష్యపరమాన్నములతో గాకపోయినను, పెట్టగలిగెను. తత్త్వజ్ఞానము వసుధైకకుటుంబము అను భావములు అతనికి తెలియకపోవచ్చును. అయినను ముక్కుమొగము తెలియని ఇంకొకని కష్టములను తనవి వలెనే యనుభవించెను. ఇట్టి గృహస్థునకు మాత్రము దైవసాక్షాత్కార మేల కాకపోదు! ఇట్టి గృహస్థునకు వైరాగ్యము లేదని ఎట్లు చెప్పగలము?

కనుక భగవత్సాక్షాత్కారమునకై తీవ్ర వైరాగ్యముతో శరీరమునుగూడ నుపేక్షించు సన్న్యాసి విరాగి యగుచో, సాటిమానవుల సుఖమునకై తమ యవసరములను గూడ నుపేక్షించు గృహస్థులు గూడ విరాగులే. ఈ సందర్భమున శ్రీరామకృష్ణుల భక్తుడగు నాగమహాశయుని పేరు చెప్పక తప్పదు. గృహస్థుల వైరాగ్యమున కీయన జీవితము పరాకాష్ఠ. తన ఇంట నేమియు లేకపోయినను తనకే భోజనమునకు గడవకున్నను, ఎట్లో యొకట్లు తన యతిథులను సత్కరించి పంపెడువాడు. పురాణకాలమున నతిథిని తృప్తిపరచుటకై పలుదినముల యుపవాసముపిదప లభించిన పేలపిండిని పూర్తిగా నిచ్చివేసి సకుటుంబముగా స్వర్గస్థుడైన సక్తుప్రస్థుడను బ్రాహ్మణుని కథను విందుము గదా!

అందుచేత ఇతరములైన యాలోచనలన్నియు కట్టివేసి ఆత్మచింతన చేయు సన్న్యాసి వలె 'తనను' గూర్చి యాలోచనలు కట్టివేసి సాటిమానవుల కష్టసుఖములు పంచుకొను గృహస్థుడు గూడ నుత్తమగతులనే పొందుననుటలో ననుమానము లేదు.

ఇక మన మూహించిన మూడవ ప్రశ్న. ఈ దృష్టితోనే సన్న్యాసమును సాంప్రదాయిక దృష్టితో గాక నవ్యసామాజికదృష్టితో గమనింపవలసియున్నది. పూర్వకాలమున మోక్షము పరమార్థమనుటయం దెవ్వరికిని సందియము లేదు. మోక్షసాధకులు గౌరవింపబడిరి. గృహస్థులు వారివద్ద నుపదేశములను బొందుచు తమ జీవితములను చక్కబెట్టుకొనుచునే మోక్షసాధనకై ప్రయత్నించిరి. విద్యార్థులట్టి మోక్షసాధకుల కడనే విద్యాభ్యాసము చేసి మోక్షదృష్టి పారమార్థికదృష్టి యలవరచుకొనిరి. అట్లు సమాజమున కంతయు మోక్షమే గమ్యమగుటచేత సామాజికజీవనము కలతలు లేక గడచిపోయెడిది. ప్రస్తుతమున పాశ్చాత్యవ్యామోహమునబడిన వ్యక్తిగత శారీరకసౌఖ్యమే జీవితపరమావధియైనది. ఇట్లగుటచేత సంఘమున కొక గమ్యము లేదు. ఎందఱు వ్యక్తు లుందురో అన్ని గమ్యములగును. అందుచేత నొకని యానంద మింకొకని యానందమున కడ్డు వచ్చును. ఫలితముగా స్పర్ధలు ద్వేషము యుద్ధము వ్యక్తిగతముగా మొదలుకొని ప్రపంచవ్యాప్తములుగా పెల్లుబికి చెలరేగియున్నవి.

ఇట్టి పరిస్థితులలో జీవితపరమార్థముగా మోక్షమును మరల స్వీకరించుటయే ఏకైక

మార్గము. ఎన్ని కష్టములనైనను సోదరమానవులలోని దైవమునకై భరించుట కూడ సన్న్యాసాదర్శములలో చేరినదే. "పురుష ఏవేదగ్ం సర్వం యద్భూతం యచ్చ భవ్యమ్" "ఉన్నదంతయు ఇక మీద కలుగబోవునదంతయు ఆ పరమాత్మయే" అని పురుషసూక్తమునందు చెప్పబడియున్నది. నారాయణసూక్తమునందును "యచ్చ కించిత్ జగత్సర్వం దృశ్యతే శ్రూయతేపి వా అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణ స్థితః" "ఈ ప్రపంచమునం దేది కన్పించినను వినిపించినను దానిలోపలను వెలుపలను నారాయణుడే వ్యాపించియున్నాడు" అని యున్నది. ఉపనిషత్సారమగు భగవద్గీతయందును

సర్వతః పాణిపాదం త
త్సర్వతోఽక్షిశిరోముఖమ్
సర్వత శ్శ్రుతిమల్లోకే
సర్వమావృత్యతిష్ఠతి.

'ఆ బ్రహ్మ మంతటను చేతులను కాళ్లను కన్నులను తలలను ముఖములను చెవులను గలదై లోకముల నన్నింటిని వ్యాపించి యున్నది.' అని చెప్పబడియున్నది గదా!

కనుక ఏకాంతమునందుండి ఆత్మగతమగు బ్రహ్మమును సాక్షాత్కరించుకొన ప్రయత్నించు సన్న్యాసాదర్శముతో సోదరమానవులందును సర్వజీవులయందును వ్యాపించియున్న బ్రహ్మమును సాక్షాత్కరింప జేసికొనుటకు నారాయణబుద్ధితో సేవచేయు సన్న్యాసాదర్శమున కేమియు విరోధము లేదు. ఈ భావమును సుస్థిరము చేసికొనుటయే వైరాగ్యమునకు పరాకాష్ఠ. ప్రస్తుతసామాజికసమస్యలకు పరిష్కారమార్గముగా నీ సన్న్యాసాదర్శమునే వివేకానందస్వామి బోధించిరి. ఇట్టి వైరాగ్యమే గదా తనకు మోక్షమును జగమునకు హితమును సాధించును!

---

# ప్రవృత్తి నివృత్తుల పరస్పర ప్రామాణ్యము

**చివుకుల కృష్ణమూర్తి**

వీధివాకిట బైరాగి ఒకడు 'అమ్మా ఒక కవళం' అని అర్థిస్తున్నాడు—చేతనున్న చిప్ప పైకెత్తి. ఇంటి ముంగిట, పెరిగే చంటిబిడ్డకు పాలన్నం ఒక పిడచ తినిపించాలని కన్నతల్లి అన్నంగిన్నె పైకెత్తి చూపుతూ 'అమ్మా ఒక్క ముద్ద' తినమంటూ తన చిన్నారిని బ్రతిమాలుతున్నది.

బైరాగి సర్వసంగపరిత్యాగిగ గణనకెక్కినా దేహాన్ని కాదనలేక, కనీస జీవనాధారంగ కోరుతున్నాడు భిక్షను. కన్నతల్లి ప్రేమ, మోహాన్ని కాదనలేక, మారాం చేసే బిడ్డ మంచికై వేడుకుంటోంది రక్షగ. ఇద్దరివీ ప్రార్థనలే. బైరాగిది మన్నింపదగిన స్వార్థం. కన్నతల్లిది ఎన్నదగిన నిస్స్వార్థం—స్థూలదృష్టికి. మొదటి స్వార్థానికి వెనుక కడుపుమంట, రెండవ నిస్స్వార్థానికి వెనుక కడుపుతీపి ఉన్నా, నిజానికి, ఒకటి సాదృశ్యంగ మరొకటి అదృశ్యంగ రెండూ స్వార్థాలే. ఇందులో ప్రవృత్తి తత్త్వమెవరిది? నివృత్తి వేద మెవరిది?

ప్రవృత్తి కామార్థాలకోసం ధర్మాచరణమవలంబించి ఐహికసుఖానికి— ఆ తరువాత స్వర్గసుఖానికి నోచుకునే వ్యాపకమనీ, నివృత్తి

కేవలం మోక్షసాధనకై సర్వకర్మములను పరిత్యజించి అంతర్ముఖమైన స్తబ్ధత అనీ, వాడుకలో ఉంది. కాని, దేహమనే గృహంలో ఆత్మ అనే యజమాని కాపురం ఉన్నంతకాలం సంఘజీవనం తప్పదు సన్యాసికి. దేహపోషణా నిరతిలో నిమగ్నుడైన సంసారికి ఉత్తమఫల సంప్రాప్తికై ఆత్మానాత్మవివేకము సూచించుటకు, త్యాగసంపన్నుడైన సన్యాసిసేవ తప్పనిసరి. దేహమనే సాధనము అమరిన ఆత్మకు వైరాగ్యమే పరమశ్రేయము. శ్రేయోసంపద సుఖమైతే, ప్రియములు అప్రియములై కలుగు నిర్వేదమే దుఃఖము. సుఖసాధనము, దుఃఖ నిర్మూలనము—ధ్యేయములు. ఇవి హెందవ కర్మాచరణము లన్నిటిని ఋజుమార్గాన వర్తింపజేయు చతుర్విధ పురుషార్థముల ద్వారా, సాధ్యములు.

రాగము సృష్టికార్య పర్వము పల్లవించుటకే నాంది. విరాగము నిగ్రహానికి భరతవాక్యమై సృష్టికారణ వివేకముతో తాదాత్మ్యము నొందునది. ద్వంద్వాతీత రాగానికి అంతరీనంగ వైరాగ్యము ఆయునైతే, నిస్సంగతికి ప్రాతిపదిక సత్సంగతి. సత్సంగతికి సంఘకిల్బిషరాహిత్యము ఎంత అవసరమో, ఏతత్ మహోపకారానికి వైరాగ్య సంపన్నుల సంఘజీవనమంత ఆవశ్యకము. పరాకాష్ఠలో ఒకటగు ప్రవృత్తి నివృత్తులు (కర్మజ్ఞాన యోగాలు), పురోగమావస్థలోనే ఒండొంటికి ప్రామాణికములై ఉభయ తారకము లౌను.

మంచుకొండ చరియలోని ఒంటరి చెట్టుక్రింది మునిముచ్చు సంఘమారుడు కాడు. సంఘమనగా మానవసంఘమనే సంకుచితార్థము వేదములందు గోచరించదు. నమకపాఠమున రుద్రు నుద్దేశించి ఉపాసకుడు

“శివేన వచసాత్వా గిరిశాచ్ఛావదామసి, యథాః సర్వ మిజ్జగద యక్ష్మగ్ం సుమనా అసత్” అని ప్రార్థిస్తాడు. ఇందు ‘జగత్’ శబ్దము, జంగమములైన పుత్రులు, పశువులు మొదలగు వానికిని, ‘సర్వమిత్’ శబ్దము వృక్షాది స్థావరము లన్నిటికిని వర్తించును. సాంతసృష్టిలో అణువణువున సృష్టికర్త మహత్తును సూక్ష్మరూపంలో సూత్రప్రాయంగ దర్శించు వేదఘోష—పదేపదే సూచించేది: భౌతిక రూప సిద్ధంగానో, మానసాయుత్తబద్ధంగానో సంఘము—కర్మము త్యజింపరానివని జీవమున్నంతవరకు జీవించుట అనుక్రియ తప్పనిదై ‘నివృత్తి’ నిష్క్రియత్వం కానేరదు. ప్రవృత్తి అన్యాయము కానేరని భోగములకే అంకితమైన అజ్ఞానము కాదు. సర్వకర్మములు త్యజించి తద్వారా కర్మఫలములైన పుణ్యాపుణ్యములను మించి జన్మరాహిత్యమునకై మనుట నివృత్తి. యోగ్యత ననుసరించి ధర్మాచరణము చేత అర్థకామములు సాధించి తద్వారా పాపనివృత్తి—పుణ్యప్రాప్తిని బొంది, ఈశుభసంపద చేత మోక్షార్థి అగుటకు పూన్కొను పద్ధతి ప్రవృత్తి. ఈ రెండునూ పరస్పర వ్యతిరేకములు కాకపోగా, పరస్పరాధారములు — పరస్పర ప్రాభావితములు.

మానవుని మనోవృత్తి (subjectivity), వస్తుతంత్రాగరిమ (objective excellence) ఒకదానికొకటి ప్రామాణికములు. మనోవృత్తి లేక అనుభవించబడు వస్తువు లేదు; వాస్తవిక జగదనుభవము నొందని మనోవృత్తి లేదు. ఈ రెంటిలో ఏకతః ఉన్న భగవదంశ ప్రస్ఫుటమై అద్వైతసిద్ధి జరుగువరకు — ద్రవ్యముకొలుచు పాత్ర ఏతద్రవ్యేతర వస్తువుతో తయారు చేయుట తప్పనిసరి అగునట్లు వైరాగ్యమునకు సంఘజీవనము కొలమానమగును. అటు

లనే సంఘమునకు వైరాగ్యప్రభావము పుష్టి
పుష్టః — అను అర్థముచేత పరి
పూర్ణతాభావము) నిచ్చును.

క్రియారహితప్రజ్ఞ ఇంధనహీనమైన వాహనమువంటిది. ప్రజ్ఞారహితమైన పనుగడ చోదకుడు లేని యంత్రమువంటిది. స్వాధ్యాయనముచేత ధర్మవ్యాధుడు గురువైనట్లే, నిరర్థకమైన 'డుకృఞ్ కరణము'తో ప్రొద్దుపుచ్చు కాశీదేశ వైయ్యాకరణి ఎంతటి పామరుడో శ్రీశంకరులు సూచించారు. స్వామి వివేకానందుని మిక్కిలి ఆకర్షించిన, నమకపాఠాంతర్గతమైన ఈ క్రింది స్తోత్రం, సర్వేశ్వరుని పండితులకు మాత్రమే తెలియ శక్యమైన కైలాసాదివర్తి రూపమువలె కాక సర్వలోకములకు ప్రత్యక్షభూతుడైన ఆదిత్యమూర్తిగ దర్శించి సుఖమాశించుచున్నది.

''అసౌ యో వసర్పతి నీలగ్రీవో విలోహితః।
ఉతైనం గోపా అదృశన్న దృశన్నుదహార్యః।
ఉతైనం విశ్వా భూతాని సదృష్టో మృడయాతినః॥''

ఇటువంటి సార్వజనీనత, సామరస్యము వైదికమత ముద్బోధించుటచేతనే. వ్యక్తిగత జీవన్ముక్తికై, తపస్సుగర్హనీయము. 'అన్నమో రామచంద్రా' యని దారిద్ర్యనారాయణులైన కోటి ప్రజానీకం అలమటిస్తూవుంటే. వేదవిరుద్ధమైన, సంకుచితమైన ఆత్మసిద్ధికై తరలి వెళ్ళే శుద్ధసత్వాన్ని — కాలపరిస్థితినిబట్టి విమర్శించిన వివేకానందుడు అటు పాశ్చాత్యదేశస్థులు, స్వకీయమైన మన ముముక్షులను స్వార్థమైన పలాయనం క్రింద నిందిస్తూ, క్రైస్తవమతము చేయు సంఘసేవ నగ్గడిస్తూ జరిపిన ప్రచారాన్ని ఎదుర్కోవలసి వచ్చింది. వ్యక్తిగను సంఘజీవిగను మనుటలో ఒకే ఆలోచనము — ఒకే ఆచారము నెఱపినగాని సందిగ్ధావస్థ తొలగదని చేసిన ఆతని బోధన శిరోధార్యము. విరాగిగ అతని ఔదార్యము సంఘములోని లోపదోషముల సరిదిద్ది, నిష్కామ నిర్లిప్తతకన్న, సంఘసేవాతత్పరత, పరమోత్తమమైన నిష్కామకర్మమని ప్రబోధించును. సంఘపు బాగోగులు అందులోని వ్యక్తుల తత్వాలను బట్టి ఏర్పడును గనుక, నిష్కాములైన బైరాగులే అత్యుత్తమ సంఘోద్ధారకు లగుదురు. సంఘసేవనమే వారి మోక్షసాధనమగును. వైదికకాలమునుండియు వర్ణాశ్రమధర్మమే వైయక్తిక కర్మాచరణమును నిర్ణయించి, ప్రవృత్తి నివృత్తులకు ఆలంబనమై ఉండునది. 'వర్ణము' అనుశబ్దముకూడ, వైదికరముగ, వ్యక్తులమనోవృత్తుల, తత్వములను బట్టి బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులన బడు వర్గీకరణమునందు వాడబడినది కాని — నేటి అస్తవ్యస్తపు సాంఘిక సంకేతముగ కాదు. లోకసంగ్రహము, ప్రవృత్తికిని, నివృత్తికిని సాధ్యమగుచున్నది. ఇటు ప్రవృత్తికిని, అటు నివృత్తికిని ఉదాహ్యతులుగ ఎందరో మహాత్ములు — తెలుగువారికి సుపరిచితులైన పోతన, త్యాగయనుంచి ప్రపంచ ప్రసిద్ధులైన గాంధీజీ వరకు చాలమంది యున్నారు. త్యాగయ సంకీర్తనముగాని, పోతన భాగవత రచనము గాని, గాంధీజీ మానవసేవగాని, వారిని కేవలము కర్మయోగులుగనే కాక జ్ఞానయోగులుగా కూడ సమపాళ్లలో తీర్చి దిద్దిన వనవచ్చును వివేకానందునివంటి లోకజాగరణకర్తలు, లోకోత్తర కర్తవ్య ప్రబోధకులు. తన జీవితాశయము లెంతగ మలచిరో గాంధీజీ తమ ఆత్మకథలో స్పష్టము చేసియున్నారు.

అవైదిక మతములైన జైన బౌద్ధమతములలో కూడ కైవల్యనిర్వాణములు సంఘటిల్లుట అచంచలమైన సంఘసేవమూలముననే. నివృత్తి

ద్వారానే మోక్షము సాధ్యమనుట వైదికత కానేరదు. సంఘవిముఖతను ఖండించుచు స్థావర జంగమాదు లన్నిటియందు ఈశ్వరసాక్షాత్కార మపేక్షించి, అన్ని స్తోత్రములలోను, సొంత సృష్టికి సుఖశాంతులకోరు వైదికదృష్టి నిష్కామ కర్మము నగ్గడించునే కాని అకర్మమును కాదు. (నిజానికి అకర్మము జీవకోటికి అసాధ్యము.)

"ఇమాగ్ం రుద్రాయ తవసే కపర్దినే క్షయద్వీరాయ ప్రభరా మహే మతిమ్, యథా నశ్శమ సద్ద్విపదే చతుష్పదే విశ్వం పుష్టం గ్రామే అస్మిన్ననాతురమ్" అను మంత్రమును సాయనుని వా ననుసరించి తెనిగిస్తే "మా యొక్క పుత్ర పౌత్రాది మనుష్యవర్గము నకును, గోమహిష్యాది పశువర్గమునకును, సుఖము కలుగుటకును, ఈ గ్రామము (జనపదములన్నీ ప్రత్యేకముగ) నందుండు ప్రాణులన్నియు పుష్టికలిగి ఉపద్రవము లేక యుండుటకును, మా కోరిక నెఱవేర్చుటకు సమర్థుడును జటాజూటము ధరించినవాడును, శత్రువీరుల (దుష్టశక్తుల) నశింపజేయువాడును అగు రుద్రుని పూజ, ధ్యానము మొదలగువానిచే మిక్కిలి ఆరాధించెదము" అను అర్థము. సామూహికముగ, సమిష్టి ప్రయోజనముకై, పండిత పామర విచక్షణ, అల్పానల్పచర్చ ఏమాత్రము లేక సాగు ఈ మంత్రపాఠము, సంఘజీవన వైశిష్ట్యమును ఋజువు చేయుచున్నది. సంకుచిత స్వభావులు, హేయములగు సిద్ధులకై, ఇష్టార్థములకై తపస్సులు చేసి వానినే సాధించినను, ఆ శక్తులు, ఫలములు, కాలదోషము చెంది ఖర్చగునట్టివే. నిజమైన జ్ఞానయోగికి సంఘజీవనము ప్రతిబంధకము కానేరదు. ఆత్మానాత్మవివేకమునకు స్వానుభవమే తార్కాణమైనట్లు — స్వానుభవమునకు ఉపాధిగ సంఘమే సిద్ధము.

నేడు మంత్రాలకు మామిడికాయలు రాలవను యాంత్రిక మనస్తత్వము, నవనాగరికులలో మెండుగ కానవచ్చుచున్నది. మంత్రములు మాటల మూటలే కావు. క్రియాశక్తి తను పాఠకునిలో, నిమంత్రించి, శబ్దబ్రహ్మోపాసనమునందు ఉదాత్తానుదాత్తస్వరితములను స్వరములతో విరాజిల్లి ఫలిత మివ్వగలవి. 'యంత్ర' శబ్దమునకు నేటి నిఘంటువు చేర్చిన అర్థమునకన్న ముందుగ 'లిఖితమైన బీజాక్షర సంపుటీకరణము' (మంత్రము) అను ప్రయోగ మున్నది. ఆమంత్రించిన గాని (unless programmed) పనికిరాని నేటి మేధా యంత్రాలు (computers—robots), క్రియాపరతకు శబ్దమే ప్రాణమని సూచించుచున్నవి కదా! ఈ చిరు వ్యాసమునందు ఉటంకించిన మంత్రములను ఆధునికు లుపాసించనొల్లకపోయినను, వైదిక కాలమునుండి 'సర్వేజనా స్సుఖినో భవంతు' అను గొప్ప కోరికతో సాగిన యజ్ఞయాగాదులు, సాంఘికసేవ. తన్మూలముగ స్వాధ్యయన సౌలభ్యము, సుఖము, ఆకాంక్షించు మన సంస్కృతి, సంప్రదాయము ఎంత ఉత్కృష్టమైనవో గుర్తింపగలరని ఉద్దేశము. నేటి సమాజస్థితిని మేలుపరచుటకు సంస్కరణాభిలాషులకు, నిస్స్వార్థమునకు మారుపేరైన విరాగ మెంత అవసరమో, స్వాభావికముగ వైరాగ్యధోరణి ఏర్పడినవారికి, సంఘసేవా కష్టనిష్ఠురములు అంత ముఖ్యములు, గీటురాళ్లుగ.

స్వార్థమునకు నిస్స్వార్థము; బద్ధజీవిబుద్ధి చేయగల రసాస్వాదనానికి నిలయమైన ద్వంద్వత్వమునకు అద్వైతసిద్ధి; రోగమునకు ఔష

ధము; ఔషధమునకు సదుపయోగము; బిడ్డ అమాయకతకు తల్లిప్రేమ; బైరాగి పిడికెడు భిక్షమునకు గృహస్థు దాతృత్వము; భోగలాల్యములననుత్తరించి యుద్ధరించుటకు త్యాగశీలము; త్యాగపరాకాష్ఠకు సంఘోపకారపారవశ్యము, ప్రమాణములు. విరాగములో ద్వంద్వాతీత రాగమున్నది సాంఘిక సేవయందే. అది విరాజిల్లునది; సంపూర్ణత్వము నొందునది.

# వైరాగ్యము - సాంఘికజీవనము

డా. దివాకర్ల వేంకటావధాని

మనము పురాణాది గ్రంథములలో మహర్షులు బహుసంవత్సరములు తపస్సాచరించిన యుదంతములనుగూర్చి చదువుచుందుము. ఆ తపశ్చర్యావిధానము మన కాశ్చర్యజనకముగా నుండును. ఆ ఋషులు దారపుత్రాదులను విడిచి, సాంసారిక సుఖములురోసి, సమస్తైహిక భోగములయెడ విరక్తులై బ్రహ్మచర్యము నవలంబించి పరబ్రహ్మానుసంధాన మొనరించుచుండిరి. వారికి అడవులందాశ్రమము లుండెను. వారందే నివసించుచు యథావిధిగా ననుష్ఠాన మొనరించుచు పవిత్రమైన జీవితము పుచ్చుచుండిరి. వారికి సంఘముతోకాని ప్రజలతోకాని యెట్టి సంబంధమును లేనట్లు కనిపించును. తపశ్చర్యకు ఫలితముగా వారు భగవత్సాక్షాత్కారమునొంది బహిఃప్రపంచ విస్మారకము, విగళిత వేద్యాంతరమునైన యానంద విశేషము ననుభవించుచుండిరి. ఆ యానంద మనుభవైక వేద్యమే కాని మాటలతో వర్ణించుట కలవికానట్టిది. తైత్తిరీయోపనిషత్తునా యానందము స్వరూపము వివరింపఁబడినది. స్థూలముగా పరిశీలించినచో వారాత్మానందాత్మమోక్షములకొఱకే కాని సంఘశ్రేయము నకై యెట్టి ప్రయత్నములను గావించునట్లు కానరాదు. కాని యా తపోధనులు తామాచరించిన తపస్సులో షష్ఠభాగము రాజున కర్పించెడివారని పురాణములవలనఁ దెలియుచున్నది. రాజు దేశమునకును దేశమునందలి ప్రజలకును ప్రతినిధి. మహర్షుల తపఃఫలములో కొంతభాగము నాతఁడు పొందెనన దేశమును ప్రజలును పొందుచుండిరన్నమాట. ఈవిధముగా పూర్వమహర్షుల వైరాగ్యసంపన్నమైన తపస్సు ప్రత్యక్షముగా కాకపోయిన పరోక్షముగానైన దేశ సంఘశ్రేయమునకు తోడ్పడుచుండెనని చెప్పవచ్చును.

విరాగభావము వైరాగ్యము. సంసారమునందును, ఇంద్రియార్థములందును, లౌకిక భోగములందునుగల యాసక్తికి రాగమని పేరు. విగతరాగమైన ప్రవృత్తియే వైరాగ్యము. దీనికిని సాంఘిక జీవనమునకును సంబంధము లేకపోవుటయే కాక కొంత వైరుధ్యముకూడ నున్నట్లు గోచరించును. సంఘమున జీవించుచు, లౌకికార్థములందు ప్రవర్తించుచు, వైరాగ్యసంపద వహించియుండుట బహుక్లేశకరమనుటలో సందేహము లేదు. అట్లుండుట కాత్మసంయమన మెంతో యవసరము. సంఘజీవనమున ప్రలోభనము లెన్నో యుండును. దానికి వశముకాక వైరాగ్య సంపదతో జీవించుట ధీరత్వమునకును లక్షణము. "వికారహేతౌ సతి న విక్రియంతే యేషాంహి చేతాంసి త ఏవ ధీరాః" అని కవికులగురువు

కాళిదాసు కుమారసంభవమున చెప్పియుండెను. ఎట్టి ప్రలోభనములును, ఆకర్షణములును లేని విజనప్రదేశములందు వసించుచు వైరాగ్యము వహించియుండుట సులభమయ్యు సర్వసాధ్యముకాదు. అందుకు సంయమన రాహిత్యమును, మనశ్చాంచల్యమును కారణములు. ఇంద్రియములు సహజముగా సక్త స్వభావము కలిగినట్టివి. సౌందర్యమాధుర్య సౌరభ్యాదులు గోచరింపఁగనే యవి వాని ననుభవించుట కువ్విళ్ళూరును. అట్టియెడ వాని నరికట్టి విరక్తితో సంచరించుట పరిణత చేతస్కులైన మహానుభావులకు మాత్రమే సాధ్యము. నరసింహామూర్తి ప్రహ్లాదుని భక్తి భావమున కలరి నీకేమి కావలయునో కోరుకొనుమని యడుగ నాతడు

మామా ప్రలోభయోత్పత్త్యా
సక్తమే తైస్తవైః ప్రభో
తత్సంగ భీతో నిర్విణ్ణః
ముముక్షు స్త్వా ముపాశ్రితః.

అని చెప్పియుండెనట! ఇట్లనుటకు మనః పరిపక్వత యెంతో యుండవలయును. అది నూటికొక్కరికైన నుండుట యసంభవము. అనుభోగ్యములైన వస్తువులెదుట సిద్ధముగానుండ వాని ననుభవింపఁ గోరకుండ విరక్తచిత్తముతో నుండుట వాంఛనీయమే కాని సులభసాధ్యము కాదు. అందుచేతనే వైరాగ్యము, సాంఘిక జీవనము అను రెండును పరస్పర విరుద్ధములుగా కనఁబడును.

కాని బహువిషయభోగ సౌఖ్యపూరితమైన సంఘమున జీవించుచునే వైరాగ్యముతో నుండుట యసాధ్యముకాదని భగవద్గీతాది గ్రంథములవలన తెలియవచ్చును. మానవుఁడు సంఘమున జీవించుచున్నను, సాంద్రారణ్యమున జీవించుచున్నను ప్రకృతిజములైన గుణముల ప్రేరణమున వశుఁడై ఏదో యొక పని చేయుచునే యుండును.[1] కర్మాచరణ ప్రవృత్తిని దృష్టిలో నిడుకొని మానవుల నిరుతెఱఁగులుగా విభజింపవచ్చును. కొందరు కర్మేంద్రియముల నరికట్టి మనస్సుచేమాత్ర మింద్రియార్థములనే స్మరించుచు కాలము పుచ్చుచుందురు. బాహ్యదృష్టి కట్టివారు విరక్తులుగనే గోచరింపవచ్చును. కాని యట్టివారు మిథ్యాచారులని భగవద్గీత చెప్పుచున్నది.[2] మఱికొందఱు ఇంద్రియములను మనస్సుచే నరికట్టి అనాసక్తులై కర్మయోగము నారంభించుచుందురు. అట్టివారు శ్రేష్ఠులు.[3] వారు నిజముగా విరక్తులైనను విరక్తులని యెవ్వరును భావింపరు. కర్మలను జేయునప్పుడు మానవులు ప్రదర్శించు నాసక్త్యనాసక్తులను బట్టి వారి వైరాగ్యము భాసించుచుండును. కృష్ణుఁడర్జునునితో

1. నహి కశ్చి త్క్షణ మపి జాతు తిష్ఠ త్య కర్మకృత్
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతి జైర్గుణైః. భగ. III-5

2. కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్
ఇంద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యా చారస్స ఉచ్యతే.

3. య స్త్వింద్రియాణి మనసా నియమ్యా రభతే ఒర్జున
కర్మేంద్రియైః కర్మయోగ మసక్త స్స విశిష్యతే.

> తస్మాదసక్తః సతతం
> కార్యం కర్మ సమాచర
> అసక్తో హ్యాచరన్ కర్మ
> పరమాప్నోతి పూరుషః. 3-19

అని అసక్తుడై కర్మల నాచరించువాడు పరమ పురుషుని పొందునని చెప్పియున్నాడు. మఱియు ననాసక్తులై కర్మల నాచరించుట ద్వారముననే జనకాదులు సంసిద్ధిని పొందిరనియు లోకసంగ్రహము కొఱకైనను మానవులు కర్మల నాచరింపవలెననియు వక్కాణించియున్నాడు (3-20) ఏలయన శ్రేష్ఠులే దాచరింతురో యితర జనులును దానినే యాచరింతురు. వారు దేనిని ప్రమాణముగా గ్రహింతురో యితరులుకూడ దానినే యనుసరింతురు. వారొకవేళ యథోచితముగా కర్మల నాచరింపనిచో నితరులుకూడ వారి మార్గముననే యనుసరించుటయు తన్మూలమున లోకము నశించుటయు సంకరాదులుత్పత్తిల్లుటయు సంభవించును. అందుచే కర్మాచరణమువలన పరమార్థమునకు భంగము వాటిల్లదు. అది వైరాగ్యమునకు విరుద్ధముకూడ కానేరదు. అజ్ఞానులు సక్తులై కర్మల నాచరించునట్లు జ్ఞానవంతు లనాసక్తులై లోకసంగ్రహాపేక్షచే కర్మల నాచరించుచుండవలెననియే శ్రీకృష్ణుని యాదేశము (3-25)

కర్మాచరణము రాగమునకును కర్మాచరణ వైముఖ్యము వైరాగ్యమునకును లక్షణములని కొందఱు భావింపవచ్చును. కాని యది పొరపాటు. కర్మల యనారంభమువలన పురుషునికి నైష్కర్మ్యము సిద్ధింపదనియు, నట్లే కర్మ సన్న్యాసమువలన నతనికి సిద్ధి లభింపదనియు (3-4) గీత స్పష్టముగా తెల్పుచున్నది. అందుచే వైరాగ్యము కర్మాచరణానాచరణ ప్రవృత్తులపైకాక ఆసక్త్యనాసక్తులపై నాధారపడియుండునని తెల్లమగుచున్నది. అనాసక్తుడై సత్కార్యము లాచరించుచు మానవుడు వైరాగ్యసంపన్నమైన జీవనమువలని మేలుపొందవచ్చును. అట్టివాడు సంఘముననే జీవించుచుండినను పరమార్థదూరుడు కాడు. సంఘమునకు దవ్వైన విజనారణ్యమున జీవించు తపస్వి తపస్సుద్వారా లోకశ్రేయము నావహింపవచ్చునుకాని ప్రత్యక్షముగా దాని నాపాదించుట కతని కవకాశములు తక్కువగా నుండును. ఉపకార మొనరించువానికన్న నుపకారము చేయుట కవకాశము కలిగించు నుపకృతుడే యెక్కువ కృతజ్ఞతకు పాత్రుడని శ్రీవివేకానందస్వామి యభిప్రాయము. విజనారణ్యమున వసించువాడు శక్తిమంతుడయ్యు నవకాశాభావముచే నన్యులకు మేలుచేయజాలడు. సంఘమున జీవించువాడల్పశక్తిశాలియయ్యు నవకాశపరంపరా లాభముచే తోడి మానవుల కనేకవిధముల తోడ్పడ జాలును. కాని యతఁడేది యొనరించినను అనాసక్తుడై చేయవలయును. అది చాల ముఖ్యము.

భగవద్గీతయందలి పంచమాధ్యాయమున నర్జునుడు కృష్ణుని కర్మసన్న్యాస కర్మయోగములలో నేది శ్రేయమో తెల్పుమని యడిగెను. కృష్ణుడంత నా రెండును నిశ్శ్రేయసకరములే యయ్యు వానిలో కర్మయోగమే విశిష్టమనియు, సాంఖ్యయోగ కర్మయోగములు భిన్నములని భావించుట అజ్ఞతాసూచకమనియు, సాంఖ్యయోగ లభ్యమగు స్థానమును కర్మయోగము వలన కూడ పొందవచ్చుననియు వివరించియుండెను. విశుద్ధాత్ముడును, విజితాత్ముడును, జితేంద్రియుడునైన కర్మయోగి కర్మాచరణ ప్రవృత్తుడయ్యు తగులముపొందక తామరాకు నీటిచేవలె కర్మలచే లిప్తుడు కాకుండ నుండును. అట్టివాడింద్రియములచేతను త్రికరణముల

చేతను ఆత్మశుద్ధికై కర్మల నాచరించుచు కర్మఫలము నుజ్జగించి నైష్ఠికమైన శాంతిని పొందజాలును. వానిని వైరాగ్యసంపన్నుడుగా భావించుటకు సందేహింప నవసరము లేదు. అసక్తతయే వైరాగ్యమునకు లక్షణము కాని వట్టి సన్యాసస్వీకారము కాదు. కాషాయవస్త్రములను ధరించి ముండితశిరస్కుడై పర్వతారణ్యములందో గుహాలయందో వసించుచు నాసక్తుడై వర్తించు సన్యాసికంటె సంఘముననే వసించుచున్నను అనాసక్తుడై కర్మలనాచరించుచు లోకశ్రేయము నాపాదించు కర్మయోగియే యెక్కువ వైరాగ్య సంపన్నుడనుటలో సందేహము లేదు.

భారతీయ సంస్కృతికి మూలకందము లనదగినవి వేదములు. అందలి ధర్మనీతి తత్త్వములను కథోపాఖ్యానములద్వారా జనసామాన్యమునకందిచ్చుటకే భారత రామాయణములును భాగవతాది పురాణములును రచింపబడినవి. "శ్లోకార్థేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రంథకోటిభిః, పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడన'' మ్మను దానిని బట్టి పరోపకారమే యాగ్రంథములన్నియు బోధించు పరమార్థము. ఈ పరోపకారము సంఘజీవనము వలననే సిద్ధించును. ఈ భావము పెంపొందుటకు స్వార్థపరిత్యాగమును సేవాపరాయణతయు నత్యావశ్యకములు. ఈ రెండును వైరాగ్యముయొక్క ముఖ్య లక్షణములు. మోక్షసాధనమునకు జ్ఞానమువలెనే వైరాగ్యమును అత్యంతావశ్యకము, జ్ఞానవైరాగ్యములు రెండును సర్వసంగపరిజ్ఞానమువలన పరిపుష్టము లగును. పాశ్చాత్య నాగరికతా ప్రభావమువలన భారతీయులుకూడ నిప్పు డాముష్మికాభ్యుదయము నెడగాక లౌకికాభ్యుదయము నెడనే యెక్కువ ఆసక్తి ప్రదర్శించుచున్నారు. నిజమున కిట్టి ప్రవృత్తి భారతీయ జీవన విధానమునకు విరుద్ధమైనది. సేవాత్యాగము లా విధానమునకు జీవగఱ్ఱలు. దానిని గుర్తించియే మహామేధావియు సన్న్యాసిశేఖరుడునైన వివేకానందుడా యాదర్శముల యావశ్యకతను పలుసార్లు నొక్కివక్కాణించియుండెను. త్యాగమనగా స్వార్థమునకు స్వస్తి చెప్పుటయే. సేవయనగా సంఘమునందే యనాసక్తితో వర్తించుచు తోడి మానవులకు మేలు కలిగించుట. ఈ రెండును చేయజాలినవాడు పరులకు హితమాచరించుచునే ఆత్మమోక్షమునుకూడ సాధింపజాలును. సేవ కాశ్రయము సంఘమే కనుక మానవులు సాంఘికజీవనము పుచ్చుచునే వైరాగ్యముతో నోపినంత సేవచేయుచు జీవితమును సార్థకము చేసికొనవచ్చును. వైరాగ్య సంఘజీవనములు స్థూలముగా చూచినప్పుడు పరస్పర విరుద్ధములుగా గోచరించినను సూక్ష్మముగా పరిశీలించినచో నన్యోన్య సహకారులుగనే కాన్పించును. రాగసహితమైన సంఘజీవనము మానవు నెంత బద్ధునొనరించునో విరాగమై సేవాభావముతో కూడిన సంఘజీవన మాతని నంత యున్నతస్థితికి గొనిపోవును.

# స్మృతి-మనస్సన్న్యాసకర్మాచరణ

శిష్ట్లా లక్ష్మీనారాయణ

తేన త్యక్తేన భుఞ్జీథా మాగృధః కస్య
స్విద్ధనమ్.

—ఈశావాస్యం.

ఫలాపేక్ష లేకుండా కర్మలను ఆచరిస్తే మనిషికి రాగము అనేది కలుగదు. రాగము లేకపోవుటయే వైరాగ్యము. ఇదే మనస్సన్యాస కర్మాచరణ. వ్యక్తి దైనందిన జీవితంలో తనకు నిర్ణయమైన కర్మలను ఫలాపేక్ష లేకుండా ఆచరించడమే వైరాగ్యంతో కర్మలను ఆచరించడం. నిత్యజీవితంలో వైరాగ్యం అంటే కూడా అర్థం ఇదే. అంతేగానీ సాంసారికమైనటువంటిగానీ, సామాజికమైనటువంటిగానీ తన బాధ్యతల్ని విస్మరించడంకాదు. న్యాయస్థానంలో న్యాయమూర్తి నిందితుని ంచేటప్పుడు, వైద్యశాలలో వైద్యుడు రోగికి శస్త్రచికిత్స చేసేటప్పుడు ఆచరించే కర్మ ఒకవిధంగా ఇదే. ఉదాహరణకి జాతిపిత మహాత్మాగాంధీ జీవితమంతా వైరాగ్యంతో కూడిన కర్మాచరణకు మారుపేరు. భారతీయులకు స్వాతంత్ర్య సముపార్జనద్వారా సేవ చేయడమే ఆయన విధిగా ఎంచుకున్నారు. కానీ లక్ష్యసాధనలో వారు ఏవిధమైన లౌకిక, పారలౌకిక వాంఛలకు తావివ్వలేదు. వారు కోరితే దొరకని పదవిగానీ, ఆశిస్తే లభించని భోగభాగ్యాలుగానీ భారతదేశంలో లేవు. కానీ ఫలాపేక్ష లేకుండా కర్మని ఆచరించడంలో ఉన్న ఔన్నత్యాన్ని గ్రహించి బంధహేతువులైన ఎట్టివానినీ ఆశించలేదు.

భగవద్గీతలో విషణ్ణమనస్కుడైన అర్జునునికి శ్రీకృష్ణభగవానుడు హృదయదౌర్బల్యాన్ని వదలిపెట్టమని చెపుతూ

యావానర్థ ఉదపానే సర్వతః సంప్లుతోదకే
తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య
విజానతః.

సాంఖ్యం-46.

ఈ మాటల హృదయం అర్థంకాని అర్జునుడు జ్ఞానం గొప్పది అయినప్పుడు తనని కర్మ ఎందుకు ఆచరించమంటున్నాడో అర్థంకాక

జ్యాయసీచేత్ కర్మణస్తే మతాబుద్ధిర్జనార్దన
తత్కిం కర్మణి ఘోరేమాం నియోజయసి
కేశవ.

కర్మ-1.

అని తన సందేహాన్ని వెలిబుచ్చుతాడు. ఇది కీలకమైన ప్రశ్న. బ్రహ్మజ్ఞానికి కర్మతో నిమిత్తం లేదని శ్రీభగవానుడు అంటే అర్జునుడు, జ్ఞానమే ఉత్కృష్టం అయితే కర్మ ఎందుకు చేయాలి అంటాడు. మానవుడు ప్రతి ఆశ్రమంలోనూ కొన్ని కర్మలు చేయవలసి ఉంటుంది. ఆ కర్మలు ఆ ఆశ్రమధర్మాలే. అవి చేసి తీరాలి. అంతవరకే. వాటివల్ల లాభం కోరకూడదు. ఫలితాన్ని గూర్చిన ఎటువంటి చింతఅయినా వ్యక్తిని అరిషడ్వర్గాల వలయంలో బందీగా చేస్తుంది. అందుచేతనే జీవి చావు పుట్టుక చక్రంనుండి బయటపడలేడు. ఫలితం ఆశించకుండా కర్మలను ఆచరించటంవల్ల రెండు విషయాలు సాధ్యమౌతున్నాయి. మొదటిది రాగద్వేషాలకు లోను కాకుండుటచే జననమరణాలనే సంసారచక్రంలో చిక్కుకొనటం ఉండదు, రెండవది అహంకారం కలుగదు. ఈ రెండు ఫలితాలను ఆశించటమన్నది కూడా సాత్త్విక అహంకారానికి దోహదం చేస్తుంది. కర్మఫలానికి మానవుడు బాధ్యుడు కాడన్న పరమ

సత్యాన్ని మానవుడు గుర్తించాలి. దీన్నే శ్రీ కృష్ణభగవానుడు ఇట్లు చెపుతున్నాడు...

కర్మణ్యే వాధికారస్తే
మా ఫలేషు కదాచన
మా కర్మ ఫలహేతుర్భూ
ర్మాతే సంగోస్త్వ కర్మణి.
సాంఖ్య–47.

ఈ కొద్ది మాటల్లోనే భగవానుడు ఎంతో విషయాన్ని స్పష్టం చేశాడు. ప్రతివ్యక్తికీ కొన్ని కర్మలు ఏర్పడి ఉన్నాయి. వీటిని ఆచరించే రీతినిబట్టి వ్యక్తియొక్క ఆత్మోన్నతి తెలియ నౌతుంది. అంతేకానీ ఆచరించే కర్మలనుబట్టి మాత్రమే కాదు వ్యక్తి స్వభావాన్నిబట్టి సంఘంలో స్థానాన్నిబట్టి కొన్ని కర్మలు ఆచరిం చాల్సి ఉంటుంది. ఎవరు ఏ పనిని చేసినా అది వ్యక్తిలోని అహాన్ని పెంచి మానవుణ్ణి దానవు నిగా చేయకూడదు. ఇటువంటి శాంతి కూడా వ్యక్తిలోని అహంకారాన్ని పెంచుతుంది, అందుకనే భగవానుడు మోక్షసన్న్యాస యోగంలో ఇట్లా అంటున్నాడు.

ఏతాన్యపి తు కర్మాణి
సంగం త్యక్త్వా ఫలానిచ
కర్తవ్యానీతి మే పార్థ
నిశ్చితం మత ముత్తమమ్. xviii–6.

ఈ మాటల్లో భగవానుడు ఫలితంపై ఏరక మైన మమతను ఉంచవద్దు అంటున్నాడు.

మనలో చాలామంది వేదములు మనల్ని యజ్ఞయాగాదులనుచేసి స్వర్గ సౌఖ్యములను అనుభవించమని ప్రబోధిస్తున్నట్లుగా భావిం చటం పరిపాటి. కానీ వేదాలను, ఉపనిషత్తు లను నిశితంగా అధ్యయనం చేసినట్లయితే ఈ విషయం కేవలం ఒక అపోహ మాత్రమే అని పిస్తుంది. ఏ వేదము, వేదాంగము కోరికలతో, స్వార్థంతో ఆచరించిన కర్మలు నిజమైన శాంతిని, ఆనందాన్ని ఇస్తాయని చెప్పలేదు. నిర్మలమైన చిత్తంతో, నిష్కామకర్మని చేయ మని శ్రుతి, స్మృతి రెండూ ఘోషిస్తున్నాయి. కాబట్టి యజ్ఞయాగాదులు తు.చ. తప్పకుండా ఆచరించటం కేవలం ఏదో ఒక ప్రయోజ నాన్నే ఆశించి వివిధములైన పద్ధతుల్ని అవలం బించటం శ్రేయస్సుకి ఏమాత్రం దోహదం చేయవు అన్న విషయాన్ని మనకు అడుగడుగున చాటుతున్నాయి. అదీకాక ఉపనిషత్తు లన్నీ వైరాగ్యభావనతోనే కర్మలన్నీ ఆచరించి జీవి తాన్ని గడపమని చెప్పుతున్నాయి. ఈశా వాస్య ఉపనిషత్తులో 'తేన త్యక్తేనభుఞ్జీథ' అన్న పదాల హృదయం ఇదే. తరువాత శ్లోకంలో 'కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేత్ శతం సమాః' అన్న పదాలకు 'ఆవిధమైన భావన కలిగి కర్మలను ఆచరిస్తూ ఈ ప్రపం చంలో నూరు సంవత్సరాలు జీవించాలని ఆశిం చాలి' అన్నదే అర్థం.

కోరికలతో ఏవిధమైన ఫలాపేక్షతో చేసే అన్నిపనులు శ్రేయస్సును ఇవ్వలేవు. అవి వ్యక్తి యొక్క అహంకారాన్ని అధికం చేస్తాయి. ఈ విషయం ముండకోపనిషత్తు ప్రతి అక్షరంలోనూ స్పష్టం చేస్తోంది. వేదవేదాంగాలు ఇచ్చేవి కూడ అపరజ్ఞానమే. పరమైన జ్ఞానం ఆ పర బ్రహ్మను అణువణువున దర్శించగలిగినపుడే మానవ హృదయంలో సాక్షాత్కరిస్తుంది. కేవలం గ్రంథాలను పారాయణ చేసినందువల్ల ఒక వ్యక్తి పవిత్రుడు కాలేడు. పవిత్రత కేవలం వ్యక్తియొక్క నిశ్చలమైన విశ్వాసం, నిర్మల మైన చిత్తం మీద ఆధారపడి ఉంటుంది. ప్రతి వారు సంతరించే జ్ఞానం ఉత్తమమైనదా, అల్ప మైనదా అన్నది, అది పరవిద్యకు దోహదం చేస్తోందా, అపరవిద్యకు దోహదం చేస్తోందా

అన్న విషయాన్ని బట్టి ఉంటుంది. కర్మాచరణ యొక్క విలువ, విశిష్టత ఆచరించేవ్యక్తి మానసిక, ఆధ్యాత్మిక స్థాయిలచే నిర్ణయింపబడుతుంది. మనం ఆచరించే వేదవిధులన్నీ కొన్ని పరిమితమైన లక్ష్యాల్ని మాత్రమే సాధించటానికి ఉపకరిస్తాయి. కాబట్టి ముండకోపనిషత్తు వీటిని సామాన్యమైన ఫలితాలుగా పరిగణిస్తుంది. సామాన్యులు మాత్రమే ఇటువంటి కర్మాచరణను మిన్నగా పరిగణిస్తారు.

ప్లవా హ్యేతే అదృఢా యజ్ఞరూపా
అష్టాదశోక్త మవరం యేషు కర్మ
ఏతచ్ఛ్రేయో యేభినందంతి మూఢా
జరామృత్యుం తే పునరేవాపి యంతి.
1-2-7 శ్లో.

అంటే దీనినిబట్టి యజ్ఞయాగాదులను కించపరచినట్లు కాదు, ఒక ప్రత్యేక ప్రయోజనం, ఫలితాన్ని ఆశించి ఆచరించేవి ఏ క్రతువులైనా సంపూర్ణమైనజ్ఞానాన్ని, ఆత్మసాక్షాత్కారాన్ని (పరజ్ఞానాన్ని) ఈయలేవు అని. ఇటువంటి కర్మాచరణ తాత్కాలికంగా వ్యక్తిని కొన్ని క్లేశాల నుండి విముక్తుణ్ణి చేయవచ్చు. ఈ యజ్ఞయాగాదులు, క్రతువులు మంచి ఫలితాలను ఇయ్యవచ్చు. ఈ ఫలితాలను వ్యక్తి అనుభవించగానే తిరిగి మిగిలేది మనఃక్లేశమే.

అవిద్యాయాం బహుధా వర్తమానా వయం
కృతార్థా ఇత్యభి మన్యంతి బాలాః
యత్ కర్మిణో న ప్రవేదయంతి రాగాత్
తే నాతురాః క్షీణలోకాశ్చ్యవంతే,
1-2-9 శ్లో.

ఈసత్యాన్నే శ్రీఆదిశంకరులు సర్వవేదాంత సిద్ధాంత సంగ్రహంలో

పుణ్యాత్మయే పుణ్యకృతో నభస్థైః
నిపాత్యమానాన్ కృతాంగాన్
నక్షత్రరూపేణ దివశ్చ్యుతాన్తాన్
విచార్య కోవా విరతిం నయాతి.

అన్నారు.

వీటన్నిటినీ పరిశీలించగా ఒకటే విషయం స్పష్టమౌతుంది — ఏ విధమైన వాంఛతో, ఫలితం కోరి ఆచరించిన కర్మ ఏవ్యక్తికీ, ఎప్పుడైనా శాశ్వతమైన శ్రేయస్సును ఏమాత్రం ఈయలేవు. ఇదే వైరాగ్యం. వైరాగ్యం అంటే ఏవిధమైన మమత ఫలితములపై లేకుండుటయని అర్థం. సంఘంలో ఎంతోమంది సత్త్వ, రజస్, తమో గుణాలకు లోనై ఎన్నో పనులు చేస్తూ ఉంటారు వీరందరు కొద్ది తేడాలతో ఒకే స్థాయికి చెందినవారు. ఒక కోటీశ్వరుడు ఒక లక్షరూపాయలు విరాళంగా ఇవ్వవచ్చును, ఒక యతీంద్రుడు కొందరికి నాలుగు మంచి విషయములను తెలుపవచ్చును. వీరంతా కొద్దిపాటి తేడాతో చేస్తున్నది ఒకటే. ఈ విషయాన్నే ప్రస్తావిస్తోందా అన్నట్లు

ఇష్టాపూర్తం మన్యమానా వరిష్ఠం
నాన్యచ్ఛ్రేయో
వేదయంతే ప్రమూఢాః
నాకస్య పృష్ఠే తే సుకృతేను భూత్వేమం
లోకం
హీనతరం వా విశంతి. 1-2-10 శ్లో.

ఈ విషయాన్ని విపులీకరిస్తూ ప్రఖ్యాత రచయిత రోహిత్ మెహతా తన గ్రంథం "The Call of the Upanishads"లో అంటాడు.

> Now a mind that seeks reward, status recognition is a corrupt mind. Most often our so called humanitarian work is undertaken by such a corrupt mind. Needless to say such humanitarian

> work hardly differs from the performances of sacrifices in conformity with spiritual injunctions.

శ్రీవివేకానందస్వామి అమరవాణి

కర్మాచరణ - దాని రహస్యం గురించి శ్రీస్వామి 1900 సంవత్సరం జనవరి 4న లాస్ ఏంజిలస్, కాలిఫోర్నియాలో ఇచ్చిన ఉపన్యాసంలో ఇట్లు వివరించారు...

ఒక పనియొక్క లక్ష్యం పట్లే కాకుండా దానిని ఆచరించే పద్ధతి, మార్గంవైపు కూడా తగిన శ్రద్ధను కనబరచాలి. సామాన్యంగా మనం లక్ష్యంచేత ఆకర్షింపబడి ఆ లక్ష్యసాధనకు దోహదంచేసే ఎన్నో సూక్ష్మమైన వివరాలను విస్మరిస్తాం. కానీ జీవితంలో ఎక్కువ అపజయాలకు కారణం లక్ష్యానికి దోహదం చేసే సాధనసంపత్తివైపు తగిన శ్రద్ధను కనబరచకపోవటమే అని తేలుతుంది. అందుచేత సాధనసంపత్తివైపుకూడా తగిన దృష్టిని మనం మరల్చాలి - ఈ విషయాల్ని ముచ్చటిస్తూ గీత నుంచి శ్రీ స్వామివారు ఉదహరిస్తారు...

> తస్మాదసక్తః సతతం
> కార్యం కర్మ సమాచర
> అసక్తో హ్యాచరన్ కర్మ
> పరమాప్నోతి పూరుషః III 19.

'అసక్తః' అంటే కర్మయొక్క ఫలితంమీద అనవసరమైన అనురక్తిలేక అని అర్థం చెప్పాలి. మనజీవితాల్లో సర్వ క్లేశాలకి, దుఃఖానికి మూలకారణం మన ప్రయత్నాల ఫలితాలపట్ల అనుచితమైన మమత్వాన్ని పెంచుకోవడమే. ప్రతివ్యక్తి తన సర్వశక్తుల్నీ తాను ఎట్లా ప్రయత్నంచేసినాసరే ఫలితంపై మాత్రం కేంద్రీకరిస్తాడు. ఎన్నో ఆశల్ని పెంచుకుంటాడు. ఈ సందర్భంలో ఆశించిన ఫలితం సమకూరనప్పుడు వ్యక్తికి మిగిలేది కేవలం నిరాశమాత్రమే- దీనివల్ల వ్యక్తి సమయాన్ని దుర్వినియోగం చేయవచ్చు ఏ కర్తవ్యాన్ని నిర్వహిస్తున్నా, ఏ బాధ్యతల్ని చేపట్టినా మనం తీరిపోని ఫలవాంఛలచే మనలను మనం మరువకూడదు.

శ్రీ వివేకానందులు జీవితంలో వ్యాపార దృష్టిని తీవ్రంగా నిరసించారు. ప్రతిపనికి లాభనష్టాల పట్టికను తయారుచేయటం మందభాగ్యుల లక్షణమని, జీవితం సక్రమంగా నడవాలంటే ఫలితాన్ని కూర్చిన చర్చవదలి శ్రద్ధాసక్తులతో వివిధమైన విధుల్ని నిర్వహించటమే నన్నారు. శ్రీ స్వామివారు...

> We are all beggers, whatever we do we want a return, we are all traders ......... Desire, want, is the father of all misery.

అన్నారు. నిజమైన శాంతి, సౌఖ్యాలకు మూలం నిస్వార్థం. ఈ భావనతో జీవితాన్ని సాగించినప్పుడే దుఃఖం అన్నది మటుమాయమై మాటలలో చెప్పలేని, ఊహకు అందని అమరమైన ఆనందం అనుభవపూర్వకంగా మనకు సాక్షాత్కారమౌతుంది. ఈ స్వామివారు ప్రవచించారు.

> Ask nothing; want nothing in return give what you have to give, it will come back to you—but do not think of that now. It will come back multipled a thousand fold—but the attention must not be on that. Yet have the power to give; give, and there it ends. Learn that the whole of life is giving, that nature will force you to give. So give willingly. Sooner or later you will have to give up.

ఈ భావనే వేదవిజ్ఞాన పరంపరలో మణిదీపంవంటి బృహదారణ్యకోపనిషత్తులో వెల్లివిరుస్తోంది. ప్రజాపతికి మూడురకాలైన పుత్రులు- దేవతలు, మానవులు, దానవులు

ఉన్నారు. ఒకసారి దేవతలు ప్రజాపతిని జీవితానికి వెలుగునిచ్చే ఒకసలహా నివ్వమన్నారు. అప్పుడు ప్రజాపతి 'ద' అన్నాడు. దాని అర్థాన్ని 'సంయమం' అని వారు గ్రహించారు. అదేవిధంగా మానవులూ అడిగారు. మరల ప్రజాపతి 'ద' అని ఉచ్చరించాడు. దీని అర్థం 'దానం ఇవ్వు' అని మానవులు గ్రహించారు...

> అథ హైనం మనుష్యా ఊచుః బ్రవీతునో భవానితి;
> హైత దేవాక్షర మువాచ ద ఇతి;
> వ్యజ్ఞాసిష్టా ఇతి, వ్యజ్ఞాసిష్మేతి హోచుః;
> దత్తేతి ని అత్థేతి ఓమితి హోవాచ వ్యజ్ఞాసిష్టేతి. V-II-2 శ్లో.

కాబట్టి వివేకానందులు నిజమైన స్వార్థం నిస్వార్థ కర్మాచరణలోనే ఉంది అంటారు. కాలమేదైనా, దేశమేదైనా, మానవసమాజమేదైనా, మతాలేవైనా, తత్త్వవేత్తలెవరైనా సర్వజనామోదమైన ధర్మసూత్రాలు ఒకటే. ఈ సత్యానికి ఉపబలంగా ప్రఖ్యాత ఆంగ్లకవి (నోబెల్ బహుమతి గ్రహీత) T. S. Eliot మహాశయుడు తన ఖండకావ్యం 'The Waste Land'లో ఆధునిక సమాజ కృత్రిమ వ్యవస్థను విమర్శిస్తూ మానవాళి సర్వతోముఖ సౌభాగ్యానికి, అమరమైన శాంతికి పైనుదహరింపబడిన ఉపనిషత్ సారమే మూలమార్గంగా సూచించాడు. సూర్యుడు సముద్రజలాన్ని గ్రహించి తిరిగి ఎన్నోరెట్లుగా ఇస్తున్నాడు. కాబట్టి మనం సంఘంనుండి గ్రహించుకున్న దాన్ని తిరిగి ఎన్నోరెట్లు ఇవ్వటంలోనే నిజమైన సార్థకత ఉంది. అందుకనే శ్రీ వివేకానందులు...

> **Ask, therefore, nothing in return; but the more you give the more will come to you.**

నేటి సమాజంలోని ఆర్థిక అసమానతలకు, దురాచారాలకు, అన్యాయాలకు, విశృంఖల వర్తనకు మూలం మానవాళి ఈ వైరాగ్య భావనను ఏమాత్రం గ్రహించకపోవటమే. నేడు మనం ఏ మంచివిషయాన్నైనా గ్రహించినా ఆచరణలోనికి ఏమాత్రం తీసుకురాలేం. జీవితం అంటే నిరంతరం పెరిగే భౌతికావసరాలను తీర్చుకోవడమే అనుకుంటున్న ఈ రోజుల్లో ప్రతివారు జీవితపరమార్థం భౌతికావసరాల పరిధినిమించి చూడలేకుండా ఉన్నారు. అటువంటి సమయంలో ఇటువంటి విషయప్రస్తావన కూడా ఛాందసుని ప్రలాపనగానే ఉంటుంది. నేడు దానవుల్ని సైతం మైమరపించే హింసాత్మక ధోరణులు (అన్నిరంగాల్లోనూ) అహంకారం ఊపిరిగాగల కర్మాచరణనుండే ఉద్భవిస్తున్నాయి. ఈనాడు మనం అరిషడ్వర్గాలకు బానిసలం. మనస్సు ఎంతో పెరిగిపోతోంది, హృదయం మృగ్యమౌతోంది. మానవులలో దానవత్వం అనంతమైన రూపాల్లో ఈ భూమిపై మానవాళి మనుగడకే ముప్పు తెస్తోంది. ఇటువంటి స్థితిలో వైరాగ్య భావనతో కర్మాచరణ తప్ప వేరొకటి తోచటం లేదు. కర్మలను ఆచరించేటప్పుడు ఫలితాలపై మనస్సు నిలుపవద్దని శ్రీ స్వామివారు ఆదేశించారు.

> **'Be, therefore, not a beggar; be unattached.'**

ఇది వినటానికి చాలా తేలికగా ఉంటుంది. కానీ ఆచరణ అసిధారా వ్రతచర్యవంటిది. అందుకనే శ్రీ స్వామివారు ఇట్లా అన్నారు.

> **Let us perfect the means; the end will take care of itself. For the world can be good and pure only if our lives are good and pure. It is an effect, and we are the means. Therefore, let us purify ourselves. Let us make ourselves perfect.**

కొద్దిమాటల్లో చెప్పాలంటే వైరాగ్యంతో చేసే కర్మలలోనే మానవునికి నిజమైన స్వేచ్ఛ, విశ్రాంతి లభిస్తుంది. కేవలం స్వార్థంతో చేసే పనులన్నీ మన స్వేచ్ఛను అరికట్టి శాంతిని భగ్నం చేస్తాయి. కాబట్టి స్వామివారు వైరాగ్యభావనతో సంఘసేవను చేయమన్నారు. వ్యష్టిప్రయోజనం, సమష్టి సంక్షేమం నిజానికి వేరు కాదు. కానీ సంకుచిత స్వార్థత, ద్వేషం, అసూయ వ్యక్తికి, వ్యక్తికి; దేశానికి, దేశానికి మధ్య లేనిపోని అగాధాల్ని సృష్టించి మానవాళి [illegible]గడకే ముప్పు తెస్తున్నాయి. వైరాగ్యభావనతో వ్యక్తిగత బాధ్యతల్ని నిర్వహించే వ్యక్తి సంఘానికి ఎనలేని సేవచేస్తాడు. ఆచార్య నాగరాజరావు తన గ్రంథం 'Contemporary Indian Philosophy' లో శ్రీ వివేకానందుల భావసంపదను వివరిస్తూ అంటాడు:

> 'True renunciation is what the Gita teaches. It is Karma-yoga. It is not freedom from activities, it is the realisation of freedom in activities. It is performance of one's duties for social good in a spirit of perfect selflessness of dedication to the Lord. It is not donothingism. Renunciation makes service perfect.'

కృష్ణభగవానులు భగవద్గీతలో జ్ఞానమార్గం, కర్మమార్గం రెండూ వేరుకావు అని ప్రతి అధ్యాయంలోనూ వ్యక్తియొక్క మనస్సు ఎట్లా ఉండాలి, ఎట్లా ఉండి కర్మలని ఆచరిస్తే నిజంగా ఆచరించినట్లవుతుంది అన్న విషయాల్ని విపులీకరించి చెపుతాడు.

ఏరకమైన కోరికయైనను (పరమేశ్వర సాన్నిధ్యం కావాలి అన్న కోరిక అయినాసరే) సరే ఆ కోరిక అనుభవించుటచేత నెరవేరదు. అది అనుభవించుటవలన కోరికలు అధికమగును. మనువు ఇట్లా అన్నాడు....

> నజాతు కామః కామానా
> ముపభోగేన శామ్యతి
> హవిషా కృష్ణవర్త్మేవ
> భూయ యేవాభి వర్ధతే.

అందుచేత వివిధమైన కోరికయూ లేక జీవిత సాగరాన్ని మానవుడు దాటడానికి యత్నించాలి. 'నేను ఇట్లా ప్రయత్నం చేయాలి, ఈ ఫలితం వస్తుంది' అన్న భావన ఏమాత్రం హృదయంలో మిణుకు మిణుకుమన్నా మిగిలేది అరిషడ్వర్గాలకు ఆలవాలమైన జననమరణ వలయమే.

గత శతాబ్దంలో మహనీయులై విరాజిల్లిన శ్రీ రామకృష్ణపరమహంస, శ్రీ వివేకానందస్వామి అవ్యవహితంగా వస్తున్న సనాతనధర్మ పరంపరను పునికిలి పుచ్చుకొని నిరంతరం అశాంతితో అలమటించే మానవాళికి వెలుగు చూపించారు. శ్రీ వివేకానందస్వామి పశ్చిమ దేశాల్లో చేసిన ఉపన్యాసాలు కేవలం ఉపన్యాసాలు కాక, చారిత్రిక అవసరం కలిగిన కొన్ని మరపురాని ఘట్టాలు. మానవత్వం యొక్క విశిష్టత, మానవజన్మకు సార్థకత అర్థం కాక ప్రపంచాన్ని నరకంగా మార్చే మానవులలోని దానవులకు వారి వాణి వెలుగు నిచ్చింది. శ్రీవివేకానందస్వామి అభియోగంలో అడుగిడిన మానవాళి శ్రేయస్సు కేవలం వైరాగ్యంతో కూడిన కర్మాచరణలోనే ఉంది అన్నారు. ఇదే శ్రుతి, స్మృతుల సారం.

సహనావవతు, సహనౌభునక్తు, సహవీర్యం కరవావహై, తేజస్వినావధీతమస్తు, మా విద్విషావహై.

ఓం శాంతిః శాంతిః శాంతిః.

# త్యాగము - సేవ

## బి. యస్. ఆర్. ఆంజనేయులు

మానవుడు సంఘజీవి. కలిసి బ్రతకటం జీవుల స్వభావము. పక్షులు ఆకాశంలోను, క్రిమికీటకాలు భూమిపైనను క్రమపద్ధతులలో తిరుగుతూ అన్యోన్యంగా జీవించుచున్నవి. జంతువులు కూడ మందలు మందలుగా గుమికూడటం, శత్రువుల నెదుర్కొనటం జరుపుతున్నవి. ఒక్కొక్క జీవికి ఒక్కొక్క ప్రత్యేక లక్షణం వున్నది. గద్దలు ఎన్నోమైళ్ల నుండి చూడగలవు. పిల్లులు, పులులు చీకటిలో చూడగలవు. ఇట్లే ఇతర జీవులు.

మానవుడు సంఘజీవియైనా అతనికొక ప్రత్యేకత ఉన్నది. ఇతర జీవులు ప్రకృతికి బద్ధులై ప్రవర్తిస్తే అతడు ప్రకృతిని ధిక్కరిస్తున్నాడు. దీనికి కారణం అతనిలో గల విచక్షణా జ్ఞానమే. ప్రాచీన హైందవ నాగరికత వైపు మన దృష్టి మళ్లిస్తే ఆకాశంలో మానవుడు (పుష్పకాది విమానాలలో) ఎగిరిపోయినాడు. అగాధ సముద్రాలలో దూరినాడు. తన యిచ్చవచ్చినట్లు బాహ్య ప్రకృతిని చీకాకు పరచినాడు. అంతేకాక తన మానసిక శక్తులను నిగ్రహించి దూరశ్రవణం, దూరదర్శనం మాత్రమే గాక దూరగమనం, అణిమాది శక్తులు సంపాదించి తన విశిష్టత ప్రదర్శించినాడు.

ప్రకృతిని అనుసరించి యితర జీవులు సామరస్యంగా జీవించగలుగుతుంటే, ప్రకృతిని జయించగల మానవుడు అలా వుండలేక పోవటం గమనార్హం. ప్రకృతిపై ఆధిపత్యం సాధించాలనే ఆకాంక్షతో, తోడి మానవులపై కూడ అది చూపాలనే యత్నమే దీనికి కారణం. బాహ్యప్రకృతిని జయించి తత్ఫలితాల గర్వముతో ఇతరులపై అధికారం చూపబూనటంవల్ల ఇతరులకు తనపై ఈర్ష్య, సంఘర్షణలు కలుగుతున్నవి. వాటి నరికట్టుటకు ఏర్పడినవే విధులు, నియమాలు, చట్టాలు, శాసనాలు. బాహ్యప్రకృతి జయం ఎక్కువ మందికి అందుబాటులోనిదే గనుక మరికొందరు మనోనిగ్రహముచే బడసిన సిద్ధుల వల్ల, అస్త్రాలవల్ల ఇతరులపై తమ ఆధిపత్యాన్ని సాగించినారు. ఇదికూడ సంఘర్షణకే దారితీసింది. రెండు రకాలైన యీ సంఘర్షణలకు కారణము ఫలితాలకై ప్రాకులాటయే యని గ్రహించి దాని నతిక్రమించదలచిన మహాత్ములు ''వివిక్త దేశ సేవిత్వం, అరతిర్జన సంసది'' యనునవి సాధనాలని గ్రహించి నివృత్తి మార్గంలో ప్రవేశించి శాంతిని, ఆనందాన్ని బడసినారు. ఎవ్వరిలోను సంఘర్షణ లేకపోవుటచే వారు అందరికీ ప్రీతిపాత్రులు, ఆదర్శవంతులు అయినారు.

ప్రకృతి సంపదలను భోగ్యవస్తువులుగా ఉపయోగించు కొలదీ మానవుడు ప్రకృతికి దాసుడై ప్రకృతి అధీనములోనికే వచ్చి కట్టుపడుచున్నారు. కావున మహాపురుషులు జనసామాన్య శ్రేయముకై ''మానవుడు తాను పరుల శ్రేయమునకే జీవించవలెను, యాచన నీచము, తాను తీసికొనుట యిబ్బడిగా పరుల కిచ్చుటకే'' యనునట్టి కొన్ని నియమముల విధించిరి. భోగానుభవములో గల అనర్థములను చవిచూచుటచేతను, తాను ప్రకృతి కన్న విలక్షణమైన పరమాత్మనని సాక్షాత్కరించుట చేతను భారతాదర్శము, అంతర్ముఖత్వములోను, త్యాగములోను సుస్థిరమై సర్వప్రపంచమును ఒకే పరమాత్మ స్వరూపముగా

గ్రహించి సర్వశ్రేయమును కోరుచున్న యీ సంస్కృతి యుగయుగములుగా నిలిచియున్నది.

కాని కాలమొక్క రీతి గడువదు. కాలము గడచిన కొలది మనోనిగ్రహమువల్లనే సాధ్యమగు పరమాత్మదర్శనముగాని, అణిమాది అష్టసిద్ధి సంపాదనగాని వెనుకబడిపోయినవి. బాహ్య సంపదల నశ్వరత్వము మాటిమాటికి నొక్కి చెప్పబడి యుండుటవల్ల దానికై శ్రమించుట తగ్గిపోయి దాని స్థానములో అలసత్వం, నైరాశ్యం, నిస్పృహ పెరిగిపోయినవి. ఆచరణకు మారుగా ధర్మప్రశ్నాలు పల్లించటం, లేక ఏవో కొన్ని పద్ధతులను పట్టుకొని ప్రాకులాడుటయే మతంగా నిలిచిపోయినది.

సత్యాన్వేషణలో భారతీయ విధానానికి గ్రీకు సంస్కృతి విభిన్నము. అది బాహ్యము. దాని ప్రభావము పాశ్చాత్య దేశము లన్నింటిలోను చొచ్చుకొని పోయినది. అందుచే ఈ అన్వేషణ ప్రకృతి నెదిర్చి కట్టబడిన కట్టడములతో ప్రారంభమై విస్ఫోటనోత్పాదన, అణువును బద్దలు కొట్టి అణుశక్తి నీవలకు లాగి తయారు చేసిన మారణాయుధముల వరకు సాగినది. దూర శ్రవణ యంత్రములగు వైర్లెసు, రేడియోలు, దూరదర్శన సాధనములగు టెలివిజనులు, దూరగమన పరికరములగు విమానములు రాకెట్లు, కృత్రిమ ఉపగ్రహములు ప్రతివారికి బాహ్యగోచరములైపోయినవి. జన సామాన్యము సులభముగా గ్రహింప గలిగినట్లుగాను అవసరమైనచో డబ్బుపెట్టికొని తక్షణమే ఉపయోగించుకొనునట్టివై యున్నవి. ప్రయోగశాలలో ఇవి ప్రతివారు సులభముగా పరీక్షింపవచ్చును గాన మనోనిగ్రహములో మతపరముగా ఏర్పరుపబడిన నియమములుగాని, నమ్మకములుగాని, సిద్ధాంతములుగాని, ఆధునిక హేతువాదబద్ధమైన మనస్సులకు అవహేళనాపాత్రము లైపోయినవి.

ఈ ప్రభావము ప్రాక్ప్రతీచీ దేశములన్నింటిలోను కార్చిచ్చువలె అలముకొనినది. భారత దేశము మాత్రము ఏకాంతములో ఎట్లుండగలదు? ప్రకృతి, రసాయన శాస్త్రములు గొనివచ్చిన ఫలితములు, ప్రజల సుఖ జీవనమునకును, భౌతికావసరములు తీర్చుటకును ఎంతో తోడ్పడుచున్నవి. అందుచే నిత్యావసరములగు కూటికి, గుడ్డకు, వసతికి, ఆనందమునకు ఆధునిక మానవుడు అవిరామ కృషి చేయుచున్నాడు.సమస్తము అతనికి వెంటనే రావలెను. ఆలస్యమునుగాని, తన ప్రయోజన సిద్ధిలో ఆటంకమునుగాని సహించలేడు. దీని పర్యవసానము—విద్యలో కల్తీ, వైద్యములో కల్తీ, విత్తములో కల్తీ, మనస్సులో కల్తీ, మస్తిష్కములో కల్తీ. దానిచే నష్టము తనకు కలిగినా, తనవారికి కలిగినా తనకు పట్టనంత దట్టముగా అతడు తనకు బైటను, లోపలను అడ్డుగోడలను కట్టుకొని యున్నాడు. అతనికి అనవరతము అశాంతి, ఆందోళన, ఆరాటము, భయము. ఈ బీభత్సములో అందని శాంతికై అఱ్ఱులు జాచుచున్నాడు.

ఆధునిక మానవుడు పూర్వమువలె ఏకాంతంలో ఉండాలనుకున్నా వీలులేదు. ఏ విషయంతో ఏ విషయం ముడిపడి యున్నదో చెప్పలేనంత గజిబిజిగా, సాంఘిక సమస్యలు, ఆర్థిక సమస్యలు, రాజకీయములు, పరిపాలనా విధానములు, వృత్తి విషయములు, వైజ్ఞానిక విషయములు పెనవేసుకొని పోయినవి. ఎదిగిపోయిన తరమునకు, ఎదుగవలసిన తరమునకు మధ్యగా ఎదుగుచూ విద్యావంతులై నిర్వ్యాపారులైన యువతరము భయానకమైన సమస్యగా మారబోవుచున్నది. విజ్ఞానదాయక

ముగా నుండవలసిన విద్య విద్వేషకారిగాను, వినాశకారిగాను మారుచున్నది. కలుషిత వాతావరణము, విద్వేషము యంత్రముపై పూర్తిగా ఆధారపడుట భయానక పరిస్థితులకు దారితీసినవి.

ఇట్టి పరిస్థితులలో సుస్థిర శాంతి, సహజీవనము సాధ్యమా? భారత దేశమునకు త్యాగము, సేవ ఆదర్శములని వానిని శక్తివంతము నర్చినచో దేశభవిష్యత్తు ఉజ్జ్వలమగునని, భారత దేశమే ప్రపంచమునకు శాంతి సందేశమిచ్చునని వివేకానందస్వామి చెప్పియున్నారు. అది సంభవించుట యెట్లు?

త్యాగము మనిషికి క్రొత్తకాదు. చంటిబిడ్డ ఏదో ప్రమాదమునకు గురికాబోవునప్పుడు తల్లి అమాంతము ఆ ప్రమాదములోకి దూకును. ప్రాణమునుకూడా లెక్కచేయదు. విద్యార్థులు పరీక్షా సమయములలో ఆకలి దప్పులను, శరీరారోగ్యమును లక్ష్యపెట్టక శ్రమింతురు. గొప్ప రాజకీయ ఉద్యమాలలో ఎందరో త్యాగములు చేయుదురు. వీటన్నింటిలో త్యాగమున్నది. కాని ఆ త్యాగమంతా వారు తమకున్నదానికన్న ఏదో యొక గొప్ప ప్రయోజనాన్ని, ఫలితాన్ని ఆశించి చేసినదే. కాని ఆ ఫలితము రాకపోతే కలిగే నిరుత్సాహాన్ని గూర్చి చెప్పనవసరంలేదు.

ఫలితాన్ని ఆశించి చేసే పనిలో అపజయ ప్రమాదాలు, తద్వారా విషాదము ఇమిడి ఉన్నవి. మకరందాన్ని ఆశించి పద్మములో దూరిన తుమ్మెద తెల్లవారేసరికి — కమలము రాత్రంతా ముకుళించినందువల్ల — మరణిస్తున్నది. తేనె త్రాగాలని దానిలో కాలు పెట్టిన చీమ, ఈగ అందులోనే అతుక్కుపోతున్నవి. అదేవిధంగా మనము అనుభవింతామని ఆశించే ఫలితాలన్నీ మనను బానిసలుగా చేసి మననే అనుభవిస్తున్నవి. కావుననే గీతలో, ''కర్మణ్యేవాధికారస్తే, మాఫలేషు కదాచన'' అని కృష్ణపరమాత్మ చెప్పియున్నారు. ''నీకు కర్మ చేయటానికే అధికారమున్నది కాని ఫలితాన్ని ఆశించుటకు గాదు. అలాగని పనిచేయకుండా ఉండకూడ''దని ఆయన నిర్దేశించియున్నారు. ''అత్యంత సక్తతతో పనిచేసి, అవసరమైనచో ఏమాత్రము బాధపడకుండా వదలగలవాడు మహాత్ముడ''ని వివేకానందస్వామి చెప్పియున్నారు.

> యదా సంహరతే చాయం
> కూర్మోఽంగానీవ సర్వశః
> ఇంద్రియాణీంద్రియార్థేభ్య
> స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా.
>
> గీతా-2-58

తాబేలు సునాయాసంగా తన అవయవాలను లోనికి ముడుచుకున్నట్టు తన యింద్రియాలను భోగ్యవస్తువులనుండి వెనుకకు మరల్చగలవాడు స్థితప్రజ్ఞుడని గీత వివరిస్తున్నది. ఫలితాన్ని ఆశించకుండా ఎవ్వరూ పనిచేయరు. అనుభవించేటప్పుడు కష్టం కలుగుతున్నా కూడా ఫలితాన్ని వదలరు. కావున తలచినప్పుడు వదలగలవారు మహాత్ములు అనిగదా దీని సారాంశము.

ఫలితం లేకుండా పనిచెయ్యటం సాధ్యమా? బిచ్చగాడికి ఏదో కొంత లభించినా తూష్ణీంభావముతోనే అది లభ్యమవుతున్నది. దీనంగానే దాన్ని అతడు అనుభవిస్తున్నాడు. అదే విధంగా ఫలితాన్ని ఆశించి చేస్తున్న మనమంతా బిచ్చగాళ్ళమే. ఫలానుభవమంతా విషాదాంతమే. మన కార్యాచరణ విధానమంతా ఫలితంతో ముడివేసుకున్నదే. కారణ

మేదో కార్యమదే. విధానమేదో పర్యవసాన మదే. కావున కారణమే విధానము. ఫలితాలను ఆశించేవి కోరికలు. వాటి పర్యవసానము సక్తత, తద్వారా బద్ధత.

మన విధానము ఫలములను ఆశించేది కాకపోతే మనకు ఎక్కువ ఫలితమే లభిస్తుంది. ఒకగింజ భూమిలోపాతితే చాల గింజలుగా అది మనకు తిరిగివస్తున్నది. నదులు సముద్రంలో నీళ్ళు విసర్జిస్తుంటే వెనకాల ప్రవాహాలు వచ్చిపడుతూనే ఉన్నవి. అదేవిధంగా మనకు తక్షణమే కానరాకపోయినా ఇతరులకు ఇచ్చేదంతా అనేక రెట్లుగా వృద్ధిచెంది మనకే తిరిగి వస్తుంది. తన వ్యక్తిత్వాన్ని మరచిపోయినప్పుడే శిల్పి సుందరప్రతిమను మలచగలుగుచున్నాడు. తనను మరచినప్పుడే కవి అద్భుత కవితాఖండాన్ని సృష్టిస్తున్నాడు. తన స్వార్థాన్ని వదలినప్పుడే ఎక్కడైనా, ఎప్పుడైనా మహాకార్యాలు సాధించబడినవి. 'ఫలితాన్ని ఆశించకుండా కర్మచెయ్యమని' గీత ప్రతిపాదించిన దానిలోని రహస్యమిదే. అలాచేసినది "దుఃఖసంయోగ వియోగం యోగం". దుఃఖము స్పర్శమాత్రంగాకూడా దగ్గరకురాని యోగస్థితి అది. ఆ స్థితప్రజ్ఞస్థితి ఫలితాన్ని ఆశించకుండా అనాసక్తితో కర్మ చెయ్యటంవల్లనే లభ్యమౌతుంది. కాబట్టి వివేకానందస్వామి మనకాదేశించిన త్యాగమనేది అన్నీ వదలిపెట్టి ఎక్కడికోపోయి కర్మనుండి విరమించటం కాదని, ఫలితాన్ని ఆశించకుండా గొప్ప స్ఫూర్తితో కార్యరంగమున దుముకుటయే యని గ్రహించవలసి యున్నది.

భారతదేశమునకు స్వామి సూచించిన రెండవ ఆదర్శము సేవ. సేవ అనగానే యితరులకేదో ఉపకారము చేయాలని వెంటనే భావిస్తాము. మనము అసలు ఎవ్వరికి సహాయము చేయటంలేదు. ఎవ్వరిని ప్రేమించటమూ లేదు. సహాయము చేస్తున్నామని, ప్రేమిస్తున్నామని మాత్రమే చెప్పుకుంటాము. భార్య భర్తను ప్రేమించినా, తల్లి పిల్లను ప్రేమించినా, గృహారామాదులను ప్రేమించినా, వాటికొరకు వాటిని ప్రేమించటంలేదని, తమకొరకే తాము సర్వమును ప్రేమిస్తున్నారని బృహదారణ్యకోపనిషత్తులో యాజ్ఞవల్క్య మహర్షి భార్యయైన మైత్రేయికి చెప్పి యున్నాడు.[1] సూక్ష్మంగా విచారించి చూస్తే మనం చేసేదంతా మనకొరకేనని తేలుతున్నది. అద్దంలో చూచి మన ముఖాన్ని సరిదిద్దుకుంటున్నాము. అలాగే ప్రపంచమనే తాలింఖానాలో ఇతరులకు చేసే ప్రతిపనివల్లా సరిదిద్దబడుతున్నది మనమేగాని మరెవ్వరూ గాదు. అద్దంలో ప్రతిబింబము బాగా లేకపోతే తప్పు అద్దానిదా? అలాగే ప్రపంచములో కనిపిస్తున్న అనేక లోపాలు ప్రపంచానివి కాదుగదా! బింబము అందంగా ఉంటే ప్రతిబింబము అందముగా ఉండదా? మనకు ప్రపంచము బాధాకరముగా ఉన్నదంటే బాధ మనలోనేకదా ఉన్నది? కావున వ్యక్తి మారితే ప్రపంచము దానంతటదే మారిపోతుంది. వ్యక్తికన్నా ప్రపంచం వేరుకాదు కాబట్టి.

మానవుడు మాధవునికన్నా భిన్నుడుకాదు. వివేకానందస్వామి సరళాఘోషాలుకు వ్రాయుచు "ఐర్లండు దేశములో బానిసగా చూడబడి వ్యక్తిత్వమే గోల్పోయి తాను బానిసనే యని నమ్మి కృంగి కృశించినవాడు

1. బృహదారణ్యక 4-5-6.

తన చింకిపాత మాటతో అమెరికాలో దిగిన వెంటనే అతని వీపు తట్టుచు ఇట్లు వినవచ్చినదని వ్రాసెను. "సోదరా! నీవు కూడా మావంటి మనిషివే. ఇది చేసిందంతా మనిషే. నీవంటివాడు, మావంటివాడు ఏదైనా చేయగలడు. ధైర్యం వహించు." ఈ మాట వినగానే వాడు తలయెత్తి చూడగా అంతా అలాగే కనిపించింది. అతనిలోనున్న బ్రహ్మము మేల్కొన్నాడు. సర్వ ప్రకృతి జాగృతమైంది. అదేవిధంగా ఆత్మశక్తి జాగృతమైనప్పుడు "శక్తి వస్తుంది. ప్రతిభ వస్తుంది, మంచి వస్తుంది, పవిత్రత వస్తుంది."[1]

మానవుడంటే తాను కేంద్రంగా కలిగి ఎక్కడా కానరాని పరిధి కలిగిన వృత్తమని, దైవమంటే సర్వత్రా కేంద్రముకలిగి ఎక్కడా కానరాని పరిధిగల వృత్తమని స్వామి నిర్వచించి యున్నాడు. మానవుడు ఇతరులకు సేవచేయటమంటే వ్యక్తిత్వమనే కేంద్రంలోని అల్పత్వాన్ని విస్మరించటమే. అప్పుడు ప్రపంచానికి చేసే సేవంతా తనకుతాను చేసుకోవటంకన్న వేరుగాదు.

సమాజము లేక సంఘము లేక సర్వము తనకన్నా భిన్నం కాదనే ఈ "అద్వైతం, నిత్యజీవితంలో సజీవమై, కళాత్మకమై, విస్పష్టమయ్యే నైతిక రూపాన్ని దాల్చాలి. అగమ్యగోచరంగా ఉండే యోగవిధానాలలోనుండి బయటకువచ్చి, పూర్తిశాస్త్రసమ్మతమై, పసిబిడ్డసైతం అర్థంచేసుకొని ఆచరించేటంత సులభం కావాలి." అని స్వామి యింకొక శిష్యునకు వ్రాశాడు. అప్పుడు- (సోదరి నివేదిత వివేకానంద సంపూర్ణ గ్రంథావళి ఉపోద్ఘాతములో ఉదహరించినట్లు) "చేసే ప్రతిపని, పడే ప్రతిశ్రమ, సృజనాత్మకమైన ప్రతి విధానము, సాక్షాత్కారమునకు మార్గాలు" అవుతవి. మనము చేసే ప్రతిపని దాని సాధనగా మారుతుంది. "ఈ సాధన ఏ గుడికో, చర్చికో పోయి చేయనక్కరలేదు. నీ యింటిలో, నీ నిత్యకృత్యాలలో, నీ భోజనశాలలోనే, ఎక్కడబడితే అక్కడ నీవు ఆచరించవచ్చు. వేదాంతం అంటే ఏదో కాదని సులభంగా అర్థమయ్యే మౌలిక సత్యమే"[2]

వివేకానందస్వామి ఇంకొకచోట వ్రాయుచు "ప్రపంచమంతా వెలుగును కోరుతున్నది. దానికై కాచుకొని ఉన్నది. భారతదేశంలోనే ఆ వెలుగున్నది. ఆ వెలుగు గారడీలో లేదు, మోసంలో లేదు, మహత్తుల్లో లేదు. అది అత్యుత్తమమైన యథార్థ వేదాంత ధర్మజ్యోతియందే ఉన్నది."

కావున వివేకానందస్వామి యిచ్చిన 'త్యాగము-సేవ' అనే ఔషధాన్ని సేవిస్తే భారతదేశములో మతము పేర నేడు కన్పించుచున్న కశ్మలమంతా క్షాళనమై కాంతులీనే దివ్యజ్యోతి అందరికి మార్గదర్శకంగా వెలుగొందుతుంది. త్యాగము (ఫలాన్ని ఆశించకుండా కొద్ది గొప్పలతో ప్రమేయం లేకుండా శ్రద్ధతో చేయటం) తనకన్నా సంఘము వేరుగాలేదు కావున సంఘములో కన్పించే లోపం తనవల్లనే వచ్చినందువల్ల, స్వార్థం పేటచేసే అన్యాయాలన్నీ తన వైపుకే తిరిగి చేరవచ్చునని తెలియటంవల్ల ఇతరుల ప్రయోజనానికే తాను ఏ పనినైనాచేసి తీరాలని గ్రహించి పనిచేయటమే-సేవయని గుర్తించిననాడు, భారతావని శాంతినిలయమై, ప్రశాంతి ప్రదాయినియై నిలిచిపోతుంది.

1. Lecture on the mission of Vedanta.
2. P. 212 Prabuddha Bharata May '75.

# వైరాగ్యము—గృహస్థ జీవనము

సి. పూర్ణచంద్రరావు

వైరాగ్యము సన్న్యాసులకే తగినదని ప్రస్తుత కాలమున నొక దురభిప్రాయము గలదు. కాని విచారించి చూచినచో వైరాగ్యము లేక సన్న్యాసమునగాని సంసారమునగాని ఏ ఘనకార్యమును సాధింపబడదని నిశ్చయముగ బయలుపడును. వైరాగ్యమన నేమి? తన లాభమును సుఖమును గూర్చిన యాలోచనను దూరము చేసికొనుటయే వైరాగ్యము. లక్ష్యముయొక్క ఔన్నత్యము మానవునకు గల వైరాగ్యతీవ్రత పైనే ఆధారపడియుండును. అట్టి ఉన్నతలక్ష్యమును జీవితమునందంగీకరించినచో శక్త్యనుసారము వైరాగ్యాభ్యాసముకూడ జరుగును. జీవితమునందలి ఏ రంగమునందైనను వైరాగ్యము లేక స్థిరమగు ఉన్నతి సాధింపబడదు. విద్యార్థి దశయందుగాని గృహస్థజీవనమునందుగాని ఉద్యోగ నిర్వహణమునందుగాని దేశనాయకత్వమునందుగాని వ్యాపార వాణిజ్యములందుగాని మానవజీవితపు ఏయొక్క అంశమునగాని వైరాగ్యము అక్కరపడుచునే యున్నది. వైరాగ్యము గలవారు పురోగమింతురు. వైరాగ్యము లేనివారు పెదముద్దలవలె ఎప్పటిచోటుననే ఉండుటయో లేక తాము జారిపోవుట దానికి ఇతరులే కారణమని వాపోవుచుండుటయో జరుగును.

సామాజిక జీవనమున గృహస్థజీవనమే ముఖ్యాంశమగుటవలన వైరాగ్యమునకు గృహస్థజీవనమున గల ప్రాముఖ్యమును విచారింతము. గృహస్థజీవనమున అయిదు ముఖ్యమగు బాధ్యతలు ఆశయములు గలవు. మొదటిది వ్యక్తిగతమైన ఆనందసాధనము. రెండవది కుటుంబజీవనము. మూడవది బంధు మిత్రుల యానందము. నాల్గవది ఉద్యోగధర్మ నిర్వహణము. ఐదవది సమాజముపట్ల బాధ్యత. వ్యక్తియొక్క జీవనము ఇట్లు క్రమముగా విస్తృతమైన ప్రభావము కలియుండుటను గమనింతుము. ప్రతియంశమునందును వైరాగ్యమునకు గల ప్రాముఖ్యమేమియో క్రమముగా విచారింతము.

ఆనంద సాధనము: ఆనందమన నేమి? ఆశలు తీరుటయే ఆనందమని ఇప్పటి భావన. కాని ఇట్టి ఆనందమునకు విలువ యున్నదా? ఎప్పటికప్పుడు క్రొత్త ఆశలు చిగిరించుచునే యుండును. నాగరికత చేసిన యుపకారమేమైన నున్నచో అది ఇట్టి కోర్కెలను నిరవధికముగ పెంచుటయే. తమ ముందట ఇట్లు చెలరేగుచున్న కోరికల సముదాయములో ఎన్నింటిని తిరస్కరింప గలిగినచో వ్యక్తి అంత ఆనందముగ నుండగలుగుచున్నాడు. ఏవో కొన్ని యాశల నుంచుకొని వానిని సాధించినచో ఆనందము, సాధింపలేనిచో దుఃఖము, ఇవి సాధింప గలిగిన పిమ్మట వేఱు ఆశలు మాకు లేవు అని అనుకొన గలుగుటకూడ వైరాగ్యమే. చిన్న పరిధిలో దానినే తృప్తియందుము. సన్న్యాసి గోచిపాత చాలు ననుకొనినచో దానిని మహా వైరాగ్యమనుచున్నాము. సంసారి నాలుగు జతలు చాలు ననుకొనినచో దానిని తృప్తి యనుచున్నాము. ఇట్టి తృప్తి, ఆలోచన తన వరకు మాత్రమే పరిమితమైనప్పుడు ఏర్పడదు. ఇతరుల పరిస్థితిని గమనింపగలిగి తన యవసరములను తగ్గించుకొనుటచేత ఏర్పడును. ఇతరుల వలన తానెంత సుఖపడవలయునని తలచినంత వఱకు వ్యక్తికి తృప్తి యుండదు. తనవలన ఇతరులకెంత సుఖము కలిగినదని తలచిననే తృప్తి కలుగు నవకాశము కలదు. భార్యాభర్తలు

గృహస్థజీవనమున ఒకరినుండి ఒకరు సుఖమును ఆశించుటకంటె ఒకరి కొకరు సుఖము నీయగలుగుటయే వారి యానందమునకు మార్గము. భార్య 'నిన్ను కట్టుకొని నేనేమి సుఖపడితి'నని భర్తను విదలించుటకంటె 'నా వలన ఈయన కేమి సుఖము కలిగినది!' అని యాలోచింపవలెను. 'ఇంకను సుఖము నెట్లు కలుగజేయుగలను?' అని యాలోచింపవలెను. అట్లే భర్తయు 'ఇందుకేనా నిన్ను చేసికొన్నది' అని భార్యను సాధింపక 'నన్ను చేసికొని అమ్మ నాయనలను వదలుకొనిన ఈమె నెట్లు సంతోషపెట్టగలను?' అని యాలోచింపవలెను. అప్పుడే మృష్టాన్న భోజనములు చేయకపోయినను కార్లు మేడలు లేకపోయినను పేరుప్రతిష్ఠలు కలుగకపోయినను అధికారములు హోదాలు లభింపకపోయినను, భార్యాభర్తలు అన్యోన్యముగ ఆనందముగ నుండగలరు. ఎంత చెప్పినను ఆనందము చివరకు మానసిక వ్యాపారమే కదా! ఇట్లు భార్య తన సౌఖ్యమును సుహృద్భావముతో వదలుకొనుటయే భర్త తన సుఖమును గూర్చిన యావ ప్రేమపూరితుడై వదలుకొనుటయే వైరాగ్యమున నొక ముందడుగు. కనుక దాంపత్య జీవనమున సంతోషమునకు ఆనందమునకు కూడ వైరాగ్యమే సాధనము.

పాశ్చాత్యమునందు వ్యక్తిగతమైన సంతోషమే సంతోషముగ భావింపబడి ఆ సంతోషము నెట్లైనను సాధింపవలయు నను భ్రమతో దప్పిగొన్నవాడు ఎండమావులను తలచుమనట్లు ఆ ఆనందాన్వేషణకై స్త్రీపురుషులు పరుగులిడుట చూచుచున్నాము. క్రైస్తవమతమో మరి యే మతమో నిలిచియున్నంతవరకు ఆ నియమములకు లోబడి యున్నంతవరకు ఏదో విధముగ వైరాగ్యాభ్యాసము జరిగి కొంత శాంతిసుఖములు అప్పటి మానవులకు లభించెడివి. శాస్త్రవిజ్ఞానపురోగమనమువలన క్రైస్తవమతము సర్వథా భగ్నమై పోవగనే వ్యక్తిస్వాతంత్ర్యము మెండై హిప్పీలు మొదలుకొని ఫెమినిస్టులు విమెన్స్ లిబరేషనువరకు ఆనంద సాధనోద్యమములు విడాకులు స్వేచ్ఛాచారము మొదలగు వ్యక్తిగత పరిష్కారములు చెలరేగుచున్నవి. ఇంకను బుద్ధిమంతులగువారు ప్రాచ్యమతములవైపును వాని లక్ష్యము ఆధారములవైపును దృష్టిసారించి వానిని బహుళముగా అవలంబించుచున్నారు. ప్రాచ్యమునగల ఏమతమునందైనను వైరాగ్యమే (ఏపేరిటనైనను) ప్రథమసూత్రము గదా. కనుక భోగవిషయములను సాధించినచో ఆనందము సాధింపగలమనుట ఎంత అసందర్భవిషయమో పాశ్చాత్య సామాజిక చరిత్ర ప్రత్యక్షముగ ప్రదర్శించుచునే యున్నది. అది చూచి చూచి మనమును అట్టి ప్రయత్నమునే చేయుగోరుట ఎంత యవివేకము! అందును పాశ్చాత్యులు [illegible] సాధనమార్గమునకై మనపైనే ఆశలు పెంచుకొనుచుండ!

కుటుంబజీవనము : కుటుంబమున సాధారణముగ దంపతులు వారి తలిదండ్రులు సంతానము కలసియుందురు. ఇట్టి జీవనమున దంపతులు తమ తలిదండ్రుల, పిల్లల సుఖసంతోషములకై తమ సుఖములను వదలుకొనిననే తప్ప కుటుంబమున ఆనందము సంతోషము చోటు చేసికొనవు. ముసలి తలిదండ్రులు తమ సుఖమున కడ్డువచ్చుచున్నారనిగాని పిల్లల మూలమున తాము సుఖముల ననుభవింప లేకున్నామనిగాని ఆలోచన వచ్చినతోడనే పైపైన నెన్ని హంగులున్నను మనశ్శాంతి సుఖము సంతోషము కొరవడిపోవును. కుటుంబమున అత్యంత శక్తివంతులు దంపతులే గనుక ఈ త్యాగము వారినుండియే ప్రారంభము కావలసియుండును.

వృద్ధులగు తలిదండ్రులు త్యాగము నవలంబించు శక్తి ఓపిక కలిగియుండరు. బుద్ధి వికసింపని పిల్లలకు త్యాగ మన నేమో అర్థము కాదు. కనుక తలిదండ్రులే నిశ్చలచిత్తముతో త్యాగమయ జీవనమును నిశ్శబ్దముగ నవలంబించినచో ఆ జీవనమే వారి సంతానమునకు ఆదర్శమై వారికి తమ తలిదండ్రులపై గౌరవమును పెంచి ఆదర్శ పౌరులనుగ చేయును.

నే నింత చేసినను వీరికి తృప్తి లేదే యను దుఃఖమునకంటె ధర్మబద్ధముగ వీరి కింతకంటె చేయజాలనైతిని గదా యను దుఃఖమే శ్రేయస్కరము. అట్టి దృష్టి కలిగినచో వారి సంతానమునకు అదియే దృష్టి ఏర్పడి ఎల్లరును త్యాగమయ జీవితము నవలంబింప గలుగుదురు. ఎందరో మహానుభావులలో త్యాగరాజస్వామి వారి జీవితమునకు సాటియేది! ఆయన ఒకరి నెన్నడును యాచించినది లేదు. తన కొకటి కావలయునని యడిగినది లేదు. గొప్పయుద్యోగములు సన్మానములు కోరలేదు. అయినను తనకు గలిగిన గానవిద్యనే అడిగిన వారి కెల్ల లేదనక ఇచ్చెను. తన కెన్ని కష్టములు వచ్చినను ఇతరుల కష్టసుఖములనే విచారించెను గాని తన కష్టముల నొకరిపై బెట్టలేదు. అట్టిది కుటుంబ జీవనము. వ్యక్తిగతముగ తన సుఖముపట్ల వైరాగ్యము అట్లే అభివృద్ధి చెందును.

తలిదండ్రులకు చేయవలసి వచ్చినదే యని విసుగుకొనుచు సేవచేయుట ఫలవంతము కాజాలదు. అట్టి సేవ వారికి సుఖమును గాని చేయు వారికి తృప్తిగాని చూచువారికి ఆనందముగాని కలుగచేయదు. తలిదండ్రుల సేవయందు ఆనందము ననుభవించుచు ఏ యొకటి రెండు మాటలే యనగలిగినను అది అందరి గుండెలను ఆనందముతో నింపివేయును. అట్టి ఆనందము ననుభవించుట యనునది తన సుఖ సంతోష సాధనములను తృణీకరించిన నే కదా కలుగును! అట్లే పుత్రులు తమను వృద్ధాప్యమున నాదుకొనవలయుననియు ఆ కారణముననే వారిని శ్రద్ధతో పెంచుచున్నామనిగాని, వృద్ధాప్యమున మీ రెట్లును మా మొగము చూడరని గాని పిల్లలను పెంచుట యనర్థదాయకమే యగును. పిల్లలపై వారు చేయబోవు నుపకారముకొఱకు ప్రేమ చూపినచో అది వ్యాపారలక్షణము అవకాశవాదము మాత్రమేయై పిల్లలకు తలిదండ్రులపై తేలికభావ మేర్పడును. తలిదండ్రులకు పిల్లపై ఒక పెట్టుబడిగా మాత్రమే నిలిచి అది సరియగు లాభము నిచ్చినదా లేదా యని మాత్రమే తోచును. ఇట్టి ఆశ ఎన్నడును సఫలము కాజాలదు కనుక దుఃఖమే పర్యవసానమగును. పిల్లలు తమ నెట్లును ఆదుకొన రను దృష్టియున్నచో పిల్లలకు తలిదండ్రులపై వైముఖ్యమును తమ జీవితమున వెలితియు, చోటు చేసికొనును. తత్ఫలితముగా ఇరువురకును శాంతి సంతోషములు గగనకుసుమములు గనే మిగిలిపోవును.

కనుక సంతానముపట్ల వారియభివృద్ధికి సుఖశాంతులకు మన మెంత చేయగలమో యని విచారించుటచేతను వారినుండి ప్రత్యుపకారమును పొందు ఆలోచననే రానీయక పోవుట చేతను సంతానముపట్ల గృహస్థులు వైరాగ్య సాధన చేయనగును. ఆ విధముగ ప్రేమతో పెంచి ఱెక్కలు వచ్చిన పిమ్మట ఏ బంధములును లేక వదలి వేయబడిన విహంగములు స్వాయముగా ప్రేమగా గౌరవముగా ఆ గూటికే వచ్చి చేరును గదా. ఇట్లు చిన్ననాటి నుండియు త్యాగజీవితమునే చూచుచు వైరాగ్యమయ జీవనమున పెరుగుచు ఇతరుల సుఖసంతోషములనే గమనించు గృహమున శిక్షితులైన పుత్రులు పుత్రికలు ఆనందదాయకు లగుటలో

వింత యేమి కలదు? అట్టి వైరాగ్యదృష్టి లేని గృహమున కలహములు నెలవు చేసికొనుటలో ఆశ్చర్య మేమి కలదు?

పాశ్చాత్య జీవితమును గమనించినచో ఇట్టి వ్యక్తిగత నిస్స్వార్థత వైరాగ్యము వారియందు కనుపింపవు. తలిదండ్రులకు ఓల్డ్ ఏజ్ హోములు పిల్లలకు కాన్వెంటు స్కూలులు ఉద్యోగము దొరకగనే ఎవరి భార్యను(లేక భర్తను) వారే వెదకికొనుటలు, ఇక ఎవరి జీవితము వారిది. కనుక వారి సంసారమున భార్యాభర్తలు మాత్రమే నిలువవలసి వచ్చును. కనుకనే వారి వ్యక్తిగత జీవనము కుటుంబ జీవనము అన్ని కష్టములకు సమస్యలకు తావగుచున్నది. ఆ కారణముననే వారి జీవనమున విడాకులు పునర్వివాహములు చొక్కాయలు మారినట్లు మారి పోవుచుండుటను గమనించుచున్నాము

బంధుమిత్రుల యానందము: ఇట్లు దంపతులు తమ గృహమున వైరాగ్యజీవనము నలవరచుకొన గలిగినచో తమ బంధుమిత్రుల యవసరములలో పాల్గొనుచు వారికి సహాయ సహకారములు చేయుచు ఎల్లరకు ఆనందము కలుగునట్లు ప్రవర్తింప గలరు. కుటుంబము బంధుమిత్రులు అనునది చిన్నసైజు సమాజమే యగుటవలన నిస్స్వార్థముగ తన వారి సంతోషమునే క్షేమమునే తన సంతోషముగ చూడగలుగు దృష్టి యేర్పడ తాను వారికి ఆనంద దాయకు డగుచు వారి వలన ఆనందమును పొందగలుగుచున్నాడు.

ఉద్యోగ నిర్వహణము: ఇట్లు వ్యక్తిగతముగను సంసారమునందును బంధుగణము నందును ఇతరులసంతోషమును చూడగలుగు వ్యక్తి ఉద్యోగనిర్వహణమునందును ఇతరుల సౌఖ్యమును గమనింపగలడు. సాధారణముగా ఉద్యోగము చేయుటయందలి సాధక బాధకములు అధికారుల పెత్తనము చేయవలె నను కాంక్ష, అధికారము నుపయోగించి వీలైనంత వరకు ధనము వెనుక వేయవలె నను కాంక్ష-నుండియే యుత్పన్నము లగును. ఇవి రెండును అవి వ్యక్తిగత సౌఖ్యమున కుపయోగకరములను నపోహ వలననే ప్రవృత్తములగుచున్నవి. వీని వలననే ఉద్యోగధర్మ మందలి అవినీతియు నిర్లక్ష్యమును పెరుగుచున్నవి.

వ్యక్తిగత సౌఖ్యమును విలువగా గ్రహించుట వలననే 'కట్నము' ముట్టిననే గాని కళాశాలలయందు సీటుగాని ఆఫీసునందు ఉద్యోగముగాని పనియందు నైపుణ్యముగాని లభింపవు. అందువలననే ఇప్పుడు కట్టిన మేడలు మరుసటి సంవత్సరముననే బీటలు వారుటలు ఈ ఏడు కట్టిన ఆనకట్టలు మరుసటి ఏడు కొట్టుకొని పోవుటలు క్షామనివారణార్థము మంజూరు కాబడిన ధనము ఉద్యోగుల జేబులబో చేరుటలు మొదలగు వైపరీత్యములు సిద్ధించుచున్నవి. ఇందువలన రకరకములైన భయములు కాంతులు అశాంతులు పెరుగుచునే యుండును.

ఉద్యోగ నిర్వహణమునందు వైరాగ్యము కలిగియుండినచో ఉద్యోగమువలన తన కెంత మిగులునన్న దృష్టిగాక తన యుద్యోగకాలమున అర్హత గలిగినవారికి (ధర్మసమ్మతముగ) ఎంత మేలు చేయగలుగుదు నన్న దృష్టి ఏర్పడును. అందువలననే సాంఘికపురోగమనము వ్యక్తిగతమైన ఆనందము సాధింపబడుచున్నవి. మహాత్మగాంధి యైనను సర్దార్ పటేల్ ఐనను తమ వ్యక్తిగతమగు సంకుచితమైన ఆనందమును వదలుకొనుటచే గదా చివరకు జగద్విఖ్యాత పురుషులైనది!

ప్రస్తుత సమయమున ఇట్టి వైరాగ్యాభ్యాసము దేశమున మిక్కిలి యవసరము. వైరాగ్యము కొరవడుటచేతనే బాలురు మొదలు వృద్ధులవరకు కూలివాడు మొదలు దేశనాయకులవరకు బహుసంఖ్యాకులు అన్నియు తమకు కావలెననియు తామేమియు ఈయనక్కరలేదనియు భావించుచు పెనగులాడుచున్నారు. అందుకు తగినట్లే దేశమును తరిగిపోవుచున్న ఉత్పత్తితోను పెరిగిపోవుచున్న ద్రవ్యోల్బణము చేతను అధోగతిపాలగుచున్నది. కనుక ఉద్యోగనిర్వహణమునందు వైరాగ్యమునకు గలుగు స్థానమును ఎంత చెప్పినను చాలదు. చిన్ని ఆఫీసులో గుమాస్తా అయినను ఎంత గొప్ప ఆఫీసరయినను తమ యుద్యోగ ధర్మమును స్వార్థత్యాగముతో చేసిననే, తమశక్తిని ప్రతిఫలాకాంక్ష లేక వీలైనంత ధారపోసిననే ఉద్యోగధర్మము వైరాగ్యయుతమై యశస్కరమై శుభంకరమై విరాజిల్లును.

సామాజిక జీవనమున ముఖ్యముగా పరస్పర సహకారము ప్రకటితమగును. సామాజిక వ్యవస్థలు అనగా సమాజమునందలి ప్రతియొక్కరికిని ఫలము నీయవలసిన సంస్థలు వైద్యశాలలు విద్యాసంస్థలు మొదలగునవి సక్రమముగా నడువవలెనన్నచో ఆ సంస్థలు నిర్వహించువారియందేగాక సమాజమునందును వైరాగ్యము జాగృతము కావలెను. మనవలన ఇతరులకు ఉపకారమేగాని అపకారము జరుగరాదనియు, ఒకవేళ మనమొకరము చెడినను పదుగురు బాగుపడనిమ్మనియు భావింపవలెను. ఇట్లు ఇతరుల శాంతిసౌఖ్యములపై దృష్టియుంచినచో సామాజిక జీవనమున వైరాగ్యసాధన సాగును. అట్లు ప్రతియొక్కరును ఇతరుల సుఖసంతోషములను గమనించునపుడు ఎల్లరును సుఖసంతోషములతో తులతూగుదురు.

గృహస్థజీవితముపై ఆధారపడియే ఈ వివిధ ధర్మము లున్నవి గనుక భార్యాభర్తలయందు వైరాగ్యము మొదట తావుచేసికొనవలెను. తమ వ్యక్తిగత సుఖములపై వైరాగ్యము నిస్స్వార్థత జనించినంతనే అదియే క్రమముగా కుటుంబమును వాడను ఊరిని దేశమును తనలో నిముడ్చుకొనగలుగును.

ఇవి యన్నియు పట్టిమాటలు అందరు విరాగులైనపుడు మేమును విరాగులమగుదుమని కొట్టివేయవచ్చును. కాని వైరాగ్యమునకు ఇతరుల ప్రసక్తియే లేదు. ఇంకొకరికి వైరాగ్యమున్నదా లేదా యని ప్రశ్నించుట కెవరికిని హక్కులేదు. నాకు వైరాగ్యము కలదా యని ప్రశ్నించుకొను బాధ్యత మాత్రమున్నది. అప్పుడే ఎవరికివారే తమంతట తామే వైరాగ్యయుత జీవనమును గడుప నిశ్చయించినపుడే ఇతరుల సుఖమునకై తన సుఖమును వదలుకొన సిద్ధపడినపుడే ఎల్లఎడలను శాంతిసౌభాగ్యములు పరిఢవిల్లును.

ఇంకొకరికి నీవేమి చేయగలవు? ఎంతచేసినను ఇంకను చేయలేదనియే సాధింతురని ఇంకొక యభ్యంతరము వినవచ్చును. దీనికి రెండు ప్రత్యుత్తరములు గలవు. అపాత్రునకు చేసిన యుపకారము బూడిదలోపోసిన పన్నీరగు ననుట యొకటి (కాని ఇందు పాత్రతను నిర్ణయించునపుడు ప్రతిఫలాపేక్ష చేత వైరాగ్యదృష్టి నశించును). ఉపకారము చేయునపుడు హృద్గతమగు వైరాగ్యము లేకపోవుటయొకటి. (అట్టి వైరాగ్యమున్నచో ఇతనికి తృప్తి కలిగింపలేక పోయితినని వ్యథమాత్రమే కలుగును గాని అతడు తృప్తిపడలేదని క్రోధముగాని తిరస్కారముగాని కలుగదు.) బిచ్చగానికి తిట్టుకొనుచు ఒకరూపాయి వేసినను సంతో

షము చెందదు. కాని ఒకపైస ఈయబోయి తన దురదృష్టమువలన జేబులో పైకము లేకుండుటకు వెతజెందు ధార్మికుని ఆ బిచ్చగాడే 'నా ప్రాప్తము నాయనా నీవేమి చేయుదువు' అని యోదార్చుట గమనింతుము. కనుక వైరాగ్య మనగా శుష్కవేదాంత శబ్దము కాదనియు హృదయమునిండి పొరలు సోదర మానవులపట్ల ప్రేమ యనియు తెలియవలెను.

ఉపసంహారమున వైరాగ్యమన తీవ్రతమ మగు దృష్టిలో తన శరీరమును మనస్సును బుద్ధిని అహంకారమును దృశ్యప్రపంచమును సర్వథా తిరస్కరించి చరాచర వ్యాప్తమగు పరతత్త్వమును వెదకికొనుటయే. అందను మానములేదు. కాని వ్యక్తుల తారతమ్యముల ననుసరించి వైరాగ్య తీవ్రతయును మారుచుండును. సాధారణ మానవునిదృష్ట్యా, ఇట్టి యున్నతతమమగు వైరాగ్యమును లక్ష్యముగా బెట్టుకొని నిత్యజీవితమునందు ఓపినకొలది వైరాగ్యము నభ్యసించు విధము సూచింపబడినది. చరాచర వ్యాప్తమగు పరతత్త్వమును వెదకుటలో సర్వమానవ ప్రేమయే వ్యక్తము కావలెననియు తీవ్రవైరాగ్యము విశ్వప్రేమయు పర్యాయపదములనియు ప్రతిపాదింపబడినది.

అట్టి వైరాగ్యము విశ్వప్రేమ యను లక్ష్యమును దృష్టిపథమునుండి చెదరనీయక జనులు తమ శక్త్యనుసారము వైరాగ్యాభ్యాసము చేసినచో ఎల్లరును ధర్మార్థకామములను సాధించుచునే మోక్షమును బడయుదురు. అట్టి వైరాగ్యసాధనకు ముఖ్యరంగమే కదా గృహస్థ జీవనము!

# సంఘజీవనంలో వైరాగ్యస్థానం

ఎస్. రమేష్

సాధారణంగా ఏదీవద్దు ఎవరూ వద్దు అనుకోవడం వైరాగ్యంగాను అన్నీ కావాలి అందరూ కావాలి అనుకోవడం సంఘజీవనంగాను భావిస్తాము. కనుక ఇలాంటి విరుద్ధ ప్రవృత్తులకు సమన్వయమంటే భూమికీ ఆకాశానికీ ముడి పెట్టడమే నేమోనని అనిపించకపోదు. కాని తరచిచూస్తే సాంఘికజీవనం లేని వైరాగ్యం సాధించవచ్చునేమో గాని వైరాగ్యం లేని సాంఘికజీవితం మాత్రం వాసనలేని పువ్వులాగా నిరర్థకమని తేలిపోతుంది.

వ్యక్తిగత జీవనానికిగాని సాంఘికజీవనానికిగాని సార్థక్యం తాము ఏర్పరచుకొనినబాటలో నిరాఘాటంగా (అంటే తనకు ఇతరులవల్లగాని ఇతరులకు తనవల్లగానీ అంతరాయం లేకుండా) పురోగమించటమే. దీనికోసమే సంఘంలో ఒక నీతీ నియమమూ తగినవీ కానివీ ఏర్పడి ఉంటాయి. సంఘంలో అందరూ ఈ నీతి నియమాలను పాటించినట్లయితే వారివారి ప్రతిభను బట్టి వ్యక్తులు ఇంకొకరికి 'అన్యాయం' చేయకనే తమ పురోభివృద్ధిని సాధించుకో గలరు. కానీ సంఘంలో ఉండేవారి బాటలూ ఆశయాలూ విభిన్నాలు కావడంమూలాన్ని అందరికీ సరిపడే నీతినియమాలు ఏర్పాటు చేయడం గడ్డు సమస్య. ప్రాచీనభారతదేశం ఈ సమస్యను వర్ణవ్యవస్థతోనూ ఆశ్రమవ్యవస్థతోనూ దివ్యంగా పరిష్కరించింది. కానీ కాలాంతరంలో పరిస్థితుల ప్రభావాలకు గురియైన వర్ణా

శ్రమవ్యవస్థ బిగుసుకు పోయి శిలీభూతమై పోయింది. ఇటువంటి పరిస్థితిలో సంఘాన్ని మళ్లీ పరిశీలించి ప్రస్తుతము సంఘపరిస్థితినిబట్టి దానికి కావలసిన ఆదర్శమూ, ఆదర్శాన్ని సాధించ గలిగే మార్గాలూ ఇప్పుడు మనం ఓర్పుతో ఏర్పాటు చేసుకోవాలి. 'పాతకాలపు' ఆదర్శమైన వైరాగ్యాన్ని 'క్రొత్తరోజుల' సాంఘిక జీవనాన్నీ తిరిగీ మథించడం ఇందుకోసమే.

ప్రస్తుతసమాజంలో ముఖ్యంగా కన్పించేవి రెండే ఆదర్శాలు. ఆస్తిక్యం నాస్తిక్యం. దైవమూ సాక్షాత్కారమూ అంటూ దాని కోసం నీతినియమాలూ పాటించాలీ అనేవాళ్లు ఆస్తికులనీ దేవుడూ లేడు దయ్యమూ లేదు. ఉన్న దంతా మూడునాళ్ల ప్రపంచమే. కనుక ఉన్నన్నాళ్లూ హాయిగా బ్రతుకు అనేవాళ్లు నాస్తికులనీ స్థూలంగావ్యవహారం. ఈనాస్తికులే చార్వాకులుగా భారతదేశంలో ప్రఖ్యాతులైనారు. వారి సిద్ధాంతాన్ని గీటురాయిగా తీసుకొనే ప్రతిమతమూ తన విశిష్టతను నిరూపించుకొంది. కాగా ఈ చార్వాకు లనబడే నాస్తికులు ఇప్పుడు భౌతికశాస్త్రాల బలంతో ఇంకా ప్రాముఖ్యం చెందడంచేత ఆస్తిక సమాజపు విలువవైన వైరాగ్యానికి నాస్తిక బహుళమైన సమాజంలో ఏపాటి స్థానం ఉంది అన్నది ముఖ్యమైన ప్రశ్నగా నిలుస్తుంది. ఆతరువాత వైరాగ్యాన్ని జీవితపు విలువగా అంగీకరించే ఆస్తిక సమాజంలో ఆధునిక పరిస్థితుల దృష్ట్యా విరాగుల స్థానం ఏమిటి అన్నది రెండవ ప్రశ్న.

చార్వాకం లేదా నాస్తికులదృష్ట్యా ముందు వైరాగ్య పరిశీలన చేస్తే వైరాగ్యం అవసరమా కాదా అనే విషయం స్పష్టపడుతుంది. ఎవరి కిష్టమైనట్లు వారు ఉండవచ్చును. ఏ కట్టుబాట్లూ అక్కఱలేదు అనేది ఒకవాదం. ఇది వినడానికి సొంపుగా ఉన్నా ఆచరణలోకి వచ్చేటప్పటికి ఏదోవిధమైన కట్టుబాట్లు అమలులోకి వస్తాయి. నీకు ఇష్టమైనది అవతలివాడికి కూడా ఇష్టం కావాలి కదా. కనుక పరస్పరం ఇష్టపడితేనే నీవు సుఖపడటం. నీకు ఎంత ఇష్టమైనా అవతలివాడికి ఇష్టం లేకపోతే నీవు తప్పనిసరిగా నీ సుఖం వదులుకోవలసిందే. అంటే వైరాగ్యం అభ్యాసం చేయాల్సిందే. లేదూ, అవతలివాడి ఇష్టంతో నాకు ప్రసక్తి లేదు. నాకు సామర్థ్యం ఉంటే సాధిస్తాను, లేకపోతే ఊరుకుంటాను అంటే అప్పటికి బలముగలవానిది రాజ్యమై సమాజం మానవసమాజంగా కాక పాశవిక సమాజంగా మారిపోతుంది. అక్కడ కూడా జంతుసమాజంలో కొన్ని నియమాలూ సంఘపు కట్టుబాట్లూ ఎంత మౌలికరూపంలో నయినా కన్పిస్తాయి. మానవుడు తన మేధాశక్తినంతా ధారపోసి జంతువులకంటే దిగజారిపోగలడేమో తెలియదు మరి.

ఇక ఇద్దరికి ఇష్టమైనప్పుడు ఏగొడవా లేదు కదా అంటే దాని పరిణామం పాతకాలంలో ధూర్తచార్వాకంగా వెలిసింది. ప్రస్తుత కాలంలో permissive society గానూ కనబడుతూనే ఉన్నది. జీవితానికి ఒక లక్ష్యం ఒక గమ్యం అంటూ లేకపోయేటప్పటికి ఎందుకు బ్రతకడం అన్న ప్రశ్న బ్రహ్మరాక్షసిలాగా ఎదురై జీవితంలోని శాంతి మాధుర్యాన్ని సంపూర్ణంగా కబళించివేస్తుంది. Permissive society లో ఎవరైనా ఏమైనా చేయవచ్చు, అడిగేవాడూ చెప్పేవాడూ ఉండరు. పాశ్చాత్య దేశాలలో అందునా 'పురోగమించిన' సంఘాలలో ప్రస్తుతజీవనవిధానం ఇది. దాని వలన మానసిక దైహిక వ్యాధులు తప్ప సంఘానికి గాని వ్యక్తికిగాని సంపాదింపబడిన విలువ ఏమీ లేదు. వ్యక్తి తనకు ఆనందాన్ని సంపాదించుకోలేడు. సంఘానికి అంటే ఇతర వ్యక్తులకు ఆనం

దాన్ని కలిగించలేదు. ప్రాచీనభారతదేశంలో ఈ ధూర్త చార్వాకాన్ని నిరసిస్తూ శిష్ట చార్వాకం బోధింపబడింది. నిజంగా జీవితంలో సాధ్యమైనంత ఆనందాన్ని జుర్రుకోవాలంటే కొంత కష్టాన్ని అనుభవించాలనీ నిగ్రహాన్ని పాటించాలని శిష్టచార్వాకపు సూత్రం. వ్యవసాయం చేయడం శ్రమఅంటూ మానివేసి రాబోయే ఫలసాయాన్ని వదులుకోడం మూర్ఖత్వమంటుంది శిష్టచార్వాకం. అలాగే యౌవనజీవితంలో శారీరక మానసిక సుఖాలు పరిపూర్ణంగా అనుభవించాలంటే అప్పటివరకూ బ్రహ్మచర్యమూ విద్యాభ్యాసము ప్రయత్నపూర్వకమైన (అంటే తాత్కాలికంగా దుఃఖదాయకమైన) దైహికమానసిక వికాసమూ అవసరమని శిష్టచార్వాక సిద్ధాంతం.

పాతకాలంలో వాళ్లకు వచ్చిన ప్రశ్నలూ వాటిని వాళ్లు చెప్పుకొన్న జవాబులూ అవి. ప్రస్తుతకాలంలో మనం పాశ్చాత్యులే ఆదర్శపురుషులుగా భావిస్తున్నాం. వారికి వచ్చిన ప్రశ్నకు వారే సమాధానం చెప్పుకో లేకుండా సతమతమవుతూ సైన్సు అనీ రిసెర్చి అనీ ఫిలాసఫీ అని తప్పించుకు పారిపోతూ ఉంటే మనం కూడా వ్యామోహంతో వారి సమాజాన్నే అనుకరించాలనీ అదే ఆధునికత అనీ భావిస్తున్నాం!

ఇలా చార్వాక జీవితంలో కూడా వదులుకోవడం అనే అర్థంలో వైరాగ్యానికిగల స్థానం తెలుసుకొన్నాం. ఆస్తిక జీవనంలో దైవం కోసం అన్నీ వదులుకోవలసిందే. ఇలా ఆస్తిక నాస్తిక భావాలలోగల వైరాగ్యం జీవితంలో అసహజమైన దేమీకాదు. మానవుడుపుట్టింది మొదలు వైరాగ్యాన్ని అభ్యాసం చేస్తూనే ఉంటాడు. అయితే అది ఇచ్ఛాపూర్వకమైనది కాకపోవడంచేత దుఃఖదాయకంగాను నిరుపయోగకరంగాను పర్యవసిస్తుంది. ఆ వైరాగ్యమే ఇచ్ఛాయుక్తంగా చేయబడితే అదే వ్యక్తికి ఆనందాన్ని సమాజానికి పురోగతినీ సాధిస్తుంది.

ఇక మానవజీవితంలో వైరాగ్యం ఎలా ప్రకటితమవుతూ ఉందో చూద్దాం.

పుట్టినప్పటినుండి మానవుడు ఒకదాన్ని ఎన్నుకొంటూ మరొకదాన్ని వదలివేస్తూ ఉంటాడు. చిన్నప్పుడు గోలీలాటలోపడి చదువూ సంధ్యా అన్నీ వదలిపెడతాడు. కొంచెం పెద్దయ్యాక పరీక్షలు దగ్గరపడితే ఆటపాటలన్నీ కట్టిపెట్టి దీక్షగా నిద్రాహారాలు వదలిపెట్టి మరీ చదువుతాడు. ఇక్కడే మనకు వైరాగ్యంలోని రెండు లక్షణాలూ స్పష్టమైపోతాయి. చిన్నప్పుడు తాత్కాలికమైన ఆనందం కోసం (తులనాత్మకంగా) స్థిరమైన ఆనందసాధనాన్ని, చదువును వదులుకుంటున్నాడు. ఇందాక మనం చెప్పిన చార్వాకుల జీవనపద్ధతి ఇలాంటిదే. పెద్దయ్యాక తాత్కాలికమైన ఆనందాన్ని విచక్షణద్వారా వదులుకొని స్థిరమైన ఆనందాన్ని సాధించే మార్గం కోసం శ్రమిస్తాడు. ఇది శిష్టచార్వాక జీవనం అని చెప్పవచ్చు. ఎందుకంటే ఇక్కడ ఆశయం తన సౌఖ్యమే. బాగా చదువుకుంటే మంచి ఉద్యోగం వస్తుందనీ 'సుఖంగా' జీవించవచ్చుననీ అతని ఆశ.

ఇక వివాహజీవితంలో అడుగుపెట్టాక ఈ వైరాగ్యం ఇంకొంచెం వికసిస్తుంది. ఇప్పుడు వ్యక్తిగతంగా తన సంతోషానికి ప్రాధాన్యత లేదు. తనపైన ఆధారపడినవారు తాను ప్రేమించేవారు సుఖపడితే అదే తన సుఖం అనుకుంటాడు మానవుడు. తన భార్య సంతోషం కోసం తన పిల్లల సంతోషం కోసం

తానన్ని కష్టాలనైనా అవమానాలనైనా భరించడానికి, సంతోషంగా భరించడానికి, సంసిద్ధుడౌతాడు. ఇలా తన సుఖసంతోషాలను వదులుకోవడమే కదా వైరాగ్యలక్షణం? ఈ మానసికపరిణతి ఇంకా వికసిస్తే ఈ స్థితిలో 'తనవారి' సుఖసంతోషాలకోసం 'తన' సుఖసంతోషాలను ఎంత తేలికగా తిరస్కరించగలిగాడో అంతే సౌలభ్యంలో తన సమాజపు తన దేశపు శాంతిసౌభాగ్యాలకోసం 'తనవారి' సుఖసంతోషాలను కూడా తిరస్కరించగలడు. ఇలాంటివాళ్లనే మహానుభావులని మహాత్ములనీ జనులు స్తుతిస్తూ ఉంటారు. ఇంతకూ వారి స్తుతికి పాత్రమైనది వారిలో వెలిగే వైరాగ్యజ్యోతి మాత్రమే. ఒక రాజా రామమోహన రాయ్ అయితేనేమి, ఒక దయానందసరస్వతి అయితేనేమి, ఒక ఈశ్వరచంద్ర విద్యాసాగరుడైతేనేమి, అలాంటివారందరూ తమ వారినందరినీ దూరంచేసుకొని సంఘానికి దగ్గర కావాలని ఆ సంఘాన్ని సుసంపన్నం చేయాలని ఆనందనిలయాన్ని చేయాలని తహ తహలాడినవాళ్లే.

ఇంకా దూరంపోతే సకల మానవజాతికి ప్రాణికోటికి శాంతిసౌభాగ్యాలు అందించటం ఎలా అనే ఆరాటంతో సామ్రాజ్యాన్నికూడా వదులుకోగలిగిన గౌతమబుద్ధునిలాంటి విరాగులు కన్పిస్తారు. కన్పించే బుద్ధుడు ఒకడైనా కన్పించని బుద్ధులు ఎంతోమంది ఉండినారని బౌద్ధ సంప్రదాయమే చెప్తుంది. అలాగే జైనమత స్థాపకుడైన వర్ధమాన మహావీరుని వెనుక ఇరవైనలుగురు తీర్థంకరులున్నట్లు వాళ్లు చెపుతారు.

ఇలా గోలీలాడే పిల్లవాడు మొదలు బుద్ధుడి వరకు అందరూ విరాగులే అయితే వారి వారి వైరాగ్యంలో ప్రకటితమయ్యే జ్ఞానాన్నిబట్టీ, ఇచ్ఛాశక్తినిబట్టీ వైరాగ్యము నికృష్టమో ఉత్కృష్టమో అవుతున్నది. ఎప్పుడైతే మనం నిత్యజీవితంలో సాధారణంగా అజ్ఞానంతోనూ బలవంతంగానూ ఆచరించే నికృష్టమైన వైరాగ్యాన్ని, విచక్షణాజ్ఞానంతోనూ మనస్ఫూర్తిగాను ఆచరించగలమో అప్పుడే, ఆ వైరాగ్యం ఉత్కృష్టమై తనకు శ్రేయస్సునూ సంఘానికి ప్రేయస్సునూ సాధించగలుగుతుంది.

ఏది నిజంగా ఆనందదాయకమో ఏది పై చూపులకు మాత్రమే ఆనందదాయకమో తెలుసుకోవటమే విచక్షణాజ్ఞానం. కాని ఇది అందరికీ ఉండే వస్తువుకాదు గనుక తెలిసినవారు అంటే జీవితంలో సాధించదగినదేదో తెలిసికొన్నవారు ఆలక్ష్యం దృష్ట్యా సంఘానికి కొన్ని నీతులూ నియమాలూ ఏర్పాటు చేస్తారు. దండనకు జడిసి అయినా ఈ కట్టుబాట్లకు అనుగుణంగా నడుచుకుంటే కొంతవరకు వ్యక్తికి శ్రేయస్సూ సంఘానికి ప్రేయస్సూ సాధింపబడతాయి. ఈ కట్టుబాట్లు నైతికంగా కానీ చట్టబద్ధంగాగానీ ఉంటాయి. ఇది ఇంకో విధంగా చెప్పాలంటే బలవంతపు సన్న్యాసం. ఈ జీవితాదర్శమూ దాని కవసరమైన కట్టుబాట్లూ అనేవి ఆసంఘంలో అవతరించిన'' తెలిసికొన్నవాళ్ల'' స్థాయినిబట్టీ వారి కాలంలో జనసామాన్యం అందుకోగలిగిన స్థాయినిబట్టీ నిర్ణయింపబడతాయి. యూదులందరూ అప్పుడే బానిసతనంనుండి స్వేచ్ఛ పొందినపుడు మోసెస్ న్యాయం కంటికి కన్ను పంటికి పన్నుగా ఉండేది. అదే జీసస్ వచ్చాక ఆయన ఒక చెంపను కొడితే రెండో చెంపను చూపమన్నాడు. కనుక వైరాగ్యాన్ని స్వతంత్రంగా పాటించే విచక్షణాజ్ఞానం లేనివారిచేత బలవంతంగా వైరాగ్యం పాటింపజేయాల్సి

వస్తుంది, సంఘక్షేమం కోసమూ వ్యక్తి శ్రేయం కోసమూనూ. కాగా బుద్ధిమంతులు స్వతంత్రంగానే నిర్ణయించుకొని వైరాగ్యం స్వబుద్ధిలోనే పాటించగలిగితే అది ఉభయత్రా ఎంతో శ్రేయస్కరం.

నాస్తికదృష్ట్యా వైరాగ్యాన్ని పరిశీలిస్తే పర్యవసానం ఇలా ఉంటుంది. ఇక ఆస్తికుల దృష్టిలో వైరాగ్యమంటే ఏమిటి ఆస్తిక వైరాగ్యానికి సంఘంలోగల స్థానమేమిటి అని పరిశీలించాల్సి ఉన్నది.

ఆస్తికులకు జీవనగమ్యం మోక్షం అని ఏర్పడిఉన్నది. వైరాగ్యమే మోక్షసాధనంగా అంగీకరింపబడికూడా ఉన్నది అయి వైరాగ్యాభ్యాసం చేయడం ఎలా అన్న ప్రశ్న! జవాబు చెప్పుకోవడంలోనే ఆస్తికులకు వైరాగ్యానికి సాంఘికజీవనానికీ విరోధాభాసం సుంది. కర్మయోగాన్ని గూర్చి శ్రీకృష్ణభగవానుడు ఎంత ప్రశంసించినా వైరాగ్యమంటే ఏకాంతవాసమే అనీ 'అంతా మిథ్య' అని నిరతమూ జపం చేయడమే అనీ ఒక భ్రమ. ఇది జ్ఞానయోగసాధన అని వారి తలపు. ఈ జ్ఞానయోగ సాధనపైనే చాల మందికి మనసు. ''జ్ఞానయోగానికి కావలసిన బుద్ధి తీక్ష్ణత సాధారణంగా లభ్యపడేది కాకపోవడంచేత జ్ఞానయోగంలో పొరపాటు జరిగితే సాధకుడు ఎంత ఉన్నతికి అందుకోవలసి ఉన్నదో అంత మాంద్యానికి వశుడై పోతాడు. జనక మహారాజు జ్ఞానికదా అయినా ప్రపంచంలోనే ఉన్నాడు కదా అంటూ ఆస్తిక జనకులు పదిమంది బిడ్డలకు తండ్రులై జ్ఞానయోగాన్ని సాధిస్తామంటారు. జ్ఞానయోగానికి ప్రమాణమైన ఉపనిషత్తులన్నింటిలోనూ జ్ఞానయోగసాధనకు అర్హతలు వివరింపబడి ఉన్నాయి. దాదాపు అందరు సాధకులూ బాలకులే వేదవేదాంగాది సర్వశ్రుతి శాస్త్ర నిష్ణాతులే నిష్ఠాగరిష్ఠులైన బ్రహ్మచారులే అంతేగాక ఇంతటి నిష్ఠాగరిష్ఠులూ విద్యావంతులూ మేధాశీలురూ అయినవారుకూడా బ్రహ్మవిద్యను పొందాలంటే గురువుగారి ఆదేశం ప్రకారం ఇంకా నియమంగా నిష్ఠగా ఉండాలి! ప్రశ్నోపనిషత్తులో ఇలాంటి ఆరుగురు అగ్నిజ్వాలలవంటి బ్రహ్మచారులు పిప్పలాద మహర్షి వద్దకు తత్త్వజ్ఞానార్థమై వెళ్లారు. వేదవేదాంగాలూ అధ్యయనం చేసి అన్ని శాస్త్రాలూ అధీనం చేసికొన్న ఆ తపస్వులకును పిప్పలాద మహర్షి మళ్లీ ఒకసంవత్సరం బ్రహ్మచర్యం పాటించి రమ్మంటాడు. అది యేమి బ్రహ్మచర్యమో అది యేమి సాధనయో మనకు ఊహకు కూడా అందదు. అందుచేత జ్ఞానమార్గానికి కావలసింది ఏకాంతవాసమే. శ్రవణ మనననిదిధ్యాసనమే. దానికి జనసంపర్కానికి పొత్తుకుదరదు'' అని వారు చాలపట్టిష్ఠంగా వాదిసారు.

కాని ఏ విషయనిర్ణయం చేయడానికైనా దేశకాలాలు చూడాలి కదా. ఆ కాలంలో అంతా సుభిక్షంగా ఉండి అందరూ ధార్మికులుగానే ఉండేవారు. అప్పుడు జనాభాసమస్యగానీ ఉత్పత్తి కొరతగానీ ఉన్నవారూ లేనివారూ అనే అగాధవ్యత్యాసంగానీ అవినీతి స్వేచ్ఛాచారముగానీ — ఇటువంటి సమస్యలే ఆ కాలంలో ఉండేవి కావు. అందుచేత అందరూ ధర్మాన్ని గౌరవిస్తూ ఆచరిస్తూ ఉండే ఆదేశంలో కొందరు జ్ఞానసాధనకు ఏకాంతవాసమూ అధ్యయనమూ మార్గంగా ఎన్నుకొన్నారు, దానిని సాధించారు. అక్కడికి వారు గురుశుశ్రూష అంటూ గురువుగారి పనులన్నీ చేసిపెట్టేవారు. ఒక జిజ్ఞాసువు దాదాపు జీవితమంతా గురువుగారి ఇంట్లో కావలసిన కట్టెలు వగైరా తేవడం

లోనే నిమగ్నుడైపోయి తను ముసలివాడవటం కూడా గమనించడు. ఒకనాడు కట్టెలతో బాటు తలలోని తెల్లవెంట్రుక తగిలి వస్తే అప్పుడు స్మృతిలోకి వస్తుంది—తన జీవితమంతా అయిపోయింది, జీవితమంతా గురుశుశ్రూషలోనే గడిపాను. అయినా గురువుగారు నాకు ఏ ఉపదేశమూ చేయలేదే అని దుఃఖము పొంగి కళ్లనీళ్లుగా వెలికిరాగా గురుపత్ని గాఢరాగా పరుగెత్తుకొచ్చి "నాయనా నీవంటి బ్రహ్మజ్ఞాని కన్నీరు భూమిమీద పడితే ఆ దేశంలో ఇక పన్నెండేండ్లు వానలే కురవవు" అంటూ ప్రేమగా కన్నీరు తుడుస్తుంది. అలాగే ఇంకొక శాల జిజ్ఞాసువు ఆవులమందను రక్షించి రెండింతలు చేసి తిరిగి వచ్చేటప్పుడు వాటి నిమిత్తమాత్రతతోనే బ్రహ్మజ్ఞానం సంపాదిస్తాడు. ఇలాంటి ఉపనిషత్కథల సంగతి ఎలా ఉన్నా శ్రీశంకర భగవత్పాదుల ప్రియశిష్యుడైన పద్మపాదులు కూడా గురుశుశ్రూషవలననే కదా తోటి శిష్యులందరిలోకీ గురువుగారి యనుగ్రహపాత్రుడైనది.

కనుక కార్యనిమగ్నులు కావటం జ్ఞానసాధనకు ఆటంకం అనేది వట్టి మాట. ఇప్పుడు గురుశుశ్రూషకు పెద్ద అవకాశం లేదు కాబట్టి దేశసేవనే సాధనంగా చేసుకోవాలి. దేశసేవ అంటే దేశనాయకుడు కావాలన్న అపోహ అక్కరలేదు. సాటి మానవులకు సాధ్యమైనంత ఉపకారం అది మానవరూపంలో ఉన్న భగవంతుని పూజ అన్న దృష్టితో చేయడమే. ఎల్లెడల ఉన్న బ్రహ్మస్వరూపముయొక్క అది స్ఫురణమే అన్న దృష్టితో చేయడమే జ్ఞానసాధన ఔతుంది. అన్ని ఉపనిషత్తులూ చెప్పేది బ్రహ్మము ఒక్కటే సత్యము ఈ ప్రపంచము మిథ్య అనే. మిథ్య అంటే నాశరీరం మాత్రం సత్యం ఇతర ప్రపంచం మాత్రమే మిథ్య అని అనుకొంటే అది మెట్టవేదాంతం. బ్రహ్మము మాత్రమే సత్యం నాశరీరం మనస్సు బుద్ధితో సహా ప్రపంచం మిథ్య అని గాఢమైన అనుభూతి కలిగేవరకూ, తన శరీరంయొక్క సత్యత్వం నిలిచినంతవరకూ, మానవుడు ధర్మాన్ని అనుసరిస్తూ సకలచరాచరప్రపంచంలోనూ ప్రపంచంలో వ్యాప్తమైయున్న బ్రహ్మమును దర్శించే ప్రయత్నం చేయాలి. అది మాత్రమే జ్ఞానసాధన కానీ పారికే పుస్తకాలు వల్లెవేసి ముందునుంచి వెనక్కూ వెనకనుంచి ముందుకూ వప్పచెప్పడం కాదు.

ప్రస్తుతసమయంలో భారతవర్షం కష్టదశలో ఉన్నది గనుక కష్టసుఖాలు మిథ్య అని భావించగలిగే జ్ఞానసాధకులు ఇతరుల సుఖానికై తాము ఎన్ని కష్టాలనైనా (అవి వారికి మిథ్యయే కాబట్టి) భరించగలగడమే, సంతోషంగా స్నేహంగా భరించగలడమే, ఉత్కృష్టమైన జ్ఞానసాధన. ఇది మాత్రమే వారు నిజంగా విరాగులని, అహంకారాలను మాసగించి జీవించే పరాన్నభుక్కులు కారని నిరూపించే గీటురాయి. ఇటువంటి విరాగులే నిజమైన దేశోద్ధారకులూ సంఘసంస్కర్తలూ సంఘసేవకులూ కాగలరు.

ఇక భక్తిమార్గాన్ని అనుసరించే ఆస్తికులు కూడా ఇదే దృష్టిని అవలంబిస్తే తప్ప భక్తిసాధన సమగ్రం కాజాలదు. 'కంజాక్షు నర్చించు కరములు కరములు' అంటూ ప్రహ్లాదుడు చెప్పిన విష్ణుదేవుని శ్రవణము కీర్తనము స్మరణమూ పాదసేవనమూ మొదలైన తొమ్మిది భక్తిసాధనలలో ఈ దేశసేవ మొదలైనవి చెప్పలేదే అని ఆక్షేపించ నక్కరలేదు. విష్ణుదేవుడు సర్వవ్యాపి సర్వాంతర్యామీ అని చెప్పింది ఆ ప్రహ్లాదుడే కదా? ఇందుగల డందు లేడని సందేహము వలదని అథయ

మిస్తూ మరీ చెప్పాడు. కనుక దేశంలో అందరూ అన్నిరకాల సమస్యలతో ఈతిబాధలతో అలమటించిపోతున్న ఈ కాలంలో ఎవరికి ఏ చిన్న ఉపకారం చేసినా అది విష్ణు పూజనమే అన్న ధోరణి ప్రబలం కావాలి. సర్వాంత ర్యామి గదా దేవుడు. దేవతార్చన పెట్టెలో ఉన్న దేవుడు, శుష్కించిపోయి తిన తిండి లేక కట్ట గుడ్డలేక చేయడానికి పనిలేక చదువూ సంస్కారమూ లేక తిరుగుతూ ఉన్న మన సోదర మానవులలో లేకపోతాడా? ఇందుగలడందు లేడని సందేహము వలదే! ఇంకా పురుష సూక్తంలో కూడా 'యచ్చ కించిత్ జగత్ సర్వం దృశ్యతే శ్రూయతేపివా, అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణ స్థితః' అని కదా ఉన్నది! ఇవన్నీ పుస్తకాల్లో ఉంటాయి కళ్లు మూసుకుని పారాయణ చెయ్యాలి కాని... అని నానవేసినా కూడా అన్ని పూజలూ చివ రకు 'సర్వేజనా స్సుఖినో భవంతు!' అని కదా పూర్తి చేస్తారు! ఇది పట్టి ఇచ్ఛకపు మాట లేనా? త్రికరణశుద్ధిలేని ఈ పూజలను దేవుడు హర్షిస్తాడా?

అంచేత భగవంతుడికోసం మేము అన్నీ వదులుకుంటాము అనే భక్తి మార్గావలంబులకు కూడా ఇప్పుడు సంఘమే దేశమే దేవుడు. ఆ దేవుడికోసమే వాళ్లు తమ సర్వసుఖాలూ సుఖా శయాలూ వదులుకోవాలి. సాటి మానవుడి అభ్యుదయంకోసం ఆ మానవుడిలో అంతర్యా మిగా ఉన్న విష్ణుప్రీత్యర్థం అన్ని కార్య క్రమాలూ సాగాలి.

ఈ సందర్భంలో హిందూ మతానికి నవ్య ప్రవక్తయైన శ్రీ వివేకానందస్వామి పలుకులు గమనింప తగినవి. రామేశ్వరంలో శ్రీ రామే శ్వరాలయంలో ఉపన్యసిస్తూ నిజమైన ఈశ్వ రార్చనను గూర్చి వారు ఇలా అన్నారు.

"నిష్కాపులుగ నుండి పరోపకారము చేయు టయే పూజ లన్నిటియొక్క సారము. దరిద్రు నందును దీనునందును రోగియందును శివుని చూడగలుగువాడు నిజముగా శివపూజ చేసిన వాడు. విగ్రహమునందే శివుని చూచువాని పూజ ప్రారంభదశ దే. ఒక దరిద్రునియందు— వాని జాతినిగాని మతమునుగాని కులమునుగాని మఱి దేనినిగాని పాటింపక—శివుని చూచి, వానికి సాయపడి ఉపచారములు చేసినవానిపై శివున కెక్కువ ప్రీతి. తన్ను దేవళమునందు మాత్రమే చూడగలుగునట్టి మనుజునిపై అంత ప్రీతి యుండదు."

"ఒకడు సోమరి, మాయలమారి, ఏమియు పని చేయడు. కాని శివుని కన్నుల సొగసును ముక్కుయొక్క చక్కదనమును ఇతరావయ వముల సౌందర్యమును ఊరక అభివర్ణించుచు స్తోత్రములు చేయుచుండును. రెండవవాడు శివుని సంతానమగు దరిద్రులనుదీనులను సమస్త జంతుజాలమును అది ఇది అననేల—సమస్త సృష్టిని—కనిపెట్టుచు సేవించుచుండును. వీరిరు వురిలో శివునకు ఎక్కువ ప్రియుడెవడు? అతని బిడ్డలకు సేవచేయువాడే అనుటకు సంశయము లేదు."

"ముందుగా మన మేలునే చూచుకొను స్వార్థపరత పాపములలో మహాపాపము. ఎవడు తాను ముందు తినవలయునని, ఇతరులకంటె ఎక్కువ డబ్బు సంపాదింపవలెనని లోకము లోని సమస్త సంపదలను పొందవలెనని ఆశ పడునో, ఎవడు తాను ఇతరులకంటె ముందుగ స్వర్గమునకు పోవలెనని ఇతరులకంటె ముందుగ మోక్షమును పొందవలెనని అపేక్షించునో వాడే నిజమగు స్వార్థపరుడు. నిష్కామి యగు నతడు నేను తుదివరకు ఆగియుండును గాక, స్వర్గమునకు పోవలెనని నే నారాటపడను. నా

సోదరులకు ఉపకారము కలుగగలదేని అందులకై నేను నరకమునకైనను పోవుటకు సంసిద్ధుడనై యుందును అని పలుకును. ఇటువంటి నిష్కామబుద్ధి ఒకనియందు ఎంతెంత హెచ్చుగా నుండునో అతడు అంతంతగా ఆధ్యాత్మపరుడును శివసాన్నిధ్యమును పొందినవాడును అగును. అతడు చదువరియైనను లేక నిరక్షరకుక్షియైనను శివునకు ఇతరులకంటె సమీపమున నున్నవాడే. ఆ సంగతి అతనికి తెలియవచ్చును తెలియక పోవచ్చును. కాని స్వార్థపరుడగు నరుడు సమస్త దేవాలయములను దర్శించుచు సర్వతీర్థములను సేవించుచు చిరుతపులివలె శరీరమంతయు బొట్లు ధరించి యుండియు గూడ శివునకు చాల దూరముననే యుండును.''

ఈ మాటలకు వేరే వ్యాఖ్యానం అక్కరలేదు.

సింహావలోకనం చేస్తే, నాస్తికులైనా సాధ్యమైనంత ఎక్కువ ఆనందం జీవితంలో అనుభవించడానికి వైరాగ్యం అవలంబిస్తూ సంఘంలో అభ్యుదయం పొందడానికి పాటుపడాలనీ, ఆస్తికులైనా జ్ఞానమార్గం ద్వారా గానీ భక్తిమార్గంద్వారా గానీ మోక్షసాధన చేయాలంటే ప్రపంచంలో వ్యాపించి ఉన్న బ్రహ్మమునూ నారాయణునీ దర్శించే ప్రయత్నాన్ని మానవసేవారూపంగా ఆచరిస్తూ వైరాగ్యసాధన చేయాల్సి ఉంటుందనీ ఏర్పడుతుంది. కాబట్టి ఆస్తికులకైనా నాస్తికులకైనా సంఘజీవనంలో వైరాగ్యానికంటే ఉన్నతమైన స్థానం ఇక దేనికీ లేదని స్పష్టమౌతుంది.

# కర్మయోగము - కర్మసన్న్యాసము

## శిష్టా రామకృష్ణశాస్త్రి

శ్లో॥ కర్మణ్యేవాధికారస్తే,
మా ఫలేషు కదాచన
మా కర్మఫల హేతుర్భూః,
ర్మా తే సంగోఽస్త్వకర్మణి ॥
భగవద్గీత II-47.

(తా॥ కర్మను చేయుటకు మాత్రమే నీకధికారము కలదు. ఫలము [లభించుటగాని లభింపకపోవుటగాని] ఎప్పుడు నీ యధీనమున లేదు. కాన నా కర్మలకీవిధమగు ఫలము కావలయునని యభిలాషను మనమున నిడికొని కర్మచేయకుము. మఱియు కర్మలను చేయక పోవుటయందు నయితము నీవు ఆసక్తుడవు కాకుము.)

జగద్వ్యాపారకర్మము ప్రవృత్తి మార్గమనియు, ఆధ్యాత్మికవ్యాపారము నివృత్తి మార్గమనియు లోకమున గలవు. సృష్ట్యారంభమున భగవంతుడు హిరణ్యగర్భుని (బ్రహ్మదేవుని) సృష్టి నుత్పన్నము చేయుమని యాజ్ఞాపింపగా, నతనియందుండి మరీచ్యాది సప్త మానసపుత్రులు పుట్టి, వారు సృష్టిక్రమము నారంభించుటకు కర్మమయమగు ప్రవృత్తి మార్గము నవలంబించిరి. మఱియు సనత్కుమారుడును కపిలుడు మొదలగు నితరులగు నేడ్గురు బ్రహ్మమానసపుత్రులు పుట్టిన వెంటనే నివృత్తిమార్గ మవలంబించిరని ఈ రెండుమార్గములకును ఉపపత్తి చెప్పబడుటచే నీ రెండుమార్గములు మోక్షదృష్టిచే తుల్య

బలములు గలవియే యగును. హిరణ్యగర్భు డెప్పుడును కర్మలను వదలినాడని యెక్కడను చెప్పబడలేదు. మఱియు విశేషించి సృష్టి వ్యవహారము ధారాళముగా నడచుటకై భగవంతుడే కర్మరూపమగు యజ్ఞచక్రమును సృజించి, వానిని సర్వకాలము ననుష్ఠింపవలసినదిగా వారికిని ఇతర దేవతలకును ఉపదేశించెనని తెలుపబడినది. (శాంతిపర్వం-339-66, 67, 67; 340-44-75) ఈ కర్మసన్న్యాసమను నివృత్తిమార్గమును కర్మయోగమను ప్రవృత్తిమార్గమును రెండును సమానముగనే మోక్షప్రదములగుటచేత నీ రెంటిలో శ్రేష్ఠమైనదో తెలియగోరి యర్జునుడు శ్రీకృష్ణ భగవానుని భగవద్గీతలో నడుగగా శ్రీకృష్ణు డిట్లు సమాధానము చెప్పినాడు.

శ్లో॥ సన్న్యాసః కర్మయోగశ్చ
నిశ్శ్రేయసకరావుభౌ
తయోస్తు కర్మసన్న్యాసాత్
కర్మయోగో విశిష్యతే

గీత V-2

(తా॥ కర్మసన్న్యాసము, కర్మయోగము నను నీ రెండుమార్గములు లేక నిష్ఠలు నిశ్శ్రేయసకరములే అనగా మోక్షమును లభింపజేయునవియే. కాని ఈ రెంటిలో కర్మసన్న్యాసముకంటె కర్మయోగమే యధికమైనది)

సన్న్యాసాశ్రమమును స్వీకరించిన నివృత్తిమార్గీయులు కర్మలను జేయనక్కరలేదని శ్రీ జగద్గురు శంకరాచార్యులవారి మతము. కాని సిద్ధావస్థ నొందినవారుకూడ లోకకల్యాణార్థము కర్మల నాచరింపవలెనని లోకమాన్య బాలగంగాధరతిలక్ గారు కర్మయోగమను భగవద్గీతా వ్యాఖ్యానమున దెలిపిరి. వైరాగ్యము గల్గినమీదట కదా సన్న్యసించుట. అట్టివారికి ఐహికకర్మలలో ప్రయోజనమేమని యాక్షేపణ. అందుకనే "ఇంద్రియార్థేషు వైరాగ్య" మనిరి కాని లోకకల్యాణ విషయమున కాదుగదా! జగత్తునందు జ్ఞానయుక్తమైన కర్మను వదలితిమేని జగము గ్రుడ్డిదై నశించును. మఱియు నీ తీరున నది నశింపకుండునటుల నలలితముగ దానిని ప్రవర్తింపజేయవలయునని భగవంతు డిష్టపడినాడు. కావుననే బ్రహ్మజ్ఞానముచే సిద్ధించు వైరాగ్యముతోడను సమత్వముతోడను జ్ఞాని జ్ఞానము గలిగిన పిదప సైతము సకల ప్రాపంచిక కర్మలను నిష్కామబుద్ధితో నొనర్చుచు సామాన్య జనులకు సద్వర్తన యను భావమును ప్రత్యక్షముగ జూపవలెను. అట్లుగాక మానవుడు నివృత్తిమార్గమనుచు ప్రాపంచిక విషయములపై వైరాగ్యముచెంది యరణ్యములకో కొండగుహలకోపోయి ముక్కు మూసికొని తపము చేసికొనుటయే తగినపనియని భావించినచో దానివలన తానొక్కడే మోక్షము చెందిన చెందవచ్చును. కాని ఇతరులకు తానెంతమాత్రమును ప్రయోజనకారి కాజాలడు. అందుకనియే పరమేశ్వరుడుకూడ తన కేమియు ప్రయోజనము లేకపోయినను

పరిత్రాణాయ సాధూనాం
వినాశాయ చ దుష్కృతాం
ధర్మసంస్థాప నార్థాయ
సంభవామి యుగే యుగే॥

గీత-IV-8.

అని లోకకల్యాణార్థము భూలోకమున నవతరించి దుష్టసంహారమొనర్చి సాధువులను రక్షించుచు ధర్మసంస్థాపనముచేయుచు "మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ! సర్వశః" అని యాదేశించినాడు. ఇట్లే దేశము సంకట

పరిస్థితిలో నున్నప్పుడు స్వార్థత్యాగ పరాయణులై నిష్కామబుద్ధితో దేవాంశ సంభూతులైనవారు జన్మించి దేశమును సంఘమును ఉద్ధరింతురు. ఆంగ్లభాషా పండితుడైన థామస్ కార్లైలు (Thomas Carlyle) దేశకాల పరిస్థితులనుబట్టి మహావీరుడు జన్మించి తదవసరానుగుణముగ మతకర్తగను రాజకీయవేత్తగను కవిగను ప్రవక్తగను సైన్యాధ్యక్షుడుగను మారి దేశమును రక్షించునని తెలిపెను. అటువంటివారే మహాత్మాగాంధీ, గోపాలకృష్ణ గోఖలే, బాలగంగాధరతిలక్, మోతీలాల్ నెహ్రూ, చిత్తరంజన్‌దాస్, లాలా లజపతిరాయ్ మొదలైన కారణజన్ములు. వారికెన్ని కష్టములు వచ్చినను, ఎన్నివిఘ్నములు కలిగినను భయపడక తమ కార్యమును సాధించువరకు ప్రాణాపాయకర పరిస్థితులలోగూడ తాము చేపట్టిన కార్యమును వదలరు. ఇదే మమకారహీనమైన నిష్కామకర్మ. వారు కామసంకల్పవర్జితులు. ఇట్టి మహాత్ములమీదనే లోకకల్యాణ మాధారపడినది. ఇటువంటివారివలననే జనసంఘము సకల సుఖములను పొందగలదు. కాన మానవసేవలేని వైరాగ్యము శ్రేష్ఠమైనదికాదు. మానవసేవయే మాధవసేవ.

ప్రజాప్రభుత్వము సాగుచున్న ప్రస్తుత కాలమునకూడ ప్రజానాయకులు అట్టి మమకారహీనమైన నిష్కామకర్మ నాచరించిననే గాని ప్రజలకు నిష్కృతిలేదు. అట్టి వైరాగ్యదృష్టిలేని కారణముననే ఎన్ని ప్రణాళికలను సాంఘిక సంక్షేమ కార్యక్రమములను తలపెట్టినను అవి ఫలవంతములు కాకున్నవి. నిరక్షరాస్యతా నిర్మూలనము, నిమ్నజాత్యుద్ధరణము, ఉచితవైద్య సౌకర్యము మొదలైనవి అనేకములలో ఒక కొన్ని. వీని యన్నిటియందును సత్ఫలితములకంటె దుష్ఫలితములే మెండగుటను చూచుచున్నాము. అందువలననే థామస్ కార్లైలు నాయకునకు ముఖ్యముగా 1. ఆత్మశుద్ధి, (Sincerety) 2. సూక్ష్మబుద్ధి, 3. నైతికదృష్టి, ౪. ప్రతిభ, ౫. దాక్షిణ్యము (Sympathy) ఉండవలెనని తెలిపినాడు. వీనికితోడు స్వార్థత్యాగము ఉండవలెనని శ్రీ వివేకానందస్వామి బోధించెను. ఇందుచేతనే గోపాలకృష్ణగోఖలేగారు Servents of India Society భారతదేశ సేవాసంఘమును స్థాపించి నిస్స్వార్థ సేవాధర్మమున శిక్షణ నొసగిరి. కాని అవి యన్నియు వారితోనే యంతమైనవి. నిస్స్వార్థసేవా పరాయణులు లేకపోవుటచేతనే, సాంఘిక సంక్షేమ కార్యక్రమములందు వైరాగ్యదృష్టి లేకపోవుటచేతనే దేశ మిన్ని యగచాట్ల పాలైనది.

కాన స్వార్థత్యాగముతో చేసిన దేశసేవ వలననే సంఘమునకు సుభిక్షము చేకూరగలదు. స్వార్థత్యాగములేని దేశసేవ అవినీతికి లంచగొండితనమునకు తప్పక దారితీసి సంఘమును సంకటముల పాలుచేయును.

# వైరాగ్యము—ఆనందజీవనము

స్వాత్మానందస్వామి

వాల్మీకిమహర్షి మానవలోకమంతకును, అసమానుడైన, సద్గుణసంపన్నుడైన, శ్రీరామచంద్రుని ఆదర్శమూర్తిగ సృష్టించినాడు. సకల సుగుణ సంపన్నుడైన మానవు డున్నాడా అని దీర్ఘంగా ఆలోచించుచుండగా అతనికి ఎవరూ తట్టలేదు. అటువంటి సమయములో నారద మహర్షి వచ్చి అతనికి శ్రీరాముని గురించి వివరించెను. నారదముఖమున రాముని గూర్చి విన్న ఈ మహర్షి అన్ని యుగములకు ఆదర్శప్రాయుడగు శ్రీరాముని మన కందించినాడు. శ్రీరాముని యందు లేని సద్గుణమంటూ ఏదీ లేదు. అదే విధముగ ఆయ ననుభవించని దుఃఖమంటూ ఏదీ లేదు. ఈ దుఃఖము లేవీ శ్రీరాముని కృంగదీయలేదు. సరికదా అవి ఆయనకు వన్నె తెచ్చినవి. ఉదాహరణకు శ్రీరాముని పట్టాభిషేకమే తీసికొనెదము. శ్రీరాముని పట్టాభిషిక్తుని చేయుటకు అందరూ ఉత్సాహముతో ఏకగ్రీవముగ అంగీకరించిరి. పట్టాభిషేకపు ఏర్పాట్లన్నీ త్వర త్వరగా జరుగుతున్నాయి. మంత్రులు, సామంతులు, ఎప్పుడు తెల్లవారుతుందా, ఎప్పుడు రాముని రాజుగా చూస్తామా అని ఎదురుచూస్తున్నారు. సీత, కౌసల్య, అయోధ్య ప్రజలందరూ శ్రీరాముని పట్టాభిషేకము కొఱకు ఎదురుచూస్తున్నారు.

కాని సమయము రాలేదు. చెప్పుడుమాటలు విన్న కైకేయి శ్రీరాముని వనవాసము, భరతుని పట్టాభిషేకము వరములుగ కోరినది. దశరథుని మొర లాలకించలేదు. తండ్రి దర్శనార్థమై శ్రీరాముడు కైకేయి మందిరమునకు వెళ్ళినపుడు కైకేయి శ్రీరామునితో, "శ్రీరామా! నీ తండ్రి నాకు రెండు వరముల ననుగ్రహించినాడు. అవి భరతుని పట్టాభిషేకము, నీ వనవాసము. అందువలన నీ తండ్రి యాజ్ఞ ననుసరించి పట్టాభిషేక ముహూర్తము ననే నీవు వనవాసమునకు ప్రయాణముకమ్ము" అని ఆదేశించినది. ఈ ఘోరవార్త శ్రీరాముని కలతనొందింపలేదు. శ్రీరాముడు తన పట్టాభిషేకవార్త వినినప్పుడు అమితోత్సాహము నొందక ఏవిధముగ నున్నాడో, అదేవిధముగ వనవాసముగూర్చి వినినప్పుడు కృంగిపోలేదు. "ప్రసన్నతాం యాన గతాభిషేక త స్తథాన మమ్లో వనవాస దుఃఖతః" దుఃఖములోకూడ ప్రసన్నతను కాపాడుకొనుటకు వైరాగ్యము కావలెను.

"దుఃఖేష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః" (గీత, 2-56) దుఃఖసమయమునందు కలతనొందక, సుఖములందు వాంఛ లేకుండ నుండుటయే ఉత్తమ మానవుని లక్ష్యము. ఇటువంటి స్థిరబుద్ధికి వైరాగ్య మంకురము. వైరాగ్యము లేనినాడు ప్రకృతి మాయలకు మనము బానిసలము. శ్రీరాముని గుణములలో ఈ వైరాగ్య మొకటి. "వైరాగ్యాంబుజ భాస్కరం" అని శ్రీరాముని మనము స్తుతించుచున్నాము. ఇటువంటి వైరాగ్యము కలవాడే సుఖశాంతులను పొందగలడు.

మానవుని దుఃఖసముద్రములో ముంచునది యింద్రియతృష్ణ. కఠోపనిషత్తులో చెప్పినట్లు "పరాంఛిఖాని వ్యతృణాత్ స్వయంభూ." ఇది యింద్రియముల నైజము, అవి ఎంతసేపూ విషయముల కొఱకై బయటకు పోవును. విషయవాంఛలజాలమున మనము దుఃఖము నొందుచున్నాము. కోరికల ననుభవించుట ద్వారా ఆనందము నొందుచున్నా నని అజ్ఞానియగు మానవుని ఆలోచన; భ్రమ. కాని ఈ కోర్కెలు

అతనిలో అశాంతినే నెలకొల్పుతున్నాయి. విజ్ఞుడైన మానవుడు, అనుభవజ్ఞులైన పెద్దలమాటలను ఆలకించి యుండినట్లయిన ఈ అశాంతి కొంత తొలగెడిది. "శాంతము లేక సౌఖ్యము లేదు" అని త్యాగరాజు అంటాడు. ఈ శాంతము పొందవలెనన్న తృష్ణ అనే గుఱ్ఱమును కళ్లెముతో బిగించి పట్టుకోవలెను. తృ అనేదే కళ్లెము. విషయాసక్తతకు పూర్తి స్వాతంత్ర్యము ఈయరాదు. జీవితానందము కన్న, జీవితాశయమునకై పాటుపడినవారు ఎక్కువ ఆనందము నొందువారని చెప్పుటకు సందియము లేదు.

జీవితాశయములు వేరుగాగల ఒకే కుటుంబములోని యిద్దరువ్యక్తులను తీసికొందము. వీరిద్దరు చరిత్ర ప్రసిద్ధులైన శ్రీనాథుడు, పోతనామాత్యులు. శ్రీనాథుడు తన కవిత్వసంపదను రాజుల కర్పించి ఇహలోక సౌఖ్యముల ననుభవించెను. పోతన భక్తుడు. తన జీవితమును భగవంతున కర్పించి యింద్రియాతీతానందము ననుభవించెను. స్వార్థపరులై, ఇహసౌఖ్యము లనుభవించువారికి, త్యాగమూర్తులను చూచిన ఎగతాళి కదా! శ్రీనాథుడు పోతనను "నీవు కవివై యుండి ఈ బీదరికము నెందుకు నెత్తిమీద ఉంచుకున్నా"వని అడిగినపుడు పోతన ఏమి చెప్పాడో అందరికి తెలుసు "హాలికులైన నేమి, గహనాంతర సీమల గందమూల కొద్దాలికులైన నేమి నిజదార సుతోదర పోషణార్థమై" ఇటువంటి వైరాగ్యమున్నది కావుననే ఆతడు శాంతి, సౌఖ్యముల నొందగలిగెను. ఎన్ని భోగము లనుభవించినను శ్రీనాథుని జీవితములో ఈ శాంతిసౌఖ్యములు కఱవయినవి. తనను పోషించు రాజుల మరణానంతరము తా ననుభవించిన సౌఖ్యములను తలంచుకొనుచు వాపోవుట తప్ప ఆతడు చేయునది లేకపోయినది. అందువలన జీవితములో నిజమైన సుఖశాంతులు కావలెనన్న వైరాగ్యముతప్ప మరియొక మార్గము లేదు. అన్ని భయములను పోగొట్టున దీ వైరాగ్యము. అందుచేతనే శ్రీ శంకరాచార్యులు, "వైరాగ్యమేవా ఽభయం" అని చెప్పిరి.

శ్రీమద్రామాయణములో శ్రీరాముని శాంతస్వభావమునకు, పోతన సుఖసంతోషములకు కారణమైన ఈ వైరాగ్యము మన ఈ సాంఘిక వ్యవస్థలో ఎంతవరకు మన కుపయోగపడును? అసలు వైరాగ్యమునకు మన వ్యవస్థలో స్థానమున్నదా? మానవు లందరు కూడ ఈ వైరాగ్యమును తెలిసియో తెలియకయో పాటించుచునే యున్నారు. తల్లిదండ్రులు తమ సంతతికై తమ సుఖమును త్యాగము చేయుచున్నారే, ఇది వైరాగ్యము కాదా? వివాహము చేసికొన్న ప్రతివారును తమ స్వాతంత్ర్యమును త్యాగము చేయుచున్నారే! ఈ త్యాగము కేవలము స్వార్థబుద్ధితో కూడుకొని యున్నది. దీనివలన నిజమైన ఆనందమును మానవుడు పొందుట లేదు. ఒకరి బలవంతముచే మనము దానము చేసినపుడు మన మానంద మొందలేము – కాని అదే దానమును మనంతట మనమే త్యాగబుద్ధితో చేసినపుడు మన మెంతటి ఆనంద మొందెదము. పేరు, ప్రతిష్ఠలకు కాక, వైరాగ్యముతో నలుగురికి సహాయపడునపుడు మన మత్యంతానందము నొందగలము. మానవు డానందమును కోరును కాబట్టి అటువంటి యానంద మొందుటకు వైరాగ్యము నలవరచుకొనవలెను.

దీనికి జాన్. డి. రాక్‌ఫెల్లర్ (John D. Rockefeller) జీవితమునే ఉదాహరణముగ తీసుకొందము. ఈయన పేరు విననివారు అరుదు,

ప్రపంచములో నున్న మానవులలో అనేకులు ఈయన సహాయము నేదో విధముగ నొందిన వారే. ఈయన సామాన్య రైతుబిడ్డ. ఈయన వ్యాపారములో అడుగుపెట్టి కష్టపడి పని చేసెను. ఇతని ధ్యేయము ధనార్జన. అందువలన తన శక్తిని, మేధస్సును ఈ ధ్యేయమునకై ధారవోసెను. దాని ఫలితముగ తన ముప్పది మూడవ యేటనే మిలియన్ డాలర్లు సంపాదించగలిగెను. నలువదిమూడవయేట ప్రపంచములో అత్యంత ధనికవర్తకుడు. ఏబది మూడవయేట ప్రపంచములోకెల్ల ధనికుడు.

అత్యంత ధనికుడగు రాక్ ఫెల్లర్ ఆనందము ననుభవించు చున్నాడా? లేదు. అతనిలో శాంతిలేదు, ధనసంరక్షణలో ఆతనికి నిద్రాహారములు కఱవయినవి. ఇడా టార్ బెల్ (Ida Tarbell) వ్రాతల మూలమున రాక్ పెల్లర్ జీవితము ఎంత హీనముగ నున్నదో తెలిసి కొనగలుగుచున్నాము, ఆయనలో ముదిమి వయస్సు స్థానమేర్పరచుకొన్నది. ఆయనకన్న ముసలివానిని ఎవరును జూడలేదు. ఆయన ఆహారము విందుభోజనము కాదు; పాలు, రెండు మూడు బిస్కట్లు. వచ్చే సంవత్సరము ఆయన జన్మదినోత్సవము జరుపుకొనగలడా అని అందరికి అనుమానము. ఆయన మరణవార్త ఎప్పుడు ప్రచురింపవలసి వచ్చునో యని వార్తాపత్రికలు ఆయన జీవితవిశేషములను సేకరించి అట్టేపెట్టుకున్నవి.

ఒకరోజు రాత్రి నిద్రలేమిచే బాధ పడు చుండగా ఆయనకు జ్ఞానోదయమైనది; "నేను ప్రపంచములో అత్యంత ధనికుడను. నేను చని పోయినపుడు ఇందులో ఒక పూచికపుల్లకూడ నాతో రాదే నా అర్జన అంతయు వదలిపెట్టి పోవలసివచ్చినప్పుడు నేను బ్రతికియుండగా నలుగురికి ఎందుకు పంచిపెట్టకూడదు!" అని అనుకొనెను. ఈ విధముగ తన సంపదమీద తనకే వైరాగ్య మంకురించినది. మరునాడే తన యావద్దాస్తిని నలుగురికి ఉపయోగపడునట్లు "రాక్ ఫెల్లర్ ఫౌండేషన్ Rockefeller foundation" అను సంస్థను ఏర్పాటు చేసెను. ఈసంస్థ ద్వారా ఆయన చేసిన సహాయములు వ్రాయాలంటే అది ఒక పెద్ద గ్రంథ మగును. "ధనమువలన దానంబు" ధనము కలిగి యుండుటవలన ఫల మేమి టనగా దానము చేయుట.

ఇచ్ఛాపూర్వకముగ తన సంపదను దానము చేయుటతో రాక్ ఫెల్లర్ జీవితములో నూతన అధ్యాయము ఆరంభమైనది. అతనిలో తృప్తి, ఆనందము ప్రవేశించినవి. అవి అతని అనారోగ్యమును బాపి పూర్ణారోగ్యమును ప్రసాదించినవి. ఏబదిమూడవఏటనే మరణించు నను కొన్న వ్యక్తి ఆరోగ్యముతో తొంబది ఎనిమిది (98) సంవత్సరముల వరకు బ్రతికి ఆనందముతో కన్నుమూసెను. ఇది వైరాగ్యమహిమ కాదా!

వైరాగ్యము వలననే మానవుడు భావ స్వాతంత్ర్యము నొందగలడు. వివేకానంద స్వామినిగూర్చిన లాస్ ఏంజిలిస్ (Los Angles) లోని 'కేపిటల్' అనే పత్రిక యిట్లు వ్రాసినది. "వివేకానందస్వామి మనమధ్య మసలుటవలన ఆసియాప్రజల లక్ష్యమును, ఉత్తమజీవనమును తెలిసికొనుటకు మనకు గొప్ప అవకాశము లభించినది. వారి ఉత్తమజీవనమునకు మూలము వైరాగ్యము, స్వాతంత్ర్యము."

వైరాగ్యము లేనినాడు స్వాతంత్ర్యము లేదు. స్వాతంత్ర్యము లేనినాడు అభివృద్ధిలేదు అందువలన సంఘము అభివృద్ధి పొందవలె నన్నను, నాగరికత పెంపొందవలెనన్నను స్వాతంత్ర్యము కావలెను, స్వాతంత్ర్యము ఒకరిచ్చునదికాదు, ఒకరు దోచునదికాదు, కాని దీనిని అనుభవిం

చుటకు తగిన పాత్రత కావలెను. అట్లు కాని యెడల అనర్థముల పాలగుదుము. హిందూదేశమున మతస్వాతంత్ర్యము కలదు కాబట్టే ఎన్నియో మతములు తలయెత్తినవి. ప్రపంచములో ఎవరూ ఊహించని అద్వైత మతము హిందూదేశములో సామాన్యులకు కూడా అవగతమే. స్వాతంత్ర్యమును బాధ్యతతో స్వీకరించి, సద్వినియోగపరచినది వైరాగ్య ధనులైన సన్యాసులు, గృహస్థులు మాత్రమే. అందువలన సంఘపురోభివృద్ధికి వ్యక్తిగత వైరాగ్యమెంతైన అవసరము.

సంఘము వ్యక్తుల సమూహము మాత్రమే. వ్యక్తి లేకుండ సంఘము లేదు. వ్యక్తి సుఖ సంతోషములు సంఘముపై ప్రతిఫలించును. అందుచేతనే హిందూదేశమున వివాహ జీవితమున నియమనిష్ఠలు; వివాహము బాధ్యతాయుతమైన సంఘముయొక్క అంగము. దానిని విస్మరించిననాడు సంఘములో అరాచకము బయలుదేరును. వివాహ జీవితమున కూడా వైరాగ్య మవసరమే. ఈ విషయమును వివేకానందస్వామి ఓలియా అను నామెకు చెప్పిరి. ఈ ఓలియా శ్రీమతి బుల్ కుమార్తె. ఓలియాభర్త ఆమెకు విడాకులిచ్చెను. ఆ ముందటి సంవత్సరమే ఆమెబిడ్డ మరణించెను. దుఃఖసముద్రములో నిస్సహాయస్థితిలో నున్న ఓలియాతో, "ఓలియా! మనము తీయని కలలుకంటూ నిద్రపోతాము. అవి భయంకరములై మనలను భయపెట్టుచున్నప్పుడు మనము మేల్కొంటాము. అప్పుడు జీవితములో చేదు నిజాలు బయటపడతాయి, ఇదేవిధముగ జీవితమనే తీయటి కలను మృత్యువు అంతము చేస్తుంది. అందువలన మృత్యువును ప్రేమించు," మృత్యువును ప్రేమించుటే వైరాగ్యము. "వివాహ జీవితములో ఆనందము లేదా?" అని ఆల్బెర్టా అను నామె స్వామీజీని అడుగగ, "లేకేమి! ఉన్నది. వివాహజీవితము తపస్సనే భావముతో సర్వమును త్యజించి స్వీకరించిననాడు అందు ఆనందమున్నది" అని జనులు చెప్పిరి. గృహస్థుడు కాని, సన్యాసి కాని, వైరాగ్యము లేనినాడు దుఃఖము నొందును.

వ్యక్తి, అతనిద్వారా సంఘము ఔన్నత్యము నొందవలెనన్న వైరాగ్య మవసరము. నీవు ఒకనికి సహాయము చేయవలెనన్న ఈ వైరాగ్య మవసరము. క్రీస్తు చెప్పినట్లు "నీ పొరుగు వానిని నీవలె ప్రేమించవలెనన్న ఈ వైరాగ్య మవసరము. రాజ్యపట్టాభిషేకమును తృణప్రాయముగ త్యజించిన రాముడు మనకు అనుసరణయోగ్యుడు. శ్రీరాముడు వైరాగ్యసంపన్నుడు కాబట్టే అయోధ్య ప్రజలందరిలో కూడ ఈ వైరాగ్యము పెల్లుబికినది. మన ఈ సాంఘిక వ్యవస్థలో నాయకులు వైరాగ్యవంతులైననాడు ప్రజలు వారి ననుసరింపరా? అప్పుడు తిరిగి రామరాజ్యము సుస్థాపిత మొందదా?

# సంఘజీవనమున వైరాగ్యపరిణామము

జైత

మానవుడు సంఘజీవి. మానవజీవిత గమ్యము మోక్షము. మోక్షమునకు జ్ఞానరూపమైన వైరాగ్యము మూలము. వైరాగ్య సంఘజీవనములు స్థూలదృష్టికి నివృత్తిప్రవృత్తి మార్గములుగ గోచరించుటవలన పరస్పర విరుద్ధము లనిపించినను సూక్ష్మదృష్టికి జ్యోతి

మధ్య తేజోనీలిమములవలె నవిరుద్ధములై గమ్యమును ప్రకాశింపఁజేయునని ఆత్మానుభూతిని పొందిన బ్రహ్మవిదులు ప్రవచించిరి.

శ్రీ వివేకానందభగవాను లీ విషయమును గూర్చి ప్రసంగించుచు మానవునియందే కాదు సకల జీవకోటియందును సంఘీభావము ప్రస్ఫుటమగుచున్నదనియు, ప్రతిజీవికి మోక్షము చరమగమ్యమనియు వెల్లడించి యున్నారు. దీనింబట్టి జీవధర్మమునందే సంఘీభావ మోక్షసుఖాభిలాష లవిరుద్ధములై యొప్పుచున్నట్లు తెల్లమగుచున్నది.

ఈ విషయమును సిద్ధాంతీకరించుటకు ముందు మానవజీవితక్రమమును బరిశీలింతము. సృష్ట్యారంభమునుండి మానవ్యోత్కృష్ట జ్ఞాన భూమికలవైపునకు కాలక్రమ పరిణామమును జెందుచు వచ్చుచున్నది. అట్టి పరిణామదశలను నాలుగుయుగములుగ చరిత్రకారులు విభజించిరి. అందు మొదటిది మాతృసత్తాక యుగము. ఈ యుగమున మానవు డజ్ఞానిగ నుండెను. చరిత్రనుబట్టి యట్టి యనాగరిక (అజ్ఞాన) దశయందతఁడు పశుప్రాయుఁడుగ జీవితమును గడపినట్లు విదితమగుచున్నది. ఇందు పశుజాతులకున్న యన్యోన్యతగూడ మానవజాతికున్నట్లు స్ఫురింపదు. కలహవాంఛాస్వార్థపరతలు మానవుని దట్టముగ నావరించియుండెను. కాలక్రమమున ప్రకృతి ప్రబోధమువలన జ్ఞానమభివృద్ధియగు కొలఁది యజ్ఞానపు పొరలు పలుచఁబడఁ జొచ్చినవి. మొదటియుగ మంతరించి పితృసత్తాకయుగ మారంభమైనది. ఇందు మానవుఁడు తన జన్మమునకు మాతాపితరు లిరువురు హేతు భూతులని గ్రహించెను. స్త్రీలోలత్వము సుఖ కారణమని తలఁచెను. అంతటఁ దన కన్య వ్యక్తితోఁ బొత్తుకొంత అవసరమయ్యెను. స్త్రీ యెప్పుడో యొకపరి యవసరమను దృష్టి తొలఁగి యామె గృహిణి (ధర్మపత్ని) యను విశ్వాసము ప్రబలెను. స్త్రీ తన సంతతిని తనతోనే నుంచుకొనుటయు తన రక్షణకొఱకు పురుషునిపై ఆధారపడి తాను భార్యగ పురుషుఁడు భర్తగ గృహస్థజీవనము నలవఱచు కొన్నది. దానితో నితరుల సహాయ బంధుత్వము లపేక్షితములైనవి. అంతట నాయుగము మాఱి జానపదయుగము వెలసినది. ఇందు కొన్నికొన్ని కుటుంబము లొకచో నివసించుట కలవాటుపడినవి. పరులొకరినొకరు దర్థము చేసికొని యొకరి కొకరు సహాయపడఁజొచ్చిరి. మానవునకు కలహవాంఛానిగ్రహ మనివార్యమయ్యెను. అంతరాత్మయందు సద్భావశక్తి స్ఫురించెను. పాపభీతి యేర్పడియెను. ఈ యుగముననే మానవుఁడు స్వార్థమునుండి విముక్తి నందఁ జొచ్చెను. ఈ విముక్తి భార్యాప్రేమతో నారంభించి సంసారాభిమానముగను, సంఘాభిమానముగను మాఱినది. తదుపరి రాజసత్తాక యుగము ప్రారంభమైనది. బలోద్ధతుల స్థానమును న్యాయ మాక్రమించినది. ఇందు మానవులు తమలో నుత్తముఁడగువాని నధిపతిగఁ జేసికొని వాని యాజ్ఞలను పాటించుచు సభ్యత నలవరుచుకొనిరి. ఇట్లు క్రమక్రమముగ సామూహిక వాంఛలకు బద్ధమై సంఘశ్రేయస్సునకు తన స్వార్థమును బలియొనర్చిన మానవ విజ్ఞానమునకు "ఆధ్యాత్మికత" (Sublimation) సంభవించినది. ఆధ్యాత్మికబల మధికమగు కొలఁది మూఢవిశ్వాసము లంతరింపఁజొచ్చెను. ఆత్మవికాస మభివృద్ధి చెందసాగెను. నాగరికతా పరిణామమునందు మానవుఁడు సంఘము రెండు నిట్లభివృద్ధి చెందెను. "మానవుని ఆత్మ అభివృద్ధి చెందినట్లే సంఘాత్మ (Conscience of a Society) సహిత మభివృద్ధి చెందు"నన్న

సైమండు ఫ్రాయిడ్ ప్రవచన మీ విషయ మునే ధృవపరచుచున్నది.

ఆధ్యాత్మికశక్తి నభివృద్ధిచేసికొను మానవున కిప్పుడొక క్లిష్టసంఘటన మేర్పడినది. స్త్రీ మొదట స్వార్థరాహిత్యమున కనుకూలమైనది. ఇప్పు డామెయే దాని యభివృద్ధికి ప్రతికూలమైనది. ఆమె తనయెడల దనకుటుంబముయెడల గల ప్రేమచే పురుషుని బంధించినది. దాని నతిక్రమించుట పురుషునకు కష్టతర ప్రయాసమైనది. కనుకనే స్త్రీయెడ సంసారమునెడ విముఖత పొడసూపెను. అట్టి విముఖతనే మనము వైరాగ్య మనుచున్నారము. వైరాగ్య సంపన్నుడైన శుకుడను బాలుడు తన వివాహమును గూర్చి ప్రస్తావించిన తండ్రియగు వ్యాసునితో పలికిన వాక్యములు కుటుంబ జీవనముపట్ల నెట్లు విముఖతను చాటుచున్నవో గమనింతము.

కదాచిదపి ముచ్యేత,
లోహకాష్ఠాది యంత్రితః,
పుత్రదారైర్నిబద్ధస్తు,
న విముచ్యేత కర్హిచిత్ ॥
గృహ్ణాతి పురుషం యస్మాత్,
గృహం తేన ప్రకీర్తితమ్.
క్వ సుఖం బంధనాగారే,
తేన భీతో స్మ్యహం పితః ॥

"తండ్రీ! లోహకాష్ఠాది సంకెలలు దగిలించినచో వాని నొకప్పుడైన మానవుడు విడిపించుకొనగలడు. కాని స్త్రీ పుత్రాదుల యందు గల భ్రాంతిరూప సంకెల లెవరు నెకాలమున వదలించుకొనజాలరు. పురుషుని గ్రహించుటచే నిది గృహమనబడెను. ఈ గార్హస్థ్య మను కారాగారమున సుఖ మెట్లు కలుగును. అందువలన గార్హస్థ్యమును గూర్చి భయపడుచున్నాను."

చూచితిరా! స్త్రీ, కుటుంబము, మానవున కొకప్పుడు సుఖకారణములైనవి. అంతియే కాదు మానవ నాగరకతాభివృద్ధికిని దోహదములైనవి. ఇప్పుడో వానియెడ నతడు విముఖుడగుచున్నాడు. కారణ మాధ్యాత్మిక జ్ఞాన మభివృద్ధి చెందినకొలది మానవునకు ప్రపంచ వస్తువులం దనిత్యత్వ అసుఖత్వబుద్ధి కలుగుటయు, నిత్యపరిణామవంతమై యనిత్యమైన ప్రపంచమునకు గారణమై పరిణామరహితమై యొప్పు నిత్యపదార్థ మొకటి యున్నదనియు, నదియే సర్వమునకు చరమగమ్యమనియు, నదియే సర్వమునకు నాత్మయనియు గ్రహించి తదన్వేషణాశీలుడగుటయే యన వచ్చును. "అనిత్య మసుఖంలోకం ఇమం ప్రాప్య భజస్వమాం" అను గీతావాక్య మీ యర్థమునే వెల్లడించుచున్నది. వైదికగాథ లనుసరించి మొదట మొదట ముముక్షువులు వైరాగ్యపాలనముకొఱకు భార్యను, కుటుంబమును, సంఘమును విడిచి యడవులయందును, కొండగుహలయందు నుండి యేకాంతముగ నాత్మాన్వేషణమునకు నంతర్ముఖులై జీవించిరి. కాలక్రమమున సంఘటిత కఠోర వ్రతములు చేయ నవసరములేదనియు, వివేకముగలవారు, విషయముల యందు దోషదృష్టిగలవారు వైరాగ్యమును గాపాడుకొనుచు స్త్రీ పుత్రధనాది పదార్థములను, సంఘమును త్యజింపకయే ఆత్మజ్ఞానము నందవచ్చుననియు గ్రహించిరి. కనుకనే పిమ్మటి ఋషులు స్త్రీ పుత్రధనాది పదార్థముల విషయక యందలి భ్రాంతిని మాత్రము విడచి యాత్మాన్వేషణ మొనర్చిరి. వారు సంఘశ్రేయస్సునుకోరి వారి యాత్మానుభూతిని జనక ప్రవాహణ దిలీపాశ్వపత్యాదిరాజులకును జ్ఞానకాంక్షగల యన్యగృహస్థులకు నుపదేశించిరి. భార్యయు, కుటుంబము, సంఘము వానిని దైవతములుగ భావించి వారి నైష్ఠిక జీవనమునకు దగిన వెరవులు గల్పించి భజించినవి. ఇందులకు బార్యా ఋషి జీవిత నిదర్శ

నము లటుండ మొన్న మొన్నటి శ్రీరామకృష్ణ పరమహంస జీవితమే అత్యుత్తమ నిదర్శనము. శ్రీరాముని, శ్రీకృష్ణుని యవతారముల కీర్తికి కీర్తిఘటించిన శ్రీవారి యవతారము, వారి వైరాగ్య సంఘజీవనము లాధ్యాత్మికలోకమునకు జ్ఞానదీపికలు. స్త్రీలు కుటుంబము, సంఘము వారికి ప్రవృత్తి (బంధ) హేతువులు కాలేదు. వారికే కాదు మరెవ్వరికి నవి బంధహేతువులు వు. వానియం దనురాగము మాత్రమే బంధహేతువగును. దీనిని బోధించు నొక వేదకాలపు కథను బరిశీలింతము. పూర్వము మాళవదేశమును శిఖధ్వజుండను రాజు పాలించుచుండెను. అతని భార్యపేరు చూడాల. రాజదంపతు లిరువురును బరస్పర పరమానురాగముల నొలుగుచుండిరి. చూడాల మనుజులకు మరణ మనివార్యమని గ్రహించి గురువు నాశ్రయించి యాధ్యాత్మవిద్య నభ్యసించి నిరంతర మాత్మధ్యాన నిమగ్నయై యాత్మసిద్ధిని బడసెను. రాజొకనాడు చూడాలయందుం బ్రకాశించుచున్న ఆత్మతేజమును గాంచి విస్మితుండై యిది నీ కెట్లు ప్రాప్తించెనని ప్రశ్నించెను. చూడాల "అనృతజడదుఃఖాత్మకమగు సర్వసంసారభ్రాంతిని విడచి సత్యజ్ఞానానందాత్మయందు రమించుచుంటిని. దాన నీ ప్రకాశము నాకు లభించె"నని నుడివెను. శిఖధ్వజుం డిట్టి తేజము సర్వసంగపరిత్యాగులగు మహాత్ములకే లభించునుగాని నావలె విషయభోగము లనుభవించు నీకెట్లబ్బెనా? యని మనమున దర్కించి తానును సత్వర మట్టి యాత్మజ్ఞానమును బడయనెంచి సంసారమును విడిచి కౌపీన దండకమండలువుల దాల్చి మందరాచలప్రాంత విపినమున బర్ణకుటీరమును నిర్మించుకొని తపమాచరించుచుండెను. చూడాల భర్తకు జ్ఞానోపదేశ మొనర్పనెంచి యొకనాడు ముని కుమారవేషమున నాతని పర్ణశాలజేరి తాను నారద పుత్రుండననియు కుంభుండనువాడననియుం దెల్పెను. రాజతని నుచితరీతుల సత్కరించి తాను మాళవదేశాధిపతియగు శిఖధ్వజుండననియు నాత్మానుభూతికై తపమాచరించుచుంటిననియు, కాని కృతార్థుండగా నైతిననియు, దన వృత్తాంతము నెఱింగించెను. అప్పుడా బాలముని వైరాగ్యమునకే యట్టి జ్ఞానము లభింపదనియు, వైరాగ్యవంతుండు సద్గురుకృపవలన నాత్మజ్ఞానమును బడయవలెననియు వచించెను.

రాజు "మహాత్మా! నేను మీకు శిష్యుండ నైతిని. నన్నుం గృతార్థుం గావింపు డనెను. ముని యవనీశా! నీవు కృతార్థుండవు గాందలంచినచో జ్ఞానమును బడయవలయును. జ్ఞానప్రాప్తికి వైరాగ్యమే ముఖ్యసాధనము. వైరాగ్యము లేనివానికి జ్ఞానముగాని శాంతిగాని దుర్లభములు. కావున నీ విప్పుడు సర్వసంగపరిత్యాగి వైనచో జ్ఞానోపదేశ మొనర్తు ననెను. రాజు తన కుటీరమును గన్ని దరికొల్పి దండకమండలాది పరికరములనందుం బడవైచి సర్వసంగ పరిత్యాగి నైతిననెను. ముని నవ్వి, నీవు సర్వసంగపరిత్యాగివైనచో నీది యను వస్తువే లేకపోవలయును. మఱి దేహమున్నది గదా! అది నీది కాదా! యనెను. రాజు దీనినికూడ పరిత్యజింతునని యగ్నియందు దుముకబోయెను. ఆ బాలతపస్వి రాజును వారించి రాజా? దేహము కాలిపోయినను బూడిద మిగిలియుండును. అది నీది కాదా! దాని నేమి సేయుదువని యడిగెను. రాజున కేమియు దోచలేదు. మునికి నమస్కరించి "నే నజ్ఞానిని. నా కేమియుం దెలియదు. నాకు సన్న్యాసము సిద్ధించి సత్వరము జ్ఞానోదయ మగునట్లనుగ్రహింపుడని వేడుకొనెను. అంతట నా మాయాతపస్వి, రాజేంద్రా! నీవు భార్యను, రాజ్యమును, దేహమును విడిచినంత మాత్రమున సర్వసంగపరిత్యాగివి కాజాలవు.

వీనిని పరిత్యజింపఁ దలఁచుట వెఱ్ఱితనము. విషయానురాగమును, దేహాభిమానమును విడిచిన నీ వన్నియు విడిచినవాఁడ వగుదువు. హృదయమున విషయవాసన లున్నంతవఱకు సంసారము నిన్నంటియే యుండును. విషయ వాసనల వీడినచో సర్వసంసారమునను సంసారము నిన్నంటదు. సన్న్యాసివే యగుదువు. పడవ నీటియందే యుండవలయును. కాని పడవలో నీ రుండరాదు. నీవు సంసారమునందే యుండవలయును. నీలో సంసారముండ రాదు. రాజా! వైరాగ్య మిట్టి దని బోధించి యాత్మోపదేశ మొనర్చెను. రాజునకు జ్ఞాననిష్ఠ స్థిరపడిన పిదప చూడాల నిజరూపమును దాల్చి రాజును స్వీయరాజ్యమునకుఁ గొనిపోయెను. రాజదంపతులు విషయరాగ రహితులై ప్రజాశ్రేయస్సు నభిలషించి బహువత్సరములు రాజ్యమును పాలించి ముక్తినిఁ బొందిరి. దీనిఁబట్టి వైరాగ్య జీవనమునకు సంఘము ప్రతికూలము కాదని సిద్ధించినది.

సంఘమునకు దూరులై జీవిత ప్రయోజనమును గుహాలపాలొనర్చిన యోగులనుగూర్చి ఆధునికయుగమున పేరెన్నిక గన్న రాజకీయవిజ్ఞుఁడు, ఆధ్యాత్మిక దార్శనికుఁడు, విఖ్యాత చరిత్రకారుఁడునైన జార్జి కాట్లిన్ మిక్కిలి విచారమును వ్యక్తపరచిరి. వారు భారతదేశమున పర్యటించుచు నరవిందాశ్రమమును దర్శించిరి. అచటివారు, అరవిందులు మూఁడు మాసముల కొకపరి దర్శన మిత్తురనియు, దర్శనమున గూడ మౌనమునే పాటింతురనియుఁ జెప్పిరట. అందుల కా పండితమణి వెల్లడించిన అభిప్రాయము గమనింపఁ దగినది. "మానవమాత్రులతో మాటమంతి లేక నిర్లిప్తుఁడై అరవిందుఁ డేదో ఆశ్రమకోణమున నున్నాఁడు, మానవోద్ధరణ మొనర్పవలసిన యోగి సమాజమునకు దూరుఁడై నిర్లేపుఁడై యుండవలసిన అగత్యము లేదు. యోగి సంఘమునకు దూరముగ నుండుట యెందులకో నాకు బోధపడుట లేదు. యోగమునకు సంఘబహిష్కార మవసరమా? ఈ దేశమున గురువగుట కిది యవసరమా?... ఆశ్రమ వాసులు కొందఱు తమ ఆస్తిపాస్తులను ఆశ్రమమున కర్పించి స్వాభిమానము వలన నిజము చెప్పలేక, ఆశ్రమజీవనము నిరుపయోగమై పోయినదనియుఁ, దాము సరియగు దారి త్రొక్కలేదనియు నంగీకరించిరి... పాశ్చాత్య రాజనీతి కోవిదుల ఆత్మోన్నతికిఁ బ్రజలతో మైత్రి నెరపుటయు, ప్రజాహృదయము లిందు వలనఁ బడి సంపాదించుటయును ప్రధానములు. ప్రాగ్దేశములం దాత్మవికాసమునకు సంఘబహిష్కారము, నిర్లిప్తత ప్రధానభూమికలు: సాధకుఁడు సామాన్య మానవులకు దూరుఁడై ఔన్నత్యము నాపాదించుకొనును. హిందూధర్మమున నీ సమస్యనే పరిష్కరింపవలయును." ఈవాక్యములను వారు రచించిన "ఇన్ ది పాత్ ఆఫ్ మహాత్మాగాంధీ" అను గ్రంథమున పొందుపరచిరి. జార్జి కాట్లిన్ కేవల పారలౌకిక యోగానుభూతి మాత్రమే కాక సంఘాభ్యుదయ కార్యకలాపబంధురమైన కర్మయోగమునకుఁ గూడ ప్రాధాన్య మీయవలెననిరి. ఈ సిద్ధాంతస్థాపనమునకే శ్రీ వివేకానందులు "శ్రీరామకృష్ణమఠ" సంస్థలను స్థాపించిరి. సంఘమునకు వైరాగ్య జీవరసాయనమున జీవనసిద్ధిఁ బొందింప యత్నించిరి. ఇట్టి పెద్దల ప్రవచనములనుబట్టి విచారించిన వైరాగ్యవ్రతఫలమగు నాధ్యాత్మికానుభూతిని సంఘలక్ష్మికి నివేదన మొనర్చిననాఁడే ఆ వ్రతము సిద్ధి నందును. వైరాగ్యవ్రతమున నాత్మానుభూతిని పొందని సంఘజీవనము, జ్ఞానకిరణముల వెదజల్లి సంఘోద్ధరణ మొనర్పని వైరాగ్యవ్రతము నిరర్థకములు.

# యోగసారబోధిని—23

## శ్రీ జ్ఞానేశ్వరానందస్వామి

**4. దీనత :** దీనత అనగా అణకువ. వినయము. అంతియేగాని ఆత్మనిందవలన వచ్చు న్యూనత గాదు. నీ యందున్న అనంతశక్తి నీకు స్ఫురింపగానే నీవు నిజముగా వినమ్రుడ వగుదువు. ఏదోనొక మాహాత్మ్యమును గుర్తించుటపై దీనత యనునది ఆధారపడియున్నది. ఇదియు ప్రేమ సహకారముగా పావనము చేయును. ఎల్లరకును గౌరవాదరములను చూపుటకు సిద్ధముగా నుండుము. దీనతయను నీ సుగుణమును నలవరచుకొనుము. దీనతనుండి శక్తి యుత్పన్నమగును. దౌర్బల్యము కాదు. గడ్డిపోచవలె కాలిక్రింద నలుగుటకును సిద్ధముగా నుండుము. రాయి విసరినచో బదులుగా ఫలమునిచ్చు చెట్టువలె, తనను నరకుచున్న కట్టెలవానికి సైతము నీడనిచ్చు చెట్టువలె నుండుము.

శ్రీరామకృష్ణుల గృహస్థశిష్యుడైన నాగ మహాశయుని పేరుచెప్పగనే అతని జీవితము నెరిగినవారికి దీనతయొక్క అతిమనోహర భావము మదిలో మెదలును. నాగమహాశయులను గూర్చి చెప్పుచు శ్రీరామకృష్ణులొకసారి ఇట్లనిరి. "జగజ్జనని ఇతనిని మాయతో కట్టివేయ ప్రయత్నించెను. కాని అతడు ఇంకను మరింకను కుంచించుకొనిపోవుటచే (దీనభావము పెరుగుటచే) కట్టుట కేమియు మిగుల దయ్యెను." (వివేకానందస్వామిని గూర్చి చెప్పుచు శ్రీరామకృష్ణులు అతడనంతముగా పెరిగిపోవుచుండుటచే జగజ్జనని అతనిని బంధింపజాల దయ్యెననెను.)

నేను పాట్నా ఆశ్రమమునందుండగా శ్రీ సంధ్యానందస్వామి యొకపరి అచటికి వచ్చిరి. ఉపనిషత్పాఠమునకు సమయము దరియగా నేను వృద్ధులగు స్వాముల సమక్షమున నుపన్యసించుటకు సంకోచపడి వారినే బోధింపుడని ప్రార్థించితిని. కాని వారందుల కంగీకరింపలేదు. మీదుమిక్కిలి బోధించుచుండగా వినమ్రతతో బ్రహ్మచారుల నడుమ గూర్చుండిరి. మహానుభావులు పాటించు దీనతకిది యొకనిదర్శనము.

చైతన్యులు దీనతను జపమును నొక్కి వక్కాణించిరి. "గడ్డిపోచకంటెను అణకువ గలిగియుండుము, వృక్షముకంటెను సహనము గల్గియుండుము; ఎల్లప్పుడును ఇతరులను గౌరవింపుము. కాని ఎన్నడును నీవేమియు నాశింపకుము."

**5. సేవ**యనగా నుపచారము. భగవంతునకు పూజావిధానముగా సకలోపచారములను చేయుట. నిష్ఠ శ్రద్ధతో జేయు సేవను భగవంతుడు స్వీకరించును. వైద్యశాలలు మొదలగు వానియందు 'సంఘసేవ' చేయుటవలన ఒకవిధమగు జాలి అంకురించును. దానినిగూర్చి జాగ్రత్తతో నుండుము. కలలోగూడ ఎవరికిగాని ఏ యుపకారమునుగాని చేయుచున్నానని తలపకుము. ఈ మహిళాసంఘపు యువతులు తమ దానధర్మములనుగూర్చి పలుకునపుడు నాకు సిగ్గుతో పాతాళమున దాగుకొనవలె ననిపించును.

నీకు ప్రీతిపాత్రుడగు భగవానుని స్వయముగా సేవించు నవకాశము కలిగినదని కృతజ్ఞుడవై యుండుము. "మీకు నేనేమి చేయగలను!" (పాశ్చాత్యమర్యాద) అనునది సరియగు భావన కాదు. ఇట్లుగాక నీవు భగవంతుని జూడలేకపోయినను ఆ భగవంతుని సంతానమగు మానవులను జూచుచున్నానను కొనుము. వారినే భగవంతునివలె సేవింపుము. నీవుపాధ్యాయుడవే యైనను నీ విద్యార్థులు భగవంతుని అవతారములని భావింపుము.

**6. ఆత్మసమర్పణము :** సంపూర్ణముగా నన్ని అలంబనములను వదలివేసి భగవంతు

నిపై ఆధారపడుటను ఆత్మసమర్పణ మందుము. ఇష్టదైవముయొక్క చిటికెనవ్రేలిని బట్టుకొనుము. ఇష్టదైవమును నీ చేతిని బట్టుకొననిమ్ము. అప్పుడు నీవు జారిపడుట కవకాశము లేదు. నీ మార్గ మప్పుడు సుగమ మగును.

వైధీభక్తి ఇట్లు పూజావిధులతో గూడినది. భక్తుడు ఇష్టదైవమునందు భక్తిప్రేమలను అలవరచుకొనుటకు భక్తిని దృఢతరము చేసికొనుటకు పూజావిధులను పాటింపవలెను. ఇష్టదైవమునం దానందము ననుభవించుట కనుసరించు మార్గములే పూజావిధులు. వేరు వేరు భక్తిభావములకు వేరు వేరు పూజావిధు లుండును.

# వార్తలు - విశేషాలు

## శ్రీరామకృష్ణమిషన్ శారదాపీఠము

(కార్యదర్శిచే ప్రకటితమైన 71-72, 72-73, 73-74 సం॥ లన నివేదిక సంగ్రహము: రామకృష్ణమిషన్ శారదాపీఠము P. O. బేలూరు మఠము, హౌరా జిల్లా.)

శ్రీరామకృష్ణమఠము శ్రీరామకృష్ణమిషన్ ప్రధానకార్యాలయ సమీపముననే యున్న శారదాపీఠము, మిషనుయొక్క ప్రముఖమైన విద్యాసంస్థలలో నొకటి. అందు ఎనిమిది అంగములు గలవు. శారదాపీఠమున జగద్ధాత్రీపూజ తగు వైభవముతో శ్రద్ధాభక్తులతో జరుపబడెను. అనేకులగు భక్తులు పవిత్రోత్సవమునందు పాల్గొనిరి. ఉత్సవాంతమున దీననారాయణుల కన్నదానము చేయబడెను. వారివారి మందిరములందు విద్యార్థులు సరస్వతీపూజను ఉత్సాహముతో శోభాయమానముగ జరుపుకొనిరి. శిల్పమందిరము శిల్పాయతనముల విద్యార్థులు విశ్వకర్మపూజను ప్రత్యేకముగ జరుపుకొనిరి.

విద్యామందిరము: కలకత్తా విశ్వవిద్యాలయమున కనుబంధకళాశాలయైన విద్యామందిరము గురుకుల విధానమున నడచును. అందు ఈ మూడుసంవత్సరములందును వరుసగా 392, 379, 324 గురు విద్యార్థులుండిరి. విద్యార్థులందరును కళాశాల వసతిగృహములందు శ్రీరామకృష్ణమఠ సన్న్యాసుల పర్యవేక్షణ క్రిందనే యుండిరి. నియమిత క్రమమున చదువు, కార్యనిర్వహణము, ప్రార్థన, క్రీడలు అభ్యసించుటయేగాక మరి ఇతర అధ్యయనేతర వ్యాపకములందుకూడ వారు పాల్గొనిరి. మత విషయముల అధ్యయనము నిర్ణీతవిధమున కొనసాగినది. విద్యామందిరమున రెండు N. C. C. కంపెనీలు తయారైనవి. నేషనల్ సర్వీస్ స్కీముక్రింద వరదబాధితుల సహాయ కార్యక్రమము, వయోజన విద్యాబోధనము మొదలగు కార్యక్రమములందు విద్యార్థుల బృందము ఉత్సాహముతో పాల్గొనినది. విద్యామందిరమునకు 12,286 పుస్తకములుగల ఒక మంచి గ్రంథాలయము గలదు.

శిక్షణ మందిరము: B.Ed, పట్టపరీక్షకు శిక్షణ నిచ్చుటకై గురుకుల నివాస విధానమున ప్రభుత్వచోదితమైన టీచర్స్ ట్రెయినింగ్ కాలేజి, కలకత్తా విశ్వవిద్యాలయమున కనుబంధమైనది, 1958 న ప్రారంభింపబడినది. ఆదర్శవంతులైన ఉపాధ్యాయులను తయారు చేయుటకై శిక్షణమందిరమున సర్వతోముఖమైన శిక్షణ గఱపబడును. ఇందలి పరీక్షా ఫలిత

ములును శ్లాఘనీయములుగ నున్నవి. మూడు సంవత్సరములందును వరుసగా 138, 117, 112 గురు శిక్షణార్థు లుండిరి. సందీపన అను వార్షిక పత్రికను శిక్షణమందిరము ప్రచురించును. ఒక మంచి గ్రంథాలయమును గలదు.

శిల్పమందిరము : ఇది ప్రభుత్వ చోదితమైన పాలిటెక్నిక్ (polytechnic), ఆల్ ఇండియా కౌన్సిల్ ఫర్ టెక్నికల్ ఎడ్యుకేషన్ వారిచే గుర్తింపబడినది. ఇందు సివిల్ ఎలెక్ట్రికల్ మెకానికల్ ఇంజనీరింగులందు 3 సం॥ల డిప్లొమా శిక్షణ ఈయబడును. మూడు సం॥లందు వరుసగా 338, 367, 397 విద్యార్థు లుండిరి. శిల్పమందిర విద్యార్థులకు N. C. C. శిక్షణ గరపబడెను. 6053 పుస్తకములు గల యొక చక్కని గ్రంథాలయము గలదు. అనేకులు ప్రతిభావంతులైన బీదవిద్యార్థులు ఆర్థిక సహాయమును పొందిరి. వీరి వార్షిక పత్రిక "త్రయి."

శిల్పాయతనము : ఇది ప్రభుత్వచోదితమైన ఉచితమగు జూనియర్ టెక్నికల్ స్కూల్ అర్హులైన బీదవిద్యార్థులకు ఈ సంస్థ ఉచితముగా 3 సం॥ వరకు ఎలెక్ట్రిక్, ఆటో మెకానిక్, టర్నింగ్, ఫిట్టింగ్, నేత, వడ్రంగముల సాంకేతిక విద్య గఱపును. ఉత్తీర్ణులైన విద్యార్థులకు శారదాపీఠము పట్టముల నిచ్చును. దాని సహాయముతో వారిలో పలువురు కర్మాగారములందు ఉద్యోగము సంపాదింతురు. దీని గ్రంథాలయము చిన్నది.

జనశిక్షామందిరము: సామాన్య జన విద్యాబోధనము, సంఘసేవ నిమిత్తమై ఈ శాఖ 1949 సం॥న స్థాపితమైనది. ప్రస్తావిత కాలమున 9 సాయంపాఠశాలలలో 317 గురు వయోజనులు అక్షరాస్యులైరి. సర్వ పరికర సమన్వితమైన మొబైల్ ఆడియో విజువల్ ఎయిడ్ యూనిట్ గ్రంథాలయమునందు 17,746 పుస్తకములు గలవు. 50,286 పుస్తకములు 4 శాఖల ద్వారా సంచాలితములైనవి. ఇతరములగు సాంస్కృతిక, విద్యాబోధక కార్యక్రమములు అనేకములు నిర్వహింపబడినవి.

తత్త్వమందిరము : ఈ శాఖ ఆధ్యాత్మిక విషయ ప్రచారము గావించినది.

ప్రచురణ మరియు ఉత్పత్తి: ఛాయాచిత్రపు లోహాపుఛటములను, పరికరములను, లాకెట్టులను, వడ్రంగపు నేతవస్తువులను, మేలురకపు సాంప్రదాణిక డ్డీలను తయారు చేయును. ఛాయాచిత్రగ్రహణ విభాగ మొకటి ప్రత్యేకముగా గలదు. ప్రచురణశాఖ పురజనులకు శ్రీరామకృష్ణ వివేకానందసాహిత్యమున పెక్కు గ్రంథముల నందించినది. ఇప్పటి వరకు ప్రచురింపబడిన గ్రంథముల సంఖ్య 20. ఈ విభాగము చక్కగా సమర్పబడిన యొక విక్రయ ప్రదర్శనశాలను నిర్వహించును. శ్రీరామకృష్ణ వివేకానంద సాహిత్యమును, వివిధ పరిమాణముల ఛాయాచిత్రములును ఇందు లభించును. వడ్రంగపు నేత ఉత్పత్తి కూడ విక్రయార్థమై ఇందే ఉంచబడును.

భగవత్కృపవలనను, ఉదారులగు పురజనుల హృదయపూర్వక సహకారమువలనను, రాష్ట్ర, కేంద్రప్రభుత్వముల గ్రాంట్సువలనను మా సంస్థ కార్యక్రమములు నిర్విఘ్నముగా కొనసాగినవి. ఈ యవకాశమును పురస్కరించుకొని వారికిని మా మిత్రులకు హితకాంక్షులకును ధన్యవాదము లర్పించుచు సంస్థ కార్యక్రమములు ఇంకను విజయవంతములగుటకు వారి సహకారము నర్థించుచున్నాము.

శ్రీరామకృష్ణ మిషనునకిచ్చు దానములన్నియు ఇన్‌కమ్‌టాక్సునుండి విముక్తములు.

# శ్రీరామకృష్ణ ప్రభ

## ముప్పదొకటవ సంపుటము

౧౯౭౪ జూలై ఆనంద ఆషాఢము మొదలు ౧౯౭౫ జూన్ రాక్షస జ్యేష్ఠము వఱకు

సంపాదకులు :

సెప్టెంబరు 1974 వఱకు

శ్రీచిద్ఘనానందస్వామి.

శ్రీ నేలటూరి భక్తవత్సలము, ఎమ్.ఏ., బి.ఓ.ఎల్.

అక్టోబరు 1974 నుండి

శ్రీచిద్ఘనానందస్వామి

ప్రకాశకులు :

శ్రీచిద్ఘనానందస్వామి


శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-600004

పాలుచందా రూ. 7.  విడిసంచిక 70 పైసలు.

# విషయానుక్రమణిక

# శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-600004

## 1975-వ సంవత్సరము, జూలై మాసమున జరుగనున్న ఉత్సవ కార్యక్రమము

**ఆదివారములందు సత్సంగ సమావేశములు**

అపరాహ్ణము 4.00—4.20 వరకు లలితా సహస్రనామ పారాయణము (13-7-75, 27-7-75)

,, ,, ,, శ్రీవిష్ణు సహస్రనామ పారాయణము (6-7-75, 20-7-75)

4.20—4.30 ,, ధ్యానము

4.30—5.30 ,, తమిళమున ఉపన్యాసములు:—

వివేకానంద చరిత్రము (సంగీత ప్రవచనము): శ్రీ మంత్రముగారు (6-7-75)

శ్రీదక్షిణామూర్తి స్తోత్రము: డాక్టర్ టి. ఎం. పి. మహాదేవనుగారు (13-7-75)

శ్రీవిష్ణుసహస్రనామము: శ్రీ వి. కల్యాణసుందరశాస్త్రిగారు (20-7-75)

శ్రీమద్రామాయణము: డాక్టర్ ఎన్. పీఠినాథన్‌గారు (27-7-75)

5.35—6.30 ,, ఆంగ్లోపన్యాసములు:—

శ్రీమద్భగవద్గీత: శ్రీమద్విమలానందస్వాములవారు

6.30—8.00 ,, ఆరాత్రికము - భజన

**ప్రత్యేకోపన్యాసములు**

5-7-75 శనివారము: 5.45 శ్రీమద్రామాయణ పఠనము: శ్రీ పి. రామకృష్ణన్‌గారు, ఐ.ఏ.ఎస్. (రిటైర్డు)

12-7-75 ,, 5.30 అపస్మారయ పరిశీలనము: డాక్టర్ బి. రామమూర్తిగారు

19-7-75 ,, 5.45 బౌద్ధమతము: డాక్టర్ టి. ఎం. పి మహాదేవనుగారు

26-7-75 ,, 5.30 శ్రీమద్రామాయణము: డాక్టర్ ఎన్. పీఠినాథన్‌గారు

**ఇతర వారములందు ఉపన్యాసములు: అపరాహ్ణము 5-45 గంటలకు**

| | |
|---|---|
| సోమవారములు: | విష్ణుసహస్రనామము (ఆంగ్లము) శ్రీమత్ వీతమోహానందస్వాములవారు |
| మంగళవారములు: | అధ్యాత్మరామాయణము (ఆంగ్లము) శ్రీమత్ గభీరానందస్వాములవారు |
| బుధవారములు: | శ్రీమద్భాగవతము (ఆంగ్లము) శ్రీమత్ గోలోకానందస్వాములవారు |
| గురువారములు: | అముదమొళ్ళి (తమిళము) శ్రీమత్ శ్రీరంగానందస్వాములవారు |
| శుక్రవారములు: | ఆత్మబోధ (తమిళము) శ్రీ ఆర్. రామకృష్ణన్‌గారు |

20-7-75 ఆదివారము: అంతర్యోగ సాధన

ఉభయ ఏకాదశులయందు సాయంకాలిక ఆరాత్రికానంతరము శ్రీరామనామ భజన (5-7-75; 19-7-75)

గురుపూర్ణిమ బుధవారము (23-7-75)

శుక్రవారములందు సాయంకాలము 6.30 గంటలకు తిరువళ్ళిక్కేణియందలి దక్షిణమాడవీధియందు 18.వ నంబరుగల రామకృష్ణ మందిరమున శ్రీమత్ గోలోకానందస్వాములవారి భగవద్గీతోపన్యాసములు.

ఈ ఉత్సవము లన్నింటియందును భక్తులెల్లరును పాల్గొని భగవంతుని అనుగ్రహభాగ్యమును బడయగోరుచున్నాము.

అధ్యక్షులు,

శ్రీరామకృష్ణమఠము, మద్రాసు-600004.

సంపాదకులు : శ్రీ చిద్ఘనానందస్వామి.

శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-600021) న ముద్రింపబడి,

శ్రీ చిద్ఘనానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మద్రాసు-600004) నుండి ప్రచురింపబడినది.

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౩౨ ౧౯౭౫ - జూలై : రాక్షస - ఆషాఢము సంచిక ౧

## విషయసూచిక

'అఖిలనిఖిల శరణాంబుమ, యా తృణంబ యతనిక్కృత నీదు ననుభూతి కందు వత్స'

—శ్రీ శారదామణి.

# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౩౨ } ౧౯౭౫ - జూలై :: రాక్షస - ఆషాఢము { సంచిక ౧

ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ !

## ప్రార్థన

## శ్రీ రామకృష్ణ కర్ణామృతము

శ్లో. భక్తానాం హృదయే జాగ్ర। ద్యోగినాం నిటలే స్వపన్
సుస్వపన్ జ్ఞానినాం మూర్ధ్ని। రామకృష్ణో జయత్య సౌ.

తే. గీ. రాగభక్తులయెదల జాగ్రత్తుగాఁగ; నిండు స్వప్నమై యోగుల నిటలములను
భూరి నిద్రయై జ్ఞానుల మూర్ధములను; వఱలు శ్రీరామకృష్ణ జయమ్ము! జయము!

వ్యాఖ్య:- భక్తుల హృదయపద్మములందు జాగ్రత్తును, యోగుల నిటలములయందు స్వప్నమును జ్ఞానుల మూర్ధ(సహస్రార)ములందు (యోగ)నిద్రయునై ప్రవర్తిలు శ్రీరామకృష్ణా! నీకు జయము!

శ్లో. ఏకత్ర సమ్మిళిత విశ్వశుభ స్వరూపా, శ్రీదక్షిణేశ్వరపురే విహితాధివాసా
అజ్ఞేషు కీర్ణపరమాత్మ సుఖానుభూతిర్, జీయా చ్చిరం భరతవర్ష మహావిభూతిః.

చ. పరమవర ప్రదాతయును భారతవర్ష మహావిభూతియున్
శరణముజొచ్చు నజ్ఞులకు సత్పరమార్థ సుఖానుభూతియుఁ
వఱలెడు దక్షిణేశ్వర నివాసియు విశ్వశుభ స్వరూపుఁ డ
క్షరుఁడును నొగదాయి కలకాలము వర్తిలు మన్మనంబునన్

వ్యాఖ్య:- సజ్జనులకు ఉత్తమోత్తమములయిన వరములను ప్రసాదించువాఁడును, భారతవర్షపు (పారమార్థిక) మహావిభూతియును, శరణుజొచ్చిన అజ్ఞులకు పరమార్థ సుఖానుభూతి గలిగించువాఁడును, ప్రశస్తమయిన దక్షిణేశ్వర (కాళీదేవ్యాలయ) నివాసియును, రూపుదాల్చిన విశ్వశుభమును అక్షరపరబ్రహ్మమును నగు శ్రీరామకృష్ణగురుదేవుఁడు కలకాలము నాహృదయమున వర్తిలునుగాక!

# శ్రీ గురుసూక్తిసుధ

స్వయంకృతమైన ప్రశ్న: జనులు వారి భార్యాపుత్రాదులు చనిపోయిరనియో ఆస్తిపాస్తులు నష్టమైనవనియో కన్నీరు కాలువలుగా నేడ్తురు. కాని దైవమును సాక్షాత్కరించుకొననైతినే యని ఎవ రేడ్తురు?

శ్రీరామకృష్ణులు: అయినను ''మే మతని నెంతయో ప్రార్థించితిమి. అయినను అతడు దర్శన మీయలేదు'' అని వారందురు. దైవము కొఱకై ఒక్కసారి అట్టి ఆవేగముతో (చనిపోయిన భార్యాపుత్రుల కొఱకైన అట్టి ఆవేగముతో) వారి నేడ్వనిండు! దైవము సాక్షాత్కరింపక దాగుకొనగలడేమో చూతము!

స్వయంకృతమైన ప్రశ్న: అంతియ గాక మనస్సును నిరోధించుటకే గదా ప్రాణాయామము మొదలైన వాని ద్వారా ప్రాణమును నిరోధింపవలయునది?

శ్రీరామకృష్ణులు: ధ్యానము వలనను దేవునిపట్ల భక్తివలనను ప్రాణములు మనస్సు కూడ తాటంతటవియే క్రమముగా నిరోధింపబడుటను చూతువు. ఈ కలియుగమున మానవులు అల్పాయుష్కులు, సామర్థ్యము తక్కువ. ఇందుకనియే భగవంతుడు అనుగ్రహముతో సాక్షాత్కారమునకు వారి బాటను అంత సులభముగ చేసినాడు. ఈ యుగములో భార్యాపుత్రుల మృతివలన కలుగునట్టి ఆక్రోశము శూన్యత దేవునికొఱకై అనుభవించినచో, అవి వాని మనస్సున ఇరువది నాలుగు గంటలైనను నిలిచినచో భగవంతుడు సాక్షాత్కరింపక తప్పదు.

స్వయంకృతమైన ప్రశ్న: ఇచ్ఛాస్వాతంత్ర్యము అటువంటి దేమైనను కలిగిన వా రెవరైన గలరా?

శ్రీరామకృష్ణులు: ఎప్పుడును ఏమైనను జరిగినది కాని జరుగబోవునది కాని అంతయు భగవదిచ్ఛవలన మాత్రమే. మానవుడు దానిని కొంతకాలమునకు తెలిసికొనును. కాని దానికి ఇంక కొంచెము చేర్పవలసి యున్నది. ఆవును పొడుగాటి త్రాటితో ఒక రాటకు కట్టినచో అది రాటకు ఒక మూరెడు దూరములో నిలువవచ్చును. లేదా త్రాటిపొడుగు లోపల ఎచ్చటనైనను నిలువవచ్చును. మానవుని ఇచ్ఛాస్వాతంత్ర్యమును అట్టిదే. ''ఈ స్థలములో దానిని పడుకొననిమ్ము, నిలుచుండనిమ్ము, ఇష్టము వచ్చినట్లు తిరుగనిమ్ము'' అను నుద్దేశముతో మానవుడు ఆవును అట్లు కట్టివేయును. అట్లే భగవంతుడు మానవునకు కొంత శక్తి నిచ్చినాడు. అందువలననే మానవుడు తాను స్వతంత్రుడ ననుకొనును. కాని త్రాడు రాటకు కట్టబడియున్నది. మరి దీనిని గమనింపుడు. ఎవరైనను అతనిని అణకువతో ప్రార్థించినచో భగవంతుడు అతనిని వేఱొక స్థలమునకు గొనిపోయి అచ్చట కట్టివేయవచ్చును. లేదా త్రాటిని మరికొంత పొడవు చేయవచ్చును. లేదా దానిని మెడనుండి పూర్తిగా తీసివేయవచ్చును.

స్వయంకృతమైన ప్రశ్న: భగవంతుని శరణుజొచ్చుట అంత సులభమా! మహామాయయొక్క లీలలు దుర్గ్రాహ్యములు! ఆమె దీనిని జరుగనిచ్చునా?

శ్రీమకృష్ణులు: ఈ ప్రపంచమున 'నా' అనువారే లేనివాడు ఒక పిల్లిని పెంచుచు ప్రాపంచికజీవనము గడపునట్లు ఆమె చేయును. పిల్లికి పాలు సంపాదించుటకై తిరుగులాడుచు అత డనును. ''నే నేమి చేయుదును? ఈ పిల్లి పాలు చేపలు తప్ప వేఱేమియు తినదు.''

ఒకరు ధనికురాలు. ఉన్నత వంశీయురాలు కావచ్చును. భర్తయు పిల్లలును అందఱు మరణించిరి. ఇక మిగిలినది చావనునదియే లేనట్లు

తచ్ఛాదుచున్న వితంతువులు మాత్రమే. కొన్ని భాగములు పడిపోయినవి. కొన్ని పడిపోవుచున్నవి. కప్పుపై చెట్లు పెరిగినవి. వానితోపాటు కొన్ని తోటకూర కాడలు మొలచినవి. ఈ వితంతువులు వానిని ప్రోగు చేయుదురు. కూర చేసి తమ ప్రాపంచిక జీవనమును కొనసాగింతురు! ఏమి ఫలము? వీరేల భగవంతుని శరణము నాశ్రయింపరు? అట్లు చేయుటకు వీరికి సమయము నిశ్చయముగ నిప్పుడే. కాని అట్లు జరుగవలయునని లేదు!

లేదా వివాహమైన కొలది కాలమునకే భర్త చనిపోవును. ఆమె బాలవితంతు వగును. ఇప్పుడామె పిల్లలులేని ప్రౌఢయైన వితంతువు. ఆమె భగవంతు నేల భజింపదు? కాని ఆమె అట్లు చేయదు. తన సోదరుని వివాహమునకు రకరకాల నగలను, జుట్టును నడినెత్తిపై ముడి వేసికొని తాళపుచెవులగుత్తిని చెంగున కట్టుకొని ప్రతియొక్కరిని తర్జించును. ఎల్లరపై పెత్తనము చేయును, గ్రామము మొత్తము ఆమెను జూచిన భయపడును, "నేను లేనిచో నా సోదరుడు భోజనమైనను చేయజాలడు" అని ఆమె అందరితో చెప్పుచుండును. ఆహా! ఎట్టి దౌర్భాగ్యురాలు! తన కేమి సంభవించినదో ఆమె ఏల గమనింపదు? తుదకు తనకై ఆమె ఏమి దాచుకొనినది!

క్రుంగిన మనోభావములతోనున్న ఒక యువకుని ప్రశ్న: అయ్యా, కామమును వదలించుకొనుట ఎట్లు? ఉద్వేగములు, తగని ఉద్రేకములు ఒక్కొక్కప్పుడు మనసును కలత పెట్టును. ప్రయత్నించినను ఆగక అవి నన్ను ఉద్విగ్నుని చేయును?

శ్రీరామకృష్ణులు: ఓ, భగవత్సాక్షాత్కార మగువరకు కామ మదృశ్యము కాదు. శరీర మున్నంతవరకు సాక్షాత్కార మైన పిదప కూడ ఏ కొంచెమో మిగిలియుండును. కాని అప్పు డది తలయెత్తజాలదు. నేనుమాత్రము సంపూర్ణముగ దానినుండి విముక్తుడ ననుకొనుచున్నావా? ఒకపరి నేను కామమును జయించితి ననుకొంటిని, పంచవటి క్రింద కూర్చుండియుండ కామము ఎంత ఉద్ధృతముగ నేర్పడిన దనగా నా నిగ్రహశక్తికి మించినదేమో అనిపించినది. అప్పుడు నేను ముఖమును మట్టిలో రుద్దుకొనుచు "అమ్మ"తో నిట్లంటిని, "అమ్మా! నేను ఘోరమగు తప్పిదమును చేసితిని. కామమును జయించితి నని ఇక నెన్నడును తలపను" అప్పుడు మాత్రమే అది మాయమైనది. మీరిప్పుడు యౌవనపు పొంగులో నున్నారు. తెలియునా? అందువలన మీరు దానిని నిగ్రహింపలేకున్నారు. పోటు వచ్చినప్పుడు అది గట్టులను లెక్కపెట్టునా? అప్పు డది పొంగును. గట్టులు త్రెంచును. ముందునకు దూకును. అప్పుడు పొలములో నీరు తాటి ప్రమాణమున నిలుచును. కాని కలియుగమున మానసిక పాపము పాపము కాదందురు. అదియుగాక ఒకటి రెండుసారులు కొఱమాలిన భావములు మనసులో నేర్పడిన నీవేల చింతపడవలయును? అది శరీరమునకు సహజము. వచ్చును, పోవును. ఇతర శారీరక కాల్యకృత్యములకంటె వాని నెక్కువగా గణింపకుము. జనులు వానికై చింతింతురా? అట్లే ఇవి చాల అల్పములని గుర్తింప తగనివని తలచి వానిని గూర్చి ఇక ఆలోచింపకుము. అంతేగాక భగవంతుని హృదయ పూర్వకముగ ప్రార్థింపుము. హరినామమును విడువక జపింపుము. భగవంతునే ధ్యానము చేయుము. అవి వచ్చినను పోయినను గమనింపకుము. క్రమముగ అవి స్వాధీనములోనికి వచ్చును.

# నిజమైన విద్య

## అనువాదము: బి. యస్. ఆర్. ఆంజనేయులు

(రాజమండ్రి శ్రీరామకృష్ణ మఠములో పూజ్యశ్రీ విమలానందస్వామీజీవారొనర్చిన ప్రసంగ సారాంశము)

శ్రీరామకృష్ణుని జీవితము, ఆయన సందేశము అగాధము, అనంతము. మనకు అందుబాటులోనున్న గ్రంథములనుండి దానిని చక్కగా అవగాహనచేసికొనుటకు సంవత్సరములు పట్టును. శ్రీరామకృష్ణుడు తన జీవితములోనే ఆచరించిచూపిన ఆ ఉత్తమబోధను వివేకానందస్వామి మాటలలో అతిక్లుప్తముగా పేర్కొనవచ్చును. రామకృష్ణమఠములలోను, ఆశ్రమములన్నింటిలోను సాయంకాలము జరుగు అర్చనలో నిత్యము గానము చేయబడుచున్న గీతములో వివేకానందస్వామి ఆశువుగా శ్రీరామకృష్ణాదర్శమును పొందుపరచెను. 'ఖండన భవబంధన, జగవందన వందితోమాయ్' అని ఆపాట ప్రారంభమగుచున్నది. ఇది బెంగాలీగీతము. కాని దానిలోని పదములు సంస్కృతమునుండి వచ్చినవే. ఈ చరణముయొక్క భావము "ఓ ప్రభూ! ఓ గురుదేవా! సంసారబంధమును, దానివలన కలుగుచున్న బాధలనన్నింటిని నీవు ఛేదించెదవు. సర్వప్రపంచము నిన్ను గౌరవించుచున్నది. మాకు జీవితపరమావధి లభించునట్టి అర్హత కల్గుటకై నీకు ప్రణామమొనర్చుచున్నాము." ఇది రామకృష్ణుని జీవిత సందేశమునందలి సారాంశము. బాధిత జనావళియొక్క బాధానివృత్తికై ఆయన జన్మించెను. కావున ఆయన జీవితము, ఆయన యిచ్చిన సందేశము మానవజాతికొక మహాద్భాగ్యము. మనము అనుభవించుచున్న బాధ అజ్ఞాన సంజనితము. మనకు ఆత్మనిగ్రహము లేకపోవుటచేతను, మంచి సాంగత్యము లభింపకపోవుటచేతను, పూర్వకర్మలచే కల్గిన అంతరాయము లుండుటచేతను అజ్ఞానము కలుగుచున్నది.

మానవులకెల్లప్పుడు కొఱతయే. వారికి తిండి కావలయును. ఆరోగ్యము కావలయును. ఆశించినదంతయు సంపాదించి దానిని అనుభవింపవలయును. మనము మన కోరికలకు అంతరాయము కలిగినచో బాధ చెందుచున్నాము. ఒకవంక కోరికలు తీరుచుండగా మఱొకవంక అవి పుంఖానుపుంఖములుగా ఉద్భవించుచున్నవి. ఈ దుఃఖస్థితిని కూకటివేర్లతో పెకలించివేయుటకు మానవుడు ఆత్మనిగ్రహము పాటింపవలెనని శ్రీరామకృష్ణుడు బోధించెను. ఈ దుఃస్థితిని నిర్మూలించి మనస్సును నిర్మలము గావింపదలచువారు పేరాసను, లోభమును అణచివేయవలెను. దీనినే కవితారీతిలో శ్రీ రామకృష్ణుడు "కామినీ కాంచన త్యాగము" అను గంభీర వచనములతో తెలియజేసెను. స్త్రీలైనను పురుషులైనను మనమందరము ఇంద్రియ సుఖసాధనకు మాత్రమే పనికివచ్చు వస్తుసంచయమును భోగాభిలాషను విడనాడుటకొరకు అనవరతము పాటుపడవలెనని దీనియందలి తాత్పర్యము. కామినీకాంచన త్యాగమను పదమును సంత్ తులసీదాసు తన 'రామచరితమానస్'లోని ఉపోద్ఘాతమునందే కావ్యస్థ మొనర్చెను. పురుషునకుగాని, స్త్రీకిగాని కలుగు నిజమైన పరిణతి మానసికాభివృద్ధివలననే లభించుచున్నది. మన వాంఛలే మన దురవస్థలని ప్రాజ్ఞులు గుర్తింతురు. ఒప్పిదములుకాని లత్యములకూర్చిన వాంఛలు మనలను ప్రమాదములో పడవేయుచున్నవి. అవాంఛనీయ

విషయములయెడ కలుగుచున్న తీర్పరాని వాంఛను, శారీరకరుగ్మత, మానసికబాధ, ఆధ్యాత్మిక మరణము అనునవి వెంబడించు చున్నవి. మన పరిస్థితికిగల మూలకారణమును గమనించియుండుటచే, మొట్టమొదట మనము ఆత్మనిగ్రహమును, అంతర్ముఖత్వమును అభ్య సింపవలెనని శ్రీరామకృష్ణుడు ఆదేశించెను. ఇదియే ధర్మశాస్త్రములన్నింటిలోనున్న సార భూతమైన మొదటి బోధ. శ్రీకృష్ణభగవా నుడు గీతలో ''త్రివిధం నరకస్యేదం ద్వారం నాశన మాత్మనః''—''నరకమునకు మూడు ద్వారములున్నవి. వానిద్వారా మానవులు ఆత్మవినాశనమొందుచున్నారు'' అని చెప్పెను.

''కామ క్రోధ స్తథా లోభః తస్మాదేత త్త్రయం త్యజేత్''—ఆ ద్వారములు కామము, క్రోధము, లోభము. అనగా విషయవాంఛ, కోపము, ఆశ అనునవి. బుద్ధభగవానుడు కామమునకు 'తృష్ణ' (విషయములపై తీరని ఆరాటము) అను పదమును వాడెను. దేనిని ప్రాచీనగ్రంథములు 'కామ, క్రోధ'మను గంభీరవచనములచే ప్రతిపాదించెనో, దానినే శ్రీరామకృష్ణుడు తన అతిసహజధోరణిలో పామరజనులకు కూడ అర్థమగునట్లు చెప్పెను. తన మహోపదేశమునకు తన జీవితమునే ఉదాహరణముగా చూపెను. అదియే ఆయనను ఆరాధ్యతమునిగా నొనర్చినది. స్వామీజీ తన గీతములో గురుదేవుని 'నరవరు'డని పేర్కొ నెను. నరవరుడనగా మానవులలో సర్వోత్త ముడుగ నెన్నబడువాడని అర్థము. తాను బోధించిన కామ, లోభముల జయమును తాను సాధించి, ఆచరించి చూపుటచే శ్రీరామకృష్ణుడు మానవులలో సర్వోత్తము డయ్యెను. సంసారబంధమును, అజ్ఞానమును అతిక్రమింపగోరువారందరకును 'కామకాంచన జయము' అవసరమని ఆయన తన బోధచేతను, తన జీవితముచేతను బోధించెను.

మానవుడు తన ముక్తిపథములోనున్న అడ్డంకులను తొలగించుకొనగోరుచున్నాడు. అంతకుముందు శరీరావసరములగు ఆకలిదప్పు లను తీర్చుకొనజూచుచున్నాడు. ఆకలిదప్పులు జీవులందఱకు సమానమగు అవసరములు. ధార్మికమైన కోరికలెన్నింటినో అనుభవించ వచ్చును. కాని ధర్మమును అనుసరించుట చేతనే అది అంగీకార్యమగును. ధర్మము నతిక్రమింపక విషయముల ననుభవింపవలెను. 'ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ''—'ధర్మమునకు విరుద్ధముగాని కామ మును నేను' అని శ్రీకృష్ణపరమాత్మ అర్జును నకు బోధించెను. మనము ఇంద్రియములను అణగద్రొక్కుట లేక హతమార్చుటకాక వానిని సక్రమమార్గములోనికి మరల్పవలయు నని మత ప్రవక్తలు బోధించియున్నారు. ఈ మరలించుట యనునది తన ఇంద్రియములను పరిశుద్ధ మొనర్పగలవారికిని, తన అనుభవము లను ఉత్తమ జీవితమునకై ఉపయోగింపగల వారికిమాత్రమే సాధ్యము. జ్ఞానసంగ్రహణ మునకు అనువైన మార్గముగ ఇంద్రియము లుండునట్లు చూడవలెను. చక్కగా నిర్ణ యింపబడిన బాహ్యజ్ఞానము క్రమముగా ఆంత రంగికమైన జ్ఞానమును కల్గించును. అందు చేతనే శ్రీరామకృష్ణుని సందేశమును ప్రాక్ప్ర తీచీ దేశములలో వ్యాప్తిచేసిన స్వామీజీ ప్రప్రథమమున ఇట్లు చెప్పెను. ''పురుష కారమును వృద్ధిపొందించు విద్య మనకు ఉండి తీరవలెను.'' మనము ప్రప్రథమమున పశువు లుగా సంచరించుట మానవలెను. అనగా ఇంద్రియములను నిగ్రహింపవలెను. సత్కా ర్యములలో నిమగ్నులమై యుండవలయును,

మొదటిదానము అన్నదానము. మన జీవితావసరములను ఇరుగుపొరుగువారితో క్రమపద్ధతిలో పాలుపంచుకొనవలయును. ఆ పంపకము ఏ ఒక్కరికి కొఱత లేనట్లుగాను, సంఘములో సామరస్యము నెలకొనునట్లుగాను ఉండవలయును.

ఇది ఏవిధముగా సాధ్యపడును? అన్యోన్యసహాయము, ప్రేమ యను ప్రాతిపదికలపై మనము సంఘమును తీర్చిదిద్దవలయునని శ్రీరామకృష్ణులు స్వామీజీ చెప్పియున్నారు. దానినే వారు స్వార్థరాహిత్యమనిరి. బాధ్యతాయుతులైన పరిపూర్ణ పుణ్యపురుషులకే అత్యుత్తమమైన స్వార్థరాహిత్యము సాధ్యము. అయినను దానిని ఇతరులుకూడ అభ్యసింపవచ్చును. మానవుడు తాను నిస్వార్థపరుడుగా నుండుటకు ప్రయత్నించినచో అతని నాదర్శముగ తీసికొని అతని పొరుగువాడు పరసుఖాపేక్షను కొంతవరకైనను అలవరచుకొనుటకవకాశము కలుగును. అన్యోన్యసహకారము, అన్యోన్యసహాయముచేత ఇతరుల సుఖమును గమనించుచు, మానవుడు తన నిత్యావసరము సంపాదించుకొనవలెను. సంపదనుమాత్రమే వృద్ధిచేయు సహకారోద్యమములు మానవశ్రేయమును కల్గింపజాలవు. ప్రతియొక్కరును జ్ఞానమార్జింపవలెను. జ్ఞానమువలన విజ్ఞానము కలుగును. దానివలన సక్రమమార్గముద్వారా మన ఆర్థికస్థితిని మనము మెరుగుపరుచుకొని, సాంఘికసంక్షేమము సాధింపవచ్చును. ప్రపంచమందలి దుస్థితికి కారణమేమి? 'అజ్ఞానము', అని స్వామీజీ ముమ్మారు గర్జించెను. జ్ఞానముచేతనే అజ్ఞానము తొలగిపోవును. ప్రపంచమున అచ్చుపడినదంతయు జ్ఞానమని మనము తలపకుండుముగాక. ఏది సంరక్షించునో దానినే మనము జ్ఞానముగా నుద్ఘాటింపవలెను. మానవుని దుఃస్థితినుండి, భవబంధమునుండి రక్షించునదియు, మానవుని యథార్థమానవునిగా మారుట కుపకరించునట్టిదియు జ్ఞానము. అట్టి జ్ఞానము మనకు ఆవశ్యకము. అదియే ఈ దేశమునకు, ప్రపంచమునకు ఆవశ్యకమైయున్నది. మనకు అపరిమితమైన జ్ఞానరాశియున్నదనుట నిజమే. కాని దానిలో తగినంత విశిష్టతను మనమింకను సాధింపవలసియున్నది. ఉపయోగకరము నిర్మాణాత్మకమునగు అధికోత్పత్తికి కావలసిన వైజ్ఞానిక సామర్థ్యము మాత్రమేగాక మానవునకు ఆరోగ్యప్రదమైన దేహమును, వికాసవంతమైన మనస్సును ఇచ్చి ఆధ్యాత్మికోన్ముఖుని చేయు జ్ఞానముకూడ ఆవిశిష్టతయందిమిడియున్నది. సమస్త విద్యాసంస్థలు, విద్యావ్యాప్తిచేయు సమస్త ప్రచురణాలయములు దేశవ్యాప్తముగా కొనసాగుచున్న విద్యావాఙ్మయోద్యమము, ఈ విశిష్టతను సాధించుటకే అనగా మానవులను ఉత్తములుగా రూపొందించుటకును, జాతిని శారీరక, మానసిక, ఆధ్యాత్మిక సౌష్ఠవవంతముగా చేయుటకును పాటుపడవలెను. ఇదియే జ్ఞానదానము —జ్ఞానము పాలుపంచుట. దీనినే స్వామీజీ ఆచరణలో పెట్టవలెనెను. శ్రీ రామకృష్ణుడు దానిని ప్రత్యేకముగా వక్కాణించుచు మార్గమును సూచించెను.

యథార్థమైన ఆధ్యాత్మికానుభూతినిపొందిన ప్రాజ్ఞునియొక్క జ్ఞానము, బయలునందు ప్రకాశించు సూర్యుని వంటిది. పరిమితమైన ప్రజ్ఞగల సామాన్య మానవుని జ్ఞానము ఇంటికప్పునందలి చిన్న రంధ్రము గుండా ప్రసరించు సూర్యకిరణము వంటిది. ప్రతి మానవుడును తాను క్రమశిక్షణతో నేర్చుకొని జీవితమునందు అభ్యసించుచున్న విషయమందు ప్రతిభావంతుడే కాని యే ఇతర విషయములో నైనను

అతడు సామాన్యుడే. మానసిక తత్త్వవేత్తలు 'పావనశక్తి ప్రభావము' (halo effect) అని చెప్పుదానిని చూచి మోహితులము కారాదు. ఒక వ్యక్తి ఒకానొక విషయమందు పండితుడే కావచ్చును, కాని అన్ని విషయములలోను అతడు పండితుడని అతని అభిప్రాయములను అంగీకరింపవలసిన అగత్యము లేదు. అంగీకరింప కూడదు కూడ. కావున కష్టార్జితముగా పొందిన జ్ఞానమును మాత్రమే ఇతరులతో పాలుపంచు కొనవలయును. మన సంరక్షణలోనున్న వారి యెడల మనము పసితనమునుండియు శ్రద్ధ వహించినప్పుడే ఈ పంచుకొనుట సాధ్యపడును. ప్రతి బాలునకు, ప్రతి బాలికకు ఇంటియందును జ్ఞానమును తప్పక బోధింపవలయును. ఇవి పిల్లలను శారీరకముగా ఆరోగ్యవంతులుగాను, మానసిక సౌష్ఠవము గలవారినిగాను, తయారుచేయుట కుపకరించును. మన మత గ్రంథములలో మదాలస అను నామె లాలి పాడుచు ఊయల ఊపి తన పిల్లలను పెంచిన కథ చదివియున్నాము.

"శుద్ధోసి, బుద్ధోసి, నిరంజనోసి
సంసార మాయా పరివర్జితోసి"

"నాయనా! నీవు శుద్ధుడవు, బుద్ధుడవు, కల్మషము లేనివాడవు, సంసార బంధ విముక్తుడవు, నిత్యజ్ఞాన స్వరూపుడవు" అని పాడెడిది. ఈ ఆదర్శములో మానవుని యొక్క దివ్యత్వమును అతి బాల్యము నుండియే నొక్కి చెప్పవలసి యున్నది. ప్రతి బాలునకును తల్లియే ప్రథమ గురువు. అలెగ్జాండరు చక్రవర్తి నొకరు, ప్రపంచమును జయించినందులకు ప్రస్తుతింపగా అతడు "ఈ జయమంతయు మా తల్లి వలననే లభించినది" అని బదులు చెప్పెను. అదేవిధముగ వివేకానంద స్వామియు; "నా ఈ స్థితికి మా అమ్మయే కారణ"మని తెల్పియుండెను. పలువురు మహాపురుషులు ఈ భావమునే ప్రతిధ్వనించిరి. ఈ విధముగ తల్లి ప్రథమ గురువు అగుచున్నది. స్త్రీలు సహజముగా అతి సరళములు, అత్యంతము ఉత్కృష్టములు అగు ఆదర్శములను పిల్లలకు బోధించుటకు అతి సమర్థురాండ్రుగా నున్నట్లు కనుపించును. పిల్లవానికి కౌమారమున తండ్రి, యౌవనమున గురువు లేక ఆచార్యుడు శిక్షణ గరపుచున్నారు. విద్య ఈ దశలన్నింటిలోను ఆత్మసాక్షాత్కారమునే యుద్దేశముగ కలిగియుండవలెను. మనము యథార్థమగు విద్యను సముపార్జింపవలెనుగాని అవిద్యను కాదు. నాటికి 90 పాళ్లు మన విద్యాశాలలు అవిద్యాశాలలుగ మారిపోయినవి. అవిద్యయనగా ఆధ్యాత్మిక అజ్ఞానము. విద్య యనగా భవబంధ వినిర్ముక్తుని గావించు భగవత్ జ్ఞానము.

"సా విద్యా పరమా ముక్తేర్హేతు భూతా."

ఋషుల యభిప్రాయము ప్రకారము ముక్తిని కల్గించునదే నిజమైన విద్య. మిగిలిన దంతయు అవిద్యయే.

# భారతదేశము - శ్రీ వివేకానందస్వామి

## శ్రీ స్వాత్మానందస్వామి

హిందూదేశము అనాదికాలమునుండి ఆధ్యాత్మిక చింతనకు ఆయువుపట్టు. దాని యావత్ శక్తి తత్త్వచింతనయందు వినియోగింపబడుచున్నది. భారతదేశపు ఔన్నత్యమునకు నాటికి నేటికి ఈ మహోన్నత ఆధ్యాత్మిక చింతనయే ఆధారము. యావత్ ప్రపంచము చీకటిలో

తడుముకొనుచుండిన కాలమున హిందూదేశమున "సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ" అను వేదవాక్కులు అన్ని దిక్కులను పిక్కటిల్ల జేసినవి. అట్టి భరతఖండము ప్రపంచదేశములకు మకుటాయమానము. హిందూదేశము కర్మభూమి. ఇచ్చటి వాతావరణమే ఆధ్యాత్మిక సుగంధమును మిళితము చేసికొని సంసారమను దుర్గంధమును రూపు మాపుచున్నది. ఇచ్చటి స్వచ్ఛమైన గంగా యమునా నదులు తాపమును పోగొట్టుచున్నవి. హిమవత్పర్వత పంక్తి ఆధ్యాత్మిక పవిత్రతను ఔన్నత్యమును చాటుచున్నది.

కాని కాలగమనమున మనలోని శక్తిసామర్థ్యములు ఒకింత కుంటువడినవి. సత్త్వసంపన్నమగు దేశము శౌర్యపరాక్రమములను చూపలేక పోవుటచే విదేశీయులు హిందూదేశము నాక్రమించి వారి కళలను విద్యలను రూపుమాపి వారిచే నూడిగము చేయించుకొనుట కారంభించిరి. ఒకరిచే పరిపాలింపబడుటచే హిందువులలో నానాటికి నీరస మావరించి వారిలో ఉత్సాహశక్తి నశించి మందమతులుగ పరిణమించిరి. ఐనను హిందూదేశమునకు జీవగఱ్ఱ యగు తత్త్వజిజ్ఞాస మాత్రము ఏమాత్రము అడుగంటలేదు. అందుచేతనే గ్రీకురోమనువంటి మహాసామ్రాజ్యములు కాలగర్భమున కలిసి పోయినప్పటికిని హిందూదేశము ఇప్పటికిని సగర్వముగ తలయెత్తి నిలిచియున్నది.

పరరాజుల పాలనలో అభివృద్ధి గాంచుట కల్ల. మన దేశమును పాలించిన మొదటి విదేశీయులు మహమ్మదీయులు. వీరు తమ మత వ్యాప్తికై హిందూదేశమునకు వచ్చి యుద్ధములు చేసి హిందూ దేవాలయములను, హిందూ గ్రంథములను అపురూపశిల్ప ఖండములను నాశనము గావించిరి. ఒకచేత ఖురాను ఇంకొక చేత ఖడ్గమును ధరించి హిందువులను తమ మతమువైపుకు మరల్చుకొనసాగిరి. అట్టి వాతావరణమున అభివృద్ధి ఎట్లు సాధ్యమగును? మన దేశీయులు పశుబలము నెదుర్కొనలేక పోయిరి. స్వమతమును వీడలేక పరమతము నంగీకరింపలేక సందిగ్ధావస్థలో పడిరి. విశ్వకల్యాణమును కోరు హిందువులు చేయునదిలేక చిన్న చిన్న తిరుగుబాటులు చేయదొడగిరి. చిలికి చిలికి గాలివాన యైనట్లు ఈ చిన్న చిన్న తిరుగుబాటులు పెద్ద రక్తపాతములైనవి. హిందువులు మహమ్మదీయులును ఒకరిపై నొకరు విద్వేషములను పెంచుకొని శాంతి విహీనులై మెలగసాగిరి.

ఇట్టి కల్లోల పరిస్థితియందు హిందూమతస్థులను కార్యశూరులనుగా చేయుటకును హిందూ మహమ్మదీయులలో సోదరప్రేమ నినుమడింప జేయుటకును కంకణము కట్టుకొనిన మహానుభావులలో గురునానక్ ఒకరు. మతమును సాంఘిక వ్యవస్థను స్వీకరించి హిందూమతమున రజోగుణపు పాలుకల్పిన మహానుభావులు నల్వురిలో ప్రప్రథముడు గురునానక్. తోడిసోదరులకై ప్రాణత్యాగము చేయుటకు సిద్ధపడి వారిని శిక్కు మతస్థులుగ గైకొని తన నూతనమతమును నెలకొల్పి మహమ్మదీయుల అరాజకము నడుగంటించిన దిట్ట. మహమ్మదీయులు హిందువులు సోదరులవలె మెలగవలెనని ఒకరి నొకరు ద్వేషించుకొనరాదని అతడు బోధించెను. మతకలహముల నణచుటకు తన శిష్యులను కత్తిపట్ట నియమించెను.

రెండవసంస్కర్త శ్రీ స్వామి రామదాసు. మహమ్మదీయ రాజుల పరిపాలన అతి క్రూరముగ కొనసాగుచుండెను. హిందూ మతస్థులు తలదాచుకొనుటకు నీడలేని స్థితిలో నుండగా రామదాసు శివాజీని ప్రోత్సహించి తన శిష్యు

నిగ చేసికొని అతనికి దేశభక్తిని నూరిపోసి దిగ్విజయము సాధించెను. స్వామి రామదాసు సన్న్యాసి అయ్యును శివాజీని యుద్ధము చేయుటకును శత్రురాజుల నోడించుటకును ప్రోత్సహించెను.

మానవ సంస్కర్త శ్రీ విద్యారణ్యస్వామి. శృంగేరీ శంకరపీఠాధిపతి. వేదాంత పంచదశి యను బృహత్తర గ్రంథ రచయిత. సుల్తానులు దక్షిణభారతమును తమ హస్తగతము చేసికొనుచున్నారని తలచి కార్యరంగమున దూకెను. గురువుగ తమ బాధ్యతను కొంత కాలము మానుకొని స్వతంత్ర రాజ్యమును స్థాపింపగోరి తగిన స్థానము నన్వేషించి విజయనగర సామ్రాజ్యమును స్థాపించిరి. హరిహర రాయలు బుక్కరాయలు ఆయన శిష్యులలో మెలగి సామ్రాజ్యమును పటిష్ఠము గావించిరి. ఈ సామ్రాజ్య స్థాపనచే దక్షిణ భారత దేశము మహమ్మదీయుల పరిపాలన నుండి రక్షింపబడినది. ఈ సామ్రాజ్య స్థాపనానంతరము విద్యారణ్యులు తమ పూర్వ కార్యములు నిర్వర్తించుచు శృంగేరీ పీఠమునకు ఆచార్యులుగ చాలకాల ముండిరి.

19-వ శతాబ్ది ఆరంభమున మన దేశమును ఆంగ్లేయుల పరిపాలననుండి కాపాడుటకు నాల్గవ సంస్కర్త శ్రీ వివేకానందస్వామి జన్మించిరి. మహమ్మదీయులు కత్తిపట్టి హిందువులను మహమ్మదీయ మతమునకు మరల్చిరి. ఇక ఆంగ్లేయులో, గ్రాంది బైనెట్ బైబుల్ పట్టుకొని హిందువులను తమ మతమునకు ఆకర్షింప దలచిరి. నాగరికత యను పేరిట యువకులను ఆకర్షించి వారికి ఉద్యోగములు నెరజూపి తమ మతములో కలుపుకొనజొచ్చిరి. ఆనాటి యువకులు సంఘములో గౌరవముకొఱకు ఉద్యోగముకొఱకు క్రైస్తవ మతమును స్వీకరించిరి. అంతటితో నాగక వారు హిందూమతమునే దూషింప మొదలిడిరి. అట్టితరి హిందూ మతమును పునరుద్ధరించుటకై శ్రీ వివేకానందస్వామి కంకణము కట్టుకొనిరి. పరరాజుల పాలనలో అభివృద్ధి గాంచలేమని తెలిసికొనిరి. ఆనాటి హిందువులు నిద్రాణస్థితిలో నున్నారని గ్రహించిరి. వారిని మేల్కొల్పుటకు విదేశీయుల దృష్టిలో భారతీయుల ఔన్నత్యమును చాటుటకు అమెరికా దేశము వెళ్లి సర్వమత మహాసభయందు హిందూమతమును గూర్చి యుపన్యసించి గొప్ప సంచలనము గొనివచ్చిరి.

ఈ సంచలనము హిందూదేశమును కూడ మేల్కొల్పినది. యువకులు ఉత్సాహవంతులై ముందడుగు వేయజొచ్చిరి. వారు వివేకానందుల రచనలు చదివి వారి యుత్సాహమును దేశభక్తిని ఇనుమడింప జేసికొనిరి. ఆంగ్ల సామ్రాజ్యాధికేతలు వివేకానందుల రచనలనిన భీతిజెందుచుండిరి. మన సుభాష్ చంద్రబోసు కూడ వివేకానందపత్రావళి యను పుస్తకమును చదివి ఆంగ్లేయసామ్రాజ్యముపై తిరుగుబాటు చేసినాడు. ఈ పుస్తకములలో శ్రీ వివేకానందస్వామి దేశస్వాతంత్ర్యమునకై యువకులకు బోధించిన కొన్ని ముఖ్య విషయములను ఇచ్చట ఉదాహరించెదము.

భారత దేశములో బీదలస్థితి సకల దోషములకును మూలమైనది. వీరిని ఈ స్థితినుండి యుద్ధరించిన గాని భారత దేశము ఔన్నత్యము నొందదు. నేటి మన కర్తవ్య మేమనగా, బీద వారు వారు కోల్పోయిన వ్యక్తిత్వమును విద్యను మరల పొందునట్లు చేయుట. విద్యయనగా ప్రపంచవిషయములను బలవంతముగ తలలో గ్రుక్కుకొని వాని యుపయోగము తెలియక పండిత మండలివలె నుండుట కాదు. విద్య యనగా "మానవుని ప్రయత్నోన్ముఖుని

గావించి, అతనిని అదుపులో నుంచి కార్య సాఫల్యమునకు దారితీయు శిక్షణ." మనకు నేడు అవసరమగు విద్య అదియే. అట్టి విద్య మన కందఱకు లభ్యమగునాడు మన భారత దేశము నూత్న జీవనము నొందును.

మన దేశపు మందగమనమునకు మఱియొక ముఖ్యకారణము మనకు గల మూఢ విశ్వాసములు. హిందువులు విదేశ పర్యటనము చేయరాదని ఆంక్ష విధించి వారి నితర దేశములను దర్శింపనీయక అవి వారిని బలహీనపరచినవి. "మూఢవిశ్వాసములతో స్వార్థముతో స్వదేశమున జీవించు హిందువు తన దేశమున కెక్కువ సేవ చేయలేడు. పాశ్చాత్య దేశములోని జాతీయ జీవనసౌధములు శీల స్తంభములపై పటిష్ఠముగ నిర్మింపబడినవి. అట్టి వానిని అసంఖ్యాకముగ మనము నిర్మించువరకు ఎవరిపై గాని కారములు మిరియములు నూరి ప్రయోజనము లేదు."

మనము అన్యప్రభుత్వముచే పరిపాలింపబడుటకు కారణము మనము బీదలకు తదితర కులస్థులకు స్వాతంత్ర్యము నీయకపోవుటయే. వారిని మనమెంతసేపును సేవకులుగ పరిగణించి వారి సేవాఫలము ననుభవించి వారి బాగోగులను మఱచి సంచరించితిమి. కుల వ్యవస్థ వృత్తినిబట్టి యేర్పడినదను సత్యమును మఱచి ప్రవర్తించితిమి. దాని ప్రతిఫలమును మన మిప్పు డనుభవించుచున్నాము. "ఇతరులకు స్వేచ్ఛనిచ్చుటకు సిద్ధముగ లేనివాడు స్వేచ్ఛగ నుండుటకు అర్హుడేనా? అనవసరమైన ఉద్రేకములకు తావీయక ప్రశాంతముగ నిజమైన మానవులుగ పనిచేయుదము. ప్రపంచమున ఎట్టిశక్తియు దీని కంతరాయము కల్గింపజాలదని విశ్వసించువారిలో నేనొక డను."

ప్రతిజాతికిని ఒక ఆయువుపట్టు గలదు. హిందూదేశమునకు "మత"మే ఆయువుపట్టు. హిందూదేశ పురోభివృద్ధికి మనుగడకు మతమే ప్రాణము. హిందువులు తత్త్వజ్ఞానమును ఎపుడు మఱచెదరో అపుడు ప్రపంచమునందు హిందువనువాడు కాని హిందూదేశమను భూభాగము కాని కనబడదు. అందుచే "ఓ నా భారతీయులారా మతమను వెన్నెముక ననుసరించి మీ నాడులన్నియు స్పందింపవలసి యున్నవి. రాజకీయములకుకూడ మతమే ఆధారము కావలెను."

మనకు మన దేశమునకు ఈ ప్రపంచమున ఒక ప్రత్యేకతయుండ ఒకరిని మనమేల అనుకరింపవలెను? కనుక "ఇతరుల నెవ్వరిని అనుకరింపదలపకుడు. మనము నేర్చుకొనవలసిన గొప్ప పాఠమిది యొకటి. అనుకరణ నాగరికత కాదు. పిరికితనమునకు గురుతగు అనుకరణము ఎన్నడును వృద్ధియనిపించుకొనదు. అది నరుని యందు చూపట్టు దౌర్భాగ్యపు పతన సూచనయే."

"హిందూదేశమను ఈ నౌక ఎన్నియో శతాబ్దములనుండి మనలను సురక్షితముగ సముద్రమందు కొనిపోవుచున్నది. ఈనాడు మన పొరపాట్లవలన దానికి చిన్నచిల్లి పడినది. విజ్ఞులమైన మనము ఈ చిల్లినిపూడ్చి మరల ప్రయాణసన్నద్ధులము కావలెను. కాని ఈ నౌకను వీడి నూతన నౌకకై వెతకుట యవివేకము. ఓ నా భారతీయులారా! లెండు, కార్యారంభులు కండు. విజయము తథ్యము."

ప్రభాప్రసారము
(సంపాదకీయము)

# మానవాభ్యుదయమునకు భరతవర్షపు కానుక

> మానవుల చిత్తవృత్తులను పరికింపుడు. ఎవని తీరు వానిది. అట్లే ఎవని ఆత్మపరిణతి మార్గము వానిది. అనంతమగు పూర్వజన్మ పరంపరవలనను పురాకృతకర్మవిశేషమువలనను మానవుని ప్రస్తుత జీవనవైఖరి నిర్ణయింపబడియుండును. ప్రతివాడును తన పురాభవఫలమును తలదాల్చి ఈ లోకములోనికి వచ్చుననియు అనంతములగు తన పూర్వజన్మలు ఇప్పటి జన్మకు మూలమనియు ఈ జన్మను తాను వినియోగించుకొను విధము ననుసరించియే రాబోవు జన్మము నిర్ణయింపబడు ననియు ప్రతిహిందువు తలంచును. ఈ రీతిగా ఈ ప్రపంచమున పుట్టెడి ప్రతిమానవుడును నిర్వహింపవలసిన ధర్మమును జీవితమున అనుసరింపవలసిన నిర్ణీతమార్గమును ఉండును. ఈ సూత్రము వ్యక్తుల విషయమున ఎటుల సత్యమో జాతి విషయమునను అంతియే. ప్రతిజాతికిని ఒక విభిన్న జీవనవైఖరి ఒక ప్రత్యేక జీవనోపపత్తి ప్రపంచజీవనమున అది నిర్వహింపవలసిన ఒక విశిష్ట కర్తవ్యము కలదు. రాజకీయోద్ధతిగాని సైనికబలోన్నతిగాని సాధించుట మనజాతికి నైజ ధర్మము కాదు. ఐనను వేఱొక కర్తవ్యము మన పాలిట నున్నది. మనలోని ఆధ్యాత్మిక శక్తి నంతను చక్కగా సంఘటితపరచి సంరక్షించి పోషించి భారతజాతిని ఒక ఆధ్యాత్మిక మహాశక్తిస్వరూపముగ తీర్చిదిద్దవలసియున్నది. అట్టి దుర్వారమహాశక్తి పరిస్థితులు అనుకూలముగా నున్నపుడెల్ల ప్రపంచమును ముంచెత్తి వేయవలెను. గ్రీకులో రోమనులో ఆంగ్లులో ఎవరైనను సరే తమ సేవలతో దాడివెడలి ప్రపంచ జాతుల నేకము చేయుదురుగాక. హైందవుల వేదాంతము ఆధ్యాత్మికవిద్య అప్పుడే నూతనావకాశమును పురస్కరించుకొని ప్రపంచజాతుల రక్తనాళములలోనికి ప్రవేశించును. సమిష్టి మానవ జాతి అభ్యున్నతికై భారతీయుని శాంతిమయ ధీశక్తి తనవంతు తాను సమర్పణ చేయవలసియున్నది. హిందూదేశము ప్రపంచమునకు ఒసగనున్న కానుక ఈ ఆధ్యాత్మిక తేజమే.
>
> —శ్రీ వివేకానందస్వామి.

మానవాభ్యుదయమునకు సకలదేశములును తమతమ శక్త్యనుసారము సహజప్రవృత్త్యనుసారము పాలుపంచుచునే యున్నవి. మానవుడు మేధావంతుడగుటవలన అతని జీవనము భౌతిక మానసిక ఆధ్యాత్మిక స్థాయీభేదముల ననుసరించియుండును. వివిధ దేశములు వానివాని స్వభావములను బట్టి పరిపూర్ణ మానవాభ్యుదయమునకు దోహదము చేయుచున్నవి. ఇందు భౌతిక మానసికరంగములయందు ప్రముఖముగ పాశ్చాత్యదేశములు ప్రగతిని సాధించినవి. రోమను సామ్రాజ్యము దాదాపు యావత్ప్రపంచము నేకము చేసినది. గ్రీకు సంస్కృతి యూరపుదేశము లన్నింటియందును వ్యాప్తమై భారతదేశమునగూడ కొంతచోటు చేసికొన్నది. ఆధునికకాలమున పాశ్చాత్య దేశములు మరల ఆంగ్లసామ్రాజ్యరూపమున ప్రపంచము నేకము చేసినవి. అమెరికనులు మానసికరంగమున సాంకేతిక విద్యాపరిణతి వలన ప్రగతిని సాధించిరి. ఈ భౌతిక మానసికాభ్యుదయము ఎంత వాంఛనీయమైనను ఆధ్యాత్మికాభ్యుదయము లేని కారణమున అశాంతి ద్వేషములకు యుద్ధము భయములకు క్రౌర్యము తృష్ణలకు ఆలవాలమగుచున్నది. ఈ పరిస్థితిని చక్కజేయు ఆధ్యాత్మిక తేజమునే భారతదేశము వేలసంవత్సరములుగ పెంపొందించుచు మానవజాతికి నిరంతరముగ పంచియిచ్చుచున్నది. ప్రస్తుత సమయమునను ఈయవలసియున్నది.

ఆధ్యాత్మిక తేజము సత్యసాక్షాత్కార ఫలము. ప్రపంచమునగల దుఃఖముల నన్నింటిని రూపుమాపుటకు సమర్థము. మనపూర్వులెన్నడో ప్రపంచమున దుఃఖముతప్ప మఱే

యొకటి కేడని గ్రహించిరి. అంతతో నాగక ఈ దుఃఖనివారణ మెట్లు చేయునగునని యన్వేషణ దృఢదీక్షతో సాగించిరి. తత్ఫలితమే హిందూతత్త్వశాస్త్రము. హిందూతత్త్వ జీవనమే హిందూమతమునగను హైందవజీవనము గను ఏర్పడినది.

సత్యాన్వేషణమే జీవనగమ్యమగుటవలన ఎట్టి సాంకేతిక వైజ్ఞానిక అన్వేషణతో గాని తత్త్వజిజ్ఞాసకు వైరము లేకపోయినది. చతుష్షష్టి కళలును అన్ని వైజ్ఞానిక శాస్త్రములును తత్త్వజిజ్ఞాసతో సమముగనే వర్ధిల్లినవి. ఇతర దేశములును ఈ కళలను వైజ్ఞానిక శాస్త్రములను అభ్యసించి పోటీలు పడుచుండుటచేతను, భారత దేశము అన్యాక్రాంతమగుటచేతను భారతీయకళలకు శాస్త్రములకు ప్రాముఖ్యత క్రమముగ క్షీణించినది. కాని ఏ దేశమును అందుకొనని అనన్యదీక్షతో ఏకైకలక్ష్యముతో తత్త్వజిజ్ఞాసను భారతదేశముమాత్రమే అనుసరించినది. తత్ఫలితముగ ప్రతియొక్క క్లిష్ట పరిస్థితియందును భారతదేశము ఇతర దేశములకు ఆధ్యాత్మిక సందేశముల నీయగల్గినది.

''ఏకం సత్ విప్రా బహుధా వదన్తి'' అనునది ప్రాచీన వేదవాక్యము. వేలసంవత్సరముల పిదప మరల ఏమాత్రము కొఱవడని గాంభీర్యముతో భారతదేశము తిరిగి ఆవాక్యమునే ఉద్ఘోషించుచున్నది. ఈ మధ్య కాలమునను భారత దేశము పరిస్థితులనుబట్టి ఎప్పటి కేయంశము ఆవశ్యకమో ఆ యంశమును వక్కాణించుచు సందేశముల నిచ్చినది.

సత్యాన్వేషణము తత్త్వజిజ్ఞాసగను ఆ జిజ్ఞాసాఫలమును జీవితమునం దాచరించు ప్రయత్నములు మతభేదములుగను క్రమముగా పరిణమించినవి. సత్యాన్వేషణమునకు ఫలము సాక్షాత్కారమే గనుక తత్త్వశాస్త్రములు వాని యభ్యాసముకలసి దర్శనము లనబరగినవి. అందు న్యాయవైశేషికదర్శనములు పదార్థపరిశీలనముచేసి వానియందలి సత్యత్వమును సాక్షాత్కరించుకొనఁ బ్రయత్నించును. సాంఖ్యయోగములు సృష్టికారణములను ఆద్యతత్త్వములను ప్రకృతిపురుషులుగ కనుగొని వానిని సాక్షాత్కరించుకొనఁ బ్రయత్నించును. పూర్వమీమాంస జగత్కారణమును వివరించి దానిని వశపరచుకొనునట్టి అనేక కర్మకాండలచే తత్త్వమును సాక్షాత్కరించుకొనఁ గోరును. ఉత్తరమీమాంస ఈ ప్రపంచ మసత్యమనియు దీనికి పూర్తిగా భిన్నమైన సత్యపదార్థమును కనుగొనుటయే జీవితాశయమనియు తెల్పి దానిని సాధించుమార్గమును తెలుపును.

వేదము లాధారముగా గల ఈ శాస్త్రము లన్నిటియందును చివరకు మీమాంస బలవత్తరమై నిలిచి, అందు సత్యాన్వేషణవృత్తి మందమై కర్మకలాపములు మెండైన కాలమున మరల సత్యాన్వేషణమును సంస్థాపించుచు నాస్తికదర్శనములగు బౌద్ధజైనములు వ్యాప్తి నొందినవి. ఆస్తికదర్శనముల లక్ష్యములను లక్ష్యసాధనమార్గములను ఏర్పరచు స్మృతులు పురాణములును అనేకము లేర్పడినవి. కాని మార్గమునుమాత్రమే వక్కాణించుచు లక్ష్యమును సరిగా నేర్పరుపకుండుటచే జనసామాన్యము మరల పెడత్రోవల బడెను.

బుద్ధదేవు డవతరించి భారతజనులకు ప్రపంచమునకు సత్యాన్వేషణమార్గమును నిరూపించిన పిదప శ్రీ శంకరభగవత్పాదు లవతరించి నిశితబుద్ధి వైభవముతో మరల భారతీయ జిజ్ఞాసాలక్ష్యమును ప్రస్ఫుటముగ చేసి వేదవాక్యములగు అహంబ్రహ్మాస్మి, తత్త్వమసి, సోఽయమాత్మాబ్రహ్మ, సర్వంఖలు ఇదం

బ్రహ్మ' అను తత్త్వపరాకాష్ఠను సుస్థిరముగ
నిలిపి చనిరి. దుర్నిరీక్ష్యమగు ఈ తత్త్వ
ప్రకాశము జనసామాన్యమున కాచరణ
యోగ్యముగ చేయుటకు శ్రీరామానుజ
మధ్వాచార్యు లేతెంచిరి. ఒడిదుడుకుల కత్తివలె
తీక్ష్ణమగు తత్త్వాన్వేషణమునకు మార్దవము
చేకూర్చుటకై శ్రీచైతన్యాది మహాభక్తు
లేతెంచి జనసామాన్యము నిత్యజీవనము
తాత్త్వికజీవనమును భక్తిశ్రద్ధలతో నాచ
రించునట్లు చేసిరి.

సుభిక్షమును సస్యశ్యామలమును అగు దేశ
మున నీ రీతి జనులు జీవించుచుండ ఆశా
పీడితులైన అన్యదేశీయులు భారతవర్షమును
కొల్లగొట్ట ననేక పర్యాయము లుద్యమించిరి.
క్రమముగ దేశము పరాధీనమయ్యెను. అన్యా
క్రాంతమగు దేశమున తత్త్వజిజ్ఞాస స్వేచ్ఛగా
కొనసాగుటకు వీలులేక యణగియుండినది.
సాధించినదానిని నిలుపుకొను ప్రయత్నమున
సాంఘిక మత జీవనము బిగిసిపోయి ప్రాణ
మాత్రావశిష్టమై నిలిచినది. అన్యమతముల
యొత్తిడికి అప్రాచ్యలక్షణములకు భారత
దేశము లోగిపోవునేమో యనునట్టి పరిస్థితి
యందు మరియొకసారి శ్రీరామకృష్ణ పరమ
హంసదేవు లవతరించి వేదధర్మమును వైదిక
లక్ష్యములను మరల సంస్థాపించి మతవైవిధ్య
మును సమన్వయపరచి జనులకు లక్ష్యసాధన
మార్గమును నిరూపించిరి. తత్త్వసాక్షాత్కా
రమే మానవజీవనగమ్యమని ఇంకొకసారి తన
జీవితముచేతనే చెప్పక చెప్పిరి. లక్ష్యసాధనకై
భారతీయు లేర్పరచిన కర్మపునర్జన్మ సిద్ధాంత
మును ఇష్టదేవతారాధనమును మరల నూత్న
జీవముతో వెలువరించిరి.

సకలప్రాణులును జీవన పరమార్థమువైపు
పురోగమించుననియు అవిచేయు సత్కర్మ
దుష్కర్మఫలముగ వాని రాబోవు జన్మలు
చేయుబోవు కర్మలును నియమితములగుననియు
కర్మసిద్ధాంతము. శ్రీరామకృష్ణులు పురాకృత
కర్మను తప్పనిసరిగా అనుభవింపవలసినను
రాబోవు కర్మను ఇప్పుడు మనము చేయబోవు
కర్మద్వారా అవశ్యము నియమించుశక్తి మన
యందే కలదని తెలిపిరి. నిత్యజీవనమున ఎన్ని
కష్టము లెదురైనను ధైర్యముతో వాని నెదు
ర్కొనుచు భగవద్భక్తిని వదలక పాటించినచో
పరిస్థితులు అవియే తప్పక అనుకూలములగు
నని, మనము నిశ్చయముగ చేయగోరిన దానిని
తప్పక సాధింపగలమనియు, మనము సాధిం
చుట యనునది కొంత ముందు వెనుకయైనను
మన దృఢనిశ్చయముపైననే ఆధారపడియున్న
దనియు ఉపదేశించిరి.

మతవైవిధ్యముచే ఎనలేని వైషమ్యముల
పాలగుచున్న నవ్యప్రపంచమునకు ఇష్టదేవ
తారాధనరూపమున ఒకే సత్యమునే ఎల్లరును
వివిధరూపముల నారాధించుచున్నారని తెలియ
జెప్పి అందు ఆవేశ కావేషములకు తావులేదని
నిరూపించిరి. "ఏకం సత్ విప్రా బహుధా
వదన్తి" అను వేదవాక్యమును "మమ
వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః"
అను భగవద్వాక్యమును తన వివిధసాక్షాత్కా
రముచే మరల సజీవసత్యములుగ నిలువబెట్టిరి.
స్వీయసాక్షాత్కారములచేత ఎల్ల మానవుల
కును సాక్షాత్కారము తప్పక సాధ్యమే
యనియు, కావలసినది ప్రయత్నము మాత్రమే
యనియు ఋజువు చేసిరి.

ఉన్నది బ్రహ్మమే అనియు ఒరులను బాధిం
చుటచేత నరులు తమను తామే బాధించు
కొనుచున్నారనియు వివరించుటచేత సర్వ
మానవ సహకారమునకు నూతనాశయమును
నెలకొల్పినారు. ఎందరు జనులో అన్ని మార్గ

ములు అని చెప్పుటచేత ప్రపంచమున గల అన్ని ఆరాధనా విధానములును సక్రమమైనవే, గమ్యమునకు చేర్చునవే యని స్పష్టపరచి మత వైషమ్యమునకు స్థానము లేకుండ జేసినాడు.

శ్రీరామకృష్ణుల జీవనమే వేదము. ఆయన జీవనమునందు అన్ని వేద సత్యములును పునరుజ్జీవితములై ప్రకాశించుచున్నవి వారి యాధ్యాత్మిక తేజము సకల మానవులకు జ్ఞాన దీపమును వెలిగించుచున్నది. స్వతంత్రులైన భారతీయులు వారి యాదర్శము ననుసరించి మరల నూతనోత్సాహముతో ఆధ్యాత్మిక జీవనమును గడపుచు శాంతి సౌభాగ్యములతో విలసిల్లుచు అన్యదేశములకు తాము అందుకొనిన అనుభవించుచున్న ఆధ్యాత్మిక తేజమును అందింపవలసి యున్నది.

విశ్వశాంతి, సకలమానవ సౌభ్రాతృత్వము, సర్వమత సమన్వయము, ప్రపంచసమాజమున గల అన్ని అంగముల సామరస్యము, సర్వవిధముల పురోగమనములను సాధించునట్టి ఈ ఆధ్యాత్మిక తేజమే భారతదేశము మానవాభ్యుదయమున కందించు మహనీయ మగు నుపహారము.

---

# భక్తిరత్నావళి

మూలము : శ్రీ విష్ణుపురి

వ్యాఖ్యాత : విష్ణుచిత్తుడు

(ప్రథమ విరచనము)

## 57-58

భగవత్కృప నందుటకు కావలసిన యొక్కగానొక్క యర్హతను ప్రహ్లాదు డుద్ఘాటించుచున్నాడు.

నాలం ద్విజత్వం దేవత్వం ఋషిత్వం వాఽసురాత్మజాః
ప్రీణనాయ ముకున్దస్య న వృత్తం న బహుజ్ఞతా ॥
నదానం న తపో నేజ్యా న శౌచం న వ్రతాని చ
ప్రీయతేఽమలయా భక్త్యా హరి రన్య ద్విడంబనమ్ ॥ (7-7-51,52)

అసురాత్మజులారా, బ్రాహ్మణ్యముగాని దేవత్వముగాని ఋషిత్వముగాని సచ్ఛీలముగాని పాండిత్యముగాని ముకుందుని సంతుష్టుని జేయజాలవు. దానము తపము శౌచము యజ్ఞములవలన నతడు ప్రీతుడుగాడు. నిర్మలమగు భక్తియొక్కటియే అతనిని రంజిల్లజేయును. భక్తిరహితములైనచో నితరములన్నియు వట్టి యాడంబరములు మాత్రమే.

## 59

ప్రహ్లాదు డీ యర్థమును సోదాహరణముగ విశదీకరించుచున్నాడు.

మన్యే ధనాభిజన రూప తపః శ్రుతౌజసస్తేజః ప్రభావ బలపౌరుష బుద్ధియోగాః
నారాధనాయ హి భవన్తి పరస్యపుంసో భక్త్యా తుతోష భగవాన్ గజయూథపాయ ॥
(7-9-9)

ధనము ఆభిజాత్యము సౌందర్యము తపము పాండిత్యము తేజము శక్తి సామర్థ్యము పౌరుషము ధీశక్తి యోగసాధనము మొదలైనవేవియు భగవదనుగ్రహమును సంపాదింపజాలవని తలతును. భక్తియొక్కటి తప్ప నితరములగు నర్హతలేవియు లేని గజేంద్రునిపట్ల నతడు ప్రీతుడాయెను గదా!

## 60

తన భక్తుడని గజేంద్రు ననుగ్రహించినచో నతడు పక్షపాతము చూపుటలేదా యను ప్రశ్నకు ప్రహ్లాదు డుత్తర మిచ్చుచున్నాడు.

> చిత్రం తవేహిత మహోఽమిత యోగమాయా లీలా విసృష్ట భువనస్య విశారదస్య
> సర్వాత్మనః సమదృశోఽవిషమస్వభావో భక్తప్రియో యదసి కల్పతరు స్వభావః ॥
>
> (8-23-8)

దేవా! నీ లీలలెంత విచిత్రములు! దుర్గ్రాహ్యమగు నీ యోగమాయచే విశ్వము నంతటిని లీలామాత్రముగా సృజించితివి. నీవు సర్వజ్ఞుడవు. సకల జీవులయందును ఆత్మరూపివై వసింతువు. సర్వసముడవు. అయినను భక్తులయం దనురాగముచేత నీవు పక్షపాతివలె తోచుచున్నావు. కాని ఇది కల్పతరువువంటి నీ స్వభావమే కాని పక్షపాతము కాదుగదా!

గమనిక : కల్పవృక్షము తన నర్థించినవారి కోరికలనెల్ల తీర్చును. కాని తన నర్థింపని వారి కోరికలను తీర్పదు. ఇది కల్పవృక్షమున పక్షపాతముకాదు. అట్లే తనయందు శరణాగతి నందినవారిని భగవంతు డనుగ్రహించును. అట్లు ప్రపన్నుడుగాక యనుగ్రహ పాత్రుడుగాని మానవునిదే దోషముగాని భగవంతుని పక్షపాతమేమియు లేదు.

# యువకులకు వివేకానందుల పిలుపు

యువకులారా! నా ఆశలన్నియు మీపై నున్నవి. మీ జాతి పిలుపు నాదరింతురా? నా మాటను విశ్వసించు సాహసము మీ కున్నచో మీలో ప్రతి యొక్కరికిని ఉజ్జ్వలమగు భవిష్యత్తు గలదు. బాల్యమున నాయందు నాకెట్టి విశ్వాస ముండెనో అట్టి అఖండవిశ్వాసము మీ యందు మీకుండవలెను. మీలో ప్రతియొక్కడును అట్టి ఆత్మ విశ్వాసము నందుడు—ప్రతి ఆత్మయందును ఆ అనంతశక్తి నిక్షిప్తమై యున్నది—దానిచే నిక మీరు యావద్భారత దేశమును పునరుజ్జీవింప జేయగలరు. ఆహా! మన మప్పుడు ఆకసము క్రింద గల దేశము లన్నింటిలోనికి చొచ్చుకొని పోవుదుము. అచిర కాలములోనే, ప్రపంచములోని ప్రతి యొక్క జాతిని నిర్మించుచున్న అనేక శక్తులలో మన భావములుకూడ ఒక ముఖ్యాంశమై పోవును. భారతదేశములోను దాని కావలను ప్రతి జాతీయజీవనములోను మనము అంతర్లీనము కావలయును. దీనిని సాధించుటకై మనము ఉద్యమింపవలసి యున్నది. ఇట్టి ఈ కార్యనిర్వ

ణమందు నాకు యువకులు కావలసి యున్నారు.

ద్రఢిష్ఠుడు బలిష్ఠుడు, బుద్ధిశాలియు అగు యువకుడే పరమాత్మను చేరగలడని వేదములు ఘోషించుచున్నవి. కనుక మీ భవిష్యత్తును నిర్ణయించుకొన వలసిన సమయ మిదియే. స్వచ్ఛమై ఉజ్జ్వలమై పొంగారు యువశక్తి మీయందున్నప్పుడే మీ భవిష్యత్తును మీరు నిర్ణయించుకొనవలసి యున్నది. జవసత్త్వము లుడిగిన పిమ్మట కాదు. లెండు. సమయ మిదియే. వీలన అస్పృష్టములైన అనాఘ్రాతములైన కుసుమములను మాత్రమే భగవత్పాదారవిందములందు అర్పింపవలెను. అట్టివానినే ఆయన స్వీకరించును. జీవితము మూణ్ణాళ్ళ ముచ్చట. కావున మీరు ఉద్బుద్ధులు కండు. న్యాయవాదులై గిల్లి కజ్జములు పెట్టుకొనుట శాసించుట కంటె చేయవలసిన ఉత్తమోత్తమ కార్యములు గలవు. మీ జాతిసౌభాగ్యమునకును మానవాళి శ్రేయమునకును మిమ్ము మీరు ఆత్మార్పణ మొనర్చుకొనుటయే అన్నింటను మహోత్తమ కార్యము. ఈ జీవితమునం దేమున్నది? మీరు హిందువులు. ఆత్మ శాశ్వత మను విశ్వాసము స్వతఃసిద్ధముగ మీయందున్నది. ఒక్కొక్కప్పుడు కొందఱు యువకులు నావద్దకు వచ్చి నాస్తికవాదమును ప్రస్తావింతురు. హిందువు నాస్తికుడు కాగలడనుట నేను విశ్వసింపను. ఆతడు పాశ్చాత్యగ్రంథములను పఠింపవచ్చును. తాను చార్వాకుడ నని నచ్చజెప్పుకొన వచ్చును. కాని అది తాత్కాలికమే. అది మీ రక్తములో లేదు. మీ స్వభావమునందే లేని విషయమును మీరు విశ్వసింపలేరు. అది మీకు అలవిమాలిన కార్యము. అట్టి పనికై ఎన్నడును ప్రయత్నింపకుడు. నా బాల్యమున నేనా ప్రయత్నము నొకపరి యొనర్చితిని. విఫలుడనైతిని. జీవిత మల్పము. ఆత్మ అమరము శాశ్వతము. మృత్యువు తథ్యము. కావున ఒక మహోన్నతాదర్శము నవలంబించి దానికై మన జీవిత సర్వస్వము ధారపోయుదము. ఇదియే మన దృఢసంకల్పమగుగాక. మన శాస్త్రములు వచించునట్లు "సాధు పరిత్రాణమునకై యుగయుగములందు అవతరించు ఆ ప్రభువు" ఆ శ్రీకృష్ణపరమాత్మ మనల నాశీర్వదించి మనల నాశయసిద్ధికి కొనిపోవుగాక!

యువకులారా! లెండు మేల్కొనుడు. ఇదే సరియైన తరుణము. ధీరులు కండు. భయమొందకుడు. ఒక్క మన శాస్త్రములలోనే భగవంతునకు 'అభీః అభీః' అను విశేషణము ప్రయుక్తమైనది. మనము నిర్భయులము కావలయును. అప్పుడే మన యుద్యమము సిద్ధించును. లెండు, మేల్కొనుడు. మీ దేశమునకు ఈ మహత్తర త్యాగము అవసరమై యున్నది. యువకులే దీని నిర్వహింపగలరు. 'శక్తిపూరితులు బలిష్ఠులు కండలు తేఱినవారు విద్యావంతులు అగు యువకులకే ఈ మహాకార్యము నిర్దిష్టమై యున్నది. అట్టి నూర్లకొలది వేలకొలది యువకులు మనకు గలరు. లెండు! మేల్కొనుడు! ఈ ప్రపంచము మిమ్ములు గెత్తి పిలుచుచున్నది. ఉత్సాహసంభరితులై లెండు. మీరు పేదలమని గాని నిస్సహాయుల మనిగాని తలంపనే వలదు. ఏమి! ధన మెక్కడనైనను మనుష్యులను తయారు చేసినట్లు కనియున్నారా? ఎల్లెడలను మానవుడే ధనము నుత్పత్తి చేయుచున్నాడు. మానవ తేజము చేతనే ఉత్సాహ శక్తి చేతనే విశ్వాసబలము చేతనే ఈ సర్వప్రపంచమును నిర్మితమైనది.

# మతము : కల్పనయా - సత్యమా?

జి. జి. జి. వి. ఆర్. ఆర్. ఆర్. గోపాల్

మతము సత్యమనియే జనబాహుళ్యము ఇప్పటివరకు నమ్మి మతాచారముల నాచరించుచు శాంతియుతులై యుండిరి. ఆధునిక సమయమున చాల కారణములవలన మతావలంబులు బలమును కోల్పోయిరి. మతధిక్కారులు అంగబలమును మెండుగా చేకూర్చుకొనిరి. మతయాథార్థ్యమునకు అయాథార్థ్యమునకు గల వైరము అనాదికాలమునాటిదే. కాని ప్రాచీనకాలమున విద్యావిధానమును దాదాపు అన్ని అభిప్రాయ నిర్మాణక విధానములును మతావలంబుల యధీనమున నుండుటచేత మతము సత్యమే యని జనసామాన్యముచేత అంగీకరింపబడుచు వచ్చినది. ఆధునిక కాలమున అనియే అవకాశములు మతధిక్కారుల హస్తగతము లగుటవలన మతధిక్కారము బహుళముగా ప్రచారము నందినది. కాని అదృష్టవశమున ఈ కాలమున సమ్యగ్విమర్శ చేయుగలుగు శక్తి జనసామాన్యమునందు గమనార్హముగనే పెరిగినది. ఈ కారణముచేత మతవిషయమునుకూడ పూర్వాపరములు విచారించి అది నిజముగా సత్యమైనచో అంగీకరించి త్రికరణశుద్ధిగ దాని నాచరించుటయందే మగ్నుల మగుటయో అసత్యమైనచో సమూలముగ పెకలించి చెత్తబుట్టలో పారవైచి జీవితమునకు వేఱువిలువలు కనుగొనుటయో తప్ప శ్రద్ధావంతుని కింకొక మార్గము లేదు కదా!

మతవిచారణ చేయుటకు మతమన నేమో నిర్వచింపవలెను. ఇది మిక్కిలి కష్టసాధ్యమైన పనియే యైనను ప్రస్తుత సందర్భమున నిట్టి యర్థము చెప్పవచ్చును; మతమనగా ఈ విశ్వమునకు అందు మానవుని జీవితమునకు ఒక ఉద్దేశమును కనుగొనుట. విశ్వమునకు సృష్టిస్థితిలయకారకమగు శక్తియొకటి కలదనియు మానవుని ఉత్తమోత్తమమగు ఆదర్శము లన్నియు అందే నిక్షిప్తములై యున్నవనియు అట్టి ఆశక్తి సాక్షాత్కారమే-లేక దైవసాక్షాత్కారమే మానవజీవితోద్దేశమనియు, మతమునకు ప్రస్తుతము స్వీకరింపబడిన యర్థము.

ఈ దృష్ట్యా మతధిక్కారుల వాదములను పరిశీలింతము. మార్క్సిస్టులు మతము జనులను జీవిత కఠోర సత్యములను గమనింపనీయక జోకొట్టు మత్తుమందని నిరాకరింతురు. శాస్త్రజ్ఞులు మానవునకు కావలసినవెల్ల శాస్త్రవిజ్ఞానమే సాధింపగలదనియు అందువలన మతమనావశ్యక మనియు పల్కుదురు. సైకోఅనాలిస్టులు మతమనునది యూనివర్సల్ న్యూరోసిస్ అనియు చైల్డ్ ఫిక్సేషన్ అనియు త్రోసివేయుదురు. మరి కొందఱు అసత్యమైన మతము ప్రాథమిక దశయందు మానవునకు శ్రేయస్కరమై యుండినను బుద్ధివికాసము పెరిగిపోవుచున్న ఈ కాలమున మతమెంత మాత్రము అవసరము లేదని యందురు. ఇతరులు కొందఱు మత మసత్యమే యైనను మానవుని మానసికారోగ్యమునకు అది అవసరము కనుక మతము ఎప్పటికిని ఆవశ్యకమే యని నమ్ముచుందురు.

పరిశీలించినచో ఇట్టి వాదము లన్నియు పాక్షికములే యని తేలును. మార్క్సిస్టులు శారీరకావసరములను మనసులో నుంచుకొని మతమును తిరస్కరించుచున్నారు. శాస్త్రజ్ఞులు భౌతికమైన భూలోకస్వర్గమును శాస్త్రవిజ్ఞానము సాధింపగలదను నమ్మకముతో పలుకుచున్నారు. సైకోఅనలిస్టులు మానసికవ్యాధుల దృష్ట్యా మతమును వివరింప ప్రయత్నించు

చున్నారు. అసత్యమైన మతము ఒకప్పుడవసరమైన దనుట ఇప్పుడు అవసరము కాదనుట సంగతవిషయము కాదు. అప్పుడే ఆవశ్యకత 'దేవుని' ప్రార్థింప ప్రేరేపించినదో అదే ఆవశ్యకత నేడును కలదు. ఇక మిథ్యయైన మతము మానసికారోగ్యమున కవసర మనుట స్పష్టముగనే విరుద్ధ వచనము.

కనుక మతము సత్యమా అసత్యమా అని నిర్ణయించుటకు చరిత్రపైననే ఆధారపడవలెను. కాని అందును చారిత్రకులు 'శాస్త్రీయ' దృక్పథముతో పాక్షిక సత్యమునే ప్రదర్శించిరి.

ప్రస్తుతము శాస్త్రవేత్తలకు పరిణామవాదమే వేదము. ప్రథమమున జీవశాస్త్రమున బుట్టిన పరిణామవాదము క్రమముగా అన్ని శాఖలకును వ్యాపించుటచేత ఏ సిద్ధాంతమున కైనను పురాతన కాలములోని మూఢనమ్మకములకు జాడలు తీసినగాని వీలులేని పరిస్థితి ఏర్పడినది. అందువలన మత సిద్ధాంతములను కూడ ప్రప్రథమమున చెట్లను పుట్టలను సూర్యుని మెరుపును మేఘములను ఆరాధించు అజ్ఞాన మనియు, భూతప్రేతములను పూజించు భయసంజనిత మనియు వివరించి కొందఱు శాస్త్రజ్ఞులు మతమును కొట్టివేయుదురు.

అయినను 'అనాగరిక' మానవులు ప్రప్రథమమున పూజించినది సర్వసృష్టికర్త ననియు, అతడు ఋజువర్తనుడనియు, అతని పూజావిధానము బలులు మొదలగు లంచములు గాక నైతికజీవనము ప్రార్థన యనియు, ఇతర శాస్త్రజ్ఞులు ఇట్టి ఋజువులను బుద్ధిపూర్వకముగ నణచివేసి రనియు ప్రకటించు శాస్త్రజ్ఞుడు ఒక్కడైనను గలడు. అట్టి దేవున కుదాహరణముగ ఆస్ట్రేలియనుల 'దారుములున్' (Darumuluu) అండమానుల 'పులుగ' (Puluga) యును 'న్దెంగి' (Ndengi) అను ఫిజియనుల దేవుడును 'ఉంకు లెంకులు' అను జులు దైవమును ఓకియస్ (Okeus) టిరావా (Tl-Rawva) నాపి (Na-Pl) అను ఎఱ్ఱ యిండియను దైవములను అతడు పేర్కొనును.

కనుక శాస్త్రవేత్తలు చెప్పునట్లు మొదట ప్రేతములు ఆరాధింపబడుచు క్రమముగా అవియే జాతీయదైవములైన వను వాదము పక్షపాతముతో చెప్పబడినదని తోచును. ఎట్లైనను అట్టి శాస్త్రవేత్తలయందే ద్వంద్వాభిప్రాయము లుండుటవలన వారి వచనములు వేదములవలె స్వీకరింప నక్కరలేదు. అదియునుగాక ఇప్పటి రసాయన శాస్త్రము (Chemistry) ఖగోళ శాస్త్రము (Astronamy) మొదలగునవి కూడ రసవిద్య (ఇనుమును బంగారుగ చేయుట) జోస్యము మొదలగు మూఢనమ్మకముల నుండి పుట్టినవే కదా! ఆ కారణమున ఆయా శాస్త్రములు ఇప్పుడు తిరస్కరణీయములు కావుగదా. కనుక మతము ఒకవేళ మూఢనమ్మకముల నుండియే జనించినదని యొప్పుకొనినను ఇప్పుడు అది శాస్త్రీయము ప్రమాణ సిద్ధము కాకపోవలయు ననునియమము లేదు.

కాని మతము ఈ ప్రమాణ వచనములపైగాక ప్రత్యక్షానుభూతిపైనే తన యాథార్థ్యమును నిరూపించుకొనుచున్నది. మతానుసారమైన జీవనము అనిర్వచనీయమైన ఆనందానుభూతిని జనింపజేయుచున్నది. వ్యక్తిగత జీవనము సంపూర్ణమగుచున్నది. ఇట్టి ఆనందము పరిపూర్ణత మరియే ఇతర శాస్త్రవిధానముల నవలంబించినను సిద్ధింపదు. మత జీవనమున అత్యంతము మాననీయులైన వారి వచనముల ప్రకారము మతజీవనము తత్సంబంధమైన యనుభూతి దైవముయొక్క అస్తిత్వమునే కాక

శాస్త్రముల ప్రామాణ్యమునకు దీటగు ప్రామాణ్యముతో ప్రదర్శించుచున్నవి. ఇట్టి యనుభూతియు క్షణికమాత్రము కాదు. దైవానుభూతి పొందిన మానవుని వ్యక్తిత్వము సంపూర్ణముగ మారిపోయి, అతని జీవన మనుక్షణమును విశ్వప్రేమరంజితమై యలరారును. ప్రతిచిన్న సందర్భమునను అతని జీవనము శీలసంపదను స్వచ్ఛహృదయమును నిర్భయమును ప్రేమను మరి ఇతర సద్గుణ సంపదలను ఇతర మానవులలో నెన్నడు కానరాని యంతగ విరజిమ్ముచునే యుండును. మతజీవన మొక్కటియే అత్యంతము ఆదరణీయమని వివిధమతప్రవక్తల ఏకైక వచనము.

అటువంటి వ్యక్తులు చరిత్రయందు పదేపదే కన్పింతురు. బుద్ధుడో శంకరాచార్యులో శ్రీ రామకృష్ణులో వివేకానందులో పాశ్చాత్యుల క్రీస్తు భగవానుడో ఎల్లరును అట్టి దైవానుభూతిని మతజీవనమునకు గమ్యమగునట్టి దానిని అనుభవించినవారే! ఎల్లరును తాము కోరిన దే దైనను సాధింపగల సమర్థులే. అయ్యును వారు అన్నింటిని తృణప్రాయముగ తిరస్కరించి ''దివ్యజీవనమే జీవనము. సోదరులారా! మేల్కొనుడు'' అనియే ప్రబోధించిరి.

వారెల్లరు మతిలేనివారు దుర్బలురు ఇం కేదో వ్యాధిగ్రస్తులు అనుటకు అసలే వీలులేదు. మతజీవనమున సమున్నతిని సాధింపగలిగిన వారందఱును భౌతిక మానసిక రంగములం దెవ్వరికిని తీసిపోని ప్రజ్ఞగలవారు. రబ్బీల వాదములను క్రీస్తు సులభముగా పిట్టకథలతో తెలియజెప్పగలిగెను. శ్రీ శంకరాచార్యుల ప్రజ్ఞ దేశమందెల్లెడలను ప్రసిద్ధమే. ఈ కాలమున విదేశములందు సైతము శ్రీ శంకరాచార్యులు గౌరవింపబడుచున్నారు. అత్యంతము ఆధునికుడైన శ్రీ వివేకానందస్వామి పాశ్చాత్య సంఘమునందలి అత్యంత మేధావంతులను సైతము విభ్రాంతులను జేయగలిగిన ప్రజ్ఞాశాలి. ఇట్లు మానవజాతికే తలమానికము లనదగు పురుషపుంగవులు మతయాథార్థ్యమును ఆవశ్యకతను ఉద్ఘాటించుచుండ అనుమానమునకు కారణమేమి?

అట్టివారు అవతార పురుషులు. వారితో మాకేమి పోలిక యనవచ్చును. కాని వారును మానవులుగనే పుట్టిరి. మానవులుగనే పెరిగిరి. మానవులవలెనే శరీరములను వదలిరి. కనుక మానవుల కుండదగిన ఉండవలసిన లక్ష్యము లే వారికి ఉండిన వని చెప్పక తప్పదు కదా? అట్లు మతానుభూతిని అనుభవించుటకు వారికి బాల్యమునుండి గల ఆకాంక్షకు వస్తువు మాత్రము లేకుండునా? ఆకలివేసిన తినుటకు తిండి చూచుటకు వస్తువులు బుద్ధియున్నందులకు చదువు కలుగుచునే యున్నవి గదా! కనుక ఈ ప్రపంచము నాడించు శక్తి ఎవరను ఆరాటము కలిగియు అట్టి శక్తిమాత్రము మిథ్య యగుట సంబద్ధ మగు విషయమా?

మా కెవ్వరకును అట్టి ఆరాటము కలుగుట లేదే అనినచో అది మన లోపమే, అపరిపక్వతయే. ఐదేండ్ల బాలునకు దాంపత్య వాంఛ కలుగునా? అందుచేత ఆ బాలునకు ఇరువదేండ్ల పిదప గృహస్థజీవనము మిథ్య యగునా? అట్లే దైవమునకై కలుగు ఆరాటమును మనస్సు బుద్ధి పరిపక్వమైన పిదప గలుగును. అది కలుగునంతవరకు మన కెంత బుద్ధిమీసములు పెరిగినను మనము బాలురమే.

అదియునుగాక అట్టి మహనీయ పరిణామము వలన మానవుడు తరతరముల మానవులను ప్రభావితులను చేయగలుగుచున్నాడు. వారి

జీవితములను క్షణములో త్రిప్పివేయగలుగుచున్నాడు. బుద్ధుడు గతించి రెండువున్నర వేల సంవత్సరములైనను ఇంకను బుద్ధునిపేరు తలచిననే ఒడలు పులకరించును. కనుక మతజీవన ఫలితములిట్లు మిరుమిట్లు గొలుపుచు వెలుగుచుండ మతముమాత్రము అసత్యము మిథ్య అనుట ఎంతటి మూఢవిశ్వాసము !

కనుక అన్ని విధములుగను మానవుని సంపూర్ణమానవునిగ జీవింపజేయు మతజీవనము ఎల్లరకును అనుసరణీయము. ధనము కీర్తి అధికారము సంతానము మొదలగు జీవితపు విలువలెన్నియున్నను అన్నింటిని సాధించినను అవి అన్నియు కలిసినను ఆధ్యాత్మిక విలువను సాధించుటకు దీటు కావు. మతజీవన మొక్క-టియే మానవజీవితమున నేకైక విలువ.

# దానము

## హరిహరదాసు

దానమన నేమి ? పరస్పర సహకారమే దానము. ఈ సహకారము ముఖ్యముగ మూడువిధములుగ నెన్నబడినది. అన్నదానము విద్యాదానము జ్ఞానదానము. అన్నదానము కేవలము భోజనమును మాత్రమేగాక శారీరకావసరముల నన్నింటిని అంతర్గర్భితము చేసికొనును. కడుపునకు తిండి ఒంటికిబట్ట ఉండుటకు గూడు రోగమునకు మందు మొదలగునవన్నియు శారీరకావసరములను తీర్చుటచేత అన్నదానమని సూక్ష్మముగా వ్యవహరింపబడుచున్నవి. విద్యాదానము మానసికావసరములను తీర్చును. జీవనాధారమగు పారిశ్రామిక కళలును వ్యవసాయకళలును ఇతర విధములగు జీవనోపాధులయందలి నైపుణ్యము, సంగీతము సాహిత్యము మొదలగు మానసిక వికాసకరములగు కళలును విద్యాదానముగ పరిగణింపబడుచున్నవి. జ్ఞానదానము ఆధ్యాత్మిక వికాసము నొసగూర్చి మానవుని దివ్యునిగా చేయును. అధ్యాత్మవిద్య యొక్కటియే జ్ఞానదానమగుచున్నది.

ఈవిధముగ విభజింపబడిన దానము పరస్పర సహకారమగుట యెట్లు ? ఇచ్చుకోలు-పుచ్చుకోలుగ నేకదా వ్యవహారము ! జీతములు కట్టినచో కాలేజి చదువు చదువవచ్చును. వేతనము లిచ్చినచో పొలమునందుగాని పరిశ్రమలయందుగాని పనులు జరుగును. డాక్టరునకు పైకము కట్టినచో రోగమునకు మందు లభించును. ఇంతియేకదా అనవచ్చును. ఇట్టి దృక్పథముయొక్క ఫలితమును ప్రత్యక్షముగ చూచుచునే యున్నాము. ఇరువైపులవారును సాధ్యమైనంత తక్కువ ఇచ్చి సాధ్యమైనంత ఎక్కువ రాబట్టుకొను ప్రయత్నము కాయ శక్తులచేసి చివరకు ఇరువురును నష్టపోవుచుందురు. వేతనములకొరకు స్ట్రైకు, చదువకుండుటకు స్ట్రైకు మందులిచ్చుటకు స్ట్రైకు ఇట్లు అన్నిరంగములయందును స్పర్ధలు వైషమ్యములు పెరుగుటవలన నష్టముగాక ఏమాత్రమైనను లాభము గలదా ?

అట్లుగాక సమాజమునందు ప్రతియొక్క-రును తమ శక్తికొలది ఇవ్వగలిగినచో ఎల్లర

కను అన్నియు సాధ్యమైనంత ఎక్కువగనే లభించి సమాజము సుభిక్షము కాగలుగు చున్నది. ఈ దృష్టిచేతనే దానము పరస్పర సహకారముగ గుర్తించి అనుష్ఠింపవలెను.

దానము ఇట్లు వ్యక్తిగతమగు ఇష్టాయిష్ట ములపై నాధారపడినచో నెందఱు బాగుపడు దురు? కనుక వ్యవస్థయే దానమును నిర్వ హింపవలెననిచో వ్యవస్థతో మాకేమియు వైరములేదు. కాగా వ్యవస్థయందును వ్యక్తులే కదా చివరకు కార్యకర్తలు? కనుక దానము వ్యక్తిధర్మముగా నెలకొనిననేగాని వ్యవస్థ ధర్మముగా రాణింపదు. దానమే అననేల ఏ కార్యమును రాణింపదు. గడ్డిపోచ పనికి మాలినదే అయ్యును వెంటిగా నేర్పడి ఏనుగు నైనను బంధింపజాలుచున్నది. అట్లే ఎవరికి వారే చేయుదానము పరిమాణాత్మకముగా గణనీయము కాకున్నను శీలనిర్మాణకముగా మహోపకారి యగుచున్నది. అందువలననే అందఱును కలిసి వ్యవస్థద్వారా చేయగలుగు దానము మిక్కిలి ప్రయోజనకారి యగు చున్నది.వరదబాధితుల సహకారసంస్థలు కరవు నివారణసంస్థలు మొదలగునవి ఒక్కొక్కరుగా చేయలేని దానమును సమర్థతతో నిర్వ హించును కదా! కాని ఇందు వ్యవహర్తలకు వ్యక్తిగతమగు దానబుద్ధి కొరవడిననే 'తిని వేయుటలు' 'దుర్వినియోగములు' పెల్లు రేగును. కనుకనే దానము ప్రధానముగ వ్యక్తి ధర్మము. ఆనుషంగికముగమాత్రమే ఎట్టి వ్యవస్థయైనను ఉపయోగకరమగును.

కనుక దానము అన్నదానము విద్యా దానము జ్ఞానదానము అని మూడు విధము లనియు అది క్రమముగా శారీరక మానసిక ఆధ్యాత్మిక అవసరములను తీర్చుననియు ఏర్పడి నది. ఏ రకమైన దానమైనను ప్రధానముగా వ్యక్తిగతమైన ధర్మమనియు తెలిసనది. ఇక దానము చేయదగు పరిస్థితులేవి?

దానమునకు దేశకాలపాత్రములు మూడు ముఖ్యావసరములు. సరియగు స్థలమునందు అనువగుకాలమున అర్హతగలిగినవానికి దానము చేయవలెను. కఱవుదేశమున అంబలి పోసినను అది కృతజ్ఞతతో స్వీకరింపబడును. అది దానమనిపించుకొనును. ఇంటికి భిక్షుకుడు వచ్చి యాచించినపుడు కలిగిన కమికెడన్న మునే శ్రద్ధతో దానముచేసినచో అతడెంతో తృప్తిపడును. అంతియేగాని ఎండలు మండి పోవు దేశమున ఉన్నికంబళ్లు దానముచేయుట పంటకాలువలు మెండుగానున్న దేశమున బావులు త్రవ్వుట ఇట్టి దానములు నిరర్థక ములు, ఇట్లే విద్యాదానముగాని జ్ఞానదానము కాని తగిన స్థలమందే చేయవలయును.

కాలమనగా అవసర మేర్పడిన కాలము. ఏ సహకారమైనను కాలానుగుణముగ చేయ వలెను. ఆకలిగొన్నపుడు అన్నదానము చదువగలిగినపుడు విద్యాదానము వ్యాధి గలిగినపుడు ఔషధదానము ఇట్లు. కాలాతీత మైన పిమ్మట చేయుదానము నిరర్థకము. రోగి స్థితి చేయిదాటిన పిదప ఎంత 'వైద్య సహా యము' చేసిమాత్రము ఏమి యుపయోగము?

పాత్రమనగా అర్హత కలిగియుండుట. ఆకలి గొన్నవాడు అన్నదానమున కర్హుడు. విద్య నేర్వగోరువాడు విద్యాదానమున కర్హుడు. సుష్ఠుగా భుజించిన మానవుడు అన్నదానము నకు పాత్రుడుకాడు. చదువునందు శ్రద్ధలేని వాడు విద్యాదానమున కర్హుడు కాడు.

ఇట్లు వ్యక్తిగతముగ దానమునకు దేశ కాల పాత్రములను విధించుట యేలనన

దానము స్వాభావగత మగుటకొరకే, దానము ఒక దృక్పథముగ పెంపొందుటకొరకే. ఇట్లు వ్యక్తియందు దానబుద్ధి ఏర్పడినచో వ్యవస్థల యందును అదే దానబుద్ధి సక్రమముగా పని చేయుచుండును. వ్యక్తిగతముగ దానము చేయలేని వ్యక్తి వ్యవస్థయందును సక్రమముగు దానము చేయజాలడు.

వ్యవస్థలకును దేశకాల పాత్రములు వర్తించును. ఉన్నత విద్యావకాశములు లేని యూర్లెన్నియో ఉండగా ఉన్నయూరనే మరియొక విద్యాలయమును కళాశాలను ప్రారంభించుట ఆసుపత్రులే లేని స్థలములెన్నియో గలుగ కావలసినన్ని యాసుపత్రులుగల పట్టణముననే మరిరెండు ఆసుపత్రులు కట్టుట పరిశ్రమలు చాలినన్ని గలుగు దేశమున మరికొన్ని పారిశ్రామిక సంస్థలను నెలకొల్పుట మొదలైనవి వ్యవస్థలకు కలుగు అదేశములు.

అప్పు అక్కఱతీరిన పిదప 'లోను' మంజూరు చేయుట సరకు ముక్కిపోయిన పిదప రవాణా సౌకర్యము లేర్పరచుట కాటకమున సగము జనులు చచ్చినపిదప ఆహారపదార్థములు రవాణాచేయుట పారిశ్రామిక కార్యక్రమములు సగము నిలచిన పిదప ముడిసరకులను వదలుట మొదలగునవి అకాలదానములు.

ధనికున కినుమిక్కిలిగా స్వల్పవడ్డీలతో ఋణముల నిచ్చుట పారిశ్రామిక సామర్థ్యము లేనివానికి పరిశ్రమను స్థాపించుటకై ధన సహాయముచేయుట చదువురానివానిని ఉపాధ్యాయునిగ చేయుట మొదలైనవి వ్యవస్థీకృతమైన అపాత్రదానములు.

ఈవిధముగ స్థలమును సమయమును అర్హతను తెలిసిచేసిన దానమే, సహకారమే, ఫలవంతమై వ్యక్తికిని సమాజమునకును ఉపయోగకరమగును. అదేశమునందు అకాలమున అపాత్రునకుచేసిన దానము వ్యక్తిగతముగ గాని సామాజికముగగాని బూడిదలోపోసిన పన్నీరే యగును.

తరువాతి ప్రశ్న ఈ దానము నేదృష్టితో చేయుట యని. భగవద్గీతయందు దేశకాల పాత్రముల ననుసరించి ప్రతిఫలము కోరక ఇచ్చు దానము సాత్త్విక దాన మనబడినది. ప్రత్యుపకారము నాశించుచు చేయు దానము రాజస మనబడినది. అదేశమున అకాలమున అపాత్రునకు తిరస్కారపూర్వకముగ నిచ్చు దానము తామస మనబడినది. (17-20-22) సత్త్వగుణము జ్ఞానమును సుఖమును కలిగించును. రజోగుణము ఆశను కార్యపరంపరను వృద్ధిచేయును. తమోగుణము అజ్ఞానమును పొరపాటులను పెంచును. (14-6-9) దీనిని బట్టి, శ్రేష్ఠమగు దానము చేయదగినది కనుక చేయవలయునను దృష్టితో చేయుటయే. ఇందువలన దాతకు అర్థికి ఇరువురకును తృప్తియు సంతోషమును కలుగును. ఈ దానమువలన నాకేమి లాభించు నని యాలోచించిచేయు దానమువలన, లాభింపనిచో దుఃఖమును లాభించినచో ఇంకను లాభింపవలయునని ఆశయు మరికొంత దానము చేసినచో ఇంకను లాభించునని దానకర్మల యందు అభినివేశమును కలుగును. ఇవ్వవలసి వచ్చినదే యని తిట్టుకొనుచు ఇచ్చుదానము దొంగల వంచకులపాలును అధికారుల పాలునునై దాతకు మౌఢ్యమును పెంపొంద జేయును.

కనుక ఏదానమైనను దానివలన ఇతరులకు కలుగు ఉపయోగమునే తలచి చేయవలయును

గాని ఇతరములగు ఆలోచనలను రానీయ రాదు. అప్పుడే అది సఫలమగును. ఇందుకు దృష్టాంతముగ జానపదమగు నొక చిన్న కథ గలదు. వీరసేనమహారాజు ఎంతయో ధనము వెచ్చించి అవంతీపురమున గొప్ప శివాలయమును కట్టించుచుండెను. ఆలయ నిర్మాణము పరిసమాప్తమగు దినము దగ్గరపడు కొలది రాజు తానెంత ఘనకార్యము చేసినది దానివలన తనపేరు ప్రఖ్యాతులెంత పెరుగునది తలచి తలచి ముదము నందసాగెను. ఇట్లుండ ఆనాటిరేయి రాజునకు కలలో దేవాలయపు కైంకర్య శిలపై తన పేరుగాక మరియొక పేరుండుట కనవచ్చెను. వరుసగా ప్రతి రాత్రియు నిట్టికలయే రాగా రాజుగారు ఆగ్రహముతో ఆ పేరుగల వ్యక్తిని వెదకించెను. చూడగా అదియొక వృద్ధురాలు. నే నాలయమును కట్టించుచుండ నీవేమి చేయుచున్నావని రాజు గద్దింపగా ఆమె వణకుచు మహారాజా తామీ పుణ్యకార్యమును నెరవేర్చుటనుజూచి ఉడుతాభక్తిగ దాహాముగొన్న పనివాండ్రకు నీరందించుచుంటినని బదులు చెప్పెను. వీరసేన మహారాజున కప్పుడు కనువిప్పు కలిగెను. తాను పేరు ప్రఖ్యాతులుకోరి యపార ధనము వెచ్చింపగా శివుడు ప్రీతుడు కాలేదు. కాని ఒకతాయి కదల్పకపోయినను ఒకపైస వ్యయముచేయకపోయినను శివకార్యమని యెంచి శివకార్య నిర్వాహకులకుచేసిన యుపకారమే శివునకు ప్రీతి కలిగించెను.

మాకే లేదు ఇంకొకరికిచ్చుట యెట్లని మరియొక దీనాలాపము వినబడును. ఈయవలయునను బుద్ధియుండవలయుననేగాని ఇచ్చు మార్గము అదియే కన్పించును. కర్ణుడు దానకర్ణుడని పేరొందుటనుచూచి దుర్యోధన మహారాజు ఈసునొంది తానును దానదుర్యోధనుడని "బోర్డు" వేసికొని దానము లీయసాగెను. ఎట్లైనను రారాజు కదా, దానము లవిరామముగా సాగిపోవుచుండెను. ఒకనాడు ఒక బ్రాహ్మణుడు వచ్చెను. రాజా, యజ్ఞము తలపెట్టియున్నాను. నాలుగుబండ్ల ఎండుకట్టె కావలయునని యాచించెను. అప్పటి కేడు దినములనుండి కుండపోతగా వర్షము. ఎక్కడను ఎండుకట్టె యను మాటయే లేదు. దానదుర్యోధను డిట్లనెను. "ఎండుకట్టెయే కదా, వానల నాగనిమ్ము నలువదిబండ్లకట్టె నిచ్చెద" ననెను. బ్రాహ్మణుడు వినక "దానదుర్యోధనుడని పట్టము తగిలించితివే. అక్కఱపడినప్పుడు ఈయలేని దాతవు నీవొక దాతవా? ముందా పట్టము బీకివేయు"మని రోషముతో బలికి దానిని బీకివేయించి కర్ణునొద్దకు బోయెను. ఆ మహానుభావుడు ఇతడడిగినదే యాలస్యముగా తన భవనములోని కలపనంతయు బీకించి బండ్లకెత్తించి బ్రాహ్మణుని వెంట బంపెను. అతడును మహానందముతో దుర్యోధన మహారాజు ప్రాసాదము ముందుండిపోవుచు "ఓహో దుర్యోధనమహారాజా చూడుము చూడుము దానకర్ణుని దాతృత్వము" అని యుగ్గడించెను. అప్పటినుండియు దుర్యోధనుడు తన యంతరము తెలిసికొని ప్రవర్తించెను. ఈకాలమున అట్టి దాతలును లేరు అట్టి పరీక్షలును జరుగవు. కావలసినదెల్ల మానవులయందు సాటి మానవులయెడ హృదయమునందు ఆర్ద్రితమాత్రమే.

శ్రీరామకృష్ణపరమహంసలును ఈ విషయమునే చెప్పిరి. పాశ్చాత్యదానరూపమగు ఫిలాన్త్రోపీ (Philanthrophy) అనిన వారికి పరిహాసము. ఏమేమిదో చేసి ఎవరెవరినో ఉద్ధరించుట యేమి! వినయముతో దీనులయందలి దైవమును పూజించు దృష్టితో చేసిన దానమే దానమని వారి యభిప్రాయము.

అట్టిది భారీయెత్తునచేసినచో మరియు మంచిదే. కాని పేరు ప్రతిష్ఠల యుద్దేశముతో చేయబడు అట్టి కార్యములు దానము కాజాలవు. దాన ఫలము నీయజాలవు.

ఇట్లు సమాజమున వ్యక్తిగతముగను వ్యవస్థయందును స్థిరముగ నెలకొనిన దానమే వ్యక్తికిని సమాజమునకును అభ్యుదయ కారణ మగుచున్నది.

# ఆస్తికుడంటే ఎవరు?

## చివుకుల కృష్ణమూర్తి

ఆస్తికుడంటే దేవుడున్నాడని నమ్మేవాడని సులభంగ నిర్వచించేవారు చాలమంది. కాని దేవుడంటే ఏమిటి, నమ్మకం అంటే ఏమిటి అని తేలికగ తేల్చేవారు అరుదు. సృష్టికంతా ఒక కర్త ఉన్నాడనే విశ్వాసంచేతనే ఆస్తికత అమరదు. సాంతసృష్టికి మౌలికంగ ఒకే సూత్రం – ప్రయోజనం – పరమార్థం ఉందనీ, అది అనుభవైక యోగ్యమనీ వైదికంగ నేర్చి, ఏతత్ పరమసత్యాన్వేషణకై నిరవధికంగా కృషిచేసేవాడు – ఆస్తికుడు. పంచభూతాత్మిక మైన జగత్తులో, సృష్టికర్త అంశము ప్రతి అణువునా ఉన్నదన్న శాస్త్రప్రమాణం ఆస్తికుని స్థైర్యానికి తార్కాణం. ఒడుదుడుకులకు, కష్టనిష్ఠురాలకు, పరీక్షానిరీక్షలకు నీరసించని అతని కృషే – దీక్ష. సత్యాన్వేషణాధీరునికి, సర్వేశ్వరుని కారుణ్యం తప్పదనే పౌరాణిక సాక్ష్యాలు ఆస్తికుని స్థైర్యానికి ఆధారాలు. ఎన్ని జన్మలకైనా అతని సాధన ఫలించక తప్పదని ప్రోత్సహిస్తూ – ఎందరో మహాను భావులు, మహాత్ములు, అవతార పరిషులు అతని జీవితనౌకకు చుక్కానులుగ ఆ యా కాలానికి తగినట్లు, వారి దివ్యప్రభావీచికలను ప్రసరిస్తారు.

'ఎందుకో పుట్టాం; ఏనాడో ఒకనాడు పోతాం. ఈ మధ్య బ్రతికినంతకాలం సాధ్యమై నంత సుఖంగ జీవితం సాగడమే మా ధ్యేయం. జననమరణాలకు మించిన అతీతశక్తి ఏదైనా ఉండేమోనని తెలుసుకోవడం మాకు అనవ సరం. ఇంద్రియప్రజ్ఞలకు అందని తత్వాన్ని గూర్చి అలమటించడం అవివేకం – వ్యర్థం' అనేవారిని, లేదా లోకాయాతవాదమనే పెను గాలికి గడ్డిపోచలవలె కొట్టుకుపోతూ – ఆ కొట్టుకుపోవడమే సుఖంగ తేలిపోవడమని భ్రమించేవారిని, నాస్తికులనవచ్చును.

ఇటు ఆస్తికులూ, అటు నాస్తికులూ కాక అయోమయమైన అంతర్యంతో అనేకరకాల బడేవారు, చాలరకాలవారు ఉన్నారు. వీళ్లకు స్వార్థమున్నంతగ ఆత్మవిశ్వాసం ఉండదు; ఆత్రమున్నంతగ అనువైన శ్రద్ధ ఉండదు. స్వప్రయోజనాలకు తోటివారి బలహీనతలను బలిచేసి, బలిసి – జరిగినంతకాలం, 'దేవుని దయవల్ల చల్లగ ఉన్నా'మంటారు కొంత మంది. కొట్లో కొబ్బరికాయను దగ్గచేసి దోచి దారిలో విఘ్నేశ్వరునికి, నలుగురిమధ్య కొట్టి భక్తులై వెలసి – ఆ పరపతితో స్వంత లాభానికి ప్రాతిపదిక వేసేవారు మరికొందరు,

ప్రభుత్వానికి తమ ప్రలోభపు అంతుచిక్కకుండ కాపాడింది ఆ ఏడుకొండలవానికి తాము మొక్కుకున్న మొక్కుబడేనని నమ్మి, తమ దొంగసొమ్ములో కొంత, కమిషన్ క్రింద శ్రీవారి హుండీలో చాటుగ దిగవిడిచేవారు మరొక తరగతి. ఒక్క రూపాయితో లాటరీ టిక్కెట్టు కొని అమాంతంగ లక్షాధికారి కావడానికి ఊర్లోని గుళ్లంతా ప్రదక్షిణం చేసే వాళ్లతోబాటు, పరీక్షాముందు, సినిమా(ఆ)లయాలకు బదులు దేవాలయ ప్రాంగణాల్లో తారసిల్లే విద్యార్థులు - ఇలాంటి తత్కాల ముముక్షువులు, ఉత్తీర్ణులైనంతవరకు, తమ ఆస్తికతా ప్రయోజనానికి తామే మురిసి పోతారు. ఐతే, పునాదిలేని కట్టడం ఉప్పెన వచ్చినప్పుడు కొట్టుకొని పోయినట్లు, వీళ్ల 'ఆస్తికత' సమసిపోతుంది - కాలం ఎదురుతిరిగి, పాపం పండినరోజు, వీళ్ల దైవనమ్మకం నాస్తికుల అపనమ్మకంకన్నా నికృష్టం. సందేహాలకు తావివ్వని నమ్మకం - శాస్త్రప్రమాణాలపట్ల అకుంఠితమైన విశ్వాసం - సాధనలోని లోప దోషాలను తీర్చిగట్టించే గురువు సాన్నిధ్యం - నిరంతర దీక్ష, అనిర్విణ్ణత ఆస్తికుని లక్షణాలు. అడుగడుగునా కలిగే అనుమానావరోధాలు, నిజానికి ఆస్తికుని దీక్షను పరీక్షచేసి, అతని ప్రగతికి గీటురాళ్లుగ ఏర్పడి, అతని సాధన రాటుదేరుతుంది. సాశీల్యవతి సీతకేగదా సుదీర్ఘ నిరీక్ష - స్వాహాభవ పరీక్ష!

కలియుగకాలమైన నేడు మానవసమాజంలో ఆస్తికతా? లేక నాస్తికతా ఎక్కువగ ప్రబలియుండేదన్న ప్రశ్నకు సమాధానం: జిజ్ఞాస, సనాతనధర్మశాస్త్ర ప్రమాణికంగా జరుగుతోందా; లేమ ఆధునిక సామాన్య శాస్త్రరీత్యా సాగుతోందా - అనే దాన్నిబట్టి ఇవ్వవలసి ఉంటుంది. కలిప్రభావమంతా నవీన విజ్ఞానసమాజనిర్మాణ మనే మయసభలోనే ఉంది. అస్తవ్యస్తపు విలువలు, డాంబిక యోజనలు, తారుమారు చేస్తున్నాయి మానవ యత్నాలను. మానవుడు అంతరిక్షయానం చేస్తున్నాడు. అందాల జాబిల్లిమీద తప్పటడుగులు వేశాడు. తల్లితండ్రుల అవసరంలేకుండ పరీక్షానాళికలో పాపాయిని తయారు చేసే ట్టున్నాడు. పరమాణువుని ఛేదించి మారణాయుధాలను విచ్చలవిడిగ వదలిపెట్టాడు. అక్కడక్కడ తన నిర్మాణకౌశలంతో ఎడార్లను నందనవనాలుగ మార్చగల్గుతున్నాడు. ప్రకృతిసిన్న తాత్కాలికోద్భృతమైన శక్తియుక్తులచేత రోగాలను అదుపులో పెడ్తున్నాడు. మానవజీవితకాలపరిధిని పెంచగల్గుతున్నాడు; పిల్లా జల్లా బాదరబందీలేని కామకాండకు దోహదమైనాడు. సంకరజాతుల సృష్టించి సస్యాలవృద్ధీ, పసరాలసనీ, పెంపొందించి - తక్కువమంది పుట్టి ఎక్కువ తిండి మెక్కి, భోగలాలసతవృద్ధికి మరింత సాయం చేస్తున్నాడు ఇదంతా చూస్తేంటే మానవుడు దివిని భువికి దింపేటట్లున్నాడనిపిస్తుంది - సామాన్యుడికి.

ఆధ్యాత్మికతత్వాన్ని సాంఘికంగ, రాజకీయంగ దాదాపు విస్మరించిన మన భారతదేశం కూడ అగ్రరాజ్యాలతోబాటు, నవీన విజ్ఞాన మార్గంలో ముందడుగువేస్తూ అణుశక్తినికూడ సాధించింది. అడవుల్లో బలమే శాసనమైనట్లు - కలిగినవాడితోడి కాపురమే మేలన్నట్లు - నేటి మేటిదేశాలకు సామాన్య విజ్ఞానశాస్త్రంలో, సాంకేతిక నైపుణ్యంలో, సాటిగ మన్నన పొందిన మనదేశం - ఎక్కడో అంతర్యంలో నిక్షిప్తమైవున్న పురాతన సంప్రదాయాన్ని శాంతికాముకతరూపాన ఋజువుచేస్తూ, అణుశక్తిని దారిద్ర్యతరణానికే వినియోగించ

సంకల్పించింది. అంతవరకు బాగానేవుంది; కానీ, ఇంత తిండీ తీర్థం - అణుశక్తి వెలుగు, సర్వత్ర జిలుగు పులుముకుంటే చాలా? అగ్ర రాజ్యాలు ఇదంతా సాధించి మించి, మితిమీరిన భోగలాలసతో అలసి ఇప్పటికే చెప్పలేని రోతలతో, మానసికవ్యథలతో, హృద్రోగాలతో అలమటిస్తున్నాయే! జీవితావసరాల సమృద్ధితోపాటు, క్షణికానందాలవలని నిర్వీర్యత, నిస్పృహ, సరికొత్త సమస్యలూ ప్రారంభమై సతమతమవుతున్న వీరి పరిస్థితి మనకొక హెచ్చరిక కాదా? లోకాయాతంలో మునిగి తేలిపోయి, వేసారి, విసిగిన పాశ్చాత్య మేధా సంపన్నులు కొందరు మనదేశానికి, ఏనాడు లేనంత ఎక్కువగ, భావదాస్యంచేస్తూ వలస వచ్చి యజ్ఞయాగాదిక్రతువుల్లో పాల్గొంటుంటే - ఇక్కడి మిడిమిడిజ్ఞానులు ఈసడించుకుంటున్నారు - ఇహాపరసాధనమైన మన తాత్వికదృష్టిని! అంతేకాదు - ఎవరో భయస్థులు, భయంకర వ్యాధిగ్రస్తులు, చాదస్తులు, మూఢులు మాత్రమే మానవాతీతమైన దేవుని గూర్చి కలలు కంటారనే అపవాదం ప్రబలింది. నవీన యుగంలో ఏ అగ్రరాజ్యాలను లౌకిక భోగధామాలుగ సామాన్య శాస్త్ర విజ్ఞానం మార్చిందో, అదేధోరణి అక్కడి మానవజీవితాలను కోరికల కార్చిచ్చుగ కూర్చింది. సౌలభ్యాలను, సౌకర్యాలను క్రుమ్మరించిన సాంకేతికవిద్య ప్రజల తీరికను పెంచి - తద్వారా మానసిక, దైహిక పారతంత్ర్యం కల్గించి, లేనిపోని బాధలు నించింది. వెలుగును నీడవలె, భౌతికమైన ఆదాయాన్ని భయంకరమైన వ్యయమొకటి వెన్నాడుతూనే ఉంటుంది. మహత్తరమైన అణుశక్తిచేత తక్కువవ్యవధిలో ఎక్కువఫలితం సాధించినా, ఇంధనానికై మిగిలిన వ్యష్టి (Nuclear waste) అతి ప్రమాదకరమైనది. దాన్ని గుప్తంచేయడం ఒక సమస్య. అడ్డదారి ఏనాటికీ నిష్కంటకం కానట్లు - ప్రతిదెబ్బకూ తగుమైన ఎదురుదెబ్బ తప్పనిసరి ఐనట్లు - సామాన్యశాస్త్ర ప్రసాదాలన్నీ దుష్టాదుష్ట మిశ్రమబాధితాలే!

దేవునిమీద నమ్మకం చేతకానితనానికి భద్రకవచం అని దెప్పిపొడిచే నవీనులు - హేతువాదధురీణులు కొన్ని నిత్యసత్యాలను అతితేలికగ విస్మరిస్తారు. ప్రతివ్యక్తికీ, పాలిచ్చి పెంచిన తల్లి మాతృత్వం ప్రత్యక్షానుభవమైతే, ఆ తల్లి వేలెత్తిచూపి పరిచయం చేసిన తండ్రి ఋజుత్వం, అనుభవంమీదకాని ఏర్పడదుకదా? ఏ బిడ్డ తల్లిని ప్రశ్నించగలదు, తన తండ్రి పితృత్వాన్ని గూర్చి? జీవితంలో అమాయకమైన నమ్మకం మొదట; ఆ తరువాత పెరుగుదలతోపాటు అన్ని సత్యాల ఎఱుక. సృష్టికర్త రక్ష, తల్లిప్రేమవలె, మాటవలె, అందర్ని ప్రభావితుల్ని చేస్తుంది. సృష్టికర్త అంతర్యం - చిన్నవానికి, తండ్రియని చూపబడిన పురుషుని ప్రత్యేకత అనుభవించిన మీదటగాని తెలియదు. ఇంతెందుకు? సామాన్యశాస్త్ర విజ్ఞాన పరిశోధకులు కూడ మొదట సిద్ధాంతమనే నమ్మకంతో మొండిగ ఒడంబడిక చేసుకుని, ఆ తరువాత ప్రయోగాల ద్వారా, ఆ నిశ్చితాభిప్రాయానికి ఋజువులు వెతుకుతారు. ఆ యా సిద్ధాంతాల, ప్రయోగాల ఉపయోగం నిస్సంశయమనే నమ్మకమే కదా వారి మొదటినైజం! పరిశోధనలకు ఎన్ని జీవాలనో, ఎంత కాలాన్నో కోట్లకొలది ధనాన్నో వెచ్చించి, చాలమార్లు నిష్ఫలులైన వీరే, యజ్ఞయాగాది క్రతువుల్లో హోమకపదార్థాలు బూడిద చేస్తారని సనాతనులను విమర్శిస్తారు. వారుచేసేవి ప్రయోగాలు; వారి కర్థంకాని బహుళార్థ సాధక ప్రయోజనాలు వారి

దృష్టిలో వ్యర్థాలు. వారి వ్యోమగామాలకైన ఖర్చు ఏమాత్రపు వాస్తవికాదాయాన్ని, జిజ్ఞాసాతృప్తిని వెలార్చిందీ, అందరికీ తెలుసు. సామాన్యశాస్త్ర ప్రయోగాలద్వారా ఎంత తక్కువ తెలుసుకుంటే అంతకన్నా ఎక్కువ తెలియజాలనిది స్ఫురించి వారిని దిగ్భ్రాంతులను చేస్తోంది. అంతరిక్షాన్ని అంతో ఇంతో కొలిస్తేనే వీళ్ల వింత - విస్మయం నిబిడీకృతమౌతుంది.

కంటికి కనబడినది నిజం - తదితరం నాస్తి అనుకునేవారికైనా, ప్రత్యక్షంగా జన్మదాతలున్నారుకదా! శూన్యమునుంచి ఏమీ పుట్టుకుని రాలేనప్పుడు, ఈ జగానికంతా ఒక కర్త, ఆదిగా ఉండక తప్పదు. ఐతే విజ్ఞానులు కొందరు; 'విశ్వానికి మొదట ఉన్న శూన్యంలో అసంఖ్యాకమైన అణువులు తేలియాడుతూఉండి, ఆ తరువాత కొన్నికొన్ని అణువులు ఒక్కొక అణుసముదాయంగా ఏర్పడినాయి. ఈ ఒక్కొక అణుసముదాయము ఒక్కొక వస్తువో, ప్రాణో, పుట్టో, చెట్టో అయింతరువాత క్రమంగా పరిణితి చెంది నేటి సృష్టి వెలసిం'దంటారు. కాని, శూన్యంలో విచ్చలవిడిగా తేలియాడ్తోన్న అణువుల మధ్య ఏ క్షణంలో, ఎందుకని అణుసముదాయాలు తారసిల్లడం జరిగిందో వీరు చెప్పరు. సృష్టిరీతులన్నీ అనేకతకు, వైవిధ్యానికి తార్కాణాలైనా, సాంతసృష్టిలో ఒక్కొక రీతికీ, ప్రతి జాతికీ - పిపీలికాది బ్రహ్మపర్యంతం, ఏకంగా విశిష్టతగా, ఒక్క గానొక్క కోరికమాత్రం, క్రమబద్ధంగా ఉంది: అదే సుఖాన్ని పొందగోరడం; దుఃఖాన్ని దూరం చేసుకోవడం సర్వ జీవరాసులకు ఒకటిగా ఉన్న ఈ విచారణ, విచక్షణ, మనోధర్మం ఎలా సాధ్యమైంది? అణువులు అసంఖ్యాకం; అణుసముదాయాలు వేరు వేరు; ఐనా అన్ని అణుసముదాయాల విభిన్నతలో ఆశయ ఏకత ఎలా కుదిరింది? బుద్ధిమంతులందరికీ ఋణమేదో, ధనమేదో, చావేదో, బ్రతుకేదో, మంచిచెడ్డల మిశ్రమ నేపమేదో, మిత్తి తరువాయి పొత్తు ఏదో, అనే విచారణ ఒకటై - సృష్టిలో ఒక సమైక్యతను సూచిస్తుంది. భిన్నభిన్నరీతుల సృష్టిసముదాయంలో సమగ్రమైన ఈ స్వభావం ఒకటిగా ఉన్నందువల్ల - ఈ సృష్టి ఒక్క సంకల్ప పరిణామమేగాని, విచ్చలవిడియానాల తేలిన అణువులు ఉన్నట్టుండి ఉమ్మడి కుటుంబాలుగా వెలసినట్టి అసంభావ్యం కానేరదు. ఇటువంటి ఉత్కృష్టమయిన సృష్టికి ఎవరు కర్త? ఏమిటీ పరిణామం? ఎందుకో సంకల్పం?

సృష్టి ఎలా కుదిరిందని తర్జనభర్జన చేయడంలోనే నిమగ్నులైన నవీన విజ్ఞాన వల్లభుల్లో కూడ ఈ మధ్య గడ్డుసందేహాలు, అసహాయతాలాపాలు, విస్మయమానాలు బయలుదేరాయి. సృష్టికి ప్రతిసృష్టి చేస్తూ, తన్మూలంగా సృష్టి వితరణ అవగాహనై తృప్తికి ప్రయత్నిస్తారు వీరు. సృష్టికారణం వీళ్ళకు అనవసరం- లేదా సృష్టిరహస్యాలన్నీ భేదించి, బోధపరచుకుంటే, సృష్టి కారణం అవగతమౌతుందని వీరి నమ్మకం. దృగ్గోచరమైన సృష్టికే పరిమితమైన వీరి పరిశోధనలు, ఎంతగా లోపదోషభూయిష్ఠాలో సూక్ష్మబుద్ధికి సువిశదం. ఉదాహరణానికి, నవీన విజ్ఞానశాస్త్ర పరిశోధనా ఫలితమైన ధాతు సంయోగకృత C వైటమిన్ (synthesized C Vitamin) ని తీసుకుందాం. అసలు, ప్రకృతిలో సహజంగా ఈ C Vitamin అనబడే ఒకానొక ఆహారపు విలువ లేక తత్వం, నిమ్మవంటి తాజా పండ్లు వగైరాలలో లభ్యమని కనుగొన్నారు. అస్కార్బిక్ ఆమ్లము (Ascorbic acid) అను పదార్థమే ఈ C వైటమిన్. దీని కణరూపాన్ని

ప్రయోగశాలలో కనిపెట్టి, ఆ తరువాత కృత్రిమంగ ఆయా కణధాతువుల సంయోగం ద్వారా అస్కార్బిక్ ఆమ్లాన్ని తయారు చేశారు. ఈ కృత్రిమ సంయోగక్రియవల్ల, అమూల్యమైన ఈ C వైటమిన్ అతిచౌకగ, భారీఎత్తున తయారుచేయ గలగడం, తద్వారా, ప్రకృతిలో దొరికే మూలవస్తువుల పంటా - కూర్పూ. వంటా - వార్పూ, సాధకబాధకాలు తొలగించడం వీరి అభినందనీయమైన కృషి ఫలితం. ఐతే కృత్రిమ సంయోగక్రియద్వారా సాధించిన ఈ C వైటమిన్ కణాకృతీ, రంగుల తీరూ, ప్రకృతిలో లభ్యమయ్యే C వైటమిన్ కణాకృతీ, రంగుల తీరునకు భిన్నంగ ఉందని **ఒక ప్రత్యేక రసాయనిక ప్రయోగంద్వారా (chromotography) స్థిరపరచారు. అంటే— హనుమంతుని ముందు కుప్పిగంతు లన్నట్లు - సృష్టికి ప్రతిసృష్టి. వైజ్ఞానిక విప్లవం ద్వారా సంపూర్ణం కావడం అసంభవమే కాదు - తత్ఫలితం హాస్యాస్పదం కావచ్చునన్నమాట! రేపు వీరు సృజించే పరీక్షానాళికలోని శిశువు (test-tube baby) ప్రకృతిసహజంగ కలిగేసంతానానికి సాటికాబోదని అర్థమౌతూనే వుంది. నక్కలు వాతపెట్టుకుంటే, పులు లౌతాయా? ఒళ్లు కాలి కొంచం వాతం తగ్గవచ్చునేమో గాని. మన నిత్య రోగాలకు పాశ్చాత్య వైద్యం రూపొందించే మాత్రలు, ద్రావకాలు, తాత్కాలికమైన ఉపశమనానికి పనికొస్తాయేమో గాని, రోగాన్ని నిర్మూలం చేయవు. సామాన్య శాస్త్రవిజ్ఞానం మన కందించే సవ్యమైన నిరపాయకరమైన నిర్దుష్టమైన సౌకర్యాలు ప్రశంసనీయాలే.

(సశేషం)

# పరిప్రశ్న

[మద్రాసు శ్రీ రామకృష్ణమఠమున 14-5-72వ తేది జరిగిన అంతర్యోగమున శ్రీమత్తపస్యానందస్వాములతోడి ప్రశ్నోత్తర సంగ్రహము.]

ప్రశ్న : మానవసేవయందు సంపూర్ణమగు అభిరుచి లేక అట్టి సేవ ఎట్లు సాధ్యమగును? ఆ కర్మయందు ఆసక్తి (సంగము) లేక అట్టి అభిరుచి ఎట్లు కలుగగలదు? కనుక నిస్సంగ కర్మాచరణ సిద్ధాంతము నంగీకరించినచో నిక్కమైన దక్షతతో కూడిన సేవకుగల ప్రోద్బలమంతయు తొలగిపోదా? ఇట్లు అభిరుచిగాని ఆసక్తిగాని లేని కర్మవలని లాభమేమి?

ఉత్తరము : అభిరుచి రెండువిధములు, వ్యక్తిగతమైన అభిరుచి, నిర్వ్యక్తికమైన అభిరుచి అని. వైయక్తికమైన అభిరుచి ఎప్పుడును వ్యక్తిగతలాభమును గూర్చిన ఆలోచనవలననే జనించును. క్రమశిక్షణకును ఒక నీతినియ

** Dr. M. J. స్మిత్ అను అమెరికాలోని రోస్‌వెల్ సంస్థలో వైజ్ఞానికశ్రేష్ఠుడు కనుగొన్న వింత సత్యం గతసంవత్సరం బాహాటంగ దినపత్రికల్లో గూడ ప్రకటితమైనది.

మముల మర్యాదకును లోబడియున్నచో ఈ ప్రోత్సాహమువలన మానవుడు సంఘపురోగతికి ఎంతయో చేయవచ్చును. ఇచ్చట అనుసరింపవలసిన సామాన్యసూత్రము ఇచ్చిపుచ్చుకోలుమాత్రమే. ఇదియే సాధారణముగ నమలులోనున్న న్యాయము కూడ.

నిస్సంగము లేదా నిర్వ్యక్తికమైన అభిరుచి, ఒక ఉన్నతతరమగు ఆలోచనాపథమును జీవనసరళిని అందుకొనినవారికి ఉద్దేశింపబడినది. ఇట్టివారు, వ్యక్తిగతలాభమునకు మాత్రమే పనిచేయుట తమకొఱకుమాత్రమే జీవించుటవలన జీవితమునకు సార్థక్యము లేదని భావింతురు. మానవప్రయత్నమునకు, వ్యక్తిగతలాభముద్వారా లభించు అభిరుచికంటె శ్రేష్ఠతరమైన అభ్యనుజ్ఞ వీరికి కావలెను. నిస్సంగకర్మాచరణము వీరికిమాత్రమే అనువర్తించును.

పై ప్రశ్నయందు ప్రతివారును నిస్సంగకర్మాచరణమను ఆదర్శమును పాటింపవచ్చుననియు, ఆఆదర్శమును పాటింప సమర్థులనియు, ఆ ఆదర్శమునే పాటింపవలయుననియు అనుక్తముగ స్వీకరింపబడినది. ఇది సరికాదు. కర్మవలన తనకు లాభము కలిగిననే కర్మ నాచరింప నిచ్చగించువాడు నిస్సంగములోను ప్రేమసాంద్రతతోను మానవసేవ చేయజాలడు. ఇచ్చిపుచ్చుకొనుట మాత్రమే అతని న్యాయము.

గౌణమగు ఆత్మకొఱకు మాత్రమే జీవించుట నిరర్థకమని భావించువారియందు, విస్తృతములు ఉన్నతములు అగు ఆదర్శముల, ఉద్యమముల, తోడి తాదాత్మ్యమువలన కలుగు ఉన్నతాశయముల వలననే కర్మయందభిరుచి కలుగజేయనగును. ఆ విధముగ సంఘసేవ దేశసేవ మానవసేవ భగవత్సేవ అనునవి అట్టి ఉన్నతతరపరిణతి నందినవారికి కర్మచోదనములైనవి. అట్టి కర్మయందు అభిరుచిగాని ఆసక్తిగాని లేదని భావించుట సరికాదు. వ్యక్తిగతముగ తమ కేమియు లాభింపకపోయినను ఉన్నతలక్ష్యములకై ఎంతయో ఉత్సాహమును ఆసక్తిని ఎందఱో ప్రదర్శించిరి. నిస్సంగమనగా నిర్లక్ష్యము కాదు – వ్యక్తిగతమగు లాభము నాశింపని ఉత్సాహము మాత్రమే.

సేవయేగాని కర్మయేగాని అది భక్తిభరితజీవనమునందు ఒకభాగమైననే అందు నిక్కముగు పరిపూర్ణమగు కార్యవత్తాయుతమైన నిస్సంగము సాధ్యమగును. అన్ని ప్రపంచములును భగవంతునివే యనియు మన నూతని వినమ్రములమైన సేవకుల మనియు భగవంతుడు మనకు కొన్ని బాధ్యతల నప్పగించినాడనియు మన జీవనరాగము స్పందింపవలెను. మనకు గల దైహిక మానసిక శక్తియంతయు భగవదనుగ్రహమనియు మనము కేవలము నిమిత్తమాత్రులము జయాపజయములు అతని ఇచ్ఛాధీనములే యనియు మనము భావింపవలెను. భక్తిసాధనచేత ఇట్టి భావనయందు సుస్థిరులమైననే మనము నిక్కముగ నిస్సంగుల మగుదుము. దేవుని పని భావించి లక్ష్యముకొఱకై పనిచేయుచున్నను అత్యంతము ఉత్సాహవంతులము కాగలుగుదుము. నిస్సంగమును పూర్తిగా సాధించుటకు నిమిత్తమాత్రతకూడ ఆవశ్యకము. నిమిత్తమాత్రత నిర్వ్యక్తిక విలువలగు దేశభక్తి మానవసేవ మొదలగు వానిని భక్తిభావము బలపరచిననే సాధ్యమగును.

ఇక నిస్సంగకర్మకు ఫలమేమనుప్రశ్న: వ్యక్తిగతమగు లాభముదృష్ట్యా మాత్రమే ఆలోచింపగలవారికి ఈ ప్రశ్న సంబద్ధమగును.

తనవిధి సక్రమముగ నిర్వర్తింప బడినదను భావనయే, ఒక లక్ష్యము నెరవేరుటకు ప్రయత్నము జరుగుటయే వారికి ప్రతిఫలము. ఈ ప్రతిఫలము పరిమాణాత్మకముగాక గుణాత్మక మగుటచేత వ్యవహారార్థములో ప్రతిఫల మనిపించుకొనదు. ఇట్టిది మన యాత్మభావమును శ్రేష్ఠతరము చేయును, శ్రేష్ఠతరులగు స్త్రీ పురుషులను చేయును, ఆధ్యాత్మిక పరిణతి యందు పురోగమింప జేయును.

భక్తిభావముతో నిస్సంగులై కర్మనాచరించువారు భగవత్కృపకు పాత్రులగుదురు. శ్రీరామకృష్ణు లిట్లనిరి, "సంవత్సరముల పర్యంతము ఒక సేవకుడు తనగూర్చిన యాలోచనయే లేక యజమానిని సేవించును. వాని పట్ల సంప్రీతుడైన యజమాని అతనికి అర్ధాసనమిచ్చి గౌరవించును. అతడు తానేయనియు ఎల్లరును అతనికి విధేయత చూపవలెననియు అత డందఱితో చెప్పును. భగవదర్థమై స్వార్థలేశమును లేక కర్మనాచరించువానిని భగవంతుడు తనదగు పరమపదమున కుద్ధరించును."

శ్రీ శంకరభగవత్పాదుల వేదాంతసిద్ధాంతము ననుసరించి నిస్సంగమగు కర్మ చిత్తశుద్ధిని కలుగజేసి సాధకుని జ్ఞాననిష్ఠకు అర్హునిగ చేయును.

## వార్తలు - విశేషాలు

### శ్రీ శంకర రామానుజ జయంతి

శ్రీ శంకర రామానుజ జయంత్యుత్సవము మద్రాసు శ్రీరామకృష్ణమఠమున 15-5-75 నాడు జరుపబడినది. 18-5-75 నాడు సార్వజనిక సభ నడచినది. శ్రీవివేకానంద సెంటెనరి మందిరమున ఆబాలవృద్ధులు బహు సంఖ్యాకులగు భక్తులు ఆనాడు సమావిష్టులైరి. శ్రీమత్తపస్యానందస్వామివారి యధ్యక్షతను పండితులును ప్రొఫెసరును అగు శ్రీవి. కల్యాణసుందర శాస్త్రిగారు శ్రీ శంకరుల జీవితమును గూర్చి ఉద్యమమును గూర్చి తమిళమున నుపన్యసించిరి. భారతీయ సంప్రదాయము లన్నింటి యందును సామాన్యముగా గల సామరస్య భావమును గూర్చియు, అన్ని మార్గములును భగవత్సాక్షాత్కారమునకు గొనిపోవు నిచ్చెన యందలి మెట్లని అన్ని సంప్రదాయములకును గల యభిప్రాయమును గూర్చియు వారు ప్రస్తావించిరి.

శ్రీ రామానుజులు ఆదిశేషుల యవతారమనియు శ్రీ మధ్వాచార్యులు వాయుదేవుని యవతారమనియు భావింపబడునట్లే శ్రీ శంకరులు శివావతారమని జనుల విశ్వాసమని వారనిరి. శ్రీ శంకరులు చిరుత ప్రాయముననే అసాధారణమైన బుద్ధిపరిణతిని ప్రదర్శించి బాల్యముననే వారి జీవిత కార్యమును చాల వరకు పూర్తిచేసిరి. సర్వశాస్త్రపాండిత్యమును వారికి సహజముగనే అబ్బెను. ఎనిమిదేండ్ల ప్రాయముననే సన్న్యాసము స్వీకరించి వారు దైవనిర్ణీతులైన తమ గురుదేవులను శ్రీగోవిందాచార్యులను నర్మదా ప్రాంతీయులను దర్శింప బోయిరి. వారినుండి ఉన్నతతమ మగు జ్ఞానమును గ్రహించి పిదప వైదిక సంస్కృతిని ప్రచారము చేయుటకై తమ జీవితమును ధారవోసిరి. ప్రస్థానత్రయముపై మకుటాయమానమైన భాష్యములను వ్రాసి జనరంజకము లగు స్తోత్రముల ననేకములను రచించిరి. వేదాంత సారస్వతమునకు వారి యుపహారము మహనీయము, శాశ్వతము. వారు సాధించిన దానిని

అతిమానుష పురుషుడే సాధింపగలడు. విధి లిఖితమైన యాయువు వారికి పదునారేండ్లే యైనను వేదవ్యాసమహర్షి ఆవయస్సున వారు సాధించిన దానికంటె ఇనుమిక్కిలి సాధించుటకై వారి యాయుష్యమును మఱప్పుడు రెండేండ్లకు పెంచెనని చెప్పుదురు. విఖ్యాతిగన్న పండితులనెల్ల స్వయముగ కలిసికొని దుష్ట సిద్ధాంతములయందును అసంగత విశ్వాసములయందును జనుల మూఢనమ్మకములను సమయజేసి దేశమును శ్రీ శంకరులు పునరుజ్జీవితముగ చేసిరి.

పిదప శ్రీ ఎస్. ఎస్. రాఘవాచార్ గారు ఆంగ్లమున శ్రీరామానుజులగూర్చి సంభాషించిరి. భావోద్విగ్నమై ప్రమాణయుతమైన యుపన్యాసమున వీరు విశిష్టాద్వైత సిద్ధాంతమును స్పష్టముగ వివరించి భారతీయ తత్త్వశాస్త్ర వైభవమునకు శ్రీరామానుజుల కృషిని గూర్చి ఘంటారావముగ నుపన్యసించిరి. శ్రీ రామకృష్ణుల సందేశమున విశిష్టాద్వైత సిద్ధాంతము లెన్ని ప్రతిఫలించుచున్నవో ప్రదర్శించుచు వారి శిష్యసత్తముడగు శ్రీ రామకృష్ణానందస్వామి శ్రీ రామానుజుల యాత్మకథను వ్రాయుటను తెల్పిరి. శ్రీరామానుజులు ఏకాకియైన తాత్త్వికుడు కాదు. వేదములనుండి ప్రవహించు సంప్రదాయమునందు, విశిష్టాద్వైత సిద్ధాంతములను మాటిమాటికిని తలపింపజేయు వేదసంప్రదాయమునందు, విరిసిన కుసుమరాజము. శ్రీరామానుజులు బృహత్తరములగు భాష్యములను వ్రాసిరి. వారి పాండిత్య ప్రకర్ష ఎట్టిదనగా ప్రతిపక్షుల యభిప్రాయములను వారికంటె స్పష్టముగ ప్రతిపాదించి ఖండించువారు. వారి రచనాశైలి స్పష్టము గంభీరము. వారి స్వాతంత్ర్యము అరమరలు లేనిది. అవసరమగుచో తన గురువులనుండి కూడ విడిపోవగల్గెను. భగవంతునియెడ భక్తిభావమును శిఖరాయమానముగ చేసి ముక్తికంటెను కూడ భక్తియొక్క శ్రేష్ఠతను ప్రకటించిరి. శ్రీరామానుజుల కృపాళుత మితిలేనిది. వారి సిద్ధాంతోద్ఘాటనము స్ఫటికమువలె స్వచ్ఛమైనది. వారి నారాయణు డను తత్త్వమును ప్రపత్తిని గూర్చి వారి యభిప్రాయములను వారి బుద్ధి నైశిత్యమును ప్రకటించుచున్నవి.

సమావేశమును పరిసమాప్తి చేయుచు శ్రీమత్తపస్యానందస్వామి ఆధునిక కాలమున నన్ని తత్త్వశాస్త్ర సంప్రదాయములును ఏకమై ప్రపంచమునకు ఉన్నతములును నిర్మాణాత్మకములును అగు దృక్పథములను ప్రదర్శింపవలసిన ముఖ్యావశ్యకతను వక్కాణించిరి. ప్రాతకాలపు దోషగణనము పరమతఖండనము స్థానమున ప్రజ్ఞాయుతమైన సహనము విశాలదృక్పథము రావలసిన సమయ మేతెంచిన దని వారనిరి.

## బుద్ధ జయంతి

బుద్ధుని జన్మము జ్ఞానోదయము నిర్వాణములతో ముమ్మారు పావనమైన బుద్ధ పూర్ణిమ దినమును మద్రాసు శ్రీరామకృష్ణ మఠము 25-5-75 న జరుపుకొనినది. ఫిజియందలి రామకృష్ణమిషను స్వామి యగు శ్రీ రుద్రానంద స్వామివారు అధ్యక్షత వహించిరి. ప్రొఫెసర్ సి. ఎస్. రామకృష్ణన్ గారు సభాసదులకు అధ్యక్షులను ఆ సాయంతనపు వక్తలిరువురను పరిచయము చేసిరి. శ్రీ రుద్రానందస్వామివారు ధర్మసంస్థాపనమున బుద్ధుని విప్లవాత్మకతను, ఆయన ప్రారంభించిన యుద్యమము శతాబ్దములుగ చేయుచున్న మానవసేవను, గూర్చి పండిత పామరరంజకముగ నుపన్యసించిరి. భారతీయులు బౌద్ధులని పిలువబడక పోయినను అంతర్యమున బుద్ధునెట్లు ప్రేమించునదియు వారి నెట్లనుసరించునదియు వివరించిరి. సనాతనధర్మమునందు

బుద్ధునకు తప్పక స్థానమున్నది. హైందవసంప్రదాయమున వ్యక్తికంటెను సిద్ధాంతమునకే ప్రాముఖ్యము. పేరునకు భారతదేశము బౌద్ధదేశము కాదు కాని తథాగతుని బోధలన్నియు హైందవధర్మమున అంతర్లీనము లైనవి. బౌద్ధధర్మమునకు అశోకుడు చేసినసేవ మరపురానిది. ప్రభుత్వనిర్వహణము ఎంత ఉదాత్తముగ సక్రమముగ నెఱపవచ్చు ననుటకు అన్ని ప్రభుత్వములకు రాష్ట్రములకు అశోకుని రాజ్యతంత్రమే నిదర్శనము. బుద్ధుడెన్నడును సాగరతరణము చేయలేదు. కాని వారి సందేశము భారతదేశమున కతివర్తించు ప్రభావము గలది. బుద్ధుని వంటి ఆధ్యాత్మిక సింహములు అవతరించుట వలననే భారతదేశము పుణ్యభూమి యైనది. బుద్ధుని వ్యవస్థాపకశక్తి యప్రతిమానము. వారి యుపదేశములు అతి సరళములు. విస్పష్టములు. జనసామాన్యమునకు తప్పించుకొనలేని యాకర్షణ కలిగినవి. వారి యష్టాంగమార్గము ఒక గొప్ప సంప్రదాయము. వైయక్తిక సామాజిక పురోగమనమునకు బౌద్ధధర్మము ఎంతగనో తోడుపడినది.

తరువాత మాటలాడుచు శ్రీ అన్నా ఎన్. సుబ్రహ్మణ్యంగారు శ్రీ రామకృష్ణమఠమువారు క్రీస్తు జయంతిని బుద్ధ జయంతిని వారి సాంవత్సరిక పవిత్రోత్సవముల పట్టికయందు చేర్చుట యందలి యంతర్భావమును ప్రస్తావించిరి. అవి శ్రీరామకృష్ణుల విశ్వజనీనత యభ్యసనము. భారతీయుల ఆధ్యాత్మిక సంస్కృతిపై బుద్ధుల ప్రభావము అపారము. మన దేశమున వ్యవస్థీకరింపబడిన ధర్మము బుద్ధునకు చాలవరకు ఋణపడి యున్నది. వారి త్యాగము తపము అసాధారణమైనవి. నిరర్థకములగు అతివాదములను వదలి మధ్యమపద్ధతి నవలంబించుటపై వారి యుద్ఘాటనము గీతాసిద్ధాంతమునకు ప్రతిధ్వని వంటిది. వారి దయార్ద్రత ఎంత గంభీరమనగా వారి సంప్రదాయమున స్త్రీలకు కూడ స్థానమును నిరాకరింప లేకపోయిరి. వారు బుద్ధకల్పద్రుమ మని కీర్తింపబడుట అన్వర్థమే.

అంత్యమున ప్రసంగించుచు ప్రొఫెసర్ కె. శేషాద్రిగారు బుద్ధునను ఉపనిషత్తులును ఒకటే సిద్ధాంతమును ప్రవచించుటను ఉగ్గడించిరి. వారి యాలోచనా రీతిలో తప్ప ముఖ్యమగు భేదమేమియు లేదనిరి. వేదాంతము పారమార్థిక ప్రధానము కాగా బుద్ధుడు వ్యావహారికముతో ప్రారంభించి మానవుల దృష్ట్యా నిర్మాణాత్మకమార్గము నేర్పరచెను. దుఃఖమే మానవునికి ప్రపంచమున గతి యని యతడు గ్రహించెను. వేదాంతముకూడ ఈ ప్రాపంచిక జీవనము "దుఃఖాలయ మశాశ్వత"మని నిర్వచించినది. మానవుడు మండుచున్న ఇంటియందు వసించుచున్నాడు. అతని తక్షణ కర్తవ్యము అందుండి వెలువడుటయే. నిస్సారములు భ్రాంతిమాత్రములు అగువానిని త్యజింపవలెను. ఇట్టి యనేకము లగు నుపదేశములందు వేదాంతము బౌద్ధము ఏకవాక్యతను ప్రకటించుచున్నవి. అహంకారమును త్యజింపవలెనని వేదాంతము చెప్పినదంతయు బుద్ధుడుకూడ చెప్పెను. కాని మానవు డెవరో వాని నిజ స్వరూపమేమో బుద్ధుడు వివరింపలేదు, అది తెలిసికొనుటకు చివరకు వేదాంతమే ఆశ్రయనీయమైనది.

# శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-600004

## 1975-వ సంవత్సరము, ఆగష్టు మాసమున జరుగనున్న

## ఉత్సవ కార్యక్రమము

**శ్రీరామకృష్ణానందస్వాములవారి జన్మదినోత్సవము**

5-8-75 గురువారము: తిథిపూజ (ఉదయము 5 మొదలు 12 వరకు) ప్రత్యేకపూజ హోమము.

10-8-75 ఆదివారము: బహిరంగోత్సవము:

అపర్ణాహము 3-30 మొదలు 5-30 వరకు బ్రహ్మశ్రీ వి. ఎస్. వేంకట్రమణారావుగారిచే 'భక్తకనకదాసు' హరికథాకాలక్షేపము.

5-30 ,, 7-30 ,, బహిరంగోపన్యాసము.

అధ్యక్షులు: శ్రీమత్ కైలాసానందస్వాములవారు, (శ్రీరామకృష్ణసేవాసంఘముల సర్వోపాధ్యక్షులు, బేలూరు.

ఉపన్యాసకులు: (తమిళము) ప్రొఫెసరు ఆర్. రాధాకృష్ణన్‌గారు, నేషనల్ [కాలేజి తిరుచ్చి.

(ఆంగ్లము) ప్రొఫెసరు K. గణేశన్‌గారు, వివేకానంద కాలేజి, [మద్రాసు.

**శ్రీకృష్ణ జయంతి**

29-8-75 శుక్రవారము: జన్మాష్టమి: ఆరతి అనంతరము భాగవత పఠనము.

31-8-75 ఆదివారము: ఉదయము 8-30 మొదలు 10-30 వరకు భగవద్గీతా పారాయణము (పూర్తిగ)

,, అపర్ణాహము: 4-00 మొ. 6-30 వరకు. బహిరంగోత్సవము; అధ్యక్షులు శ్రీమత్ తపస్యానందస్వాములవారు.

ప్రత్యేకోపన్యాసములు: 6-30 గంటలకు విషయము: షడ్దర్శనములు.

ఉపన్యాసకులు: డాక్టరు టి. ఎం. పి. మహాదేవన్‌గారు 1-8-75, 2-8-75, 4-8-75, 6-8-75, 7-8-75, 8-8-75, 9-8-75.

**ఆదివారములందు సత్సంగ సమావేశములు**

అపరాహ్ణము 4-00—4-20 వరకు లలితా సహస్రనామ పారాయణము (17-8-75)

,, ,, ,, శ్రీవిష్ణు సహస్రనామ పారాయణము (3-8-75, 24-8-75)

4-20—4-30 ,, ధ్యానము

4-30—5-30 ,, తమిళమున ఉపన్యాసములు:—

శ్రీవిష్ణుసహస్రనామము: శ్రీ వి. కల్యాణసుందరశాస్త్రిగారు (3-8-75)

వివేకానంద చరిత్రము (సంగీత ప్రవచనము): శ్రీ మంత్రముగారు (24-8-75)

శ్రీదక్షిణామూర్తి స్తోత్రము: డాక్టర్ టి. ఎం. పి. మహాదేవనుగారు (178--75)

5-35—6-30 ,, ఆంగ్లోపన్యాసములు:—

శ్రీమద్భగవద్గీత: శ్రీమద్విమలానందస్వాములవారు

6-30—8-00 ,, ఆరాత్రికము - భజన

**ప్రత్యేకోపన్యాసములు**

16-8-75 శనివారము: 5-45 శ్రీమద్రామాయణ పఠనము: శ్రీ పి. రామకృష్ణన్‌గారు, ఐ.సి.ఎస్. (రిటైర్డు)

23-8-75 ,, 5-30 శ్రీమద్రామాయణము: డాక్టర్ ఎన్. వీరనాథన్‌గారు

**ఇతర వారములందు ఉపన్యాసములు: అపరాహ్ణము 5-45 గంటలకు**

సోమవారములు: విష్ణుసహస్రనామము (ఆంగ్లము) శ్రీమత్ వీతమోహానందస్వాములవారు

మంగళవారములు: అధ్యాత్మరామాయణము (ఆంగ్లము) శ్రీమత్ గభీరానందస్వాములవారు

బుధవారములు: శ్రీమద్భాగవతము (ఆంగ్లము) శ్రీమత్ గోలోకానందస్వాములవారు

గురువారములు: అముదమొళ్లి (తమిళము) శ్రీమత్ శ్రీరంగానందస్వాములవారు

శుక్రవారములు: ఆత్మబోధ (తమిళము) శ్రీ ఆర్. రామకృష్ణన్‌గారు

24-8-75 ఆదివారము: అంతర్యోగ సాధన

ఉభయ ఏకాదసులయందు సాయంకాలిక ఆరాత్రికానంతరము శ్రీరామనామ భజన (3-8-75; 17-8-75)

21-8-75 గురువారము శ్రీనిరంజనానందస్వామి జయంతి.

శుక్రవారములందు సాయంకాలము 6-30 గంటలకు తిరువళ్లిక్కేణియందలి దక్షిణమాడవీధియందు 18-వ నంబరుగల రామకృష్ణ మందిరమున శ్రీమత్ గోలోకానందస్వాములవారి భగవద్గీతోపన్యాసములు.

ఈ ఉత్సవము లన్నింటియందును భక్తులెల్లరను పాల్గొని భగవంతుని అనుగ్రహభాగ్యమును బడయగోరుచున్నాము.

అధ్యక్షులు,

శ్రీరామకృష్ణమఠము, మద్రాసు-600004.

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౩౨ ౧౯౭౪ - ఆగష్టు: రాక్షస - శ్రావణము సంచిక ౨


## విషయసూచిక

ఫోను : 71231 పోస్టు బాక్సు : 635

## మా మాసపత్రికలు

# వేదాంతకేసరి

**తత్త్వశాస్త్ర - మత - సంస్కృతివిషయికంగా 1914-వ సంవత్సరంనుండి నడపబడుతుండే ఆంగ్ల మాసపత్రిక**

| | ఇండియాలో | శ్రీ లంకలో | అమెరికాలో | ఇతర విదేశాలలో |
|---|---|---|---|---|
| సాలు చందా : | 8 రూపాయలు | 10 రూపాయలు | 4 డాలర్లు | 1 పౌను |
| జీవిత చందా : | 150 ,, | 200 ,, | 70 ,, | 18 పౌనులు. |

# శ్రీ రామకృష్ణ విజయం

**మత - సాంస్కృతికవిషయికంగా 1921-వ సంవత్సరమునుండి ప్రచురింపబడుతున్న తమిళ మాసపత్రిక**

| | ఇండియాలో | శ్రీ లంకలో | అమెరికాలో | ఇతరవిదేశాలలో |
|---|---|---|---|---|
| సాలు చందా : | 7 రూపాయలు | 9 రూపాయలు | 3 డాలర్లు | £ 0-70 |
| జీవిత చందా : | 100 ,, | 150 ,, | 50 ,, | 12-పౌనులు. |

# శ్రీ రామకృష్ణ ప్రభ

**1944-వ సంవత్సరంనుండి ప్రచురింపబడుతూ విశ్వోపజీవ్యమైన ఆధ్యాత్మిక విజ్ఞానామృతమును వెదజల్లే తెలుగు మాసపత్రిక**

| | ఇండియాలో | శ్రీ లంకలో | అమెరికాలో | ఇతరవిదేశాలలో |
|---|---|---|---|---|
| సాలు చందా : | 7 రూపాయలు | 9 రూపాయలు | 3 డాలర్లు | £ 0-70 |
| జీవిత చందా : | 100 ,, | 150 ,, | 50 ,, | 12-పౌనులు. |

1. చందాదారులు ఉత్తరప్రత్యుత్తరాలలో తమ 'చందాదారు సంఖ్య' నుదాహరిస్తూ విలాసాలను స్పష్టంగా వ్రాయాలి.
2. పత్రిక అందకపోతే మాసాంతానికి మాకు తెలుపాలి.
3. చందాదారులకు మేము ప్రచురించిన గ్రంథాలను 5% తగ్గింపు ధరలకు అందజేస్తాం. వివరాలకు క్రింది విలాసానికి వ్రాయండి.
4. ప్రముఖ సంస్కృతి కేంద్రాలలో ప్రచారంలో ఉన్న యీ ఆధ్యాత్మిక విజ్ఞాన పత్రికలు అడ్వర్టైస్మెంట్లకు చక్కని ప్రాపకాలు. రేట్లకు వ్రాయండి.
5. సమీక్షకు గ్రంథాలు పంపేటప్పుడు రెండేసి ప్రతులు పంపవలసినదని గ్రంథకర్తలకు ప్రకాశకులకు మా ప్రార్థన.
6. ప్రజారంజకములైన మత - తత్త్వశాస్త్ర - సంస్కృతివిషయిక స్వతంత్ర వ్యాసాలను రచయితలు అందజేస్తే సంపాదకులు కమ్మలం కద్దుకొని ప్రచురిస్తారు.
7. పత్రిక స్పెసిమెన్కాపి కోరేవారు 75 పైసల పోస్టేజి పంపాలి.

ఇంకా వివరాలు కావలసినవారు :

మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠం, మైలాపూరు, మద్రాసు-600004

అనే విలాసానికి వ్రాయండి.

'అఖిలవిధ శరణొందుమ, యీ క్షణంబ యతనికృప నీదు ననుభూతి కందు వత్స'

—శ్రీ శారదామణి.

# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౩౨ } ౧౯౭౫ - ఆగస్టు : : రాక్షస - శ్రావణము { సంచిక ౨

ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ !

## ప్రార్థన

## శ్రీ రామకృష్ణ కర్ణామృతము

భక్తానాం హృదయే జాగ్రద్యోగినాం నిటలే స్వపన్
సుష్వపన్ జ్ఞానినాం మూర్ధ్ని రామకృష్ణో జయత్యసౌ.

దైవభక్తుల హృదయమున జాగృతమైయుండు తత్త్వము యోగి జనుల ఫాలమున స్వప్నముల గనుచుండు తత్త్వమును జ్ఞానుల శిరస్సులందు నిదురించు తత్త్వమును ఆ శ్రీరామకృష్ణుడే.

ఏకత్ర సమ్మిళితవిశ్వ శుభస్వరూపా శ్రీదక్షిణేశ్వరపురే విహితాధివాసా
అజ్ఞేషు కీర్ణపరమాత్మసుఖానుభూతిర్జీయాచ్చిరం భరతవర్షమహావిభూతిః.

భరతవర్షమునకు పెన్నిధియగు శ్రీరామకృష్ణుడు చిరము జీవించుగాక. దక్షిణేశ్వర దేవాలయ నివాసి మూర్తీభవించిన సర్వశుభసందోహములును అగు శ్రీరామకృష్ణుడు చిరము జీవించుగాక. అజ్ఞానపంకమున జిక్కిన మానవులకు బ్రహ్మానుభూతినిచ్చు శ్రీరామకృష్ణుడు చిరము జీవించుగాక.

# శ్రీ గురుసూక్తిసుధ

దేవేంద్రనాథ్ బాసు ప్రశ్న : అయ్యా, ఏ అభిప్రాయము గొప్పది — భగవంతుడు సాకారుడనునదియా? నిరాకారుడనునదియా?

శ్రీరామకృష్ణులు : నిరాకారమును గూర్చి రెండు రకముల అభిప్రాయములున్నవి, "పక్వము" "అపక్వము" అని. భగవంతుడు నిరాకారుడను పక్వమైన అభిప్రాయము నిజముగా గొప్పదే. దీనిని సాకారుడగు భగవంతుని ద్వారా అందుకొనవలయును. నిరాకారమును గూర్చిన అపక్వమైన అభిప్రాయమన్ననో — కన్నులు మూసికొనగనే అది యంతయు తమస్సు, బ్రాహ్మసమాజికుల విషయములో వలె.

స్వయంకృతమైన ప్రశ్న : సాకారుడైన భగవంతుడెవరో నీకు తెలియునా?

శ్రీరామకృష్ణులు : నీరు, మంచుగడ్డవలెనే. గడ్డకట్టుకొనుట వలన నీరు మంచుగడ్డ అగుచున్నది. మంచుగడ్డ లోపలగాని వెలుపలగాని నీరే. మంచుగడ్డ నీరు తప్ప మరేమియు కాదు. కాని ఇటు చూడు. నీటికి ఆకారము లేదు. కాని మంచుగడ్డకున్నది. అట్లే అవిభాజ్యమైన సచ్చిదానందము భక్తుని భక్తివలన గడ్డకట్టుకొనినట్లై మంచుగడ్డవలె వివిధ రూపముల దాల్చును.

స్వయంకృతమైన ప్రశ్న : ఆధ్యాత్మిక గురువు పట్ల భక్తి ఎట్లుండునో నీకు తెలియునా?

శ్రీరామకృష్ణులు : ఆధ్యాత్మిక గురువు ఏమేమి పలుకునో శిష్యుడు వెంటనే దానిని దర్శింపగలుగును. అర్జునునకట్టి భక్తియుండెను. ఒకనాడు అర్జునునితో రథమున బోవుచు శ్రీకృష్ణుడాకసమువైపు చూచి ఇట్లనెను. "స్నేహితుడా, చూడు. అచ్చట నెగిరిపోవుచున్న పావురముల గమి ఎంత అందముగనున్నదో!" అర్జునుడు చూచి వెంటనే "ఔను మిత్రమా, ఎంతో చక్కని పావురములు" అని యనెను. మరుక్షణమే శ్రీకృష్ణుడు మరల చూచి ఇట్లనెను. "మిత్రమా! ఏమాశ్చర్యము! ఇవి పావురములే కావు." అర్జునుడు చూచి "అవును సుమా, అవి పావురములు కానే కావు." అనెను. ఇచ్చట విషయము నర్థము చేసికొనుడు. అర్జునుని సత్యసంధతయందనుమానము లేదు. శ్రీకృష్ణుని మెరమెచ్చులకై అతడట్లని యుండడు. కాని శ్రీకృష్ణుని పట్ల అతని కెంత భక్తియనగా అతని వచనములపై నెంత విశ్వాసమనగా అతడేది వర్ణించినను తప్పైనను ఒప్పైనను, దానిని అర్జునుడు తన కన్నులతో నిజముగా చూచును.

స్వయంకృతమైన ప్రశ్న : ఇటు చూడుము. ధ్యానమునకు కూర్చొనుటకు ముందు (తనను చూపుచు) దీనిని ఒకసారి తలచుకొనుము. నేనేల ఇట్లనుచున్నాను?

శ్రీ రామకృష్ణులు : నీకు ఇచ్చట నమ్మకమున్నది కనుక. దీనిని తలచుకొనుట నీకు భగవంతుని జ్ఞప్తికి తెచ్చును. దీనిని గమనింపలేదా? ఆవుల మందను చూచినచో ఆలకాపరి జ్ఞప్తికి వచ్చును. పుత్రుని చూచినచో అతడు తండ్రిని జ్ఞప్తికి తెచ్చును. న్యాయవాదిని చూచి న్యాయస్థానమును గుర్తుకు తెచ్చుకొనును. ఈ విషయమున కూడ నట్లే. అర్థమైనదా? మనస్సు ఇచ్చటను అచ్చటను ఎల్లెడలను విరజిమ్మబడియున్నది. (తనను చూపుచు) దీనిని తలచుచున్నచో అది ఒకచోట సమకూడును. అప్పుడు దైవోన్ముఖము చేసినచో సరియగు ధ్యానము కొనసాగును.

స్వయంకృతమైన ప్రశ్న : ఆధ్యాత్మిక భావముల వలననే భగవంతుని సాక్షాత్కరించుకొన సాధ్యమగును. అవి లేనివానికి భగవత్సాక్షాత్కారము సాధ్యమా?

శ్రీరామకృష్ణులు : ఆధ్యాత్మిక భావములు ఆవశ్యకములు. ఒక ప్రత్యేకమైన ఆధ్యాత్మిక భావమును పెంపొందించుకొనవలెను. అప్పుడు భగవంతుని పిలువవలెను. "ఎవని భావ మెట్టిదో అతని లాభ మట్టిది; మూలమైనది విశ్వాసమే. భావమునుండియే ప్రేమ జనించును." ఆధ్యాత్మిక భావములు తప్పక ఆవశ్యకములు. అట్టిదే విశ్వాసము కూడ. పట్టు వదలకయుండుట అవసరము. అప్పుడే విజయము సాధింప గలడు. భావ మన నేమో తెలియునా? భగవంతునితో నొక బాంధవ్యము నేర్పరచుకొని దానిని మన కన్నుల ఎదుట ఎల్ల వేళలయందును దీపిమంతముగ నుంచుకొనుట. తినునప్పుడు త్రాగునప్పుడు కూర్చుండునపుడు నిదురించునపుడు మొ॥—దీనినే ఆధ్యాత్మిక భావ మందురు. ఉదాహరణమునకు "నేనతని సేవకుడను" "నేనతని బిడ్డను" "నే నతనిలో నొక భాగమను" ఇది "పక్వమైన అహంకారము, జ్ఞానాహంకారము." "నేను బ్రాహ్మణుడను. నేను క్షత్రియుడను" "నేను ఫలానావారి కుమారుడను" "నేను ఫలానావారి తండ్రిని" ఇవి యన్నియు ఆధ్యాత్మికమైన అజ్ఞానపుటహంకారములు. ఇవి యన్నియు వదలుకొనవలెను, త్యజింపవలెను. అహంభావమును గర్వమును దృఢతరముగ చేసి ఇవి బంధనములను కల్పించును. నిరంతర స్మరణ మవసరము. మనస్సునం దొక భాగమును ఎల్లప్పుడును భగవంతుని వైపు త్రిప్పి యుంచవలెను. అప్పుడు మాత్రమే జయము కలుగును. ఒక ప్రీతిపూర్వకమైన బాంధవ్యమును వదలక అవలంబించి అతనిని స్వంతము చేసికొనవలెను. ఈ విధముగ మాత్రమే భగవంతునిపై ప్రేమ సహితముగ వత్తికొని రాగలము. చూతువుగదా, ఎవరితో నైనను ప్రథమ పరిచయ మేర్పడినపుడు ఏర్పడబోవునపుడు అతనిని అయ్యా, తమరు అని పిలుతుము. పరిచయము గాఢమగు కొలది అదిపోయి 'మీరు' వచ్చును. పరిచయము సుస్థిరమైనపుడు 'మీరు' కూడ ఎబ్బెట్టుగ నుండును. 'నీవు' కావలసి వచ్చును. భగవంతుని తనవానికంటె నధికతరముగ జేసికొనవలెను. అప్పుడు వచ్చును జయము. ఉదాహరణమునకొక కాలుజారిన వనితను తీసికొనుము. అప్పుడే ఆమె ప్రేమికుని ప్రేమింప మొదలిడినది. అచ్చట ఎంత రహస్యము భయము సిగ్గు! ఈ ప్రేమ ప్రగాఢమైనపుడు ఈ భావము లేవియు మిగులవు. అందఱి ఎదుటను అతని చేయి పట్టుకొను నంత దూరము పోయి కుటుంబమునకు బాహ్యయగును. అత డామెను పోషించుటకు సందేహించుచు వదలివేయ దలచుచో ఆమె వాని మెడపై కొంగువేసి లాగును. "ఏమి! ఇల్లు వాకిలి వదలి నీకొఱకై నన్ను నేను నిస్సహాయురాలినిగ చేసికొంటిని. ఇప్పుడు నన్ను వదలివేయ జూతువా? నన్ను భరింపక నీకు తప్పదు." ఇట్లే భగవంతునికొఱకై సర్వమును త్యజించి అతనిని స్వంతము చేసికొనినవాడు అతనిపై వత్తిడి తెచ్చును. ఇట్లనును. "నేను నీకొఱకై సర్వమును పరిత్యజించితిని. నాకు నీవు ప్రత్యక్షమగుదువో లేదో చెప్పుము!"

# సంఘ సంస్కారణము

## అనువాదము: బి. యస్. ఆర్. ఆంజనేయులు

(రాజమండ్రి శ్రీరామకృష్ణమఠములో పూజ్యశ్రీ విమలానందస్వామి వారొనర్చిన ప్రసంగసారాంశము)

విద్యాదానములో రెండు స్థితులు గలవు. అన్నదానము తర్వాత వచ్చునది విద్యాదానము. విద్యాదానమునందలి ఉత్కృష్టస్థితి ముక్తిని కల్గించును. అట్టిది మోక్షదానము. దిగువ మెట్టునందలి విద్యాదానములో మానవ జాతికి మరింత సామరస్యమును, మరింత సంఘటితత్వమును, కార్యాచరణమునందు మరింత నైపుణ్యమును, మరింత ఆత్మవికాసమును, మరింత ఆత్మనిగ్రహమును కల్గించు విద్యలన్నియు చేరియున్నవి. మన గ్రంథములనుండి, గ్రంథాలయములనుండి, ఉపాధ్యాయులనుండి, ఆచార్యులనుండి, గృహములనుండి, విద్యాలయములనుండి నేర్చుకొనుచున్న జ్ఞానములో ఈ విద్యలన్నియు ఇమిడియున్నవి. మనము ఈ విద్యలయందలి విశిష్టతకు ప్రాధాన్య మీయనిచో అవియన్నియు కేవలము ఒక సముదాయముగానే నిలచిపోవుచున్నవి. ఈ (సారభూతమైన) విశిష్టత దేనివలన కలుగుచున్నది? తాము బోధించిన దానిని తమ జీవితములందు ఆచరించిన వ్యక్తులవలననే ఆ విశిష్టత కలుగుచున్నది. కావున బోధించువారి నడవడికపై విద్యయొక్క విశిష్టత ఆధారపడియున్నది. తాను బోధించినది మొదట తాను ఆచరించి చూపించుటచేతనే శ్రీరామకృష్ణుడు ఉత్తమోత్తమ గురువయ్యెను. ఎవరైనను పిల్లవానితో "అబ్బాయీ! అబద్ధమాడవద్దు, పరులకు సాయపడుము." అని చెప్పెను. ఆ చెప్పినవాడు ఆ ప్రకారము ఆచరింపడని పిల్లవాడు గ్రహించినచో అతడిచ్చు సందేశము అర్థరహితమగుచున్నది.

శ్రీరామకృష్ణుడొక చక్కని నీతికథను చెప్పెను. ఒకడు తన పిల్లవానిని వైద్యుని యొద్దకు కొనిపోయెను. వైద్యుడు ఆ పిల్లవానిని పరీక్షించి "రేపురండు, మందు చెప్పెదను" అనెను. ఆ తండ్రి ఆ జబ్బుపిల్లవానిని మరునాడు వైద్యునివద్దకు గొనిపోయెను. వైద్యుడు "పిల్లవానికి బెల్లము ఈయవద్దు" అని సలహా ఇచ్చెను. అప్పుడాతడు "ఈ చిన్నమాట పిల్లవానికి నిన్ననే చెప్పియుండవచ్చునే!" అని ప్రశ్నించెను. వైద్యుడప్పుడు ఇట్లు చెప్పెను. "నేను అప్పుడు చెప్పలేకపోయినాను. చెప్పకూడదు కూడ. నా గదిలో అప్పుడు బెల్లమున్నది. పిల్లవాడు దానిని గమనించినాడు. నేను చాల బెల్లము తినెదనని, అందుచేతనే బెల్లమును నిల్వయుంచినానని పిల్లవాడు అప్పుడు అభిప్రాయపడినాడు. ఈ వైద్యుడు చెప్పునదొకటి, చేయునది యొకటి అని వాడు తలంచును. వానికి నాయందు విశ్వాసముండదు. కావున ఈ విషయము నిన్న చెప్పలేదు. ఈ రోజు మొదలు నేను చెప్పిన విధముగా చేసిన పిల్లవాడు స్వస్థత చెందును." ఇందొక పరమ సత్యమున్నది. సత్ప్రవర్తనద్వారా, ధర్మము ద్వారా ఇతరులను సంస్కరింపదలచువారు మొట్టమొదట తాము ఆదర్శవంతులుగ నుండవలెను.

తమ బోధలను తాము ఆచరింపవలెననియు, తాము ఆచరించుదానిని చూచి ఇతరులనుసరించునట్లు చేయవలెననునదియే శ్రీరామకృష్ణ సందేశము.

భగవద్గీత ద్వితీయాధ్యాయములో "స్థిత్వా స్యామంత కాలేఽపి బ్రహ్మ నిర్వాణ మృచ్ఛతి", 'జీవితాంతమునందైనను యథార్థ జ్ఞానమునందు నెలకొనిన యోగి బ్రహ్మసాక్షాత్కారమును పొందును' అని చెప్పబడినది. ఆ జ్ఞానమునందు నెలకొనియుండుట యనగా తాము బోధించుదానిని తాము ఆచరింపవలెనని అర్థము. ఇది మిక్కిలి కష్టమైనపని. ఈ విషయమును నొక్కి వక్కాణించుటయే శ్రీరామకృష్ణుని పరమ సందేశము, ఆయన ప్రయత్నమును. దీనిని విస్మరించితిమేని మనము చదివిన గ్రంథ సంపుటములు, చేయు ప్రచారములు నిరర్థకములుగనే నిలచిపోవును. కనుక నేను మొదట ఆయన సందేశము "ఖండన భవబంధన" అనగా మానవునకు ముక్తి కల్గించుట అని ప్రారంభించితిని.* ఈ ముక్తి కల్గుటెట్లు? శరీరము, మనస్సు, ఆత్మ అను త్రికరణములయందు శ్రద్ధవహించుటచేతనే మానవుడు మొట్టమొదట స్వాస్థ్యవత్తైన శరీరమును, స్వాస్థ్యవత్తైన మనస్సును కల్గియుండవలెను. అప్పుడే తక్కినవి సాధ్యమగును. ఆధునిక విద్యావేత్తలుగూడ విద్య యనునది స్వాస్థ్యవమగు జాతియందు స్వాస్థ్యవత్తైన శరీరమును, స్వాస్థ్యవమగు మనస్సును, నిర్మించుటకు తోడ్పడవలయునని చెప్పుచున్నారు. సరియైన శ్రద్ధ తీసికొననిచో శరీరమును స్వాస్థ్యవముగనుంచుట అసంభవము. చిన్నతనము నుండియు క్రమశిక్షణలేనిచో స్వాస్థ్యవత్తైన మనస్సు కల్గియుండుట దుర్ఘటము. ఈ రెండు విషయముల యందు శ్రద్ధతీసికొనినచో స్వాస్థ్యవత్తైన జాతి దానియంతటదియే సంభవమగును. కావున సంఘముపై తాము ప్రయోగింపదలచిన విధానములన్నింటిని మొదట తమపై ప్రయోగింపక సంఘమును బాహ్యముగా సంస్కరింపదలచిన సంస్కర్తలందఱు తప్పక పరాజయము పొంది తీరుదురు. అందులకే స్వామి వివేకానందజీ పదేపదే యిట్లు చెప్పెను. "నేను సంస్కర్తను, కాని నేను కూకటి వ్రేళ్లనుండి సంస్కరింప దలచితిని. సంఘమునకు అచ్చటచ్చట మాసికలు వేయదలంపలేదు."

సహజముగా రెండుతెగల సంసర్తలు గలరు. కొందఱు ప్రజల ఆలోచనా విధానమును సంస్కరింప జూచుచున్నారు. మరి కొందఱు వారిని ఆర్థికరంగమున సంస్కరింప నెంచుచున్నారు, పరిపాలనా విధానములలో చైతన్యవంతులను గావించి రాజకీయ ప్రబోధము గావింప జూచుచున్నారు. ఈ సంస్కరణలన్నియు ఆయా కాలములలోను, ఆయా పరిస్థితులలోను, ఆయా అవకాశముల లోను అవసరమైయున్నను, అవి వ్యక్తి ఉత్తమ విషయములవైపు మరలుటకు సమర్థుడైనపుడే ఫలకారులగుచున్నవి. భవన నిర్మాణమునకు పగిలిన, అరకాల్పు ఇటుకలు పనికిరావుగదా! ఆ భవనపు స్థిరత్వము, శాశ్వతత్వము దాని కట్టడములో ఉపయోగించిన వస్తువులపై ఆధారపడియుండును. అట్లే మానసిక విశిష్టత, శరీరముపొందిన శిక్షణ విధానములే సంఘమును చెప్పుకొనదగినదిగా ఉంచగలుగుచున్నవి. కావున ముఖ్యముగా ఈ విషయమునకై అత్యంత ప్రాధాన్యమీయవలసియున్నది. "నేను ఆమూలాగ్రమైన సంస్కారమును కోరుచున్నాను" అని వివేకానందజీ చెప్పినదానికి అర్థము మనుష్యునియొక్క మనస్సును సంస్కరించి, తద్వారా ఈ తరము వారికి, రాబోవు తరమువారికి ఎక్కువ సహాయము చేయవలయుననుటయే, మొట్టమొదట

* చూ. శ్రీరామకృష్ణ ప్రభ, జూలై 75.

మనము పేదరికమును నిర్మూలింపవలయునని ఆయన మరల మరల నొక్కి వక్కాణించెను. ఈ సమస్య పట్టుదక్క నిది ఏమాత్రము నిలకడ లేనిది. ఈనాడు కూడా ఆ కార్యకమము మన ముందున్నది. పేదరికము తొలగించుటకు స్వామీజీ రెండు మార్గములు సూచించెను.

సంఘమును క్రమబద్ధమొనర్చి శాస్త్ర విజ్ఞానమును ఉత్పాదక విధానములో అమలు పరచుట ఒకటి. దీనికంటె అత్యంత ప్రధానమైనది ఆత్మనిగ్రహము, పట్టువిడువని పరిశ్రమ. ప్రాచీన భారతీయులు దేశకాల పరిస్థితులను గమనించి, గౌరవముతో నిచ్చిన వస్తువును స్వీకరించిరేతప్ప దేనిని గాని యెవ్వరినుండి గాని యాచించెడివారు కారు. పరాన్నభుక్కువలె ఇతరులపై బడి జీవించుట పాపమని వారు భావించిరి. అత్యావశ్యకమైన పరిస్థితి ఏర్పడినప్పుడు తప్ప దానమును స్వీకరించుట సైతము మహాపాపము. దానమిచ్చుట మహా పుణ్యకార్యమని మన శాస్త్రములు శ్లాఘించుచున్నవి. కాని యే వస్తువునైనను స్వీకరించుట అవమానమునకు హేతువు. మానవుడు తాను తీసికొనిన దానికంటె, తిరిగి యిచ్చునది హెచ్చుగా నుండవలెను. తాను తీసికొనుట, అభివృద్ధిచేసి తిరిగి యిచ్చుటకొఱకే. సంస్కృతములో ఒక శ్లోకమున్నది: భగవంతుడు బలి చక్రవర్తిని మూడడుగుల భూమి యాచించుటకు వామనుడుగా అవతరింపవలసి వచ్చినది. భగవంతుడు సైతము యాచింపవలసినప్పుడు అల్పుడుగావలసి వచ్చెను. స్వర్గాదిలోకముల కంటె ఉన్నతుడైన భగవంతుడు, ఇతరులను యాచింపవలసినప్పుడు బాలునివలె కురచగా మారవలసివచ్చెను. యాచన అంత నీచము. యాచింపనేరాదు. అంతేగాక, ఆత్మనిగ్రహము వలననే కోరికలు తగించుకొనుట సాధ్యమను విషయము నెవ్వరును మరువకూడదు. ధర్మశాస్త్రములో మనోహరమైన యొక శ్లోకము గలదు. ''వస్తుసంచయమును, సంపదను, అధికాధికముగా కోరునట్టి సన్యాసిని, తన కుటుంబము కొఱకైనను సంపాదింపని గృహస్థును పెద్దబండతో కట్టి సముద్రమధ్యమున విసరి పారవేయవలయును.'' చమత్కారమైన ఈ సూక్తి గొప్ప పాఠమును నేర్పుచున్నది.

కనుక సంఘసంస్కరణము మొదట ఆత్మసంస్కరణముతో ప్రారంభము కావలెను. ఆత్మసంస్కరణమును సాధ్యముగ చేయునది యే విద్య అట్టి విద్యయే ఆత్మసంస్కరణముద్వారా సంఘసంస్కరణమును మోక్షప్రాప్తిని కలుగ జేయును.

# శ్రీ రామకృష్ణానందస్వామి

## రావుబహదూర్ సి. రామానుజాచారియర్

శ్రీరామకృష్ణభగవానులు అన్ని రకముల ఆధ్యాత్మిక సాక్షాత్కారములకును కూడలి స్థానము. వారి జీవితము అన్ని జీవితములకు ప్రాణము. ఆయన మతము అన్ని మతములకును మతము. ఆయనయందు పరాకాష్ఠ నందిన ఆధ్యాత్మికవికాసజ్వాలయందుండి కరదీపికలు భూమండలమున నన్ని దేశములకు అన్ని కాలములలోను వెలుగు నిచ్చుటకై కొనిపోబడినవి. ఆయన శిష్యుల సాధనసంపత్తి భిన్నవిభిన్నములైనను ప్రతి యొక్కరును అత్యున్నతమగు

ఆధ్యాత్మిక సాక్షాత్కారమును సాధించిరి. కొందఱు దానికి అమేయమగు ధీశక్తిని కూడ జోడించిరి. ఎల్లరును ఆ మహాత్ముని సాక్షాత్కారములలో నొక యంశమును గ్రహించి వారి వారి శిష్టమగు రీతిని దానిని అభివృద్ధి చేసి కొనిరి. తుదిని సర్వోత్తమసాక్షాత్కారమును బడసిరి. పై చూపులకు వారు భిన్న విభిన్న ప్రకృతుల వారని పించవచ్చును. వారి ప్రకృతులు పరస్పరము విరుద్ధములని సైతము అని పింపవచ్చును. కాని, వీరందఱి యుత్కృష్టతకు మూలము ఒకరే ననియు ఆయన తన మానసపుత్రు లందఱి సాక్షాత్కారముల సమష్టి యనియు శాంతిమాత యనియు మతసమన్వయ కర్త యనియు గుర్తించు కొనినచో ఇట్టి యపోహలు తలయెత్తవు.

శ్రీరామకృష్ణానందస్వామి వారి యందు జ్ఞానము భక్తి సేవాధర్మము సముచితముగ మిశ్రితములైనవి. వారియందు అద్వైతజ్ఞానము అంతర్వాహినియై వారి ప్రగాఢమగు భక్తిభావమునకు మూలాధారమైనది. వారి దృష్టిలో భగవంతునితోడి ఐక్యమును సాక్షాత్కరించు కొనిన పిదప పెంపొందు భక్తియే పరభక్తి. ఒకడు మరొకనితో తాదాత్మ్యమును పొందినచో అట్టి తాదాత్మ్యము పిదప అతనిపట్ల కలుగు ప్రేమయే ఉన్నతతమ మని వారను చుందురు. వారు ద్రష్టయగుటచే వారి మనస్సు యొక్క లోతుల నన్వేషించి అచ్చటి రహస్యములను అవలీలగ తెలిసికొనుచు సాధకుల కేర్పడు వివిధ సమస్యలకు సమాధానములను కనుగొనెడివారు.

వారి జీవనశ్రుతి వారి జీవిత లక్ష్యము గురుశుశ్రూషయే. వారికి వారి గురుదేవులును పరాత్పరుడును ఒకరే. సోదరి దేవమాత యనినట్లు "వారి స్మృతియందు గురుదేవులకు తప్ప మరి దేనికిని స్థానము లేదు. ఆయన తన నెప్పుడో మఱచిపోయెను, వారి జీవనమంతయు గురుదేవులయందే." గురుభక్తి వారిలో అణువణువునను ఆవేశించినది. సేవాతత్పరతతో ఆత్మవిస్మృతి నందుటకు వారే విశిష్టోదాహరణము. శ్రీరామచంద్రునకు లక్ష్మణస్వామి నిద్రాహారములు వదలి చేసిన కైంకర్యమును వారు స్ఫురింపజేయుదురు.

శ్రీరామకృష్ణుల వ్యక్తిత్వము ఆధ్యాత్మిక శక్తి ప్రేమశీలత ఎల్లర మనస్సులను హరించును. అది వారియందు అంతటి భక్త్యావేశమును నెలకొల్పి ఏమాత్రమును సడలిపోకుండ కాపాడుటలో ఆశ్చర్యమేమియు లేదు. కాగా శ్రీరామకృష్ణుల భౌతికసాన్నిధ్యము తొలగిపోయిన పిమ్మట కూడ శ్రీరామకృష్ణానందస్వామివారి జీవిత శేషమగు ఇరువదియొకు సంవత్సరములు వారి గురుభక్తి యను జ్యోతి ఎట్టి హృదయవిదారక పరిస్థితులలోనైనను, ఎట్టి సంకటములలోనైనను, ఏమాత్రమును వదలింపక వెలుగుచునే యుండుటయే అద్భుతము. శ్రీరామకృష్ణులకు వారి హృదయపూర్వకమగు ఆత్మార్పణమునకు శ్రీవారిపట్ల వారికి గల యచంచల విశ్వాసముతోడై ప్రోది చేసిన గురుభక్తి ఎట్టి విపత్కరపరిస్థితులందును చెక్కు చెదరలేదు. ఉక్కును ఒకసారి అయస్కాంతముగ చేసినచో ఇక సర్వదా అయస్కాంతముగనే ఉండిపోవును గదా!

సాధారణ జనులు ఇష్టదైవముయొక్క దివ్యసాన్నిధ్యము ననుభవించు మహోన్నతస్థాయి వరకు తమ భక్తిని క్రమక్రమముగ నభివృద్ధి చేసికొందురు. స్వామివారి విషయమున నిది విపరీతమైనది. అత్యంతము అపూర్వమగు అదృష్టవశమున వారికి ప్రప్రథముననే వారి ఇష్టదేవతాసాన్నిధ్యము భౌతికముగనే లభించినది. ఆ దివ్యసాంగత్యమువలన వారియందు శాశ్వతముగ నెలకొనిన భక్తిప్రథలు జీవద్విశ్వాసము

ఎంత గాఢమైన వనగా తరువాతి సంవత్సరములలో ఎట్టి బలహీనమైన యాదృచ్ఛికమైన సూచనలైనను వానిని ప్రజ్వలితములుగ నుంచుటకు సమర్థములైనవి. అట్లే కానిచో పన్నెండు సంవత్సరములు ఏకైకదీక్షతో వారి గురుదేవుల స్మారకచిహ్నములను పరిరక్షింపగలరా? వారి గురుదేవులు ఆ ఛాయాచిత్రమునందు వేంచేసి యున్నారని దర్శించి దినదినమును వారు బ్రతికి యున్నప్పటివలెనే అన్నము తినిపించుచు గుడ్డలు మార్చుచు వీవన విసరుచు ఎట్టి యసౌకర్యమును కలుగకుండ అసాధారణ ప్రేమ మార్దవముతో సేవింపగలిగెడు వాడా? వారికి పూజ యాంత్రిక మెంతమాత్రము కాదు. సంప్రదాయము మాత్రము కాదు. తాను సర్వవిధముల ఋణపడి యున్నవారికి, ఎవరు వినా తనకు జీవితమే లేదో అట్టివారికి, చేయు ప్రేమ సంభరితమైన భక్త్యుత్సాహ సమన్వితమైన పరిచర్య. ఈ పూజయందే ఆయన తనయొక్క ఆధ్యాత్మిక సాధన సర్వస్వమును అమోఘమగు మోక్షసాధన సామగ్రిని దర్శించెను. పూజామందిరమున పూజ చేయునపుడు పూజను దర్శించునపుడు వారియందు స్పష్టముగ తోచు త్రికరణశుద్ధి అమేయమగు భక్త్యతిరేకము మందిర వాతావరణమును భక్తితరంగములతో నింపివేయును. అతిశయ భక్తిచేతను ప్రశాంతత చేతను ఉజ్జ్వలమగు వారి వదనమును దర్శించుటయన, భక్తిపూరిత హృదయముతో వారు దైవసన్నిధిని నిల్చుండుటను చూచుట యన; వారి శరీరమున కండరములు తరంగితములై సకల శరీరమును నివేదింపబడుచుండుటను గాంచుటయన, నిజమగు పూజయన నేమో గుర్తించుటయే. అతి సులభముగ బాహ్యలక్షణములను దాటి అంతరాదర్శమును దర్శించుటయందు వారతిసమర్థులు. కనుకనే దారిప్రక్కనున్న గుడిసెలోని దైవమూర్తియు గర్భగుడియందు సర్వలక్షణ సమన్వితమై సర్వోపచార సంయుతమైన దైవమూర్తివలెనే వారికి తాదాత్మ్యము కల్గించెడిది.

స్వామివారిని దర్శింప నోచుకొనని పలువురకు "జీవముచిందు భక్తి" అనునది అర్థము లేని మాటలుగనే యుండును. "భక్తి కలిగిన వానికి అన్నియు కలవు, భక్తిలేని వానికి ఏదియు లేదు," అను శ్రీరామకృష్ణవచనమునకు స్వామివారే దృష్టాంతము. గురుదేవులయందు భక్తి విశ్వాసములు వీరియం దెంత వికసించిన వనగా తనను వారియం దొక భాగముగనే భావించెడివారు. తత్ఫలితముగ గురుదేవు లంగీకరింపని వానిని వారును ఎట్టి పరిస్థితులలోనైనను అంగీకరింపరు. గురుదేవులు నమ్మినదానిని, పలికిన దానిని, మాఱుమాటలేక అంగీకరించెడివారు. అట్టి దివ్యచరిత్రుని ఆదర్శసాధువును మదరాసు నగరము తన నడుమనుండ బడయ గల్గినది. మద్రాసు మఠము ఉద్యమముల కార్యక్రమములకు వారు అచంచలములైన పునాదులను నిర్మించిరి. వ్యవస్థలను స్థాపించుటకంటె మానవులను దిద్దుటయందే వారికి ఎక్కువ విశ్వాసము. "నా ఆహారము నేను యాచించుకొందును. ఏ సత్రపు టరుగుపైననో నడుము వాల్చగలను. నా గురుదేవుల యుపదేశములను మాత్రము నన్ను బోధింప నిండు. దానిని వినుట కెందఱు వచ్చినను నాకు చింత లేదు. ఒక్కరినైనను నేను సక్రమముగ చేరగలిగినచో నేను నిజముగ జీవించినట్లే," అని, మరియొకరు నిరాశా నిస్పృహాలలో మునిగిపోయెడి పరిస్థితులలో సంతోషముగ పలికెడివారు. వారి గురుదేవులయందు వారి భక్తి అకుంఠితమైనది. అనన్యసాధ్యమైనది. అదియే వారియందు వారి పంచప్రాణములుగ నిలిచియుండెను.

# ప్రాజ్ఞజన సంసేవ్యములు

ఈనాటి ఆధునికశాస్త్రమువలన గాఢములును సుస్థిరములును అనుకొనిన పురాతన విశ్వాసములు పూర్తిగ హతమైపోవుచున్నవి. మానవజాతి యంతయు లొంగి మన్ననచేసి తీరవలయునని ఆశించిన సాంప్రదాయిక గౌరవాధిక్యములు వలివలిగా చితుకగొట్టబడి గాలిలో కానరాకుండ ఎగిరిపోవుచున్నవి. ఈనాటి ప్రాచీన వస్తు పరిశోధన లనెడు నమ్మెట పోటులకు తాళజాలక పురాతనాచార విశ్వాసములు గాజుముక్కలవలె పొడిపొడియై పోవుచున్నవి. మతము పాశ్చాత్య దేశములందు పామరులచేతిలో చిక్కుకొనిపోయినది. ఇట్టిపట్టున భారతీయ వేదాంతమునందలి ఆధ్యాత్మిక మహాశయములు భారతహృదయము ముందునకు సాగివచ్చుచున్నవి. అత్యున్నత వేదాంత ధర్మములు సామాన్య భారతప్రజలకు నిత్యానుష్ఠాన మర్యాదలు. ఈ సర్వమును ఒకే పదార్థమనెడు అద్వైతమార్గము, వేదాంతము బోధించు నిర్గుణతత్త్వభావము, నరుని ఆత్మ అనశ్వర మనెడు అద్భుత సిద్ధాంతము, జీవయాత్ర తెగిపోక సర్వకాలము సాగివచ్చు మహాప్రస్థాన మనెడు తలపు, ఈ జగము అనంతమను విశ్వాసము, నేటి ప్రపంచమును గొప్ప ఆపదనుండి రక్షింపబూనినవి. మన గ్రంథములలో—అసలు మన గ్రంథములలో మాత్రమే-అనంతమై పరగు దేశకాల నిమిత్త భావన కాన్పించుచున్నది. ఆధునిక కాలమున పరిణామసిద్ధాంతము అక్షయశక్తి సిద్ధాంతము మున్నగునవి బయలుదేరి నానావిధ తుచ్ఛదేవతారాధనలను రూపుమాపుచున్న ఈ సమయమున — నరుని ఆత్మాన్వేషణ ఫలమును భగవంతుని అద్భుతవాణియునగు వేదాంతము బోధించు ఉదాత్తమహితములును ఉదారపావనములును అగు దివ్యభావములుగాక మఱెయ్యది ప్రాజ్ఞులకు సంసేవ్యమై నిలువగలదు?

—శ్రీ వివేకానందస్వామి.

ప్రాచ్య పాశ్చాత్యములందు సాంప్రదాయికముగ విశ్వసింపబడుచుండిన నమ్మకములన్నియు ఆధునిక విజ్ఞానశాస్త్రములవలన తల్లక్రిందులై పోవుచున్నవి. మానవజీవితము జీవితోద్దేశము ఉద్దేశ సాధనావకాశము మున్నగు భావన లన్నియు నష్టములు కాగా నూతనాశయముల పట్టుదొరకక మానవాళి కొట్టుమిట్టాడుచున్నది. ఇప్పట్టున శాశ్వతములు అచంచలములు అగు భారతీయ వేదాంత భావనలు మాత్రమే ఆధునిక శాస్త్రపరీక్షలకు నిలువగలుగుచున్నవి. ప్రాజ్ఞులకు అంగీకార్యములై అనుసరణీయము లగుచున్నవి.

మానవాకారముగల భగవంతుడొకడు కలడనియు అతడు స్వర్గమునుండి మానవుల స్థితిగతులను గమనించుచుండుననియు సాంప్రదాయిక విశ్వాసము. ప్రపంచము నిట్టి దేవుడే కొన్నివేల యేండ్ల క్రిందట ఏడుదినములలో సృజించెనని పాశ్చాత్యుల దృఢవిశ్వాసము. అనాదికాలమున బ్రహ్మయో నారాయణుడో మరియొకరో తమ సంకల్పబలముననే ప్రపంచము నావిర్భవింపజేసిరని ప్రాచ్యుల నమ్మకము. ఆ దేవుని ఇచ్ఛయే సృష్టికారణమనియు ఆయన ఇష్టము ననుసరించియే ప్రపంచము నష్టమగుననియు ప్రజల నమ్మకము. ఆ దేవుని సంప్రీతుని జేసి ఈ లోకమున సుఖసంతోషముల ననుభవించుటయే పరలోకమున స్వర్గసౌఖ్యముల ననుభవించుటయే జీవనపరమార్థమని సాధారణముగ నెల్లరును అంగీకరింతురు. ఆ దేవుని ప్రీత్యర్థమై పలురకములైన పూజలను ప్రార్థనలను నడపుదురు.

మానవజీవితము ఈ జీవితకాలమునకే పరిమితమనియు ఈ జీవిత ఫలితమునుబట్టియే

మానవుడు శాశ్వత స్వర్గమున నరకమునకో పోవుననియు పాశ్చాత్యుల దృఢవిశ్వాసము. మతాధికారులే దైవమునకు ప్రతినిధులనియు వారి యాజ్ఞానుసారము వర్తించినచే విమోచన మనియు సాంప్రదాయిక విశ్వాసము. ఆధి వ్యాధులను పోగొట్టుకొనుటకును యోగక్షేమ ములను సాధించుటకును మతాధికారు లుప దేశించు పలురకములైన పూజాపురస్కారము లను కిమ్మనక పాటింతురు. ఆ దేవుని ప్రతి నిధులుగ ఈ ప్రపంచమున రాజును మతాధి కారులును నెలకొని దేవునికగు గౌరవముల నెల్ల అనుభవించుచుండిరి. వారు సంతుష్టు లైననే దైవము సంతుష్టుడగును. వారి ఆజ్ఞా భంగము జరిగినచో అది దైవాపచారమే. ఈ దృష్టితో జనులు రాజులు మతాధికారులు నిర్ణయించు విధానములనే ప్రశ్నింపక అనుస రింతురు.

ఇట్టి యవసరమున సామాన్యమానవులకు జీవితపరమావధి ఈ విశ్వాసముల నతిక్ర మింపక జీవించుటయే యైనది. మతాధికారుల యందును రాజులయందును సంపూర్ణ విశ్వా సమునుంచి వారు చెప్పినదే వేదమని నమ్మి సంతృప్తులై జనులు నిశ్చింతగ కాలము గడపు చుండిరి.

కాని ఆధునికశాస్త్ర విజ్ఞానము నేడు ఆ విశ్వాసముల నన్నింటిని కూలద్రోయుచున్నది. ఫాదర్ ఇన్ హెవెన్ కాని బ్రహ్మనారా ణులు కాని మరియొకరు కాని ఉన్నట్లు దానికి రుజువేమియు దొరకలేదు. కోట్లసంవత్సరముల వెనుక యాదృచ్ఛికముగ సృష్టి ప్రారంభమైన దనియు క్రమపరిణామమువలన ప్రాణులిట్లు ఏర్పడినవేగాని ఒక్కసారి శూన్యమునుండి సృజింపబడలేదనియు కనుగొనినది. విశ్వాంత రాళమునగల ధూళియే వివిధ ప్రపంచములు గను సూర్యులుగను నక్షత్రములుగను నెబ్యు లాలు గెలాక్సీలుగను ఏర్పడుచున్నదని కను గొని దేవుని ఏడుదినముల సృష్టిని నవ్వులపాలు చేసినది. ఈ దేవుని అనుజ్ఞ లేకయే వానలు వరదలు తుఫానులు భూకంపములు మొదలగు బాధలన్నియు ప్రకృతి నియమముల ననుస రించియే కలుగుచున్నవని వెల్లడించినది. సూర్యుడు అగ్ని వరుణుడు మొదలగునవి దేవత లగుటకు మారు పదార్థరూపాంతరములు మాత్రమేనని నిశ్చయించినది. పుణ్యము పాపము అననేమి అని ప్రశ్నించినది. ఈ భూమిపై సుఖసంతోషములను సాధించుటయే కర్తవ్యమని నిర్ధారించినది. ప్రాచీనుల పూజా విధానముల నన్నింటినో కనుగొని వారు పూజించిన ఆ దేవతలు వానిని పూజించిన ఆ ప్రజలు నామమాత్రావశిష్టులగుట నెత్తిచూపి నది. లేని దేవునికై పూజలు పురస్కారము లేమని పరిహసించినది. నీకు కావలసిన యానందము నెల్ల ఆధునిక శాస్త్రములద్వారా సమకూర్చుకొను మనుచున్నది. ఈ జీవితము పిదప స్వర్గనరకము లున్నవనుటకును మరల వత్తుమని నమ్ముటకును ఏమి ఆధారమని అడుగుచున్నది. మతమును మతానుభూతి లేని పామరులపాలై అర్థరహితమైనది.

ప్రాచీనములగు జీవితకారణములిట్లు ఆధు నిక శాస్త్రములచేత నిరస్తములైనవి. జీవిత లక్ష్యము ఎగురగొట్టబడినది. జీవనవిధానము అపహాస్యముల పాలైనది. ఇట్టి సమయమున ఈ ప్రపంచమున ఇంద్రియ సుఖములను మాత్రమే అనుభవించుచు జంతువులవలె జీవింపలేకయు ఉన్నతతరములగు జీవితలక్ష్య ములు లేకయు జనసామాన్యము విభ్రాంతు లగుచున్నారు. జీవితము నిరర్థకమని కొందఱు నిస్పృహ చెందుచున్నారు. జీవితము భయానక

మని కొందఱు ఆత్మహత్య చేసికొనుచున్నారు. అనేకులు సంశయగ్రస్తులగుచున్నారు.

ఇట్టి సమయముననే భారతీయ వేదాంత హృదయము ప్రపంచముపై ప్రవహించుచున్నది. సర్వమును ఒక్కటియే అను అద్వైత మార్గము భౌతికశాస్త్రముగాని రసాయన శాస్త్రముగాని ఖగోళశాస్త్రముగాని మరి యే శాస్త్రముగాని వెదకు మౌలిక పదార్థమునకు గమ్యముగ నిలుచుచున్నది. విశ్వాంతరాళమున గల ధూళికణముల నడుమనున్న "శూన్యము" వేదాంతము బోధించు రూపలక్షణ విరహితమగు నిర్గుణతత్త్వమును స్మృతికి తెచ్చుచున్నది. నరుని ఆత్మ అనశ్వరమనియు అనాదికాలమునుండియు రూపాంతరములను గ్రహించుచు పరిణామము నొందుచునేయున్నదనియు ఇంకను పరిణతి చెంది ఆ నిర్గుణతత్త్వమునందే లీనమగునని చెప్పు వేదాంతసిద్ధాంతము జీవపరిణామ సిద్ధాంతమును కొలువడజేయుచున్నది. వేదాంతము బోధించు అనంత బ్రహ్మము ఖగోళశాస్త్రపు తుదిలేని నెబ్యులాలు గెలాక్సీలను పసివాని తొక్కుపలుకులుగ చూపించుచున్నది.

ఆధునిక శాస్త్రఫలితములేవియు వేదాంత భావనలతో విరోధింపకుండుటచే వేదాంతము సగర్వముగ నుద్ఘాటించు ఆ బ్రహ్మసాక్షాత్కారము ననుమానించుటకు ఆధునిక శాస్త్రముల కాధారములేదు. పాశ్చాత్య మనస్తత్త్వశాస్త్రము బోధించు స్వప్నజాగ్రదవస్థలుకాక వేదాంతము బోధించు సుషుప్తి తురీయావస్థలు ఆధునిక శాస్త్రములకు ఉత్తరములేని ప్రశ్నలైనవి. సర్వశాస్త్రములును అంగీకరించు ఆత్మతత్త్వమే పరతత్త్వమని వక్కాణించుచు ఏ శాస్త్రమును ప్రతిఘటింపలేని దివ్యసత్యమును వేదాంతము బోధించుచున్నది. పరతత్త్వమే ఎల్లజీవులయందును ఆత్మతత్త్వముగ భాసించుచున్నదని వచించుచు బ్రహ్మసాక్షాత్కారమునకై సంఘటిత ప్రయత్నము చేయుటకును విశ్వసమన్వయమునకును కారణము చూపుచున్నది. ఈ బ్రహ్మసాక్షాత్కారమును విరోధించు కార్యములే పాపములనియు సహకరించు కార్యములే పుణ్యములనియు అనుచున్నది.

ఇట్లు శాస్త్రవిజ్ఞానమే ఏకైక ప్రమాణమగు ఆధునికకాలమున ఆ శాస్త్రవిజ్ఞానము తిరస్కరింపలేని, అన్నివిధముల ఉజ్జీవకరములగు వేదాంత సత్యములుగాక ప్రాజ్ఞులకు మరి ఏవి సంసేవ్యములు కాగలవు?

---

# యువకులకు శ్రీ వివేకానందుల పిలుపు

## మన సంస్కృతి - విద్యావిధానము

నా దేశీయులారా! నా స్నేహితులారా! నా బిడ్డలారా! ఈ జాతీయనౌక కోటానుకోట్ల జీవులను సంసారసాగరమును తరింపజేయుచు వచ్చుచున్నది. ఉజ్జ్వలములగు అనేక వేల సంవత్సరములుగ ఈ నీటిపై అది పయనించుచు కోటానుకోట్ల జీవులను ఆవలిగట్టునకు పరమానందమునకు చేర్చుచున్నది. కాని నేడో— బహుశః మీ పొరపాటు వలననే— ఈ నౌక కొంచెము పాడైనది, చిన్న చిల్లి పడినది. అంత మాత్రమున దానిని శాపనార్థములు పెట్టుదురా? దానిపై, ప్రపంచమున మఱి ఏ ఇతరమును చేయని అంత సేవ చేసిన దానిపై, నోరు విప్పి

నిందావాక్యములు పలుకుట మీకు తగునా ! ఈ మన జాతీయనౌకలో—ఈ మన సమాజములో చిల్లు లున్నచో మనము దాని బిడ్డలము, మనము పోయి ఆ రంధ్రములను బిగింతము గాక ! మురిపెముతో మన గుండెల రక్తముతోనే ఆ పని చేయుదము, చేయజాలనిచో చావనైన చచ్చెదము. మన మెదడులనే బిరడాలుగ చేసి ఆ నౌకకమర్చెదము. కాని దానిని ద్వేషించుటయా? ఏనాటికిని పలదు. ఈ సమాజమును గూర్చి పల్లెత్తి ఒక్క పరుష వచనమైనను పలుకకుడు. గతించిన ఔన్నత్యమునకై దానిని నేను ప్రేమించుచున్నాను. మీరందఱును దేవతలకు బిడ్డలగుటచేతను ప్రఖ్యాతులైన మీ ముత్తాతల సంతానమగుటచేతను, మిమ్ము నేను ప్రేమించుచున్నాను. అట్టి మిమ్ము నే నెట్లు దూషింపగలను? సర్వశ్రేయములు మీకు కలుగుగాక ! నా బిడ్డలారా ! నేను మీవద్దకు వచ్చినది నా విధానముల నన్నింటిని మీకు చెప్పుటకే. నా మాట వినెదరేని మీతో కలిసి పని చేయుటకు సంసిద్ధుడనుగ నున్నాను. మీరు నిరాదరించి భారతదేశమునుండి నన్ను గెంటివేసినను తిరిగివచ్చి మన మందరము మునిగిపోవుచున్నామని చెప్పుదును. మీ నడుమ కూర్చుండుటకే ఇప్పుడు వచ్చియున్నాను. ఒకవేళ మనము మునుగవలసినచో అందరము కలిసియే మునుగుదము. కాని మననోటినుండి ఛీత్కారములు వెడలకుండు గాక !

మన దేశపు ఆధ్యాత్మిక, లౌకిక విద్యా విధానములు మన అధీనములోనుండి తీరవలయును. మీ కది అర్థమగుచున్నదా? దానినే మీరు కలవరింపవలెను, ముచ్చటింపవలెను, ఆలోచింపవలెను. దానినే మీరు సాధించి తీరవలయును. అంతవరకు ఈ జాతికి ముక్తి లేదు. మీరు నేర్చుచున్న విద్యలో కొన్ని మంచి విషయములున్నవి. కాని అం దెంత మహానర్థమున్నదనగా అది ఈ మంచి విషయముల నన్నింటిని తుడిచివేయుచున్నది. మొట్టమొదట అది ధీరులను చేయు విద్య కాదు. అది కేవలము పూర్తిగ విధ్వంసక మగు విద్య. విధ్వంసక మగు విద్యయైనను నిరాసనముపై ఆధారపడు ఎట్టి శిక్షణమైనను మరణముకన్న నికృష్టము. పిల్లవాడు బడిలో చేరుటయే ఆలస్యము. వాడు మొట్టమొదట నేర్చుకొను పాఠము తన తండ్రి మూర్ఖుడని, రెండవ పాఠము తన తాత పిచ్చివాడని, మూడవది తన గురువు లందఱును మిథ్యాచారులని, నాల్గవది తన మత గ్రంథము లన్నియు పుక్కిటి పురాణములని. ఆ పిల్లవాడు పదునారేండ్ల ప్రాయమువా డగునప్పటికి వాడొక నిరసనముల రాశియై నీరసుడై నిర్జీవుడై మిగులుచున్నాడు.

మీ మెదడులో కుక్కబడి ఒంటబట్టక బ్రతికి నన్ని రోజులు కలవరపెట్టుచుండు ఆ సమాచార సందోహము విద్యకాదు. మనకు కావలసినది చైతన్యవంతులుగ నొనర్చునవియు, ధీరులుగ రూపొందించునవియు శీలమును తీర్చి దిద్దునట్టివియు అగు భావములను జీర్ణించుకొనుటయే. అయిదు భావములను మీరు జీర్ణించుకొని వానిని మీ జీవితముగను శీలముగను చేసికొంటిరేని ఒక పెద్ద గ్రంథాలయము నంతటిని కంఠస్థము చేసికొనిన వానికంటె ఎక్కువ విద్య మీకు సమకూరును. విషయసేకరణయే విద్యయైనచో గ్రంథాలయములే మహాయోగులు, విజ్ఞానసర్వస్వములే ఋషులు అగుచున్నవి. కావున మన ఆదర్శ మే మనగా మన దేశమందలి లౌకిక ఆధ్యాత్మిక విద్యా విధాన మంతయు మన అధీనములో నుంచుకొనుట, సాధ్యమైనంతవరకు అవి జాతీయ విధానములలో నుండుట జాతీయ పద్ధతులపై కొనసాగుట.

# భక్తిరత్నావళీ

మూలము :
**శ్రీవిష్ణుపురి**

వ్యాఖ్యాత :
**విష్ణుచిత్తుడు**

(ప్రథమ విరచనము)

## 61-62

ప్రేమాన్వితమైన భక్తియన భగవంతున కెంతప్రీతియో, భక్తున కతడెట్లు వశంవదు డగుచున్నాడో శ్రీ శుకుడు నాలుగుశ్లోకములలో వర్ణించుచున్నాడు.

స్వమాతుః స్విన్నగాత్రాయా విశ్రస్త కవరస్రజః
దృష్ట్వా పరిశ్రమం కృష్ణః కృపయాసీ త్స్వబన్ధనే ॥
ఏవం సందర్శితా హ్యంగం హరిణా భక్తవశ్యతా
స్వవశేనాపి కృష్ణేన యస్యేదం సేశ్వరం వశే ॥ (10-9-18, 19)

తలలోపువ్వులు జారిపోవ చిక్కుపడిన కేశసంపదతో స్వేదబిందువులచే నార్ద్రమైన శరీరముతో నలసిపోయిన తనతల్లిని జూచి శ్రీకృష్ణుడు దయాళువై తానే కట్టువడెను.

సర్వలోకములెవ్వని యధీనములో అట్టి శ్రీహరి తన భక్తపరాధీనత నిటు ప్రదర్శించెనుగదా !

గమనిక : దామోదర వృత్తాంతము. శ్రీకృష్ణుని యల్లరికి విసిగి యశోదాదేవి బాలకృష్ణుని త్రాటితో కట్టివేయ ప్రయత్నించును. ఎంతపొడవుత్రాడు ఎన్నిసార్లు తెచ్చినను శ్రీకృష్ణుని చిన్నిపొట్టను చుట్టుటకు చాలక శ్రమతో చెమటలుపట్టిన యశోదాదేవిపై కరుణబూని శ్రీకృష్ణుడు తానే కట్టువడును.

## 63-64

నైవం విరించ్యో న భవోనశ్రీరప్యంగ సంశ్రయా
ప్రసాదం లేభిరే గోపీ యత్తత్ప్రాప విముక్తిదాత్ ॥
నాయం సుఖాపో భగవాన్ దేహినాం గోపికాసుతః
జ్ఞానినాం చాత్మ భూతానాం యథా భక్తిమతామిహ ॥ (10-9-20, 11)

ముక్తిదాయకుడగు శ్రీహరి కటాక్షము గోపికయగు యశోదకు లభించినట్లు బ్రహ్మకుగాని శివునకుగాని అర్ధాంగియగు లక్ష్మికైనగాని లభింపలేదు.

రాగరంజితమగు భక్తిగలుగు వారెంత సులభముగా శ్రీహరిని బొందుదురో అంత సౌలభ్యము జ్ఞానులకుగాని ధ్యానులకుగాని లభింపదుగదా !

**65-66**

భక్తియే భగవంతుని బొందుటకు రాజమార్గమని బ్రహ్మ ప్రవచించుచున్నాడు.

శ్రేయః స్రుతిం భక్తి ముదస్యతే విభోక్లిశ్యన్తి యే కేవల బోధ సిద్ధయే
తేషామసౌక్లేశలవ ఏవ శిష్యతే నాన్యద్యథాస్థూలతుషావఘాతినామ్ ॥
పురేహ భూమన్ బహవోపి యోగిన స్త్వదర్పితేహా నిజకర్మ లబ్ధయా
విబుధ్య భక్త్యైవ కథోపనీతయా ప్రపేదిరేంజోచ్యుత తే రతిం పరామ్॥ (10-14-4, 5)

సకలశ్రేయములనిచ్చు భక్తిని వదలి శుష్కజ్ఞానమాత్ర లాభమునకై శ్రమించు వారికి తుదిని వారి శ్రమయే మిగులును. అట్టివారు వట్టి యూకను దంచువారి వలె వృథాశ్రమ పడుదురు. (ఊకను దంచినచో గింజలు రాలవనుట)

అచ్యుతుడా! కాలగర్భమున నెందరో యోగులు తమ సర్వకర్మలను నీకర్పించిరి. తత్ఫలముగా నీయతులిత గుణసంకీర్తనమును చేయగల్గిరి. ఏతత్ఫలితముగా లభించిన భక్తి వలనే వారు పరమపదము నందజాలిరి.

# పారమార్థిక సాధకులకు సూచనలు

## శ్రీ యతీశ్వరానందస్వామి

ఉన్నతజీవనమునకు యథావిధిగ సిద్ధపడకనే స్వీయవాంఛలకు భావములకు ఊర్ధ్వగతులను చూపకనే ఏకాగ్రత నభ్యసించుట చాల ప్రమాదకరమైనది. అది మిక్కిలి దుష్ఫలితములకు దారితీయవచ్చును. ఒకవిధముగ చూచినచో మన మందఱము మనస్సు నేకాగ్రము చేయుదుము, కాని దాని నెట్లు పని చేయింపవలెనో ఎఱుగము. ఏకాగ్రమైన కారణమున ఈ మనస్సు విషయ సుఖముల వైపునకు అన్నిరకముల ప్రాపంచిక విలాసముల వైపునకు ఇనుమడించిన తీవ్రతతో పరుగులు తీయును. దాని నెట్లు సరియైన మార్గమున పెట్టవలయునో తెలియని యెడల అది యొక పెద్ద ప్రమాద కారణమగును. ఊర్ధ్వగతి నందని ఏకాగ్రత కంటె అసలు ఏకాగ్రత లేకుండుటయే శ్రేష్ఠము. మనయొక్క మనోభావములకు కోరికలకు ఊర్ధ్వగతులను చూపనిదే పారమార్థిక మార్గమున పురోగతిని బడయలేము. కనుక మనసా వాచా కర్మణా పవిత్రత అహింస సత్యము బ్రహ్మచర్యము మొదలగువాని ఆవశ్యకతను ఎంతయో వక్తి చెప్పవలెను. నిష్ఠతో నీతినియమములను పాటించిన పిదపనే ఏకాగ్రత ధ్యానములను సాధించుటకు ప్రయత్నింపవలెను. ఏకాగ్రమైన మనస్సు పరిశుద్ధము కానిచో అది ఒక పిశాచము వంటిదగును. సాధకునకు చెప్పలేనన్ని కష్టములను కలుగజేయును.

స్థూలమైన లౌకిక మగు భోగము లాభములపై ప్రాపంచికుని ఏకాగ్రత తన ప్రయోగములపై శాస్త్రజ్ఞుని ఏకాగ్రత ఆలోచనల రీతి వాని సిద్ధాంతములపై మన తత్త్వ శాస్త్రజ్ఞుని

ఏకాగ్రత ఆత్మానాత్మ వివేచనపై యోగి యొక్క ఏకాగ్రత ఇవియన్నియు బాహిరముగ ఏకాగ్రత యొక్క రూపములే. కాని ఆంతర్యమున వాని విషయములో అపారమైన భేదమున్నది. అందువలన అవి విభిన్నములగు అనుభవములను ఫలితములను ఇచ్చును.

సత్యాన్వేషకుడగు యోగి సాధారణముగ 'దేవుడు' అనబడు వానియందు విశ్వాసములేక దేశకాలసంబంధులైన స్థూలసూక్ష్మవిషయములతో ఏకాగ్రత ధ్యానముల నారంభించి పిదప ఆ విషయములను దేశకాలాతీతములుగ చేయవచ్చును. అటుపై అతడు దేశకాలపరిచ్ఛిన్నములగు సూక్ష్మ విషయములను ఏకాగ్రత ధ్యానములకు విషయములనుగా గొని పిదప వానిని దేశకాలాతీతములుగ చేయవచ్చును. ఇంకను ముందునకు పోయి అతడు ప్రథమమున అంతరింద్రియమగు మనస్సును తరువాత అహంకారమును తన ఏకాగ్రత ధ్యానములకు విషయములుగ చేయవచ్చును. ఈ విషయముల నిజస్వరూపమును తెలిసికొనిన పిదప అతడు ఈ పరిచ్ఛేదకములతో తన తాదాత్మ్యమును భావించుకొనుట మానివేసి ఆత్మకు సమీపస్థుడై బ్రహ్మానందమును జ్ఞానసాక్షాత్కారమును అనుభవించును

భగవంతుని విశ్వసించు వేదాంత సాధకుడు ప్రథమమున ఒక మహాత్ముడగు పావనచరిత్రుని దేశకాల పరిచ్ఛిన్నమైన భౌతిక రూపముపై ఒక ప్రతిమగనో చిత్రముగనో భగవత్ప్రతీకగనో ధ్యానింప వచ్చును. అటుపిదప అపరిచ్ఛిన్నముగ ధ్యానింపవచ్చును. మరికొంత పురోగమించి ఆ పావనమూర్తి హృదయము పైననో దివ్యచిత్తముపైననో ధ్యానమును నిలిపి క్రమముగ ఆ పావనగుణములను ఆత్మగతములుగ చేసికొనవచ్చును. ఆ తరువాత అతడు వ్యష్టియో సమష్టియో అగు విశుద్ధ చైతన్యమును ధ్యానించి తన పరిచ్ఛిన్నము అశుద్ధము అగు చైతన్యమును శుద్ధముగను విస్తృతముగను చేసి తనలోని పరమాత్మతో అనుసంధానమును సాధింపవచ్చును. అంతియగాక దివ్యసాక్షాత్కారమును కూడ బడసి సముద్రమును స్పృశించిన ఉప్పుబొమ్మవలె 'తాను' కరిగిపోయి నిర్వికల్పబ్రహ్మమునందు లీనుడు కావచ్చును. ఇట్లు వ్యష్టిచైతన్యము నవలంబించి వివిధప్రకారములగు ఏకాగ్రత ధ్యానముల నభ్యసించి దృశ్యద్రష్టసంబంధమును సకల సాపేక్షకత్వమును అతిక్రమించు విశుద్ధచైతన్యమును కైవల్యమును అద్వైతానుభూతిని అందుకొనగలుగును.

ఏకాగ్రత ధ్యానములకు మాత్రమే ప్రత్యేకించి ఏ పారమార్థిక విలువయును లేదు. మీదుమిక్కిలి మనఃపారిశుద్ధ్యమును భావములకూర్ధ్వగతిని సాధింపని మనుష్యుడు వాని నభ్యసించుట ప్రమాదకరమని కూడ చెప్పబడినది. చిరకాలమునుండి దుష్కర్మల చేత చెడు ఆలోచనల చేత పోగుపడిన చెడు సంస్కారములు ప్రవృత్తులు ఎంతవరకు మనస్సునందుండి క్షాళనమగునో అంతవరకు మాత్రమే ఏకాగ్రత ధ్యానములు పారమార్థికముగ ఉపయోగకరములగును. శ్రేష్ఠతమమైన నిస్సంగము పావిత్ర్యము మాత్రమే సాధకుని తీవ్రతరములైన సాధనలను విజయవంతముగ సాధించుట కర్హునిగ చేసి తుదను ఉత్కృష్టమైన దివ్యానుభూతికి మోక్షమునకు గొనిపోవును.

## దైవోన్ముఖత్వము

సామాన్య మానవునకు ప్రతి యొక్కనికిని ఏకాగ్రత ధ్యానములను అభ్యసించు సామర్థ్యము కలదు. కాని ఇవి సాధారణముగ ప్రపంచమున లభించు విషయములవైపు, విషయభోగ

ములవైపు సన్నిహితులవైపు తిరిగి యుండును. పారమార్థిక జీవనమును జీవించుటకు ఏ క్రొత్త సామర్థ్యమును హఠాత్తుగ సృష్టింప నక్కఱ లేదు. ప్రాతసామర్థ్యములను సంస్కారములను వాని తీవ్రతను తగ్గింపకయే దైవమువైపు త్రిప్పవలెను. అప్పుడు ఆ ప్రాపంచికుడు పారమార్థికు డగును. కనుక నిజమగు భక్తు డిట్లు ప్రార్థించును. "దేవా, అజ్ఞానులు ప్రాపంచిక విషయములపట్లచూపునట్టి బలవత్తర ప్రేమతో నేను నిన్ను తలచుకొనెదను గాక. అట్టి ప్రేమ నిరతమును నా హృదయమునందు నెలకొను గాక."

అహంకారము మాటిమాటికిని బహిర్గత మగుచునే యుండును. కనుక దానిని భగవంతుని సేవకునిగ నొనర్పుము అని శ్రీరామకృష్ణు లందురు. వాంఛలు ఉద్వేగములు నిగ్రహాము నకు లొంగవు. వాని తీవ్రత నట్లే యుంచుచు వానిని దైవమువైపు త్రిప్పుము—అని ఆ పారమార్థికగురువు ఉపదేశించును. స్త్రీ పురుషుల సాంగత్యమునకై ఉత్కంఠ చెందుటకంటె భగవదైక్యముకొఱకు ఉత్కంఠితుడ వగుము. అందఱియందును అతనిని దర్శింపుము. కాని నిన్ను నీవు మోసగించుకొనకుము. ఆత్మయొక్క తుదారిని భగవంతు డొక్కడే నివారింపగలడు. అతడు మాత్రమే ఆత్మగతమైన వెలితిని పూరించి శాశ్వతమైన ప్రేమానందముల నీయగలడు.

స్థూలములు కాని సూక్ష్మములు కాని అగు నీ విషయభోగముల కాటంక మగు వారిపై కోపించుటకు బదులు నీ భగవన్మార్గములో నున్న అభ్యంతరములపై కోపింపుము. నీ యొక్క నికృష్టవాంఛలపై నీ కల్లోలిత ఉద్వేగములపై చివరకు నీయొక్క కోపముపైననే కోపించుట నేర్చుకొనుము. వీని నన్నింటిని నీయొక్క గొప్ప శత్రువులనువలె పగగొనిన వైరులను వలె తొలగించుకొనుము. ఇంకొక మానుషరూపమైన ఆటబొమ్మను పొందగోరుటకంటె క్షణిక మైన లౌకికసంపదను పొందగోరుటకంటె భగవంతుని, నష్టము కాజాలనిది శాశ్వత శాంతి నిచ్చునది అగు అతని తరుగని సంపద నాశింపుము. భాగవత మి ట్లనుచున్నది. కామము క్రోధము భయము ప్రేమలు సాంగత్యము స్నేహములను భగవంతునివైపు త్రిప్పినచో అవియే భగవదైక్యమునకు గొనిపోవును. పరుసవేది తాకినచో అన్ని లోహములును బంగారమగునట్లే భగవంతు డను పరుసవేది తాకిన వాంఛలు ఉద్వేగములు క్రోధలోభములు వాని దుష్టస్వభావమును కోల్పోయి ఆత్మకు బ్రహ్మానందమును అమరత్వమును ఇచ్చు స్వచ్ఛమగు భక్తిగ మారిపోవును. "అత్యంతము దుర్మార్గుడగు వాడు కూడ అనన్యచిత్తుడై నన్ను భజించునెడల - అతని సంకల్పము ఉత్తమమైనది. అచిరకాలముననే అతడు ధర్మవర్తనుడై శాశ్వతశాంతిని బడయగలుగుచున్నాడు. నా భక్తునకు వినాశము లేదని ఘంటాపథముగ చెప్పవచ్చును" అని భగవద్గీత యనుచున్నది.

మీ సంస్కారము లన్నింటిని దైవోన్ముఖములుగ చేయుడని శ్రీరామకృష్ణులు మరల మరల చెప్పుదురు. ప్రత్యేకము భక్తిమార్గమున వాంఛలు ఉద్వేగములకు బుద్ధిపూర్వకముగ వాని తీవ్రతను తగ్గింపకనే ఊర్ధ్వగతిని చూపవలెను.

## ఆత్మను పరిశుద్ధముచేయు విధానము

ఉదాహరణమునకు కోపమును తీసికొందము. మనమేల కోపింతుము? మనము ఆనందసాధనమని భావించు విషయమున కడ్డుగ నేదైనను ఎవరైనను ఉండుటవలననే.

మన కోపమునకు గల కారణమంతయు నిదియే. ఎల్లప్పుడును క్రోధమనునది మనయొక్క దృఢమైన అహంకారమునకు గాని వ్యక్తిత్వ భావనకుగాని సంబంధించియుండుటను గమనింతుము. ఇట్టి అహంకారము, ఉద్వేలమగు భోగవాంఛ (మానసిక భోగమే కాని భౌతిక భోగమే కాని) లేనిచో మన హృదయమునందు కోపమనునదే తలఎత్తజాలదు. కనుక ఈ అహంకారమే భోగవాంఛయే మనము కోపించుటకు ఏకైక కారణము. మనము ఏ భోగమును ఆశింపనిచో ఎవరినుండిగాని దేనినిగాని ఆశింపనిచో, ప్రతిఫలమును దేనినిగాని ఆశింపక ఇచ్చుచు పనిచేసినచో, క్రోధమనునది కలుగనే కలుగదు. మనము కోపింపవలసినది మన కోపముపైనే, ఇతరులపైగాదు. విషయములపైగాక విషయ సుఖములపైగల మన ఆశలపైనే మనము అత్యంతము కోపింపవలసియున్నది. కోపమును పెకలించివేయుటకు తుదకు నిర్మూలించుటకును సాధ్యమగుమార్గము ఇది యొక్కటియే. ఈ క్రోధమును తత్సంబంధమైన దోషములను చాలవరకు నిర్మూలింపనిదే పారమార్థిక జీవనమున మనము ఏ మాత్రపు పురోగమనమునుకూడ సాధింపలేము. కామక్రోధములు ఆధ్యాత్మికమార్గమునందలి రెండు మహాశత్రువులు. కావున సాధకులు వానిని అతి జాగ్రత్తతో దూరముగ నుంచవలెను.

ఎప్పుడు క్రోధము జనించినను ఏదియో యొక సక్తత యుండును. ఒక మితిలేని వాంఛ అనురాగము ఉండును. ఏలన ఒక వ్యక్తియందుగాని వస్తువునందుగాని సక్తత లేక క్రోధమనునది తలయెత్తజాలదు. విషయభోగము నిరాకరింపబడిన మనోవాంఛయే కోపమును కల్పించును. కాని ఈ విషయమును స్థూలబుద్ధితోగాక సూక్ష్మమగు అర్థమున గ్రహింపవలెను. కోపకారణము తప్పనిసరిగా స్థూలమగు భోగవాంఛయే కానక్కరలేదు.

ఒకడు వాంఛలవలని దుష్ఫలితములను స్పష్టముగ నెరిగియే యుండవచ్చును. అయినను అతడు వానిని పూర్తిగ తొలగించుకొనలేక పోవచ్చును. అతడు వాని నతిక్రమించుట ఎట్లు? అతడేమి చేయవలెను? ప్రత్యక్షముగనో పరోక్షముగనో అతడు అన్ని కోరికలను, ఉద్వేగములను ఇంద్రియ ప్రేరణలను బుద్ధిపూర్వకముగ ప్రయత్నపూర్వకముగ భగవంతునివైపు త్రిప్పవలెను. పాటలు పాడుట అతనికి మిక్కిలి ఇష్టమైనచో అతనిని భక్తిగీతములను భగవత్సంకీర్తనములను విననిమ్ము. అట్లు వినుచున్నంతసేపును అతనిని భగవంతుని తలచుకొననిమ్ము. అతనికి కళాత్మక దృష్టి బలవత్తరమై కళలను అనుభవింపవలెనను కోరిక అతిశయముగ నున్నచో పావనమగు కళనొక దాని నెన్నుకొని భగవంతుని స్థాయినందుకొనుటకు దానిని సోపానముగ చేసికొనవలెను. అతనికి పుష్పసౌరభములు కుసుమసౌందర్యములు అనిన ఇష్టమైనచో వాని ననుభవింపవలెనను కోరిక కలిగినచో ఆ పూవులనుకోసి భగవంతుని కర్పింపనిమ్ము. వానితో తనివితీర భగవంతుని పూజాపీఠము నలంకరింపనిమ్ము. ఎవరినైనను ప్రేమింపదలచినచో ఎవరిచేనైనను గాఢముగ నాకర్షితుడైనచో ఆ వ్యక్తిలోని భగవంతుని ప్రేమింపనిమ్ము. అందువలననే భగవంతునివైపు నేరుగ నాకర్షింపబడనిమ్ము. బుద్ధిపూర్వకముగ ప్రయత్నపూర్వకముగ చేసినచో ఇదియంతయు ఒక శక్తివంతమైన నిగ్రహకారణముగ పనిచేయును. క్రమబద్ధ

ముగ నడిపించును. మనవాంఛలను క్రమముగ ఊర్ధ్వగతులను కల్పించి మనలను పవిత్రతరులను చేయును. కాని ఇచ్చటకూడ సాధకునకు చరమలక్ష్యమేమనగా సంపూర్ణమైన ఆత్మ సంయమము, భగవత్సాక్షాత్కారము మాత్రమే. తక్కినదంతయు దానికి సోపానములుగనే పనిచేయును. ఈ సోపానరీతి ననుసరించుచు చివరకు మనము అత్యున్నతస్థాయి నందవలసియున్నది.

మనస్సునందు చేరుకొనిన మురికిని దుర్వాసనలను మూలమూలలనుండి తొలగించినగాని మన సమస్య పరిష్కారముకాదు. గది తలుపుల సందులోనుండి ఒక కాంతి కిరణము మాత్రము లోపలకు ప్రవేశించి తక్కిన గదియంతయు చిమ్మచీకటి ముసరియుండి దుర్గంధకూపముగ నుండినచో సాధింపబడినదేమియు లేదు. అట్లే మన మనస్సునందును ఒక సన్నని కాంతికిరణముమాత్రమే ప్రవేశించి అచ్చట పడియున్న చెత్తచెదారమంతయు ప్రస్తుతమునకు దూరముననున్న మారుమూలలలోనికి త్రోయబడినచో నిజమగు ఏ పారమార్థిక ప్రబోధమును కలుగదు. అట్టి యవసరమున మానవుడు ఇట్టి 'మెరపు'లను చూచుటకు ముందు ఎట్లుండెనో పిదపకూడ నట్లేయుండును. పట్టి సిద్ధాంతములు తత్త్వశాస్త్రములు అవి ఎంత అద్భుతములైనను మనకెట్టి సహాయమును చేయజాలవు. ఆవశ్యకమైన దేమన స్వానుభవమున అనుష్ఠానము ఊర్ధ్వపరివర్తనము, మనస్సునందుచేరిన మురికిని తొలగించుట– అంతియకాని కొందఱనునట్లు చిత్తవృత్తుల నన్నింటిని పూర్తిగ "నిరోధించుట" కాదు. ఇది ప్రారంభదశలో ఇచ్ఛాపూర్వకమైన నిద్రనుమాత్రమే కల్పించునుగాని సత్యమగు ఎట్టి సాక్షాత్కారరూపమును కాదు. పారమార్థిక జీవనమున ప్రప్రథమముననే సంపూర్ణమగు చిత్తవృత్తి నిరోధమునుగూర్చి మాటలాడువారు వారేమనుచున్నారో వారెఱుగరు.

సర్వసాధారణముగ మనకు కొంత బాహ్యమగు నిగ్రహముమాత్రమే ఉండును. కాని ఇదికాక నిజమగు ఆంతర నిగ్రహముకూడ నుండవలెను. మనము బాహిరముగ నిగ్రహవంతులమై మనస్సులోని ఇంద్రియ స్థానమును అచటి సంచలనమును నిగ్రహింపలేకున్నను క్రమముగ ఉన్నతతర నిగ్రహములను సాధింపగలము. ఇంద్రియములు నిగ్రహింపబడినను విషయభోగములకై అవి ఉత్సుకము లగుచున్నచో నిజమగు నిగ్రహము సాధింపబడలేదు. దానియొక్క బాహ్యస్వరూపము మాత్రమే సాధింపబడినది. అయినను అది సన్మార్గమున నొక ముందడుగే.

ఒకవిధమగు నిగ్రహమేమన ఇంద్రియ విషయములనుండి పూర్తిగా తొలగిపోవుట, ఇంకొకవిధమేమన క్రొత్త వాంఛలను కల్గించి సాధకుని బాధింపని పరిశుద్ధములగు విషయములతో సంపర్కము కలుగనిచ్చుట. మనలో చాలమందికి ఇదియే శ్రేష్ఠతరము సులభతరము అగు పద్ధతి.

"ఓనా మనసా అమ్మను పూజింపుము. గురూపదిష్టమైన మంత్రమును రాత్రింబవళ్లు జపింపుము. నీవు పరుండినచో అమ్మకు సాష్టాంగ నమస్కారములు చేయుచున్నట్లు భావింపుము. నిద్రించునపుడు ఆమెను ధ్యానించుచున్నట్లు భావింపుము. భుజించు

నపుడు ఆమెకు నైవేద్యము సమర్పించుచున్నట్లు ధ్యానింపుము. సంతోషాతిరేకముతో రామ ప్రసాదు ప్రకటించుచున్నాడు. అన్ని శరీరము లందును అమ్మ వసించును. ఊరిలో నడచు నపుడు అమ్మకు ప్రదక్షిణము చేయుచున్నానని యనుకొనుము.''

చక్కని ఈ గీతమునందలి భావమిది. జీవిత మున మనముచేయు ప్రతియొక్క పనిని బుద్ధి పూర్వకముగ ప్రత్యక్షముగనో పరోక్షము గనో దైవమున కన్వయింపవలెను. భగవ త్సాన్నిధ్యమును నిరంతరము అభ్యసింప వలెను.

---

# మధుర స్మృతులు

## శ్రీ హిరణ్మయానందస్వామి

నే నపుడు విద్యార్థిని. బేలూరుమఠమునకు పోయి శ్రీ శివానందజీ మహారాజులను అప్పు డప్పుడు దర్శించెడివాడను. నేను వారితో ఎక్కువ మాటలాడునది లేదు. చర్చించునది లేదు. వారిని అడుగుటకు ప్రత్యేకముగ ప్రశ్న లును ఏవియు నా కుండెడివి కావు. నాకు అర్థము కాగలిగినదంతయు కావలసినదంతయు స్వామిజీ (శ్రీ వివేకానందస్వామి) సాహిత్యమును చదివియే తెలిసికొంటిని. ఇక నేను మాటిమాటికిని మఠమునకు పోవలసిన అవసరమేమి ? అనినచో అది ఏదో అనిర్వచనీయమైన ఆకర్షణ. మాట లలో చెప్పలేని మధురానుభూతి. నేను పోయి శ్రీ శివానందజీ మహారాజులకు ప్రణామము చేయుదును. వారి ఒక చూపు – ఒకమాట – 'కుశలమే కదా' అని ఎపుడైన వా రందురు. 'ఆఁ కుశలమే' నని నేను బదులిత్తును. దానితో నాకు ఆ రోజంతయు, రోజులతరబడి, ఏదియో దివ్యశక్తి ఆపాదమస్తకము నింపివేసినట్లుం డును. శ్రీ శివానందజీ మహారాజులతో నా పరిచయ మట్టిది.

ఒకనాడు ఎప్పటివలెనే వారికి ప్రణామము చేయబోయితిని. వారు ధ్యానమగ్నులై యుండి రేమో. 'ఎందుకు నీవు ఇట్లు చేయుదువు ? మాటిమాటికి నన్ను విసిగింతువు ?' అని కోప గించుకొనిరి. నాకు చాల మనస్తాపము కలిగి నది. వారు నా గురువు. నన్నిట్లు తిరస్కరించుట ఏల ? నేను వచ్చుట వారికి అట్టి అభ్యంతరమా ? అయినచో నాతో స్పష్టముగ ననవచ్చునే ? నేను మరల ఆచోట అడుగే పెట్టను గదా ! ఇంటికి ఇట్టి భావములతో మరలి పోయితిని. అట్లే ఒక ఘాటైన ఉత్తరమును వ్రాసితిని. దానిని పోస్టుకూడ చేసితిని.

కొన్నాళ్ల పిదప ప్రత్యుత్తరము వచ్చినది. అందు, ఇప్పుడు మన మనునట్లు ఈ మాట లన్నియు నీ మేలుకొసమే అంటినని లేదు. మన మాశించునట్టి క్షమాపణలు లేవు. 'నేను వృద్ధు డను. ఒక్కొకసారి నాకు కోపము వచ్చును. ఇది స్వామిజీ మఠము. ఇచ్చటకు వచ్చుటకు ఎల్లరకును అధికారము గలదు' అని మాత్ర మున్నది.

శ్రీ శివానందజీ మహారాజులకు శ్రీరామ కృష్ణులపై గల భక్తి చెప్పనలవిగాదు. శ్రీ రామకృష్ణుల శిష్యగణమంతయు నట్టిదే కాని ప్రత్యక్షముగ చూచుటచేత వారు శ్రీరామ

కృష్ణుల కెట్టి ప్రాముఖ్యము నిచ్చి తమను తా మెంతగ ప్రచ్ఛన్నులను చేసికొందురో నాకు స్పష్టముగ తెలియనైనది. శ్రీ వివేకానందుల పైనను వారి భక్తి అట్టిదే.

ఒకనాడు మా తోటలోని మామిడిపండ్లను శ్రీ శివానందజీ మహారాజులకై కొనిపోయితిని. మాఊరు మామిడిపండ్లకు ప్రసిద్ధి. అందు మరియు మేలైన పండ్లను నేను ఏరి తెచ్చితిని నేను వానిని మహాపురుష్‌జీ మహారాజులకనియే (శ్రీ శివానందస్వామివారు) ఉద్దేశించితిని. కాని వారు వానిని చూచుటతోడనే 'ఎంత చక్కని పండ్లు! వీనిని గురుదేవుల కర్పింతము' అనిరి. మరియొకనాడు వారికై చక్కటి ఎఱ్ఱ గులాబీలను కొనిపోయితిని. అప్పుడే విరిసినవి. పెద్దవి. ఎఱ్ఱనివి. ఎంతో బాగున్నవి. మహాపురుష్‌జీ వానిని చూడగనే 'ఎంత చక్కని పువ్వులు! వానిని స్వామిజీ మేజాపై నుంచుము. అవి యచ్చటనే రాణించును' అనిరి. స్వచ్ఛములు నవవికసితములు శ్రేష్ఠములు సర్వోత్కృష్టములు అయిన వన్నియు గురుదేవులకు స్వామిజీకి అర్పింపవలెనని వారి యభిలాష. వారి మాటల తన యునికియే అస్తిత్వమే వారికి జ్ఞప్తియందుండునట్లు తోచదు.

మరియొకసారి, శ్రీ శివానందజీ వృద్ధులై త్రోపుడు కుర్చీలో త్రిప్పబడుచుండి నప్పటి సంగతి. ఒకరోజు స్వామిజీ గదిముందటి వరండా యందు వారు త్రోపుడు కుర్చీలో కూర్చుండి ఒకస్వామి దానిని త్రోయుచుండగా ముందునకు వెనుకకు 'పచారు' చేయుచుండిరి. నేను అచ్చటనే కొంత దూరమున నిల్చుండియుంటిని. వారు ముందునకు వచ్చునపుడు దక్షిణేశ్వరము దిక్కు మొగమై యుందురు. కుర్చీ మరలునపుడు స్వామిజీ గది కభిముఖు లగుదురు. దక్షిణేశ్వరమును చూచుచున్నంతసేపును వారు సంతోషముతో చప్పటలు కొట్టుచుందురు ఆనందముతో కేరింతలాడుదురు. స్వామిజీకి కాగనే వారి ముఖ కళవళిక లన్నియు చేతితో తీసివేసినట్లు మారిపోవును. 'జై స్వామిజీకీ జై' అని ఉచ్చైఃస్వరముతో గంభీరముగ పలుకుచుందురు.

ఇది చిన్న విషయము కాదు. మహాపురుష్‌జీ స్వామిజీకన్న పెద్ద. వారిని 'నరేన్' అనియు 'నీవు' అనియు పిలిచెడివారు. స్వామిజీ వారిని తారక్‌దా (తారక్ అన్నయ్యా) అనియు 'మీరు' అనియు సంబోధించెడివారు. అట్టి మహాపురుష్‌జీ 'జై స్వామిజీకీ జై' అను నప్పుడు స్వామిజీపట్ల వారికిగల ప్రేమాతిశయము గౌరవోపప్లవములను మనము గుర్తింప గలుగవలెను.

శ్రీ రామకృష్ణుల శిష్యగణమంతయు అట్టివారే. ప్రేమను ఆర్ద్రతను చిప్పిలుచుందురు. ఎవరికి వారే మహోన్నతగిరిశృంగములు. అయినను ఎవరి విశిష్టత వారిది. నేను మరికొందఱు ప్రథమ శిష్యులనుకూడ దర్శించితిని. ఒకనాడు అఖండానంద స్వామివారు వచ్చియుండిరి. మఠమున నొక గదిముంగట కూర్చుండి యుండిరి. నాకప్పుడు వారెవరో తెలియదు. వారిని చూచుచునే వారి ముందునుండి పోయితిని. మహాపురుష్‌జీ మహారాజులకు ప్రణామమాచరించి రెండవద్వారము ద్వారా వెలుపలికి వచ్చితిని. అచ్చట మేనేజరు మహారాజులను చూచి ఆ కూర్చుండియున్న స్వామి ఎవరని యడిగితిని. వారు నన్ను తీసికొనిపోయి పరిచయము చేయగా నేను వారికి ప్రణామము చేసితిని. "నీ ప్రణామములను అర్హతల క్రమమున చేయుదువా?" అని వారి ప్రశ్న. నేను తత్తరపడుచుండగా "అందుకనియేనా మేనేజరుగారిని

పిలుచుకొని వచ్చితివి!'' అని యుటంకించిరి. ఒకరు ఇట్లు మృదువుగ ఆటలు పట్టింతురు.

మరియొకసారి శ్రీ సుబోధానందజీ మహా రాజు వచ్చియుండిరి. నేను వారికి ప్రణామము చేయబోగా వారు స్వీకరింపలేదు. నేను చాల నొచ్చుకొంటిని. ఇప్పుడే గదా మహాపురుష్ జీకి ప్రణామము చేసివచ్చితిని. నన్నేల వీరు ప్రణామము చేయనీయరని మనసు కష్టపెట్టు కొంటిని, క్రిందికివచ్చి గంగాతీరమున మరియొక స్వామితో మాటలాడుచు నిలుచుంటిని. సుబోధానందజీ గది కిటికీవద్ద నిలుచుండి నా వైపే చూచుచుండిరి. చాలసేపు అట్లు చూచు చునే యుండిరి. తరువాత కొంతకాలమునకు మరల మఠమునకు పోయితిని. శ్రీ సుబోధా నందజీ మహారాజుల గది ఖాళీగా నుండెను. వారెక్కడ అని యడుగగా వారికి టి. బి. అనియు హాస్పిటలునందు చేర్చిరనియు తెలిపిరి. వారు నన్నేల ప్రణామము చేయనీయలేదో నా కప్పుడవగతమైనది. నా మనస్తాపమును వారు తప్పక గమనించియుందురు. అందుచేతనే కిటికీ వద్దనుండి అంతటి కరుణార్ద్రదృక్కులతో నన్ను అంతసేపు తడిపివేసిరి.

విజ్ఞానానందస్వాములవారితో నా కెక్కువ పరిచయము. వారు ఒక పర్యాయము 'నీవెట్లు నిద్రపోవుదువు' అని నన్నడిగిరి. ఇది యొక ప్రశ్నయా అనుకొనుచు 'ఏమున్నది? పడకపై పడుకొందును నిద్రపోవుదును' అని యంటిని. వారు, 'నేను పడకపై పడుకొందును ఆలోచ నల నన్నింటిని పారద్రోలుదును, ఆటుపై నిదురపోవుదును' అని యనిరి. కొంచెము గొప్పతో 'నేనంతటి శ్రమపడ వలసిన యగ త్యము లే'దని నేనంటిని. అది విని వారు ఒకటే నవ్వు. పడీ పడీ నవ్విరి. ఆలోచనలను పార ద్రోలుటయన సమాధిస్థితి యని వారి భావము. అది నాకు తరువాత గదా తెలిసినది.

వారు స్వామిజీనిగూర్చి అనేకములైన సంఘ టనలను తెల్పెడివారు. ఒకనాటి రేయి వారు స్వామిజీ గది ముందునుండి పోవుచు తలుపుసందు నుండి వెలుతురు వచ్చుచుండుటను గమనించిరి. ఇది ఏమని తొంగిచూడగా స్వామిజీ శరీరము కాంతు లీనుచుండుట కన్పించినది. అది చూచి వారు భయపడి పారిపోయిరి. మరునటిదినమున వారు మీ శరీరము అట్లు వెలుగు చిమ్ముచుం డిన దేమని యడుగ స్వామిజీ సహాసముగ నిన్న రాత్రి నీ వేమి తింటివని యడిగిరట. ఏమైన అజీర్తి చేసి కలలు కంటివా? అని వారి యభి ప్రాయము. కాని ఈ సంఘటన శ్రీరామకృష్ణ సంప్రదాయమున మహిమలకు అద్భుతశక్తులకు ఎట్టి తృణీకారము లభించునో స్పష్టముచేయునే కాని ఆ ఫలితముల యాథార్థ్యమును సందేహా స్పదముగ చేయదు. హృదయుడు శ్రీరామ కృష్ణుని తనను కూడ జ్యోతిర్మయస్వరూపుల నుగ దర్శించి ఎట్టి గంతులు వేసినది స్మృతికి తెచ్చుకొనినచో ఈ సంఘటన మజియు అర్థ వంత మగును.

ఇంకొకనాడు శ్రీ అభేదానందస్వామి వచ్చి యుండిరి. వారిది కొంచము చామనచాయ వర్ణమేయైనను కనుముక్కు తీరు ఎంతో చక్కగనుండి గ్రీకోరోమన్ అందమును తల పించుచుండురు. వారప్పటికి వయస్సున వృద్ధులు. ఆ సాయంతనమున వారు గురు దేవుల మందిరముకడ నిల్చుండియుండగా భక్తులందఱును వరుసగా ప్రణామములను చేయుచుండిరి. ఇంతలో ఒక భక్తుడు కాళీ మహారాజు (శ్రీ అభేదానందస్వామి) శ్రమ పడుటను సహింపలేక 'ముసలాయనను

పాపము కూర్చుండనిండు. తరువాత తీరికగా ప్రణామములను చేయవచ్చును' అని విసుగు కొనెను. ఇది విని వెంటనే కాళీమహారాజు మందిరమువైపు చూపుచు "ముసలాయన అదిగో అచ్చట కూర్చుండియున్నాడు. మే మెన్నడును ముసలులము కాబోము" అని పలికెను. వారి గాంభీర్యమట్టిది.

ఒకపరి మాస్టరు మహాశయులను చూడ బోయితిని. నా చేతిలో కీరో (Cheiro) సాముద్రికపు పుస్తకముండెను. నీకు చేయిచూచుట తెలియునా అని వారు నన్నడిగిరి. నేనింకను ఏమియు చదువలేదు. అయినను వారు తమ చేయి నాకిచ్చి చెప్పుమనిరి. నేనును ఆ చేయి అందుకొని ఇది జీవితరేఖ ఇది హృదయరేఖ ఇది విధిరేఖ యనుచు చెప్పితిని. వారు ఇంత సంబరపడిరి. నా చేయందుకొని నా మోచేతి క్రింద నొకచేయియు అరచేతిక్రింద మరియొక చేయియుపెట్టి తూచుచు, ఆఁ ఇది చాలమంచి చేయి అనిరి. (శ్రీ గురుదేవులు తమ శిష్యుల అర్హతను పరీక్షించు విధములలో నిది యొకటి).

ఇట్లు శ్రీరామకృష్ణుల శిష్యగణమంతయు ఎవరికివారే ప్రత్యేకతను చూపుచుందురు. ఎవరికివారే సాటి. వారందరిది అదియొక ప్రత్యేకమైన స్థాయి.

శ్రీరామకృష్ణమఠమున నేను చేరుటకేమి కారణమని నన్నడుగుచుందురు. ఏమి కారణము? మొదట శ్రీవివేకానందులు తరువాత శ్రీరామకృష్ణులు పిలుచుటయే కారణము. ఆ పిలుపు మనకు తెలియవచ్చును తెలియక పోవచ్చును. కాని ఆ పిలుపును తెలిసియో తెలియకయో అందుకొనగలిగినవారు ఇతర మేమియు చేయజాలరని నా యభిప్రాయము. స్వామిజీయో శ్రీరామకృష్ణులో పిలిచినచో రాక ఎట్లు తప్పును? వేలకొలదిగ గల ఈ యువక సమూహములోనుండి వారిచే ఎన్న బడుటయన్న అదియే మహాత్కటాక్షము.

# ఆస్తికుడంటే ఎవరు?

చివుకుల కృష్ణమూర్తి

(గతసంచిక తరువాయి)

అవి మన అజ్ఞానాన్ని మభ్యపెట్టేందుకు పని కొస్తున్నాయా, లేదా, అమృతతుల్య మౌతు తున్నాయా, అనేదే మన ప్రశ్న. అసలు C వైటమినో (లేక మరొక వాస్తుగుణమో) ఒక ప్రత్యేక గుణంగ ఎందుకు వెలసింది – ఇన్ని రకరకాల గుణాలు సృష్టిలో ఇంత విపులంగ – అనుకరించడానికి అభ్యంతరంగ, ఎలా వెలిశా యని ఎవరు చెప్పగలరు? కారణం లేక ఇన్ని వస్తుతత్వాలు, ప్రాణికోటివిధాలు, వైవిధ్యాలు, ఎన్నో ప్రత్యేకతలతో, నిత్యనూతన మనిపించే పరిణామాలతో నిస్సంకల్పంగ, మౌలికంగ (originally) ఏర్పడగలవా? ఒక్కొక అణు సముదాయం ఒక్కొక ప్రత్యేకతగ తయారైం దేమోనంటే సృష్టి సర్వత్రా ఉన్న వృద్ధి – పుష్టి – సంతుష్టి – సుఖం – శాంతి వంటి సమైక్యమైన పురోగతికాంతు ఎలా కుదిరింది? మూలధాతువులు (elements) ఒకకొన్నే (limited in number) కనుక సృష్టికిఒకవిధమైన సమైక్యత కుదిరిందంటే – అసలు ఆ మూల ధాతువుల విభిన్నతకు కారణమేమి? మరలా

క్రమేణా జరిగిన సంయోగ వితరణకు ఎవరి సంకల్పం కారణం?

నిమ్మకాయను కోసి చూస్తే C వైటమిన్ కనబడదు. అసలు C వైటమిన్ అనే గుర్తింపు (labelling) ఇంగ్లీషుభాష అలవాటుగ నున్న దేశాలలో ఒకానొక ఆహారపు విలువను గణించే తీరు. చైనాలోనో రష్యాలోనో దీన్నే మరొక పేరుతో పిలువవచ్చును. ఈ వస్తువు – దేవునివలె – అసలు మనం దానిని ఉన్నట్లు సృష్టిలో గుర్తించినా, లేకపోయినా, అది నిజమైనది. దాని విలువ, అది తక్కువై బాధ పడే వ్యక్తి ద్వారా ఇతరులకు, దాన్ని స్వయాన పుచ్చుకుని కోల్కొన్న తరువాత ఆ వ్యక్తికీ అవగతమౌతుంది.

‘దేవుడు’ అనేమాట కూడ ఒకానొక పేరు మాత్రమే. ఇంకెన్ని పేర్లతోనైనా సృష్టికర్త పిలువబడవచ్చును. అసలు, అతడు లేడన్న వానికీ తెలియకనే ఉన్నాడు. ఉన్నాడన్న వానికీ స్వానుభవరూపంగానే తప్ప ఇతరత్రా నిరూపించడానికి ఒదగడు. C వైటమిన్, దేహానికి ఒక పరిమిత పరిధిలో అత్యంత ముఖ్యావసరమైతే, దేవుడనే పరమగుణుడు – గుణాతీతుడు – మానవమేధకు అంతు చిక్కని నిర్గుణుడు – మన దేహానికే కాదు – దుఃఖమయమైన మన జన్మరోగానికే పరమావసరమైనవాడు. మన అజ్ఞానము – నిరుత్తరంగ మనలో నిలచిన ప్రశ్నలకూ అచ్చెరువున ముంచు సృష్టివైచిత్ర్యవిభ్రమానికీ, ఆలవాలమై, జననమరణాల ముందు వెరుకలకూర్చి వాపోవునది. ఈ బాధాకరమైన అజ్ఞానరోగానికి ఆస్తికతే మందు. పరమాత్ముని గూర్చిన చదువు, సంస్కారం, వస్తువు, వేదం, ఒజ్జ, మనం విశ్వసించి, ఫలితం పొంది, స్వానుభవం ద్వారానే ఈ పరమగుణ రసాస్వాదనం చేయగలం. ఈ పరమగుణం మనలో తేగల మంచి మార్పు (జ్ఞానం, నిర్భయత, నిస్సంశయత, దుఃఖాతీత శాంతి) అర్థం చేసుకోగలం. కనుక నమ్మకమే నాందిగ ఆత్మకళ్యాణ సౌఖ్యమే పరమావధిగ, నెలకొన్న జీవిత కావ్యానైజమే ఆస్తికత. ఏ అమాయకుడో, పిచ్చివాడో, కార్యశూన్యుడో, అవివేకో, అప్రయోజకుడో, తెచ్చికోలుదనంతో నెత్తిన రుద్దుకొన్న మూఢ విశ్వాసం కాదది. యుగయుగాలుగ, తరతరాలుగ, ఆస్తికత సాధించిన ఇహపరసౌఖ్యాన్ని మొదట నమ్మి ఆ తరువాత నిరవధికంగ యత్నించి దానిని స్వంతం చేసుకొనే ధీరుడు ఆస్తికుడు.

ఓం తత్ సత్.

# తిరువళ్ళువనాయనారు

## నే. భక్తవత్సలము

తమిళభాషకు గల ప్రశస్తికి ఎన్నో కారణము లున్నవి. ఆకారణములలో ప్రథమ కారణము తిరుక్కుఱళు దానికి సొంత మగుటే అని చెప్పినచో అతిశయోక్తి కాజాలదు. ఆ గ్రంథవరిష్ఠతను గుర్తించియే పలుభాషల వారు దానిని తమతమ భాషలలోనికి అనువదించుకొని ఆత్రముతో ఆస్వాదించుచున్నారు. తిరుక్కుఱళులోని భాషను అర్థము చేసికొనుట సులభము కాదు. కావుననే పలుటీకలు దానికేర్పడియున్నవి. అయినను పరిమేలళగరు

మణక్కుడియరు అనెడి యిద్దఱి టీకలు మాత్రమే ముద్రితములై ప్రకటింపబడి యున్నవి. తక్కినటీకలు ప్రస్తుతము లభ్యములుగ లేవు. ప్రకటితములై యున్న టీకల లోను పరిమేలళగరుగారి టీక బహువిషయ సంపన్నముగ నున్నది. దానిని చదివినవారు బహువిషయజ్ఞు లగుదు రనుట నిజము.

తిరుక్కుఱళును రచించిన వళ్ళువనాయనారునుగూర్చి వాడుకలో నున్న వక్కణమాలివి—ఆయన అగస్త్యమహర్షి వంశీయుడు. అతనితల్లి 'ఆది' మాలవాడలో పెరిగినది. అతనికి అవ్వ ఉప్ప ఉరువ వళ్ళి అనెడి నలుగు రక్కలును, అదిగమాను కపిలుడు అనెడి యిద్దఱన్నలు నుండిరి. తండ్రియగు తిరువారూరు భగవానుని నియమానుసారము తల్లియగు ఆది బిడ్డలను కన్న తావుననే విడిచి యేగినది. అవ్వ, సరస్వతి యంశమం దవతరించిన దట. ఈమెచే సంఘపండితులు గర్వభంగ మొందిరట. ప్రథమశిష్యుడు ఏలేలసింహుడట. వళ్ళువయోగీంద్రుని ధర్మపత్నియగు వాసుకి ఇసుకను తన పాతివ్రత్య మహిమచే అన్నముగ మార్చిన దట. ఏలేలసింహుని వర్తకనావ గట్టుకు మోదుకొని ఒరగినప్పుడు, వళ్ళువయోగి దానిని తాకగా, ఆ స్పర్శ మాత్రముచేత అది చక్కబడిన దట. ఈయన అగస్త్యాశ్రమమునకు జని అగస్త్యమునీంద్రునకు తన గ్రంథమును జూపి మెప్పొందె నట. తల్లి చేత విడువబడిన వళ్ళువయోగి వేళాళకులము వారి పోషణలో పెరిగి పెద్ద యయ్యె నట. ఈయనభార్య వేళాళకులమువి యట. నేత వృత్తి చేయుచు వళ్ళువయోగి ఈమైలాపూరులో వసించియుండె నట.

ఇట్లు చెప్పబడు అంశములలో నిజ మెంతో కల్పిత మెంతో పరిశోధనచే నిర్ణయ మొంద వలసియుండును.

ఆదియు భగవుడును వళ్ళువయోగీంద్రుని తల్లిదండ్రు లని 'కపిలరగవల్' అను గ్రంథమున జెప్పబడియుండ, జ్ఞానామృత మనెడి మఱొక గ్రంథమున యాళిదత్తుడును విప్రవనిత యని భ్రమగొని అతడు కలిసిన యొకమాలపడుచును వళ్ళువయోగీంద్రుని తండ్రియు తల్లియు నని తెలుపబడియున్నది. ఈక్రమములో 'ఇదే సరి అయినది, అది కాదు' అని తీర్మానించుటకు ఆధారములు లేవు.

దండోరా వేసి రాజశాసనమును చాటుట వృత్తిగా గల కులము వళ్ళువకులము. ఆ కులమున పుట్టుటచే ఈతనికి వళ్ళువనామము గలిగె నని కొందఱును ఆకులమున పెరుగుటచే ఇతని కాపేరు ఏర్పడె నని మఱికొందఱును చెప్పుచున్నారు. వారిమాట నిజమో వీరి మాట నిజమో నిశ్చయించుటకును ఆధారములు లేవు.

వళ్ళువయోగీంద్రుని సొంతఊరు దక్షిణ మధుర యని కొందఱును మైలాపూ రని కొందఱును చెప్పుచున్నారు. మైలాపూరులో ఈయన కొక గుడియు కట్టబడియున్నది.

వళ్ళువయోగీంద్రుని వృత్తి 'నేత' అని పరంపరగా విశ్వసింపబడుచున్నది.

అహింసాది ధర్మముల నొక్కివక్కాణించి యున్నందున ఈయన జైను డనియు బౌద్ధు డనియు నూహించువారు కొంద ఱున్నను, అవి వైదికమతధర్మములలో చేరినవే యైనందున నితడు వైదికమతమువాడు కా డనుట కాధారము లే దనువారు పెక్కుండ్రుగ నున్నారు.

శైవుడో వైష్ణవుడో నిర్ణయించుటకును ఏకాంతికములైన ఆధారములు కానరావు.

ఈ గ్రంథమందలి ప్రయోగములను బట్టి ఈకవి తుదిసంఘకాలమునకు మునుపటివాడని మాత్రము చెప్పనగునే కాని, ఏశతాబ్దము వాడో నిశ్చయింప జాలకున్నాము అనుచున్నారు విమర్శకులు.

'కుఱళు' అనునది ఒకఛందము. అది తెలుగులోని ద్విపదకంటెకూడ చిన్నది. అంతటి చిన్నఛందోబంధమున కొండంత యర్థము నిమిడ్చిన వళ్ళువనాయనారిమహిమ వివిధశాస్త్రసూత్రకర్తల మహిమను మించునే కాని అందుకు తీసిపోదు ఆ 'కుఱళు'ల నిక యథాశక్తి చవి చూతము.

# రాంభొట్లూ - సోంభొట్లూ

## చెవిటి సోమశేఖరశర్మ

(నవంబరు' 74 చూడుడు)

సోంభొట్లు: శరీరాన్ని త్రోసివేయడమంటే మరింకేమిటి?

రాంభొట్లు: నీ వెవరివో సరిగ్గా తెలుసుకోవడమే.

సోంభొట్లు: (విసుగుతో) నే నెవరో నాకు తెలియదా? ఏమిటి అర్థంలేని మాటలూ?

రాంభొట్లు: తొందరపడకు. నీ వంటే మరి ఎవరు? నీ శరీరమా? నీ మనస్సా? నీ బుద్ధియా? అన్నీ నీ వస్తువులే కదా, మరి అసలుకు నీ వెవరు?

సోంభొట్లు: (దిగ్భ్రమతో) నేనే లేనా? ఇవన్నీ కలిస్తేనే నేను. నా వ్యక్తిత్వం...

రాంభొట్లు: (నవ్వుతూ) నీ వ్యక్తిత్వం సరే. నీ అస్తిత్వం గురించి కదా ప్రశ్న? వ్యక్తిత్వం కలిగిన "నేను" ఎవరు? అది తెలుసుకోవడమే శరీరాన్ని త్రోసివేయడం.

సోంభొట్లు: నే నెవరు? నా బుద్ధినీ కాదు, నా వ్యక్తిత్వాన్నీ కాదు, నేనే కాదు. చాలా? నన్నే త్రోసివేస్తూ శరీరాన్ని మాత్రమే త్రోసివేయు మనడ మెందుకూ?

రాంభొట్లు: (అనుశయముగా) అంత దిగు లెందుకు సోంభొట్లూ. ఒక్క శరీరం పోతే నేమి, అనంతవిశ్వ మంతా నీదే అవుతుంది.

సోంభొట్లు: (కచ్చతో) ముందీ శరీరం సంగతి తేల్చు. తరువాత విశ్వం సంగతి చెప్పుదువు గాని.

రాంభొట్లు: ఇదిగో, ఈ కనబడుతున్నది స్థూలశరీరం. ఐదు కర్మేంద్రియాలూ, ఐదు జ్ఞానేంద్రియాలూ పంచప్రాణాలూ మనస్సూ బుద్ధీ చిత్తమూ అహంకారమూ అనే పందొమ్మిదీ కలిసి సూక్ష్మశరీరం. సంస్కారాలు, పుట్టుకతో పుట్టిన బుద్ధు లంటామే అవి, దీనితోనే వస్తాయి. అజ్ఞానమనేది కారణశరీరం. ఈ కారణశరీరాన్ని కూడా వదిలించుకొంటే అప్పుడు మోక్షం లభిస్తుంది.

సోంభొట్లు: బాగుంది. ఒక శరీరం పోయి మూడు శరీరాలు వచ్చాయే (నవ్వును).

రాంభొట్లు: పంచకోశాలని అయిదు ఉన్నాయి. వాటినే ఈ మూడు శరీరాలుగా చెప్తారు.

సోంభొట్లు: వీటన్నిటినీ తెలుసుకొని త్రోసివేయాల్నా? చాలా కష్టమైన విద్యగా ఉందే.

రాంభొట్లు: మీవాడు బి.ఏ పరీక్ష పాసవడానికి మూడేళ్ళనుండీ తంటాలు పడుతున్నాడు గదా. అటువంటిది బ్రహ్మవిద్య నేర్చుకోవడానికెంత మేధాశక్తి కావాలో ఆలోచిస్తూ ఉండు. తరువాత శాస్త్రాలేమంటాయో చూద్దాం.

సోంభొట్లు: సరే. ప్రస్తుతానికి శరీరం అంటే; పుట్టిన శరీరం ఒక శరీరం. పుట్టుకతో వచ్చిన బుద్ధీ సంస్కారాలూ మొదలైనవి రెండో శరీరం. ఏది తీసుకొచ్చిందో అది మూడవశరీరమూ. ఇవి వరసగా స్థూలశరీరమూ సూక్ష్మశరీరమూ కారణశరీరమూనూ. సరిగ్గా చెప్పానా?

రాంభొట్లు: సరిగ్గా చెప్పావు.

సోంభొట్లు: (సగర్వముగా) చూచావా! అన్నీ శరీరాలే అయితే ఇక నేనెవరు? నీవు మాట్లాడేది వట్టి అసంబద్ధప్రలాపమని ఒప్పుకుంటావా!

రాంభొట్లు: (నవ్వుతూ) ఉండుండూ. ఈ శరీరాలన్నిటి వెనుకా ఉన్నదే అసలైన నేను అని చెప్పాను కదా.

సోంభొట్లు: (చిరునవ్వుతో) లేదే. కారణ శరీరాన్ని కూడా త్రోసివేస్తే మోక్షం లభిస్తుంది అన్నావు. మోక్షమంటే ఏమిటో నాకు తెలియదనుకో.

రాంభొట్లు: ఉండనీ, శరీరాన్ని త్రోసివేయడమే ఆనందమని చెప్పాను గదా. అది సరిగ్గా తెలిసిందా!

సోంభొట్లు: (ఊరకుండును.)

రాంభొట్లు: మీ పక్కింటాయనకు ఏక్సిడెంటయి ఒళ్ళంతా నజ్జునజ్జయితే నీ కేమీ దుఃఖం కలగలేదు గదా! నీకాలు విరిగినప్పటిలాగా?

సోంభొట్లు: (గునుస్తూ) పాపం. అంత దెబ్బలు తగిల్తే ఎవరు మాత్రం బాధపడరు! ఎంతయినా, ఆయన అనుభవించే బాధను నేనెలా అనుభవించగలను!

రాంభొట్లు: అంటే ఆయన శరీరం నీది కాకపోవడంచేత నీకు బాధ, నిజమైన బాధ, లేదు. అంతేనా!

సోంభొట్లు: అవును మరి. ఎద్దుపుండు కాకికి నొప్పా?

రాంభొట్లు: నీ చొక్కా చినిగిపోతే నీవు బాధపడ్తావు కదా.

సోంభొట్లు: మరి చొక్కా చినిగిపోతే ఇంకో చొక్కాకు డబ్బెవరిస్తారు చెప్పు! మరీ ఇలాంటి ప్రశ్న లడక్కు రాంభొట్లూ.

రాంభొట్లు: అయినా ఏ ఏక్సిడెంటులోనో నీవు తప్పించుకొని నీ చొక్కా మాత్రం పీలికలైపోయినా నీవు చాలా సంతోషిస్తావు కదా!

సోంభొట్లు: అవును మరి– వెధవ చొక్కా పోతే పోయింది, నాకు ఎముక విరిగితే ఎవరు దిక్కు! సంతోషిస్తానా, ఇంకా సంతోషిస్తానా.

రాంభొట్లు: అంటే నీ చొక్కా నీవు కాదనుకోబట్టే సంతోషిస్తున్నావు కదా. ఊరికే నేను నీ చొక్కా చింపితే నీ తోలే వలిచేసినట్లు బాధపడిపోయేవాడివి. ఏం!

సోంభొట్లు: (ఆలోచించును)

రాంభొట్లు: మనం పైన చెప్పిన శరీరాలన్నీ చొక్కాయల్లాంటివే. ఇవి వట్టి చొక్కాయలే. నేను కాదు. అని తెలుసుకొని ఆ శరీరాలను చొక్కాయల్లాగానే ఉపేక్షించగలిగితే, స్పష్ట

మైన శక్తిలేని ఆనందం అనుభవిస్తాం. అవునా కాదా?

సోంభొట్లు : ఎలా?

రాంభొట్లు : ఏముందీ? అధివ్యాధులు శరీరానికే- నాకు కాదు- అన్నిరకాలైన మనస్తాపాలూ శరీరానికే- నాకు కాదు - అని దృఢంగా ఏర్పడిన తరువాత నాకు దుఃఖమెక్కడిది?

సోంభొట్లు : దుఃఖం లేకపోతే ఆనందమేనా? రాయికి ఏ దుఃఖమూ లేదు కదా. అది చాలా ఆనందంగా ఉందా?

రాంభొట్లు : ఆనందమంటే లడ్డు తింటే కలిగే ఆనందం కాదయ్యా, మహానుభావా. కారణశరీరందాకా ఇటువంటి ఆనందాలే ఉంటాయి, ఏదో ఒక రూపంలో. కారణ శరీరం కూడా త్రోసివేస్తే ఉండేదే 'నేను' యొక్క నిజస్వరూపం అదే ఆనందం. అంత విలక్షణమైన ఆనందం కనుకనే దాన్ని బ్రహ్మానందం అన్నారు.

సోంభొట్లు : అంటే చివరికి 'నేను' అంటే ఆనందస్వరూపమే నంటావు. ఇది నమ్మాల్సిందేనా?

రాంభొట్లు : (చిరాకుతో) అనాదికాలంలో శివుడు మొదలుకొని ఇప్పుడు శ్రీరామకృష్ణ రమణమహర్షులవరకూ ఎందరో అటువంటి ఆనందాన్ని అనుభవించారు. 'తమ్ముడూ, నీవుకూడా అనుభవించు' అని చెప్తూ ఉన్నారు. నమ్మాల్సిందేనా అంటే ఏమన్నా అర్థం ఉందా? 'పరమాన్నం తియ్యంగా ఉంటుందిరా నాయనా తిను' అని చెప్తే 'నమ్మాల్సిందేనా' అంటే ఏం లాభం? తిని చూస్తే తెలుస్తుంది. అలాగే ఆ బ్రహ్మానందం కోసం ప్రయత్నం చెయ్యి. లేదూ, ఇంకెలాగ శాశ్వతమూ అద్వితీయమూ అయిన ఆనందాన్ని సంపాదించగలవో చెప్పు. అంతే గాని చాల తెలివిమంతుడిలాగ చివరికి నమ్మాల్సిందేనా అంటే ఒళ్ళు మండుతుంది.

సోంభొట్లు : అంత కోపమెందుకురా, నాయనా. నేనున్నానని ఇంత స్పష్టంగా తెలుస్తున్న దానిని వదిలిపెట్టి ఇంకో ఏదో 'నే' నంటే అర్థం గాక అడిగా నంతే. నీవు చెప్పేది ఒక్కొక్కటే సరిగా ఉన్నట్లనిపిస్తుంది గాని మొత్తం మీద ఏదో వెలితిగా అనిపిస్తున్నది రాంభొట్లూ.

రాంభొట్లు : (సానుభూతితో) ఒకసారి వింటే తెలిసిపోయేదయితే దాన్ని గూర్చి అన్ని శాస్త్రా లెందుకు సోంభొట్లూ? మన ప్రయత్నం మనం చేయాలి. ఈ ప్రపంచంలో జీవిస్తూనే మన నిజస్వరూపాన్ని గూర్చి ఆలోచించాలి ''కాలేనాత్మని విందతి''

# వైరాగ్యము - సంఘజీవనము పరస్పర విరుద్ధములా?

ఇంద్రియార్థములందును, లౌకిక భోగములందును గల రక్తియే రాగము. ఇట్టి విషయ సుఖములయందు విముఖతయే వైరాగ్యము. ఇట్టి వైరాగ్యమునకు సంఘముతో పని ఏమి? ఇట్టి వైరాగ్యమును సాధింపవలెనన్న సర్వసంగపరిత్యాగులై, విషయసుఖముల నన్నిటిని త్యజించి, అడవులకు వెళ్లవలసినదే. సంఘముతో పనిలేదు - అని కొందరి అభిప్రాయము.

సాధారణముగా ఇంద్రియములు ఆకర్షణీయములగు బాహ్యభోగవస్తువుల జూచినంతనే వాటి ననుభవింప తహతహలాడుచుండును. ఇట్టి ఇంద్రియములను నిర్జించుట యనిన సామాన్యమా ?

''యతతో హ్యపి కౌన్తేయ పురుషస్య విపశ్చితః
ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభంమనః.'' (గీత 2-

'కౌన్తేయా! విక్షేపకరములగు ఇంద్రియగణములు అత్యంత యత్నశీలుడును, మేధావియును, (శాస్త్రజ్ఞుడు) నగు పురుషుని మనస్సును గూడ బలపూర్వకముగా ఆకర్షించుచున్నవి.'– ఇంద్రియములంతటి బలవంతములని శ్రీభగవానుడు పేర్కొనెను.

కాని ఇట్టి సంఘమునందు, ఆకర్షణీయమగు భోగ్యవస్తువులతో కూడియున్న ఈ సంఘమునందు, వైరాగ్యవంతుడై కార్యముల నాచరింపవలయుననియే గీత బోధించుచున్నది, మనుజుడు సంఘముననో, లేక కారడవులనో నివసించుచున్నను, ప్రకృతి గుణములచే ప్రేరేపింపబడి ఏవేని కార్యముల నాచరించుచున్నాడు. కాని కర్మల నాచరించు విధము పైననే అతని బంధ విముక్తు లాధారపడియున్నవి. స్వార్థపరత్వముతో చేయు కర్మలు బంధ హేతువులై యుండ, నిస్స్వార్థతతో నాచరించు కర్మలు మోక్షమునకు దారి చూపుచున్నవి. అందుకే భగవంతుడు

''యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మ బంధనః,
తదర్థం కర్మ కౌన్తేయ ముక్తసంగః సమాచర.''(గీత 3-9)

'ఈశ్వర ప్రీత్యర్థ మనుష్ఠింపబడిన కర్మ కంటె ఇతరములగు కర్మలవలన ఈలోకము బంధింపబడుచున్నది. కనుక నీవు, భగవంతుని నుద్దేశించి అనాసక్తుడవై కర్మల నాచరింపుము.' మఱియు

'అసక్తో హ్యాచరన్కర్మ పరమాప్నోతి పూరుషః' (3-19)

'అసక్తతతో కర్మమొనర్చు మనుష్యుడు నిశ్చయముగా ముక్తిని పొందగలడు' అని పేర్కొనెను.

(కేవలము కర్మ సన్న్యాసమున సిద్ధి లభింపదు. కేవలము బాహ్యేంద్రియముల నిగ్రహించి మనస్సున విషయసుఖముల స్మరించువాడు కపటియని గీత పేర్కొనును)

అసక్తుడై కర్మల నాచరించుటవలన మనుజుడు సిద్ధి నొందునని భగవానుడు బోధించెను. జనకాదులు కూడ కర్మమువలననే సిద్ధి నొందిరనియు, లోకసంగ్రహార్థమైనను కర్మల నాచరింప వలయుననియు, మఱియు లోకముల శ్రేష్ఠులగువారు ఎట్లు నడతురో, ఇతర జనులుకూడ వారి ననుసరింతురు, అందువలన సత్కర్మాచరణము నిస్సంగ బుద్ధితో నొనర్చుట శ్రేష్ఠము, అజ్ఞులు ఎట్టి ఆసక్తితో కర్మల నాచరింతురో, విజ్ఞులు అట్టి అనాసక్తితో కర్మల నాచరింతురనియు భగవానుడు పేర్కొనెను,

మఱియు మానవజీవితలక్ష్యము ఆత్మసాక్షాత్కారమని ఏనాడో గ్రహించిన మన దేశము, అందలి ప్రజలు పలుస్థాయిలలో నుండుట గాంచి, ఒకేసారి విషయోన్ముఖులై, సర్వసంగ పరిత్యాగులుగా ఆత్మానుసంధానము చేయజాలకుండు వారికి, విషయ సుఖములకు కొంత చోటిచ్చినది – తన్మూలమున వారు నిస్సంగముగా కర్మల నాచరించి, విరక్తిని సంపాదింపవలయునను భావము తోడనే!

కాబట్టి మనము స్వార్థపరతతో జీవింపక, ఇహలోక జీవితముననే వివేక వైరాగ్యముల నలవరచుకొన ప్రయత్నింపవలయును. కేవలము మృగములవలె ఎల్లప్పుడు విషయసుఖములలో మునిగి తుదకు రోగి యగుటకు బదులు నిస్సంగముగా కర్మల నాచరించి సిద్ధి గాంచ ప్రయత్నింప వలయును. ఏ కర్మ స్వార్థపరతతో నాచరించినపుడు బంధకారణ మగునో, అదే కర్మను నిస్స్వార్థముతో నాచరించునపుడు ముక్తి దారితీయును. కాబట్టి మనము సంఘమున ఏ వృత్తి చేయువారమైనను, ఇట్టి వైరాగ్యమును మూలాధారముగా చేసికొనియే పరమార్థమును సాధింపవలసి యున్నది.

మఱి వైరాగ్యమును పాటింపవలయు ననుట కర్థము కేవలము సంఘమును వదలి అడవులకు పోవలయుననియో, ముక్కు మూసికొని ఒక మూలన కూర్చుండ వలయు ననియోగాక, అనాసక్తితో కర్మల నాచరించుటయే యని తేలును.

మఱి, సర్వసంగపరిత్యాగులై అడవుల కేగుట తప్పా యను ప్రశ్న బయలుదేర వచ్చును. ఆత్మ సాక్షాత్కారమే అందరి లక్ష్యమైనను, సంఘముననే జీవించుచు, అనాసక్తతతో కర్మల నాచరించువాడు లోకమునకు అధిక హితకారి యగును. అట్టి ఆచరణమున అతడు సిద్ధిని కూడ పొందును. దీనినే భగవానుడు,

"సాంఖ్య యోగౌ పృథక్ బాలా
ప్రవదంతి న పండితాః,
ఏకమప్యాస్థితః సమ్యగుభయోర్విందతే
ఫలమ్."

'అజ్ఞులే కర్మసన్న్యాసమును, కర్మయోగమును వేఱని చెప్పుదురు, పండితు లట్లు చెప్పరు. ఈ రెంటిలో నే యొకటి యైనను చక్కగ అనుష్ఠింపబడిన రెంటియొక్క ఫలము లభించును' - అని పేర్కొనెను. ఇట్టి మార్గము వలన అతడు సిద్ధత్వమును సాధించుటయేగాక లోకమునకు హితకారిగా నుండును.

పరోపకారార్థ మిదంశరీరం అనునది ఆప్త వాక్యము. పరులకు హితమొనరించుటకే ఈ శరీరమని భావము. ఈ పరోపకారమునకు స్వార్థపరిత్యాగము, సేవాపరాయణత్వము ఎంతేనియు అవసరములు. ఇవియే వైరాగ్యము యొక్క ముఖ్య లక్షణములు. కావున నిస్సంగులై సంఘమునకు సేవ యొనర్చుచు, ఆత్మసిద్ధికై ప్రయత్నించుట మన ధర్మము. పై దృష్ట్యా వైరాగ్యము సాంఘిక జీవనమునకు విరుద్ధమని తోచుటకు బదులు, ఎంతో ఆవశ్యకమని, పరస్పర సహకారి యని తేలుచున్నది.

ఆచార్యశ్రేష్ఠుడగు శ్రీ వివేకానంద స్వామియు ఈ విషయముసే వక్కాణించి చెప్పియుండిరి. మఱియు వారిచే స్థాపింపబడి నేడు మన దేశముననే గాక ప్రపంచమందంతటను అన్నదాన, విద్యాదాన, జ్ఞానదానములతో అఖండ సేవ లొనర్చుచున్న శ్రీరామకృష్ణ సేవాసంస్థ "ఆత్మనో మోక్షార్థం జగత్ హితాయచ" - అను ఇదే లక్ష్యమును కలిగి యున్నది.

కాబట్టి మనము గ్రహింపవలసిన ముఖ్య విషయ మేమన, వైరాగ్యమను పదమున కర్థము నిస్స్వార్థపరత్వము అనాసక్తితో ఆచరింపబడు మానవసేవ అనియే.

# పరిప్రశ్న

ప్రశ్న : మనము అంతయు భగవత్సంకల్పమునకే వదలి శరణాగతులమైనచో అది విధినియతవాదము (fatalism) నకు లొంగిపోవుట కాదా? అట్టి పరిస్థితియందు స్వాతంత్ర్యమవసరమగు నైతికవర్తనమునకు స్థానముండునా?

ఉత్తరము : శ్రీరామకృష్ణులును మరి ఇతర ఋషులు ప్రవక్తలు అవతారములును చెప్పునది విశ్వము వెనుకనున్న సంకల్పమొక్కటియనియే — ఆ సంకల్పము భగవత్సంకల్పమనియే. ఈ విషయమును మనము గుర్తించినను గుర్తింపకపోయినను పరమసత్యమదియే. ఎవడు ఈ సత్యమును తత్త్వమును గుర్తించునో, అతని దృక్పథమున మరియొక సంకల్పమునకు స్థానమే లేకపోవుటచేత, అతనికి విధినియతవాదమను ప్రశ్నయే తలయెత్తదు. అట్టి వ్యక్తియొక్క లక్షణమేమనగా : అతని జీవితమున ఆత్మప్రాధాన్యము 'అహం'కార ప్రాధాన్యము కన్పింపవు. సాధారణ మానవుని వలె 'ఎత్తులు' వేయుచు ప్రణాళికలు నిర్మించుచు చింతాగ్రస్తుడగుచు నుండడు. స్వస్థచిత్తుడై ఎల్లరతో శాంతియుతుడై మెలగును.

అహంకారప్రాధాన్యము కలిగియు పరాత్పరమగు నొక దివ్యసంకల్పము నంగీకరించువారికి విధినియతమను ప్రశ్న ఏర్పడును. మనకు అహంకారప్రాధాన్యమున్నంతవరకు మనము 'పరిమిత సంకల్ప స్వాతంత్ర్యము' నంగీకరింపవలెను. అన్ని క్లిష్టసమస్యలయందు వలెనే రెండు అతివాదముల నడుమ సరాసరియే శ్రేష్ఠము, సాధారణ జనులకు. ఒక చివర సంపూర్ణమగు సంకల్ప స్వాతంత్ర్యము కలదు. పూర్తిగ యాంత్రికదృష్టితో చూచినను జీవశాస్త్రదృష్టితోనయినను ఈ భావన అసంబద్ధమే. మరియొక చివర విధినియతవాదము కలదు. ఇది వ్యక్తిత్వముయొక్క ప్రత్యేకతను గుర్తించుచునే వ్యక్తి స్వాతంత్ర్యము నంగీకరింపదు.

ఇప్పుడు మనము దివ్యసంకల్పము యొక్క సర్వోత్కృష్టతతో సమన్వయమందు మధ్యమమార్గము నవలంబింపవలసి యున్నది. దీనిని మనము 'పరిమిత స్వాతంత్ర్య' మందుము. దీనిని శ్రీరామకృష్ణులు ఒక పిట్టకథతో వివరింతురు. దూడను యజమాని త్రాటితో చెట్టునకు కట్టును. దూడకు స్వాతంత్ర్యమున్నదా లేదా? త్రాటియొక్క పొడవుమేరకు దూడకు స్వాతంత్ర్యము కలదు. అటుపైన లేదు. త్రాటి పొడవుకూడ పర్యవసానమున యజమానియే నిశ్చయించినను వ్యవహారమున త్రాటి పొడవు మేరలో ఇచ్చవచ్చినట్లు తిరుగుటకు దూడకు స్వాతంత్ర్యము నిచ్చెను. ఈ పరిమితిలోని గడ్డిని దూడ తినివేసినచో యజమాని త్రాటి పొడవును పెంచవచ్చును.

ఈ 'పరిమిత స్వాతంత్ర్యము' నంగీకరించినచో పురుష ప్రయత్నముతో విరోధము పెట్టుకొనకయే శరణాగతి నభ్యసింపవచ్చును. మన యనుభవపు స్థాయియందు సంకల్ప స్వాతంత్ర్యమను భావము సత్యమే. ఈ వ్యక్తి సంకల్పమను భావన దివ్య సంకల్పమున లీనమగువరకు వ్యక్తి సంకల్ప స్వాతంత్ర్యము అనుభవ సత్యమే. అంతవరకు పరిమిత స్వాతంత్ర్యము నంగీకరించి భగవంతుడు నిర్ణయించిన పరిధికి లోబడి స్వతంత్రముగ వ్యవహరింపవలసి యున్నది.

# వార్తలు - విశేషాలు

## గురుపూర్ణిమ

గురుపూర్ణిమ ఉత్సవమును మద్రాసు శ్రీరామకృష్ణ మఠమున జరుపవలసినదిగను తద్వారా మంత్రదీక్షను స్వీకరించిన భక్తబృంద మంతయు శ్రీరామకృష్ణమఠపవిత్రావరణమున సమావేశ మగుట కవకాశమును కల్పింపవలసినదిగను పలువురు భక్తులు ఒక ఆనందదాయకమగుసూచనను చేసిరి. తదనుసారము మఠ చరిత్రయందు ప్రప్రథమముగ శ్రీరామకృష్ణమఠాధిపతులు 23 జూలై '75 బుధవారమున గురుపూర్ణిమ ఉత్సవము నేర్పాటుచేసిరి. నగరమున గల కొన్నివందల స్త్రీలు పురుషులు అగు భక్తులకు ఆహ్వానములు పంపబడినవి. ఆహూతుల ఆసక్తియు ప్రోత్సాహజనకముగ నుండెను.

శ్రీరామకృష్ణుల దివ్యచిత్రపటము మఠావరణమునందు ఉన్నతాసనమున నలంకరింపబడి పవిత్రవాతావరణము నొనగూర్చెను. సాయంకాలము ఐదుగంటలకు భక్తజనులెల్లరు అచట సమావిష్టులై గంటన్నర పర్యంతము భజనలు చేసిరి. విష్ణుసహస్రనామ స్తోత్ర పఠనము గావించిరి. ధ్యానము సల్పిరి. అటుపిదప ఆరాత్రికము నిర్వహింపబడెను. తదనంతరము సమావిష్టులైన భక్తులకు గురుపూర్ణిమ మహిమనుగూర్చి శ్రీమత్తపస్యానందస్వామి యుపన్యసించిరి. ఉపన్యాస సారాంశమిది.

"గురువుయొక్క ఆకారములనేకములైనను నిజమునకు గురువు ఒకడే. అట్టి గురువును సంస్మరించి భజించు పావనసమయమే గురుపూర్ణిమ. దీనినే వ్యాసపూర్ణిమ అనియు నందురు. ఈ దినమునుండియే సాధువులు తమ చాతుర్మాస్య వ్రతదీక్షను ప్రారంభింతురు. హిందువులెల్లరకు వ్యాసుడు మాననీయు డగు మహర్షి. పరమాత్ముని యవతారమే యని అతడు పూజింపబడును. మనకు ఆధ్యాత్మిక ప్రబోధమూలములకు రెండింటికి వ్యాసమహర్షి కర్త. వేదములు పురాణములు హిందువులకు వారి యనుగ్రహప్రతీకలు. వారి వేదాంతసూత్రములు వేదాంతము నభ్యసించువారికి ఎనలేని వరములు. అన్ని వేదాంత శాఖలును వారికి నివాళులిచ్చును. ఇన్ని యాధ్యాత్మిక గ్రంథములకు కర్త యని పేరుగాంచిన వ్యాసుడు ఒక వ్యక్తియో లేక 'వ్యాసుడు' అనునది పలువురు మేధావులకు సామాన్యమైన బిరుదమో స్పష్టముగ తెలియదు.

సనాతన ధర్మసంప్రదాయమున గురువునకు విశిష్టమైన స్థానము కలదు. క్రైస్తవులు, వారి మతాచారములను పారంపర్యముగ నందించు బాధ్యతను వారి 'చర్చి' వ్యవస్థయే స్వీకరించు నందురు. తరతరములకు ఉద్బోధజనకమై తనరవలె ననిన ఆ సంప్రదాయము చక్కగ పరిరక్షింపబడవలెను. మానవ సమాజమునందు గురుశిష్యపరంపర భూతవర్తమానముల కనుసంధానము కల్పించుచు ఆధ్యాత్మికసంస్కృతిని జీవచ్ఛక్తిగ చేయును.

మద్రాసునందలి శ్రీరామకృష్ణమఠము అట్టి ఆధ్యాత్మిక కేంద్రమై వర్ధిల్లినది — మహితచరిత్రులగు మాతృశ్రీ శారదాదేవి శ్రీ బ్రహ్మానందస్వామి శ్రీ శివానందస్వామి ప్రభృతులు వారి దివ్యసాన్నిధ్యము చేతను ప్రార్థనలు పూజల చేతను ఈ మఠమును పావనముచేసిరి. శ్రీ వివేకానందస్వామి స్వయముగ ప్రోత్సహింపగా శ్రీ రామకృష్ణానంద స్వామివారు దానిని తమ పావనహస్తములతో స్థాపించి పెంపార జేసిరి. శ్రద్ధాయుతము భక్తిసంభరితములగు శ్రీరామకృష్ణులపూజ ఇచ్చట అనుదినమును సంవత్సర

ముల పర్యంతము కొనసాగినది. ఈ మతావరణముననే వందలకొలది సాధకులు తమ ఆధ్యాత్మిక జీవనమున నడుగిడిరి.

గురువు భగవంతుని వ్యక్తరూపమునకు ప్రతినిధి. శ్రీరామకృష్ణులు నిక్కముగ జగద్గురువు, గురుశక్తియొక్క మూర్తీభావము, ఇహలోకమున క్రీడించుచున్న భగవంతుని ఉద్ధారకశక్తి. ఎవరనిన వారు గురువు కాజాలరు. గురువనగా సర్వప్రాణికోటిని సంసారసాగరమును తరింపజేయు నౌకవంటివాడు. నిజమునకు సచ్చిదానందమే గురువు రూపమును దాల్చును. మానవునిపట్ల ప్రేమను దయను ప్రకటించుచు విశ్వము వెనుకనున్న దివ్యసంకల్పము యొక్క వ్యక్తరూపమే గురువు. నిసలైన గురువునందు అహంకారమే ఉండదు. అతడు వైరాగ్య మూర్తి. గురుత్వ మనునది ఒక ఉద్యోగము కాజాలదు. ఉద్యోగముగ గురువగువాడు మహోదాత్తమగు ఆధ్యాత్మికాదర్శమునకు ఘోరమగు వికారరూపము. నిజమగు శిష్యుడు నిజమగు గురువునకు తగియుండును. జగద్గురువు ఒక నూతన శక్తి సంచాలనమునకు ప్రారంభోత్సవము చేయును. ఆ శక్తి పనిచేయు వాహికలుగా తన శిష్యులను నిలుపును. గురువును ఇష్టదేవతయును ఒకరే. సకాలమున శిష్యుడు గురువు ఇష్టదైవమున లీనమగుటను దర్శించును. ఆధ్యాత్మిక సాధనయందు గురువునందు విశ్వాసమనునది అపూర్వమగు సద్గుణము. గురువు శిష్యున కందించు మంత్రము అపారమగు శక్తి కలిగినది. గురూపదిష్టమైన మంత్రము సూక్ష్మరూపమున నున్న దైవమే. మంత్రము యొక్క శక్తి మహత్తరమగు శక్తి.

ఆధ్యాత్మికసాధనయందు గురుసేవ అత్యంతము ప్రయోజనకారి. భగవంతుని సేవించునట్లే గురువును సేవింపవలెను. గురువును సేవించుటయన ఆయన ఉద్యమమును సేవించుట ఆయన ప్రయత్నమును సఫలము చేయుట ఆయన సందేశమును వ్యాప్తముచేయుట. ఆయన మతమును ఆశ్రమమును బలవత్తరము చేయుట.

శ్రీరామకృష్ణుల ప్రముఖశిష్యుడు మనకు వారు అవతార వరిష్ఠులని బోధించిరి. అత్యంతము సరళము గంభీరమునైన శ్రీరామకృష్ణుల వచనామృతము మన కందుబాటులో నున్నది. ఇట్టి విశిష్ట గురుపరంపర, మానవులను దేవులుగా సేవించు మహత్తర సన్న్యాస వ్యవస్థ, అధ్యయనముచేసి మననము చేయుటకు దివ్యమగు శ్రీరామకృష్ణ సూక్తిసుధ, అను మహాదవకాశములను సక్రమముగ వినియోగించుకొని ఆత్మవికాసమును సాధించుట ఇక మన బాధ్యత.”

సమావిష్టులైన భక్తులెల్లరు ప్రసాద స్వీకారము చేసిరి. ఇట్లు కృపార్ద్రమగు గురుకటాక్షమును గ్రోలి పవిత్రభావ తరంగముల నోలలాడి ఆధ్యాత్మికానందమున మరువలేని సాయంతనమును గడపి భక్తులు రాత్రి తొమ్మిది గంటలకు గృహోన్ముఖులైరి.

# శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-600004

## 1975-వ సంవత్సరము, సెప్టెంబరు మాసమున జరుగనున్న

## ఉత్సవ కార్యక్రమము

**ఆదివారములందు సత్సంగ సమావేశములు**

అపరాహ్ణము 4-00—4-20 వఱకు లలితా సహస్రనామ పారాయణము (7-9-75, 21-9-75)
" " " శ్రీవిష్ణు సహస్రనామ పారాయణము (14-9-75, 28-9-75)
4-20—4-30 " ధ్యానము
4-30—5-30 " తమిళమున ఉపన్యాసములు :—
శ్రీమద్భాగవతము : శ్రీ అణ్ణాగారు (7-9-75)
శ్రీవిష్ణు సహస్రనామము : శ్రీ వి. కల్యాణసుందరశాస్త్రిగారు (14-9-75)
శ్రీమద్రామాయణము : డాక్టర్ ఎన్. వీఴినాథన్‌గారు (21-9-75)
శ్రీదక్షిణామూర్తి స్తోత్రము : డాక్టర్ టి. ఎమ్. పి. మహాదేవన్‌గారు (28-9-75)
5-30—6-30 " ఆంగ్లోపన్యాసములు :—
శ్రీమద్భగవద్గీత : శ్రీమత్ తపస్యానందస్వాములవారు

**ప్రత్యేకోపన్యాసములు**

6-9-75 శనివారము : 5-30 శ్రీమద్రామాయణ పఠనము : శ్రీ పి. రామకృష్ణన్‌గారు, ఐ.సి.ఎస్. (రిటైర్డు)
13-9-75 " 5-30 శ్రీమద్రామాయణము : డాక్టర్ ఎన్. వీఴినాథన్‌గారు

**ఇతర వారములందు ఉపన్యాసములు : అపరాహ్ణము 5-45 గంటలకు**

సోమవారములు : విష్ణుసహస్రనామము (ఆంగ్లము) శ్రీమత్ వీతమోహానందస్వాములవారు
మంగళవారములు : అధ్యాత్మరామాయణము (ఆంగ్లము) శ్రీమత్ గభీరానందస్వాములవారు
బుధవారములు : శ్రీమద్భాగవతము (ఆంగ్లము) శ్రీమత్ గోలోకానందస్వాములవారు
గురువారములు : అముదమొళి (తమిళము) శ్రీమత్ శ్రీరంగానందస్వాములవారు
శుక్రవారములు : ఆత్మబోధ (తమిళము) శ్రీ ఆర్. రామకృష్ణన్‌గారు

21-9-75 ఆదివారము : అంతర్యోగ సాధన
ఉభయ ఏకాదశులయందు సాయంకాలిక ఆరాత్రికానంతరము శ్రీరామనామ భజన (2-9-75, 16-9-75)
4-9-75 గురువారము శ్రీఅద్వైతానందస్వామి జయంతి.
29-9-75 సోమవారము శ్రీ అభేదానందస్వామి జయంతి
9-9-75 మంగళవారము శ్రీవినాయకచతుర్థి

శుక్రవారములందు సాయంకాలము 6-30 గంటలకు తిరువల్లిక్కేణియందలి దక్షిణమాడవీధియందు 18-వ నంబరుగల రామకృష్ణ మందిరమున శ్రీమత్ గోలోకానందస్వాములవారి భగవద్గీతోపన్యాసములు.

ఈ ఉత్సవము లన్నింటియందును భక్తులెల్లరును పాల్గొని భగవంతుని అనుగ్రహభాగ్యమును బడయగోరుచున్నాము.

అధ్యక్షులు,
శ్రీరామకృష్ణమఠము, మద్రాసు-600004.

సంపాదకులు: శ్రీ చిద్ఘనానంద స్వామి.

శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-600021) న ముద్రింపబడి,

శ్రీ చిద్ఘనానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మద్రాసు-600004) నుండి ప్రచురింపబడినది.

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౩౨ ౧౯౭౫ - సెప్టెంబరు : రాక్షస - భాద్రపదము సంచిక ౩

## విషయసూచిక

'అఖిలవిభు శరణొందుమ, యా క్షణంబ యతనికృత నీదు ననుభూతి కందు వత్స'

—శ్రీ శారదామణి.

# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౩౨ } ౧౯౭౫ - సెప్టెంబరు :: రాక్షస - భాద్రపదము { సంచిక ౩

ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ !

## ప్రార్థన

## శ్రీరామకృష్ణ కర్ణామృతము

ఏకత్ర వీర్యమితరత్ర యశః పరత్ర జ్ఞానం విరక్తిరపరత్ర కుతశ్చన శ్రీః
ఐశ్వర్యమన్యత్ర ఇమే న మిథో మిలన్తి కుత్రాపి చేహ తు భగాస్సకలా మిలన్తి.

భగవంతుని శౌర్య మొకరియందు ప్రకటిత మగును. కీర్తి మఱొకరియందు వికసించును. జ్ఞానము ఇంకొకరియందు ప్రకాశించును. వైరాగ్యము మఱొకరియందు తేజరిల్లును. సౌందర్యము వేఱొకరియం దలరారును. ఐశ్వర్యము ఇంకొకరియందు రాజిల్లును. ఎన్నడును భగవదైశ్వర్యము లాఱును ఒకచోట నుండుట నెఱుగము. కాని శ్రీరామకృష్ణునియం దన్నియు అన్యోన్యముగ మెలగుచున్నవి కదా!

హే రామకృష్ణ మధురం తవ సచ్చరిత్రం త్వత్పుణ్యనామ మధురం మధురం త్వదంగమ్
సంభాషణం చ మధురం మధురం చ గానం తత్కిం ను యన్న మధురం భవతిత్వదీయమ్.

శ్రీరామకృష్ణా! నీ దివ్యచరిత్రము మధురము. నీ పావననామము మధురము. నీ రూపమును మధురమే. నీ సంభాషణము గానముకూడ మధురములే. రామకృష్ణా! నీ దగున దేది మధురము కాదు!

# శ్రీ గురు సూక్తి సుధ

స్వయంకృతమైన ప్రశ్న: పుత్రుని మరణము వలె దహించివేయు బాధ ప్రపంచమున నింకేమి గలదు?

శ్రీరామకృష్ణులు: ఈ శరీరమునుండియే పుత్రుడు జన్మించును కదా! కనుక ఈ శరీరముతో అతని సంబంధము ఈ శరీర మున్నంత వఱకు నుండును. అక్షయుడు చనిపోయినాడు. ఆ సమయమున నా కేమియు ననిపింపలేదు. నే నచ్చట నిలుచుండి మానవు డెట్లు చనిపోవునో చూచుచుంటిని. ఒక ఒరలో కత్తి యున్నట్లే ఒరనుండి కత్తిని తీసినట్లే చూచితిని. కత్తి కేమియు కాలేదు. అది ఎట్లుండెనో అట్లే యుండెను. ఒరమాత్రము అచ్చట పడి యుండెను. దానిని చూచుటతో నాకు ఎంతయో సంతోషము కలిగెను. నేను నవ్వితిని పాడితిని నాట్యము చేసితిని. వారు శరీరమును దహించి తిరిగి వచ్చిరి. మరుసటిదినమున నే నచ్చట నిలుచుండి యుంటిని (కాళీ దేవాలయపు టావరణముదగ్గర, గదికి తూర్పున నున్న వరండాను చూపిరి.) నా కేమనిపించెనో తెలియునా? తడిగుడ్డ పిండబడినట్లు నా గుండె పిండబడుచున్న దనిపించెను. అక్షయునకై నా హృదయ మంత పరితపించుచుండెను. నే నిట్లనుకొంటిని. "అమ్మా దీనికి (తన శరీరమునకు) ఇది ధరించు వస్త్రముతోనైనను సంబంధము లేదు, ఇక మేనల్లునితోడి సంబంధ మెంతటిది. ఇక్కడనే (తనకే) ఇట్లుండగా ఇక సంసారుల కీ బాధ ఎంత హృదయ విదారకముగ నుండును! నీ వది చూపుచున్నావు, అవునా!"

కాని మీకు తెలియునా! భగవంతుని యందు శరణుబొందువారు ఈదుస్సహాశోకము వలన గూడ పూర్తిగా మునిగిపోవరు. కొన్ని పర్యాయములు కొట్టుకొనిన పిదప మరల స్వాస్థ్యమును పొందుదురు. తక్కువ సామర్థ్యముగలవారు చిట్టి పడవలవలె వశము తప్పిపోదురు, స్వాస్థ్యమును కోల్పోవుదురు, పూర్తిగా మునిగిపోవుదురు. స్టీమరులు గంగపై పోవునపుడు చేపలుపట్టు పడవల అవసను మీరు గమనింపలేదా? వాని పని యైపోయిన దనిపించును. కొన్ని పూర్తిగ తిరుగబడిపోవును. టన్నుల బరువుగల పెద్ద నావలు కొన్నిసార్లు ఊగిపోయి మరల చక్కబడును. కాని ఒకటియో రెండో ఊపుల నన్నియు అనుభవించును.

ఈ ప్రపంచమునందు వీరందఱి సంబంధము (పుత్రుడు తండ్రి మొ॥) నిలుచున దెంత తక్కువ కాలము. ఆనందమును కోరుచు మానవుడు ప్రపంచమున ప్రవేశించును. పెండ్లి చేసికొనును, పుత్రవంతుడగును. కుమారుడు పెద్దవాడగును. అతడు కుమారునకు పెండ్లి చేయును. ఇట్లు సంతోషముగ కొన్ని దినములు గడచును. తరువాత ఒకరికి జబ్బు చేయును. మఱియొకరు చనిపోవుదురు. ఇక ఆ మానవుడు చింతలతోను ఆందోళనతోను సతమత మైపోవును. ఎంత మిక్కుటముగ ఆశాభంగమో అంత పెద్దగ నాక్రోశము! మిఠాయివాని పొయ్యిలో పచ్చికట్టెలు ఎట్లుండునో గమనింపలేదా! మొదట అది చక్కగా మండును. తరువాత అది మండుచుండగా దాని వెనుకవైపున రసము ఊరుచు, అది నురుగై బుడగలగుచు పేలుచు అనేకములైన బుసబుస శబ్దములు చేయును. సరిగా అట్లే.

స్వయంకృతమైన ప్రశ్న: మిథ్యను త్యజింప ప్రయత్నింపనిచో దీనిని (బ్రహ్మము సత్యము జగత్తు మిథ్య అని) విని అర్థము చేసికొనిన మాత్రమున నేమి లాభము?

శ్రీరామకృష్ణులు: అది ప్రాపంచికుల జ్ఞానము వంటిది. ఇట్టి జ్ఞానముద్వారా సత్యము నందుకొనజాలరు. దృఢవిశ్వాసము ఆవశ్యకము. వైరాగ్యము విధాయకము. అప్పుడు మాత్రమే మానవుడు కృతకృత్యు డగును. అట్లు కానిచో నీవు "ముల్లు లేవు గ్రుచ్చుకొనుట లేదు" అని వల్లించినను, నీవు ముండ్లను తాకిన తత్‌క్షణమే అవి గ్రుచ్చుకొని బాధతో అరతువు. "ప్రపంచము లేదు. అది మిథ్య ఉండునది బ్రహ్మము మాత్రమే" మొదలైన మాటలు చెప్పుదువు. కాని ప్రాపంచిక విషయములు దృశ్యములు రుచులు మొదలైనవి నీ ఎదుటకు రాగనే వానిని సత్యమని భావించి అందు చిక్కుకొని పోవుదువు. ఒకప్పుడు పంచవటి కొక మహాత్ముడు వచ్చెను. జనులతో అతడు నిరంతరము వేదాంతము మాటలాడెడి వాడు. ఒకనాడు నేను అతడొక స్త్రీతో అక్రమసంబంధము పెట్టుకొనె నని వింటిని. నేను కాలకృత్యములకై ఆ దిక్కునకు పోయి అత డచ్చట కూర్చుండి యుండుట చూచితిని. "నీవు వేదాంతమును గూర్చి అంత మాటలాడుదువు. మరి నీగురించి ఈ వదంతి యేమి?" అని నే నంటిని. "దానివలన నేమి? అందేమియు ప్రమాదము లేదని నీకు స్పష్టము చేయగలను. ప్రపంచము భూతకాలమునను వర్తమానమునందును భవిష్యత్తులోను అసత్యమైనప్పుడు అదిమాత్రమే సత్యమగునా? అది కూడ అసత్యమే." అని యతడు బదులాడెను. ఇది విని నాకు చిత్తెత్తినది. "నీ వేదాంతము మండిపోను" అని యంటిని. ప్రాపంచికులు వేదాంతమును గూర్చి ఈ రకమైన జ్ఞానమును కలిగియుందురు. ఆ జ్ఞానము జ్ఞానమే కాదు.

కొందఱు శిష్యు లడిగిన ప్రశ్న: అయ్యా, మీరు చదువను వ్రాయను కూడ నేర్వక పోయినను, వీని నన్నింటిని (వేదములు వేదాంతములు యోగశాస్త్రములు మొ॥) ఎచ్చట నుండి నేర్చితిరి?

శ్రీరామకృష్ణులు: ఆఁ, నేను స్వయముగా చదువని మాట నిజమే కాని నేను చాల విని యుంటిని. అది యంతయు నేను జ్ఞప్తియం దుంచుకొంటిని. వేదములు వేదాంతము దర్శనములు పురాణములు అన్నియు మంచి ప్రసిద్ధులైన పండితులవద్ద వింటిని. వానిని విని వాని సారమును తెలిసికొంటిని. వాని నన్నింటిని దారముతో మాలగా గ్రుచ్చి మెడలో వేసికొని వానిని అమ్మ చరణాబ్జముల కడ సర్పించి ఇట్లంటిని. "ఇవిగో నీ వేదశాస్త్రములు పురాణాదులు. నాకు నిష్కళంకమైన భక్తిని మాత్ర మిమ్ము."

స్వయంకృతమైన ప్రశ్న: ధ్యానసమయమున మాత్రమే ఇష్టదేవతను తలచుకొనవలెనా? ఇతర సమయములందు అతనిని మరచి పోవలయునా?

శ్రీరామకృష్ణులు: నీ మనస్సునం దొక భాగము నెప్పుడును అతనిపై లగ్నము చేసి యుంచవలెను. దుర్గాపూజ సమయమున దీపమును వెలిగింపవలెనని గమనించి యుందువు. ఆ దీపము దేవి సమీపమున వెలుగుచునే యుండునట్లు చూడవలెను. దానిని కొండెక్కనీయరాదు. అది కొండెక్కినచో ఇంటి యజమానికి అమంగళమును సూచించును. అట్లే ఒకసారి ఇష్టదేవతను పిలిచికొనివచ్చి హృదయపద్మమున కూర్చుండబెట్టిన పిదప ఆయనను గూర్చిన ధ్యానమను దీపము ఎల్లప్పుడును వెలుగుచుండునటుల చూడవలెను. ప్రాపంచిక విధులను నిర్వర్తించునపుడు అప్పుడప్పుడు ఆ ధ్యానదీపము వెలుగుచున్నదో లేదో గమనించుచుండవలెను.

# పారమార్థిక సాధకులకు సూచనలు

## శ్రీ యతీశ్వరానందస్వామి

### భగవంతుని సర్వవ్యాపకత్వమును గుర్తించుట

దైవము ప్రతిచోటను గలదు. ప్రతివస్తువు నందును గలదు. కాని మనము విచక్షణచేసి తదనుగుణముగ ప్రవర్తించుటను నేర్చుకొనవలెను. మనమింకను జాగరితులము చైతన్యవంతులము కావలెను. మన మింకను ఆలోచనాపరులమై మంచిదైనను చెడుదైనను ఇంద్రియ ప్రేరణములపై సహజ ప్రవృత్తులపై ఆధారపడి ప్రవర్తించుటను తగ్గించుకొనవలెను. ఈ విషయమై మనమెంతయో అజాగ్రత్తగ నుందుము. యథేష్టముగ నుందుము. అందువలన వ్యతిరేకమార్గమున బడి తుదిలేని ఆపదలను కొని తెచ్చుకొందుము.

ఏకత్వమను ఈ భావనను చక్కగ నిర్దుష్టముగ గుర్తింపవలెను. ప్రస్తుత సమయమున దానిని ఇష్టాయిష్టముగ గుర్తింతుము. సరిగా చెప్పినచో, నిజమగు నిస్సంగమును నిర్మమత్వమును సంపాదింపనిచో ఈ ఏకత్వమును హృదయపూర్వకముగ గుర్తింపలేము. తదనుగుణముగ జీవింపలేము. అవిభక్తమగు ఏకత్వము సర్వత్ర కలదని మనకు దృఢనమ్మకము కలిగినచో ప్రత్యేకముగ ఎవరిపైనను గాఢమగు శారీరకమైన ప్రేమగాని ద్వేషముగాని చూపలేము. కాగా వానికి పూర్వరంగమగు దివ్యత్వమును మాత్రమే చూతుము. ఇట్లనుటకు అర్థము మందబుద్ధులవలె ప్రవర్తింపవలెనని కాదు. పులి ఏకత్వముయొక్క వ్యక్తీకరణమేయైనను పులిని పులిగనే ఎఱుగవలెను. అంతియగాని పోయి దాని ఎదుటవంగి నమస్కరింపరాదు. ఈ ఐక్యసూత్రము స్త్రీ పురుషుల యందు సమముగ కలదని గుర్తింపవలెను. కాని ఈ గుర్తింపు, మనము ఈ వ్యవహార రంగమున నున్నంతకాలమును విచక్షణ చేసికొనుచు జాగ్రత్తగ నుండుట కడ్డుపడరాదు. ప్రాపంచికుడై అవినీతిమార్గమున పతితుడై చరించు మానవునిలోకూడ ఈ ఏకత్వమే కలదని గుర్తింపవలెను. కాని అతనివద్దకు పోయి ఆప్తసంభాషణలు చేయరాదు. ఇది మిక్కిలి ముఖ్యము. ఈ నియమము ననుసరించి వర్తింపనిచో ఒకనాడు తప్పటడుగువేసి ఘోరమగు ఆపదల పాలగుదుము. ఈ విషయమున సాధకునకు మితిమీరిన జాగ్రత యనునది లేదు. మనము ఈ అవిభక్తమైన ఏకత్వమును అందఱియందును గుర్తింపగలిగినంత మేరకు మన ద్వేషములు మానుష 'ప్రేమ'లు మన లంపటత్వము తగ్గిపోయి మనపై అవి వాని యాజమాన్యమును ప్రభావమును కోల్పోవును. సాధకు డెచ్చటనైనను ప్రాపంచికులతోను స్త్రీలతోను విచక్షణలేక మెలగ గోరినచో అతనియందు ఏదియో గాఢమగు లోపమున్నట్లే. సాధకురాండ్ర విషయమును ఇట్లే. విషయసుఖములపట్లను వాని భోగము పట్లను అతనికి గల కోర్కెలు వాని తీవ్రతను కోల్పోవలేదు. ఏమాత్రపు పారిశుద్ధ్యమును సాధింపబడలేదు. కనుక పారమార్థిక పురోగమనము సాక్షాత్కారము అను ప్రశ్నయే ఉదయింపదు.

సాధారణముగ మనకుగల రాగము మన విచక్షణాబుద్ధిని కప్పివేయును. మనము రూపముకంటెను అహంభావముకంటెను ఇంద్రియ విషయములకంటెను ఆత్మకు ప్రాధాన్య మీయవలెను. ఏలన ఈ 'అహం' భావముల ప్రాధాన్యము, ఇంద్రియ విషయ

ములయందలి సక్తత మనబుద్ధి నావరించి యున్నంతకాలమును మనము నిజముగ ఈ అవిభక్తమైన ఏకత్వమునుగూర్చి చింతింపనే లేము. అందువలననే మనముచేసిన పొరపాటులనే మరల మరల చేయుచుందుము. కనుక సాధకులందఱును సాధ్యమైనంత విరాగమును అభ్యసింపవలెను. విరాగము లేక ఏమియు సాధింపలేము.

"నన్ను ప్రేమించుటకుమించి తలిదండ్రులను ప్రేమించువాడు నన్ను పొంద నర్హుడు కా"డని క్రీస్తు చెప్పెను. ఇది ముమ్మాటికిని సత్యమే. ఇంతియగాక దేవునికంటె యధికముగ తనను ప్రేమింపనిచ్చువాడుకూడ దైవమును పొందుట కర్హుడు కాడు. ఒకడు భగవంతునిచే నాకర్షింపబడుటకు బదులు తనచేత ఆకర్షింపబడుటకు సమ్మతించు మానవుడు భగవంతునిపొందుట కర్హుడు కాడు. అట్టివాడు భగవంతుని పొందజాలడు. తగినంత తూష్ణీంభావమును ప్రదర్శింపక ఇంకొకడు మనసట్లు ప్రేమింపజేసినచో మనము భగవంతుని పొందుట కర్హులము కాము. కనుక ఇందున కూడ మనము అతిజాగ్రతతో మెలకువతో నుండవలెను. మనలను ప్రస్తుతించినచో మనకు చాల సంతోషమే. ఇతరుల కాకర్షణీయులముగ నుండగోరుట నిజమే. సంతోష కారణులముగ ఇతరులచే ప్రేమింపబడుట కిష్టపడుదుమనుట సత్యమే. కాని మనము ఎంత ఆలోచన లేనివారము ఆవేశపరుల మనగా, పారమార్థికదృష్ట్యా మనకు ఇతరులకు కూడ కష్టములు కల్గించి మన పురోగతిని ఆభ్యంతర పెట్టుచున్నామని ఎంతమాత్రమును తెలియజాలకున్నాము. మనము గంభీరముగ జాగరూకతతో నుండవలెను. వికారమార్గమున మనల నెవ్వరును దరిచేర సాహసింపకుండునట్టి పద్ధతి నవలంబింపవలెను. క్లుప్తముగ మనము ఇనుమిక్కిలి విచక్షణ జ్ఞానమును సంపాదింప ప్రయత్నింపవలెను.

విరాగమునకు విధినిషేధములు రెండును గలవు. సాధ్యమైనంతవఱకు ఇతరులనుండి విరక్తులమై భగవంతునియందు అనురక్తుల మగుటకు ప్రయత్నింపవలెను. ఇందువలన తరువాత తరువాత ఇతరులతోడి సంపర్కమంతయు భగవంతునిద్వారా మాత్రమేగాని నేరుగా ఏర్పడదు. భగవదర్పితమైన మానవప్రేమ క్రమముగ పరిణతి చెందవచ్చును కాని అట్లు భగవదర్పితము కానిచో మనమెంత కాదనుకొనినను అది పతనమై దుఃఖదాయకమగును. ఇతరులతోడి మన సంబంధములన్నియు, అవి ప్రత్యక్షసంబంధములైనచో, శరీరముతోడనే జనించును. శరీరముద్వారామాత్రమే ఇతరులతో సంబంధించును. మనకు శాంతిని నిజమగు ఆనందమును సాధింపగలుగునది ఏదియు అందుండదు.

ఇంతగా బాధపడుచుండియు జనులకు ప్రబోధము కలుగక వారి మిథ్యాభూతములగు తాదాత్మ్యములనే వారు అంటిపెట్టుకొనియుండుట చాల వింతైనవిషయముగదా. సర్వసాధారణముగ మనము గమ్యమును మఱచిపోయి సాధనములనే గమ్యములుగ భ్రమపడుచుందుము. కామక్రోధములచే ఈ ప్రపంచమంతయు బద్ధమైయున్నది. కాని ఈ రెంటిపట్లను మనమొక నూతన దృక్పథము నేర్పరచుకొనవలయును. ధనమునే మనము జీవన పరమార్థముగ భావింతుము. అందువలన కష్టముల పాలగుదుము. ఒక పురుషుని ప్రేమనో స్త్రీ ప్రేమనో జీవితమునకు చరమ గమ్యముగ భావింతుము. జీవితమును దుఃఖభాజనముగ చేసికొందుము. నిజమునకు మనము

చేయవలసినదేమన అంతర్ముఖులమై మన జీవిత గమ్యమేమి యని విచారించి దానిని సాధింప ప్రయత్నించుటయే.

సాధారణముగ మన శరీరము ఇంద్రియములు ఉద్వేగములతో మనకెంత తాదాత్మ్యమనగా భగవంతుని గణింపనే గణింపక దులిపివేసికొందుము. భగవంతునిగూర్చిన సంశయమెచ్చటనున్నదో అచ్చటనంతయు శరీరము-ఇంద్రియ విషయములపట్ల మితిమీరిన సక్తతయుండును, అందువలన భగవంతుడు బహిష్కరింపబడుచున్నాడు. మానవుడు ఇంద్రియ సుఖవాంఛలచేతను కూడబెట్టవలెనను కోరికలచేతను అహంకారదర్పములచేతను నిండియున్నంతకాలమును అతని జీవితమున భగవంతునకు స్థానములేదు. మన ఈ పాశవికబుద్ధి జ్ఞానమును భగవంతుని త్రోసివేయును. ఈ వాంఛలనుండియు ఉద్వేగములనుండియు మనస్సు సంపూర్ణముగ విడివడగలిగినచో మానవుడు తత్క్షణమే భగవత్సాక్షాత్కారము నందును. కనుక మనము భగవత్సాక్షాత్కారమునందనిచో, సత్యము మనఎదుట కనిపించక మినుక్కుమనకపోయినచో, దానికేమి కారణమని ప్రత్యేకముగ నడుగనక్కఱలేదు. మన మనస్సునందును అంతరాళమునందును కోర్కెలు బలవత్తరములై యున్నవనియు మనము ముందు ఈ అభ్యంతరములను వదలించుకొనవలెననియు ఎఱుగవలెను. వానిని మనము ఉండనిచ్చినంతకాలమును మనకు సాక్షాత్కారమను ప్రశ్న ఉత్పన్నముకూడ కాదు.

మనపై మన ప్రవృత్తుల యధికారమును భగ్నము చేయవలెను. ఈ ప్రవృత్తులు జనించిన క్షణమే మనలను మనము విశాలముగ చేసికొనవలెను. అప్పుడు ఈ ప్రవృత్తులు అలలు సముద్రమునవలె మాయమగును. తన చైతన్యమును విస్తృతము చేసికొనుట ఎట్లో తెలిసిన మానవుడు, ఉన్నతతరమగు మన స్థితిని అందుకొనుట ఎట్లో తెలిసిన మానవుడు, తన మనస్సున జనించునట్టి ఇట్టి ప్రవృత్తులచేత విచలితుడు కాడు. మనఃప్రవృత్తుల నతిక్రమించుటకు ఒక అత్యుత్తమ విధమేమన నిరంతరము మనయందేయుండు ఆ అనంత సాన్నిధ్యముతో దివ్యచైతన్యముతో అనుసంధానమును సాధించుట. మనఃప్రవృత్తుల నతిక్రమించుట ఎట్లో తెలియకనే, మన ఉద్వేగములను నిగ్రహించి సంయమమును సాధించుట ఎట్లో తెలియకనే, వైరాగ్యమును అనుద్విగ్నతను అభ్యసింపకనే, బాహ్యాంతశ్శుద్ధిని సాధింప ప్రయత్నింపకనే, ఎవరికిగాని పారమార్థిక జీవనము సాధ్యముకాదు. దానిని సాధించుటకు మనము ఇంకను ఆలోచనాపరులము విచక్షణాశీలురము కావలెను.

మన మాటలకును చేతలకును చాలినంత సమన్వయములేదు. వేదాంతసాధకునియందు ఎట్టి అస్పష్టతయు నుండరాదు. అస్పష్టతకు అనిశ్చితబుద్ధికి పారమార్థికజీవనమున స్థానమే లేదు. ప్రతియొక్కటియు విస్పష్టముగ నుండవలెను. మనకు నిశ్చితములైనవి అర్ధ్వములైనవి అగు ఆలోచన లుండవలెను. నిశ్చితములు అర్ధ్వములు అగు భావనలు అనుభూతులు ఉండవలెను. నిశ్చితములు అర్ధ్వములు అగు చేత లుండవలెను. అప్పుడుమాత్రమే దివ్యమగు గమ్యమునకు పురోగమించి దానిని సాధింపగలము.

# ధర్మవిచారము

**హరిహరదాసు**

ధర్మమన నెన్నియో అర్థములు వచ్చును. ధర్మమన న్యాయమని యొక అర్థము. ఇద్దరు తగవులాడినచో ధర్మము నీవు చెప్పుమని మఱి యొకని వద్దకు పోవుదురు. స్వభావ మని మఱి యొక అర్థము. కాల్చుట అగ్నిధర్మము. కాంతి నిచ్చుట వెలుగుధర్మము. విధి యని మఱి యొక అర్థము. తల్లిదండ్రులను గౌరవించుట పుత్రధర్మము. ఇట్లనేకవిధములుగ ధర్మమున కర్థము చెప్పబడినందున ప్రస్తుతము ధర్మమునకు మనము ఒక వస్తువునందు గల విశిష్ట గుణమను నర్థము స్వీకరింతము. కాల్చుట మాత్రమే కల గుణము. అట్లే ప్రవహించుట ద్రవములకు మాత్రమే కల గుణము. ఇక మానవులకు విశిష్టమైన గుణమేది! మానవుడు మాత్రమే మానవాతీతుడు అనగా దివ్యుడు కాగోరుచున్నాడు. ఇట్లు దివ్యత్వము సాధింపవలె నను కోరిక సాధించు శక్తి మానవునియందు మాత్రమే కలవు. కనుక దివ్యత్వమును తనయందభివ్యక్తము చేసికొనుటయే మానవధర్మము.

విశిష్టగుణ మనినచో అది ఆ జాతిలోని అన్నింటియందును ఉండవలెను కదా. అందఱు మానవులును దివ్యత్వము నభివ్యక్తము చేయ గోరుదురా! అనినచో కోరుదు రనియే చెప్పవలెను! కాల్చుట నిప్పు ధర్మమే యైనను నివురుగప్పిన నిప్పు చిదుగులనైన కాల్పజాలదు. రగిలిన నిప్పు వంటకట్టెలను కాల్చును. దావానలము మహాటవులను సైతము దహించివేయును. ఈ భేదములు నిప్పుయొక్క ధర్మభేదమును కాక అంతర భేదమును తారతమ్యమును మాత్రమే ప్రదర్శించుచున్న వనుట స్పష్టమే కదా! అట్లే లోకమున బహు సంఖ్యాకులు మానవులు నివురుగప్పిన నిప్పువలె తమ దివ్యత్వము నభివ్యక్తము చేసికొనకనే చేసికొను ప్రయత్నమునైనను చేయకనే యుందు రనుట నిజమే. అయినను ఆ శక్తి వారి యందు ముత్యపు చిప్పలోని ముత్యమువలె చెకుముకి ఱాతిలోని నిప్పువలె ఇమిడియే యున్నది.

దివ్యత్వ మనిన అది యేమి? దాని నేల ఆవిష్కరించుకొనవలెను? దివ్యత్వ మనగా శాంతి ఆనందముల స్వరూపము. ఏ మానవుడైనను ఏవిధముగనైనను కోరునది శాంతిని ఆనందమును మాత్రమే. శాంతి ఆనంద మని పర్యాయముగ చెప్పుటయే కాని రెండును ఒక అవస్థనే సూచించును. శాంతిస్వరూపమే ఆనందము. ఆనందస్వరూపమే శాంతి. మఱి వానిని ప్రత్యేకముగ చెప్పుట యేల? సాధారణ వ్యవహారమున గల్గు అర్థభేదమునుబట్టి అట్లు చెప్పుదుము. మనస్సునకు కలుగు ఆవేగములు ఉద్వేగములు అణగిపోయినచో అది శాంతి. అవి అణగు సాధనము లభించినచో అది ఆనందము. ఉదాహరణకు బాలుడు గోలీ లాడ దలచును. వెంటనే వాని మనసు గోలీలతో ఉద్విగ్నమగును. వలదని వారించినచో ఆ ఉద్వేగ మణగదు కనుక దుఃఖితు డగును. వాని తల్లి విసిగి సరి పొమ్మని కసరినను వాని కానందమే. ఏలన గోలీ లాడుటతో వాని యుద్వేగ ముపశమించినది. కాగా పిన్నలకు గోలీలాడిన ఆనందము. పెద్దలకు వారి యనేకము లగు క్లిష్టతరములగు కోర్కెలు తీరిన ఆనందము. కాని ఆనందము దానివలన లభించు శాంతియు క్షణికములు మాత్రమే. ఒక కోరిక తీరిన వెంటనే మఱియొక కోరిక బయలుదేఱి మనసు నుద్విగ్నము చేయుచుండును. కనుక లోక

వ్యవహారమున ఆనందమన కోర్కెలను మాన
సికోద్వేగములను బాహ్యవస్తువులతో తృప్తి
పఱచి తాత్కాలికముగ నుపశమింప జేయుట,
శాంతియన నట్టి తాత్కాలికోపశమనము. ఇక
దివ్యత్వ మనబడు శాంత్యానందములు బాహ్య
విషయముల సహాయమును కోరకయే మన
స్సును శాశ్వతముగ నుపశమింపజేసి ఎల్లప్పు
డును ఆనందస్థితియందే నిలిపి యుంచును.

ఇట్టి శాశ్వతము అవ్యవహితము అగు
శాంతిని ఆనందమును సాధించుట మానవ
ధర్మము — దీనిని సాధించుట యెట్లు? ప్రయ
త్నము వలననే. సంస్కృతమున నొక శ్లోకము
గలదు. గచ్ఛన్ పిపీలికాయాతి । యోజనాని
శతాన్యపి । అగచ్ఛన్ వైనతేయోపి । పద
మేకం న గచ్ఛతి॥ అడుగుతీసి అడుగు వేయు
చున్నచో చీమయైనను (ఎంత అసమర్థుడైనను)
వందలకొలది యోజనములను గడచి పోవును.
(ఎట్టి ఘనకార్యమునైనను సాధించును). కాని
అడుగు కదల్పనిచో (ప్రయత్నమే చేయనిచో)
గరుడుడైనను (ఎంత సమర్థుడైనను) ఒక పద
మైనను ముందునకు పోజాలడు. (ఏమియు
సాధింపజాలడు). కనుక మానవ ధర్మమును
అనుసరింప గోరువారు అనగా శాంత్యానంద
ములను అభివ్యక్తము చేసికొన దలచువారు
ఉన్నచోటనుండి కదలు ప్రయత్నము చేయ
వలెను. అనగా వారు ఇంతకాలమును కోరు
చున్నట్టి బాహ్యవస్తు సంపాదనమును గూర్చి
యాలోచించుట తగ్గించి మనస్సు దానంత
టదియే ఉపశమించునట్లు చేయుట కుద్యుక్తులు
కావలెను.

ఇట్లు ధర్మాచరణ మన శాంత్యానందముల
నభివ్యక్తము చేసికొను ప్రయత్న మనియు
శాంత్యానందము లనగా కోరికలచే మనస్సు
ఉద్విగ్నము కాకుండుట ఇతరముల నపేక్షింప
కయే మనస్సు ఉపశమించుట అనియు ఏర్పడినది.
ఇది యెల్లరకును సాధ్యము కాదనుట స్పష్టమే.
మిక్కిలి కష్టసాధ్య మగుటయే కాక నిరర్థక
మని కూడ తోచును. అల్ప మగు శ్రమతో
తాత్కాలికమగు ఆనందము నిరవధికముగ
సాధించు అవకాశము లుండగా మిక్కిలి శ్రమ
పడి సాధ్యమో కాదో అను ననుమానము గల
శాశ్వతానందమునకై ఏల శ్రమింప వలెను?
పరిశీలించినచో తాత్కాలికానందము సులభ
సాధ్యమే అయ్యును అది లభించువఱకు నిశ్చ
యము లేదు. కావలసిన అల్పప్రయత్నము చేసి
నను ఆ ఆనందము లభింపక పోవు అవకాశ మెప్పు
డును గలదు. అప్పుడు దుఃఖమే ఫలము. ఒక
వేళ ఆనందము లభించినను అది త్వరలోనే
నష్టమై దుఃఖమే చివరకు మిగులును. కాని
కష్టసాధ్యమగు శాశ్వతానందము పర్యవసాన
మున నిశ్చయముగ లభించును. ఒకసారి లభిం
చిన పిమ్మట దానికి నష్టము లేదు. ఇట్లున్నను
సాధారణ మానవులు శాశ్వతానందసాధనకై
తాత్కాలికానందములను పూర్తిగ వదలు
కొనజాలరు, కనుకనే ఈ రెండింటిని సమన్వ
యము చేసికొనుచు శాశ్వతానంద సాధనకు
భంగము లేకుండ తాత్కాలికానందమును
సాధించుకొన ప్రయత్నింపవలెను. అప్పుడు
శాశ్వతానంద సాధన ఫలవంత మగు కొలది
తాత్కాలికానందములపై ఇచ్ఛ క్రమ క్రమ
ముగ నదియే అంతరించును. చిన్నప్పుడు కోతి
కొమ్మచ్చి యాడవలెను, గోలీలాడవలెను అని
యుండిన కోర్కెలు టెన్నిస్ ఫుట్‌బాలులపై
కోర్కెలు పెరిగిన పిమ్మట క్రమముగ అవియే
పోవును కదా. అందువలన దుఃఖలేశమును
కలుగదు కదా!

కనుక ధర్మాచరణ మను శాశ్వతానంద
సాధనకును తాత్కాలికానంద సాధనకును

ఎక్కువ విరోధము లేదు. కాని మానవుడు శాశ్వతానంద సాధనకు వ్యతిరేకుడై నాకు తాత్కాలికానందము మాత్రమే కావలయు ననినచో అతడు మానవుడుగ పుట్టి పొరపాటు చేసినాడని యనవలసి వచ్చును. ఏ వరాహము గనో శునకముగనో పుట్టినచో తాత్కాలిక మగు అమందానందము ననుభవింప గలిగెడు వాడు. తడవకు పదిపిల్లల నీనుచు బురద గుంటలో దొరలు వరాహము ధ్యాననిష్ఠుడైన బ్రాహ్మణునివలెనే నిమీలితనేత్రములతో కదలక యుండును గదా! ఎండి రసహీనమై దుర్వాసనవేయు ఎముక యొకటి లభించినచో శునకము మహదానందముతో దానిని నమలుచు దేవేంద్రుడు వచ్చి చెంత నిలిచినను లక్షింపదు. కనుక తాత్కాలికానందములతో తృప్తి పడ దలచువారు జంతువులవలెనే జీవింతురు కాని మానవులవలె కాదు.

శాశ్వతానందసాధనయందు మాత్రము దుఃఖములు లేవా యనినచో ఉన్నవి. కాని ఈ దుఃఖము ఆరంభమున మాత్రమే, పరిణామమున నమృతోపమముగ నుండును. కృషీవలుడు సంవత్సర మంతయు శ్రమించినను ఫలసాయము చేతికి వచ్చినప్పుడు కలుగు ఆనందముతో పోల్చినపుడు దానిని శ్రమయని దుఃఖమని భావింపడు కదా. అట్లే శాశ్వతానందసాధనము ఆరంభమున మిక్కిలి శ్రమ యనిపించినను ఫలితమున సాటిలేని యానందమును భంగములేని యానందమును లభింపజేయును. కొలదిపాటి శ్రమను చూచి బుద్ధిమంతుడు భీతిచెంద జనడు కదా!

ఇప్పటికి ధర్మమన విశిష్ట గుణ మనియు మానవధర్మము దివ్యత్వము నావిష్కరించుకొనుట యనియు దివ్యత్వమన శాశ్వతానందము నభివ్యక్తము చేయుట యనియు అది మిక్కిలి శ్రమతో కూడిన దయ్యును మానవు డవశ్యము సాధింపవలసిన దనియు ఏర్పడినది.

ఇక ఈ శాశ్వతానంద సాధన విధానములను అనగా ధర్మాచరణ విధానములను పరీక్షింతము.

ఏ ప్రయత్నమునైనను రెండు విధములుగ చేయనచ్చును. ఉత్కృష్టమైన పద్ధతి నికృష్టమైన పద్ధతి. పరీక్ష పాసు కావలె ననిన కాపీ కొట్టి పాసు కావచ్చును. కష్టపడి చదివి పాసు కావచ్చును. ఉద్యోగము నీయ వలసినచో అర్హతచూచి ఈయవచ్చును. లంచముచూచి ఈయవచ్చును. ఇట్లే ప్రతి పనియు ఉత్తమ పద్ధతిలో గాని అధమపద్ధతిలో గాని చేయ నగును. ఉత్తమపద్ధతి ఉత్తమఫలము నిచ్చును. అధమపద్ధతి అధమఫలము నిచ్చును. ఆ ఉత్తమ పద్ధతియే శాశ్వతానంద సాధన ప్రయత్నము, అధమ ప్రయత్నమే తాత్కాలికానంద సాధన ప్రయత్నము.

ఈ ప్రయత్నము నెప్పుడు చేయవలెను? ఎట్లు చేయవలెను? అనుక్షణమును చేయవలసినదే. మనసా వాచా కర్మణా చేయవలసినదే. పుట్టినది మొదలు మానవుడు ఏదియో పనిని చేయుచునే యుండును. అనుక్షణమును ఈపనిని శ్రేష్ఠతరముగ చేయుట ఎట్లుఅని విచారించుచు తనకుతోచినవరకు శ్రేష్ఠతమముగ చేయుటయే ధర్మాచరణము. శాశ్వతానందసాధనము. 'ఇంత చేసినచో చాలును. ఇంతకు మించి యక్కఱలేదు.' అని చేసినచో అది అధర్మము, తాత్కాలికానంద సాధనము.

ఇట్టి నిర్వచనము ద్వారా సాధారణముగ స్వీకరించు విధులు బాధ్యతలు అర్థవంతము లగును. తండ్రిగా బాధ్యత పుత్రునిగా బాధ్యత సోదరునిగా బాధ్యత విద్యార్థిగా బాధ్యత

ఉద్యోగిగా బాధ్యత పాలకుల బాధ్యత పాలితుల బాధ్యత ఇట్లు సంఘమునందలి యే అంశమును చూచినను ఈ ఉత్కృష్ట నికృష్ట విధానములలో నొక దానిని అవలంబింపవలసియుండుటను చూతుము. సంఘమునందలి వ్యక్తులెల్లరును ఎవరికివారే ఉత్కృష్టపద్ధతి నవలంబించి పని చేసినచో క్రమక్రమముగ సంఘమంతయు ఉత్కృష్టస్థితికి వచ్చును. ఉత్పత్తి సాధ్యమైనంత యధికముగ జరుగును. వర్తకులు సాధ్యమైనంత స్వచ్ఛమగు సరుకును సాధ్యమైనంత తక్కువ ధర కమ్ముదురు. కార్మికులు సాధ్యమైనంత ఎక్కువ పనిని సాధ్యమైనంత తక్కువ కాలములో సాధ్యమైనంత నాణ్యతతో చేయుదురు. అట్లే పుత్రులు ఆదర్శ పుత్రులు తండ్రులు ఆదర్శపితలు అధ్యాపకులు ఆదర్శమూర్తులగు అధ్యాపకులు మిత్రులు ఆదర్శ సఖులుగను ఉండుటకు సర్వదా ప్రయత్నింపవలెను. ఇట్లు సంఘమునకావలసిన భౌతికమానసిక తాత్కాలికానందము లన్నియు అప్రయత్నముగనే లభించును. అంతియగాక శాశ్వతమగు ఆనందమును ఎల్లరకును సాధ్యమగును. పరీక్షలో మొదటి తరగతియం దుత్తీర్ణుడైనచో అది ఆనందమే. కాని అనుదినము శ్రద్ధగా చదువుటయే కాలక్రమమున వెలలేని యానందము నొనగూర్చును కదా!

ఉపసంహారమున ధర్మమన ఉత్కృష్టమగు విధానమున కర్మాచరణమనియు దానికి ఫలము దివ్యమగు శాశ్వతానంద మనియు అవాంతర ఫలములుగ తాత్కాలికానందములు సాధింపబడుచున్న వనియు ఇట్టి శాశ్వత, తాత్కాలికానందములను సాధించుటకు ఎల్లరును అధికారులే యనియు విశదమగుచున్నది.

# వినతి

ఎ. వి. నారపరెడ్డి కవి

గీ. గీతలో దెల్పినట్లుగ ప్రీతిగాను, బ్రహ్మనిష్ఠను జేయుచు భక్తితోడ
బ్రహ్మమున్ గలసిపోయిన పరమహంస. రమ్యగుణసాంద్ర! యతిరాజ! రామకృష్ణ!

కం. తోతాపురి గురుదేవులు, పూతాత్ముని జేసె నీదు పుణ్య మదేమో
చేతోమోదము గూర్చెడు, నీ తత్త్వము నెవడు దెలియు నిర్గుణరూపా!

కం. ప్రజ్ఞాన ఖడ్గధారల. నజ్ఞానాటవిని నఱికి యలరితి వయ్యా
విజ్ఞానంబు నొసంగియు, నజ్ఞానము బాపుమయ్య ఆత్మస్వరూపా!

కం. నీ పాద భక్తి నొసఁగియు, నేపారెడి యహము ద్రుంచి యెల్లప్పుడు మా
ప్రాపును దాపును నీవై, కాపాడియు బ్రోవుమయ్య కారుణ్య నిధీ!

కం. అచలము అచలంబనుచును, వచియింతురు గాని దాని వర్తన మేమో
శుచులం గోరెడి వారికి, యచలంబును గానగును యాత్మ స్వరూపా!

కం. పరమ విరాగము చేతను, నిరతంబును నిన్ను గొల్తు నిశ్చలభక్తిన్
అరమర లేటికి జేసెదు, సరసగుణా బ్రోవుమయ్య సద్గురువర్యా!

# విశ్వజనీనమతాదర్శము

మానవుల కింకనే క్షేత్రమందును కానరాని అపార ప్రేమభావములు మతము మూలమున నుద్భవిల్లినవి. ఇంక నే క్షేత్రమునందును కానరాని ఘోరాతిఘోర ద్వేషభావములుకూడ మతము మూలముననే ఉద్భవిల్లినవి. ప్రపంచము మున్నెన్నడు వినియెఱుగని మహోదారశాంతి సందేశములు మతప్రవక్తలయొద్దనుండి బయలుదేఱినవి. మున్నెన్నడును కనివిని యెఱుగని భీషణ నిందారూప విషవర్షములుకూడ బోధకులనుండియే వెలువడినవి. మతముయొక్క ఉద్దేశము ఉన్నతమగుకొలది దాని వ్యవస్థ పరిణతినందుకొలది దాని కార్యకలాప విధానములుకూడ విశిష్టత నొందుచుండును. మతప్రేరణలవలె లోకమును రక్తసముద్రములలో ముంచిన ప్రేరణ లింకేవియు లేవు. కాని అన్ని దీనజన శరణాలయములు అన్ని చికిత్సాశాలలు లోకమున నే యితర ప్రేరణలవలనను స్థాపింపబడలేదు. మానవక్షేమముకొఱకే కాక నోరులేని అతిహీనజంతువుల క్షేమముకొఱకుకూడ నదుపాయము లేర్పడుటకు కారణభూతమైన మానవ ప్రేరణలలో మతప్రేరణలకే అగ్రస్థానము. మతోత్సుకత్వమువలన కలుగునంత క్రౌర్యము మఱి దేనివలనను కలుగదు. మతోత్సుకత్వమువలన కలుగునంతటి దయాళుత్వముకూడ మఱిదేనివలనను కలుగదు. ఇంతవఱకిట్లే జరుగుచున్నది. ఇకమీదకూడ నిట్లే జరుగునని నమ్మదగును. కాని ఈ కలకలములు ఈ సంక్షోభములు ఈ పోటీలు ఈ పోరాటములు మతములయెడల మతశాఖలయెడల గల ఈ ద్వేషములు ఈర్ష్యలు: ఈ యన్నిటి కోలాహలమంతయు మునిగిపోవునంతటి గంభీరనినాదముతో శాంతిసామరస్యములు సమస్త వసుంధరయందు ప్రకటించు మహత్తర శక్తివంతములగు వాక్కు లప్పుడప్పుడు వినవచ్చుచుండును. ఆ శాంతి సామరస్యము లెన్నటికైన సిద్ధించునా?

—శ్రీ వివేకానందస్వామి.

ప్రకృతియం దెచ్చట చూచినను వ్యతిరేకశక్తులు ఏకకాలముననే పనిచేయుచుండుట కన్పించును. ఆకర్షణవికర్షణలు వాని యనేక రూపములందు ప్రకృతియం దంతటను అభివ్యక్తములై యున్నవి. భౌతికరంగమున ఆకర్షణవికర్షణలు సంయోగవియోగములు వృద్ధిక్షయములు కలుగునటులే మానవుల యంతరంగములందు మంచిచెడులు రాగద్వేషములు వ్యాపించియున్నవి. భావములు సున్నితములగుకొలది ఈ రాగద్వేషములును తీవ్రతరములై ప్రకటితము లగుచున్నవి. అత్యంతము సున్నితమైన మతవిషయమున ఈ రాగద్వేషములును తీవ్రతమములైనవి.

తమ మతమునకు చెందినవారిపై మిక్కుటమగు రాగము ప్రేమ ఇతరమతములకు చెందినవారిపై ద్వేషము నిరంతరముగ పెరుగుచునే యున్నవి. అవి ప్రశమించినపుడు మహానుభావు లెందఱో అవతరించుచునే యున్నారు. వారి యనుభూతికి వచ్చిన ఔదార్యము సమత్వము సౌభ్రాతృత్వము ప్రేమ శాంతి యని బోధించుచునే యున్నారు. వారు గతించిన పిమ్మట ఆ అనుభూతి లేనివారియందు ఆ బోధలే మఱియొక శాఖను రాగద్వేషసంభరితమైన మఱియొక మతశాఖను జనింపజేయుచున్నవి. ఒకమతమువారు మతశాఖవారు సౌభ్రాతృత్వమనినచో అది వారి శాఖకు మాత్రమే పరిమితమై ఇతరులపట్ల ద్వేషమును వైరమును పెంచుచున్నది. ఇట్టి పరిస్థితియందు సౌభ్రాతృత్వమును సాధించు మతము ఒక సంఘమునకో ఒక రాష్ట్రమునకో ఒక దేశమునకో పరిమితమై తదితరులతోడి వైరమున పర్యవసించుచున్నది. ఇక సర్వజనులను పొదివికొను

మతము, ఎవ్వరితోడను వైరములేని మతము ఎన్నటికైనను సాధ్యమా?

సాధ్యమనుటలో సందియములేదు. ప్రకృతి యందును అనంతమైన విభేదములున్నవి. ఒక మానవునివలె నింకొకడుండుటలేదు. అయినను వారొక దేశీయులే. ఒక దేశపు సంప్రదాయములు మఱియొక దేశస్థులకు పాపములు. అయినను అందఱును మానవులే. మానవుల వలె జంతువులు పక్షులు జలచరములు లేవు. కాని అన్నియు జీవములే. కనుక ఎంత వైవిధ్యములోనైనను ప్రకృతియందు ఐక్యసూత్ర మొకటి కన్పించుచునే యున్నది. అట్లే భిన్న విభిన్నమత సంప్రదాయములకు గల మూల సూత్రమేది?

ప్రతి మతమునందును మతతత్త్వము పురాణము కర్మకాండ అని మూడు విభాగములు గోచరించును. మతతత్త్వము ఆ మతము యొక్క సిద్ధాంతములను ప్రతిపాదించును. మానవజీవిత లక్ష్యమేమి? ఆ లక్ష్యమునకు మానవునకు గల సంబంధమేమి? లక్ష్యములను సాధించు విధానమేమి? అను విషయములను మతతత్త్వము ప్రతిపాదించును. ప్రతి మతమునకును ప్రత్యేకమైన సిద్ధాంతములుండును. ఆ సిద్ధాంతములే సరియైనవనియు ఇతర సిద్ధాంతములు తప్పులనియు ఉద్ఘాటించుచు కొన్ని మతములు రక్తపాతమునకైనను వెనుదీయవు. స్వర్గమున తంబుర మీటుచు దేవుని స్తుతించుటయే మానవుని లక్ష్యమని యొక మత మనగా పాలు తేనెలు ప్రవహించు స్వర్గమున తినుచు త్రాగుచు అందగత్తెలతో సుఖించుటయే పరమార్థమని మఱియొక మత మనును. దేవుని నిరంతరము దర్శించుటయే యానందమని యొకమతమనగా దేవునికి నీకు భేదము లేదని మఱియొక మత మనును. ఇట్లు అనేకములగు మతముల లక్ష్యములు భిన్నములు కాగా మానవునకు వాని తోడి సంబంధమును ఆ లక్ష్యములను సాధించు విధానములును అట్లే లెక్కకు మిక్కిలిగ ఏర్పడుచున్నవి. ఇట్టి పరిస్థితియందు ప్రపంచ మంతటికిని ఒక్కగానొక్క లక్ష్య మేర్పడుట కలయందైనను సాధ్యము కాదు.

పురాణములందు ఐక్యత ఇంకను దుస్సాధ్యము. ప్రతిమతమును తన పురాణములు పరమ ప్రమాణము లనుటయేకాక ఇతరుల పురాణములు పుక్కిటి పురాణములు కాకమ్మ కథలు అనుచు పరిహసించును. కర్మకాండల యందును ఒక మతమునకు పరమపవిత్రములైన ప్రతీకలు మఱియొకదానికి జుగుప్సాకరములుగ నుండును. ఒక మతమునకు అత్యున్నతమగు భావోత్కర్షను కలిగించు కర్మకలాపము మఱియొకదానికి హాస్యాస్పదముగ నుండును. ఒకరికి మహోన్నతభావ మగునది మఱియొకరికి వట్టి దురహంకార మగుచున్నది. ఉదాహరణమునకు క్రీస్తునుగూర్చిన కథలన్నియు క్రైస్తవులకు పరమప్రమాణములు. కాని క్రైస్తవేతరులకు అవి కథలు మాత్రమే. హిందువుల శ్రుతులు వారికి పరమప్రమాణములు కాని తదితరులకు అవి అనాగరిక సల్లాపములుమాత్రమే. క్రీస్తు 'మాంసమును' 'రక్తమును' స్వీకరించుట (Sacrament) క్రైస్తవులకు పవిత్రత నాపాదించును. కాని తదితరులకు అది నరమాంస భక్షణ వంటిదే. హిందువుల విగ్రహారాధన వారికి అప్రతిమానమగు పరమార్థసాధనము కాని ఇతర మతస్థులకు అంతకుమించిన మూఢ నమ్మకము లేదు. ఇట్లు తత్త్వములందుగాని పురాణములందుగాని కర్మకాండయందుగాని మతములకు సమైక్యత కుదురదు.

ఒకవేళ కుదిరినను అది వాంఛనీయము కాదు. భిన్నత్వము సృష్టిలక్షణము. ఐక్యము ప్రళయ లక్షణము. విశ్వమున నిన్ని భిన్న విభిన్నములగు జీవకోటులు వానివాని లక్ష్యములతో వర్ధిల్లుచున్నవి కనుకనే అది ప్రపంచమనిపించుకొనుచున్నది. సృష్టికి పూర్వము సర్వమును ఏకపదార్థమే. దానినే మృత్యుస్వరూప మనుచున్నాము. నిద్రయందెల్ల జంతువులు చరాచరములు సమానస్థితియందే యుండును. అట్లని నిరవధికము నిరంతరాయము అగు నిద్రావస్థ నెవ్వరును వాంఛింపరు గదా. కనుక చైతన్యశక్తి వ్యక్తము కావలెనన్న భిన్నత్వము వర్ధిల్లుచునే యుండవలెను. ఏకత్వము సర్వథా సాధింపబడవలెనన్నచో చైతన్యశక్తి ఉపసంహృతము కావలసినదే. కనుక సృష్టి కొనసాగువఱకు నూత్నవినూత్నములగు మతములు వర్ధిల్లవలెను. ప్రతిమానవునకును వానికి తగిన మత మేర్పడవలెను.

ఇట్లయినచో మతసమైక్యత ఇక ఏ విషయమున సాధ్యము? చీమలు మొదలు మానవుల వఱకుగల జీవరాశిలో అనంతమగు తారతమ్యములున్నను అన్నింటికిని జీవత్వము ఎట్లు సామాన్యమో అట్లు మతములకును భిన్నవిభిన్నముగ వర్ణింపబడిన పరతత్త్వమొకటి లక్ష్యముగ నున్నది. వివిధమానవులకు సులభతరముగ తెలియుటకే ఆ పరతత్త్వము పురాణముల రూపమున విపులముగ చరిత్ర, కథల మిశ్రమముగ వివరింపబడియున్నది. ఆ పరతత్త్వమును నిత్యజీవితమున సాక్షాత్కరించుకొను విధానమే అన్నిమతములందు ఆయా కర్మకాండలరూపమున ప్రకటితమగుచున్నది. కనుక అన్నిమతములును ఈ ప్రపంచమున కతీతమగు తత్త్వము నన్వేషించుమార్గములు. ఏమార్గమునైనను త్రికరణశుద్ధిగ నవలంబించినచో తుదిని ఒక గమ్యమునకే ఎల్లరును చేరుదురనుటలో సందియము లేదు.

ఇట్లు భిన్నవిభిన్నములగు అభిరుచుల కనువగు మార్గములను సూచింపగల మతమే విశ్వజనీన మతము కాగలుగుచున్నది. అందు ప్రతి మానవుడును తనకు నచ్చిన ఆదర్శమును స్వీకరింపవచ్చును. తనకు సాధ్యమగు విధమున దాని నర్థము చేసికొనవచ్చును. తనకు వీలయిన విధమున దానిని సాధింప ప్రయత్నింపవచ్చును. అట్టిమతము అభ్యాసములోనికి రావలెనన్నచో దానికొక రూపము ఒక లక్ష్యము ఒక పద్ధతి ఉండవలెను కదా!

దానిరూపము మానవుల విభిన్న ప్రకృతుల సమన్వయము. దాని లక్ష్యము పరిపూర్ణత నిత్యజీవనమున అనుష్ఠానము. దాని పద్ధతి ప్రోత్సాహము.

ఒక్కొక్క అంశమును పరిశీలించినచో: మానవప్రకృతి అత్యంతము క్లిష్టమైనది. అనంతమగు వైవిధ్యములతో కూడియున్నది. అయినను దానిని ముఖ్యముగ నాలుగు తరగతులుగ విభజింపవచ్చును. కొందఱు ఉద్యమశీలురు. ఎప్పుడును ఏదియో ఒక సత్కార్యమును చేయుచునే యుందురు. ప్రపంచమున నింత దుఃఖము కష్టము నిండియుండ "పరతత్త్వము" గూర్చి చర్చించుట వీరి కెంతమాత్రమును అంగీకార్యము కాదు. అందుచేత వీరు నిరంతరము కార్యవ్యగ్రులై ఆసుపత్రులు విద్యాలయములు గృహావసతులు మఱి ఇతర సౌకర్యములను సోదర మానవులకు కల్పించుట యందే నిమగ్నులై యుందురు. అంతియగాక అట్లు చేయనివారిపై వీరికి తిరస్కారము. అట్టివారు పరాన్నభుక్కులనియు సంఘమునకు భారమనియు వారినెంత శీఘ్రముగ తుద

ముట్టించిన నంతక్షేమకరమనియు వీరి యభిప్రాయము.

రెండవతరగతివారు సంయములు. అన్ని జీవులును ఏశక్తిచే ప్రేరితములై తమ తమ కార్యములందు ప్రవర్తించుచున్నవి? మానవుడేల సర్వోత్తముడగుచున్నాడు? మానవునియందంతర్గతమైన ఆ విశిష్టశక్తి యేది? అని వెదకి తమలోని ఆ శక్తిని సంపూర్ణముగ నావిష్కరించుకొనుట వీరి లక్ష్యము. దానిని వీరు తమ మనస్సుల నేకాగ్రము చేయుటవలనను కేంద్రీకరించుకొనుటవలనను సాధింపజూతురు. ఇట్లు తమ మనస్సులపై నధికారము సంపాదింపనివారు వ్యర్థులని వీరి యభిప్రాయము. అట్టివారనిన వీరికి తృణీకారము.

ప్రేమికులు మూడవతరగతివారు. వీరికి సుఖదుఃఖములతోను శక్తులతోను ప్రమేయము లేదు. ప్రకృతి సౌందర్యమును అట్టి సౌందర్యమును సృష్టించిన వాని సౌందర్యమును వీరారాధింతురు. తమ సర్వస్వమును వానికై వదలుకొందురు. వానినే ప్రేమింతురు. అతడు కన్పించిన చాలునందురు. అట్టివానికి సకలోపచారములను చేయుచు నిరంతరము వానిని గూర్చియే ఆలోచించుచు వానినెట్లు దర్శింపవలెననియే వీరు చింతింతురు. లోకములోని సుఖదుఃఖములు వీరికి పట్టవు. తమ మనశ్శక్తులనిన వీరి కసహ్యము. తమ ప్రియుని సాంగత్యముతో పోల్చినచో ఇట్టివన్నియు వారికి పెంట కుప్పలతో సమానము.

నాల్గవరకమువారు తాత్త్వికులు. తమకు గల మేధాసంపత్తితో వారు అన్నింటికిని కారణము నెఱుగగోరుదురు. సత్యమేది అని యడుగుదురు. పుట్టినవన్నియు చచ్చుచుండగా ఈ ప్రపంచమున శాశ్వతవస్తువేదనియందురు. ఈ ప్రపంచమే అసత్యము. సృష్టియే అసత్యము. అందలి శక్తులు సుఖదుఃఖములు సృష్టికర్త అన్నియు అసత్యములే. వీని నన్నింటినిమించిన పరతత్త్వమును తెలియవలెనని వీరి సిద్ధాంతము. తమ హేతువాదము నందుకొనలేని వారిపై వీరికి అపరిమితమగు తిరస్కారము.

ఇట్లు పరస్పరము తిరస్కరించుకొను ఈ నాలుగు ప్రకృతులును పర్యవసానమున సాధించునది ఒక పరతత్త్వమునే. భిన్నవిభిన్నములగు అన్నిమతములందును ఈ నాలుగు ప్రకృతులును అవశ్యము సిద్ధించునవే. కాని ఆయా మతములలోనే విభిన్న ప్రకృతుల నడుమ అవహేళనమును తిరస్కారమును వ్యక్తముగనో అవ్యక్తముగనో ఏర్పడుచునే యుండును. విశ్వజనీనమత మనునది ఈ భిన్నప్రకృతులకు వానికి కావలసిన ఆదర్శముల నందింపవలెను. వానికి సాధ్యమగు సాధనమార్గములను చూపవలెను. ప్రతివారును ఏకైకమగు పరతత్త్వమును సాధింపగలరని వక్కాణింపవలెను. ఆ సాధ్యత్వమును ప్రదర్శింపవలెను.

దీనిని సాధింపవలెనన్న అట్టి విశ్వజనీనమతము లోకకల్యాణ ప్రయత్నములను పరతత్త్వప్రేమను మనస్సుయొక్క ఏకాగ్రతను నిశితమగు హేతువాదమును తనయందు సమన్వయించుకొనవలెను. లోకమున కుపకారము చేయగోరువారికి తగు కార్యక్రమములను చూపవలెను. కాని ఆ కార్యక్రమముల ఫలితములతోడి సంగమునవచ్చు దుఃఖమును వారించుటకై నిస్సంగ కర్మాచరణమును బోధింపవలెను. మనస్సు నేకాగ్రము చేయగోరువారికి అనేకవిధములగు ఆత్మనిగ్రహవిధానములను మనోలయమును సాధించు విధానములను బోధించి సహకరింపవలెను. ప్రేమికు

లకు ఎల్లమానవులందును గల ఆ పరాత్పరుని గుర్తించు విధానమును తెలుపవలెను. కావలసినన్ని ప్రేమారాధ విధానములను వారికి కల్పింపవలెను. అదిమిథ్య ఇది అసత్యము అను తాత్త్వికులకు వారి శరీరమే బుద్ధియే మిథ్యయని తెలియజెప్పవలెను. అందఱకును ఎవరికి కావలసిన తత్త్వమును పురాణమును కర్మకాండను అందించుచు విశ్వజనీనమతము అందఱి మార్గములను అంగీకరించుచు అందఱిని ప్రోత్సహించుచు అందఱియందును సుహృద్భావమును కలుగజేయవలెను.

అట్టిదే విశ్వజనీనమతము. అది మాటలయందుండదు. నిత్యజీవితమునందనుష్ఠింపబడవలెను. ఎవనియందు ఈ నాల్గు అంశములును సమపాళ్లలో నభివృద్ధిచెందవో అతడు పాక్షికాభివృద్ధినిమాత్రమే సాధించును. పరిపూర్ణతనెన్నటికిని అందుకొనజాలడు. ఎంత అందమైన విశిష్టమైన ఆకర్షణీయమైన సిద్ధాంతములను ప్రతిపాదించినను అది విశ్వజనీనమతము కాజాలదు. నిత్యజీవనమున ననుష్ఠింపబడినదే అది విశ్వజనీనమతము. సర్వాత్మనా ఆ పరిపూర్ణతను తనయందావిష్కరించుకొనుటయే విశ్వజనీనమతము.

# యువకులకు శ్రీ వివేకానందుల పిలుపు

## భౌతిక - ఆధ్యాత్మిక శక్తి

భారతదేశము చేరిన ఆర్యులు అచ్చటి వాతావరణము నిరంతరముగ పని చేయుటకు వీలులేనంత వేడియని గ్రహించిరి. అందుచే వారు ఆలోచనాపరులు కాజొచ్చిరి. ఆ విధముగ వారు అంతర్ముఖులై మతమును పెంపొందించిరి. మానసికశక్తి అనంతమైనదని గ్రహించుటచే దానిని వారు వశపరచుకొన యత్నించిరి. ఆ మానసిక శక్తి ద్వారా వారు మానవుడని మనము వ్యవహరించు ఆ శరీరములో చుట్టచుట్టుకొని అనంతశక్తి దాగియుండుటను అది చలనస్థితి పొంద యత్నించుచుండుటను కనుగొనిరి. ఈ శక్తిని అభివ్యక్తము చేయుటయే వారి ముఖ్యోద్దేశ మయ్యెను. ఆర్యులలో మఱియొక శాఖ ఇంకను చిన్నది, సుందరమైనది అగు గ్రీసుదేశమునకు పోయిరి. అచ్చటి వాతావరణము వారికి అనుకూలతరముగ నుండెను. అందుచే వారి కార్యాచరణ బహిర్ముఖమై బాహ్యకళలను బాహ్యస్వాతంత్ర్యమును అభివృద్ధి చేసినది. గ్రీకులు రాజకీయ స్వాతంత్ర్యమునకై యత్నించిరి. హిందువులు ఎల్లప్పుడును ఆధ్యాత్మిక స్వాతంత్ర్యమునకై పాటుపడిరి. ఇరువురును పాక్షికులే. భారతీయులు జాతిరక్షణపట్లను దేశాభిమానముపట్లను తగినంత శ్రద్ధ వహింపరు. తమ మతమును మాత్రమే కాపాడుకొందురు. ఇక గ్రీకులకు (గ్రీకునాగరికత కొనసాగిన ఐరోపాయందును) దేశమే ప్రప్రథమ విషయము. ఆధ్యాత్మిక స్వాతంత్ర్యమునే ప్రోదిచేసి సాంఘిక స్వాతంత్ర్యమును గణింపకుండుట యొక్క లోపము. కాని సాంఘిక స్వాతంత్ర్యమునకై ఆధ్యాత్మిక స్వాతంత్ర్యమును లెక్కచేయకుండుట తీవ్రతరమైన లోపము. కావున ఆత్మ స్వాతంత్ర్యమునకు శారీరక స్వాతంత్ర్యమునకు కూడ పాటుపడి తీరవలెను.

పవిత్రముగ నుండుట, నిస్స్వార్థముగ నుండుట—ఇదే మతసర్వస్వము.

నాయనలారా! మతరహస్యము ఆచరణలో నున్నది కాని సిద్ధాంతములలో లేదు. మంచిగ నుండుట మంచిచేయుట—ఇదేమతసర్వస్వము. "దేవా! దేవా! అని యఱచువాడు కాదు. తండ్రి యానతి నిర్వర్తించువాడు." మీ రొక చక్కని యువకవర్గము. శీఘ్రముగనే మీలో పలువురు మీరు పుట్టిన దేశమునకు సౌభాగ్య కర్తలుగను మీరున్న సంఘమునకు అలంకార ముగను అగుదురని యాశింతును.

ఈ ప్రపంచమువలన మీకు అప్పుడప్పుడు కష్టము కల్గినచో బాధ చెందకుడు. అది త్వర లోనే తొలగిపోయి సర్వము చక్కబడును.

నీతిమంతులు కండు. సాహసోపేతులు కండు. అకుంఠిత నీతివర్తనులు సాహసోన్మత్తులు అగు పరిపూర్ణ మానవులు కండు. మతసిద్ధాంతము లతో మీ తల దిమ్మెత్తించుకొనకుడు. పిరికి పందలే నేరమొనర్తురు. తలంపులలోనైనను సాహసవంతు లట్లు చేయరు. వీరు వారనక అంద ఱిని ప్రేమించుటకై యత్నింపుడు. మీరుధీరులై మీ సన్నిహిత సంరక్షణలోనున్న వారు సాహసో పేతులు నీతిమంతులు దయాళువులు అగునట్లు చేయుడు. నా బిడ్డలారా! మీకు నైతిక వర్త నము సాహసము తప్ప వేఱు మతము వలదు. పిరికితనము వలదు. పాపము వలదు. నేరము వలదు, బలహీనత వలదు. ఇక తక్కినవి తాని యంతట నవియే వచ్చి పడును...... నరము లను బలహీనపరచు వినోదకార్యక్రమ మెట్టి దైనను సరే చూడనే వలదు.

జాతిగ మనము మన వ్యక్తిత్వమును కోల్పో యితిమి. భారతదేశ మందలి దౌర్భాగ్యమున కిదియే కారణము. కోల్పోయిన వ్యక్తిత్వమును మరల జాతియందు కల్పించి పామర జనోద్ధరణ కావింపవలెను. హిందువు లేమి ముస్లిము లేమి క్రైస్తవులేమి అందఱును పామరుల నణగ ద్రొక్కిరి. మరల వారి నుద్ధరించు శక్తి అంత ర్యము నుండియే—సనాతన హిందువుల నుండియే—వచ్చి తీరవలెను. ప్రతి దేశమం దును దోషము లుండునది మతమునకు ప్రతి కూలత యందే కాని, మతమునందు కాదు. దీనిని సాధించుటకు కావలసినది మొదట మను ష్యులు తరువాత నిధులు.

ప్రస్తుతము మీకు మంచి ఊహలు మంచి తలపులు కలుగుగాక. మీరు సజ్జనులు, ఉదా త్తులు, చైతన్యవంతమైన శక్తిని జడపదార్థ ముగ—అనగా ఆధ్యాత్మికతను చార్వాక స్థాయికి—దిగలాగుటకు మారుగ మీరు జడ పదార్థమును చైతన్యశక్తిగ మార్చి వేయుడు. ఆ ఆధ్యాత్మిక విశ్వమునగల అనంతసౌందర్యము శాంతి పవిత్రతలను క్షణమాత్రమైనను మీరు అనుదినము దర్శించి దివారాత్రములు దాని యందే జీవింప యత్నింపుడు. విపరీత మగు దేనినిగాని అన్వేషింపకుడు. కాలి కొనగోళ్ళతో నైనను స్పృశింపకుడు.

# భక్తిరత్నావళి

మూలము :
**శ్రీవిష్ణుపురి**

వ్యాఖ్యాత :
**విష్ణుచిత్తుడు**

## 67

ప్రేమభక్తియందు సుస్థిరుడైనవాని కిక కార్యమేమియు లేదని ఉద్ధవుడనుచున్నాడు.

తస్మిన్ భవనావఖిలాత్మహేతౌ నారాయణే కారణమర్త్యమూర్తౌ
భావం విధతో నితనాం మహాత్మన్ కిం క్వావశిష్టం యువయోస్తు కృత్యమ్॥
(10-46-33)

మహాత్ములారా! (శ్రీకృష్ణుని మాతాపితలగు యశోదయు నందుడును) సర్వజీవుల కాత్మయు మూలకారణుడును ఐన నారాయణుని మానుషరూపమే శ్రీకృష్ణుడు. అట్టివానియెడ మీరు వాత్సల్యభావమును దృఢముగ నిలిపితిరి. జీవనసాఫల్యము నిట్లు పడసిన మీకు కర్తవ్యమిక నేమి కలదు ?

## 68

అట్టి భక్తి నుత్పాదించు సాధనముల నుద్ధవుడు పేర్కొనుచున్నాడు.

దానవ్రత తపోహోమ జపస్వాధ్యాయ సంయమైః
శ్రేయోభిర్వి విధైశ్చాన్యైః కృష్ణే భక్తిర్హి సాధ్యతే॥ (10-47-24)

దానము వ్రతము తపము హోమము జపము సద్గ్రంథపఠనము మనోనియమనము మఱి ఇతరములగు ఆధ్యాత్మిక సాధనలవలన శ్రీకృష్ణునిపట్ల ప్రేమభక్తి పెంపొందును.

గమనిక : ఆధ్యాత్మికసాధన లన్నింటి పరమాశయమును శ్రీకృష్ణునియెడ ప్రేమభక్తిని పొందుటయే. పై జెప్పబడిన సాధనలన్నియు భక్తిసాధకుల కుపాయమాత్రములే. పరమార్థతః ప్రేమభక్తి వికాసము భగవత్కృపపై నాధారపడియున్నది కనుక తక్కినవన్నియు ప్రయత్నములు మాత్రమే.

## 69

శ్రీకృష్ణునియెడ గోపికల భక్తిని బొగడుచు ఉద్ధవుడు భగవత్కృపాలాభమునకు కావలసిన సముదాచారములనెల్ల ప్రేమభక్తి యెట్లతిక్రమించునో ప్రదర్శించుచున్నాడు.

క్వేమాస్త్రియోర్వనచరీ ర్వ్యభిచారదుష్టాః కృష్ణే క్వచైష పరాత్మనిరూఢభావః
నన్వీశ్వరోను భజతోఽవిదుషోపి సాక్షాచ్ఛ్రేయ స్తనో త్యగదరాజ ఇవోపయుక్తః॥
(10-47-59)

వనచరులు నీతినియము లేని సమాజములోనివారు అయిన ఈ స్త్రీ లెక్కడ! వారి నడుమ వెలసిన పరాత్పరుడగు శ్రీకృష్ణునిగూర్చి గాఢము ఉద్ధృతమునైన యుత్కంఠ యెక్కడ!

తన దివ్యత్వము నెఱుగకయే తనను సర్వాత్మనా ప్రేమించిన చదువుసంధ్యలు లేని గోపికల నా పరాత్పరుడు కటాక్షించెను. తెలియక సేవించినను దివ్యౌషధము గుణము చూపును కదా!

గమనిక : ఈ శ్లోకమునందు గోపికలకు శ్రీకృష్ణుని ఈశ్వరత్వము తెలియదనియు, అతనిని కేవలము మానవుడగు ప్రియునిగనే ప్రేమించిరనియు అయినను శ్రీకృష్ణుని ప్రభావముచే పరమార్థమును పొందిరనియు ధ్వనించుచున్నది. ఇది గుణము తెలియకయే సేవింపబడిన ఔషధప్రభావముతో పోల్చబడినది. ఇది శ్రీకృష్ణుని ఆశ్రితవాత్సల్యమునకు మోక్షదాయక వైభవమునకు ప్రశంసయే. ఐనను నారదభక్తిసూత్రములు మొదలైన భక్తిశాస్త్రములందే కాక భాగవతమునందుకూడ ఇతర సందర్భములందు గోపికలు శ్రీకృష్ణుని అతిలోకమగు ఈశ్వరత్వము నెఱిగియు అతనిని సామాన్యుడగు ప్రియునివలె కూడ చూచిరని తెలుపబడి యున్నది. భాగవతమునందలి ప్రేమభక్తిభావమున జరుగునదేమన: భక్తుడు దేవుని దివ్య గాంభీర్యమును కేవలి దర్శించుట మాత్రమేకాక అతనికొఱకై తన బంధుగులందువలె వ్యక్తిగత మైన ప్రేమను చూపును. దైవము తన తల్లిదండ్రులు పుత్రులు సోదరులవలె తన స్వంతమని భక్తుడు భావించుటయే దీనికి కారణము. భక్తునకు దైవమునకు మధ్య దేవుని దివ్యగాంభీర్యము కలిగించు అగాధమును వ్యక్తిగతమగు ప్రేమలోని సాన్నిహిత్యము సరిచేయును. భాగవతము నందలి దివ్యప్రేమ ఈ విధముగ భగవంతుని అనంతశక్తిని అనంతప్రేమను సమన్వయము చేయుట గమనార్హము.

---

# భారతీయ సంస్కృతి

## డా. దివాకర్ల వేంకటావధాని

సంస్కృతి యను పదము సముపసర్గపూర్వక మైన కృధాతువునుండి యేర్పడినది. సంస్కార మన్నను సంస్కృతి యన్నను ఒకటే. దీనికి సంస్కరించుట, దోషములను తొలగించి లెస్సగా చేయుట జ్ఞానము మున్నగు నర్థము లున్నవి. సంస్కృతి నాగరికత పదములు సాధారణముగా సమానార్థకములుగా వాడబడు చున్నను వాని యర్థములందు భేద మున్నది. నాగరికత బాహ్యమైన దేహమునకు సంబంధించినది, సంస్కృతి యాంతరమైన ఆత్మకు సంబంధించినది. అందుచే సంస్కృతి పదమున మతము, వేదాంతము, కళలు సాహిత్యము మున్నగున వెన్నో ఇమిడి యున్నవని చెప్పవచ్చును. వాని యన్నింటియందు నంతర్వాహినిగా ప్రవహించు విజ్ఞానధారయే సంస్కృతి.

భారతీయసంస్కృతి సనాతనమైనది. దానికి మూలకందములు వేదములు. వేదమంత్రము లతి ప్రాచీనకాలమున దర్శింపబడిన వగుటచే నందలి భాషయు మిక్కిలి ప్రాచీనమైయుండును. వేదమంత్రము లందలి సంస్కృతమునకును తరువాత ప్రచారము పొందిన లౌకిక సంస్కృతము నకును పద పదార్థ వ్యాకృతులందు కొంత భేద మున్నది. కాలక్రమమున ప్రాచీనమైన వేద భాష సామాన్యజనుల కవగాహనము కాక

పోఁగా నందలి సంస్కృత ప్రకాశమును సర్వ జనుల కందుబాటులోనికి తెచ్చు నుద్దేశముతో వాల్మీకివ్యాసాదులగు మహర్షులు లౌకిక భాషలో రామాయణ భారత పురాణాది గ్రంథములను రచించిరి. అవి కథోపాఖ్యానాదులద్వారా వేద నిక్షిప్తములైన ధర్మనీతి తత్త్వములను పఠితల కందజేయును. నిజము పరిశీలింప నవి యన్నియు వేదార్థోపబృంహణార్థము నిర్మింపఁబడి నట్టివే. "పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడన" మ్మనునది వాని సంక్షిప్త పరమార్థము.

భారతీయసంస్కృతీవాహిని ఐహికాముష్మి కములను నిరుదరుల నొరసి ప్రవహించు చుండును. అది ఐహికాముష్మికాభ్యుదయములు రెండింటికి సమముగా యత్నించును. ఆ రెంటిలో నే దెుక్క దానితోనైన తృప్తి పొందునది సమగ్ర సంస్కృతి కాఁజాలదు. పాశ్చాత్య దేశ ములవారు మహైశ్వర్యసంపన్నులైనను శాంతి హీనులై కలఁత నొందుచుండుటకు వారిహము నందువలె పరమునందు దృష్టి సారింప కుండు టయే కారణము. ఈ క్రింది శ్లోకము భార తీయ సంస్కృతి పరమార్థమును చక్కగా బోధించుచున్నది.

> వర్షార్థమష్టౌ ప్రయతేత మాసా
> న్నిశార్థ మర్థం దివసే యతేత
> వార్ధక్య హేతో ర్వయసా నవేన
> పరస్య హేతో రిహ జన్మనా చ.

"వర్షాకాలమున సరిగా పని చేయుట కవ కాశ ముండదు. కావున తత్కాల సౌకర్యము నకై మిగిలిన ఎనిమిది నెలలు శ్రమింపవలెను. నిశాసౌఖ్యమునకై పగటిపూట పని చేయ వలెను. పరలోకసౌఖ్యమునకై ఈ లోకమున పనిచేయ వలయును. అని యీ శ్లోకమునందలి యర్థము. భారతీయ సంస్కృతియు నీ యర్థ మునే బోధించును. పురాతన భారతీయ సంప్ర దాయము లన్నింట, సాహిత్య సదుద్యమము లన్నింట నీయుభయార్థసాధనమిమిడియుండును. గతమునుబట్టి వర్తమానమును సరిదిద్దుకొని భవిష్యత్తు నంతకంటెను మేల్తరము కావించు కొనవలయునని దాని ఆశయము.

భారతీయసంస్కృతి సహన సంపన్నమైనది. చరిత్ర పరిశీలించి చూచినచో భారత దేశముపై వివిధ కాలములందు పలువురు విదేశీయులు దండెత్తి దాని నాక్రమించుకొని కొంత కాలము పరిపాలన సాగించినట్లు తెలియవచ్చును. వైదేశి కములైన ఆ దండయాత్రలు కేవలము రాజకీ యములైనట్టివే కావు. సాంస్కృతికములైనట్టివి కూడను. ఆ విదేశీయులు తమ అధికారముతో పాటు మతసంస్కృతిసంప్రదాయములను కూడ భారతదేశమున ప్రవేశపెట్టుటకై యత్నించిరి. వా రెన్ని యత్నములు కావించినను భారతీయ సంస్కృతి స్వరూపమును పూర్తిగా మార్చఁ జాలక పోయిరి. పరధర్మ సంస్కృతులయం దేదైన మంచియున్నచో భారతీయ సంస్కృతి దానిని గ్రహించినది. తనయందలి మంచిని వాని కందించినది. అంతే కాని తన స్వత్వమును కోల్పోయి యుండలేదు. ఇందుకు భారతీయ సంస్కృతి యందలి సహనశీలతయే కారణము. నిజము పరిశీలింప సహనమే సంస్కృతి. శ్రీ రాధాకృష్ణ పండితులు 'Tolerence is culture' అని చెప్పియున్నారు. అట్టి సహనసంపద భార తీయ సంస్కృతియందు పుష్కలముగా నున్నది. అహింసతోడను తితిక్షతోడను కూడిన సత్యము దాని ప్రధాన లక్షణము.

పాశ్చాత్య నాగరికతా ప్రభావము వలన నేమి, పరమత ప్రచార ప్రభావమువలన నేమి, వర్తమాన కాలమున భారతీయుల వేషభాషల యందును మన స్తత్త్వమునందును కొంత మార్పు

కనవచ్చుచున్నది. పరధర్మసంప్రదాయములం దేదో మేలు కలదని భ్రమించి అగ్నినిజూచి ఫలమని భ్రాంతిపడి తదుదగ్రజ్వాలావలీధ్వస్తమయు శలభములవలె కొందఱు వానిచే నావర్జితులై స్వత్వమును గోల్పోవుచున్నారు. పతనానంతరము పశ్చాత్తాపము పొందుటకంటె ముందే జాగరూకత వహించుట మంచిది. "శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్" అని భగవద్గీత నొక్కి చెప్పుచున్నది. పరధర్మముకంటె విగుణమైనను స్వధర్మము శ్రేయస్కరమన సగుణమైన స్వధర్మమును గూర్చి వేఱుగా చెప్పనేల!

భారతదేశము వేదోపనిషదాదులు ప్రభవించిన దేశమగుటచే తత్త్వప్రధానమని పేరొందినది. అందుచే పై దేశములవారు భారతీయులు వేదాదులయందును తత్త్వగ్రంథములందును నిష్ణాతులై యుందురని భావింతురు. భారతీయులెవరైన నున్నత విద్యాధ్యయనమునకై పాశ్చాత్యదేశముల కరిగినపు డందుండువారు వారిని వేదములనుగూర్చియు గీతోపనిషదాదులను గూర్చియు నేమైన చెప్పుమని యడుగుదురట; కాని భారతీయు లా పేరులను మాత్రము వినియుందురు కాని వానిని గూర్చి యేమియు తెలియని పరిస్థితిలో నుందురు. అప్పుడు వారు భారతీయుల యాధ్యాత్మిక పరిజ్ఞానమింతేనా యని వారిని గూర్చియే కాక సర్వ భారతీయులను గూర్చియు భారతీయ సంస్కృతి సంపదను గూర్చియు లాఘవ భావమును వహింపవచ్చును. నిజమున కిప్పటి భారతీయుల పరిస్థితి యాధ్యాత్మిక విషయమున శోచనీయముగనే యున్నదని చెప్పవలయును. అందుచే వేదవేదాంతముల గూర్చియు భారతీయ సంస్కృతిని గూర్చియు కొంతైన నెఱుంగవలసిన యావశ్యకత యెక్కువగా గోచరించును. నాకే యధికార మున్నచో నట్టివారికి భారతీయ సంస్కృతి విషయములలో నొక పరీక్షపెట్టి యందుత్తీర్ణత గాంచిన వారినే భారతదేశమును విడిచి పై దేశముల కరుగనిత్తును.

రాత్రియంతయు నంధకారమయమై యుండును. ఆ యంధకారమున నల్లాడువారు సూర్యుడెప్పు డుదయించి దానిని పటాపంచలొనరించునా యని తూర్పు దెస కాత్రమున దృష్టులు సారించుచుందురు. అట్లే అనాత్మవాద ధ్వాంత విభ్రాంతులైన పాశ్చాత్యులు ప్రాచ్యమైన భారతదేశము నుండి తత్త్వవేత్తలైన శాంతిదూత లెవ్వరైన నరుదెంచి తమకు శాంతిని ప్రసాదింతురేమో యని యత్తుత్తి చూచుచుందురు. అందుకు శంకర రామానుజాదులును, బుద్ధమహావీరాదులును, వివేకానందరామతీర్థాదులును భారతదేశమున నుదయించి తమ ప్రబోధామృతముచే ప్రపంచమునకు శాంత్యానందములను ప్రసాదించి యుండుటయే కారణము. భారతదేశ మట్టి మహాపురుషులను తయారుచేసి అశాంతి కల్లోలితమైన ప్రపంచమునకు శాంతి ప్రసాదింపవలసిన అగత్యమెంతైన నున్నది.

కొందరు భారతీయులు వేదవేదాంత భారత రామాయణాదులం దంతర్గతమైన తత్త్వసంపద నెఱుంగజాలక పోవుట యటుండ నివి సారహీనము లనియు పుక్కిటి పురాణములనియు నాక్షేపించుచుందురు. అట్లనుట వారి యల్పజ్ఞానమునకును అహంకారమునకును తార్కాణము. అనర్ఘమైన రత్నము చేతికి చిక్క దాని మూల్య మెఱుంగక ఱాయి యని గేలి చేసిన వారి యజ్ఞానమే వెల్లడి యగును. అదియునుం గాక అనర్ఘమైన రత్నమును పోగొట్టుకొంటిమే

యని వారు పశ్చాత్తాప పడవలసి వచ్చును. భారతీయసంస్కృతికి నిధానములైన యామహా గ్రంథములను నిరసించువారి పరిస్థితియు నిట్లే యుండును. పూర్వ మొకప్పు డొక గొల్లవాని కమూల్యమైన రత్న మొకటి లభింప నాతఁడు దాని నొక నులకత్రాటితో మేకమెడలో కట్టి దానిని త్రోలుకొనుచు నింటికి పోవుచుండెను. దారిలో నొక రత్నాలవర్తకుఁ డా రత్నమును చూచి ఆశ్చర్యపడి దానిని తన కిమ్మని యా గొల్లవాని నడిగెను. గొల్లవాఁడు ముద్దుగా మేకమెడలో కట్టిన దాని నిచ్చుట కిష్టపడ లేదు. అప్పుడు రాత్నికుఁ డైదు రూపాయల నాతని కిచ్చి యా త్రాటి నిమ్మని కోరెను. గొల్ల వానికి దాని విలువ తెలియనందున దానిని మేక మెడనుండి తీసి వర్తకుని చేతి కిచ్చెను. వర్తకునిచేత చేరఁగనే ఆ రత్నము వేయి ముక్కలై పోయెను. అది చూచి వర్తకుఁడు "ఓ రత్నమా! ఇదేమి? అనాగరికుడైన యా గొల్లవాని చెంత నున్నంతసేపు జాజ్వల్యమానముగా ప్రకాశించితివి. నీ మహాత్మ్యము నెఱిఁగిన నా చేతికి రాఁగనే వేయిముక్కలైపోయితివి" అని యడిగెను. అంత నొక రత్నపు ముక్క "ఔను, ఆ గొల్లవాఁ డనాగరికుఁడే. నా విలువ అతనికి తెలియదు. అందుచేతనే అతఁ డైదు రూపాయలకు మురిసి రత్నమును నీ కిచ్చినాఁడు. కాని నాగరికుఁడవు, జ్ఞానవంతుఁడవు, నా విలువ తెలిసినవాఁడవు అయిన నీవు నా కైదు రూపాయలే విలువ కట్టుట చూచి నా గుండె వేయి ముక్కలైపోయినది" అని చెప్పెను. రత్నవ్యాపారి లజ్జితుఁడై తల వంచుకొనెను. అట్లే విదేశీయులు గొల్లవాని వలె భారతీయ సంస్కృతి సర్వస్వములైన వేదాదుల విలువ నెఱుంగక వానిని లఘూకరింప వచ్చును. కాని భారత దేశమున పుట్టి భారతీయ రక్తము నాడులలో ప్రవహించు భారతీయులే వానిని నిరసించినచో వానిని నిర్మించిన మహర్షుల ఆత్మలు వ్యథితములై సహస్ర ఖండములై పోవును. వారి యాత్మల ఖేదము తత్కారణభూతులను శాపగ్రస్తుల నొనరించుటే కాక తరతరములవఱకు చింతాగ్ని దగ్ధులఁ గావించును.

భారతీయ సంస్కృతి ప్రకాశ మిప్పు డనేక కారణములచే మఱుగుపడి యుండుట నిజమే. అంత మాత్రమున నది నిర్మూలమై నశించిన దని భావింపరాదు. త్రివేణీసంగమమైన ప్రయాగలో గంగాయమునలే కనిపించును. కాని సరస్వతీనది చర్మచక్షువులకు గోచరింపదు. అయ్యును అది అంతర్వాహినిగా ప్రవహించుచునే యున్నది. అట్లే భారతీయ సంస్కృతీవాహినియు నిప్పుడు పరనాగరికతా ప్రభావ గ్రీష్మాతపముచే శుష్కించి దృశ్యాదృశ్యముగ నుండి సన్నగిల్లి పోవచ్చును. మరల నచిర కాలముననే వివిధ హిందూ సంస్థల ప్రచార ప్రబోధములను ప్రావృట్కాల ప్రభావముచే నది నిండారి యొడ్డుల నొరసి ప్రవహించుచు సర్వ ప్రపంచమునకు కనువిందొనర్పఁ జాలు ననుటలో సందేహము లేదు. భారతీయసంస్కృతి పరమాత్మప్రభవలె నచ్ఛేద్యము, అశోష్యము. దాని సంపర్కము, పరశువేధి యితరలోహములను వలె, పతితులను సైతము పవిత్రీకరించి పరమానంద సంభరితుల నొనరించును.

# ప్రేమారాధనము

విశ్వనాథ్

ప్రపంచమున నన్ని బంధములకంటెను బలవత్తరమైనది ప్రేమ. మానవునకు ఇతర మానవులతోగాని వస్తువులతోగాని ఏర్పడు గాఢమైన అనుబంధమును ప్రేమ యందుము. ఈ ప్రేమ పుత్రులపట్లను భార్యపట్లను ధనము పట్లను అధికారముపట్లను పేరు ప్రతిష్ఠలపట్లను పరాకాష్ఠనంది సాధారణముగ కన్పించును. ఒక కొడుకు పరీక్ష తప్పినచో తండ్రికి పిచ్చి పట్టినంతపని యగును. భార్య ద్రోహము చేసినచో భర్తకు నిజముగా పిచ్చియే పట్టును. కడుపుకట్టుకొని కూడబెట్టిన ధనము నష్టము కాగా మానవుడు ఆత్మహత్య చేసికొనును. ఇట్లే అధికారముపట్లను పేరుప్రతిష్ఠలపట్లను గల ఇట్టి ప్రగాఢమైన బంధమునే ప్రేమయను చున్నాము. ఇవియన్నియు ఇంద్రియ విషయములే. కనుక తాత్కాలికముగ మాత్రము ఆనందము కలిగించును. ఎప్పుడు మానవుడు ఈ ఇంద్రియముల కతీతమైన వస్తువును గుర్తింపగలడో అప్పుడు అతనికి శాశ్వతమగు ఆనందము నొసగూర్చు విషయము లభించును. ఆ ఇంద్రియాతీతమగు వస్తువునే భగవంతు డనుచున్నాము.

ఈ భగవంతుని ప్రేమించుట ఎట్లు? ఇంద్రియ విషయముల నెట్లు గాఢముగ ప్రేమించుచు అవి లేనిచో లభింపనిచో జీవింపలేమని భావింతుమో అట్లే భగవంతుడు లేకుండిన జీవింపలేమను ఆర్తితో ప్రేమింపవలెను. కనుక భగవంతుని ప్రేమించుటయన మన సహజ స్వభావమును నిర్మూలించుట కాదు. దానిని భగవదున్ముఖము చేయుట. ఇదియే నిజమగు భగవత్ప్రేమ. భగవద్భక్తి. ప్రహ్లాదుడనునట్లు బుద్ధిహీనులకు ఇంద్రియ విషయములపై ఎట్టి తరుగని ప్రేమయుండునో మనకు భగవంతుని పట్ల అట్టి ప్రేమ చెదరక ఉండవలెను.

ఒక యువతిని ప్రేమించు యువకు డెన్ని కష్టముల బడునో మనము చూతుము. ఆమె కెట్టి వేషభాషలు నచ్చునో కనుగొని వానినే అతడవలంబించును. ఆమె రుచు లెట్టివో గ్రహించి తదనుగుణముగనే తన రుచులను మార్చుకొనును. ఆమెకెట్టి మాటలు పాటలు ప్రీతిని కల్గించునో వానినే మాటలాడును. తన వైపు కటాక్షవీక్షణము బరపినచో మురిసి పోవును. పెడమొగమైనచో పాతాళమునకు క్రుంగిపోవును. అట్లే భగవత్ప్రేమను సంపాదింపగోరువారు భగవంతుని కేవి ఇష్టమో కనుగొనవలెను. తదనుగుణముగ నడచుకొనవలెను. భగవత్ప్రేమకు తగిన అర్హతలను సంపాదించుకొనవలెను.

భగవత్ప్రేమను పొందినవారు శ్రీమద్రామానుజాచార్యులవంటివారు భగవంతుని ప్రసన్నుని చేసికొనుటకు కావలసిన లక్షణములను వివరించిరి. అవి వివేకము, విమోకము, అభ్యాసము, క్రియ, కల్యాణము, అనవసాదము అనునవి.

1. వివేకము : — మద్రామానుజాచార్యుల యభిప్రాయమున వివేకమన ఆహారమునుగూర్చిన వివేకము. మన శరీరము బుద్ధి మనస్సు అన్నియు మనము స్వీకరించు ఆహారముయొక్క పరిణామములే. ఆహారముయొక్క లక్షణము లెట్లుండిన మన బుద్ధియు మనస్సుకూడ అట్టివే యగును. మనకుగల శారీరక మానసిక శక్తులు ప్రేరణలు అన్నియు ఆహారముయొక్క ఫలితమే. ఉద్రేకములను

కలిగించు మాంసము సారాయి వెల్లుల్లి మొదలగునవి తినినచో మనస్సుకూడ ఉద్రిక్తమై అశాంతి పాలగును. పాలు నెయ్యి శాకములు ధాన్యములు మొదలగు వస్తువులు మనస్సును కుదుటపరచి ప్రశాంతతను ఏకాగ్రతను చేకూర్చును. చలిదియన్నము, పాచిపోయిన వస్తువులు, రసములేనివి మందము కలిగించునవి అగు వస్తువులను తినినచో బుద్ధిమాంద్యము నిద్ర అలసత అలవడును. కనుక భగవత్ప్రేమను సాధింపగోరువాడు తన యాహారమునందలి స్వభావదోషములను (దీనినే జాతిదోషమందురు) తొలగించుకొనవలెను.

ప్రత్యేకము, మాంసాహారము వలన మనకు క్రౌర్యము ఏర్పడుటయేకాక ఇతర మానవులు క్రూరులగుటనుకూడ ప్రోత్సహించినవార మగుదుము. కసాయివారు ఏ సమాజమున గౌరవనీయులుగా నున్నారు?

ఆహారమునందు వెంట్రుకలు గోర్లు మొదలగు కల్మషములుండుట రెండవదోషము. దీనిని నిమిత్తదోషమందురు. మనము స్వీకరించు ఆహారము స్వచ్ఛముగ నుండవలెను. అపుడే మనస్సును స్వచ్ఛమగును. దుమ్ము ధూళిపడిన ఆహారము ఈగలు వ్రాలిన ఆహారము మొదలగునవి అన్నియు నిమితదూషితములు. ఇంతియగాక ముఖ్యముగ గమనింపవలసినది పెదవులను వ్యర్థముగ చేతులతో తాకుట ఉచ్ఛిష్టమును తినుట. ఇవి రెండును చాల హానికరములు. పెదవులపై చర్మపుపొర చాల పలుచగ నుండును. సంస్కారములు లోన ప్రవేశించుట కిది అత్యంతము సులువైన మార్గము. కాగితములను త్రిప్పునపుడు పెదవులను చేతితో తాకుట ఎంగిలిపూసి స్టాంపులు మొదలగువాని నంటించుట మొదలగుపనులు, ఆరోగ్యరీత్యా హానికరములగుట యటుంచి, చెడు సంస్కారములు అంతర్గతములగుటకు వీలు కలిగించును. ఉచ్ఛిష్టమును తినుటవలన ఏవ్యక్తి ఉచ్ఛిష్టమును తినుచున్నామో ఆ వ్యక్తి సంస్కారములు సులభతరముగ మనయందు ప్రవేశించును. మన చెడుసంస్కారములను పోగొట్టుకొనవలసినదిపోయి ఇంకొకరి చెడుసంస్కారములను కొని తెచ్చుకొందుము. ఆహారమున నిట్టివి నిమిత్తదోషములు.

మూడవది ఆశ్రయదోషము ప్రతివ్యక్తియు తన సంస్కారములను నిరంతరము ప్రసరింపజేయుచుండును. అవినీతిపరులు చెడునడవడి కలుగువారు స్పృశించిన ఆహారము వారినుండి గ్రహించిన ఆహారము అట్టి యాలోచనలనే మనయందు కలుగజేయును. ఆ ఆహారము ఎంత శ్రేష్ఠమైనజాతికి చెందినను అట్టి పాపవర్తనుల ఆశ్రయమున దోషపూరితమగును సంప్రదాయములను పాటించు గృహములందు బయటితిండి తినరాదనుట ఈ కారణముననే. ఇవి మూడును బాహ్యమగు ఆహారదోషములు వీనిని గుర్తించి తొలగుటయే వివేకము.

శ్రీశంకరభగవత్పాదులు ఆహారశుద్ధికి మానసికమగు నర్థమును చెప్పిరి. మనస్సు యొక్క ప్రశాంతత మనముచేయు ఆలోచనలను బట్టియుండును. మంచి ఆలోచనలు చేసినచో మంచిరీతుల నాలోచింపగలిగినచో అదియే ఆహారశుద్ధి. వారును అట్టి ఆహారదోషములను మూడింటిని పేర్కొనిరి. అందు మొదటిది సంగము.

సంగమువలన మానవుడు మరియొకనికి బానిసయగును. అతనికి సుఖసంతోషములను కలిగించుటకు మరి ఎందఱికైనను దుఃఖము కల్గించుటకు వెనుదీయడు. ప్రపంచమున గల దుఃఖములకు తొంబదితొమ్మిదిపాళ్లు సంగమే

కారణము. 'తన' వారికి మేలుచేయగోరి మానవుడు అనేకులకు అపకారము చేయుచున్నాడు. భగవంతుడు ఎల్లరయందును కలడుకదా. ఇతరులను బాధించి భగవంతుని ప్రీతునిచేయుట ఎట్లు ? కనుక మానవుడు నాది నేను నావారు అను సంగమునువదలి ఎల్లరును తనవారే అను ఆదరభావముతో వ్యవహరింపవలెను. సంగము వలన మరియొకరికి బానిసల మగుటవలన మన స్వాతంత్ర్యమును ఆనందమును కోల్పోవుదుము. నిస్సంగమును అలవరచుకొనుటవలన ఉద్వేగములను మనశ్చాంచల్య కారణములగు భావములను తొలగించుకొన గలుగుదుము.

రెండవది అసూయ. ఇంకొకనికి కలది తనకులేదే యని విచారించుట అసూయ. మానవునకు ఇంద్రియ విషయములపైననే కోరిక యున్నంతవరకును అసూయను వదలించుకొనుట మిక్కిలి కష్టము. అసూయవలన మన శ్శాంతి నష్టమగుటయేకాక ఇతరుల కపకారము చేయవలెనని కూడ మానవుడు యత్నించును. అసూయను తగ్గించుకొనుకొలది మనస్సు శుభ్రతరమగును.

మూడవది మోహము. ఒకవస్తువు నింకొక వస్తువుగ భ్రమించుట మోహము. మానవులు సాధారణముగ దుఃఖాశ్రయములగు ఇంద్రియ విషయములను ఆనందసాధనములుగ భ్రమించి వానికై కడగండ్ల పాలగుచుందురు. ప్రతి విషయముయొక్కయు నిజరూపమును గ్రహించి దుఃఖమును కలిగించు విషయములనుండి వైదొలగి ఆనందదాయకములగు వానిని సేవింపవలెను. కనుక మంచిఫలితములనిచ్చు కార్యములు మొదట దుఃఖమునే కల్గించునట్లు కన్పించినను అట్టి భ్రమకు లోనుగాక వానియందే మానవుడు నిమగ్నుడు కావలెను. అట్లే ప్రథమమున సుఖమును కల్గించినను తుదిని దుఃఖమును కల్గించు విషయములను గుర్తించి విషమువలె దానిని వదలవలెను. అప్పుడు మనస్సు క్రమముగ పరిశుద్ధమగును.

ఇట్టిది శ్రీశంకరు లుపదేశించిన వివేకము. కాని సాధారణముగ ఈ రెండింటిని కలిపి పాలించుట శ్రేయస్కరము. జనులకు శ్రీశంకరవచనమే సమంజసమని తోచినను, నిత్యజీవనమున మన మనఃస్థితి ఆహారముపైననే ఆధారపడియుండుటను గమనింతుము. మనోబలము తగినంత చేకూరువరకు మద్రామానుజ ప్రోక్తమైన ఆహారశుద్ధి పాటించుట ఆవశ్యకము. అటుపిదప నియమమును కొంత సడలించినను ప్రమాదముండదు. కాని ఆరంభముననే అట్టి నిషేధములను వదలినచో కంచె లేని మొక్కవలె మనకు నాశము తప్పదు.

2. విమోకము : విమోకమనగా స్వేచ్ఛ. మనము ఇంద్రియసుఖములచేతను వానిపై గల కోర్కెలచేతను బద్ధులమై యున్నాము. వానినుండి అట్టి కోరికలనుండి విడివడుటయే విమోకము. అనగా కోరిక లన్నింటిని చంపుకొనవలెనా? అక్కఱలేదు. ఆ కోరిక లన్నియు భగవంతుడు కావలెనను కోరికకు అనుషంగికములుగ నుండవచ్చును. ధనమో అధికారమో భార్యయో పుత్రులో ఎవరైనను భగవంతుని దర్శించుటకు సహాయకులైరేని ఉండవచ్చును. కాని భగవద్దర్శనమున కాటంకమగుచో సర్పదష్టమైన అంగుష్ఠమును వలె వెంటనే ఖండింపవలెను.

ఇంద్రియసుఖములనే మనము కోరుటకు కారణమేమి? మన శరీరము శాశ్వత మను భ్రమయే. నిరంతరము మనచుట్టును అనేకులు మరణించుటను చూచుచున్నాము. అయినను మనము మాత్రమే శాశ్వతుల మనుకొనుచు

శరీరమునకు 'సుఖము' కలిగించు విషయము లనే కోరుచు వానియందే తగుల్కొనుచున్నాము. ఎప్పుడు మనము మన శరీర రూపమున శాశ్వతులము కాము అని గుర్తింతుమో అప్పుడు శారీరక వాంఛలపై కోరిక తొలగిపోవును. దీనిని దృఢతరము చేసికొనుటకే నిరంతరము దేవుని దర్శింపవలెనను కోరికకు తప్ప మిగత కోరికలకు వేనికిని స్థానమీయకుండవలెను. ఇట్లు ఇంద్రియసుఖముల పట్ల గలుగు కోర్కెలనుండి విడివడుట విమోకము.

3. అభ్యాసము : నిరంతరమును దైవమును తలచుకొనుట సాధ్యమా? ఇంద్రియవిషయములవైపు మనస్సు మరల మరల పరువులెత్తుచుండునే? అయినను ఎడతెగని ప్రయత్నము వలన నిరంతర దైవధ్యానము సాధ్యమే. ఎప్పుడెప్పుడు మనస్సు అన్యాక్రాంతమగునో, అయినదని గుర్తింతుమో అప్పుడే మరల మనస్సును సమీకరించి దేవునిపై నిలుపవలెను. దీనికి సహాయముగ దైహిక కర్మలను గూడ దైవమును గూర్చి చేయుచుండవలెను. ఇట్టివే దైవప్రతిమకు అలంకరణలు పూజాపురస్కారములు భజనలు సంకీర్తనలు మొదలగునవి. ఇట్టి కార్యములను చేయునపుడు మనఃపూర్వకముగ చేయుచుండినచో భగవచ్చింతన సులభతరమగును. కాని శారీరక కార్యకలాపములను చేయుచు మనస్సును ఇచ్చవచ్చినరీతి నాలోచింప నిచ్చినచో అది ఆత్మవంచనయే.

అభ్యాసమునకు బలవత్తరమగు సహాయము సంగీతము. ఎట్టి మందుడైనను, మనస్సు ఎంత ఆధీనమున లేనివాడైనను శ్రావ్యమగు సంగీతము చెవుల బడినంతనే కొంతవరకు ఏకాగ్రచిత్తుడగును. కనుక ఇట్టి సంగీతము భగవత్పరముగ నభ్యసించినచో దైవచింతన సులభసాధ్యమగును.

4. క్రియ : మనముచేయు కర్మలును మనఃపారిశుద్ధ్యమును సాధించునవిగ నుండవలెను. ముఖ్యతమమగు కల్మషమే స్వార్థపరత. స్వార్థమున్నంతవరకు నిజమగు భగవచ్చింతన జరుగదు. కనుక నిస్స్వార్థత నలవరచుకోవలెను. దీనికై ఉపదేశింపబడినవే పంచమహాయజ్ఞములు. దేవయజ్ఞము మన ఇష్టదేవతలకు చేయు పూజలు. పితృయజ్ఞములు శ్రాద్ధకర్మలు మాసికములు మొదలగునవి. పరలోకమున నున్న పితరులకు తృప్తి కలిగించుట. ఋషియజ్ఞమన అనుదినము పవిత్రగ్రంథములను చదువుట పారమార్థిక చింతనచేయుట. నరయజ్ఞమన మానవులను తృప్తిపరచుట. భూతయజ్ఞమన ఇతర ప్రాణికోటికి సహాయము చేయుట.

ఇవి యన్నియు భగవత్సేవ యందలి అంశములే. పవిత్రగ్రంథములను చదువుటవలన పవిత్రములగు ఆలోచనలు మనస్సున కెక్కి ఏదో యొక కాలమున ఆచరణలోనికి వచ్చి ఫలము నిచ్చును. ప్రస్తుత సమయమున ముఖ్యమైనది నరయజ్ఞమే. ఇతరులు దుఃఖపడుచుండగా తాను సుఖపడదలచువాడు మహాపాపి. ఇతరులను తృప్తిపరచియే శక్తి కొలది తృప్తిపరచిన మీదటనే తన సుఖమును గూర్చి యాలోచింపవలెను. శ్రీ వివేకానంద స్వామి యనునట్లు నీవు ఇల్లు కట్టుకొనదలచి నచో ఇతరుల కిండ్లున్నవో లేదో మొదట గమనింపుము. నీవు భోజనము చేయుటకు ముందు ఇతరులు భుజించిరో లేదో చూడుము. ఇట్లు తనకు ఏ యే సుఖములు కావలెనని మానవుడు కోరుకొనునో అవి యన్నియు ఇతరులు కూడ అనుభవించుచున్నారా లేదా

యని విచారించి వారికి తోడ్పడుట వలన స్వార్థము చాలవరకు తగ్గిపోవును. బీదలు సాక్షాత్ భగవదవతారములే అని ఎంచి వారికి సేవచేయవలయును. ఇట్లు నిరంతరము పరుల సుఖమును గూర్చి ఆలోచించుచు ప్రయత్నించుట వలన క్రమముగా మనస్సు పరిశుభ్రమై భగవచ్చింతనకు సరియగు ఉప కరణమగును.

5. కల్యాణము : కల్యాణమన పవిత్రత. ఇందు సత్యము ఆర్జవము దయ అహింస దానము అను నంశములు కలవు. ఆడితప్ప కుండుట సత్యము. సత్యము నవలంబించుట వలన త్రికరణశుద్ధి యేర్పడి మనస్సు అనవసర ముగ విచలితము కాకుండును. ఆర్జవ మన వక్రచింతనలు చేయకుండుట. మోసము చేయ కుండుట. దయ అనగా ఇతరుల కష్టములకు బాధచెంది వానిని తీర్పగోరు గుణము. అహింస యనగా మనసా వాచా కర్మణా ఇతరులకు బాధ కల్గింపకుండుట. దానమనగా తనకు కలిగిన దానిని ఇతరులతో పంచుకొనుట.

అన్నియు ముఖ్యములే యైనను దానము నకు ప్రత్యేక స్థానము గలదు. అది స్వార్థపర తను తొలగించుకొనుటకు మిక్కిలి సహాయ కారి. సాంప్రదాయికముగ ప్రథమ ఫలిత ములు భగవంతునకు బీదసాదలకు పంచు నల వాటు కలదు పండిన పంటలో కొంతభాగము దేవునకు సంతర్పణకు వినియోగింపబడును. తోటయందు మొదట కోసిన కాయలు భగ వంతునకు బీదసాదలకు వినియోగింపబడును. ఇట్లే అనుదినమును భోజనసమయమున కొంత భాగము భిక్షుకులకు సేవకులకు పక్షులకు ప్రత్యే కింతురు. ఇందువలన అడుగడుగునను ఇతరు లను గూర్చిన ఆలోచన కలిగి స్వార్థపరత క్రమముగా తగ్గిపోవును.

అనభిధ్యయని ఇంకొక గుణము కలదు. ఇంకొకరి వస్తువులను కోరకుండుట వ్యర్థమగు ఆలోచనలు చేయకుండుట తనకు జరిగిన యప కారమును గూర్చి తలచి తలచి విలపింప కుండుట అనభిధ్య యనబడును. స్పష్టముగనే ఈ మూడును మనఃప్రవృత్తిని ప్రశాంతముగ చేయును.

6. అనవసాదము : తృప్తి సంతోషము కలిగియుండుట. ఎప్పుడును విచారముగ దుఃఖితులై యుండువారు భగవత్ప్రేమ కర్హులు కారు. అట్లు దుఃఖితులగువారు ఇత రుల సంతోషమును సహింపలేరు. తమయం దుండు ప్రేమ లేశమునుకూడ పోగొట్టుకొని క్రూరాత్ములగుదురు. ప్రపంచమున దేవుని పేరిట జరిగిన రక్తపాతముల కన్నింటికిని ఇట్టి వారే కారణము. కనుక సదా ఆనందముగ నుండవలెను.

అట్లని విపరీతమగు నవ్వును ఉత్సాహ మును వెళ్లబోయరాదు. దానినే ఉద్ధర్ష మందురు. ఉద్ధర్షము కూడ పనికిరాదు. ఇటు విచారమును అటు ఉద్ధర్షమును పరిహరించి భగవంతుని ప్రేమింపగోరువాడు ఎల్లప్పుడును సంతుష్టుడై ఆనందముగ నుండు ప్రయత్నము చేయవలెను.

భగవంతుని ప్రేమను సంపాదింపవలె నని న మనకుండవలసిన అర్హతలివి. ఈ యర్హతలను మనమెంత ఎక్కువగా సంపాదించుకొనగలిగిన నంత త్వరగా భగవద్దర్శనము సాధ్యమగును.

# వేదః ప్రాచేతసాదాసీత్

**'సరస్వతీ కంఠాభరణ' శ్రీ వేదుల సూర్యనారాయణశర్మ.**

శ్రీమద్రామాయణము పారాయణము చేయునపుడు ప్రప్రథమముగ ఈ క్రింది శ్లోకము పఠింపబడుట మనము గమనించుచుండుము.

శ్లో॥ వేదవేద్యే పరేపుంసి
జాతే దశరథాత్మజే,
వేదః ప్రాచేతసాదాసీత్
సాక్షాద్రామాయణాత్మనా.

దీనికి అందఱు చెప్పుకొను అర్థము:— వేదవేద్యే = వేదముచేత తెలిసికొనదగినవాడగు, పరేపుంసి = పరమపురుషుడు (భగవంతుడు), దశరథాత్మజే = దశరథునికొడుకై, జాతే = పుట్టినవాడగుచుండగా (సతిసప్తమి), వేదః = వేదము, ప్రాచేతసాత్ = వాల్మీకినుండి, సాక్షాత్ = ప్రత్యక్షముగ, రామాయణాత్మనా = రామాయణ స్వరూపముతో, ఆసీత్ = ఆయెను.

శ్రీరాముడు భగవంతుడు కాన అతడు వేదవేద్యుడు. ఆ భగవంతుడు దశరథుని కొడుకై పుట్టినాడు. అతని చరిత్రము రామాయణము. దానిని వాల్మీకి వ్రాసినాడు. అది సాక్షాత్తు వేదము. వేదముచేత తెలిసికొనదగు భగవంతుని రామాయణ గ్రంథమువలన తెలిసికొనగలమని ఫలితార్థము. ఈ విధముగ శ్రీరాముడు భగవంతుడని రామాయణము వేదమని చెప్పినప్పుడు రామాయణకథ చదివినచో శ్రీరాముడు భగవంతుడని తెలియబడవలసియున్నది గదా! రామాయణకథలో మనకు ఈ భావము కలుగుచున్నదా? వేదములోని భగవంతుడు నిరాకారనిర్గుణ పరమాత్మ కాగా రామాయణములోని శ్రీరాముడు దశరథునకుపుట్టిన మానవరూపుడు. అతడుచేసిన పనులు మానవచేష్టలే. ఆదర్శమానవుడు కావచ్చును కాని మానవుడే. మానవాతీతుడు కాడు. తండ్రిమాట తలదాల్చినవాడు, ఏకపత్నీవ్రతుడు, ధర్మపరిపాలకుడు. శ్రీరాముని భార్యను రాక్షసు డెత్తుకొనిపోయెను. కోతుల సాయముతో శ్రీరాముడు తన భార్యను తిరిగి తెచ్చుకొనెను. ఈవిధమైన కథ వేదములోని భగవల్లక్షణములను తెలుపదని అందఱకు తెలిసినదే. అయినను శ్రీరాముని దేవునిగ పూజించుచున్నాము. ఈ కథకు వేదముతో సామ్యము చెప్పుటెట్లు? ఈ కథ వేదములో నున్నదా? రామాయణము ఆదికావ్యము. కావ్యత్వ పరిపూర్ణత సిద్ధింపజేసిన వాల్మీకి మహాకవి. ఒక ఇతివృత్తమును దీసికొని దానిని మహత్తర కావ్యధర్మములతో పోషించి ఒక మహాపురుషునిగ శ్రీరాముని సృష్టించి వాల్మీకి చరితార్థుడు కావచ్చును. ఆ కావ్యమునందలి ధర్మములను ఆదర్శములుగ తీసికొని, దానిని పఠించువారు కృతార్థులు కావచ్చును. కాని రామాయణము వేదమనికాని శ్రీరాముడు వేదప్రతిపాద్యుడైన భగవంతుడని కాని రామకథ ఆధారముగ చెప్పలేము. రామకథ చరిత్రాత్మకమని అయోధ్యాదులు ఇప్పటికిని ఉన్నవని చెప్పినప్పుడు, రామాయణము వేదమని రాముడు భగవంతుడని అసలే చెప్పలేము కదా!

ఇట్లయినచో పై శ్లోకమునకు చెప్పిన అర్థము సరికాదనవలెను. శ్రీరాముడు భగవంతుడని రామాయణము వేదమని సాధించు అర్థమును ఆ శ్లోకమునకు చెప్పుకొనవలెను. అట్టి అర్థము దానిలో నున్నదా? ఉన్నది. అందులోని వేదః దశరథాత్మజే ప్రాచేతసాత్

రామాయణాత్మనా అన్న పదములకు రూఢ్యర్థము కాక యౌగికార్థమును చెప్పుకొన్నచో సరియగు అర్థము గోచరము కాగలదు. అది అంతరార్థము కాన తెలిసికొనుటకు అంతర్దృష్టి కావలెనంతియే. ఆ అర్థమిది.

వేదవేద్యే = జ్ఞానముచే తెలిసికొనదగిన, పుంసి = పరమపురుషతత్త్వము, పరే = (అన్ని తత్త్వములకు) చివరిదైయుండ, ఆ పరతత్త్వము దశరథ + ఆత్మ + జే = దశేంద్రియములను (అశ్వములను) బూన్చి నడిపించునట్టి రథికుడగు జీవునియొక్క, అనగా ఇంద్రియ దమనముచేయుచు గమ్యమును చేరుటకు యత్నించు సాధకునియొక్క, ఆత్మ = మనస్సునందు, జే = పుట్టినదగుచుండ, అనగా సాధకుడు పది ఇంద్రియములను సంయమములో నడిపించుచు కైవల్యమువైపు పయనించువాడగుచుండ దైవము వాని హృదయములో ప్రవేశించునని అర్థము. అప్పుడు ప్రాచేతసాత్ + ప్రకృష్టమైన చేతస్సునుండి (ప్రచేతసః భవః ప్రాచేతసః అని రూప మేర్పడును). వేదః = జ్ఞానము, ప్రకృష్టమైన చేతస్సువలన సాధింపబడిన జ్ఞానము-పరమేశ్వర జ్ఞానమని యర్థము. సాక్షాత్ = ప్రత్యక్షముగ రామ + అయన + ఆత్మనా = రామశబ్దము 'రమ్' ధాతువునకు ఘఞ్ ప్రత్యయము చేరగా ఏర్పడినది. 'రమ్' ధాతువునకు ఆనందము అర్థముకాగా రామ అనగా ఆనందమని యర్థము. రామ + అయనము = ఆనందము స్థానముగ కలది అని అర్థము. రామాయణాత్మనా = ఆనందస్థానమైన స్వరూపముతో, ఆసీత్ = ఆయెను. అనగా ప్రకృష్టమైన చేతస్సునుండి కల్గిన జ్ఞానము ఆనందస్వరూపమని అర్థము. అట్టి ఆనందస్వరూపమునకును జ్ఞానమునకును అభేదము కాన రామాయణమునకును వేదమునకును అభేదము. ఇంద్రియ నిగ్రహము సాధించిన సాధకునకు హృదయములో పరమపురుషుడు ప్రవేశించునని, ఆ తరువాత అతనికి ఇంద్రియ దమనసాధనవలన ఉత్కృష్టమైన మనస్సు కల్గునని, ఆ ఉత్కృష్టమైన మనస్సునుండి జ్ఞానము కల్గునని ఆ జ్ఞానము ఆనందాత్మకమని అదే భగవత్స్వరూపమని పై శ్లోకమువలన తెలియబడుచున్నది.

ఇప్పుడు రామాయణకథ పై శ్లోకముయొక్క అంతరార్థమునకు సరిపడునట్లుగ ఉండవలెను. ఉన్నదా మరి? ఉన్నది. దానిని చూచుట కంతర్దృష్టి కావలెను. రామాయణ కథకు అంతటికిని కైవల్య సాధకమైన అంతరార్థ మున్నది. ఈ అంతరార్థపరముగనే రామాయణము వేదమైనది. కథలోని ప్రత్యక్షార్థమును సాధింపవలెను. అచ్చటచ్చట వచ్చిన పాత్రల పేర్లలోని యౌగికార్థములను పరిశీలించినచో ఆ అర్థమే నిజమైన అర్థమనిపించును కూడ.

వైదికభాషలో బాహ్యార్థ విషయమునుండి గమ్యమానమగు మరియొక విషయమును చెప్పుట కాననగును. ఇదియే పరోక్షపద్ధతి. "పరోక్ష ప్రియాః దేవాః" అని వేదములో పదేపదే చెప్పబడియున్నది కూడ. వేదసిద్ధమైన ఈ పరోక్షపద్ధతితో రామకథకు వేద ప్రతిపాదితమైన పరతత్త్వ సాధనాపరమగు అంతరార్థ మెట్లువచ్చునో ఇకముందునుండి క్రమక్రమముగ తెలుపుటకు యత్నింతును.

# తిరుక్కుఱళు

మూలకర్త:
శ్రీ వళ్ళువనాయనారు

అనువక్త:
నే. భక్తవత్సలము

## ఉపోద్ఘాతము

### ప్రథమాధికారము - ఈశ్వరస్తుతి

అక్షరములకు ఆది అకారము, అట్లే జగత్తునకు ఆది భగవంతుడు ... 1

జ్ఞానమూర్తి శ్రీచరణములను ఉపాసింపడేని, చదివినందులకు గలిగిన ప్రయోజనమేమి? ... ... 2

(భక్తుల) హృదయకమలము నధిష్ఠించియుండు భగవంతుని శ్రీచరణముల నాశ్రయించినవారు నిరవధిక బ్రహ్మానందపరమపదమందు వెలసియుందురు. ... 3

రాగద్వేషరహితుని శ్రీచరణసమాశ్రితులకు సంసారదుఃఖము (తాపత్రయము) ఎక్కాలమందును ఉండదు. ... 4

యథార్థాత్మకమైన సర్వేశ్వరునిపొగడ్తను ఆకళించుకొన్నవారికి మాయాసంభవములైన పుణ్యపాపము లంటవు. ... 5

పంచేంద్రియములతృష్ణను ఉడిపిన సర్వేశ్వరునిదైన సత్యధర్మమార్గమున నెలకొన్నవారు అమృతత్వ మొందుదురు. ... 6

తనకుసాటిలేనివాడగు సర్వేశ్వరుని శ్రీచరణములను ఆశ్రయించినవారికే కాని, ఇతరులకు మనోవ్యథలు తీఱుట అసంభవము. 7

ధర్మసాగరుడగు సర్వశ్రేష్ఠుని శ్రీచరణముల నాశ్రయించినవారికే కాని, ఇతరులకు ఇతరసాగరములను తరించుట అసంభవము. 8

అష్టగుణవిశిష్టుని శ్రీచరణములకు ప్రణమిల్లని శిరము విషయగ్రహణములేని యింద్రియములవలె నిరుపయోగము. ... 9

ఈశ్వరుని శ్రీచరణములను ఆశ్రయించినవారు భవసాగరమును తరింతురు, ఆశ్రయింపనివారు తరింపరు. ... ... 10

### ద్వితీయాధికారము - వర్షప్రస్తుతి

వానవలన లోకమునకు స్థితి కలుగుచున్నందున, వానను అమృత మని గ్రహించుట భావ్యము. ... ... 11

మంచి ఆహారపదార్థములను పండించి, వానిని ఆరగించువారికి తానును ఆహార మగునది వాన. ... ... 12

సరియైన సమయమున కురియక వాన వంచించునేని సముద్రవేష్టితమగు నీవిశాలజగమునందలి ప్రాణులు ఆకలితో నకనకలాడుదురు. ... ... ... 13

పంటకు సాధకమైన వాన తగ్గినచో, రైతుల సేద్యము (నాగంటితో దున్నుట) సాగదు. ... ... ... 14

కురియక భూజనులను దుఃస్థితిపా లొనర్చి రాపాడునదియు వానయే; కురిసి, ఆధారమై, వారిని కాపాడునదియు వానయే. 15

వానచినుకు పడిననే తప్ప భువిపై పచ్చిగడ్డిమొలక తలచూపుట అసంభవము. 16

మేఘము నీటిని త్రాగి కడలిపోటును తగ్గించును, తాను గ్రోలిన నీటిని మేఘము వర్షించి కడలికే చేర్చును. మేఘ మిట్లు సేయకున్న కడలిస్వరూపమునకు ముప్పు. ... 17

వాన కురియకున్నచో, ఈ లోకమున వేల్పులకు వైభవముతో జరుగు పూజయు సాగదు. 18

వాన కురియకున్నచో, ఈ విశాల ప్రపంచమున దానము తపస్సు అనునవి రెండును ఉండవు. ... ... 19

ఎంతెంతలేనివారికిని నీరు లేనిదే లోకయాత్ర గడవదు. అట్లే, వానలేనిదే, నీటికి ఎడతెంపులేని పాఱుదలయు ఉండదు. 20

## తృతీయాధికారము - త్యాగిజనుల పేర్మి

తమకు విహితమైన సన్మార్గమందే యుండి సర్వసంగపరిత్యాగముచేసినవారిపేర్మి శ్రేష్ఠము లన్నింటికంటె శ్రేష్ఠము. శ్రేష్ఠముల దెలుపు సకలగ్రంథముల సిద్ధాంత మిదే. 21

సర్వసంగపరిత్యాగముచేసినవారిపేర్మి ఇంతటి దని కొలిచి తెలియగోరుట—ఈ భువిని పుట్టిచచ్చినవారు ఇందఱు అని వారిసంఖ్యను తెలియగోరుట వంటిది. ... 22

సంసారము మోక్షము అను రెండింటి తెఱగును ఎఱిగినవారై (సంసారబంధముల తెకతెంపుచేసికొనుటకై) ఈ జన్మములో సన్న్యాసధర్మము నవలంబించినవారిపేర్మియే లోకములో ఉత్కృష్ట మైనది. ... 23

ప్రబలజ్ఞానమనెడి యంకుశముచే పంచేంద్రియము (లనెడిగజము)లను అదుపులో ఉంచుకొనుట పరమపదప్రాప్తికి బీజ మగును. ... ... 24

పంచేంద్రియములతృష్ణ నణచుకొన్నవాని బలమునకు విశాలస్వర్గలోకాధిపతియగు దేవేంద్రుని* సాక్ష్యమే చాలు. ... 25

దుస్సాధ్యములగు పనులను సాధించువారే పెద్దలు; దుస్సాధ్యములను సాధింపజాలనివారు పిన్నలు. ... ... 26

శబ్దస్పర్శరూపరసగంధములనెడి తన్మాత్రలను ఐదింటిని (సాంఖ్యశాస్త్రపరిగణితతత్త్వముల నిరువదైదింటిని) ఎఱిగినవాడు విశ్వము నెఱిగినవాడు. ... ... 27

అమోఘవచస్కులగు యతీంద్రుల (నోట వెలువడిన) మంత్రములే భువిలో వారి మహిమను ప్రత్యక్ష మొనర్చును. ... 28

జ్ఞానవైరాగ్యాదికల్యాణగుణరాశి యనెడి పర్వతశిఖరపు టగ్రభాగమున నెలకొన్న మునులకు కోపము క్షణకాలమే యుండును. ఐనను అది అమోఘము. ... 29

తక్కిన సకలప్రాణులమీద చల్లని దయ వహించియుందురు కావున సన్న్యాసనిష్ఠులు (అన్దణర్) సుందరశీతలస్వభావు లనబడుదురు. ... ... ... 30

(సశేషము)

* గౌతమమహర్షి శాపముచే దేవేంద్రుడు భంగమొందిన కథ ఇట సూచితము.

# పరిప్రశ్న

(13-8-72వ తేది శ్రీరామకృష్ణమఠము (మద్రాసు)న జరిగిన అంతర్యోగమునందు పృచ్ఛకుల ప్రశ్నకు శ్రీమత్తపస్యానంద స్వామి వారి సమాధానము.)

ప్రశ్న: నిర్దుష్టమగు ధ్యానమునందు శరీర స్మృతి యుండరాదు, కాని ఇష్టదేవతాస్వరూపముపై ధ్యానము చేయునపుడు మనము శరీర స్మృతియందే చిక్కుకొని పోవు నవకాశము కలదు కదా? శరీరరూపమున కాక మఱి యే ఇతరరూపముననైనను ఇష్టదేవతను భావింపనగునా?

ఉత్తరము: ధ్యానమునందు సాధింపవలసిన దేమన ధ్యాన లక్ష్యమునందు తాదాత్మ్యము పొందుటచేత మన శరీరమును విస్మరించుట. నిజమగు ఏకాగ్రత యున్నచో ఈ విస్మరణము అప్రయత్నముగనే సంభవించును. ఏ బాహ్య విషయమునందైనను లేక పుస్తకమును చదువు నప్పుడును మనస్సు అందు గాఢముగ లీనమైనపుడు మనలను మనము విస్మరింతుము. మన మనస్సంతయు మనము వ్యగ్రులమై యుండు ఆ లక్ష్యముననే లీనమై పోవును. కనుక వ్యక్తి రూపమున ఇష్టదేవతను ధ్యానించుటకును శరీర స్మృతి నతిక్రమించుటకును ఏమియు విరోధము లేదు. వచ్చు కష్టమంతయు అభ్యాసకుడు దైవ ధ్యానము చేయుటకంటె ఎక్కువగ తనను గూర్చి చింతించుటవలననే.

సగుణబ్రహ్మమనిన తప్పక మానవ శరీరముతో నుండవలెనని లేదు. గుణములతో కూడిన పరమాత్మ అని మాత్రమే దాని యర్థము. అతడు సాకారుడు నిరాకారుడు కూడ. గుణములతో కూడిన వ్యక్తిత్వము మానవ విజ్ఞానమునకు తెలిసిన ఉత్తమోత్తమ విభాగము. కనుక మనకు తెలిసినట్లు సర్వోన్నతుడగు పరమాత్మనూహించునపుడు అతనిని సగుణుడందుము. అంతమాత్రముచేత అతడొక వ్యక్తి యని కాదు. సగుణబ్రహ్మము సచ్చిదానందముయొక్క అభివ్యంజనము. అతనికి మనము తెలియును. మనల నతడాదరించును. ప్రేమించును. ప్రేమింపబడును. 'వ్యక్తి' అనుచో ఆ వ్యక్తి యొకడే కావలయును. మఱియొకడు కాజాలడు. కాని సగుణబ్రహ్మము ఏ వ్యక్తిత్వముతోనైనను అభివ్యక్తము కాగలడు. భక్తులకు సాక్షాత్కరించిన సగుణబ్రహ్మముయొక్క అట్టి వ్యక్తి రూపములనే 'మూర్తు' లని 'భగవదవతారము' లని మన మందుము. మనము చూచు ఈ సృష్టి ఒక్కొక్క ప్రత్యేకత కల్గిన అసంఖ్యాకములగు వ్యక్తరూపములు మాత్రమే. దిగ్భ్రమగొలుపు వైవిధ్యములకు కారణుడగు అతడు ఏ భక్తుడు ఏ ఇష్టదైవము నర్చించిన ఆ రూపమున ప్రకటితుడు కాగలుగు మూలరూపము నేల కలిగి యుండరాదు? ఈ దివ్యమూర్తులు భక్తియొక్క శైత్యప్రభావమున మంచుగడ్డలవలె ఘనీభవించిన సచ్చిదానంద మహోదధియందలి భాగములని శ్రీరామకృష్ణులనెడువారు. సాకారమునుగూర్చి కొందఱకు కలుగు మానసిక సంశయములను పర్యాలోచన చేసి యతిక్రమింపగలిగినచో భగవద్రూపము ధ్యానమునకు సహకారి యగును. సాకారమనిన ఇష్టము లేనివారు అతనినిగూర్చి సర్వవ్యాపకమగు 'సాన్నిధ్యము'గ అతనిని భావింపవచ్చును. వారి హృదయాంతరాళములలో అతనిని సత్ చిత్ ఆనంద స్వరూపునిగ అనుసంధింపవచ్చును.

# గ్రంథపరిచయం

## శ్రీ సమర్థరామదాస బోధలు

రచయిత : శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ కేశవతీర్థస్వాములవారు. డెమ్మి 1/64 సైజు. (172+24) పుటలు. మూల్యము రూ. 1-25. ప్రాప్తిస్థానము : శ్రీరామతీర్థ సేవాశ్రమము, పిడుగురాళ, గుంటూరుజిల్లా, ఆంధ్రప్రదేశ్.

శ్రీ సమర్థరామదాసస్వామి జీవితోపదేశములను సంగ్రహరూపమున ఈగ్రంథము విశదపఱచుచున్నది. ఇందు మొదటిభాగమున శ్రీ స్వాములవారి జీవితగాథయు, రెండవభాగమున శ్రీ స్వాములవారు లోకమును ప్రబోధించుచు జనసామాన్యమునకు తెలియజేసిన సాంసారిక జీవయాత్రా కథనమును మూడవ భాగమున శ్రీవారు లోకమునకు ఉపదేశించిన 'సూక్తి'లలో ముఖ్యములయినవి 108 సంగ్రహముగ వివరింపబడియున్నవి. ఇందలి రెండవ భాగమున వివరింపబడిన 'జీవయాత్ర' సమస్త మానవులకును పఠనీయము. ఆజన్మాంతము మానవుడు లోకమున గడపు జీవితవిధాన మిందు విపులముగ వివరింపబడియున్నది. సాధకులు, ముముక్షువులు జనసామాన్యము — అందఱకును ఈ గ్రంథము అవశ్యపఠనీయము, అనుసరణీయము.

## శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్ర భాష్యము

అనువాదకులు : బాలవ్యాస శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి, క్రౌను సైజు (408+26) పుటలు, మూల్యము : రూ. 8-00. ప్రాప్తిస్థానము : సాధన గ్రంథమండలి, తెనాలి.

సాధన గ్రంథమండలి వారు ప్రచురించు శంకరగ్రంథరత్నావళియందు సప్తమరత్న మీ పుస్తకము. శ్రుత్యుపనిషదాది గ్రంథాంతర్గతములైన ధర్మములు దుర్గ్రాహ్యములగుటచేత సర్వజనోపకారియు సులభగ్రాహ్యమును అగు ధర్మము నెఱుగగోరి ధర్మరాజు భీష్మాచార్యుని "కో ధర్మః సర్వధర్మాణాం భవతః పరమో మతః" అని యడుగగా ఆయన "ఏష మే సర్వధర్మాణాం ధర్మోఽధికతమో మతః" అని విష్ణుసహస్రనామస్తోత్రము నుపదేశించెను.

అట్టి సర్వధర్మసారమును వివరించుచు శ్రీ శంకరభగవత్పాదులు శ్రీ పరాశరభట్టరులు వ్యాఖ్యానములను వ్రాసిరి. శ్రీ శంకరుల భాష్యము ననుసరించు ఇతర ఆంధ్రానువాదమాత్రము లున్నను అవి మూలమును పూర్తిగ ననుసరింపనట్లును అసంపూర్ణముగ నున్నట్లును తోచును. శాస్త్రిగారి యనువాదము ఈలోపమును తీర్చుచున్నది. శైలియు సులభము. సుగ్రాహ్యము.

ఈ గ్రంథము శ్రీ శంకరభాష్యమును అనువాదమును కూడ కలిగియుండుటచేత శ్రీశంకర వచనముల నెఱుగగోరు జిజ్ఞాసువులకును అర్థమును మాత్రము తెలియగోరు ముముక్షువులకును కూడ ప్రయోజనకారి యగుచున్నది.

గ్రంథాంతమునగల అకారాది నామానుక్రమణిక గ్రంథోపయోగము నధికతరము చేయుచున్నది.

—శంకరశాస్త్రి

# షికాగో నగరోపన్యాసములు

అమెరికాయందలి షికాగో నగరమున జరిగిన విశ్వమత మహాసభయందు శ్రీ వివేకానందస్వాములవారు హిందూమత ప్రతినిధియై యొసగిన ఉపన్యాసముల సంపుటీకరణము!

సనాతన ధర్మోన్నతిని ప్రపంచమంతటికిని జాటిన వీ యుపన్యాసములే. మతమును గూర్చిన శ్రీ వివేకానంద సందేశామృతము సమస్తము ఇందు నిక్షిప్తమైయున్నది. హిందూ మతౌన్నత్యమును దెలియగోరు ప్రతి భారతీయుడును తప్పక చదువవలసిన గ్రంథమిది.

ప్రజ్వలమగు పంచమ ముద్రణము. వెల: రూ. 1-00

# శ్రీ రామకృష్ణ సూక్తిసుధ

**అనువాదకులు: ఆచార్య శ్రీ నేలటూరి భక్తవత్సలముగారు**

'సహానోద్ధారమయిన వచనామృతము ఇట్టి గ్రంథరూపముదాల్చుట కిదే మొదలు' (ఆల్డసు హక్స్లి) అను పొగడ్తగన్న శ్రీమన్నిఖిలానందస్వాముల సంక్షిప్తాంగ్ల మూలమునకు ఇది తేటతెలుగున అనువాదము.

'గురుదేవుని స్వతస్సిద్ధజ్ఞానము, చిదానందోద్రేక ప్రభవసహజసరళవాగ్ధాటి, శిశూచితామాయికత, అనిర్వచనీయప్రజ్ఞ, ఋజూపమానములు, సరసకథలు, గేయములు, పద్యములు చక్కగా అనూదితములు. (హిందు: తేది 27-7-'58)

'అద్యతనగద్యరచయితలెల్ల మేలుబంతిగా అనుసరింపదగిన గ్రంథరాజము.'

(స్టాండర్డు: తేది 16-2-'58)

'అనువాదమైనా స్వతంత్రగ్రంథం అనిపించు ధాటి గలది.' (భారతి: 7-6-'61)

'చవులూరించు చక్కని రచన.' 14-2-'58 (డాక్టరు సర్ ఎస్. రాధాకృష్ణగారు)

**590+158 పుటలు** **వెల: రూ. 7-50**

ఇట్లు వ్రాయుడు: మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-600004

# శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-600004

## 1975-వ సంవత్సరము, అక్టోబరు మాసమున జరుగనున్న

## ఉత్సవ కార్యక్రమము

**శ్రీశ్రీ దుర్గాపూజ :**

10-10-75 శుక్రవారము : శ్రీదుర్గాషష్ఠి.
" " శ్రీలలితాసహస్రనామార్చన అపరాహ్ణము 5-00 గంటలకు.
12-10-75 ఆదివారము : శ్రీదుర్గాష్టమి. విశేషపూజ.
" " సంధిపూజ అపరాహ్ణము 6-50 నుండి 7-38 వఱకు.
14-10-75 మంగళవారము: విజయదశమి (సాయంకాలిక ఆరాత్రికము పిదప శాంతిజలప్రోక్షణము.)

**శ్రీశ్రీ లక్ష్మీపూజ :**

19-10-75 ఆదివారము : సాయంకాలిక ఆరాత్రికము పిదప.

**ఆదివారములందు సత్సంగ సమావేశములు :**

అపరాహ్ణము 4-00—4-20 వఱకు లలితా సహస్రనామ పారాయణము (5-10-75, 19-10-75)
" " " శ్రీవిష్ణు సహస్రనామ పారాయణము (12-10-75, 26-10-75)
4-20—4-30 " ధ్యానము.
4-30—5-30 " తమిళమున ఉపన్యాసములు :—
"జగన్మాత" : శ్రీ అణ్ణాగారు (5-10-75)
శ్రీదక్షిణామూర్తి స్తోత్రము : శ్రీ టి. ఎమ్. పి. మహాదేవన్‌గారు (12-10-75)
శ్రీవిష్ణు సహస్రనామము : శ్రీ వి. కల్యాణసుందరశాస్త్రిగళ్ (19-10-75)
శ్రీమద్రామాయణము : డాక్టర్ ఎస్. వీఝినాథన్‌గారు (26-10-75)
5-35—6-30 " ఆంగ్లమున ఉపన్యాసములు :—
శ్రీమద్భగవద్గీత : శ్రీమత్తపస్యానందస్వాములవారు.
6-30—8.00 " ఆరాత్రికము భజన.

**ప్రత్యేకోపన్యాసములు**

4-10-75 శనివారము : 5-45 శ్రీమద్రామాయణ పఠనము : శ్రీ పి. రామకృష్ణన్‌గారు, ఐ.సి.ఎస్. (రిటైర్డు)
18, 25-10-75 " 5-30 శ్రీమద్రామాయణము : డాక్టర్ ఎస్. వీఝినాథన్‌గారు.

**ఇతర వారములందు ఉపన్యాసములు : అపరాహ్ణము 5-45 గంటలకు**

సోమవారములు : శ్రీవిష్ణుసహస్రనామము (ఆంగ్లము) శ్రీమత్ వీతమోహానందస్వాములవారు.
మంగళవారములు : అధ్యాత్మరామాయణము (ఆంగ్లము) శ్రీమత్ గభీరానందస్వాములవారు.
బుధవారములు : శ్రీమద్భాగవతము (ఆంగ్లము) శ్రీమత్ గోలోకానందస్వాములవారు.
గురువారములు : అముదమొళ్ళి (తమిళము) శ్రీమత్ శ్రీరంగానందస్వాములవారు.
శుక్రవారములు : ఆత్మబోధ (తమిళము) శ్రీ ఆర్. రామకృష్ణన్‌గారు.

ఏకాదశత్రయమునందు సాయంకాలిక ఆరాత్రికానంతరము శ్రీరామనామ భజన (1-10-75, 15-10-75, 31-10-75)

5-10-75 ఆదివారము శ్రీ అఖండానందస్వామి జయంతి.

శుక్రవారములందు సాయంకాలము 6-30 గంటలకు తిరువళ్ళిక్కేణియందలి దక్షిణమాడవీధియందు 18-వ నంబరుగల శ్రీరామకృష్ణ మందిరమున శ్రీమత్ గోలోకానందస్వాములవారి భగవద్గీతోపన్యాసములు.

ఈ ఉత్సవము లన్నింటియందును భక్తులెల్లరును పాల్గొని భగవంతుని యనుగ్రహభాగ్యమును బడయగోరుచున్నాము.

అధ్యక్షులు,
శ్రీరామకృష్ణమఠము, మద్రాసు-600004.

సంపాదకులు: శ్రీ చిద్ఘనానందస్వామి.
శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-600021) న ముద్రింపబడి,
శ్రీ చిద్ఘనానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మద్రాసు-600004) నుండి ప్రచురింపబడినది.

# శ్రీ మ ద్భ గ వ ద్గీ త

అనువాదకులు :

శ్రీ నిర్వికల్పానందస్వాములవారు

ఇది మూలశ్లోకములు, ప్రతిపదార్థము, ధారాళమగు అనువాదము, శ్రీధరీయ, టీకాసారము, విశేషాంశములు, సానువాదగీతాపాఠక్రమము, ధ్యానమాహాత్మ్యములు సమభావాత్మకములగు ఉపనిషద్వాక్యసూచిక, వేదాంతసూత్రసూచిక, గీతాశ్లోకసూచిక, శబ్దానుక్రమణిక—ఇన్నిటితో విరాజిల్లుచున్నది.

భక్తులకు సాధకులకు మాత్రమేకాక కళాశాల విద్యార్థులకు సైతము ఉపయుక్తమయిన దివ్యగ్రంథము.

పుటలు : 58+440 (అందమయిన అష్టమ ముద్రణము) వెల : రూ 9-00

# 'మా దివ్యవాణి' గ్రంథమాల

**నేడే కొనండి !** **పదే పదే చదవండి !!**

దివ్యావతారమూర్తుల విశ్వోపజీవ్యములైన అమృత మధుర సూక్తులు సర్వసుగ్రహము హృదయ సన్నిహితమునైన తేట తెనుగున వీనిలో అందజేయబడ్డాయి. ఇందులో ఒక్కొక్కటి నిరుత్సాహులకు ఉత్సాహప్రదం, అశాంతిసంక్షుభితులకు శాంతిదాయకం, సంశయాందోళితులకు సంశయాపనోదకం, జిజ్ఞాసువులకు పరమార్థజ్ఞాన సమర్పకం, అందరికీ శిక్షకం, సంస్కారకం, నిర్వృత్యాపాదకం. మువ్వన్నెల మేలి జాకెట్టుతో పాకెట్టుసైజులో చక్కని తయారింపు—

| | | | |
|---|---|---|---|
| శ్రీ రామకృష్ణ ఉవాచ | 0-80 | శ్రీ కృష్ణవాణి | 0-80 |
| శ్రీ శారదాసూక్తి నవనీతము | 0-80 | బుద్ధ ఉవాచ | 0-80 |
| శ్రీ వివేకానంద శంఖారావము | 0-80 | క్రైస్తు సూక్తిమాల | 0-80 |

మహమ్మదు సూక్తిమంజరి 0-80

ఇట్లు వ్రాయుడు :

మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠము, మైలాపూరు, మద్రాసు - 600004.

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౬౨ ౧౯౭౫ - అక్టోబరు : రాక్షస - ఆశ్వయుజము సంచిక ౪

## విషయసూచిక

# శ్రీ వివేకానంద జీవితచరిత్ర

(శ్రీ చిరంతనానందస్వామి ప్రణీతము)

ఇందు శ్రీ స్వాములవారి జీవితమున నింతకుపూర్వము గ్రంథస్థములుగాని ముఖ్య సంఘటన లెన్నియో శ్రీవారి సోదరశిష్యులవలన విని వ్రాయబడినవి. ఇది శ్రీ స్వాములవారి సంపూర్ణ చరిత్ర!

...శ్రీ వివేకానందస్వాములవారి యసమాన వాగ్వైభవమును మంచి నుడికారపు టొడుపుతో శ్రీ చిరంతనానందులు తెలుగునఁ బ్రదర్శించిరి. వివేకానందుల వాఙ్మయ మూర్తికి తెలుఁగుసేత యలంకృతి...

—వేటూరి ప్రభాకరశాస్త్రి

నిర్దుష్టమైన భాష, అందమైన అచ్చు, ఆకర్షకమైన రూపము.

432 పుటలు (పదవ కూర్పు) వెల: రూ. 4-00

## భక్తిమార్గము

మూలము: శ్రీ పరమానందస్వామి

అనువాదకుడు: శ్రీ గోటేటి సత్యనారాయణ

భక్తిరేవ గరీయసీ యని నారద వాక్యము. రచయిత భక్తి పవిత్రత సుస్థిరత నిర్భయత ఆత్మసమర్పణము అను వాని ద్వారా భక్తి మార్గమును సులభగమ్యముగ చేసిరి.

పుటలు: 62 + II వెల: రూ. 1-00

నాలుగవ ముద్రణము.

## తాపత్రయ చికిత్స

శ్రీ రామకృష్ణానందస్వామి

జిజ్ఞాసువులకు భక్తులకు ఆర్తులకు శ్రీ స్వామివారు అమృతవర్షము వంటి యుత్తరములు వ్రాసి యుండిరి. వాని యందలి విశేషాంశముల సంపుటి కగణమే తాపత్రయచికిత్స. ప్రపంచము నందలి తాపత్రయ సంతప్తులకు ఈ చిన్ని పొత్తము శాంతి ప్రదమగుట నిస్సంశయము.

పుటలు: 64+VIII వెల. రూ. 0-60

మూడవ ముద్రణము

ఇట్లు వ్రాయుడు: మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-600004.

## కర్మయోగము

అనువాదకులు :
శ్రీ చిరంతనానందస్వాములవారు

ఇందు శ్రీ స్వాములవారు కర్మయోగ తత్త్వమును అరటిపండొలిచినట్లు విశదీకరించియున్నారు. కర్మమెటుల మోక్షసాధనమో స్పష్టీకరించియున్నారు.

(అష్టమ ముద్రణము)

(146+8) పుటలు వెల : రూ. 4-00

## భక్తియోగము

అనువాదకులు :
శ్రీ చిరంతనానందస్వాములవారు

ఆధునికుల చిత్తము నాకర్షించురీతిని, అమోఘవచనములతో, విమర్శకదృష్టితో శాస్త్రప్రమాణములతో భక్తితత్త్వమును శ్రీ వివేకానందస్వాములవా రిందు విపులముగా ప్రదర్శించియున్నారు. మూల గ్రంథములలోని ప్రమాణవచనములును వానికి టిప్పణములును సులభశైలియందు వ్రాయబడియున్నవి.

(ఏడవ కూర్పు)

(121+4 పుటలు) వెల : రూ. 4-00

## శ్రీరామకృష్ణపరమహంస జీవిత సంగ్రహము

శ్రీ చిరంతనానందస్వామి

మహిమాన్వితమగు శ్రీరామకృష్ణ పరమహంస జీవిత విశేషములు ఇందు రమణీయమగు శైలిలో వర్ణింపబడి యున్నవి. లోకమునకు శ్రీరామకృష్ణులు కావించిన యుపకారము వారి యుపదేశ సారముకూడ చక్కగా వివరింపబడినవి.

పుటలు : 48 వెల : రూ. 0-75

నాలుగవ ముద్రణము

## గురూపదేశములు

అనువాదకులు : శ్రీ చిరంతనానందస్వామి

శ్రీ గురుదేవుని మానసపుత్రుడనబరగిన శ్రీ బ్రహ్మానందస్వామి గురుముఖము నుండి వచ్చిన యుపదేశములను యథాతథముగ గ్రహించి వానియందు ముఖ్యములగు వానిని సంగ్రహించి యాంగ్లమున రచించిరి. వాని యనువాదమే ఈ గ్రంథము. ఇందు గృహస్థులకు సాధకులకు వలయు సూక్తు లెన్నియో వివరింపబడియున్నవి.

పుటలు : 168 వెల : రూ. 2-00

తొమ్మిదవ ముద్రణము

ఇట్లు వ్రాయుడు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-600004

'అఖిలవిభు శరణొందుమ, యా క్షణంబ యతనికృప నీదు ననుభూతి కందు వత్స'.

—శ్రీ శారదామణి.

# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౩౨ } ౧౯౭౫ - అక్టోబరు : : రాక్షస - ఆశ్వయుజము { సంచిక ౮

ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ !

## ప్రార్థన

## శ్రీ రామకృష్ణ కర్ణామృతము

శ్రీరామకృష్ణ తవ పాదయుగాభిమర్శో బుద్ధ్యా కృతోఽపి పులకోద్గమమాతనోతి
సాక్షాత్ కరేణ విహితస్తు తదీయమర్శః కం కం ప్రదాస్యతి వికారమహం న జానే.

శ్రీరామకృష్ణ! నీ పాదపద్మముల స్పర్శనూహించిన మాత్రముననే నాకు ఆనందాతిరేకమున పులక లెగయుచున్నవి. ఇక నీవు నీ కరపల్లవముల స్పర్శచే ప్రత్యక్షముగ ననుగ్రహించినచో అది నాయందెట్టి దివ్యభావములను రేకెత్తించునో తెలియజాలకున్నాను గదా !

మహేశభావస్తవ హృద్య ఏవ మనుష్యభావస్తు తతోఽపి హృద్యః
ఆద్యే గభీరే హృదయం విషక్తం సౌమ్యే ద్వితీయే తు మనః ప్రలీనమ్.

పరాత్పరుడవగు నీ మహేశ్వరరూపము కడుమనోహరమే. కాని నీ మానవరూపము దానికంటెను రమణీయము. గంభీరమగు నీ దివ్యవైభవమునందు మహేశ్వరరూపమునందు మనస్సు నిశ్చలముగ నిలుచును. కృపాసముద్ర స్వరూపమగు నీ మానవరూపమును ధ్యానించునపుడు మనస్సు అందు కరిగియేపోవును.

# శ్రీ గురుసూక్తిసుధ

స్వయంకృతమైన ప్రశ్న: ఈ సిద్ధుల (అష్ట సిద్ధుల)యం దేమున్నది?

శ్రీరామకృష్ణులు: వానియందు చిక్కుకొని మనస్సు సచ్చిదానందమున కతిదూరముగ పయనించును. ఒక కథ వినుడు. ఒకని కిద్దరు కుమారులుండిరి. పెద్దవానికి చిన్నతనముననే వైరాగ్యమావేశించినది. సన్న్యాసియై అత డిల్లువదలెను. చిన్నవాడు విద్యాభ్యాసము చేసి పండితుడును గుణవంతుడును అయ్యెను. ఆ పిదప వివాహితుడై గృహస్థధర్మములను నిర్వర్తించుటయందు నిమగ్నుడయ్యెను. సన్న్యాసులయం దొక ఆచారముకలదు. వారి కిష్టమైనచో పన్నెండుసంవత్సరముల పిదప వారి జన్మస్థలమును చూడబోవచ్చును. మన సన్న్యాసియు తన జన్మస్థలమును చూడవచ్చెను. తన తమ్ముని భూములను సేద్యమును సంపదను ఆస్తిపాస్తులను చూచుచు అతని గృహద్వారముననిల్చి తమ్ముని ఎలుగెత్తి పిలిచెను. ఆ పిలుపు విని తమ్ముడు వెలికివచ్చి అన్నను చూచెను. చిరకాలముపిదప వచ్చిన అన్నను చూచి అతడు మహదానందముతో అభివాదముచేసి లోనికి గొనిపోయి సరసను గూర్చుండబెట్టుకొని అనేకవిధముల నుపచరింప సాగెను. భోజనానంతరము వార నేకవిషయములు చర్చించిరి. పిదప తమ్ము డిట్లనెను. "అన్నా, ఈ సౌఖ్యముల నన్నింటినివదలి ఇంతకాలము సన్న్యాసివై తిరిగితివి. అందువలన నీవేమి పొందితివో దయచేసి నాకు చెప్పుము." ఇది వినగనే అన్న "చూతువా! అయిన నాతో రమ్ము" అనుచు తమ్ముని దాపుననున్న నదీతీరమునకు గొనిపోయెను. అచ్చట తమ్ముని చూచుచుండుమనిచెప్పి అన్న నీటిపై నడచిపోయి నది ఆవలిగట్టు చేరెను. అచ్చటినుండి తమ్మునివైపు "చూచితివా" అని యరచెను. తమ్ముడు పడవవాని కొక యర్ధణాయిచ్చి నదిని దాటి అన్నను చేరబోయి "నేనేమి చూచితిని?" అని యడిగెను. అన్న "అదేమి? నేను నీటిపై నడచుచు నదినిదాటుట చూడలేదా?" అని యనెను. తమ్ముడు నవ్వుచు "అన్నా, అర్ధణాయిచ్చి నేనును నదినిదాటుట నీవు మాత్రము చూడలేదా? ఈ పన్నెండు సుదీర్ఘ సంవత్సరములు కష్టముల పాలైనందుకు నీకు లభించినదింతియేనా! అతి సులభముగా నేను అర్ధణాతో సాధింపగలిగిన దానినిమాత్రమే నీవు సాధింపగలిగితివి." అని పల్కెను. తమ్ముని ఈ మాటలతో అన్నకు కనువిప్పు కలిగినది. అప్పటినుండి అతడు భగవత్సాక్షాత్కార సాధనయందు నిమగ్నుడయ్యెను.

స్వయంకృతమైన ప్రశ్న: సచ్చిదానందమన నేమో ఎవరును చెప్పజాలరు. అందువలననే అతడు మొదట సగము పురుషుడు సగము స్త్రీ (అర్ధనారీశ్వరుడు) అయ్యెను. ఏల?

శ్రీరామకృష్ణులు: ఏలన అతడు పురుషుడును ప్రకృతియు తానేయని చూపగోరినాడు. పిదప అచ్చటినుండి మరియొక మెట్టుదిగి పురుషుడు వేఱుగను ప్రకృతి వేఱుగను అయ్యెను.

మనస్సు సచ్చిదానందముతో నేకమగువఱకు భగవత్ప్రార్థనయు ప్రాపంచిక విధులును కొనసాగును. సచ్చిదానందమునందు మనస్సు లీనమైన పిదప అప్పుడు విధులను నిర్వర్తింపవలసిన యగత్యము ఉండదు. హాథీ పాగల్ మేరానితాయ్ అను కీర్తన చరణ

మును తీసికొనుము. కీర్తన ప్రారంభించినపుడు అన్ని పదములు చక్కగా ఉచ్చరించుచు రాగము, తాళము, శ్రుతి సర్వము అన్నియు పొరపాటులేక పాడుదురు. వీని యన్నిటి యందును శ్రద్ధతో పాడవలసిన విధమున పాడుదురు. కొంతసేపటికి మనస్సు పాటలోని భావమున కొద్దిగా లీనముకాగా హాథీపాగల్ హాథీపాగల్ అని మాత్రమే పాడుదురు. భావములో మనస్సు ఇంకను గాఢముగా లీనముకాగా హాథీహాథీ అని మాత్రమే పాడుదురు. మఱింత గాఢముకాగా పాటకుడు హాథీ అనబోయి హా అని మాత్రమే పలికి (నోరు తెఱచి యుండిపోవును).

స్వయంకృతమైన ప్రశ్న : మంచిది. ఇతడేమి సాధించెనో అతడేమి సాధింపలేదో అని ఈ బాలురందఱినిగూర్చి నేనేల ఇంత ఆతురపడుదునో చెప్పగలవా ! వీరు బడిపిల్లలు మాత్రమే, నిర్ధనులు...

శ్రీరామకృష్ణులు : కారణమిది. వీరందఱు పరిశుద్ధమనస్కులు. కామినీకాంచనములు వీరి నింకను అంటలేదు. వారి మనస్సులను దైవమునందు లగ్నముచేసినచో వారు దైవసాక్షాత్కారమును బడయగలరు. నా స్వభావము హుక్కా పీల్చువాని స్వభావమువంటిది. హుక్కాపీల్చువాడు ఒంటరిగా హుక్కాపీల్చుటతో తృప్తిపడజాలడు. అతనికి మత్తెక్కిన పిదప అతడు హుక్కా నందించుటకు మరియొకడు మిక్కిలి యవసరము. నాకును అట్లే. ఈ బాలు రందఱిపట్లను నా కట్లే యైనను నరేను గురించి ఆత్రపడినట్లు మరియొకరిగూర్చి ఆత్రపడను. అతడు వచ్చుట రెండురోజు లాలస్యమైనచో నా హృదయము తడిగుడ్డవలె పిండబడుచున్నట్లు బాధపడును. ఇతరు లేమందురో అని తలచుచు చింతచెట్ల క్రిందికి తొలగిపోయి పెద్దగ నేడ్చెడివాడను. ఒక నాడు హాజ్రా ఇట్లనెను "నీయీ వింతస్వభావమేమి ? నీవు పరమహంస స్థితియందున్నావు. నీ మనస్సును సమాధిలో భగవంతునియందు మగ్నము చేసి భగవంతునితో తాదాత్మ్యము నొందియుండుటమాని నరేంద్రుడేల రాలేదు ? భావనాథుని కేమగును ? ఇత్యాది ప్రశ్నలతో చింతాక్రాంతుడ వగుదువేల ?" అప్పుడు నే నతడు చెప్పినది నిజమేననియు నేను మరల నట్లు చేయరాదనియు అనుకొంటిని. పిదప నేను ఆ చింతచెట్లనుండి తిరిగి వచ్చుచుండగా నాకు (జగన్మాతచేత) కలకత్తాయొక్క విస్పష్టమైన చిత్రము కన్నులకు కట్టినట్లు చూపబడినది. అందు జనులందఱు రాత్రింబవళ్లు కామకాంచనములందు మునిగి ఘోరముగ తపించుచున్నట్లు చూచితిని. అది చూడగనే నా హృదయమున కరుణ పొంగిపొరలినది. "ఈ జనుల శ్రేయస్సునకై నేను లక్షమడుంగు లధికముగ బాధపడవలసివచ్చినను ఎంతో సంతోషముగ నట్లు చేయుదు"నని యనుకొంటిని. నేను తిరిగివచ్చి హాజ్రాతో నిట్లంటిని. "నేను వారిని గూర్చియే చింతింతును. దానివలన నీ కేమి ? దుష్టుడా !"

ప్రభాప్రసారము
(సంపాదకీయము)

# స్వార్థము - పరార్థము

> నరునిపట్టి గోళ్లతోచీల్చి వేడినెత్తురును త్రావు ఆడుపులి తన బిడ్డలను రక్షించుటకై తన ప్రాణముల నర్పించును. జంకుగొంకులేక సోదర మానవులను వధించు నీచాతినీచుడును తన భార్యను బిడ్డలను సంరక్షించు నిమిత్తము ప్రాణముల నర్పించును. ఒకటి స్వార్థపరత, రెండవది స్వార్థ త్యాగము. ఇట్లు బ్రహ్మాది పిపీలిక పర్యంతము ఈ జగత్తు సర్వము ఈ రెండు శక్తులకు నాట్యరంగమై యొప్పుచున్నది. జగద్వ్యాపార మంతటికిని క్రోధము వైరము స్పర్ధ పోరాటముపైని ఆధారముచేయుటకు వారికి ఏమి అధికారము కలదు? ఇవి ఉన్నవి అనుట నిజమే. కాని రెండవశక్తి పనిచేయుట లేదనుటకు ఎవనికిని హక్కులేదు. ఎవరైనను ఈ "నాఽహం" (నేను కాదనుట) ఈ త్యాగముతప్ప వేఱగు అనుకూల శక్తి యేదైన లోకమున కాన్పించుచున్నదని చెప్పగలడా? మొదటిదియు ప్రేమశక్తియొక్క వక్రరూపమే అనవచ్చును. ప్రేమశక్తియే స్పర్ధకు (పోటీ) దారితీయును. నిజముగా స్పర్ధకు జన్మస్థానము ప్రేమయే. దుర్మార్గమునకు నిజమగు మూలము స్వార్థరాహిత్యమే. సత్కార్యశక్తి యొక్క వక్రగతియే దుష్కర్మ. నరహత్య కావించినవాడు తన బిడ్డలపైగల ప్రేమచేతనే అది కావించియుండవచ్చును. అతని ప్రేమ జగమునగల కోట్లకొలది ప్రజలను కాదని సంకుచితమై తన బిడ్డలయందు పరిమితమై పోయియుండును. కాని పరిమితమైనను అపరిమితమైనను అది ప్రేమయే సుడీ! కావున ఈ జగత్తునకు మూలబలమై నడుపుచుండునది యే మార్గమున ప్రకటనకు వచ్చినను ఆ ఒక్కశక్తియే. ఆ అద్భుత శక్తియే స్వార్థరాహిత్యము త్యాగము ప్రేమ అనంబడును. జగమునగల సత్యమగు చైతన్యశక్తి అది యొక్కటియే.
>
> —శ్రీ వివేకానందస్వామి.

ప్రపంచమున నిరంతరము రెండుశక్తులు పనిచేయుచుండుటను చూతుము. ఒకటి స్వార్థము. రెండవది పరార్థము. మానవుని పురోగతియంతయు స్వార్థమునే యాశ్రయించి యున్నదని యొక వాదము. మానవుడు బలవంతుడగుటకు సుఖపడుటకు ఆనందముగ నుండుటకు చేయు నిరంతర ప్రయత్నఫలితమే పురోగతియని వారందురు. పరార్థమునే యాశ్రయించియున్నదని మరియొక వాదము. బలహీనులను రక్షించుటకు సుఖపెట్టుటకు ఆనందముగ నుండునట్లు చేయుటకు జరుగు నిరంతర ప్రయత్నఫలితమే పురోగతియని వీరి యభిప్రాయము. రెండింటికిని తగిన బలవత్తరములగు కారణములు కన్పించుచునే యుండును.

స్వార్థప్రయత్నమువలననే స్పర్థలు సంఘర్షణలు ఏర్పడుచున్నవి. ఇతరులను కాదని వారు కష్టనష్టముల పాలైనను పూర్తిగ నిర్మూలింపబడినను తమ సౌఖ్యమును చూచుకొనుట స్వార్థలక్షణము. దీని ఫలితముగ తమ సుఖమున కడ్డువచ్చువారిని తొలగించు ప్రయత్నమే స్పర్ధ, సంఘర్షణము. స్పర్ధయే పురోగమన సూత్రమని ప్రప్రథమున జీవశాస్త్ర సిద్ధాంతమేర్పడి క్రమక్రమముగ మానవ జీవితమునందలి యన్ని రంగములకును వ్యాపించినది. ప్రస్తుతమున స్వార్థము స్పర్ధ సంఘర్షణ జీవనన్యాయములుగ నిలిచిపోయినవి. వానికి 'హ్యూమన్ నేచర్' అను నొక బిరుదముకూడ నివ్వబడినది.

స్పర్ధలు సంఘర్షణములవలననే శ్రేష్ఠతమమగు జీవులు వర్ధిల్లుననియు తదితరములు నశించుననియు జీవశాస్త్ర సిద్ధాంతము. కనుక

మానవసమాజమునకూడ అట్టి స్పర్ధలు సంఘర్షణలవలననే శ్రేష్ఠతముడగు మానవుడు శ్రేష్ఠతమమగు జాతి వర్ధిల్లునని తదితరములు నశించునని భావింపబడుచున్నవి. చరిత్రయంతటను ఇతర జాతులపై వివిధజాతుల యొక్క దాడులును వివిధ సామ్రాజ్యస్థాపనములు వలసరాజ్యముల యభివృద్ధి సాంస్కృతిక వ్యాప్తి మొదలగునవి ఈ యభిప్రాయమున కాధారముగ చూపుదురు.

అట్లే ఎవరి సుఖమును వారు చూచుకొనినచో ఎల్లరి సుఖమును ఫలించునని ఆర్థిక శాస్త్ర సూత్రము. ఇందును స్పర్ధవలననే శ్రేష్ఠతమమైన సంస్థ యభివృద్ధిచెంది తదితరములు నశించునను వాదము పూర్వకాలమున అత్యంతప్రాబల్యము నొందియుండినది. కాలాంతరమున ఆ సూత్రముయొక్క తీవ్రత చాల వఱకు తగ్గిపోయినను ఇంకను యజమానవర్గము కార్మికవర్గము నడుమగల స్పర్ధవలననే అనేకములగు దేశములందు ఆర్థిక వ్యవస్థ యాధారపడుటను చూతుము.

సాంఘికజీవనమునను ధనికులు బీదలు అను వర్గములు ఉన్నతవర్గములు అధమవర్గములు అను విభాగముచేతనే ఒకరి నణగద్రొక్కుట వలననే మఱొకరు అభివృద్ధిగాంచుట దైనందినానుభవము.

రాజకీయరంగమునను ప్రతిదేశమును ఏదియో యొకవిధమున ఇతర దేశములపై యాధిపత్యమును సంపాదించి దానివలన లాభము పొందుచుండును. ఇట్టి లాభము ప్రథమమున సైనికబలముతో సాధింపబడి తరువాత వాణిజ్య వ్యాపారరూపమునుపొంది ప్రస్తుతము వ్యక్తావ్యక్తమగు ఆర్థికసూత్రముల ద్వారా సాధింపబడుచునేయున్నది.

సర్వమానవ సౌభ్రాతృత్వమును బోధించు మతములు సైతము ఒండొంటితో ఘర్షణపడుచు ఒకమతము ఉన్నతము మరియొక మతము ఆటవికము అనాగరికము అనుచు ఇతర మతములను హీనముగ చిత్రించుచు తమ మతముయొక్క ఉత్కృష్టతను నిలువబెట్టుకొన యత్నించును.

ఇట్లు వివిధరంగములయందు స్వార్థప్రయత్నమే జీవనన్యాయమనియు పురోగతి దానివలననే సాధ్యమనియు సామాన్యముగ నేర్పడుచుండ మానవసమాజమున పరార్థప్రయత్నమే సర్వవిధముల పురోగతికి మూలకారణమై యున్నదని చెప్పుటకును ఆధారములు గలవు.

దాడులుచేసి సామ్రాజ్యములు స్థాపించిన దేశములెన్నియో కాలగర్భమున కలిసిపోగా అందఱిచేతను దాడిచేయబడి ఏయొక్క దేశముపైనైనను దాడిచేయని భారతదేశము ఇంకను వర్ధిల్లుచునేయున్నది. సకలదేశీయులును ఇందు ఆదరమును పడయుచునేయున్నారు.

పారిశ్రామిక ఆర్థికరంగములందు ఎవరి సుఖమునువారు చూచుకొనుచుండిన కాలమున, ధనికులు పేదలను ఏ ఇతరవస్తులవలెనే నిష్కరుణముగ వాడుకొనుటనుచూచి సహింపలేని కరుణాళువులగు మహాత్ముల హృదయపరితాపమువలననే కార్మిక సమాజమునకు ప్రప్రథమమున హక్కులు కలుగుట క్రమక్రమముగ పారిశ్రామిక వర్తకవాణిజ్య సమాజములందు కార్మికులు యజమానుల నడుమను ఉత్పత్తిదారులు (Producers) వినియోగదారులు (Consumers) నడుమను స్పర్ధ, వైషమ్యముల ప్రభావముతగ్గి పరస్పర సహకారమే పురోభివృద్ధికి పరస్పరాభ్యుదయము

నను ఆవశ్యకముగా గుర్తింపబడుటను గమనింతుము.

వైజ్ఞానికరంగమున లూయీ పాశ్చర్ మేడమ్‌క్యూరీలవంటి శాస్త్రవేత్తలెందరో తమ జీవితములను మానవాభ్యుదయమునకై యను ఋణమును ధారవోయుటను గమనింతుము. సాంకేతికరంగమున యంత్రశక్తి ఆవిరిశక్తి మొదలగునవన్నియు మానవప్రయత్నమును సులభతరముచేయుటకై ఆయా శాస్త్రవేత్తలు తమ సుఖమును నిరాకరించిచేసిన ప్రయత్నముల ఫలితములే.

సాంఘికజీవనమునను ఆయాకాలములందు మహాత్మాగాంధీ అబ్రహాములింకన్ వంటి మహితచరితు లరుదెంచి చరిత్రను నూతన మార్గము త్రొక్కించిరి.

అట్లే రాజకీయరంగమునందును విశ్వమానవ కల్యాణమును దృష్టియందుంచుకొని దానిని సాధించు ప్రయత్నమునందే జీవితములు గడపిన నెహ్రూ కెన్నడీలవంటి రాజకీయవేత్తల విశాలదృక్పథమువలననే నేడు అంతర్జాతీయ సంబంధముల కొక గమ్యము దారి దొరకినది.

మతజీవితమునందును బుద్ధుడు క్రీస్తు మొదలగు మతకర్తలందఱు ముఖ్యముగా విశ్వమానవ కల్యాణమునకే యత్నించుటను మనము కనుగొనగలము. కాలక్రమమున వారి యనుయాయులకట్టి విశాలదృక్పథము లేకపోవుటచే సంకుచితత్వమువలన ఇతర మతములతోడి ఘర్షణ లేర్పడినవి. వానిని సమయజేసి విశ్వమానవ సౌభ్రాతృత్వమును నెలకొల్పుటకే మరల శ్రీరామకృష్ణపరమహంస వివేకానందు లరుదెంచి ఏరూపమున చెప్పబడినను మతములన్నిటి పరమార్థమును ఒకటియే యనియు వారివారి యభిరుచుల కనుగుణముగా వివిధమార్గములైన మతభేదము లేర్పడినవనియు ప్రబోధించుచున్నారు.

మానవచరిత్రయందు ప్రతిరంగమునను ఇట్లు ఒకవంక స్వార్థశక్తి మఱొకవంక పరార్థశక్తి పనిచేయుచుండుట కన్పించును.

నిజముగా నిట్టి విరుద్ధశక్తులున్నవా యని పరిశీలించినచో స్వార్థము పరార్థములందు నిజముగా ప్రకటితమగునది ప్రేమశక్తియేయనియు పరిమితమై ఇతరులపట్ల విరోధము నేర్పరచుకొను ప్రేమ స్వార్థమనియు అపరిమితమై యెల్లర సౌభాగ్యమును కాంక్షించు ప్రేమ పరార్థమనియు అవగతము కాకమానదు. కనుక స్వార్థప్రయత్నమువలన సాధింపబడిన పురోగతి కాని పరార్థప్రయత్నమువలన సాధింపబడిన పురోగతి కాని నిజమునకు ప్రేమవలననే, సంకుచితము విస్తృతము అగు ప్రేమవలననే, సాధింపబడినదని యేర్పడుచున్నది. కాగా సంకుచితమగు ప్రేమవలన కొందఱసౌఖ్యము సాధ్యమైనను పలువుర దుఃఖము సంప్రాప్తమగుచుండగా పరార్థమువలన కొందఱ 'దుఃఖము'వలన అనేకుల అభ్యుదయము సాధ్యమగుచున్నది. ఇతరుల అభ్యుదయమునందు ఆ 'దుఃఖము' దుఃఖముకాక నిజమైన సౌఖ్యముగా ఆత్మతృప్తిగా సార్థకజీవనముగా నెగడుచున్నది.

ఇట్టి దృష్టితో చూచినపుడు ఎల్లరయందుండు ప్రేమశక్తిని ఉద్దేశపూర్వకముగా ప్రయత్నపూర్వకముగా అభివృద్ధిచేసికొనుట తప్ప మానవాభ్యుదయమునకు వేఱొక నిర్దుష్టమైన మార్గము కలదా !

# భారతీయ సంస్కృతి

## హరిహరదాసు

మానవులు తమ జీవితమున కేర్పరచుకొను విలువలను సంస్కృతియందురు. ఇవి మానవుని మనస్సంబంధమైన వ్యాపారములందు ప్రకటితము లగుచుండును. మానవుని జీవనగమ్యము దాని సాధన విధానములతో నొదలై సంగీతము సాహిత్యము నాటకములు బుఱ్ఱకథలవఱకు ఈ సంస్కృతి ప్రతిఫలించుచునే యుండును. అనగా సమాజమున గల మాన్యతముులైన మేధావులు ఉత్కృష్టములగు విలువలను నిర్ణయించి సమాజమున గల అతి సామాన్యులగు మానవులకును వాని నేదియో యొక మార్గమున నందజేయుదురు. సజీవమగు సంస్కృతి ఇట్లు మానవ సమాజమున ఆమూలాగ్రము వ్యాపించి యుండును.

ఇక ఆ విలువలను ప్రకటించుట, వాని యన్వేషణలో సాధింపబడు విషయములు, వాని యనుభవము, అనునవి మూడును కలిసి నాగరికత యనిపించుకొనును. సాధారణముగ నాగరికతయే పై మాపులకు కన్పించుట చేతను సంస్కృతిపరిశీలనము చేయు శక్తి తీరిక జన సామాన్యమునకు లేకపోవుట చేతను ఒక నాగరికత మరియొక నాగరికతపై ప్రభావము చూపుచుండును. కాని సమాజమున నున్న ఉత్తములు సంస్కృతివిచారము చేయుచునేయుండుట వలన క్రమముగ కాలము గడచుకొలది ఉత్తమతరమగు సంస్కృతి ప్రచురమై ఇతరమగునది జనసామాన్యముచేత కూడ త్యజింపబడుచున్నది.

మానవసమాజము విస్తృతమగు కొలది వివిధసమాజములకు సంపర్కమేర్పడు కొలది ఈ నాగరికత సంస్కృతుల సమ్మిశ్రమము గాఢమై సమాజము లందలి సర్వోత్కృష్ట మానవులచేత ఉత్తమోత్తమమగు సంస్కృతి స్వీకరింపబడుచున్నది. అటుపిదప అది జన సామాన్యమున వఱకు వచ్చుటకు కాలము మాత్రమే వ్యవధానము.

ఈ విషయమును మనసునందుంచుకొని భారతీయసంస్కృతి ఎట్టిదని విచారణ చేయగా:

భారతీయుల జీవితవిలువలను వారికి పరమ ప్రమాణములగు వేదములు ప్రకటించుచున్నవి. అహం బ్రహ్మాస్మి తత్త్వమసి అయమాత్మా బ్రహ్మ ప్రజ్ఞానం బ్రహ్మ అను మహావాక్యములు ప్రకటించుచున్నవి. ఉత్తమాధికారులకు అనగా మిక్కిలి మేధావంతులకు వైరాగ్యశీలురకు ఈ మహావాక్యములలో నేయొక్కటియైనను ఒక్కసారి మాత్రమే ఉపదేశింపబడినను అది వారి జీవనగమ్యమును సాధించునదై యున్నది. అంత మేధాశక్తి అంత వైరాగ్యము లేనివారికి ఉపనిషదుపదేశములు వేదాధ్యయనములు వేదవిహిత కర్మలు కలుగుచున్నవి. వానినిగూడ నర్థము చేసికొనలేని వారికి మనుస్మృతి మొదలగు స్మృతులు మహాభారత రామాయణాది ఇతిహాసములు భాగవతము శివపురాణము మొదలగు పురాణములు లక్ష్యమును లక్ష్యసాధనవిధానమును వివరించుచున్నవి. జనసామాన్యమునకు వీనిని గూడ శ్రద్ధతో చదువు వ్యవధి లేనందునను సమాజమునకే ప్రయత్నసాధ్యమగు ధర్మాచరణమునందు ఆసక్తి కలుగక పోవుట వలనను అట్టి వారికికూడ అందునట్లుగ సంగీత సాహిత్యములు వివిధములగు కళలు వినోద కార్యక్రమములు కూడ ధర్మములనే ఆసక్తిజనకములుగ ప్రదర్శించుచు జనులకు వానియందు రక్తిని గౌరవమును కలిగించుచు జీవనగమ్యమును మరువకుండునట్లు చేయుచున్నవి.

ఇట్లు సమాజమున గల అన్ని యంతరములకును వైరాగ్య మొకటిగ లేకపోవుట చేతనే అందఱికిని సరిపడునట్లుగ ధర్మార్థ కామమోక్షములు కోరదగినవిగ నేర్పఱుపబడినవి. అనగా అతిసామాన్య మానవునకైనను సార్వభౌమునకైనను మోక్షమే పరమగమ్యము. దానికి సాధనమగు వైరాగ్యమును సంపాదించు దృష్టితోడనే అర్థకామముల యుపభోగము. అర్థకామములను సంపాదించు రీతియే ధర్మము. వారివారి యోగ్యతలనుబట్టి ఈ ధర్మార్థకామమోక్షములు కొలదిగనో గొప్పగనో మానవ జీవితమున సాధింపబడు చున్నవి.

యోగ్యతలను విచారించినచో ఉపనిషత్తులందే బ్రహ్మవిద్యకు అనగా మోక్షమునకు అర్హులగువారి యర్హతలు సూచింపబడి యున్నవి. కఠోపనిషత్తునందు నచికేతుడు యముని వద్దకు పోవును. అత డిచ్చిన మూడు వరములకును మొదట తన తండ్రి సంతోషమును, పిదప స్వర్గసౌఖ్యసాధన మగు అగ్నివిద్యను కోరును. మూడవ వరముగ అమృతత్వసాధనమగు ఆత్మవిద్యను కోరును. అనగా మానవుడు ప్రథమమున బాధ్యతలను ధర్మమును సక్రమముగ నిర్దుష్టముగ నిర్వహింపవలెను. అట్లు ధర్మ నిర్వహణము చేయుచు సాధించిన విషయభోగములను ఇచ్ఛ యున్నచో అనుభవింపవలెను. ఇవి యన్నియు తీఱిన పిమ్మటనే వైరాగ్యప్రాప్తియు మోక్షసిద్ధియు చేకూరును. గమనార్హ మగు విషయ మేమన, మొదటి రెండు వరములను సంతోషముతో నిచ్చిన యముడు తన సంతోషమును ప్రకటించుచు అదనముగ మఱియొక వరమును కూడ నిచ్చును. కాని నచికేతుడు అమృతత్వసాధనమగు ఆత్మవిద్యను కోరినపుడు యము డతని ననేక విధముల ప్రలోభపెట్టును. శతాయుష్కులైన పుత్ర పౌత్రుల నిత్తును. అపారమగు ధనధాన్యములను పశుసంపదను గజాశ్వములను సువర్ణమును ఇత్తును. నీవును నీ కెంత కాలము వలసిన నంత కాలము వీని ననుభవించుచు జీవింపుము. సార్వభౌముడవు కమ్ము. సర్వవిధములగు విషయముల ననుభవింపుము. అప్సరసలు రథాశ్వములు నృత్తగానములు నీ కేయే భోగములు కావలెనో వానినెల్ల కోరుకొనుము. ఇచ్చెదను అనును. కాని నచికేతునకు గల వైరాగ్యము విషయ త్యాగము అసదృశము. ఈ చిరజీవిత్వము నీవున్నంత కాలమే యుండును. కనుక నీ రథాశ్వములు నీ నృత్తగీతములు నీకడనే యుంచుకొనుము. నాకు కావలసిన దాత్మవిద్యయే యని నిష్కర్షగ చెప్పును. మానవు డూహింప గలుగు భోగముల నెల్ల, ఇహపర లోకములందు అనుభవింపగల భోగముల నెల్ల తృణీకరింప గలిగిననే కదా మోక్షమునకు దానికి సాధనమగు బ్రహ్మవిద్యకు అధికారము కలుగుచున్నది?

ఇట్లే ప్రశ్నోపనిషత్తునందును మునికుమారులార్గురు పరబ్రహ్మము నన్వేషించుచు పిప్పలాద మహర్షి కడకు పోయిరి. వారప్పటికే వేదవిదులు, బ్రహ్మనిష్ఠులు. ఎల్లరును వారివారి వంశములకు దీపములవంటివారు. అట్టివారు పిప్పలాదమహర్షి వద్దకు పరబ్రహ్మమును తెలియగోరి యరుగగా అతడు, మీరు మరల నొక సంవత్సరము శ్రద్ధావంతులై బ్రహ్మచర్య మవలంబించి తపోనిష్ఠులై యుండి అటుపిదప రండని చెప్పును. మోక్షమును బ్రహ్మచర్యమును సాధించుటకిట్టి ప్రయత్నము కావలెను. ఇంతటి మహోన్నత మగు అర్హత సామాన్య మానవులకు లేదు కనుకనే అర్థకామముల యనుభవము కొంతకాలము వారికనుమతింపబడినది.

**కనుక ఇట్లు ఉపనిషత్తులయందే మానవ జీవితపు విలువలు ప్రకటింపబడి యున్నవి.**

అవి సామాన్యజనుల కర్థమగుటకొఱకే ఇతిహాసపురాణములు వర్తిల్లుచున్నవి. ధర్మమే ఆచరణీయము గమ్యమే మోక్షము అని సమాజమున కలుగు కష్టనిష్ఠురములలోనే ప్రదర్శించు పంచమవేదము శ్రీమద్భారతము. మనస్తత్వపరిశీలనము మానవులకు కలుగు సమస్యలు వానికి సాధ్యమగు వివిధపరిష్కారములు మహాభారతమునందు లేనివి ఇక లేవనియే చెప్పవచ్చును. అట్లే శ్రీమద్రామాయణమునను మానవుల సమస్యలు వాని పరిష్కారములు సర్వవిధములను పరిశీలింపబడి పరిష్కారమార్గములు సూచింపబడి యున్నవి. ఉదాహరణమునకు శ్రీరాముని తమ్ములు భరతలక్ష్మణులకు ఎదురైన ఆపద ఒకటియే. అయినను ఒకరు రాముని వెంట జనగా మఱియొకరు రాముని విడిచి యుండుట కొడంబడిరి. భ్రాతృప్రేమయందు వీరిలో నొకరు తక్కువ ఒకరు ఎక్కువ అని చెప్పుట కెవరు సాహసింతురు? అట్లే రావణుని తమ్ములు విభీషణ కుంభకర్ణులు ఒకరు రావణునికై చావగా మరొకరు రావణుని చంపుటకే సాయముచేసిరి. వీరిలో గుణదోషనిర్ణయమును యోగ్యతానిర్ణయమును గాక మరి యేమి ప్రకటితమైనది? స్వయముగనే ధర్మసూక్ష్మములను గ్రహించువారు అరుదు కదా. అట్లే వేదవాక్యమగు సత్యం వద అను వచనమును స్పష్టపరచుటకు హరిశ్చంద్రోపాఖ్యానము, శ్రద్ధయా దేయమ్ అను వాక్యమునకు శిబిచక్రవర్తి గాథయు, ఇతిహాసములందు ప్రచురములై యున్నవి. సర్వజనరంజకముగ కావ్యగానము చేసిన తులసీదాసు సంగీత విద్వాంసులైన పురందరదాస త్యాగయ్యలు క్షేత్రయ్యపదములు ఇట్లు అత్యంత సామాన్యులగు జనులకు సైతము వేదాంతమందింపబడినది. భారతీయ విలువలు యక్షగానము లందును వీధినాటకములందునుకూడ ప్రతిఫలించుచు పల్లెలయందలి ఆలకాపరులకు రాజాధిరాజులకు పురుషార్థము పరమగమ్యముగ ప్రకటముగ నిలువబెట్టుచున్నవి.

భారతీయ విలువలు వారి నుడికారమున కూడ వినిపించును. మానవుడు చనిపోయిన, భారత దేశమందు అతడు 'దివం'గతు డగును. అనగా ఇతరములగు ఆస్తిపాస్తులను వలె శరీరమును గూడ నిచ్చటనే వదలి మానవుడు స్వర్గమునకు పోవును. పాశ్చాత్యులు దీనినే ఆత్మను వదలుకొనుట అందురు. (to give up the Ghost). అచ్చట మానవు డన ఆ శరీరమే. దానికి గల యొక ఉపకరణము మాత్రమే ఆత్మ.

ఇట్లు మోక్షమును సాధించు వేదాంతము ఇష్టదైవము నారాధించుట ద్వారా ఆచరణీయమై పలువిధములగు మతములకును మతావలంబనమునకును ప్రోదిచేసినది. ఏ ఇష్టదైవము నారాధించినను పర్యవసానమున జన్మాంతరములందైనను బ్రహ్మసాక్షాత్కారమే సాధనీయమగునది యని మహాత్ముల చరిత్రలు ఋజువు చేయుచున్నవి. భారతీయ సంస్కృతి యందు మోక్షము పరమగమ్య మని ఇట్లు వ్యవస్థితమైనది.

దీనిని నిరంతరాయముగ తరతరముల కందించు విధానమే గురుశిష్యసంబంధము. తాను నేర్చినది ఇతరుల కందింపవలెను. లేనిచో గురువుల ఋణము తీఱదు. ఋణగ్రస్తుడై అతడు పాపము చేసినవా డగుచున్నాడు. ఈ గురుశిష్యసంబంధముకూడ వేదప్రోక్తమే. శిష్యులకు వేదములను గఱపి ఆచార్యుడు స్వాధ్యాయ ప్రవచనాభ్యాం న ప్రమదితవ్యమ్ అని అనుశాసనము చేయుచున్నాడు. శిష్యుడు స్వాధ్యాయమును అనగా విద్యనేర్చు

కొనుటను విద్యాభ్యాసము పూర్తియైన పిదప కూడ ఏమరక యుండవలెను. అట్లే ప్రవచనమునందు అనగా తాను నేర్చినది ఇతరులకు బోధించుటయందును ఏమరక యుండవలెను. ఉపాసకధర్మముల నుపదేశించు వేదము ఋతం సత్యం దమః శమః అని ప్రత్యేకముగ నొక్కొక్క దానిని పేర్కొనుచు ప్రతిదానికిని స్వాధ్యాయప్రవచనేచ అని పదింబదిగ పేర్కొనుచు వాని ప్రాముఖ్యము నుద్ఘాటించుచున్నది. సత్యమును ఋతమును శమమును దమమును అతిథులను సంతానమును మానవుడు ఆదర్శవంతముగ పాటించుటను నేర్వవలెను. అట్లు పాటించుట నితరులకు నేర్పవలెను. ఇట్లు గురుత్వమనగా నోటిమాటలు కాక నిత్యజీవితమున మోక్షసాధనకై గురుడాచరించి చూపు వేదవిహితమైన శీలము. అట్టి గురుని ఆదర్శముగ స్వీకరించి శిష్యుడును మోక్షసాధనకై యత్నించును. తానెంత జాగ్రత్తగ నున్నను ప్రమాదము లేవైన కల్గినవేమో అని గురువు యాన్యనవద్యాని కర్మాణి తాని సేవితవ్యాని నో ఇతరాణి అని శిష్యునకు చెప్పును. గురువు ఉత్తమశీలసంపన్నుడగుటచేత తన శిష్యుని ఉత్తమశీలమందు నమ్మకము కల్గి ఈ మాటలు త్రికరణశుద్ధిగ ననును.

గురుశిష్యసంబంధ మెప్పుడు అర్థవంతమగు ననగా తా నుపదేశించు విద్యకు ఫలము గురువు జీవితమున ప్రతిఫలించి నపుడే. బ్రహ్మసాక్షాత్కారమే జీవనగమ్యమని బోధించు గురువునకు కొంతవఱకైనను బ్రహ్మసిద్ధి కలుగవలెను. 'కొంతవఱకు' అను పదము యోగ్యతను సూచించును. బ్రహ్మసిద్ధియందు కొద్ది గొప్పలు లేవు, అది కలుగును లేదా కలుగదు. కలిగిన పిమ్మట ఇక కలుగవలసినదేమియు మిగులదు. కలుగనంతవఱకు దానికి కావలసిన యోగ్యతను సంపాదించు ప్రయత్నము జరుగుచుండును. యోగ్యత చేకూరు కొలది గురువు జీవితము నిష్కలంక మగుచుండును. శిష్యునకు గురువునందు శ్రద్ధావిశ్వాసములను కలిగించునది ఈ యోగ్యతాయుతమైన నిష్కలంకజీవనము మాత్రమే. ఈ గురుశిష్యసంబంధము బడిలోని అధ్యాపకునకు బడిపిల్లలకు మాత్రమే పరిమితము కా(రా)దు. ఏవిషయమునందైనను ప్రతి మానవుడును తా నింకొకరికి నేర్పగలుగుచు ఇంకొకరినుండి నేర్చుకొనుచు జీవింపవలెను. ఒకరి జీవితమును చూచి మఱియొకరు నేర్చుకొనగలుగునట్లు ప్రతివారును జీవింపవలెను. ఇట్లు జీవితమునకు ఆదర్శమును గుర్తించి దాని కనుగుణముగ ప్రయత్నము చేసిననే ఏ విద్యయైనను సార్థకమై బ్రహ్మసిద్ధికి సహకారక మగుచున్నది.

భారతీయసంస్కృతి విలువలగు సత్యము అహింస సోదరమానవులపట్ల సానుభూతి ధర్మాచరణము మొదలగునవి, వానినే పరమార్థములుగ స్వీకరించినచో లౌకికము లగుచున్నవి అట్టి లౌకిక విలువలకు పరాకాష్ఠలుగ మన దేశమున గాంధీమహాత్ముడు రాజా రామమోహనరాయ్ బాలగంగాధరతిలక్ సర్దార్ పటేల్ వంటి మహానుభావులు ఎందఱో జనించి యున్నారు. వారిచే నుద్బోధితులై ఎందఱో సాంఘికసంక్షేమకర్తలు దేశభక్తులు మేల్కొనిరి. ఇట్టి విలువలను సహకారములుగను బ్రహ్మసాక్షాత్కారమును పరమార్థముగను గుర్తించి ఈ ప్రపంచము నిస్సారము భగవత్సాక్షాత్కారము తప్ప మఱియొక ప్రయోజన మీ ప్రపంచమున లేదని యుద్ఘా

టించు మహాత్ములు శ్రీరామకృష్ణపరమహంస శ్రీరమణమహర్షి వంటివారు జీవద్వేదములుగ జనించుచుందురు.

భారతీయసంస్కృతికి బ్రహ్మసాక్షాత్కారము తల్లివేరు వంటిది. దానిని సాధించి ఇతరులచేత సాధింపజేసి వారిద్వారా మఱి యితరులచేత గూడ సాధింపజేసిన మహానుభావుడు శ్రీరామకృష్ణపరమహంస. ఈ జన్మయందే బ్రహ్మసాక్షాత్కారము సాధ్యమని తన మానుషజీవనముననే ప్రదర్శించిన గురువు శ్రీరామకృష్ణులు. వారి నాదర్శముగ గొని వారి శిక్షణనంది బ్రహ్మసాక్షాత్కారమును సాధించినవారు శ్రీవివేకానందస్వామి శ్రీరామకృష్ణానందస్వామి శ్రీబ్రహ్మానందస్వామి శ్రీ శారదానందస్వామి మొదలగువారు. వీరిచే గూడ సుశిక్షితులై బ్రహ్మసాక్షాత్కారము నందిన విరజానంద శుద్ధానందాది ప్రశిష్యగణము లెక్కకు మీఱియున్నది. పాశ్చాత్యులు 'భారతీయులు వట్టి యనాగరికులు. క్రైస్తవ మిషనరీలు వారిని నాగరికులుగ చేయవలసియున్నది' అను అచంచల విశ్వాసము కలిగియున్న కాలముననే వీరిలో పలువురు పాశ్చాత్యదేశముల కరిగి భారతీయ సంస్కృతికి మూర్తరూపములుగ నిలిచిరి. మాక్స్‌ముల్లరు పాల్‌డాయ్‌సన్ మొదలగు పాశ్చాత్య విద్వాంసులు భారతీయ తత్త్వశాస్త్రముయొక్క ఔన్నత్యమును గుర్తించిరి. భారతసంస్కృతి ప్రతిరూపమైన శ్రీ వివేకానందస్వామి సాంగత్యమును కోరిరి. శ్రీరామకృష్ణుల జీవితముచే నాకృష్టుడై మాక్స్‌ముల్లరు the life and teachings of Sri Ramakrishna (శ్రీ రామకృష్ణుల జీవితము తద్బోధలు) అను పుస్తకమునుగూడ వ్రాసెను.

ప్రస్తుత పరిస్థితి ఇట్టిది. మేధాసంపన్నుల స్థాయియందు భారతీయ సంస్కృతి సర్వోత్కృష్టముగ నిలిచినది. ఇక అది జనసామాన్యము వఱకు రావలసియున్నది. అనగా భారతీయులు సర్వులును భారతీయసంస్కృతి యౌన్నత్యమును గుర్తించి దాని యాదర్శమును తమ జీవితములం దంగీకరించి మరల సగర్వముగ తల యెత్తి నిలిచినప్పుడే పాశ్చాత్య దేశములన్నియు భారతదేశమునకు భక్తిశ్రద్ధలతో నీరాజనము లిచ్చును. ప్రస్తుత సమయమున భారతీయుల వేదములు ఇతిహాస పురాణములు చదువుట యందు వాని యర్థగాంభీర్యమును గ్రహించుట యందు యువతరమునకు సామర్థ్యము లేదు. వారికి వారి సాంస్కృతిక భాష యగు సంస్కృతము రాదు. విదేశీయ సాంస్కృతిక భాష యగు ఆంగ్లమును సవ్యముగ రాదు. కనుకనే రెండు విధముల భ్రాంతులై వారు పైపై మెఱుగులచే ప్రలోభితు లగుచున్నారు.

కనుక భారతీయ సంస్కృతీ ప్రచారమునకు ప్రస్తుతము కావలసిన దేమన భారతీయ తత్త్వశాస్త్రములు ఇతిహాస పురాణ కావ్య సంగీత సాహిత్యాదు లన్నింటను భారతీయాదర్శమెట్లు ప్రకటింపబడినదో జనులకు ప్రాంతీయ భాషలలో సుగమముగ తెలియజెప్పుట. ఎల్లరును అట్టి ఆదర్శవంతమగు జీవనము గడప ప్రయత్నము చేయుట. అనుక్షణమును మనలో ప్రతియొక్కరును మన జీవన గమ్యమును సాధించు ప్రయత్నమును త్రికరణశుద్ధిగ చేయ ప్రయత్నించిన గదా భరతవర్షము మరల నచిరకాలములోనే ద్విగుణీకృతమైన ప్రాచీన వైభవముతో రాజిల్లును!

ఓమ్ - తత్సత్

# శ్రీకృష్ణావతారము

విద్వాన్ పమిడికాల్వ చెంచునరసింహశర్మ

## పూర్వార్థము

"యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత! అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్" అన్ని నుడివిన తన వాగ్దానము ప్రకారము భగవానుడు స్వీయ లీలాగృహీత శరీరుఁడై యనేకవిధముల లోకోద్ధరణ కార్య ప్రవర్తకుఁడై వెలయుచుండుట సార్వకాలిక ప్రత్యక్ష ప్రమాణసిద్ధము. అమ్మహానుభావుని దివ్యజన్మకర్మ లనంతములు. "అన్ని రూపులు దనరూపమైనవాఁడు" అన్నపు డొకటి యని నిర్ధారణ మేమున్నది? కాని యది యంతర్విశ్వ నాటక విషయము. బాహ్య జగన్నాటకములో ముఖ్యముగా దశావతారములు మాత్రమే సుప్రసిద్ధములైనవి. భాగవతములో నిరువది యొక్క యవతారములు పరిగణింపఁబడినవి. కాని ధర్మస్థాపనాది మహాకార్యఘటనలకు సమర్థమైనవి పదియనియే పెద్దల నిర్ణయము. అవి "మత్స్యః కూర్మవరాహశ్చ నారసింహశ్చ వామనః రామోరామశ్చ రామశ్చ బౌద్ధః కల్కిరేవచ" అన్నారు. దీనిలోఁ గొంత గొడవ యేర్పడినది. పై జెప్పఁబడిన రామత్రయములో బలరాముఁడున్నాడు. సర్వశక్తి సంపన్నుఁడైన శ్రీకృష్ణభగవానుఁ డా పట్టికలో జేరలేదు. అక్కడనే వచ్చినది చిక్కు.

శ్రీకృష్ణుఁ డవతారమూర్తియే యగుట నిజముకాదా? బలరామునికంత విశిష్టస్థాన మిచ్చి సర్వలోకపాలుని జగన్మోహన వేణుగానలోలుని సామాన్యగోపాల బాలునిక్రింద దిగదుడిచి 'ఓటింగు' హక్కుగూడ లేకుండ జేయుటలో మనవారి యుద్దేశము కొంత నిగూఢమయినదనియే భావింపవచ్చును. ఇది యొక చిదంబరరహస్యము. అసలు భగవంతుని వాగ్దానము దేవకీదేవి యష్టమగర్భము. అష్టప్రకృత్యాశ్రయము దానికే యొప్పినది. దుష్ట శిక్షణ శిష్టరక్షణలకు ప్రధానమైనదదియే. ఈ విషయము పోతన మహాకవి దేవకి గర్భరక్షణ వర్ణనములో వెల్లడించియున్నాడు. "సలిలమా యెలనాగ జఠరార్భకుని గానఁ జనిన కైవడి ఘర్మసలిల మొప్పె నొగి తేజమా యింతి యుదరడింభకుఁ గొల్వఁగదిసిన క్రియ దేహకాంతి మెఱసె–" ఇట్లే పంచభూతములు మనోబుద్ధ్యహంకారములు మున్నగునవి యాశ్రయించి యప్పరమేశ్వరుని లీలామానుష దేహ నిర్మాణమును పూర్తిచేసినవి. ఏ దేహమునకైనను నివి ముఖ్యములే. కాని యవి యా గర్భస్థుడైన బాలుని సేవించుటకై చేరిన వనుటలో బోతనగారి భావము మిన్నుముట్టినది. ఆ చర్చ మున్ముందు రాఁగలదు.

ఈ మూర్తి శ్రీకృష్ణునిది. ఇదియే సప్తావరణ విలక్షణమైన పరమాత్మ యష్టమ గర్భ జననము. దేవకి సప్తమగర్భము "నాశేషాఖ్య తేజ"మని భగవానుఁడే స్వయముగా యోగమాయాదేవితో జెప్పియున్నాడు. తర్వాత "ఆనకదుందుభి మనమున శ్రీనాథుం డంశభాగశిష్టత నొందె"నని చెప్పఁబడినది. అంతకు ముందు వసుదేవునికి భగవదావేశము కాలే దనియే చెప్పవచ్చును. ఇట్టి పరిస్థితులలో నే యవతారము గ్రాహ్యమో నిర్ణయమునకు రాక 'రామ' శబ్దము పరమాత్మకన్వయించుటచే నట్లైన సరిపడునని ముందు జనించిన బలరామునే యెన్నుకొన్నారు. అంతేకాక

రామావతారమునుండి వచ్చినవానికి గ్రమముగా దైవికశక్తిసామర్థ్యములు 'బహుళపక్ష శీతభానుని పగిది' నున్నట్లు తోచును. అట్టిచో నమేయ ప్రభావసంపన్నుండైన శ్రీకృష్ణునిఁ బరశురాముని వెనుక జేర్చుటయు సక్రమమే యగును. అందువలననే మిగ్గురు రామమూర్తులు తరగతివారిగా నెన్నుకొనబడిరి. మొదటినుండి నృసింహమూర్తివఱకు జంతురూపములు. ఆస్వరూపమేదియుఁ గానిది. తర్వాతవచ్చిన వామనమూర్తి బ్రహ్మచారి. శ్రీరాముఁ డేకపత్నీవ్రతుఁడు పరశురామునికి రక్తపిపాసయేకాని రక్తిలేదు. అతని ప్రక్కనఁ గమ్మని కైపులో గంధర్వనగరాలు చూచుచుండు బలరాముఁ డుండఁదగినవాఁడు కాని గోపికలను, అష్టభార్యలను పదియాఱువేల రాజకాంతలను, సమాధానపఱచుచుఁ బూసలలో దారమువలె మెలఁగనేర్చిన శ్రీకృష్ణభగవానునిఁ జేర్చుట యిసుకలోఁ జక్కెర గల్పినట్లుండును. అందుకే బలరామునికి స్థానమందినది.

ఇట్లు ప్రత్యేకించబడిన శ్రీకృష్ణుఁడు కేవలమొక విష్ణ్వంశభవుడనుటయే ప్రధానముగాదు. త్రిమూర్తుల కాదియగు పరాశక్తియొక్క ప్రత్యేక మహాపురుషావతారమని దేవీభాగవతకారులు నిర్ణయించినవిధమే సమంజసముగా నున్నది. లేకున్న "యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహం" మ్మనగల్గిన యవతార మేదీ? ఎవరెట్లు భావించిన నట్లే తోచు మహామాయావిలాసము సకలవిశ్వాకర్షణశక్తి, సర్వమయియగు నా జగజ్జననికిఁ దప్ప మఱెవ్వరికున్నది? ఆమెయే సర్వభావాతీతమగు పరబ్రహ్మమనియు జెప్పఁబడుచున్నది. ఈ విషయమంతయు గ్రహించినవాఁడు కావుననే పోతన మహాకవీంద్రుడు గ్రంథారంభమునుండియు శ్రీకృష్ణుని విషయమునఁ బైవిశిష్టభావములనే ప్రకటించుచు వచ్చినాడు. అసలు భాగవత కల్పతరువే "లలితస్కంధము కృష్ణమూల" మన్నాడు. "కర్షతీతి కృష్ణః" అను వ్యుత్పత్తిచే సర్వాకర్షణశక్తి బీజాంకురమే శ్రీకృష్ణస్వరూపము. అదియే భాగవత కల్పతరువుయొక్క వేరు. దాని స్థూలరూపము "లలిత" యైనది. శాక్తేయసిద్ధాంతములో సర్వోత్కృష్టమైన రూపము లలితాంబ. ఆమె మొదటిపేరే మాతృశ్రీ. "శ్రీమాతా శ్రీమహారాజ్ఞీ శ్రీమత్సింహాసనేశ్వరీ" (లలితా సహస్రనామము) అని చెప్పఁబడినది. కావున నా తరుస్కంధము "లలిత" యనుట నిస్సంశయము. ఇక "శుకాలాపాభిరామము" అనగా నామె యంశమే వాగ్దేవతయైయుండ నమ్మహాశక్తి పల్కులు శుకాలాపాభిరామము లనుటలో సందియమేమి? "మంజులతాశోభితము" సర్వజగన్మోహిని యగుటచే మనోహర దివ్యతేజఃస్ఫూర్తి యామెకు సహజసిద్ధమే. "సువర్ణ సుమనస్సుజ్ఞేయము" గుణత్రయ వర్ణనిర్ణయములో శుద్ధశ్వేతవర్ణ భావితము సత్త్వగుణము- అట్టి సాత్త్వికభావులచేఁ దెలియదగిన జ్ఞానస్వరూపిణి యని భావము. "సుందరోజ్జ్వల వృత్తంబు" ఆ జగజ్జనని విశ్వసౌందర్యవిలాసిని గదా? అందులో నుజ్జ్వలసౌందర్యము సత్య సౌందర్యము. అట్టి సౌందర్యలహరి యనుట నగ్నసత్యము. "మహాఫలంబు" ఇతర దేవతలకన్న నమ్మహాదేవిలోగల విశేషాంశమిదియే.

"భయాత్రాతుం దాతుం ఫలమపిచ వాంఛా సమధికం" (సౌందర్యలహరి) అన్నట్లు 'అభీప్సితాధిక ఫలదాయిని' యని భావము. "విమల వ్యాసాలవాలము." పరిశుద్ధవిస్తార

స్థితి గలది. "శరజ్జ్యోత్స్నా శుద్ధాం శశియుత జటాజూట మకుటామ్" (సౌందర్యలహరి) అన్నారు శంకరులవారు. అట్టి చిత్కళాభాసితమే భాగవత కల్పతరువు. ఆ పరదేవియొక్క పురుష స్వరూపుడే శ్రీకృష్ణుఁడు కావున భాగవతము కృష్ణమూలము. తక్కిన యవతార గాథలకన్న కృష్ణావతార చరిత్రయే యిందు సమగ్రముగా జెప్పబడినది. అందలి విషయమంతయుఁ బైపద్యమునకు సమగ్రవ్యాఖ్యానమై యున్నది. ఆ చర్చ ప్రకృత కర్తవ్యాంశము కాదు.

ముందు పోతనకు సాక్షాత్కరించినది శ్రీరామమూర్తి. గ్రంథము రామాంకితము. ప్రారంభ దైవస్తుతి శ్రీకృష్ణ పరము. ఆత్మార్పణభక్తి తద్వారా స్వీయకైవల్య ప్రాప్తియు నందలి విషయము. ఈ యత్యున్నత విచిత్ర భావదృష్టిలో నతనికి రామమూర్తిని మఱుగుపఱచి శ్రీకృష్ణుని ముందిడుకొని. జగన్మాతయే గోచరించినది. చూడుడు! "శ్రీకైవల్యపదంబు జేరుటకునై చింతించెదన్" అని ప్రారంభించినాడు. కొన్ని విశేషణములతో పద్యము సాగినది. చివర నామకరణము దగ్గర ధ్యేయమూర్తి యే యమ్మకొడుకో చెప్పలేక "మహానందాంగనాడింభకున్" అని శ్లేషలో చమత్కరించి యా సమస్యను గడచినాడు. మహా+నందాంగనాడింభకుడు అనగా 'గొప్ప ఇల్లాలైన యశోదకొడుకు' అని యొక యర్థము. మహానంద+అంగనాడింభకుడు అనగా బ్రహ్మానంద స్వరూపిణియైన మూలప్రకృతి ముద్దుబిడ్డడని వేఱొక యర్థము. ఇట్లు సరిచేసి తన సహజ పాండిత్య ప్రకర్షను వెలయించినాడు. ఇట్లే చాల చోట్ల శ్రీకృష్ణుని పరబ్రహ్మస్వరూపునిగా వర్ణించియున్నాడు.

శ్రీకృష్ణుని శైశవక్రీడలను వర్ణించుపట్టున 'అవ్వల నెఱుగక ముప్పురికవ్వల వెలుగొందు పరము దర్భకుడై యా యవ్వలకు సంతసంబుగ నవ్వా యవ్వా యనంగ నల్లన నేర్చెన్" అన్నాడు. మఱియొకచోట "బ్రహ్మాది సురులకు భావింపగా రాని బ్రహ్మంబు గోపాలబాలుఁడయ్యె" నన్నాడు. వేరొక తావున 'ఏ హానివృద్ధుల నెఱుగని బ్రహ్మంబు పొదిగిటిలో వృద్ధిబొందజొచ్చె" నన్నాడు. ఈ బాల్యక్రీడలందే శ్రీకృష్ణుని త్రిమూర్త్యాత్మకత్వము తద్విలక్షణతయు నొక్క పద్యమునందే పూర్తిచేసినాడు.

"చెయివుల్ సేయు తరిన్ విధాత కరణిన్
జెన్నొందు సంతోష దృ
ష్టియుతుండై నగుచున్ జనార్దనుని
మాడ్కిన్ బొల్చు రోషించి యు
న్నయెడన్ రుద్రుని భంగి నొప్పును
సుఖానందంబునన్ బొంది త
న్మయుఁడై బ్రహ్మముభాతి బాలుఁడమరున్
బాహుళ్య బాల్యంబునన్."

ఇట్టివి భాగవతమునఁ గోకొల్లలు. ఇవన్నియుఁ బరిశీలింపగా శ్రీకృష్ణావతారము మామూలు దశావతారములలోనిది కాదని విస్పష్టమగుచున్నది. ఈ రీతిగాఁ బోతన మహాకవి "విబుధ జనులవలన విన్నంత కన్నంత తెలియవచ్చినంత" తేట పఱచినాడు.

"కరాంగుళి నఖోత్పన్న నారాయణ దశాకృతిః" అని లలితాసహస్రనామములో గలదు. అందుచే కృష్ణావతార మా నారాయణదశరూపములలో జేరిన పరశురాముని వెనుక జేర్పంబడవలసినది కానేరదు. ద్వాపరాంతమున రేగిన భారతసంగ్రామాది యతిదుర్ఘట కార్యనిర్వహణమునకై నారాయణాంశము

నాధారముగా గొని సర్వసృష్టిస్థితిలయకారిణి యగు పరమేశ్వరి ప్రత్యేక రూపముతో నవతరించె ననుట యథార్థము. "ఆదిత్యానామహం విష్ణుః" "రుద్రాణాం శంకరశ్చాస్మి" "వృష్ణీనాం వాసుదేవోఽస్మి" ఇత్యాది వాక్యములు ఆ విరాట్ స్వరూపిణివి కాక మఱెవ్వరివి? ఈ స్త్రీ పుం భేదము వ్యావహారిక మే కాని పారమార్థికము గాదు. అన్నిటి కతీతమైనది యా విశుద్ధమూలప్రకృతి శక్తి. మనము భగవతి యనవచ్చును. భగవానుఁ డనవచ్చును. ఇందు గుణ భేద ముండవచ్చును. కాని వస్తుభేదము లేనే లేదు. ఇది మఱువరాని విషయము.

కావున నా ద్వాపరాంతమున వెలసిన సామాన్యావతారము బలరామమూర్తియే. కాని కార్యభారమునుబట్టి పరాశక్త్యంశము శ్రీకృష్ణరూపముతో ప్రభవింపవలసివచ్చినది. అయినచో భాగవతకారుడు చెప్పినది యసత్యమా యనవచ్చును. అందును గొంత వ్యావహారిక సత్యత్వమున్నది. నరనారాయణు లను నిద్వారు మహామునులు శ్రీమన్నారాయణుని గూర్చి గంధమాదన పర్వత ప్రాంతమునఁ దపస్సు చేయుచుండ వారి ద్వారా భూభారమును దీర్పనెంచి యావిష్ణుభగవానుఁడు వారిలో నావేశించియున్నట్లును, అందు నరుఁ డర్జునుఁడుగను నారాయణుఁడు శ్రీ కృష్ణుఁడుగను ప్రభవించిరని మహాభారతమున జెప్పఁబడియున్నది. ఈ సూక్ష్మబీజమే విష్ణుపారమ్యమగు భాగవతమున మహావృక్షముగా పరిణమించినది. అసలు భాగవతమే వ్యాసప్రోక్తము కాదని వాదించు వారును గలరు. బోబదేవు డను వైష్ణవకవి యెవ్వడో రచించె నని కొంద అనుచున్నారు. ఎవరెట్లు తలంచినను భాగవతము భక్తజన కల్పక మనుట నిర్వివాదాంశము. దేవీ భాగవతములో చండముండాది దుష్టదైత్యసంహారార్థమై యాదిశక్తి మహాకాళీ స్వరూపముతో నావిర్భవించి కడపట బ్రహ్మాది దేవతల జయజయ ధ్వానముల సందడిలో నానంద తాండవము సల్పుచుండ నీశ్వరుడు హర్షాతిరేకముతో దన హృదయముపై నాట్యము సేయుచున్నట్లును అప్పుడా మె శివుని బరుండబెట్టి హృదయరంగమున నటించుచుండ నాతడు "నీవు పురుష రూపముఁ దాల్చి క్రీడింపవలయు" నని కోరగా నామె "నేను త్వరలో శ్రీకృష్ణావతారము నెత్తవలసి యున్నది. అప్పుడు మీరు స్త్రీరూపము నవధరించిన యెడల మీ కోర్కె దీర్చెద" నన్నట్లును అట్లే యాయన యొక కాంతయై యభీష్టసిద్ధి నొందినట్లును చెప్పఁబడినది.

ఈవిధముగా శ్రీ కృష్ణావతారము తుదకు "యే యథామాం ప్రపద్యంతే" అను వరుసకే దిగినది. ఇవన్నియు బర్యాలోచన సేయగా పోషణకర్తృత్వ నియత మగు విష్ణ్వంశమును ముందుంచుకొని కార్యభార మంతయు సర్వసృష్టిస్థితిలయకారిణి యగు మూలప్రకృతియే వహించియున్న సమగ్రశక్తిసామర్థ్యోపేత మగు పురుషోత్తమ రూపమే శ్రీ కృష్ణావతార మని కచ్చితముగా చెప్పవచ్చును.

రుద్రతేజోమహితుఁ డగు నాంజనేయుఁడు వాయుపుత్రుఁ డనుట జగత్ప్రసిద్ధమైనట్లు కృష్ణునియెడ విష్ణుభావము బహుళప్రచారము నందినది. భగవద్విషయమున నెట్లు భావించినను దప్పేమియు లేదు. ప్రమాద మేదియు రాదు. సక్రమ విషయనిర్ధారణమునకట్టి చర్చ లావశ్యకములు. "ఆకాశాత్పతితం తోయం యథా గచ్ఛతి సాగరమ్, సర్వదేవ నమస్కారం కేశవం ప్రతిగచ్ఛతి" అన్నట్లు సర్వభావములు తుదకుఁ బరాత్పరునియందే లయ మగుచున్నవి గదా!

# యువకులకు శ్రీ వివేకానందుల పిలుపు

## మానవసేవ

నామాట వినుడు. మీ కళాశాల చదువు ముగియగనే పరుల సేవయందు మీరు పూర్తిగా నిమగ్నులు కండు. అప్పుడు మీకు కలుగు ఆనందము, ఒక ఖజానా ధనము వజ్ర మాణిక్యములు మీ వశమైనప్పుడు కలుగు ఆనందమునకన్న ఎన్నో మడుంగు లధికము... పేదరికమును గూర్చిన తలపులు కట్టిపెట్టుడు. ఏ విషయమున మీరు పేదలు? మీ కొక సారటు బండి గుర్రములజోడు అడుగులకు మడుగులొత్తు సేవకబృందము లేరని మీకు పరితాపమా? లేకున్న నేమి? మీ హృదయ రక్తము ధారపోసి యితరులకై అహోరాత్రములు పాటుపడినచో జీవితములో మీరు సాధింపలేని దేదియు ఉండనేరదని మీకు అణుమాత్రమైనను తెలియుటలేదు.

చూడుడు! ఇన్ని సంవత్సరముల నుండియు చేసిన భారతదేశపర్యటనలలో నేను పలువురు మహాత్ములను, దయారస పరిప్లుతహృదయులను దర్శించియున్నాను. వారి పాదసన్నిధిని కూర్చుండినప్పుడు ఒక మహాశక్తిప్రవాహము నా హృదయములోనికి ప్రవహించుచున్నట్లు అనుభూతి చెందితిని. నేను మీతో ప్రసంగించుచున్న మాటలన్నియు వారి సాంగత్యముచే కలిగిన శక్తిప్రసారలబ్ధములే.

మనకు శ్రద్ధ కావలెను. ఆత్మవిశ్వాసము కావలెను. బలమే జీవనము. బలహీనతయే మరణము. శ్రద్ధయను భావమును పోగొట్టుకొనుటచేతనే ఈ దేశము శిథిలమై పోయినది. కావున ధీరమానవులను తయారుచేయుడు. మనకు కావలసినది ధీరులు. శ్రద్ధలోపించినచో ధీరు లెట్లు తయారగుదురు? ఏ విద్యచే శీలము నిర్మిత మగుచున్నదో మానసికశక్తి వృద్ధి చెందుచున్నదో బుద్ధి వికసించుచున్నదో దేని వలన వ్యక్తి స్వశక్తిపై నాధారపడగలడో అట్టి విద్య మన కావశ్యకము.

ఉపనిషత్కథలను మీరు చదువలేదా? మీ కొకటి చెప్పెదను. సత్యకాముడను వాడు గురుసమక్షమున బ్రహ్మచర్యజీవితము గడపుటకై పోయెను. గురువుగారు అతనికి కొన్ని ఆవుల నొప్పగించి వానితో అతనిని అడవికి పంపెను. ఎన్నో నెలలు గడచిన పిదప ఆ ఆవులు రెండింత లగుటను కనుగొని సత్యకాముడు గురుసమక్షమునకు తిరిగిపోవ నుద్యుక్తుడయ్యెను. అతనికి ఆ తిరుగు మార్గములో ఒక యెద్దు అగ్ని మరికొన్ని జంతువులు సర్వోత్కృష్టమైన బ్రహ్మజ్ఞానమును బోధించినవి. శిష్యుడు తిరిగి రాగనే అతని ముఖకవళికలను ఒకసారి చూచుటతోడనే అతనికి బ్రహ్మసాక్షాత్కారము కల్గినట్లు గురువుగారు గ్రహించిరి. యథార్థమైన విద్య, ప్రకృతి సాహచర్యమును విడువక జీవించుటనే సంప్రాప్తమైన దని ఉపదేశించుటయే యీ కథలోని నీతి.

మానవుడు అగ్నివలె జ్వలించుచున్న శీలము గలవారి సాన్నిధ్యమున తన బాల్యమునుండియు జీవింపవలెను. ఉత్తమవిద్యకు సజీవ తార్కాణము అతని యెట్టయెదుట నుండవలెను. ప్రతి బాలుడును అస్ఖలితబ్రహ్మచర్యము నవలంబించు నట్టి శిక్షణ నీయవలయును. అప్పుడే, అప్పుడు మాత్రమే, శ్రద్ధావిశ్వాసములు లభ్యము లగుచున్నవి. మన దేశమున సర్వకాలములందును త్యాగపురుషులే జ్ఞానబోధ గావించిరి. మనము రామాయణము మహాభారతము ఉపనిషత్తుల నుండి చిన్న చిన్న కథలతో కొన్ని పుస్తకములను చాల సరళమైన భాషలో రచింపవలెను.

ఆ పుస్తకములను మన చిన్న పిల్లలకు చదువుట కీయవలెను.

శక్తి మొదలగునవి వాని యంతట నవియే వచ్చి చేరును. మీరు పనికి ఉపక్రమించినచో మీలో ఎట్టి అఖండశక్తి ఉత్పన్న మగుననగా మీరు దానిని భరించుటయే కష్టమనిపించును. పరులకై యొనర్చిన ఎంత స్వల్ప కార్యమైనను మీయందున్న శక్తిని జాగృత మొనర్చి క్రమముగా మీ హృదయమున సింహబలమును చొప్పించును. నేను మి మ్మెంతగానో ప్రేమించుచున్నాను. కాని మీ రందఱును పనిచేయుచూ మరణింపవలె ననియే ఆకాంక్షింతును. మీ రట్లు చేయుట ఒకవిధముగ నా కానందదాయకమే యగును.

---

# భక్తిరత్నావళి

మూలము :
**శ్రీవిష్ణుపురి**

వ్యాఖ్యాత :
**విష్ణుచిత్తుడు**

(ప్రథమ విరచనము)

## 70-71

ఉద్ధవు డింకను చెప్పుచున్నాడు.

నాయం శ్రియోంగ ఉ నితాంతరతేః ప్రసాదః స్వర్యోషితాం నలినగంధరుచాం కుతోన్యాః
రాసోత్సవేఽస్య భుజదండగృహీత కంఠలబ్ధాశిషాం య ఉదగాద్వ్రజవల్లవీనామ్ ॥
ఆసామహో చరణరేణు జుషామహం స్యాం వృందావనే కిమపి గుల్మలతౌషధీనామ్
యాదుస్త్యజం స్వజనమార్యపథం చ హిత్వా భేజుర్ముకుందపదవీం శ్రుతిభిర్విమృగ్యామ్ ॥
(10-47-60, 61)

వ్రజపురమునందలి గోపికలు రాసక్రీడయందు శ్రీకృష్ణుని బాహువులను తమ భుజములపై ధరించు నపురూపమహాద్భాగ్యమును బడయగల్గిరి. పద్మగంధులగు నప్సరసలు కాని తుదకు నిరంతరము అతని చెంతనే యుండు లక్ష్మీదేవి కాని ఇట్టి యదృష్టమునకు నోచుకొనలేదనిన ఇతర భక్తులమాట చెప్పనేల?

ఈ గోపికలు తమ బంధుజనులను ఆప్తవర్గమును సచ్ఛీలమును కూడ విడనాడి వేదములు వెదకు శ్రీకృష్ణపదాబ్జములను వెదకుకొనిరి. అట్టివారి పాదధూళిచే కప్పబడుటకు నేను బృందావన మందలి యొక తీగగనో పొదరిల్లుగనో ఉండగల్గుట ఎంతటి యదృష్టమో కదా!

## 72

భక్తికి మాత్రమే భగవంతుడు వశుడైనచో భగవంతుడు పక్షపాతియను విమర్శను యుధిష్ఠిరుడు వారించుచున్నాడు.

న బ్రహ్మణః స్వపరభేదమతిస్తవ స్యాత్ సర్వాత్మనః సమదృశః స్వసుఖానుభూతేః
సంసేవతాం సురతరోరివ తే ప్రసాదః సేవానురూపముదయో న విపర్యయోఽత్ర ॥
(10-71-6)

పరబ్రహ్మవగు నీకు వీరు నావారు వారు పెఱవారను భేదము లేదు. ఆత్మానుభూతియందే తుష్టి చెందు నీవు ఎల్లరయెడ సమదర్శివి. కల్పవృక్షమును ప్రార్థించు వారికి వలె నిన్నాశ్రయించు వారికి మాత్రమే నీ యనుగ్రహము లభించును. వారివారి సేవకు తగినట్లే వారువారు ఫలితములను పొందుదురు. ఇందు విపరీత మేమియు లేదు.

గమనిక : భగవంతునికి పక్షపాతము లేదని భావము. ఎవరైనను అతనిని ప్రార్థింపవచ్చును. అతని కటాక్షమును పడయవచ్చును. కొంద ఱతని నాశ్రయింతురు. కొంద ఱాశ్రయింపరు. ఆశ్రయింపని వారిది దోషముకాని భగవంతుని దోషమేమియు లేదు.

## 73

ఏ ఇతరసహాయము లేకున్నను కేవలము భక్తివలననే భగవంతుని జేరవచ్చునని శ్రీకృష్ణుడే గోపికల నాశ్వాసించుచున్నాడు.

మయి భక్తిర్హి భూతానామమృతత్వాయ కల్పతే
దిష్ట్యా యదాసీన్మత్స్నేహో భవతీనాం మదాపనః ॥ (10-82-44)

నా యెడల ప్రేమార్ద్రమగు భక్తి కలిగిన నెల్లగను మోక్షము నందుదురు. అట్లగుటచేత నాయందు మీ కట్టి భక్తి యుండుట మహాద్భాగ్యమే.

# బృందావనమున శ్రీరామకృష్ణులు

(శ్రీ ప్రేమానందస్వామికి శ్రీరామకృష్ణానందస్వామి వ్రాసిన రెండుత్తరములు)

శ్రీ చేతనానందస్వామి యనువాదము

ఆలంబజార్ మఠము,
26-12-1895.

ప్రియసోదరా, బాబూరామ్,

నిన్న హృదయ్ ముఖర్జీ (శ్రీ రామకృష్ణుని మేనల్లుడు) మఠమునకు వచ్చెను. శ్రీ గురుదేవుల బృందావనయాత్రను గూర్చి అతనినుండి నేను వినినది వినినట్లే వ్రాయుచున్నాను. ఆయన మొదట మథురలో దిగి ధ్రువఘట్టమును, శ్రీ కృష్ణునితో సంబంధపడిన ఇతర ముఖ్య ప్రదేశములను దర్శించెను. పిదప బృందావనమునకు

పోయి గోవిందాలయమువద్ద నున్న ఒక యింటి యందు నివసించెను. మథురుడు, హృదయుడు పలువురు ఇతరులును ఆయనతో నుండిరి. బృందావనమున ఆయన ఎప్పుడును భావ సమాధియందే యుండుటవలన ఒక యడుగైనను నడువజాలకుండెను. ఆ కారణమున ఆయన పవిత్ర దేవాలయములు దర్శించుటకు ఒక పల్లకి నేర్పాటు చేసిరి. ఆయన దేవతామూర్తులను చూచుటకు వీలుగ పల్లకి తలుపులు తెఱచియే యుంచబడినవి. కొన్నిసార్లు ఆయన భావాతిరేకమున పల్లకినుండి దుముకుటకు ప్రయత్నించును. కాని పల్లకికొమ్మును పట్టుకొని ప్రక్కనే నడచుచుండిన హృదయుడు ఆయనను వారించును. ఈ విధముగ హృదయునితో గురుదేవులు శ్యామకుండమును రాధాకుండమును పరిసర దేవాలయములను దర్శించెను. ఆ సందర్భమున మథురుడు పోలేదు.

దారిలో శ్రీ గురుదేవులు ఒక తెల్ల నెమళ్ళ గుంపును చూచి హృదయుని హెచ్చరించెను. ఉత్సాహాతిశయముతో ఆయన పల్లకినుండి దుముకుట కుద్యుక్తుడయ్యెను. తరువాత ఒక జింకలగుంపును చూచెను. అదియు ఆయనను ఉత్సాహవారిధిలో ముంచివేసెను. పంచిపెట్టుటకై మథురుడు హృదయునకు నూటయేబది రూపాయలను నాణెములుగ ఇచ్చి యుండెను. శ్రీ గురుదేవులు వైష్ణవునో మహాత్మునో చూచినపుడు అతనికి కొన్ని నాణెముల నిమ్మని హృదయునితో చెప్పును.

అటుతరువాత ఆయన గోవర్ధనపర్వతమును చూచుటకు పోయి దాని శిఖరము వఱకును ఎక్కెను. అచ్చటి అర్చకులు ఆయన దిగి వచ్చుటకు సాయము చేసిరి.

గంగామాత (నిధువనమున నివసించుచుండిన బృందావన భక్తురాలు) ప్రథమవీక్షణముననే శ్రీ గురుదేవుల దివ్య స్వభావమును గుర్తించెను. ఆమె ఆహ్వానముపై ఆయన ఆమె వద్ద ఆఱు ఏడు దినము లుండెను. ఆ పావన చరిత్రురాలిచే శ్రీ గురుదేవులు ఎంత ఆకర్షితుడయ్యెననగా ఆయన ఆ ప్రదేశమును వదలుటకిచ్చగింపకుండెను. ఇది విని మథురబాబు గంగామాతనుండి శ్రీ గురుదేవుల నెట్లైన తొలగింపుమని హృదయునితో చెప్పెను. శ్రీ గురుదేవుల నిచ్చటనే వదలి రిక్తహృదయములతో ఇంటికెట్లు మరలి పోగలమని మథురుడనెను. అట్లు హృదయుడు గంగామాత ఇష్టమునకు వ్యతిరేకముగ, ఆమె పెద్దగా అఱచుచు ప్రతిఘటించుచుండ, గురుదేవులను నిధువనము నుండి తీసికొని పోయెను.

ఆయన బృందావనయాత్ర నట్లు ముగించి మథురునితో మథురకు మరలిపోయి అచ్చటి నుండి కలకత్తాకు పోయెను. బృందావనములో నున్నప్పుడు అయన వైష్ణవ వేషమును ధరించెను. తరువాతి యుత్తరములో ఇతర వివరములను వ్రాసెదను.

నీ—<br>శశి.

14 పుష్యమి

సోదరా బాబూరామ్,

శ్రీ గురుదేవులు ఆ వైష్ణవవేషమును రాధాకుండమువద్ద చతురయను పేరుగల యొక

అర్చకునివద్దనుండి స్వీకరించెను. ఈ బృందావన యాత్రయందు ఆయన ఎప్పుడును ఒక వెదురుకర్రను కొనిపోయెడు వాడు. ఒక్కొక సారి హృదయుడు దానిని ఆయనవద్దనుండి తీసికొనెడివాడు. ఇది గురుదేవులను క్షోభ పెట్టెడిది. దానిని తిరిగి పొందువరకు ఆయన విచారగ్రస్తుడయ్యెడివాడు. బృందావనములో ఆయన ఒక యదుగుకూడ నడువజాలకుండెను. యమునలో స్నానము కూడ పల్లకిలో కూర్చుండియే చేసెడువాడు.

సీ—

శశి.

(మూలము : ఉద్బోధన్ పుష్యమి 1349).

---

# తిరుక్కుఱళు

మూలకర్త:
**శ్రీ వళ్ళువనాయనారు**

అనువక్త:
**నే. భక్తవత్సలము**

## చతుర్థాధికారము - ధర్మబలము

ధర్మము ప్రాణులకు స్వర్గాదిఫలము నిచ్చును, మోక్షపురుషార్థము నొసగును, కావున ధర్మమును మించిన సమున్నతి సాధనము వేఱేది? ... ... 31

ఎవనికిగాని ధర్మానుష్ఠానమును మించిన సమున్నతి సాధనమును లేదు, వ్యామోహముచే ధర్మమును మఱచుటను మించిన కీడును లేదు. ... ... ... 32

మీకు మీకు సాధ్యమైనంతవఱకు ధర్మమనెడి సుకృతము నవిచ్ఛిన్నముగ త్రికరణములచేతను చేయుడీ. ... 33

అట్లు యథాశక్తి ధర్మము చేయువాని మనస్సులో కళంకము లేకుండుటే ధర్మసర్వస్వము. మనఃకళంకముతోడి వేషభాషలు వట్టియాడంబరములే. ... ... 34

అసూయ విషయతృష్ణ క్రోధము వాక్పారుష్యము అనెడి నాల్గింటిని తుడిచివేసికొని సదా వర్తించుటే ధర్మము. ... 35

(ఇప్పు డెలప్రాయమున నున్నారము కావున) ధర్మానుష్ఠానమును మరణించునాటికి పెట్టుకొందమని తలంపక, ధర్మమును సదా అనుష్ఠింపవలెను. అట్లనుష్ఠితమైన ధర్మమే దేహమునుండి యుత్క్రమించు జీవునకు సంగిలేని తోడగును. ... ... 36

ధర్మప్రయోజన మిది యని తెలిసికొనుటకు శాస్త్రప్రమాణ మక్కఱ లేదు. పల్లకిలో కూర్చున్నవానిని పల్లకిని మోయుచున్నవానిని బట్టి అది ప్రత్యక్షముగనే తెలియుచున్నది. సుకృతముకలిమి పల్లకి నెక్కించినది, సుకృతములేమి పల్లకిని మోయించినది— అనుట. ... ... ... 37

ధర్మము నాచరింపని దిన మొక్కటైనను లేకుండునట్లుగ నొకడు సదా ధర్మమును చక్కగా నాచరించునేని, అధర్మాచరణమతనికి పునర్జన్మమార్గమును మూసివేయు బండయగును. ... ... 38

గృహస్థధర్మముతో పొందుపొసగు ఆనందమే ఆనందము, దానికి విరుద్ధముగ (వ్యభిచా

రాదులవలన) గలుగునది అప్పటికి ఆనందముగ నున్నను దుఃఖమున పర్యవసించును, కీర్తియు చెడును. ... ... 39

ఎవనికిగాని కర్తవ్యమగున దెల్ల సుకృతమే, మానవలసిన దెల్ల దుష్కృతమే. 40

ఉపోద్ఘాతము ముగిసినది.

## గృహస్థధర్మము

### పంచమాధికారము - గృహస్థజీవనము

గృహస్థు డనబడువాడు ధర్మస్వభావులగు తక్కిన మూడాశ్రమములవారు చను సన్మార్గమున వారికి దృఢసహాయు డగును. ... 41

రక్షకులచే విడువబడినవారికిని దరిద్రులకును యాచకులకును గృహస్థుడే దిక్కు. ... 42

పితరుల-అతిథుల-చుట్టముల సమారాధనమును పోషించుకొనుటయు గృహస్థుని వరిష్ఠ ధర్మము. ... ... 43

గృహస్థుడు పాపభీతి గల్గి, ధనసంపాదనము గావించి, పితరులను వేల్పులను అతిథులను చుట్టములను తృప్తిపఱచి శేషమును తా నుపయోగించుకొని జీవించునేని, అతని సంతతికి విచ్ఛేద ముండదు. ... ... 44

గృహస్థజీవి పత్నిపట్ల ప్రేమయు ఇతరుల పట్ల ధర్మమును గలిగి మెలగవలెను. అట్లు మెలగుట ఆ జీవితమునకు నాణెమును ప్రయోజనము నగును. ... ... 45

గృహస్థజీవితమును ధర్మమార్గమున గడపు వానికి వానప్రస్థాశ్రమ మెందులకు? ... 46

గృహస్థాశ్రమమందే యుండి తదనుగుణశీల సమంచితుడై జీవించువాడు అన్నికాల వానప్రస్థులకంటెను వరిష్ఠుడు. ... 47

తపస్వులకు వారిదారిని జన తోడ్పడుచు తానును తనధర్మమును వీడకుండు గృహస్థుని జీవితము తపస్వులజీవితమునకంటె నధిక సహనసంపన్నము. ... ... 48

గృహధర్మము యతిధర్మము అనెడి రెంటిలో గృహధర్మమే ప్రశస్తధర్మ మని శాస్త్రములు చెప్పినవి. ఒరులనిందకు గతి కానియప్పుడే యతిధర్మము గృహస్థధర్మము వంటి మంచిదగును. ... ... 49

గృహస్థధర్మానుష్ఠాతకు మఱుజన్మమున స్వర్గసుఖము తప్ప దనుటే కాదు, భూలోకమున నుండగనే యతడు నాకనివాసులగు వేల్పులలో నొక్కడుగ గౌరవ మొందును. 50

### షష్ఠాధికారము - గృహిణి

గృహస్థాశ్రమోచితములైన సద్గుణములును సత్ప్రవర్తనమును గలిగి, మగని వచ్చుబడికి తగినరీతిలో జీవితమును గడపు పత్నియే సహధర్మిణి. ... ... 51

గృహస్థాశ్రమోచితములైన సద్గుణ సత్ప్రవర్తనము లెవనిగృహిణి కుండవో, అతని కెంత సంపద యున్నను జీవితము వ్యర్థమే. 52

సద్గుణ సత్ప్రవర్తములు గల యిల్లాలున్న వానికి లేని దేది? సద్గుణసత్ప్రవర్తనములుగల యిల్లాలు లేనివానికి ఉన్న దేది? ... 53

ఇల్లాలికి సుదృఢపాతివ్రత్య ముండునేని, భర్త కంతకంటె మేలిమి ఏ మున్నది? ... 54

వేఱుదైవము నుపాసింపక, తనదైవమగు భర్తనే ఆరాధించి మేల్కాంచు నామె 'కురియుము' అనిన వాన కురియును. ... 55

పాతివ్రత్యము సడలకుండునట్లుగ తన్ను కాపాడుకొనుచు, భర్త నారాధించుచు, ఇద్దతి

మంచిపేరును నిల్పుచు, ఇట్టి సద్గుణసత్ప్రవర్తనములందలి యధ్యవసాయమును దృఢముగ నవలంబించియుండు మహిళయే మహిళ. 56

మగువలను చెఱలో నుంచి చేయు కాపుదల నిష్ప్రయోజనము. వారు తమ మనస్సును పాతివ్రత్యమున నిల్పుకొని తమను చేసికొను కాపుదలయే శ్రేష్ఠమైనది. ... 57

భర్తృసమారాధనపరలైన మగువలు నాకలోకమున త్రిదశులవలన నత్యధికపూజను పడయుదురు. ... ... 58

మంచిపేరునందు కోరిక గల యిల్లాలు ఎవనికి లేదో, అతడు తనతప్పులెన్ని శత్రువుల సమక్షమున పురుషసింహమువలె గంభీరముగ నడువ జాలడు. ... ... 59

ఇల్లాలి సద్గుణసత్ప్రవర్తనములే భర్తకు మంగళము లనియు, ఆసద్గుణ సత్ప్రవర్తనములకు సత్పుత్రప్రాప్తియే అలంకార మనియు ఎఱుకగలవారు వక్కాణింతురు.

(సశేషము)

---

# అధ్యాత్మ మార్గము*

## శ్రీ యతీశ్వరానందస్వామి

### చిఱుతవయస్సున ప్రారంభింపుము

ఆధ్యాత్మికజీవనమును జీవితమున సాధ్యమైనంత చిన్నతనముననే ప్రారంభింపవలెను. పారమార్థిక జీవనమునకు బీజమును మనస్సునందు బాల్యముననే నాటినతప్ప తరువాతి జీవనమున పారమార్థికభావములు కలుగు నవకాశము లేదు. ప్రపంచమున జీవించునపుడే పారమార్థికులు కానివారు ప్రపంచమునుండి విరమించిన పిదప నెన్నటికిని పారమార్థికులు కాజాలరు. వారికి ఆ ప్రాత కలుషసంస్కారము లెంత గాఢముగ నేర్పడిపోవు ననగా వాని నున్మూలించుట ఇక సాధ్యమే కాదు. వారి ఉద్వేగములకు స్వభావమునకు బానిసలై వారు కోరుకొను విధమున జీవింపలేక పోవుదురు. ఉన్నతతరమగు జీవనము శారీరకముగగాని మానసికముగగాని వారికి సాధ్యపడదు. అట్లుండ, ఈ జీవితముననే మోక్షసాధన ప్రారంభించి మనకు లభించిన కాలమును శ్రేష్ఠతమముగ నుపయోగించుకొనుటయే మన ఆదర్శము.

### భగవత్కృప

మానవునకు స్వప్రయత్నరూపముననే భగవత్కృప లభించును. ఈ దృశ్యమాన ప్రపంచముకంటె శాశ్వతమును, ఉత్తమమును అగు విషయమునొందుటకు తీవ్ర ప్రయత్నము చేయుటకు వలసిన సంకల్పబలము రూపమున లభించును. కొందఱు 'విధి' అందురు. మరికొందఱు స్వప్రయత్న మందురు. తదితరులు "అవును. నిజమే. అంతయు భగవదిచ్ఛపైనే ఆధారపడియున్నది. కాని భగవంతుడు నేను నా కాయశక్తుల ప్రయత్నింపవలె నని యుద్దేశించుచున్నాడు. నా "విధి" స్వప్రయత్నరూపముననే ప్రకటితమగు

---

* Vedanta Kesari '1937 నుండి.

చున్నది. స్వప్రయత్నమును నాయందు కల్పించునది భగవత్సంకల్పమే'' అందురు. కాని పవిత్రత లేనిచో నిష్కల్మషమైన వైరాగ్యము లేనిచో ఆధ్యాత్మిక జీవనము కాని ఆధ్యాత్మిక ప్రయత్నము కాని జరుగు అవకాశమే లేదు. మనము ఓపినంతవఱకు శక్తి గలిగి నంతవఱకు ప్రయత్నించిననే గాని భగవత్కృప సిద్ధింపదు.

## మనోనిగ్రహము

ఏ విధమైన ఆధ్యాత్మిక జీవనము నందైనను ముఖ్యముగ కావలసినది మనస్సునందు ఎక్కువ భాగమును భగవచ్చింతన యందే మగ్నము చేయుట, ప్రాపంచిక విధులను నిర్వర్తించు నపుడుకూడ ఎన్నడును మనస్సును, దాని ఆలోచనలను, పూర్తిగ ప్రాపంచిక సంబంధ బాంధవ్యములపాలు కానీయకుండుట. మనస్సును విభజించుట కొంతవఱకైన నేర్చి, ఏపని చేయుచున్నను మనస్సునం దొక భాగము భగవంతుని, భగవంతునిమాత్రమే, ఆశ్రయించి యుండునట్లు చేయవలెను. నిరంతరాభ్యాసమువలన అకుంఠిత దీక్షవలన మనమేమి ఆలోచించినను ఏమి చేసినను అదియంతయు భగవత్సేవయే అని భావించుచు మన కర్మఫలములందు మన కధికారము లేదను మనోభావము నేర్పఱచు కొనవచ్చును. ''హే! భగవన్! నే నేపని చేసినను దానిని నీ ఆరాధనగనే భావింతును.'' ఈ సేవ శారీరకము కావచ్చును. మేధాయుతము కావచ్చును. అధ్యాత్మికము కావచ్చును. కొందఱు మానవుల వలనను కొన్ని వస్తువుల వలనను నీ మనస్సునం దేర్పడు ప్రతిచర్యలను గమనింపుము. వానికి తగినట్లు నడచుకొనుము. నీ గతించిన జీవితము నందలి దుష్టసంస్కారములను ప్రకోపింప జేయు వాని నన్నింటిని పరిహరింపుము. ప్రాపంచిక ప్రేమను వెన్నాడుచు భగవత్ప్రేమను కూడ తత్కాలముననే కలిగి యుండుట అసాధ్యము. రాముడును కాముడును ఒకచో నుండజాలరు.

## గమ్యమును మార్గమును గూర్చిన నిశ్చితబుద్ధి

ప్రాపంచిక సుఖములు కాని స్వర్గసుఖములు కాని మన జీవనగమ్యము కావను ఆదర్శమును నిర్ధారించుకొనవలెను. ఆత్మ సాక్షాత్కారమే మన గమ్యము—ఈ ప్రపంచము కాని స్వర్గలోకము కాని మఱి యేయితరలోకము కాని కాదు. స్వర్గసుఖములు ప్రాపంచిక సుఖముల కంటె భిన్నములు కావు. వానికొఱకై ప్రాకులాడుచున్నంతకాలము మనము గమ్యమును చేరుకొనజాలము. స్వర్గమున కాని ప్రపంచమున కాని కల భగవత్సృష్టిని మించి భగవంతుని కొఱకై ఉత్కంఠితులము కావలెను.

ఆధ్యాత్మిక జీవనమునకు దీక్షాబద్ధుల మగుటకు పూర్వము దానివలన కలుగు కష్టనష్టముల నెదుర్కొనగలమా? లేదా యని నిశ్చయించుకొనవలెను. మన ఆదర్శమును గూర్చి మన జీవనవిధానమును గూర్చి ఒక్కసారి తిరుగు లేని నిశ్చయమునకు రావలెను. ఎట్టి పరిస్థితులయందైనను దానికి వైదొలగక నిలువవలెను. ఈ మిథ్యాభూతముల నన్నింటిని అతిక్రమింపవలె ననినచో మనయందు కొంత ధీరత్వము నిర్భీకత కొంత దుస్సాహసము కావలసియున్నది. మన లౌకిక వాంఛల నన్నింటిని బలి ఇచ్చుటకు సిద్ధపడిననే తప్ప ఉన్నతాదర్శమును సాధించు ఆశ యుండదు. ''మాకు యుక్తాయుక్త వివేకము నిమ్ము. వైరాగ్యము నిమ్ము. భక్తి జ్ఞానముల నిమ్ము'' భగవంతుని మనమిట్లు ప్రార్థింతము గాక!

## యుక్తాయుక్త వివేకము

జనులందఱితోడను నిస్సంకోచముగ మసలరాదు. కొంత విచక్షణను పాటింపవలెను. ఎవ

రైనను నిస్సాకర్షించినచో మనస్సును ఉత్తమ మార్గమునకు త్రిప్పుము. ఆ వ్యక్తి ఆకర్షణ యంతయు నశించునట్లు ఆ వ్యక్తిపట్ల శోక అయిష్టతను జుగుప్సను కలిగించుకొనుము. కొంతకాలము గడచిన ఈ జుగుప్సనుకూడ తుడిచి వేసి ఏ ఇతర ఆగంతుకుని చూచునట్లుగనో ఆ వ్యక్తిని నిర్వికారముగ చూడవలెను. ఆధ్యాత్మిక జీవనమున ఇతరులతోడి వ్యక్తిగతమగు సంబంధమును త్రెంచుకొనినను భగవంతుని ద్వారా వారిపట్ల ఒక విశాలతరమగు ప్రేమను సానుభూతిని కలిగియుందువు. ఎవరైనను ఉత్తమమగు ఆదర్శము నందుకొనినచో అధమమైన ఆదర్శము దాని ఆకర్షణను కోలుపోయి త్యజింపబడును. మనము తీసికొను ఆహారము నందు కూడ మనము కొంత నిగ్రహమును విచక్షణను పాటింపవలెను. కనుక మనము ఈ శరీరమునం దుండునంత కాలము శరీరముపట్ల శ్రద్ధ వహించి పోషించి భగవత్సాక్షాత్కారమునకు తగిన ఉపకరణముగ నుంచుకొనవలెను. జబ్బు పడిన వానియందును బలహీనునియందును దేహబుద్ధి ఆరోగ్యవంతునియందుకంటె అధికముగ నుండును. ఆధ్యాత్మికజీవనమున త్వరితముగ పురోగతి నందవలె ననిన ఈ దేహబుద్ధి సాధ్యమైనంత తక్కువగ నుండునటుల చూడవలెను.

మన మనస్సు కొంతవఱకైనను పరిశుద్ధమై నిస్సంగమై వైరాగ్యమునకు సిద్ధముగ నుండిననే తప్ప భగవత్సాక్షాత్కారమునుగూర్చి చింతించుటయే సాధ్యపడదు. నీ హృదయమును నీ మనస్సును సాధ్యమైనంత వఱకు పరిశుద్ధము చేయుము అప్పుడు ఆధ్యాత్మిక సాక్షాత్కారమను అగ్నిజ్వాలలు అన్నికోరికలను దహించివేయును.

## పావన చరిత్రులను గూర్చి ధ్యానము

నిరాకారుడు నిర్గుణుడు అగు భగవంతుని గూర్చిన ధ్యానముతో ఆధ్యాత్మిక సాధనను ప్రారంభింప గలుగువారు మిక్కిలి అరుదు. పలువురకు నిరాకారుడైనను సగుణుడగు భగవంతుని గూర్చిన ఊహయే దుస్సాధ్యము. భగవంతుని గూర్చిన ఈ అంతర్యామిత్వమును అతీతమును గూర్చిన ఊహ మనకు సాధ్యము కానంత వఱకు మనము మొదట పుణ్యపురుషుల రూపమున— అవతారపురుషులు ప్రవక్తలరూపమున —ప్రకటితమైన భగవద్వైభవమును గూర్చి చింతింపవలెను. నిక్కముగ అంతరంగికముగ భగవంతు నారాధించుటను గూర్చి మాటలాడుట మిక్కిలి సులభము. కాని వాస్తవమునకు మన కది సాధ్యము కాకపోవుటచే అది అర్థరహిత మగు మాటల సముదాయముగనే మిగిలిపోవును.

మనము మన పరిమితమైన కల్మషపూరితమైన వ్యక్తిగతచైతన్యము ద్వారా ఆలోచింతుము. కాని మహాత్ములు అనంత చైతన్యము ద్వారా ఆలోచింతురు మనము ఆత్మవిస్మృతి నొందిన చిన్ని బుడగలవంటివారము వారు తమ సాగర జన్మమును మఱువని పర్వతోన్నత తరంగముల వంటివారు. సాగర మెన్నటికిని తరంగరూపమునకు పరిమితము కాదు.

'అవతార మనునది భగవంతుని ఒక అద్భుత మగు వ్యక్తీకరణము, కాని సంపూర్ణ మగు వ్యక్తీకరణము కాదు నిజమునకు సాధారణ మానవులయందును భగవంతుడు కలడు.

చిన్నిబుడగల మగుటచేత ఒక తరంగిత చైతన్యమును కూడ పూర్తిగ గ్రహించుట మనకు కష్టసాధ్యము. ఆ మహిత చరిత్రులను అరాధించుచు ధ్యానించుటచేత మనము వారి అతీంద్రియ చైతన్యము తోడి సంపర్కమును పొందుదుము. ఇది మన పరిమితజీవనముయొక్క శృంఖలములను భగ్నము చేయును. నూతన

తేజమును కొనివచ్చును. మన హృదయపు లోతులలో దాగియున్న ప్రగాఢ చైతన్యమును జాగరితము చేయును. ఈ తరంగములు మనకు సాగరసంపర్కమును కలిగించును. మనము సావధానముగ వారి జ్ఞానభూమికను చేరుకొనుట వలన మన భ్రమ లన్నియు తొలగి పోవును. దేహబుద్ధి నశించును. స్త్రీపురుష భేదము మాయ మగును. పరిచ్ఛేదకములను విదలించుకొని ఒక నూతనమైన పరిశుద్ధమైన అస్తిత్వమును పొందుదుము—విశ్వవ్యాప్తమైన ఆ అస్తిత్వము మన వ్యక్తిగత జీవనమును అస్తిత్వమును అర్థవంతముగ చేయును. (సశేషము)

# రాంభొట్లూ - సోంభొట్లూ

చెవిటి సోమశేఖరశర్మ

సోంభొట్లు: అయితే ఈ స్థూల సూక్ష్మ కారణ శరీరాల కతీతమైనది 'నేను' అంటావు? దాని స్వరూపమే ఆనంద మంటావు?

రాంభొట్లు: అతీతమైనది అంటే 'ఇవి కానిది అది' అని కాదు. ఈ మూడింటిలోనూ ఉంటూ ఈ మూడూ లేనప్పుడుకూడా ఉండేది అని ఉద్దేశం. నిజంగా 'నేను' అని మనం వ్యవహరించేది దాన్ని గురించే. అవును, దాని స్వరూపమే ఆనందం.

సోంభొట్లు: మరి ఇందాక విశ్వం అన్నావు?

రాంభొట్లు: శ్రద్ధగా విను మరి. ఈ ప్రపంచంలోని గాలి పీలుస్తూ ఈ ప్రపంచాన్ని ఆహారంగా జీర్ణం చేసుకుంటూ ఈ ప్రపంచంలో, మనుషులే గానీ కుక్కలూ పిల్లులే గానీ ఇల్లూ వాకిలీ చెట్టూ చేమలే గానీ ఇలా ఈ ప్రపంచంతో, అనేక రకాల సంబంధ బాంధవ్యాలతో పడుగూ పేకగా కలిసిపోయి ఉన్నావు. సూక్ష్మంగా చెప్పాలంటే నీవు ఈ ప్రపంచంలో ఒక భాగానివి. ఏం?

సోంభొట్లు: నిజమే.

రాంభొట్లు: ఇంకో విధంగా చెప్పాలంటే ఈ నీ శరీరం ఈ ప్రపంచ వస్తువుల రూపాంతరం. అంతేనా?

సోంభొట్లు: దేహం పాంచభౌతిక మంటారు మరి. అదేనా నీవు చెప్పేది? మట్టీ నీళ్ళూ నిప్పూ గాలీ ఆకాశాలతో తయారైన శరీరం మరి ప్రపంచ వస్తువుల రూపాంతరమే కదా!

రాంభొట్లు: అంటే నీవు మాత్రం అని వ్యవహరించేటప్పుడు నీవు వేఱే ప్రపంచం వేఱే అనీ ప్రపంచం అనేటప్పుడు ఆ ప్రపంచంలో నీవు కూడా ఉన్నావనీ అర్థం. తెలుస్తున్నది గదా?

సోంభొట్లు: ఆఁ ఆఁ!

రాంభొట్లు: ఇలా 'నీవు' అనే వ్యవహారానికి వ్యక్తి అనీ ప్రపంచం అనే వ్యవహారానికి సమిష్టి అనీ పేర్లు. వ్యక్తిగా స్థూలశరీరం ఉన్నప్పుడు సమిష్టిగా స్థూలప్రపంచం ఉన్నది. అలాగే వ్యక్తిగా ఉన్న సూక్ష్మశరీరం ఉన్నప్పుడు సమిష్టిగా సూక్ష్మప్రపంచం ఉన్నది. వ్యక్తిగా కారణశరీరం ఉన్నప్పుడు సమిష్టిగా కారణ ప్రపంచం ఉన్నది. తెలుస్తున్నదా?

సోంభొట్లు: ఏమిటో, సూక్ష్మశరీరం అంటే కర్మేంద్రియాలూ జ్ఞానేంద్రియాలూ ప్రాణాలూ మనస్సూ బుద్ధీ చిత్తమూ అహంకారమూ అని కదా చెప్పావు? సూక్ష్మ ప్రపంచం అంటే సూక్ష్మ చెట్లూ సూక్ష్మ ఇళ్ళూ అన్నీ ఉంటాయా?

రాంభొట్లు : ఎందుకుండవూ? ఇలా చూడు. ఇప్పుడు మేల్కొనే ఉన్నావు. నీ స్థూల శరీరాన్ని 'నీవే' అనుకుంటున్నావు. స్థూల ప్రపంచాన్ని చూస్తున్నావు. ఏం? ఇప్పుడు సూక్ష్మ శరీరం గొడవే నీకు పట్టదు. అవునా?

సోంభొట్లు : (ఊరకుండును.)

రాంభొట్లు : రాత్రి నిద్రపోతావు. నీవు ఊరికి పోయినట్లూ రైలు చాలా లేటయినట్లూ, నీ మిత్రు లందరినీ కలుసుకున్నట్లూ ఎంతో సుఖ సంతోషాలతో చాలా రోజులు గడిచిపోయి నట్లూ కలగంటావు. ఈ కలలోని 'నీవు' ఎవరు? కలలోని రైలూ మిత్రులూ కాలమానమూ అంతా ఏమిటి?

సోంభొట్లు : (ఆశ్చర్యముతో నోరు తెఱచి) ఓహో! అదంతా వేతే ప్రపంచమూ! స్వప్న ప్రపంచం!

రాంభొట్లు : అదే నీ సూక్ష్మశరీరమూ అదే నీ సూక్ష్మ ప్రపంచమూ, వ్యక్తి ఉన్నప్పుడు సమిష్టి ఉండక తప్పదని చూచి ఉన్నాము కదా.

సోంభొట్లు : నిజమే. మేల్కొని ఉన్నప్పుడు ఇప్పటి ఆలోచనలూ వ్యవహారాలూ ఒకటి. నిద్రలో కలలు గంటే ఈ మేల్కొన్నప్పటి ప్రపంచం గుర్తే ఉండదు. అప్పటి ఆలోచనలూ వ్యవహారాలూ అచ్చంగా మేల్కొన్నప్పటి లాగానే జరిగిపోతూ ఉంటాయి. నీ విప్పుడు చెబుతూ ఉంటే ఎంత ఆశ్చర్యంగా ఉంది!

రాంభొట్లు : ఈ కలలో నీవూ మేల్కొన్న నీవూ రెండూ నిజమే కదా మరి! కలలో నీ ఈ శరీరం లేకపోయినా!

సోంభొట్లు: నిజమే మరి. ఇప్పుడు నీతో మాట్లాడేది నేనే. నిన్న రాత్రి కలలో కాఫీలో చక్కెర తక్కువైందని మా ఆవిడ మీద విసుక్కున్నది నేనే. కాదనడం ఎలా?

రాంభొట్లు: ఇక ఒళ్ళు తెలియకుండా గాఢంగా నిద్రపోయా వనుకో. నిద్ర లేచాక ఏమంటావు? ఎంత గాఢనిద్రపోయానో! ఏమీ తెలియలేదు అంటావు. కలలూ రాలేదు. నిద్రలో నీవు ఒకడివి ఉన్నట్లు కూడా నీకు తెలియలేదు.

సోంభొట్లు : (నవ్వుతూ) అక్షరాలా నిజం. మొన్నొకసారి రాత్రి మా వాడు లేచి కూర్చుని 'నే నెక్కడున్నాను?' అని తర్కించుకుంటు న్నాడు, నవ్వలేక చచ్చాం.

రాంభొట్లు : చూడు మరి. ఏమీ తెలియకుండా నిద్రపోయినా ఆ నిద్రసుఖం అనుభవించేందుకు నీవూ, ఈ దేశకాలనిమిత్తాలను దాటి పోయిన మావాడూ, అక్కడ కూడా ఉండనే ఉన్నారు. ఆ శరీరాలే కారణ శరీరాలు ఆ ప్రపంచాలే కారణ ప్రపంచాలూ. అర్థమవుతున్నది గదా?

సోంభొట్లు: ఓ, చక్కగా అర్థమవుతున్నది. మేల్కొన్నప్పుడు కల గంటున్నప్పుడు కలలు లేని నిద్రలో ఈ మూడు అవస్థలలోనూ మారకుండా ఉన్నదే నిజమైన నేను—వ్యక్తిగా. ఆ నేనులు ఉన్న ఆయా ప్రపంచాలు — వాటిని వేతే ఏమనాలి—అవి నా సమిష్టి రూపాలు. అంతే గదా?

రాంభొట్లు : అంతే. నీ స్థూల శరీరానికీ నీ స్థూల ప్రపంచానికీ భేదం లేదనీ రెండూ ఒకటే అనీ చెప్పాం గదా.

సోంభొట్లు : అవును. నా శరీరమూ పంచభూతాలతో చేసినదే. ప్రపంచమూ పాంచభౌతికమే. అందువలన నిజానికి రెండూ ఒకటే అనే అనాలి.

రాంభొట్లు: అలాగే సూక్ష్మ కారణ శరీరాలూ సూక్ష్మకారణ ప్రపంచాలూనూ. కను

కనే ఈ మూడు శరీరాల్లోనూ వాటిని మించీ ఉన్న నీవే ఆ మూడు ప్రపంచాల్లోనూ వాటిని మించీ ఉన్నావు.

సోంభొట్లు : (ఆలోచించును.)

రాంభొట్లు : నీ ఈ మూడు అవస్థలలోనూ వ్యాపించి ఉన్న ఆ చైతన్యమే శరీరాల్లో ఉన్నంతకాలమూ 'నేను' గాను ప్రపంచాల్లో ఉన్నప్పుడు విశ్వంగానూ వ్యవహరించబడుతూ ఉంది.

సోంభొట్లు : ఆ చైతన్యంతో తెలిసి తెలిసీ తాదాత్మ్యం పొందగలిగితే 'నేను' విశ్వవ్యాపినని తెలుసుకొనగలనంటావు. నిజంగా విశ్వమంతా నాదేనని గ్రహిస్తానంటావు. ఇప్పుడు నా శరీరాన్ని ఎంతగా ప్రేమిస్తున్నానో అప్పుడు నా ప్రపంచాన్నీ అంతగానూ ప్రేమిస్తానంటావు ఏం? (సాలోచనగా చూచును.)

రాంభొట్లు: అద్దీ, చక్కగా అందుకొన్నావు.

# పరిప్రశ్న

[శ్రీ రామకృష్ణ మఠము (మద్రాసు) న 10-6-72 న జరిగిన అంతర్యోగమునందు జిజ్ఞాసువుల ప్రశ్నలకు శ్రీమత్తపస్యానందస్వామి వారి యుత్తరములు]

ప్రశ : ఎవరికిని అపకారము చేయక పవిత్ర జీవనము గడపిన యొకడు దారుణవ్యాధిగ్రస్తుడయ్యెననుకొనుడు. అతని దుఃఖములన్నింటికి పూర్వజన్మలలో అతడు చేసిన కార్యములే కారణమని అతనికి చెప్పుటవలన ఏమైన ప్రయోజనమున్నదా? ఆ పాపములు ఈ జన్మలో తనకు తెలియనందున ఇప్పటి దుఃఖములను అప్పటి పాపములకు సరిపెట్టుకొన జాలనని అతడు తిరస్కరింపవచ్చును గదా? అతని నింకెట్లు అనునయింపగలము?

ఉత్తరము : కర్మసిద్ధాంతమును పూర్తిగ నంగీకరించిననే దానిపై నాధారపడిన వివరణములు సహాయకరము లగును. కార్యకారణవంతమైన ప్రపంచమునందు వర్తమానమునందలి ప్రతియొక్క నైతిక ప్రభావయుతమైన సంఘటనకు నైతికప్రభావయుతమైన పూర్వఘటన యొకటి యుండి తీరవలెను. యాంత్రిక ప్రపంచమున నున్నట్లే. ఈ సిద్ధాంతమును సూత్రప్రాయముగనైన నంగీకరించినను కర్మసిద్ధాంతము మానవునకు అర్థవంతమగును. మన మిప్పుడనుభవించుచున్న దుఃఖములకు కారణములగు ఆ నిశ్చితకర్మలను తెలిసికొనవలెనని యొత్తిడిచేయుట, మన సర్వనాశమునకు దారితీయు జ్ఞాపకశక్తిని కోరి తెచ్చుకొనుటయే. గతించిన జన్మలయందలి సంఘటనలను సాంగత్యములను అన్నింటిని గుర్తుతెచ్చుకొనినచో మానవుడు అత్యంతదౌర్భాగ్య స్థితియందు పడిపోవును. ఈ వర్తమాన జీవితమందలి అన్ని జ్ఞాపకములే మన మానసికారోగ్యమునకు ఎంతయో చెఱుపు చేయజాలును. మానవుని మనస్సును రక్షించుటకు దయార్ద్రప్రకృతి ఏర్పరచిన విధానమే మన కొన్ని జ్ఞాపకముల మఱపు. మనకు రక్షకములగు ఈ మఱపుపొరల నిర్మూలనమును మనము కోరకుందుము గాక. ఈ విశ్వమున జరుగు సంఘటనల వెనుక నొక న్యాయము-ధర్మము కలదని తృప్తిపడుటకు, మన వర్త

మానము మనభూతకాలముయొక్క ఫలమని యంగీకరించిన చాలును.

కర్మసిద్ధాంతము నవలంబించుటవలన మన బుద్ధికి కలుగు సమాధానమే కాక; మనము ఆ పరమసంకల్పశక్తియందు శరణ్యాభావమును కూడ నలవరచుకోవలయును. పర్యవసానమున ఆ పరమసంకల్పశక్తి ఎట్లు పనిచేయునో మన కర్థముకాదు. కర్మసిద్ధాంతమన ఆ సంకల్ప శక్తిని మానవమేధ కార్యకారణరూపమున నర్థము చేసికొను ప్రయత్నము మాత్రమే. కాని తుదకు ఆ అనంతసంకల్పశక్తి లోతులను మన మర్థము చేసికొనజాలము. తెలివైనపని యేదనగా, దానిని ప్రతిఘటించుటకంటె దాని యందు శరణుపొందుటయే. ఈ శరణాగతిని సంపూర్ణముగ నలవరచుకొనినచో దుఃఖ సంతప్తునకుకూడ అది శాంతి నీయగలదు.

ఈ దుఃఖములను నిర్ణయించు సిద్ధాంతములు మిక్కిలి అగమ్యములు. భగవంతు డెవని నెక్కువ ప్రేమించునో వానిపై తీవ్రతమములగు దుఃఖములను వర్షించుననిపించును. ఒక జీససుక్రీస్తు శిలువవేయబడినాడు. ఒక రామకృష్ణపరమహంస కాన్సరు (Cancer) వ్యాధితో కీర్తిశేషుడయ్యెను. గొప్ప భక్తకోటిలోనివారైన పాండవులు చెప్పరాని కడగండ్లు పడవలసివచ్చినది. మహాత్ములగు వారు కూడ మనకు తెలిసినంతవఱకు నిష్కారణముగ ననుభవింపవలసిన గానిని, అల్పజనులమగు మనము సహించుట నేర్చుకొనవలయును.

# వార్తలు - విశేషాలు

శ్రీరామకృష్ణానంద స్వామివారి 113-వ జన్మదినోత్సవము శ్రీరామకృష్ణమఠము (మైలాపూరు మద్రాసు-4) న 1975 ఆగస్టు 5-వ తేది భక్తిప్రపత్తులు పెంపారగా జరుపబడినది. ఉదయమున 5 గంటలకు మంగళారాత్రికానంతరము గీతాపఠనము ఉపనిషత్ పారాయణము చండీపాఠము నడచినవి. మధ్యాహ్నమువఱకు భజనలు జరుగుచుండగా విశేష పూజయు హోమమును నిర్వహింపబడినవి. శ్రీరామకృష్ణానంద స్వామివారి చిత్రము అలంకృతమై మఠావరణమున నమర్చబడి భక్తుల నందఱను ఆధ్యాత్మికభావతరంగములందోలలాడించుచుండినది. మధ్యాహ్నము పన్నెండుగంటలకు సమావిష్టులైన భక్తులకు ప్రసాదము పంచిపెట్టబడెను.

సాయంకాలికారాత్రికము తరువాత శ్రీ రంగానంద స్వామివారు భక్తులకు శశి మహారాజుల (శ్రీరామకృష్ణానందుల) మహాత్మ్యమును గూర్చి యుపన్యసించిరి. "వారి జీవితమే ఒక తీవ్రమైన తపము, సాటిలేని గురుభక్తికి అద్వితీయమగు గురుసేవకు నిధానము. శ్రీవారి శుభనామమునకు తగినట్లే వారి యానందమంతయు శ్రీరామకృష్ణులయందే. గురుశుశ్రూష వారికి మోక్షముకంటె ప్రియము. శ్రీరామకృష్ణ మఠము ఈనాడిట్లు వటవృక్షమువలె విస్తరించినదనగా దానికి శ్రీ రామకృష్ణానంద స్వామివారి పెట్టుపోతలే కారణము. వారి గురుసేవ యందు గురువుగారి శిష్యులసేవయు గర్భితమై యుండెను. కనుకనే వారికి 'మఠమునకు అమ్మ' అను పేరు వచ్చినది. వారి యాత్రలు శ్రీరామకృష్ణుల సాన్నిధ్యమున నుండుటయే. ఎట్టి కష్టకాలములందును వారు తమ కైంకర్యమును కుంటుపడనీయలేదు. పూజా మందిరములోని

శ్రీరామకృష్ణుల పటము వారికి సర్వవిధముల సజీవసాన్నిధ్యము. వారి శ్రీరామకృష్ణ పూజ సుమసమనోహరము. శ్రీరామానుజాచార్యుల పట్ల వారి ప్రేమ, గౌరవములు ప్రగాఢములు. వారు ఆచారనిష్ఠులైనను విశాలహృదయులు ''

పిదప శ్రీరామకృష్ణ మఠ-సేవాసంఘ ఉపాధ్యక్షులు శ్రీ కైలాసానందస్వామివారు ఆంగ్లమున నుపన్యసించి శ్రీరామకృష్ణానందస్వామి వారి ప్రజ్ఞాప్రేమ విశేష కథనములతో భక్తబృందమును హర్ష పులకితగాత్రులను చేసిరి. వారి యుపన్యాస సారాంశము : శ్రీరామకృష్ణానందస్వామివారు ఆచారనిష్ఠమైన భక్తకుటుంబమున జనించిరి. వారి చిన్నతన మంతయు పూజలు వ్రతనియమములు ఉపవాసములు జాగరణల వాతావరణములో గడచిపోయినది. పాఠశాలయందును కళాశాలయందును ఆయన ప్రజ్ఞానిధియైన విద్యార్థి. శ్రీరామకృష్ణులతోడి వారి సమాగమము వారి జీవితమున నొక ముఖ్యమైన మలుపు. శ్రీరామకృష్ణుని పదునార్గురు శిష్యులలో వారొకరైరి. ఏసుక్రీస్తుతోడి వారి ముఖ్య సంబంధమును శ్రీరామకృష్ణులు కనుగొనిరి. అర్హులైన శిష్యులకొఱకై శ్రీరామకృష్ణుల యాక్రోశమునకు ఫలముగ ఆయనకడ కరుదెంచిన బాలురలో శ్రీరామకృష్ణానంద స్వామి యొకరు. ఆయనపై వారి కుటుంబ మెన్నియో ఆశలు పెట్టుకొని యుండెను. మాతాపితలపట్ల వారికి బాధ్యత యుండెను. అయినను ఆ ప్రాపంచిక బంధముల నన్నింటిని త్యజించి తనను తాను ఆ యుగావతారునకు సమర్పించుకొనెను. శ్రీరామకృష్ణులతోడి ప్రప్రథమసమావేశముననే పారమార్థిక సంస్కారమును చిన్నతనముననే అనుసరింపవలసిన యగత్యమును గూర్చి తెలిసికొనెను. ఇక అప్పటి నుండియు ఆయన శ్రీరామకృష్ణ గతప్రాణులై సేవాపరాయణులై జీవించిరి. కస్సిపూరునందు ఈ సేవ పరాకాష్ఠ నందినది. నిజమునకు గురుసేవకంటె ఇతరమగు సాధన వారికి తెలియదు. విశేషమేమన శ్రీరామకృష్ణులు నిర్వాణమునొందినను వారి సేవాతత్పరత ఏమాత్రమును తరుగలేదు. భారతదేశమునకు త్యాగము - సేవ ఆదర్శములని యందురు. ఈ రెండును శ్రీరామకృష్ణానందులయందు అద్భుతముగ వ్యక్తమైనవి. మఠమున కాయనయే ప్రాపయ్యె ననిన ఆశ్చర్యమేమి ?

జన్మదిన బహిరంగోత్సవము 10-8-75 న జరుపబడినది. 3-30 గంటలనుండి 5-30 వఱకు బ్రహ్మశ్రీ వి. ఎస్. వెంకటరమణ రావుగారు ''భక్త కనకదాస'' హరికథతో భక్తులను రంజింపచేసిరి. బహిరంగసభ శ్రీ వీతమోహానందస్వామివారి వేదగానము సంకీర్తనముతో ప్రారంభమై 5-30 గంటలనుండి 7-30 వఱకు శ్రీ కైలాసానందస్వామివారి అధ్యక్షత న జరిగెను.

శ్రీమత్తపస్యానందస్వామివారు తమ స్వాగతోపన్యాసమున శ్రీ కైలాసానందస్వామి వారి ప్రశంసను పేర్కొనిరి. మద్రాసు మఠమునకు 1944 నుండి 1971 వఱకు అధ్యక్షుడుగ నుండి వారు చేసినసేవ నిరుపమానము. శ్రీరామకృష్ణ సంప్రదాయ కార్యక్రమము మద్రాసునందు వారి యాజమాన్యమున నిరంతరాయముగ వర్ధిల్లి విస్తృతమైనది దక్షిణదేశమునకు శ్రీరామకృష్ణుల దూతయైన శ్రీరామకృష్ణానంద స్వామిని తలపించుచు శ్రీ కైలాసానంద స్వామి వారును దక్షిణదేశమునకు తమ జీవితమున నధికాంశము నర్పించిరి. వివేకానంద కళాశాల మొదలగు విద్యాసంస్థలు, (దేశమున గల శ్రీరామకృష్ణసేవాసంఘమునుండి విద్య నభ్యసించు

చున్న 60,000 మంది విద్యార్థులలో 16,000 మంది మద్రాసునందే కలరు.) జనులకు పారమార్థిక సేవ, ప్రచురణసంస్థ, మఠప్రదేశము— అన్నియు శ్రీ కైలాసానందస్వామివారి అసమాన దూరదృష్టిని సాహసోపేతమైన నిర్వాహణను ప్రకటించుచున్నవి. ఇటీవలనే వారు శ్రీ రామకృష్ణ మఠ సేవాసంఘమునకు ఉపాధ్యక్షులగుట మద్రాసు మఠముయొక్క భక్తులకు మఱింత ముదావహమగు విషయము.

తరువాత నగరమునందలి మఠ సేవా సంఘ సంస్థ లనేకముల తరఫున శ్రీ కైలాసానంద స్వామివారికి పుష్పమాల లర్పింపబడినవి. శ్రీ ఎస్. కె. శివరామన్ గారు శ్రీరామకృష్ణులపట్ల శ్రీ కైలాసానందస్వామి వారి ప్రగాఢ భక్తిని గూర్చియు, వారి గురువులగు శ్రీ మహాపురుష్ మహారాజుల (శ్రీ శివానందస్వామి) పట్ల వారి యచంచల భక్తి విశ్వాసములను గూర్చియు శ్రీ రామకృష్ణసంప్రదాయముపట్ల వారికి గల అకుంఠితమైన సేవాతత్పరతను గూర్చియు భక్తి ప్రపత్తులతో ప్రశంసించిరి.

మద్రాసు వివేకానంద కళాశాలయందలి ప్రొఫెసర్ కె. గణేశన్ గారు ఆంగ్లమున మద్రాసు సాంఘికజీవనమునకు శ్రీ శశిమహారాజులు (శ్రీరామకృష్ణానందస్వామి) చేసిన యుపకృతినిగూర్చి ప్రసంగించిరి. వారిట్లనిరి: శ్రీరామకృష్ణుల సేవయందు శ్రీ రామకృష్ణానంద స్వామి యెల్లరను అతిశయించెను. పవిత్రమైన ఆ సంప్రదాయమునకు ఆయన ఒక ఉత్తముడు ఉదాత్తుడు అగు ప్రతినిధి. 'మహాపురుషుల జీవితము లన్నియు మన జీవితమును కూడ దివ్యములుగ చేసికొనగలమను విషయమునకు జ్ఞాపికలే' యను కవివాక్యమున కాయన తార్కాణము. ఆయన నిరంతరము శ్రీరామకృష్ణులయందే లీనుడై జీవించుచు కార్యములు నిర్వర్తించుచు ఇతరులుకూడ ఆ పరమహంస తరుచ్ఛాయయందు నివసించునట్లు చేసెను. శ్రీ శశి మహారాజుల జీవితమును గూర్చి చింతించునపుడు 'వసంతకాలమువలె ప్రపంచాభ్యుదయమునకు పాటుపడు మహాత్ములనుగూర్చి శ్రీ శంకరులు చేసిన స్తుతి స్మరణకు వచ్చును. జగద్గురుడగు శ్రీరామకృష్ణుని శిష్యుడగు శ్రీరామకృష్ణానందస్వామి శ్రీ కృష్ణ భగవానుని శిష్యులగు ఉద్ధవార్జునులను తలపించును. ఈ యుగావతారుని కార్య నిర్వహణకై ఎన్నుకొనబడిన యుపకరణ మాయన. గురుశక్తి మూర్తీభావమే శ్రీరామకృష్ణపరమహంస, భగవంతుని యనుగ్రహశక్తియే గురువు. వివేకచూడామణి వచనములలో శ్రీరామకృష్ణ పరమహంస కరుణాసముద్రుడు, బ్రహ్మవిత్. ''అయినను, నేను కాదు క్రీస్తుదేవుడే నాయందు నివసించుచున్నాడు'' అను సెయింట్ పాల్ మాటలను స్మృతికి తెచ్చుచు శ్రీ శశిమహారాజ్ తన యాత్మను శ్రీ రామకృష్ణులయందే లీనము చేసెను. శ్రీరామకృష్ణులయందే శ్రీ శశిమహారాజ్ జీవించియుండెను. వారి ప్రతియొక్క చర్యయు గురుదేవులయిచ్ఛానుసారమే జరిగెను. వారి గురుదేవుల పూజ కార్యకలాపముకంటె నధికమై యెల్లరకును ఉద్బోధకరమై యొప్పెను. ఏకమనస్కమైన భక్తికి అవ్యవహితమైన సేవకు ఆయన రూపకల్పన. తీర్థయాత్రలయందైనను వారికి రుచి లేదు, పావిత్ర్యమంతయు వారికి వారి పూజామందిరములోని సాన్నిధ్యమునందే యుండెను. వారి జీవితము పరిపూర్ణమైన ఆత్మత్యాగము, ఆత్మార్పణము. మన దేశమునందలి భక్తాగ్రగణ్యులు ప్రకటించిన, శాస్త్రము లుద్ఘాటించిన, భక్త్యాదర్శమునకు ఆయన జీవితమే ఒక వ్యాఖ్యానము.

పిదప ఆర్. రాధాకృష్ణన్ గారు - తిరుచిరా పల్లి - తమిళమున ప్రసంగించిరి. గురువు శ్రద్ధా యుతుడైన శిష్యునకు అత్యంతాదరణీయుడనుచు వారు తమిళ ప్రబంధములనుండి అనేకోదాహరణములను చూపిరి. గురువును తప్ప ఇతర దైవము నన్వేషింపని సాధకు లెందరో కలరు. శ్రీరామకృష్ణుని సేవయందును వారిపట్లగల భక్తి యందును శశిమహారాజు ఆంజనేయుని గుర్తునకు తెచ్చును. శశిమహారాజు నందు అహంకార ప్రకటనయే లేదు. ఉన్నదంతయు శ్రీరామకృష్ణ చైతన్యమే. తన గురువునందు వారి శరణాగతి, భగవంతునియందు గజేంద్రుని శరణాగతి వంటిది, శ్రీకృష్ణునియందు ద్రౌపది శరణాగతి వంటిది. అది సంపూర్ణము, నిశ్చలము.

సమావేశమును ముగించుచు శ్రీ కైలాసానంద స్వామివారు ఇట్లనిరి: శ్రీరామకృష్ణుల కార్యము వర్ధిల్లుచున్నది. ఆయన కార్యము నాయనయే చేసికొనును. ఇతరులు నిమిత్త మాత్రులుగ నుందురు. చూపరులుగ నుందురు. 'శ్రీరాముని ఇచ్ఛ' కథలోని సాలెవాని వలె ప్రతి పనియందును శ్రీరాముని ఇచ్ఛను చూచుటను ప్రతియొక్కరును నేర్చుకొనవలెను. శ్రీ వివేకానందస్వామి శ్రీ శశిమహారాజులను మఠమునకు మూలస్తంభమనియు 'అమ్మ' అనియు పేర్కొని యుండిరి. నిజముగ శ్రీరామకృష్ణ నాటకమున శశిమహారాజులపాత్ర అతి ముఖ్యమైనది కీలకమైనది. వ్యవస్థాపకులయందును నిర్మాతలయందును శశిమహారాజులను మించిన వా రెవరును లేరు. శ్రీరామచంద్రునకు హనుమంతు డెట్లో శ్రీరామకృష్ణులకు శశిమహారాజు అట్లు. శ్రీరామకృష్ణుల ఇచ్ఛానుసారము వారి పదునార్గురు శిష్యులును వారిని పరివేష్టించి వారివారి పాత్రలను నిర్వహించి చనిరి. కాని శ్రీరామకృష్ణనాటకము మొదలగుచున్నది ఇప్పుడే. ఇక రాబోవు దశాబ్ద శతాబ్దముల వఱకు అది కొనసాగును. శ్రీరామకృష్ణులు ఒక విశిష్ట గురువైనచో శ్రీ శశిమహారాజు ఒక విశిష్ట శిష్యుడు. ప్రపంచయుగమునమున ప్రతి ముఖ్య ఘట్టమునను భగవంతుని సాహాయ్యము లభించుటయు పరిస్థితులు చక్కబడుటయు ప్రపంచ చరిత్ర ప్రదర్శించుచునే యున్నది. శ్రీరామకృష్ణోద్యమమున శశిమహారాజులపాత్ర ప్రముఖము శాశ్వత ఫలదాయకము. దక్షిణ భారత దేశము వారి కెంతయో ఋణపడి యున్నది. దక్షిణ దేశమున వారి కృషి ఫలితము కాలక్రమమున సమగ్రముగ ప్రకటితము కాగలదు. వారు మాతృదేవి శ్రీ శారదా దేవిని దక్షిణ దేశమునకు కొనివచ్చినపుడు ఆమెయాత్ర సుఖముగ జరుగుటకై వారు రక్తము నోడ్చిరనియే చెప్పవచ్చును. శ్రీ శారదా దేవిపట్ల వారి భక్తిప్రపత్తు లట్టివి. మద్రాసున వారి విద్యాదాన కార్యక్రమమున వారితో సహకరించుటకు రాము, రామానుజుడును లభించుట కొంకె యదృష్టము. నిక్కముగ శ్రీరామకృష్ణోద్యమమున ప్రథమమున ఉత్తర దేశమునకు పిదప దక్షిణ దేశమునకు శశిమహారాజుల కృషి యమోఘము.

ప్రొఫెసర్ ఎస్. నారాయణన్ అధ్యక్షులకు వక్తలకు వందన సమర్పణము కావించిరి.

పిదప శ్రీరామకృష్ణ మఠ భజనమండలి భక్తులకు సంకీర్తనలతోను స్తోత్రములతోను వీనులవిందు గావించినది.

# రామకృష్ణమిషన్ వరదబాధితులకు సహాయ కార్యక్రమము

## ఒక మనవి

బీహారు రాష్ట్రమునందలి ఉద్ధృతమైన వరదలు జనులకు ఆస్తిపాస్తులకు అపారమైన నష్టమును కలిగించుట ఎల్లరకును తెలిసిన విషయమే. పాట్నానగరముకూడ ఈ వరదల తాకిడికి బలియైనది. నగరమునందలి ఎన్నియో ప్రాంతములందు ఇంకను నీరు నిలిచియేయున్నది. వరదల వలని కలుగు అనేకములగు వ్యాధులవలన పరిస్థితి మఱింత విషమించినది.

పాట్నానగరమునందును ఆ పరిసరములందును ఆగస్టు 27 వ తేదీనుండి రామకృష్ణ మిషను వరదబాధితులకు సహాయకార్యక్రమమును ప్రారంభించినది. ప్రస్తుతము గోధుమపిండి అటుకులు ఉర్లగడ్డలు ఉప్పు అగ్గిపెట్టెలు మొదలగునవి, ధోవతులు, చీరలు, ఏడుప్రాంతములందు 5000 బాధితజనులకు పంచిపెట్టబడుచున్నవి. అదేసమయమున ఆ ప్రాంతములందే వైద్యసహాయముకూడ చేయబడుచున్నది. అయినను సాధ్యమైనంతమంది బాధితులకు ఉపయోగకరమగు సహాయమందుటకు ఇతరప్రాంతములకుగూడ భారీయెత్తున సహాయకార్యక్రమము విస్తరింపవలసి యున్నది. సోదర సామాజికులు ఉదారహృదయముతో విరాళములనిత్తురను ధైర్యముతో మేము సహాయకార్యక్రమమును ప్రారంభించితిమి. దీననారాయణసేవయందు సోదరసామాజికులందఱును పూర్వమువలెనే శక్తికొలది చేయూత నిత్తురని విశ్వసించుచున్నాము.

తదర్థమగు విరాళములు ఈ క్రింది యడ్రెసులందు కృతజ్ఞతతో స్వీకరింపబడును. చెక్కులు (Cheques) పంపగోరువారు "రామకృష్ణమిషన్" పేరిట పంపవలెను.

### అడ్రెసుల పట్టిక

1. రామకృష్ణమిషన్ బేలూరు మఠము 711-202 హౌరా.
2. అద్వైత ఆశ్రమము 5, దేహి ఎన్టల్లి రోడ్డు కలకత్తా 700-014.
3. ఉద్బోధన్ కార్యాలయము 1, ఉద్బోధన్ లేన్ కలకత్తా 700-003.
4. రామకృష్ణ ఇన్స్టిట్యూట్ ఆఫ్ కల్చర్ గోల్ పార్క్ కలకత్తా 700-029.
5. రామకృష్ణ ఆశ్రమము సేవాప్రతిష్ఠాన్ 99 శరత్ బోసురోడ్డు కలకత్తా 700-026.
6. రామకృష్ణమిషన్ ఆశ్రమము రామకృష్ణ అవెన్యూ పాట్నా 800-004.
7. రామకృష్ణ ఆశ్రమము ఖార్ బొంబాయి 400-052.
8. రామకృష్ణమిషన్, రామకృష్ణ ఆశ్రమమార్గ్ న్యూఢిల్లీ 110-055.
9. రామకృష్ణమఠము, మైలాపూరు మద్రాసు 600-004.

గంభీరానందస్వామి
జనరల్ సెక్రెటరి
రామకృష్ణ మిషన్.

బేలూరు మఠము
5, సెప్టెంబరు 1975

## శ్రీరామకృష్ణోపనిషత్తు

తమిళ రచయితలు :

శ్రీ చక్రవర్తి రాజగోపాలాచార్యులుగారు

ఆంధ్రానువాదకులు :

గౌ॥ న్యాయమూర్తి

శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావుగారు

శ్రీరామకృష్ణ దేవుని దివ్యోపదేశ వాక్యము లాధారముగాగొని, వానిని విరివి పఱచి, మనోహర కథా రూపముగను, సంభాషణరూపముగను అమర్చిబడినది.

128 పుటలు వెల : రూ. 3-75

## శ్రీరామకృష్ణ పరమహంస నీతికథారత్నములు

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వామి

మనోహరములు చమత్కారములు తత్త్వార్థబోధకములు అగు శ్రీరామకృష్ణుల నీతి కథలలో విశిష్టమగువాని నెన్నుకొని విషయానుగుణముగ విభజించి యనువదించిరి. హృద్యమగు శైలి.

పుటలు : 84 + VI వెల : రూ. 2-50

నాలుగవ ముద్రణము

## నా జీవితము జీవనకార్యము శ్రీవివేకానందస్వామి

అనువాదకులు :

శ్రీ కందుకూరి మల్లికార్జునం

భారతదేశ ప్రజలు లక్షలాదిగ వెతల పాలై కుందుచుండుటను చూచి ఆయన హృదయమెట్లు రక్తాశ్రువులు కార్చుచుండెనో తన మాతృదేశమును మరల పూర్వ తేజోవైభవముతో దీపించునట్లు చేయుటకు ఆయన సంకల్పించిన మార్గ మెద్దియో ఇందు ప్రస్ఫుటముగ తెలియుచున్నది.

పుటలు : 61+II వెల : రూ. 1-25

(రెండవ ముద్రణము)

## బాలల వివేకానందుడు

బెంగాలీమూలము :

శ్రీ నిరామయానందస్వామి

అనువాదకులు :

శ్రీ కరణం రంగనాథరావు

జగద్విఖ్యాతుడైన వివేకానందస్వామి జీవితచరిత్ర బాలబాలికలకు సులభముగా అర్థమగునట్లు రచింపబడినది. స్వామివారి బాల్యవిశేషములు శ్రీరామకృష్ణుల సాంగత్యము పాశ్చాత్యదేశములకు పయనము మాతృదేశమున వారి కార్యక్రమము మనోహరముగ సంగ్రహింపబడినది.

పుటలు : 80+VIII వెల : రూ. 2-00

(రెండవ ముద్రణము)

అడ్రెసు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-600004

## శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-600004

### 1975-వ సంవత్సరము, నవంబరు మాసమున జరుగనున్న

### ఉత్సవ కార్యక్రమము

శ్రీశ్రీ కాళీపూజ :

2-11-75 ఆదివారము : సాయంకాలిక ఆరాత్రికానంతరము.

ఆదివారములందు సత్సంగ సమావేశములు :

అపరాహ్ణము 4-00—4-20 వఱకు లలితా సహస్రనామ పారాయణము (9-11-75, 23-11-75)

„ „ „ శ్రీవిష్ణు సహస్రనామ పారాయణము (16-11-75, 30-11-75)

4-20—4-30 „ ధ్యానము.

4-30—5-30 „ తమిళమున ఉపన్యాసములు :—

శ్రీమద్భాగవతము : శ్రీ 'అణ్ణా' ఎన్. సుబ్రహ్మణ్యంగారు (9-11-75)

శ్రీదక్షిణామూర్తి స్తోత్రము : డా. టి. ఎమ్. పి. మహాదేవన్‌గారు (16-11-75)

శ్రీవిష్ణు సహస్రనామము : శ్రీ వి. ఆర్. కల్యాణసుందరశాస్త్రిగారు (23-11-75)

శ్రీమద్రామాయణము : డాక్టర్ ఎన్. వీథినాథన్‌గారు (30-11-75)

5-35—6-30 „ ఆంగ్లమున ఉపన్యాసములు :—

శ్రీమద్భగవద్గీత : శ్రీమత్తపస్యానందస్వాములవారు.

6-30—8-00 „ ఆరాత్రికము - భజన.

ప్రత్యేకోపన్యాసములు :

1-11-75 శనివారము : 5-30 శ్రీమద్రామాయణ పఠనము : శ్రీ పి. రామకృష్ణన్, ఐ.సి.ఎస్. (రిటైర్డు)

22, 29-11-75 „ 5-30 శ్రీమద్రామాయణము : డాక్టర్ ఎన్. వీథినాథన్‌గారు.

ఇతర వారములందు ఉపన్యాసములు : అపరాహ్ణము 5-30 గంటలకు

సోమవారములు : శ్రీవిష్ణుసహస్రనామము (ఆంగ్లము) శ్రీ వీతమోహానందస్వామి.

మంగళవారములు : అధ్యాత్మరామాయణము (ఆంగ్లము) శ్రీ గభీరానందస్వామి.

బుధవారములు : శ్రీమద్భాగవతము (ఆంగ్లము) శ్రీ గోలోకానందస్వామి.

గురువారములు : అముదమొళ్ళి (తమిళము) శ్రీ శ్రీరంగానందస్వామి.

శుక్రవారములు : ఆత్మబోధ (తమిళము) శ్రీ ఆర్. రామకృష్ణన్.

9-11-75 ఆదివారము : అంతర్యోగ సాధన.

ఉభయ ఏకాదసులయందు సాయంకాలిక ఆరాత్రికానంతరము శ్రీరామనామ భజన (14-11-75, 29-11-75)

15-11-75 శనివారము శ్రీ సుబోధానందస్వామి జయంతి.

17-11-75 సోమవారము శ్రీ విజ్ఞానానందస్వామి జయంతి.

శుక్రవారములందు సాయంకాలము 6-30 గంటలకు తిరువల్లిక్కేణియందలి దక్షిణమాడవీధియందు 18-వ నంబరుగల శ్రీరామకృష్ణ మందిరమున శ్రీమత్ గోలోకానందస్వాములవారి భగవద్గీతోపన్యాసములు.

ఈ ఉత్సవము లన్నింటియందును భక్తులెల్లరును పాల్గొని భగవంతుని యనుగ్రహభాగ్యమును బడయగోరుచున్నాము.

అధ్యక్షులు,

శ్రీరామకృష్ణమఠము, మద్రాసు-600004.

# శ్రీ రామకృష్ణమఠ ప్రచురణలు

| | | |
|---|---|---|
| శ్రీ రామకృష్ణ సూక్తిసుధ ... | 7 | 50 |
| శ్రీ రామకృష్ణ బోధామృతము ... | 4 | 50 |
| గురూపదేశములు ... | 2 | 00 |
| శ్రీరామకృష్ణోపనిషత్తు ... | 3 | 25 |
| శ్రీరామకృష్ణపరమహంస నీతికథారత్నములు ... | 2 | 50 |
| పరమహంస శ్రీరామకృష్ణుడు ... | 0 | 25 |
| నా గురుదేవుడు ... | 0 | 40 |
| శ్రీ రామకృష్ణుడు, వివేకానందస్వామి ... | 0 | 25 |
| శ్రీ శారదాదేవి జీవిత చరిత్ర ... | 2 | 75 |
| శ్రీ శారదా ప్రసంగములు ... | 3 | 00 |
| శ్రీ శారదాదేవి ... | 1 | 25 |
| శ్రీ వివేకానంద జీవిత చరిత్ర ... | 4 | 00 |
| వివేక సూర్యోదయము ... | 4 | 00 |
| బాలల వివేకానందుడు ... | 2 | 00 |
| శ్రీ వివేకానంద సంపూర్ణగ్రంథావళి 9 సంపుటముల సెట్టు (సాదా) ... | 45 | 00 |
| ,, ,, క్యాలికో | 58 | 50 |
| * విడి సంపుటములు ఒక్కొక్కటి సాదా | 5 | 00 |
| ,, ,, క్యాలికో ... | 6 | 50 |
| సందేశ తరంగిణి (మొదటిభాగము) ... | 4 | 00 |
| ,, (రెండవభాగము) ... | 3 | 00 |
| భక్తియోగము ... | 4 | 00 |
| కర్మయోగము ... | 4 | 00 |
| హిందూమతము ... | 4 | 00 |
| భారత యువజనులారా! ... | 3 | 00 |
| ప్రబోధ రత్నాకరము ... | 2 | 50 |
| శ్రీ వివేకానందలేఖావళి (మొదటిభాగము) | 2 | 25 |
| ,, (రెండవభాగము) | 1 | 75 |
| అనుష్ఠాన వేదాంతము ... | 1 | 25 |
| ప్రాచ్యము-పాశ్చాత్యము ... | 1 | 25 |
| చికాగోనగరోపన్యాసములు ... | 1 | 00 |
| భారతదేశము ... | 1 | 00 |
| భారతీయ మహిళ ... | 1 | 00 |
| శ్రీ రామకృష్ణ సేవాసంస్థల ఆదర్శములు | 0 | 50 |
| నా సంస్కరణ యుద్ధ విధానము ... | 0 | 37 |
| నవీన భారత దేశము ... | 0 | 40 |
| పవహారి బాబా ... | 0 | 25 |
| తాపత్రయ చికిత్స ... | 0 | 60 |
| పారమార్థిక సంభాషణలు ... | 3 | 00 |
| నారద భక్తి సూత్రములు ... | 4 | 00 |
| శ్రీ దొడ్డ భాగవతము-రెండవ సంపుటము | 5 | 50 |
| ,, మూడవ సంపుటము | 7 | 50 |
| దేవీమాహాత్మ్యము ... | 2 | 50 |
| పరతత్త్వ ప్రసంగము ... | 2 | 00 |
| శ్రీమద్భగవద్గీత (టీకాతాత్పర్య విశేషార్థసహితము) ... | 9 | 00 |
| పారాయణగీత మూలము ... | 1 | 00 |
| గిరీశచంద్ర ... | 1 | 00 |
| శ్రీరామకృష్ణ ఆరాత్రికము మరియు శ్రీరామనామ సంకీర్తనము ... | 0 | 50 |
| భక్తిమార్గము ... | 1 | 00 |
| శ్రీ రామకృష్ణ ఉవాచ ... | 0 | 80 |
| శ్రీ శారదా సూక్తి నవనీతము ... | 0 | 80 |
| శ్రీ వివేకానంద శంఖారావము ... | 0 | 80 |
| శ్రీకృష్ణవాణి ... | 0 | 80 |
| బుద్ధ ఉవాచ ... | 0 | 80 |
| క్రీస్తు సూక్తిమాల ... | 0 | 80 |
| మహమ్మదు సూక్తి మంజరి ... | 0 | 80 |
| అద్భుతానందస్వామి ... | 0 | 87 |

ఇవియేకాక ఆంగ్ల, సంస్కృత, తమిళ, హిందీ, కన్నడ గ్రంథములును,

**వేదాంతకేసరి (ఆంగ్లము) శ్రీరామకృష్ణ విజయము (తమిళము)**

అను మాసపత్రికలును, శ్రీరామకృష్ణ పరమహంస, శ్రీశారదాదేవి, శ్రీవివేకానందస్వామి మున్నగువారి ఛాయాచిత్రములు, త్రివర్ణ చిత్రములు, తైలచిత్రములు మున్నగున వెన్నియో మాయొద్ద లభింపగలవు.

* అయిదవ సంపుటము క్యాలికోగాని అట్టబైండుగాని లేదు.

ఇట్లు వ్రాయుడు:

**శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-600004.**

# శ్రీ మ ద్భ గ వ ద్గీ త

**అనువాదకులు :**

శ్రీ నిర్వికల్పానందస్వాములవారు

ఇది మూలశ్లోకములు, ప్రతిపదార్థము, ధారాళమగు అనువాదము, శ్రీధరీయ, టీకాసారము, విశేషాంశములు, సానువాదగీతాపాఠక్రమము, ధ్యానమాహాత్మ్యములు సమభావాత్మకములగు ఉపనిషద్వాక్యసూచిక, వేదాంతసూత్రసూచిక, గీతాశ్లోకసూచిక, శబ్దానుక్రమణిక—ఇన్నిటితో విరాజిల్లుచున్నది.

భక్తులకు సాధకులకు మాత్రమేకాక కళాశాల విద్యార్థులకు సైతము ఉపయుక్తమయిన దివ్యగ్రంథము.

పుటలు : 58+440 (అందమయిన అష్టమ ముద్రణము) వెల : రూ 9-00

# 'మా దివ్యవాణి' గ్రంథమాల

**నేడే కొనండి ! పదే పదే చదవండి !!**

దివ్యావతారమూర్తుల విశ్వోపజీవ్యములైన అమృత మధుర సూక్తులు సర్వసుగ్రహము హృదయ సన్నిహితమునైన తేట తెనుగున వీనిలో అందజేయబడ్డాయి. ఇందులో ఒక్కొక్కటి నిరుత్సాహులకు ఉత్సాహప్రదం, అశాంతిసంక్షుభితులకు శాంతిదాయకం, సంశయాందోళితులకు సంశయాపనోదకం, జిజ్ఞాసువులకు పరమార్థజ్ఞాన సమర్పకం, అందరికీ శిక్షకం, సంస్కారకం, నిర్వృత్త్యాపాదకం. మువ్వన్నెల మేలి జాకెట్టుతో పాకెట్టుసైజులో చక్కని తయారింపు—

| | | | |
|---|---|---|---|
| శ్రీ రామకృష్ణ ఉవాచ | 0-80 | శ్రీ కృష్ణవాణి | 0-80 |
| శ్రీ శారదాసూక్తి నవనీతము | 0-80 | బుద్ధ ఉవాచ | 0-80 |
| శ్రీ వివేకానంద శంఖారావము | 0-80 | క్రైస్తు సూక్తిమాల | 0-80 |

మహమ్మదు సూక్తిమంజరి 0-80

**ఇట్లు వ్రాయుడు :**

మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠము, మైలాపూరు, మద్రాసు - 600004.

# శ్రీ రామ కృ ష్ణ ప్ర భ

సంపుటము ౩౨ ౧౯౭౫ - నవంబరు : రాక్షస - కార్తీకము సంచిక ౫

## విషయసూచిక

## కర్మయోగము

అనువాదకులు:

శ్రీ చిరంతనానందస్వాములవారు

ఇందు శ్రీ స్వాములవారు కర్మయోగ తత్త్వమును అరటిపండొలిచినట్లు విశదీకరించియున్నారు. కర్మయోగుల మోక్ష సాధనమును స్పష్టీకరించియున్నారు.

(అష్టమ ముద్రణము)

(146+8) పుటలు వెల: రూ. 4-00

## భక్తియోగము

అనువాదకులు:

శ్రీ చిరంతనానందస్వాములవారు

ఆధునికుల చిత్తము నాకర్షించు రీతిని, అమోఘవచనములతో, విమర్శనదృష్టితో శాస్త్రప్రమాణములతో భక్తితత్త్వమును శ్రీ వివేకానందస్వాములవా రిందు విపులముగా ప్రదర్శించియున్నారు. మూల గ్రంథములలోని ప్రమాణవచనములును వానికి టిప్పణములును సులభశైలియందు వ్రాయబడియున్నవి.

(ఏడవ కూర్పు)

(121+4 పుటలు) వెల: రూ. 4-00

## శ్రీరామకృష్ణపరమహంస జీవిత సంగ్రహము

శ్రీ చిరంతనానందస్వామి

మహిమాన్వితమగు శ్రీ రామకృష్ణ పరమహంస జీవిత విశేషములు ఇందు రమణీయమగు శైలిలో వర్ణింపబడియున్నవి. లోకమునకు శ్రీ రామకృష్ణులు కావించిన యుపకారము వారి యుపదేశ సారముకూడ చక్కగా వివరింపబడినవి.

పుటలు: 48 వెల: రూ. 0-75

నాలుగవ ముద్రణము

## గురూపదేశములు

అనువాదకులు: శ్రీ చిరంతనానందస్వామి

శ్రీ గురుదేవుని మానసపుత్రు డనబరగిన శ్రీ బ్రహ్మానందస్వామి గురుముఖమునుండి వచ్చిన యుపదేశములను యథాతథముగ గ్రహించి వానియందు ముఖ్యములగు వానిని సంగ్రహించి యాంగ్లమున రచించిరి. వాని యనువాదమే ఈ గ్రంథము. ఇందు గృహస్థులకు సాధకులకు వలయు సూక్తు లెన్నియో వివరింపబడియున్నవి.

పుటలు: 168 వెల: రూ. 2-00

తొమ్మిదవ ముద్రణము

ఇట్లు వ్రాయుడు: మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-600004

'అఖిలవిధ శరణొందుము, యా క్షణంబ యతనికృప నీకు ననుభూతి కందు వత్స'.

—శ్రీ శారదామణి.

# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౩౨ } ౧౯౭౫ – నవంబరు : : రాక్షస – కార్తీకము { సంచిక ౫

ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ !

## ప్రార్థన

## శ్రీ రామకృష్ణ కర్ణామృతము

ఆనంద సింధులహరీవ చిదంబరోద్యత్ సౌదామనీవ భువనత్రయదీపికేవ
కారుణ్య తీర్థమివ భక్తి సరోజినీవ ముక్తిప్రభేవ తవ రాజతి దంతకాంతిః

బ్రహ్మానంద సాగరతరంగమువలె శుద్ధచైతన్యరూపమగు చిదాకాశమున మెఱయు విద్యుల్లతవలె ముల్లోకములకు వెలుగునిచ్చు దీపమువలె దివ్యకారుణ్యమునకు పుణ్యతీర్థమువలె భక్తి సరోవరమువలె మోక్ష తేజమువలె నీదంతకాంతులు దీపించుచున్నవి.

కర్పూరనీరమివ రాజతనిర్ఝరీవ క్షీరార్ణవోర్మిరివ శారద చంద్రికేవ
సచ్చిత్ప్రభేవ తవ భాసురదంతకాంతిః ప్రాక్ష్య ప్రసహ్య శిశిరీకురుతే_న్తరంమే.

కర్పూరము కలిసిన నీటివలె వెండియే ప్రవహించు సెలయేటివలె పాలసముద్రమున లేచు అలలవలె శరద్రాత్రులందు వెలుగు వెన్నెలవలె శుద్ధచైతన్య ప్రకాశమువలె నీ దంత కాంతులు నా మనము నలమి హాయిని గొల్పుచున్నవి.

# శ్రీరామకృష్ణస్మృతులు

'మా అమ్మ అమాయికతకు మూర్త రూపము. లౌకిక విషయము లామె కేమియు తెలిసెడివి కావు. ధనమునుకూడ లెక్కింప లేకుండెడిది. అన్ని విషయములను ఎల్లరకును చెప్పుటలోని ప్రమాదమును గుర్తింపక తన మనస్సునకు తోచినదెల్ల ఎవరనిన వారికి చెప్పి వేసెడిది. అందుకు లోకులామెను 'పిచ్చి మాలోకము' అనెడివారు. ఎల్లరకును భోజనములు పెట్టుట యనిన కూడ ఆమెకు పరమ ప్రీతి. శూద్రునికడనుండి మా తండ్రి ఎన్నడును దానము పుచ్చుకొనలేదు. దినములో నధిక భాగము పూజ జపధ్యానములలో గడిపెడు వాడు. నిత్యప్రార్థనల సమయమున ఆయన "ఆయాహి వరదా దేవి..." అని గాయత్రీ జపము చేయునపుడు ఆయన ఱొమ్ము విరివియై రక్తమువికి కన్నీటితో తడిసిపోవును. పూజ, లేక ఇతర సాధనలయందు నిమగ్నుడు కాని సమయమున రఘువీరు నలంకరించుటకై సూదిదారముతో పూలమాలలు గ్రుచ్చుచు కాలము గడపెడివాడు. అబద్ధపు సాక్ష్యము చెప్పుటనుండి తప్పించుకొనుటకై అతడు పిత్రీయమైన గృహావాసమును వదలుకొనెను. గ్రామస్థులు ఆయనపట్ల ఒక మహర్షి కర్హమైన గౌరవమును భయభక్తులను చూపెడి వారు.'

*　　*　　*

'ఒకప్పుడు మా తండ్రి గయాతీర్థమునకు పోయెను. అచ్చట రఘువీరుడు కలలో అతనితో నిట్లనెను. "నేను నీ పుత్రుడనై జన్మించెదను." అది విని మా తండ్రి యతనితో "దేవా! నేనొక బీదబ్రాహ్మణుడను. నేను నిన్నెట్లు సేవింపగలను?" అని యర్థించెను. "దానినిగూర్చి చింతింపకుము. అదియంతయు మఱియొకరు చూచుకొందురు" అని ఆయన ప్రత్యుత్తర మిచ్చెను.'

*　　*　　*

'ఆ ప్రాంతములందు బాలురకు మధ్యాహ్నమునకై బొరుగుల నిత్తురు. వీనిని వారు రెల్లు బుట్టలయందో మరియు బీదవారైనచో ధోవతి కొంగులనో కట్టుకొని వీధిలోనికో పొలముల లోనికో ఆడుకొనుటకు పోవుదురు. నా కాఱే డేండ్ల వయస్సున జూన్ - జూలై మాసమున నొకనాడు బుట్టిలోని బొరుగులు తినుచు వరి చేల గట్లవెంబడి నడచుచుంటిని. ఆకసము వైపు చూడగా ఒక నల్లటి మేఘము కన్పించెను. ఆకసమునంతను కప్పివేయుచు అది త్వరత్వరగా వ్యాపించుచుండగా మంచువలె తెల్లనైన ఒక కొంగలబారు ఆ నల్లటి మేఘమున కెదురుగ ఎగిరిపోయెను. అది యెంతటి మనోహర దృశ్యమై కన్పట్టినదనగా నా మనస్సు సుదూరప్రాంతములు సంచరింప నేగినది. బాహ్యస్మృతిని కోల్పోయి నేను క్రిందబడితిని, బొరుగులు నలుదిక్కుల చెదరిపోయినవి. అట్టి స్థితిలో నన్ను ఎవరో కొందఱు కనుగొని నన్నెత్తుకొని ఇంటికి తీసికొనిపోయిరి. సమాధియందు పూర్తిగా బాహ్యస్మృతి కోల్పోవుట నా కదియే ప్రప్రథమము.'

*　　*　　*

'నా చిన్నతనమున కామార్పుకూరునందలి స్త్రీ-పురుషులకు నాపై సమముగనే ప్రీతి. నా పాటలు వినుట యనిన వారికెంతో ఇష్టము. ఇతరుల మాటలను చేతలను నేను అనుకరింప గలిగెడువాడను. అందువలన వారిని నా విధముగ వినోదపెట్టెడివాడను. స్త్రీలు నాకు పెట్టుటకై భక్ష్యములను దాచియుంచెడివారు, నాపై

నెవ్వరికిని అపనమ్మకము లేదు. ఎల్లరును నన్ను కుటుంబములో నొకనినిగనే చూచెడివారు.

'కాని నేను ఆనందముల పావురమువలె నుంటిని. ఆనందముగనుండెడి కుటుంబములకే తఱచుగ పోయెడివాడను. ఎప్పుడైనను దుఃఖము బాధచూచినచో అటనుండి పరుగెత్తి పోయెడివాడను.

'ఊరియందలి ఒకరిద్దరు బాలురు నాకు చాలదగ్గరి స్నేహితులు. నేను వారితో చాల చనవుగ నుంటిని. కాని ఇప్పుడు వారు పూర్తిగ సంసారమునందు మునిగిపోయిరి. వారిలో కొందఱు అప్పుడప్పుడు నన్ను చూచుటకు వత్తురు. ఇట్లందురు ''ఆశ్చర్యము! ఊరి పాఠశాలలో ఎట్లుండెనో సరిగా అట్లే యున్నట్లు కన్పించుచున్నాడు!'' పాఠశాలకు పోవుచుండినపుడు లెక్కలు నన్ను గాభరాపెట్టెడివి. కాని నేను ఎంతో చక్కగా రంగులు వేసెడి వాడను. దేవతల చిన్న ప్రతిమలను కూడ చేయ గలిగెడువాడను.

'సాధువులకు బీదలకుగా నేర్పరుపబడిన సత్రములకు తఱచుగాపోవుట నాకెంతో ఇష్టము. గంటలతరబడి వారిని గమనించుచుండెడి వాడను.

'రామాయణము భాగవతమువంటి పవిత్ర గ్రంథపఠనము వినుటయనిన నాకెంతో ప్రీతి. పాఠకులకేవైన వింత చేష్టలున్నచో నేను వానిని సులభముగ ననుకరించి నా యనుకరణతో నితరుల నానందపెట్టెడువాడను.

*   *   *

'బాలకులు లౌకికుల సాంగత్యమున నానందింపలేరు. రాఖాలు ఇట్లనెడువాడు ''లౌకికులను చూచినతోడనే నాకు చిరుకంపము కలుగును.'' నాకు మొదట ఆధ్యాత్మికానుభవములు కలుగుట మొదలైనపుడు లౌకికులు వచ్చుట చూచినతోడనే నా గదితలుపులు వేసికొనెడివాడను.

'కామార్పుకూర్ నందు బాల్యావస్థలో రాంమల్లికు నెంతో ప్రేమించితిని. కాని తరువాత, నేనిక్కడకు వచ్చినపుడు, అతనిని స్పృశింపనైన స్పృశింపలేకపోయితిని. మా బాల్యమున రాంమల్లికు నేనును ప్రాణమిత్రులము. రాత్రింబవళ్లు కలిసియే ఉండెడివారము. కలిసియే నిద్రించెడివారము. అప్పుడు నాకు పదునారు పదునేడేండ్ల వయస్సు. ''వారిలో ఒకటు స్త్రీయైనచో వారిరువురు పెండ్లిచేసి కొనెడివారు'' అని జనులనెడివారు. ఇరువురము అతని ఇంటివద్ద ఆడుకొనెడివారము. ఆ రోజులు నాకు చాల జ్ఞాపకము. అతని బంధువులు పల్లకీలలో సవారియై వచ్చెడివారు. ఇప్పుడు అతనికి చానక్ వద్ద నొక దుకాణము. అతని కొఱకు నేనెన్నియోసార్లు కబురంపితిని; అతడీటీవల నొకసారివచ్చి రెండుదినము లిచ్చట గడిపెను. తనకు బిడ్డలు లేరని రాం అనెను. తన మేనల్లుని పెంచుకొనెను కాని ఆ బాలుడు చనిపోయెను. ఒక నిట్టూర్పు వదలుచు అతడిది నాతో చెప్పెను; అతని కన్నులు కన్నీరు క్రమ్మినవి; మేనల్లునికొఱకై అతడు శోకసంతప్తుడయ్యెను. తమకు బిడ్డలు లేనందున తన భార్య ప్రేమయంతయు మేనల్లునిపై తిరిగెనని యతడనెను. దుఃఖముతో ఆమె పూర్తిగా తలమునుకలయ్యెను. రాం ఆమెతో నిట్లనెను. ''నీకు పిచ్చిపట్టినది. ఏడ్చుటవలన నీవేమి బావుకొందువు! వారణాసికి పోవుదువా!'' చూచితిరా? అతడు తన భార్యకు పిచ్చి యనెను. బాలునిగూర్చిన దుఃఖము అతనిని పూర్తిగా నీరవుని చేసెను. అతనియందేమియు సత్తాలేదని తెలిసికొంటిని. అతనిని స్పృశింపలేకపోయితిని.

ప్రభాప్రసారము
(సంపాదకీయము)

# భారతీయ వ్యక్తిత్వము

> ప్రతి హిందూ బాలుడును పుట్టునప్పుడు తన తోడ తెచ్చికొను నిర్ణీత కర్తవ్యమెద్ది? బ్రాహ్మణ జన్మను గురించి మనువు ఏమని ధీరముగా ప్రతిజ్ఞ చేసెనో మీరు చదివియుండలేదా? బ్రాహ్మణ జన్మ "ధర్మమను ధనాగారముయొక్క రక్షణకొఱకు" అని ఆయన వ్రాసియున్నాడు, ఆ మాట ఈ పుణ్య భూమియందు జన్మించు బ్రాహ్మణునికేగాక ప్రతి వానికిని జీవిత పురుషార్థమని నేను చెప్పుచున్నాను. మన జీవితమందలి యే ఇతర సమస్యయైనను ఈ ఏకైక సూత్రమునకు లోబడియుండవలసినదే: రాజకీయాధికారము ప్రధాన జీవిత ధర్మముగా గల ఒక జాతి యుండవచ్చును. ఆ ముఖ్య జీవిత ధర్మమునకు వారి మతమును వారి సర్వ మును లోబడి నడువవలసినదే. అధ్యాత్మ జ్ఞాన మును వైరాగ్యమును ప్రధాన జీవనధర్మముగా గలిగి 'ఈ ప్రపంచమంతయు బూటకము; మూన్నాళ్లముచ్చట' అనెడు ధర్మసూత్రముపై నడచుచున్న మఱొకజాతి ఇక్కడ నున్నది. సర్వ మును- ప్రకృతిశాస్త్రములుగాని సంపదలుగాని కళలుగాని భోగములుగాని అధికారములుగాని పేరుగాని ప్రతిష్ఠలుగాని - ఆ ఒక్క ధర్మమునకు లోబడి పోవలసినవే. భారతీయుని శీలముయొక్క రహస్య మిది, ప్రతి హిందూ శిశువునకును నైజ మైన ఈ ఒక్క ప్రధాన ధర్మమునకు అనగా- పారమార్థికతకు జాతిపవిత్రతకు- అతని సర్వ స్వము లోబడవలసినదే. యూరపియనులవలన అతడు గ్రహించిన ప్రకృతి శాస్త్రవిజ్ఞానమేకాక తన కలిమి పదవి ప్రఖ్యాతి సర్వమును దానికి లోబడి తీఱవలెను. అదియే వాని జాతీయ జీవన మునకు కీలకము।
>
> —శ్రీ వివేకానందస్వామి.

మానవుడు తనకు తాను నిర్ణయించుకొను విలువలను వివిధ పరిస్థితులలో అతడు వాని విషయమై అంగీకరించు సర్దుబాటులను బట్టి అతని వ్యక్తిత్వ మేర్పడుచుండును. ఈ విలువ లెంత స్పష్టముగ నుండి వాని విషయమై అత డెంత తక్కువ సర్దుబాటు నంగీకరించునో అతని వ్యక్తిత్వ మంత విశిష్టముగ నెన్నబడుచున్నది. మహాత్మాగాంధి మహాత్ముడైనచో అది ఆయన తన అహింసావ్రతము సత్యప్రియత్వము మొద లగు ఆశయములను ఎట్టి పరిస్థితులలోనైనను విడనాడకుండుటవలననే. సుభాష్‌చంద్రబోసు ఇప్పటికిని దేశమందనేకులకు ప్రియతముడైనచో అది మహాత్ముని దేదీప్యమానమైన ప్రభావము నెదుట వెలవెలబోవని అతని ఆత్మవిశ్వాసము వలననే. ఇట్టి వ్యక్తిత్వ మెట్లేర్పడుచున్నది? జీవితమున ప్రతి చిన్న యంశమునందును పరి స్థితుల నెదిరించి తన విలువలను నిలువబెట్టు కొనుటచేతనే. జీవితమున బాల్యమాదిగ నెదు రగు అనేకములగు చిన్నచిన్న సమస్యలను జాగరిత బుద్ధితో సరిగా పరిష్కరించుకొను కొలది క్రమముగ కేవలము అభ్యాసవశముననే క్లిష్ట సమస్యలయందును మనస్సు సరియగు రీతిని పనిచేసి సరియగు పరిష్కారమునే ఎన్ను కొనును. ఇట్లాక నిశ్చితమగు వ్యక్తిత్వ మేర్ప డిన మానవుడు హఠాత్తుగ తన వ్యక్తిత్వము నకు పూర్తిగ భిన్నమైన విలువల నెదుర్కొని నపుడు వానిని గ్రహించి తన వ్యక్తిత్వమున కనుగుణముగ మలచుకొని జీర్ణించుకొనవలెను. అట్లుగాక తన వ్యక్తిత్వమును వదలుకొని ఇతర విలువలను స్వీకరింప ప్రయత్నించినచో వానిని స్వీకరింపలేకయు తన వ్యక్తిత్వమును

వదలుకొనలేకయు పిచ్చిపట్టియో ఆత్మహత్య చేసికొనియో నశించును.

వ్యక్తి విషయమున నెట్లో దేశము విషయమునను అట్లే కాలక్రమమున నొక వ్యక్తిత్వమేర్పడుచుండును. ఆ వ్యక్తిత్వమున కనుగుణముగనే వివిధ పరిస్థితులయం దేర్పడు నూతనానుభవములు స్వీకరింపబడుచుండును. జపాను దేశమునకు దేశభక్తి మూలసిద్ధాంతము. రాచరికము వెలసినన్నాళ్లును ప్రజలు రాజులచే పాలింపబడిరి. రాజులును ప్రజలును దేశమునకు వన్నె తెచ్చిరి. పరిస్థితులుమారి రాచరికము నిలువజాలని పరిస్థితి యేర్పడగనే సామంతులు ఇతర రాజపురుషులు నిస్సంకోచముగ తమ హక్కులను వదలుకొని తమ దేశభక్తిని వెల్లడించిరి. సమైక్యదేశమై పురోగమించిరి. ఆర్థిక పరాక్రమమే జీవనసూత్రమైన ఈనాడు సంఘటితదేశమై సర్వవిధముల ఆర్థిక పురోగమనము సాధించి జపానుదేశ మలరారుచున్నది. అన్ని దేశములయందును జపాను దేశము జపానుదేశీయులు గౌరవమును సంపాదించుకొనిరి.

అమెరికా దేశమునకు వ్యక్తిస్వాతంత్ర్యము కీలకము. ఇతర దేశములనుండి స్వాతంత్ర్యపిపాసువులై వచ్చినవారి దేశమది. ఆ స్వాతంత్ర్యాన్వేషణయే వారిని అన్నిరంగములయందును అగ్రగాములను చేయుచున్నది. స్వాతంత్ర్యము ననుసరించియే వారికి తెలిసిన జీవితాశయమగు ఆనందమును వారు సాధించుకొనుచున్నారు. స్వాతంత్ర్యము నన్వేషించుచునే వారు చంద్రమండలమునకు గ్రహాంతరములకు పయనించుచున్నారు. ఆ స్వాతంత్ర్యముతోనే వారు జీవితమునగల అన్ని వ్యవస్థలను తల్లక్రిందులుచేసి అన్నివిధముల పరీక్షించుచున్నారు. వారి కళలు శాస్త్రవిజ్ఞానము సారస్వతము అన్నియు స్వతంత్రముగ, వారి స్వాతంత్ర్యమున కాశయమగు ఆనంద సముపార్జనకై, ఉపయోగించుకొనుచున్నారు. ఆ స్వాతంత్ర్యముతోనే ఆధ్యాత్మికత కేకైక మార్గమగు యోగమునుకూడ ద్విగుణీకృత భౌతికానందమునకు సాధనముగ మలచికొని వారుపయోగించుకొనుచున్నారు.

ఇక భారతీయుల వ్యక్తిత్వమునకు ఆధ్యాత్మికతయే మూలస్తంభము. చరిత్రకందని కాలమున సైతము భారతీయులు అగ్నిని వరుణుని ప్రార్థించినపుడును ధర్మముకొఱకే విశ్వశాంతికొఱకే 'దేనిని తెలియుటచేత సర్వమును తెలియబడుచున్నదో దానిని తెలియుట' కొఱకే ప్రార్థించిరి. తమ జీవితములను వెచ్చించిరి. అనుక్షణమును జీవన పరమగమ్యమును సాధింపగోరి శతాబ్దముల పర్యంతము చేసిన యన్వేషణయే భారతీయ తత్త్వశాస్త్రము. దాని యభ్యాసమే సనాతనధర్మము. వేదకాలమున నగ్నిహోత్రమును నిలిపికొనినపుడును బౌద్ధులకాలమున దేవాలయములు నిర్మించినపుడును మహమ్మదీయులు ఆంగ్లేయుల పరిపాలనయందు వర్ణవ్యవస్థను బిగదీసినపుడును భారతీయులయందు తత్త్వాన్వేషణయే ప్రకటితమైనది. దానికొఱకై వారు తక్కిన యానందములనన్నింటిని వదలుకొనిరి. రాజకీయ స్వాతంత్ర్యము ఆర్థిక స్వాతంత్ర్యము సామాజిక స్వాతంత్ర్యము దేనినిగూడ భారతీయులు గణింపలేదు. కాని వారి యాధ్యాత్మిక స్వాతంత్ర్యమునుమాత్రము వారు అణుమాత్రమైనను వదలుకొనలేదు. ఆ కారణముననే భారతీయులు ఇంకను వర్ధిల్లుచున్నారు. ఆధ్యాత్మికమార్గమున పురోగమించుచున్నారు. అట్టి భారతీయుల ఆధ్యాత్మిక మహావృక్షమున నొక

వినూత్న ఫలగుచ్ఛమే శ్రీరామకృష్ణ వివేకానందబోధ.

ప్రస్తుతసమయమున భారతీయు లెన్నడును ఎదుర్కొనని విచిత్ర పరిస్థితి ఎదురైనది. బౌద్ధులైనను మహమ్మదీయులైనను ఆంగ్లేయులైనను దేశమునకు విపరీతపు విలువల నెక్కువగా కొనిరాలేదు. అన్నియు మతవిషయకమైనవే. ఆధ్యాత్మికవాసన గలిగినవే. వాని నన్నింటిని భారతదేశము సులభముగనే జీర్ణము చేసికొనినది. ఆధునిక కాలమున మతమునే సమూలముగ తిరస్కరించు చార్వాకము మరల విజృంభించినది. ప్రపంచమున నే విషయమైనను దైహిక మానసిక ఆనందమునకు సాధనము మాత్రమేననియు అట్టి ఆనందమును మించిన గమ్యము లేదనియు ప్రకటించు పాశ్చాత్య సంస్కృతి భారతీయుల కెదురైనది. పాశ్చాత్యుల లౌకికాభ్యుదయము ఆనందాన్వేషణయందు స్త్రీ-పురుషుల స్వేచ్ఛ ఆనందాన్వేషణయందు వారి సాంకేతిక పురోగతి ఆనందాన్వేషణయందు వారి కావశ్యకమగు నిరంతర వైచిత్రి భారతీయుల కనులు మిరుమిట్లు గొల్పుచున్నవి. ఈ పైపై మెరుగులు పాశ్చాత్యుల యాంతరముననున్న మితిలేని యాక్రోశమును అశాంతిని కప్పివేయుచున్నవి. భారతీయులను, వారి గాఢము నిశ్చలము శాశ్వతానంద సాధకము అగు ఆధ్యాత్మికతను శతాబ్దుల నిరంతరాన్వేషణ ఫలితమును ఒక్కసారిగా వదలివేయ ప్రలోభింపజేయుచున్నవి.

భారతీయు లీనాడు తమ ఆధ్యాత్మిక వ్యక్తిత్వమును నిలువబెట్టుకొని ఈ బాహ్యాడంబరములను దాని కనుగుణముగ మలచుకొనిననే వారి జాతి వర్ధిల్లగలదు. రాజకీయ స్వాతంత్ర్యము సంపాదింపబడినది. పారిశ్రామికాభ్యుదయము నానాటికి పెరుగుచున్నది. సాంకేతిక విజ్ఞానము పెంపొందుచున్నది. మన శస్త్రశాస్త్రము వైద్యవిజ్ఞానము సామాజిక జీవనము అన్నియు వికసించుచున్నవి. అన్నిటియందును పాశ్చాత్యుల యనుకరణము కన్పించుచునే యున్నది. ఈ పరిస్థితిని భారతీయ గమ్యమగు ఆధ్యాత్మిక సాధనకై త్రిప్పవలయును.

భారతీయులు ఆర్థిక పురోగమనమును సాధించినచో అది పాత్రత తెలిసి దానము చేయుటకే, ఇతరులకై వినియోగించుటకొఱకే. బొక్కసములలో దాచి భోగభాగ్యములలో మునిగి తేలుటకు కాదు. సాంకేతిక విజ్ఞానము పెంపొందించుకొనినచో అది మన దేశము స్వయంసమృద్ధమై ప్రజ లనాయాసముగ ఆధ్యాత్మికమార్గము నవలంబించి పరస్పర సహకారమును అన్యోన్య పురోగమనమును సాధించుటకే. మారణాయుధములను కనిపెట్టి పరస్పరవినాశమును సాధించుటకు కాదు. విద్య దేశము దెల్లెడల వ్యాపించినచో అది ఆధ్యాత్మికగమ్యమును తెలిసికొని సకల కార్యకలాపములను ఆధ్యాత్మికదృష్టితో చేయుట యెట్లో తెలిసికొనుటకే, భోగతృష్ణాపీడితులై కామకాంచనములందు తగుల్కొనుటకు కాదు.

కనుక ఆధునిక కాలమున సాధింపబడు అత్యంతాధునిక ప్రగతుల నన్నింటిని మనము మనకు జీవగఱ్ఱయగు యాధ్యాత్మిక గమ్యమున కనుగుణముగ మలచుకొనవలసియున్నది.

# శ్రీకృష్ణావతారము

విద్వాన్ - పమిడికాల్వ చెంచునరసింహశర్మ

## (ఉత్తరార్థము)

ఇట్లు శుద్ధ విద్యాశక్తి పురుషమూర్తి నవ ధరించిన కారణముచే నవవిద్యాశక్తు లెనిమిదియు నాతనికి భార్యలై యాశ్రయించినవి. ఈ విషయము పోతన ముందే నిరూపించియున్నాడు. మన నల్లనయ్యకు పుట్టకముందే కన్యా నిశ్చయము ముహూర్తవిధులు జరిపించి బ్రహ్మాది దేవతలకుఁ దాంబూలాము లిచ్చి పంపించినాడు. ఎందుకు జేయడు? ఆయన యందఱివలె "విన్నంత" మాత్రమే చెప్పువాడు కాదే! "కన్నంత, తెలియవచ్చినంత" తేటపఱచువాడు గదా! ఆ పరమభక్తి జ్ఞాననిధి కా మహానందాంగనా డింభకుని విషయమునఁ గైవల్యకాంక్షతోపాటు కల్యాణ వాంఛకూడ తొలుతనే కల్గిన దేమో! ఆ రెండవది లేకున్న మొదటిది సిద్ధింపదని యా మహాత్ము డెఱుగకుండునా? ఆ యష్టవధూరత్నము లెవ్వరో తెలిసికొందము "భూమి రాపోఽనలో వాయుః ఖం మనోబుద్ధి రేవ చ అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా" (భగవద్గీత) అని మూలప్రకృతి యొక్క విక్షేపశక్తి రూపము లెనిమిది విధములుగా నిర్ణయింపబడినవి. 1. భూమి, 2. జలము, 3. అగ్ని, 4. వాయువు, 5. ఆకాశము, 6. మనస్సు, 7. బుద్ధి, 8. అహంకారము. ఈ ప్రకృతి తత్త్వములు పరమపురుషుని సేవించినవని యంతరార్థము. ఇందు మనము గ్రహింపవలసిన దేమి? బాహ్యలీలావిలాసము లగు శ్రీకృష్ణుని భార్యలకును నీ ప్రకృతులకును సంబంధమున్నదా? లేదా? యనుట ప్రకృత చర్చనీయాంశము. ఇది వివాహ విషయ మగుటచే కాలవయోభేదముల ననుసరించి పై తత్త్వముల వరుసక్రమములో నున్న కన్యలే రారు మొత్తముపై గ్రహింపవలసియుండును. వ్యావహారికముగా ప్రథమ సతీమణి రుక్మిణీదేవి. ఈమె తత్త్వమేదియో కనుగొందము.

ఈ వధూలలామ 'రమాభగవత్యంశభవ' యని మొదటనే పోతనగారు 'రం' బీజప్రాధాన్యమును సూచించియున్నారు. ఆమె పేరు నట్టిదియే. 'రుక్' అనగా కాంతి. "హిరణ్యవర్ణాం హరిణీం" "ఆదిత్యవర్ణే తపసోఽధి జాతో" "పద్మేస్థితాం పద్మవర్ణాం" ఇత్యాది ఋక్కులచే నరుణకాంతి విరాజిత యనబడినది. కావున రుక్మిణి యను పేరు సార్థకము. 'ర'కార మగ్నిబీజ ముందురు. ఇన్ని కారణములచే నీమె యగ్నితత్త్వ మనఁదగును. పైగా పవిత్ర భావశీల సంపత్తులచేతను నగ్నితత్త్వమునే యనుసరించి యున్నది. అసలు శ్రీ శక్త్యర్థములోను అగ్నిబీజ మావరించియే యున్నది. ఇక సత్యభామాదేవి గుణశీలాదికము లోకప్రసిద్ధము. రుక్మిణి యందు శ్రీ దేవ్యంశ ముండుటచే గొంత రజోగుణ మాపాదించి యుండును. కాని యీ సుందరీమణియందు రజస్తమస్సులు తాండవించు చున్నవని యామె స్వాధీనపతికా భావమే తెల్పుచున్నది. సత్రాజిత్తునకు గొడుకులు లేనందున నీ కూతురియందే తన స్వభావము సుప్రతిష్ఠితమై యుండవచ్చును. దానిచేఁ దండ్రిపోలిక తక్కిన పిల్లలకన్న నీమెయందే బాగుగా కానవచ్చుచున్నది. పోతనగారీమెను "యశఃకామ" "ముఖనిర్జితసోమ" యనుటచే మిగుల సౌందర్యవతి యనియు గీర్తిప్రతిష్ఠల కాశించునదియు నని తెలియనగును. ఇట్టి కారణములచే నహంకారతత్త్వస్వరూపిణిగా నీమెను గైకొనవచ్చును.

ఇకఁ గాళిందీదేవి విషయము కొంత విచారింతము. ఈమె సూర్యభగవానుని సుపుత్రికారత్నము. ఆమె యెవ్వరిని వరింపక విష్ణుదేవునే పెండ్లాడుదునని పట్టుబట్టి తండ్రిచే గల్పింపఁబడిన యమునానదీ జలాంతర్గృహమున దపస్సు చేయుచుండ శ్రీకృష్ణుఁడు పార్థుఁడు నచ్చటికి రాగా నామె గ్రహించి శ్రీకృష్ణభగవానునిఁ బెండ్లియాడినదట! ఈ విధముగ నీమె చరిత్రమే చాటుచుండ ప్రత్యేకసూచ్యార్థము లవసరము లేకయే బుద్ధితత్త్వమని యెన్నవచ్చును. ఇంతటి సహజ నిశ్చయబుద్ధి, తపోనియతి, మఱెవ్వరి కున్నది? తర్వాత మిత్రవింద విషయమున చరిత్రాంశము లెక్కువగా వివరింప లేదు. కావున నిందు పోతన గారి వర్ణనాంశముల సూచ్యార్థములే శరణ్యము. "నిత్యాపూరిత సుజనానంద" "చారుచికుర కాంతి విజితషట్పద బృంద"యై యున్నదట! మిత్రవింద. అనఁగా సర్వగ్రహ నక్షత్ర చంద్రభానుల దీప్తులచేతను 'ఆకాశ శరీరం బ్రహ్మే'త్యాది బ్రహ్మభావనల చేతను, సర్వదా సుజనానందము వెల్లివిరియించునదియు, శిరోజనీల కాంతి భాసురమైనదియు నగు నాకాశతత్త్వమని భావింప నగును. అట్లుగాకున్న మహాలక్ష్మి, రుక్మిణి యుండగా "నిత్యాపూరిత సుజనానందదాయిని" మిత్రవింద యెట్లగును! పోతనగారి భావగర్భితవిశేషణములు తీసివేయ దగినవి కావు. ఇక నాగ్నజిత్తి వృత్తాంత మరయుదము. ఈమె కోసలాధిపతియగు నగ్నజిత్తుని కూతురు. ఈ కన్నియ వివాహవిషయమున నాతఁ డొక పందెము బెట్టినాడు. తనవద్ద గల వాడికొమ్ములు గలవియు మహాబలసంపన్నము లైనవియు నగు నేడు వృషభములతో బోరాడి వానిని గెల్చిన వారికిఁ గన్య నిచ్చి పెండ్లి చేయుదు నని చాటించినాడు. ఎవ్వరి కా పని సాధ్యముగాక పోవుటచే శ్రీకృష్ణుఁ డచ్చటి కేతెంచి వృషభములతోఁ బోరి సులభముగా వానిని గెల్చి యామెను బెండ్లాడెనట! ఈ సందర్భమున నా రమణీలలామ శ్రీకృష్ణుఁడు తమ యింటి కేతెంచి నప్పటినుండియు, నాతనిపై మరులుగొని ఈ జగన్మోహనాకారుఁడైన గోవిందుడు నన్ను గైకొన్నచో నా తొంటి నోము ఫలించినట్లే యని యెంతో యాందోళన పడుచుండినదట! తన కామె సంకల్పమే నెఱవేరినది. "కన్యా వరయతే రూప" మ్మనునది యీ కామిని విషయమున స్పష్టముగా దోచుచున్నది. అది మనోవిషయిక మగుటచే నీ నాగ్నజిత్తిని మనస్తత్త్వముగా దలంపవచ్చును. ఇందుల కీమె చరిత్రమే సాక్ష్యమైనది.

ఇక భద్రాదేవిని గురించిన చరిత్రాంశము లెక్కువగా లేనందున సూచ్యార్థములే గ్రాహ్యములు. ఈమె కేకయరాజు కూతురును, సుదర్శన రాజేంద్రుని చెల్లెలును గృష్ణునికి మేనమఱదలును నై యున్నదట ఈ కన్నియను వర్ణించుచు పోతన "ఇద్ధనయోన్నిద్ర, ప్రపూర్ణ సద్గుణ సముద్ర అక్షుద్ర" అన్నాడు. ఈ విశేషణము లన్నియు జలతత్త్వమును సూచించుచున్నవి. గొప్ప జీవనచైతన్యము గలిగి భూతలమెల్లను విస్తారముగా నాక్రమించి పరిశుద్ధభావము గలిగియుండునది జలమే కదా! కావున నీ భద్రను జలతత్త్వముగా నూహింపవచ్చును. ఇక లక్షణాదేవి చరిత్రమునందును జరిత్రాంశము లెక్కువగా లేవు. కావున సూచ్యార్థములే గ్రహింతము. ఈమె మద్రభూపతి తనయ. ఈ కన్యకను గైకొను సమయమున బోటిగా వచ్చిన మదాంధులైన వైరి భూపతులను బాఱద్రోలి శ్రీకృష్ణుడు పెండ్లియాడెనట! ఈమె వర్ణనములో "సమదమృగేక్షణ, నయవిచక్షణ లక్షణ, పుణ్యలక్షణ" అను విశేష

ణములు వాడినాడు పోతన. చంచలస్వభావము జగత్ప్రాణ, తాపహరణాది సులక్షణత్వము, సహజపావనత్వము మొదలైనవి వాయుగుణము లగుటచే నీ లక్షణము వాయుతత్త్వముగా నెన్నుకొనవచ్చును. ఇందులో దాలివిశేషణమే యీమె వాయుతత్త్వ మని సూచించుచున్నది. వాయువాహనము లేడి. దాని కమిత చంచలత్వము. వాయువున కదియే ముఖ్య లక్షణము. అట్టి చంచలదృష్టులు గలది లక్షణ యైనది. అందుచే వాయుతత్త్వ భావనలే యిందు సూచితములు. ఇక జాంబవతి మిగిలియున్నది. ఆమె విషయమునను చరిత్రాంశములు లేవు. కాని జాంబవంతుని కూతురనియు, నతఁడు కృష్ణునితోఁ బోరాడి సత్యము గ్రహించి తన కుమారిత నిచ్చి పంపె నన్న కథాంశము కొద్దిగా నున్నది. ఆమె వర్ణనములో మాత్రము "బాలామణి కన్యకారత్నము" అని సమానార్థక విశేషణములు వాడినాడు - పోతన. శమంతకమణితో నీ బాలికామణియు గుదిరినది. ఈ రత్నోపమానద్వయసారస్యముచే నీమె రత్నగర్భయగు భూతత్త్వమూ యనిపించుచున్నది. అందులో నీమె భల్లూకరాజ సంతానము. అందుచే భూతత్త్వమే ప్రధానము.

ఈ విధముగా మూలప్రకృతియొక్క భిన్నాంశము లెనిమిదియుఁ దమ యధిపతియగు శ్రీకృష్ణభగవానునికి సతీరత్నములై భాసిల్లినవి. త్రిమూర్తుల విషయమున నాదిశక్తి చర్యలు నింతియే కదా! త్రిగుణాత్మిక లగు సరస్వతీ లక్ష్మీ గౌరీ దేవ్యాఖ్యలతో వారి నాశ్రయించియే యున్నది. ఇట్టి శాక్తేయ మహత్తర శృంగార రసాకర్షణ ప్రభావము శ్రీకృష్ణుని బాల్య చేష్టలనుండి వెల్లివిరిసిన దనుటకు వారి జీవిత చరిత్రమే ప్రబలసాక్ష్యమై యున్నది. అదియుఁ జిదచిత్ప్రకాశిత మగుటచే బాహ్య విశ్వ సమ్మోహనమే కాని యంతరమున నిత్య బ్రహ్మచారిత్వమే సుప్రతిష్ఠితము. అందుకే "అనాది బ్రహ్మచారీ చ కృష్ణా వ్యసన కర్మకః" అన్నారు. పరీక్షిన్మహారాజు శ్రీకృష్ణుని జారవినోదక్రీడల విషయమంతయు విని శుకమహర్షితో "ధర్మకర్తయు ధర్మభర్తయు ధర్మమూర్తియునైన సత్కర్ముడీశుఁ డధర్మశిక్షయు ధర్మరక్షయు జేయఁగా నర్మిలిన్ ధర మీఁద బుట్టి పరాంగనాజన సంగమే ధర్మ మంచు దలంచి చేసె నుదాత్త మానస చెప్పుమా" యన్నాడట! దాని కాయన "గోపజనములందు గోపికలందును సకల జంతులందు సంచరించు నా మహాత్మునకు బరాంగన లెవ్వరు! సర్వమయుడు లీల సలిపె గాక" అని చెప్పెను. కావున నిందు జారత్వాది దోష భావములు స్వాధీనమాయకుల కంటవు. మాయాధీనులగు ప్రాణులకే యా కర్మబంధముల చేటుపాటులు. తన రూపములతో దానాడుకొనుటలోఁ దప్పేమున్నది? ఇది యిందలి పరమార్థము.

"నగుమొగమున్ సుమధ్యమును నల్లని
మేనును లచ్చి కాట ప
ట్టగు నురమున్ మహాభుజము లంచిత
కుండల కర్ణముల్ మదే
భగతియు నీలవేణియుఁ గృపారసదృష్టియుఁ
గల్గు వెన్ను డి
మ్ముగ బొడసూపుగాత! కను మూసిన
యప్పుడు విచ్చినప్పుడున్"

(ఆంధ్ర భాగవతము - పోతన మహాకవి)

# శ్రీరామకృష్ణాష్టకము

## కళాప్రపూర్ణ నిడుదవోలు వెంకటరావు

ఉ. శ్రీలలితానుభూతి తనఁ జెందఁగ బాహిరమైన యట్టి మా
యాలయమెల్ల దాఁటి సకలాగమసాధన మించి ఆత్మరే
ఖాలయమందు మాతను ముఖాముఖినే దరిసించె నట్టి యు
ద్వేలుఁడు రామకృష్ణగురుదేవుఁడు మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్. 1

ఉ. ఎంచఁగరాని శక్తి నిఖిలేంద్రియవృత్తులఁ గట్టి కామినీ
కాంచనముల్ జయించిన యఖండ మహామహిమోన్నతుండునై
మించిన లోకసంగ్రహ సమీహితబుద్ధిని యోగవిద్య బో
ధించిన రామకృష్ణగురుదేవుఁడు మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్. 2

చ. చదువుల సారమున్ దెలిసి శాస్త్రము లెల్లను నాకళించినన్
మెదడును పెంపుసేయుటకు మించిన మార్గమె కాని ఎన్నడున్
హృదయము పెంపుసేయదని యీడితశక్తిని చాటినట్టి స
ద్విదితుఁడు రామకృష్ణగురుదేవుఁడు మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్. 3

చ. మతములు వేఱువేఱయిన మానస మొక్కటియే యటంచు సం
గతి విడనాడ డంచును, వికారవిదూరిత యోగమార్గమే
గతి యని భారతీయులకు కామితమిచ్చు నటంచు దెల్పె హ్రా
ద్వితతుఁడు రామకృష్ణగురుదేవుఁడు మాకు ప్రసన్నుఁ డయ్యెడున్. 4

ఉ. భావము నిశ్చలంబయిన, భార్య, గృహంబును గల్గియుండియున్
జీవిత మెప్పు డన్యగతిఁ జెంద దటంచును శారదామణీ
దేవి పరిగ్రహించి, తన దృష్టిని నిల్పెను లోకమాత నా
ధీవరి రామకృష్ణగురుదేవుఁడు మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్. 5

ఉ. దీపిత భారతీయ జగతీతల పీడిత భావదాస్యమున్
బాపుచు నార్షసంస్కృతి ప్రభావము సర్వదిగంతరాళికిన్
ప్రాపుగఁ జేసి చేతనను భారతజాతికిఁ గూర్చినట్టి యు
ద్దీపుఁడు రామకృష్ణగురుదేవుఁడు మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్. 6

చ. నిరతము దక్షిణేశ్వర మునీంద్రుఁడు నాగ ప్రసిద్ధికెక్కి వి
స్ఫురదురు భారతీయ పరిపూర్ణ మహత్తర యోగతేజ భా
స్వరమును పూర్వపశ్చిమ దిశానవఖండము నిండఁజేయు సు
స్థిరుఁడగు రామకృష్ణగురుదేవుఁడు మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్. 7

ఉ. భూవలయంబునం దొలి నపూర్వత వెల్గియు నన్యపాలనన్
ధావితమైన యా భరతధాత్రికి నూతన దివ్య చేతనో
జ్జీవన కారణంబగుచు సిద్ధి వహింపఁగఁ జేసినట్టి మా
దేవుఁడు రామకృష్ణగురుదేవుఁడు మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్.

ఉ. హృష్టము సర్వమానవ సుఖైకదమై చెలువొంద నాత్మ
పుష్టినిఁ గూర్పఁగా నిడుదవోలు కులుండగు వేంకటాఖ్యు డీ
యష్టకమున్ రచించె సుజనావళి మోదమునంద భక్తి సం
ధృష్టత, రామకృష్ణగురుదేవ! ననుం దయఁజూడు మెప్పుడున్.

# యువకులకు శ్రీ వివేకానందుల పిలుపు

## ఉద్బోధ

నడువుడు. ఎచ్చెచ్చట మహామారి క్షామము చెలరేగుచున్నవో ఎచ్చెచ్చట జనులు దురవస్థ పొలగుచున్నారో మీరందఱు ఆయా చోట్లకు పొండు. వారి వ్యథల నుపశమింప జేయుడు. మహా అయినచో మీ రా ప్రయత్నములో మరణింపవచ్చును. అయిన నేమి! ప్రతినిత్యము మీవంటి వా రెందఱు క్షుద్రకీటకములవలె పుట్టుట లేదు. చచ్చుట లేదు? దానివలన ఈ విశాలవిశ్వమున కేమైన భేదము కన్పించుచున్నదా! చావు ఎప్పటికైన తప్పదు. కాని చచ్చుట కొక గొప్ప ఆదర్శము నుంచుకొనుడు. జీవితమున నొక ఉత్తమాదర్శము నుంచుకొని దానికై మృతినొందుటయే శ్రేయస్కరము, ఈ దేశభవిష్యత్తును గూర్చిన ఆశ లన్నియు మీ మీదనే ఉన్నవి. మీరు నిష్క్రియులై కాలము గడపుట చూడ నా కెంతో బాధ కలుగుచున్నది. కార్యారంభులు కండు. కార్యదీక్ష బూనుడు. జాగుసేయకుడు. దినదినము మృత్యువు సమీపించు చున్నది. సర్వము దేనికాలమున అది ఎప్పుడో జరుగునని సోమరులై కాలము గడపకుడు. ఆ విధముగ ఏ పనియు జరుగదు. గుర్తుంచుకొనుడు.

ఈ జీవితమా క్షణభంగురము. ప్రాపంచిక భోగములా క్షణికములు. పరులకై ఎవరు జీవింతురో వారే నిజముగా జీవించినవారు. ఇతరులు జీవించియు చచ్చినవారితో సమానమే.

ఇతరులకు స్వాతంత్ర్య మిచ్చుటకు సిద్ధపడని వాడు స్వాతంత్ర్య మనుభవించుట కర్హుడేనా! నిరర్థకమైన ధుమధుమలతో మనశక్తినంతయు వ్యర్థము గావించుటకు మారుగా మగటిమితో శాంతముగా కార్యాచరణ కుపక్రమింతము. నావఱకు నేను, దేని కెవరు నిజముగ అర్హులో వారికి దానిని చెందనీయకుండ చేయుటకు ఈ విశ్వమున ఏ శక్తికి సాధ్యము కాదని దృఢముగా విశ్వసింతును. గడచిపోయిన కాలము గొప్పదే, నిజమే. కాని భవిష్యత్తు ఇంత కంటెను ఉజ్జ్వలముగా నుండునని నేను నిశ్చయముగా నమ్ముచున్నాను. పవిత్రత, ఓర్పు, పట్టుదలలయందు సుస్థిరులమై యుండునట్లు ఆ శంకరుడు మనల ననుగ్రహించు గాక!

మనకు కన్పించు మానవ మృగములు నూటికి తొంబదిమంది చచ్చినవారే. దయ్యములే—నాయనలారా! ప్రేమించువారే జీవింతురు. అన్యులు కాదు. పరితపించుడు. బిడ్డలారా! అనుతాపమును చెందుడు. పేదలకై అజ్ఞానులకై అధఃపతితులకై పరితపించుడు. అప్పుడు ఆ భగవంతుని చరణారవిందముల యందు మీ హృదయమును క్రుమ్మరింపుడు. మీకు శక్తి అప్పుడు వచ్చును. సాయము వచ్చును. అణచుటకు శక్యముకాని ఉత్తేజము కల్గును. నా వత్సలారా! భయమందకుడు. నక్షత్ర ఖచితమైన ఆకాశమువైపు, అది మిమ్ము అణచివేయునేమో అనునట్లు, భీతదృక్కులతో పైకి చూడకుడు. కొలది గంటల కాలములో అది పూర్తిగా మీ పాదములక్రింద నుండును. ధనము రక్షింపదు. కీర్తి రక్షింపదు. ప్రతిష్ఠ రక్షింపదు. పాండిత్యము రక్షింపదు, రక్షించునది ప్రేమ. కష్టపరంపరలు అను దుర్భేద్యములగు అంతరాయములను చీల్చుకొని పో గలిగినది శీలమే.

తేజమును కలిగియుండుడు. అన్ని వైపులకు వ్యాపింపుడు. కార్యదీక్ష వహింపుడు. నాయకత్వము వహించునపుడు సేవకులుగా మెలగుడు. నిస్స్వార్థముతో నుండుడు. ఒక మిత్రుడు మఱొకనిని రహస్యముగా నిందావాక్యములని నచో వాని మాటల నాలింపకుడు. అపారమైన ఓర్మి కలిగియుంటిరా ఇక జయము మీదే. ఇతరులపై అధికారము చెలాయింపకుడు. కేవలము పరశ్రేయమునకై పని చేయుటయే నిజమైన జీవనము. కావున పనిచేయుడు.

జాగరూకులరై యుండుడు. అసత్యమేదైననుసరియే, జాగ్రత్త సుమా! సత్యమును అంటిపెట్టుకొని యుంటిమా, జయించి తీఱుదుము. అలస్యమైన కావచ్చునేమో గాని జయము తథ్యము. పని పూర్తిగా మీ యొకరి మీదనే ఆధారపడియున్నట్లు పని చేయుడు. అయిదువేల సంవత్సరములు మీకై నిరీక్షించుచున్నవి. భావిభారతభాగ్యోదయము మీమీదనే ఆధారపడి యున్నది. పని కొనసాగించుడు. మీ కందఱకు నా ఆశీర్వాదములు.

ఇదివరలో మనము పని పాడు చేయలేదు. నిస్సందేహముగా లేదు. మన సంఘము చెడ్డది కాదు, మంచిదే. నే నాశించునది, అది మఱింత మంచిగా ఉండవలె ననియే. తప్పునుండి ఒప్పునకు కాదు, చెడునుండి మంచికి కాదు. సత్యము నుండి పరమ సత్యమునకు, మంచినుండి అంతకంటె మంచికి, అత్యంత శ్రేష్ఠత్వమునకు రావలెను. నేను నా దేశీయులకు చెప్పునదేమనగా ఇప్పటివఱకు మీరు చక్కగనే పని చేసి యున్నారు. మీ రింకను చక్కగా పని చేయుట కిది తరుణము.

నా విధాన మిది — ఋషులు నిర్దేశించిన మార్గమున పురోగమించుట. అనేక శతాబ్దముల బానిసత్వముచే సంప్రాప్తమైన తమస్సును పూర్తిగా దులిపివేయుట తప్ప హిందువులు ప్రత్యేకముగా దేనిని త్యజింప నవసరము లేదని నిరూపించుట. మనము మన మార్గములోనే మన విధానములోనే ముందునకు సాగవలసి యున్నది. ప్రతి జాతికి ఒక ప్రధాన జీవన స్రవంతి యున్నది. భారత దేశమున కిది మతము (ధర్మము). దానిని బలిష్ఠము చేయుడు. అప్పుడు ఆ స్రవంతి కిరువైపుల నున్న నీరు దానితో ముందునకు సాగిపోయి తీఱును.

నీవు భారతీయుడవని గర్వపడుము. సగర్వముగా ఇట్లు ప్రకటింపుము. ''నేను భారతీయుడను. ప్రతి భారతీయుడును నా సహోదరుడు''

సగర్వముగా ఉచ్చైఃస్వరముతో ఇట్లు ఘోషింపుము, "భారతీయుడు నా సోదరుడు. భారతీయుడు నా ప్రాణము. భారతీయ దేవతలే నా దైవతములు. భారత సంఘము నా బాల్య డోలిక, నా యౌవననందనవనము, నా వార్ధక్య వారణాసి." సోదరా, ఇట్లనుము. "భారతభూమి నా మహోన్నత స్వర్గము. భారత దేశశ్రేయమే నా శ్రేయము." అహోరాత్రములు ఇట్లు ప్రార్థింపుము. "ఓ మహేశ్వరా! ఓ లోకేశ్వరీ! నాకు ధీరత్వమును ప్రసాదింపుము. ఓ శక్తిమాతా! నా దౌర్బల్యమును తొలగింపుము. నాలోని పిరికితనమును తీసివేయుము. నన్నొక ధీర పురుషుని గావింపుము."

---

# భక్తిరత్నావళి

| మూలము : | వ్యాఖ్యాత |
|---|---|
| **శ్రీ విష్ణుపురి** | **విష్ణుచిత్తుడు** |

(ప్రథమ విరచనము)

## 74-76

జ్ఞానము మోక్షదాయకమనుట సత్యమే. కాని భక్తియొక్క విశిష్టత యేమన అది జ్ఞానమార్గమున కవసరమగు నియమనిష్ఠ లేవియు లేకనే జ్ఞానమును కల్గింపగలదు. అంతియగాక అందేయపాయమును లేదు. ఇట్టి భాగవత ధర్మసారమును కవియను యోగి చెప్పుచున్నాడు.

యేవై భగవతా ప్రోక్తా ఉపాయా హ్యాత్మలబ్ధయే
అంజః పుంసామవిదుషాం విద్ధి భాగవతాన్ హి తాన్
యానాస్థాయ నరో రాజన్న ప్రమాద్యేత కర్హిచిత్
ధావన్నిమీల్య వా నేత్రే న స్ఖలేన్న పతేదిహ
కాయేన వాచా మనసేంద్రియైర్వా బుద్ధ్యాత్మనా వానుసృతా స్వభావాత్
కరోతి యద్యత్సకలం పరస్మై నారాయణేతి సమర్పయేత్. (11-2-34-36)

వేదశాస్త్రముల నధ్యయనముచేయని సాధకులు భగవత్ప్రాప్తినందుటకు సులభ మార్గముగ భగవంతుడు భక్తిమార్గమను భాగవతధర్మమును స్వయముగ నుపదేశించి యున్నాడు.

ఈ మార్గమునను సరించు మానవున కపాయములేదు. పతనములేదు. కన్నులు మూసికొని పరుగుతీసినను అతని యడుగులు తప్పవు. క్రిందబడడు. (అజ్ఞానముతో సాధన చేసినను ప్రమాదము లేదనుట.)

మనోవాక్కాయములచేతను బుద్ధిఆత్మలచేతనైనను ఏమిచేసినను, అనగా వేదవిహిత కర్మలుమాత్రమేకాక దైనందిన చర్యల నన్నింటిని భగవత్ప్రీత్యర్థము నారాయణున కర్పింప వలెను.

## 77

సర్వమును నారాయణార్పణముచేయు నీ యుద్దేశమునే ప్రబుద్ధుడను యోగి విశదీక రించుచున్నాడు.

ఇష్టం దత్తం తపో జప్త్వం వృత్తం యచ్చాత్మనః ప్రియమ్
దారాన్ గృహాన్ సుతాన్ ప్రాణాన్యత్ పరస్మై నివేదనమ్. (11-3-28)

చేయు యజ్ఞదానములను జపతపములను ఇతర కర్మలను పరమాత్మునకు నివేదన ముగ నీయవలెను. తనకు ప్రియతమములగు ఇల్లువాకిండ్లను భార్యాపుత్రులను తుదకు ప్రాణ ములను సైతము పరాత్పరునకు నివేదింపవలెను.

## 78

ఇట్టి భక్తినేల యభ్యసింపవలెనో కవియను యోగి నిమిచక్రవర్తితో చెప్పు చున్నాడు.

భయం ద్వితీయాభినివేశతః స్యాదీశాదపేతస్య విపర్యయోఽస్మృతిః
తన్మాయయాతో బుధ ఆ భజేత్తం భక్త్యైకయేశం గురుదేవతాత్మా. (11-2-37)

భగవద్విముఖులగువారు అతని మాయకు వశులగుదురు. తత్ఫలితముగ వారు తమ యాత్మభావమును మరచిపోయి శరీరమే తామని భ్రమించుచుందురు. ఇట్టి శరీరభావమువలన వారు తమకు (తమ శరీరములకు) విరుద్ధములగు శక్తులనుజూచి భయమునకు లోనగుచున్నారు. కనుక సర్వులకును గురువు దైవమును ఆత్మయునగు పరాత్పరు నెల్లరును ప్రీతిపూర్వకమగు భక్తితో సేవింతురు గాక.

# ప్రవృత్తి నివృత్తుల సమన్వయము

రమణ

ప్రాచీనకాలమున మానవులు ధార్మిక జీవనము ననుసరించు రోజులలో చతురాశ్రమములు అమలునం దుండెడివి. బ్రహ్మచర్యము గృహస్థము సన్న్యాసము అనునవి తప్పనిసరిగా పాటింపబడుచుండెడివి. బ్రహ్మచర్యముబాల్యావస్థలో విద్య నార్జించిన తదుపరి దేశాటనము చేసి లౌకికజ్ఞాన మార్జించుటకు, గృహస్థము సంసారజీవితమును ఒడుదుడుకులు లేక నడుపుకొనుచు సహాయ మర్థించువారికి బాసటగా నుండుటకు, వానప్రస్థము సాంఘికసేవ యొనరించుచు అనుభవమునుబట్టి వలయువారికి సలహాల నొసంగుటకు, సన్న్యాసము వైరాగ్యమును వహించి ఆశ్రమవాసియై భగవంతుని గూర్చి తపస్సు చేయుటకు వినియోగ పడుచుండెడివి.

ఇయ్యవి అనుల్లంఘనీయములు. గృహస్థములో తప్ప తక్కిన యాశ్రమములలో ధనార్జన మను దానికి స్థానము లేదు. తక్కిన యాశ్రమముల నున్న వారు శాంతియుతముగా జీవనము సాగించెడి వారు.

అధునాతన కాలములో మానవులు చతుర్విధాశ్రమములను పాటించుట లేదు. ధనాశ మెండగుటవలన ఎల్లరును—బాల్య యౌవన కౌమార దశలయందున్న వారు—విధివిరామ మెఱుగనివారై ఏదేనొక వృత్తిని చేపట్టి తత్సాధనమునకు కృషి చేయుచున్నారు. నీతిని పాటించుట లేదు. ద్రవ్యోల్బణము వలనను కృత్రిమముగా సృష్టింపబడిన కాటకమువలనను నిత్యావసర వస్తువులు లభింపక ప్రజలు కష్టములకు గుఱి యగుచున్న ఈ కాలములో ధనార్జనమునకు పూనుకొనిన వారికి నల్లబజారు ధరల పెంపకము వగైరాలు అండదండలైనవి. ఈ ధనవ్యామోహము వలన మానవుడు ఆత్మశాంతిని కోలుపోయి వేసిన తాయి కంతయు వెఱ్ఱిమొఱ్ఱిగా పరువు లిడుచున్నాడు.

ఇయ్యది భౌతికవాదముయొక్క ప్రభావము. అమెరికా దేశీయులను ఇందులకు ఉదాహరణముగా పేర్కొనవచ్చును. సిరిసంపదలతో తులతూగుచున్న అమెరికనులు ఆత్మశాంతిని కోలుపోయి అసంతృప్తితో కొట్టుమిట్టాడుచున్నారు. ఆత్మశాంతికొఱకు అన్వేషణ చేయుచున్నారు. అనేకులు అమెరికనులు హిప్పీలుగా తయారై భారత దేశమున పర్యటించుట చూచుచున్నాము. వారిని ప్రశ్నింప వారు తమ పర్యటన ఆత్మశాంతి సముపార్జన కొఱకని చెప్పుచున్నారు. ఈ పరిస్థితి భౌతికవాదము ననుసరించియే సంభవించినది. ఆధ్యాత్మికవాదము ననుసరింపని కొఱత తేటతెల్లముగా విదితమగుచున్నది.

భారత దేశమున ఆధ్యాత్మిక చింతన పరివ్యాప్తమై యున్న రోజులలో ప్రజలు శాంతితో మనుగడ సాగించుచుండిరి. అధునాతన కాలములో ఆధ్యాత్మికచింతన అడుగంటి పోయినందున ఎంతో విస్తృతమైన కార్యరంగము కనిపించుచున్నను, మానవులు కార్యదక్షులై యున్నను శాంతిని కోలుపోయి శోకతప్తులగుచున్నారు.

ఈ యస్తవ్యస్త పరిస్థితులకు పరిష్కారమెయ్యది? శాంతి సంస్థాపనమునకు మార్గమెయ్యది? అన్న ప్రశ్నలు మేధావి వర్గము నెదుర్కొనుచున్నవి. వేదకాలమునందు వలె కర్మపరిత్యాగ మొనరించి వైరాగ్య మూని తపస్సు చేసికొనుటయా? లేక శ్రీ వివేకానంద స్వామి సలహా ననుసరించి మానవాళి మధ్య వసించుచున్నను తామరాకుపై నీటిబిందువువలె నిస్సంగుడై సేవాపరాయణుడై జీవించుటయా?

వేదకాలమునందువలె నేటి మానవుడు వైరాగ్య మూని తపస్సు చేసికొనుట పొసగదు. కాలగమనమునందు సమాజము పురోగమించి నేటి స్థితిని చేరుకొన్నది. కార్యరంగమునందు మానవుడు తల మునకలుగా పడిపోయినాడు. భారత దేశమునకు పరిసర ప్రాంతములగు రష్యా చైనా వియత్నామ్ రాజ్యములందు కమ్యూనిజము పాలన చేయుచున్నది. అచ్చట భౌతికవాదము తప్ప ఆధ్యాత్మిక వాదము మచ్చునకైనను కన్పింపదు. కార్యరంగమునందు మానవుడు తలదూర్చి అధికోత్పత్తికై కృషి చేయుటయే ధ్యేయము. ఆ విధానమునకు భారత భూమిని గల యనేకులు స్వాగతము పలుకుచున్నారు. కాగా కార్యపరిత్యాగము (నివృత్తి) చేపట్టుట పొసగదు. ఇక శ్రీవివేకానందస్వామి సలహా మేరకు సమాజ మధ్యమునందుండియు శాంతి నన్వేషింపవలసి యున్నది.

క్రియాశీలత్వము వెనుక ద్వివిధములైన భావన లున్నవి. (1) నేను చేసిన కర్మయొక్క ఫలమును, ఉద్దేశించినపుడు ఉద్దేశించినవిధముగ ననుభవింపగలను. (2) అట్లు కానిచో నేను కర్మ చేయను. కాని సాధారణముగ ఇందులకు విపరీతముగ జరుగుచుండును. ఏకర్మయును నిరర్థకము కాదు. చేసిన ప్రతికర్మకును ఫలమను భవింపక తప్పదు. కాని ఆ ఫలము మన ముద్దేశించినపుడు కలుగక పోవుటచేతను ఒకవేళ కలిగినను ఉద్దేశించిన ఫలము కలుగక పోవుటచేతను మనము దుఃఖమగ్నుల మగుచున్నాము. కనుకనే ఆనందముగ నుండుటకు భగవద్గీత, ఉత్తమమార్గము నుపదేశించుచున్నది

కర్మజం బుద్ధి యుక్తాహి
ఫలం త్యక్త్వా మనీషిణః
జన్మబన్ధ వినిర్ముక్తాః
పదం గచ్ఛ న్త్యనామయమ్॥

బుద్ధిమంతుడగు మానవుడు కర్తవ్యమగు కర్మ నవశ్యము చేయవలెను. కాని కర్మఫలమును గూర్చి ఆశింపరాదు. అపుడే అతడు దుఃఖరహితు డగును.

నేను ఫలముతోగూడ పనిని విడనాడుదు ననువారు తమోగుణప్రధానులు. అరణ్యములో ముక్కు మూసికొని తపస్సు చేసికొందు ననువారు మారినకాలము దృష్ట్యా ఈ కోవకు చెందినవారు. ''నేను కర్మఫలమును అనుభవింతును. అందుకొఱకే కార్యమును చేయుదును'' అనువారు రజోగుణ ప్రధానులు. వీరు నేటి సమాజము నిండా ఉన్నారు. ''నేను పని చేయుదును. కాని ఫలమును కోరను. ముందుగాని వెనుకగాని ఫలమును గూర్చి ఆలోచింపను.'' అను వారు సత్త్వగుణప్రధానులు. వీరు నేడు కావలయును. రజోగుణప్రధాను లందఱు సత్త్వగుణప్రధానులుగా మారిననాడు సమాజము శాంతి కాలవాలము కాగలదు.

కామముతో క్రియాశీలుడైన వానికంటె నిష్కామముతో క్రియాశీలుడైనవా డధికుడు ఇందొక విశేషము కూడ కలదు. ఫలమును కాంక్షించి పని చేయునాడు తన కాలములో నధికభాగమును ఫలితములను గుఱించి యోచించుచు వ్యర్థము చేయును. ఫలాపేక్ష లేని క్రియాశీలుడు ఏకాగ్రతతో తన యావత్కాలమును కార్యమునందు ప్రయోగించి అత్యుత్తమమైన ఫలమును సాధించుచున్నాడు శ్రద్ధలేనివాని కార్యమునకంటె కార్యమునం దానందించువాని పని మిక్కిలి శ్రేష్ఠము. మనస్సు స్థిమితముగా నుండుటచేత కార్యమును చక్కగ నొనరింప గలుగును. ఆ కార్యమునందు సౌందర్యము గోచరించును.

ఫలాపేక్ష గలవాడు పనిని స్వార్థబుద్ధితో జూచును. కార్యము సర్వోత్కృష్టముగా నెఱవేఱదు. ఫలాపేక్ష లేనివాడు కార్యము విధ్యుక్తధర్మ మని భావించి స్వబుద్ధితోను న్యాయదృష్టితోను కార్యమునందు నిమగ్ను డగును. కార్యము ద్విగుణీకృతముగ ఫలించును.

భారత దేశమున ప్రజలు శాంతియుతముగ జీవింపవలయునన్న భగవద్గీతయందు బోధింపబడిన నిష్కామకర్మమును అవలంబింపవలెను. మతకర్తలు ఆధ్యాత్మికవాదులు ప్రజలయందు నిష్కామకర్మయోగమును ప్రచారము చేయవలయును. అప్పుడే దేశమున శాంతి నెలకొనగలదు.

# శ్రీశంకరభగవత్పాదులు

**శిష్టా లక్ష్మీనారాయణ**

పరిత్రాణాయ సాధూనాం
వినాశాయ చ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ
సంభవామి యుగే యుగే॥

సాధుజనులను రక్షించుటకు దుష్టులను శిక్షించుటకు పతనమౌతున్న ధర్మమును మరల ఉద్ధరించుటకు భగవంతుడు అవతారమెత్తుతూ ఉంటాడు. ఇది సత్యము. మానవజాతి చరిత్రలో ఎందరో మహర్షులు తత్త్వవేత్తలు నాయకులు జన్మించి వారు తలపెట్టిన కార్యం ముగియగానే ఈ పాంచభౌతిక కాయాన్ని వదలి వేయడం మనందరికీ తెలిసిన విషయమే. వీరే యుగపురుషులు. శ్రీరామ[illegible] డు వీరంతా అవతారపురుషులు. అట్లాగే ఈ కలియుగంలో కూడా చాలమంది అవతార పురుషులు జన్మించి మహత్తరమైన విషయము లను సాధిస్తూ మానవజా[illegible] వన్నె తెస్తున్నారు. అట్టివారిలో శ్రీశంకరభగవత్పాదులు ఒకరు.

శ్రీశంకరభగవత్పాదులు క్రీ. శ. 788 లో కేరళలోని కాలడి అనే ఒక గ్రామంలో జన్మించారు. బౌద్ధమతము విపరీతంగా పెరిగి వైదిక మతముయొక్క బలము క్రమముగా నశించు చున్న రోజులవి. ఎప్పుడైతే బ్రాహ్మణులు వైదిక కర్మకాండలలోని తత్త్వమును మఱచి వానిని గ్రుడ్డిగా ఆచరించటం మొదలు పెట్టారో, అప్పుడు బౌద్ధము, వైదికమతమునకు వ్యతిరేకోద్యమముగా కాక, సంఘంలో వెఱ్ఱి తలలు వేస్తున్న వైదిక కర్మకాండకు వ్యతిరేకంగా వెలిసింది. బుద్ధుడు ఈ రకమైన వైదిక కర్మకాండను ఖండించి మానవాళి మనస్సంతా అష్టాంగమార్గంవైపు మళ్లించాడు. గౌతమబుద్ధుడు వేదములలోని జ్ఞానాన్ని బాగా జీర్ణంచేసికొని ఆనాటి పరిస్థితుల ననుసరించి ప్రజలకు కావలసినవిమాత్రమే బోధచేశాడు. అటువంటిమతము దేశములో విపరీతంగా వ్యాపించి, వేదమతముయొక్క అస్తిత్వానికే ముప్పువాటిల్లిన సమయంలో శ్రీశంకరభగవత్పాదులు, వేదమతాన్ని పునరుద్ధరించటానికి సాక్షాత్తు శ్రీశంకరుని అంశతో మానవజన్మ నెత్తారు. వీరు అవతారపురుషులు కాబట్టే తమ ఎనిమిదవ ఏటనే సన్న్యసించి పదునారవ ఏటికే బ్రహ్మసూత్రభాష్యము మొదలగు అనేక గ్రంథములను రచించి శిష్యులకు బోధించిరి. తరువాత దేశమంతటా కాలినడకను పర్యటించుచు అనేకులైన బౌద్ధాచార్యులను వాదమున ఓడించి దేశములో అయిదుచోట్ల (బదరి ద్వారక పూరి శృంగేరి కంచి) మఠము లను స్థాపించి క్రీ. శ. 820 లో ఈ భౌతిక కాయమును వదలి పరమేశ్వరునియందు లీనమైరి.

శ్రీశంకరులు అద్వైతమతస్థాపకులు. "ఏది అమరము, సర్వశక్తివంతము, సర్వవ్యాపకమునై ఆదిమధ్యాంతరహితమై ఉంటుందో అదే బ్రహ్మము. సత్యమైన పదార్థము ఒక్కటే మిగిలినవన్నీ మిథ్యాభూతములే." అని [శ]ంకరులు సిద్ధాంతీకరించారు. వీరి సిద్ధాంతాన్ని ఈవిధంగా చెప్పారు.

బ్రహ్మసత్యం జగన్మిథ్యా
జీవో బ్రహ్మైవ నాపరః.

శంకరులు ప్రస్థానత్రయమును (ఉపనిషత్తులు భగవద్గీత వేదాంతసూత్రములు)

మథించి అద్వైతసిద్ధాంతాన్ని చేశారు. వ్యక్తిగతమైన అనుభవమే మతమునకు హృదయము. కేవలము అర్థరహితములైన శుష్కతర్కవాదములు కావు. కానీ తర్కంకూడా అవసరమే ఉపనిషత్తులు బ్రహ్మముయొక్క శాశ్వతత్వాన్ని గూర్చి చెప్పినవి. బ్రహ్మపదార్థాన్నే శుద్ధచైతన్యం అన్నారు దాని తుల్యమైనదికానీ మించినదికానీ వేఱొకటి లేదు. ఆ శుద్ధచైతన్యము నిర్గుణమైనది నిర్వికారమైనది. అది ఆలోచనలవలన తెలుసుకోబడే భావముకాదు. అది సచ్చిదానంద స్వరూపము. అదే అన్ని కార్యకారణములకు ఆదిమధ్యాంతరహితమైన మూల కారణము. ఇది బ్రహ్మము, అని మనం అసంపూర్ణమైన మనస్సులతో చెప్పలేము. కారణం ఏమిటంటే శుద్ధ చైతన్యమైన ఆ పదార్థం ఈ పంచేంద్రియ జ్ఞానమునకు మించిన సత్యమూర్తి. ఎప్పుడైతే మనము ఇది బ్రహ్మము అది బ్రహ్మము అని చెప్పడం మొదలుపెట్టామో అప్పుడు ఆ అనంతమైన బ్రహ్మమును మన సంకుచితమైన మనస్సులతో కించపరుస్తున్నట్లే. కాబట్టి శ్రీ శంకరులు ఇది బ్రహ్మము కాదు, ఇది కాదు (నేతి, నేతి) అని వ్యతిరేకముగా చెప్పారు. బ్రహ్మము బాహ్యచక్షువుల కగోచరమైనది, మాటలతో 'ఇది' అని చెప్పుటకు వీలుపడనిది. దీనినే శ్రీ శంకరులు శుద్ధ చైతన్యముగా సృష్టికి మూలమైనదిగా సృష్టిలో నిహితమైనదిగా సృష్టికి అతీతమైనదిగా ఎంచారు. వారు బ్రహ్మమునకు సృష్టికి గల సంబంధాన్ని గురించి యే విధంగా సిద్ధాంతీకరించారో పరిశీలిద్దాం.

వీరు వివర్తవాదస్థాపకులు, సాంఖ్యుల పరిణామవాదము అద్వైతుల వ్యావహారిక సత్యములతో సంబంధము కలిగియున్నది. సాంఖ్యులకు కారణం కార్యం రెండూ సత్యమే. కానీ అద్వైతులకు కార్యము కారణము వ్యావహారిక సత్యముతో సంబంధించినవి. బ్రహ్మమే సత్యము. ఈ బ్రహ్మమును మించి, జీవులకు ప్రకృతికి ఒక స్వతంత్రమైన అస్తిత్వం అంటూ ఏమీ లేదు. ఈ సృష్టికి మూలం బ్రహ్మము సృష్టి బ్రహ్మము యొక్క వేఱు రూపం కాదు. ఈ సృష్టి కంతటికీ మూలకారణమైన బ్రహ్మములో ఈ సృష్టివలన ఏ రకమైన మార్పూ రాదు. వివర్తవాదం బ్రహ్మమునకు ఈ సృష్టికి గల అపురూపమైన సంబంధాన్ని తెల్పుతుంది. ఈ సృష్టికి మూలకారణమైన బ్రహ్మము సృష్టికన్నా అతీతము. కానీ కార్యమైన (effect) ఈ సృష్టికి బ్రహ్మమునుండి వేఱైన అస్తిత్వం లేదు. కారణం (cause) కార్యం లాగా అగుపిస్తుంది. కార్యంలో ఉన్న లోపాల వలన కారణంలో (బ్రహ్మములో) ఎటువంటి మార్పూ ఉండదు నిరంతరం మార్పులకు లోనయ్యే ఈ సృష్టి, దీనికి మూలకారణమైన ఆ బ్రహ్మములో ఎటువంటి మార్పును తీసుకురాలేదు. కారణమునకు (బ్రహ్మమునకు) కార్యమునకు (సృష్టికి) చాల అంశాల్లో భేదం ఉన్నది. ఈ సృష్టి అనిత్యమైనది, నిరంతరము మార్పునకు లోనయ్యేది. కాని బ్రహ్మము శాశ్వతమైనది, మార్పు లేనిది. ఈ సృష్టి శాశ్వతమైన సత్యము కాదు. కారణ మేమిటంటే, అదే కనుక శాశ్వతమయిన సత్యమైనట్లయితే ఒక స్వతంత్రమైన అస్తిత్వం దానికి ఉండాలి. అటువంటిది సృష్టికి లేదు. కాబట్టే 'జగన్మిథ్య' అనవలసి వస్తోంది. అంటే జగము బొత్తిగా లేదని అభిప్రాయము కాదు. నిత్యమైనది కాదని మాత్రమే. ఈవిధంగా కార్యము (ఈ ప్రపంచము) కారణంకంటే (బ్రహ్మముకంటే) భిన్నమైనదిగా కనబడడానికి కారణం మాయయే.

శ్రీ శంకరులు తన అద్వైతసిద్ధాంతాన్ని అపూర్వమైన తర్కాన్ని, అనుమాన ప్రమాణాన్ని, వేదప్రమాణాన్ని ఆధారంగా చేసికొని సమర్థించారు. ఇటువంటి అసమానమైన తర్కం ముందు మహా పండితుడైన మండనమిశ్రుడు కూడా తల వంచాడు. బ్రహ్మము ఒకటే సత్యమయినది. అంతా బ్రహ్మమే. ఈ సృష్టి అంతా మాయాసంజనితమే. బ్రహ్మము మాయ వలన సృష్టిగా గ్రహింపబడుతోంది. ఈ సృష్టి సత్యము నిత్యము అనుకోడానికి కారణం ఒక వ్యక్తియొక్క అవిద్యయే. మాయ అన్నది సృష్టి దృష్ట్యామాత్రమే. అదే ఒక వ్యక్తిపరమైనపుడు దాన్ని అవిద్య (అజ్ఞానం) అన్నాం. జీవుడు అవిద్యచేత ఆవరింపబడి ఉండటంవలన ఈ బ్రహ్మమునుండి తన్ను తాను భిన్నంగా ఎంచుకుంటాడు. అవిద్యయే వ్యక్తిలోని అహంకారాన్ని కలుగజేస్తుంది. ఈ అవిద్యయు భ్రాంతియు జ్ఞానముచేతనే నశిస్తాయి. వ్యక్తి తాను జీవించియుండు కొలది సంవత్సరములు పుణ్యకార్యములచేతనూ శాస్త్రవ్యాసంగముచేతనూ చిత్తశుద్ధి సంపాదించి తద్వారా ఈ అవిద్యను జ్ఞానముచేత రూపుమాపాలి. బ్రహ్మైక్యము పొందాలి. అదియే మోక్షము.

శ్రీ శంకరులు తమ సిద్ధాంతమును మాయావాదంవల్ల సాధించారు. 'మాయ' అనే పదం శ్వేతాశ్వతర ఉపనిషత్తులో పేర్కొనబడియున్నది.

> మాయాం తు ప్రకృతిం విద్యాత్
> మాయినం చ మహేశ్వరమ్
> తస్యావయవ భూతైస్తు
> వ్యాప్తం సర్వ మిదం జగత్.

ఏవిధంగానైతే చీకటిలో తాడుపాముగా కనబడుతుందో అలాగే అవిద్యవలన నిరంతరం మారుచుండు లోనయ్యే క్షణికమయిన ఈ ప్రపంచం శాశ్వతంగానూ ఆత్మనుండి భిన్నంగానూ కనబడుతుంది. తాడు పాముగా కనబడిన భ్రాంతి శాశ్వతం కాదు. క్షణికమే. అట్లాగే అవిద్యకూడా శాశ్వతంకాదు. సృష్టి ఈవిధంగా కనుపించటానికి కారణం మాయయే. 'మాయ'ను చేతనధర్మం అంటారు. ఇది బుద్ధిలోనే ఉంటుంది. మాయకు మొదలనేది లేకపోయినా బ్రహ్మమువలె అది అమరమైనది కాదు. మాయ ఒక పదార్థంయొక్క నిజస్వరూపాన్ని కప్పిపుచ్చడమే కాకుండా దానిస్థానంలో మరియొక క్రొత్త వస్తువును చూపిస్తుంది. మనము వ్యావహారిక దృష్టితో చూచినపుడే ఈ ప్రపంచమంతా సత్యము. కాని పారమార్థికదృష్టితో పరిశీలించినపుడు బాహిరమైన పాంచభౌతిక ప్రపంచము అసత్యము అశాశ్వతము అని తెలుస్తుంది. శంకరులు ఈ పదార్థప్రపంచం అంతా మిథ్య మాయాజనితమైనది అన్నప్పుడు, ఆకాశకుసుమమువలె కుందేటి కొమ్మువలె శాశ్వతమైన అసత్యము అశాశ్వతము అని కాదు. ఒక వ్యక్తికి బ్రహ్మజ్ఞానం వలన జ్ఞానోదయం అయ్యేవరకూ ఈ భౌతిక ప్రపంచం శాశ్వతమే. ఈ ప్రపంచం సత్యమైనదికాదు. ఎందుకనగా ఇది బ్రహ్మమువలె అమరమైనదికాదు. కానీ చాలమంది తత్త్వవిమర్శకులు ఈ విషయాన్ని అర్థం చేసికోలేక శంకరుల అద్వైతాన్ని నిరంతరం ఈ ప్రపంచంయొక్క అశాశ్వతత్వాన్ని బోధించే నీరసమయిన తత్త్వముగా జమకట్టారు.

శ్రీశంకరులు గొప్పజ్ఞాని, వేదాంతి మహాభక్తులు కూడాను. మానవుడు మోక్షాన్ని జ్ఞానంద్వారానేకాక, భక్తికర్మమార్గముల

ద్వారా కూడా సాధింపవచ్చు. నిరంతరం శుష్కమైన తర్కంచేత మనస్సులను పాడు చేసికొనడంకంటే ఆ సచ్చిదానందస్వరూపుని పాదాల్నే నమ్ముకొని జీవితయాత్ర సాగిస్తే మోక్షం తప్పక లభిస్తుంది. శ్రీశంకరులు వ్రాసిన శతకము లన్నిటిలోకి "శివానంద లహరి" చాల మహత్తరమైనది. దీనిలో శ్రీశంకరభగవత్పాదులు కేవలం భక్తునివలె కాక మహాకవిగా కనిపిస్తారు. పార్వతీనాథుని పూజించుటకొరకు పూలు తీసుకురావటానికి కొలనులోదిగి అడవులలోతిరిగి తెలివితక్కువ వారు తమ అమూల్యమైన కాలాన్ని వృథా చేస్తారు. వారికి తమవద్దనున్న హృదయకమలాన్నే ఆ పార్వతీనాథునికి సమర్పిద్దామనే ఆలోచనే ఉండదు. ఈ భావాన్నే శ్రీశంకరులు ఈవిధంగా చెప్పారు.

> గభీరే కాసారే విశతి విజనే ఘోరవిపినే
> విశాలే శైలే చ భ్రమతి కుసుమార్థం జడమతిః,
> సమర్ప్యైకం చేతస్సరసిజమ్ ఉమానాథ భవతే
> సుఖేనావస్థాతుం జన ఇహ న జానాతి కిమహో॥

నిరంతరము తర్కము వ్యాకరణము పఠించుటవలన ముక్తిరాదు. ఆ గోవిందుని పాదాల్ని నమ్ముకుంటే తప్పక మోక్షం వస్తుంది. ఈ విషయాన్నే స్పష్టంగా భజగోవింద శ్లోకాల్లో చెప్పారు.

> భజగోవిందం భజగోవిందం
> గోవిందంభజ మూఢమతే
> సంప్రాప్తే సన్నిహితే కాలే
> నహి నహి రక్షతి డుకృఞ్కరణే.

శ్రీశంకరులు అవతారపురుషులు. పెచ్చు పెరుగుతున్న నాస్తికమతమును రూపుమాపి వైదిక ధర్మమును పునరుద్ధరించుటే వారి ధ్యేయం. అందువల్ల శ్రీశంకరులు చిన్న వయస్సులోనే సన్న్యసించి పదునారవ సంవత్సరానికల్లా మహాభాష్యాన్ని వ్రాసి దేశమంతా పర్యటించి తమ ప్రజ్ఞావిశేషాలచే బౌద్ధమతాన్ని ఖండించి వైదికమతాన్ని పునరుద్ధరించారు. దేశంలో నాల్గుదిక్కుల తమ జ్యోతిని వెలిగించి ముందుతరాలవారికి ఎంతో మేలు చేశారు. ముప్పదిరెండు సంవత్సరాలకే బ్రహ్మైక్యం పొందారు.

> అధిగత భిదా పూర్వాచార్యా నుపేత్య సహస్రధా
> సరిదివ మహీభేదాన్ సంప్రాప్య శౌరి పాదోద్గతా
> జయతి భగవత్పాద శ్రీముఖాంబుజ నిర్గతా
> జననహరణీ సూక్తిః బ్రహ్మాద్వయైక పరాయణా॥

—శ్రీ అప్పయదీక్షితులు.

# అధ్యాత్మమార్గము

## శ్రీ యతీశ్వరానందస్వామి

(గత సంచిక తరువాయి)

### వ్యష్టి - సమష్టి

సముద్రమునుండి వేఱుపడుటకు చేయు ప్రయత్నములో బుడగ పగిలిపోవు ప్రమాదము కలదు. ఏలన సాగర సంపర్కము లేక బుడగ నిలువలేదు...వచ్చిన కష్టమేమనగా మన మీ ముఖ్యవిషయమును మఱచి పోవుదుము. మనము సముద్రముకంటె ప్రత్యేకమగు వ్యక్తుల మనియు పరస్పరము భిన్నుల మనియు భావింతుము. అజ్ఞానము వలన ఈ ప్రప్రథమమగు పొరపాటు మనము చేయగనే తక్కిన పొరపాటు లన్నియు సహజముగనే దాని ననుసరించి వచ్చును. మన జీవితమును నిరంతర శోక మగ్నముగ చేయును.

మొదట మన పరిచ్ఛిన్నమగు అస్తిత్వమును కేవలము సత్యముగనే భావించినను, అనుభవము మీదట గాఢతర మగు పర్యాలోచన మీదట ఇది నిజము కాదని తెలిసికొందుము. నిజమగు దానిని గూర్చిన ఈ భ్రాంతియుతమైన భావన మన అజ్ఞాన ఫలితమే. దీని వలననే మనము నీచములు సంకుచితములు అగు భావనలను చేయుచుందుము, వానివలన బాధపడుచుందుము. ఎట్లయినను ఈ భ్రాంతులను వదలించుకొనుట వలన భ్రాంతిపూర్వకము లగు అభ్యంతరములను దాటి మన స్వరూపమును మనలోని గంభీరము అద్భుతము అగు దివ్యత్వమును మనది మాత్రమే కాక ఎల్లరలోనిది యగు దివ్యత్వమును పొందుదుము.

### ధ్యానమునకు సూచనలు

ఆధ్యాత్మిక జీవన ప్రారంభమున మన ప్రతీకలను మనమే ఏర్పఱచుకొనవలెను. కాని ఈ ప్రతీకలు సక్రమమైనవిగ నుండవలెను. అనగా ఒక సత్యపదార్థమును ఆధారముగ చేసికొని ఈ ప్రతీకలను ఊహింపవలెను. అవి పూర్తిగ స్వకపోలకల్పనలు కారాదు. కొందఱు ప్రతీక యొక్క రూపమునకంటె సాన్నిధ్యమునకు ప్రాధాన్యము నిత్తురు. అయినను వారు కూడ రూపము నేర్పఱచుకొనవచ్చును. ఒక పరతత్త్వమే ఈ ప్రతీకయందును సాధకునియందును ఉన్నది. ఏలన అదియే సాధకుని శాశ్వత తత్త్వము—అతని నిజమైన స్వరూపము.

నీ హృదయమంతయు లేక శిరమంతయు ఆ దివ్యప్రకాశముచే వ్యాప్తమై యున్నదని భావింపుము. సమస్తపదార్థములందును వ్యాపించి యుండు అనంతప్రకాశముయొక్క అంశమే ఈ ప్రకాశమని భావింపుము. నీయొక్క వ్యక్తిత్వము నంతయు 'అహం' కారము నంతయు దానిలో కరిగిపోనిమ్ము. దీనిని స్పష్టాతిస్పష్టముగ నూహించుకొనుము. అప్పుడు ఈ అనంత ప్రకాశమునందొక యంశము ఘనీభవించి నీ ఇష్టదైవము యొక్క రూపమును దాల్చును. కాని నీవు నీ యిష్టదైవము మఱి ఇతరము లన్నియు ఆ అనంతపూర్ణాంగము యొక్క అంశలనియు అదియే వీని యన్నింటియందును వ్యాపించియున్నదనియు మరువకుము. నీ వెనుకను సర్వవిశ్వము వెనుకను ఉన్న ఆ సాగరమును, శాశ్వత సత్యమును, మరువనే రాదు. ఏలన నీవు ఒకనాటికి సాక్షాత్కరించుకొనవలసినది దానినే!

కాని పవిత్రమగు జీవనమును గడపనివాడును నియమనిష్ఠలు లేనివాడును ఈ సూచనలను అవలంబింపరాదు. ఏలన సరియగు సాధన

సామగ్రి లేనివానికి, కావలసిన ప్రాథమిక శిక్షణ పొందనివానికి ధ్యానము ప్రమాదకరమగును.

## ఆత్మ నివేదనము

నిజముగా కండలు తెగునట్లు ప్రయత్నము చేసిన మానవుడే సంపూర్ణముగ నిరాలంబముగ భగవత్పాదముల చెంత ఆత్మ నివేదనము చేసికొనగలడు. అన్ని రకముల ప్రయత్నములును మనస్సును పరిశుద్ధపఱచి భగవత్కృపకు అర్హముగ చేయును. ఆధ్యాత్మిక సాధనను అకుంఠితముగను అవ్యవహితముగను కొనసాగించిన పిమ్మటనే ఆత్మనివేదనము సాధ్యము. సముద్రమధ్యమునందలి పడవనుండి నాలుగు దిక్కులకును నేలకొఱకై ఎగిరి ఎగిరి తుదను పడవలోని తెరచాప కొయ్యపైని కూర్చుండియున్న పక్షి ఱెక్కలవలె డస్సిపోయిననే ఆత్మ నివేదనము సాధ్యమగును.

మితిమీరిన కార్యకలాపము మిక్కిలి ప్రమాదకరము ఏలన అది ఉద్దేశములేని కోతియొక్క పనులవలె మారిపోవును. ఇట్టి కార్యకలాపము వట్టి మనఃస్థిమితము లేకపోవుట మాత్రమే. సాధారణముగ నిట్టి కార్యవ్యగ్రతను ఏ వ్యాపకమును లేక యుండుటకు భయపడు వారియందు చూతుము. కాని మఱియొక ప్రక్క సోమరితనము బద్ధకము తామసము మాత్రమే అగు 'ఆత్మనివేదనము'ను కూడ చూతుము, ఉద్దేశములేని కార్యవ్యగ్రత వలెనే ఇదియు అనర్థదాయకము. నిజమగు సాధకుడు రెండింటిని సమన్వయింపవలెను. సరియగు కార్యనిర్వహణము - ఆత్మనివేదనము.

## అధ్యయనము - అభ్యాసము

ఆధ్యాత్మికజీవనమన అది పుస్తకజ్ఞానమున కంటె భిన్నమైనది, దానికంటె నెక్కుడైనది యును. మేధాశక్తివలన సంపాదించిన గ్రంథ పాండిత్యమువలనమాత్రమే తత్త్వము నెన్నటికిని తెలిసికొనలేవు. పాండిత్యమునుగూర్చియు పండిత జీవనమునుగూర్చియు అభినివేశమున్నంతవఱకు మనము ఆధ్యాత్మికజీవన సత్యములను గ్రహింపలేము.

'వీలైనంత చక్కగా చదువుకొననిమ్ము, అన్ని విద్యలయందును పారంగతుడు కానిమ్ము. కాని అట్లు గొప్ప పండితుడైనపిదప కోరికల నన్నింటిని త్యజించి ఆ పాండిత్యమువలన కలుగు జ్ఞానముపై ఆధారపడి జీవింపనిమ్ము.'

నిజముగా ఆధ్యాత్మిక ప్రగతిని సాధింప గోరినచో మానవుడు అన్నిరకముల వంచనలను అసత్యమును మనోవైక్లబ్యములను దూరముగ తొలగింపవలెను. ఋజుమార్గము నవలంబింపవలెను. ధ్యానాసక్తమానవుడు కావలెను.

ఆధ్యాత్మికజీవనముయొక్క ముఖ్యసూత్రములను తెలిసికొనినపిదప దైవమునుగూర్చి ఒక స్పష్టమైన నిర్ణయమునకు వచ్చినపిదప సాధనల నభ్యసింప ప్రయత్నింపవలెను. వట్టి మాటలను మితిమీరి చదువకుము. అది చిత్తవిభ్రమణమునకు కడగండ్లకు మాత్రమే దారితీయును. అట్లనుట అసలు గ్రంథపఠనమే చేయరాదని కాదు. కాని తత్త్వమును సాక్షాత్కరించుకొను నుద్దేశములో మాత్రమే గ్రంథములను చదువవలెను. అట్టి అధ్యయనముతోపాటు ప్రతిదినమును నిజమగు ఆధ్యాత్మికసాధన కొంతయైనను చేయుచుండవలెను. నీ మేధకు నిరంతరము శిక్షణ నీయవలెను. నిశ్చితమగు అధ్యయనముండవలెను. ఆ సమస్యలపై గాఢపర్యాలోచనముచేసి స్పష్టమగు ఆలోచనల నేర్పఱచుకొను అలవాటు చేసికొనవలెను. అట్లు చేసినమీదట ఏదినమై

నను నీవు ఏవిషయమునైనను సమగ్రముగ పఠించి అందలి తత్త్వమును పర్యాలోచన చేయునిచో ఆ దినము మనస్స్థిమితము కలుగదు. ఇట్టి దైనందినము అధ్యయనము ఆధ్యాత్మికసాధనయందొక భాగము కావలెను.

## కామము - లోభము

శ్రీరామకృష్ణుల సందేశమిది. "పారమార్థికుడవుగ నుండుము. తత్త్వమును నీవే సాక్షాత్కరించుకొనుము. పారమార్థికజీవనము గడపుటచేత దైవము మన జీవితమునందే జీవించునట్లు చేయగలము. పారమార్థిక జీవనమున మహోన్నత్తరములైన అభ్యంతరములగు కామమును లోభమును ఎట్లు అతిక్రమింపవచ్చునో గురుదేవుడు (శ్రీరామకృష్ణ పరమహంస) చెప్పెను. మనము మనపట్లను ఇతరులపట్లను ఒక క్రొత్త దృక్పథము నేర్పఱచుకొనవలెనని ఆయన అనెను. స్త్రీలును పురుషులును దివ్యమగు దృక్పథమును కలిగియుండవలెను. కాని స్త్రీపురుషభేదమును శరీరమును దృష్టియందుంచుకొనరాదు. స్త్రీపురుషభేద మనెడు సమస్యకు స్త్రీపురుష సంబంధ మనెడు సమస్యకు అంతటియందును దేవునిచూచుట ఒక్కటియే పరిష్కారమార్గము. ఆధ్యాత్మికసాధకుడు గమనింపవలసిన అతిముఖ్యమగు విషయమిది. మధ్యయుగపు యోగులు ప్రయత్నించినట్లు స్త్రీలనేగాని పురుషులనేగాని ద్వేషించుటచే మాత్రమే కామదృష్టిని అతిక్రమింపలేము. దానికి మించినదొకటి కావలయును. దైవము నాయందున్నది. అంతటియందున్నది. ప్రతి దానియందున్నది. "నేను పురుషుడను కాను, నేను స్త్రీని కాను, నేను ఆత్మను."

## అభ్యాసమునకు బుద్ధుని యుపదేశములు

వేదాంతమును వేదాంత తత్త్వములను గూర్చియు, పూజాపురస్కారములు కర్మకలాపములను గూర్చియు అతిగా ఆలోచింపవలదని చెప్పుటయే, పవిత్రత ధ్యానము ఆధ్యాత్మిక సాధన మనోనియమనముల ద్వారా ఆధ్యాత్మికతను పారమార్థిక ధర్మమును మన జీవితములందే స్పందింప జేయుడని చెప్పుటయే బుద్ధుని జీవనదీక్షయైనది. దైవమును గూర్చి అంతయెక్కువగా మాటలాడుట అవసరము కాదు. అత్యంతము అవసరమైనదేమన దైవోన్ముఖమగు మార్గము నవలంబించుట, ఆధ్యాత్మిక జీవనమును జీవించుట. "ఓ దేవా! నీ వెంత అందముగ నున్నావు! నీ ఆకాశ మెంత చక్కగ నున్నది! నీ నక్షత్రములు! నీ అపూర్వసృష్టి!" అనుట వలన నేమి ప్రయోజనము? సృష్టికంటె సృష్టికర్త యే విషయముననైనను శ్రేష్ఠుడే. ఆ విషయమై అతడు గర్వపడడు. మానవదృష్ట్యా మనము అది చాల ఘనమైన దనుకొందుము. కాని దేవున కది తృణప్రాయము. కనుక ఏమియు చేయక నిరంతరము భగవంతుని ప్రశంసించుటకంటె దైవోన్ముఖమగుమార్గము నవలంబించుట మిక్కిలి యావశ్యకము. ఇట్లు మాటలలో కోటలు దాటుటవలన సాధకున కేమియు ప్రయోజనము లేదు.

ఒక పర్యాయము బుద్ధు నిట్లు ప్రశ్నించిరి. "స్వామీ, దేవుడు కలడా?" అత డిట్లు బదులు చెప్పెను. "భగవంతుడు కలడని నే నంటినా?" "అయినచో భగవంతుడు లేడా, స్వామీ?" "భగవంతుడు లేడని నే నంటినా?" అని ప్రత్యుత్తరము. ఇట్టి నిరర్థకములగు తర్కవితర్కములను ఊహాగానములను కట్టిపెట్టి ప్రజలు ఏదేని ప్రయత్నము చేయునట్లు చేయవలెనని అతడు వాంఛించెను. అందువలన అత డిట్లనెను. "ఇల్లు కాలిపోవుచున్నచో నీవు ఆ ప్రమాదమునకు కారణ మేమని యన్వేషింతువా లేక మంటల నార్పుటకై ప్రయత్నింతువా?" కాని

బుద్ధిహీనుల మగు మనము కారణమే మనిరే వెదకుచుందుము. కాని దానిని కనుగొను లోపలనే ఇల్లంతయు కాలిపోయి బూడిదరాశి మిగులును.

మనము మనకొఱకు కర్మ్మయు ఇతరులు చేసి పెట్టవలయు ననియే కోరుదుము. సాధకుని స్వప్రయత్నము లేని 'బేనామీ' మోక్షము ఎచ్చటను లభింపదు మతావలంబు లనిపించు కొనువారిలో పలువురు ఆధ్యాత్మిక పారమార్థిక ప్రపంచమున పరాన్నభుక్కులు మాత్రమే. వారింకొక దారి పట్టుటయే శ్రేయస్కరము

## ప్రలోభములకు వైదొలగుట

ఆధ్యాత్మిక సాధన కాలమున స్థూలములును సూక్ష్మములును అగు ప్రలోభములకు దూర ముగ నుండుటకు సాధ్యమైనంత ప్రయత్నింప వలెను. ప్రలోభ కారణ మగు దేనికైనను దూరమునుండియే ఒక నమస్కారము పెట్ట వలెను. దానిని సమీపింపకుందుముగాక. చిర కాలమువఱకు మన మనోదార్ఢ్యమును నమ్మ దగదు. మన దరిద్రపు మనస్సునందెట్టి దౌర్భా గ్యపు సంస్కారము లున్న వనగా ఒకసారి దానిని కదిలించినచో ఇక అది అనంతమైన కష్టములను కడగండ్లను కలిగించును. కామము ద్వేషము లోభము నైచ్యము అన్నియు మన యందు దాగియుండి మనలను సంహరించుటకు మాటువేసి యుండును. కనుక మనము జాగ రూకులమై యుండవలెను మనస్సునందు కలుగు అల్పాల్పమైనగణనీయము కాదనిపించు చిన్న అలను గమనింపక పోవుటవలన సర్వసాధారణ ముగ మన ఆపదలన్నియు ఉత్పన్నము లగును. బాహిరమగు చోదకము ఎంత సూక్ష్మమైనను దృశ్యాదృశ్యమైనను అది క్రమముగ మన మనస్సు నావరించును. ఒక్కొకసారి మనలను తల్లక్రిందులు చేయుటకు ఆ ప్రాతకల్మష పూరి తములగు సంస్కారములు జ్ఞాపకము రేచాలును. ఏలన దానికి బీజము ఎల్లప్పుడును లోపలనే యుండును. వెలుపల కాదు. బీజము లోపల నుండిననే తప్ప అది అంకురింపజాలదు.

సక్తత ఏ రూపమున నున్నను చాలును— అది బుద్ధి వైపరీత్యమును కలుగజేసి ఆధ్యాత్మిక సర్వనాశమును గొని తెచ్చును. సక్తతయు క్రోధమును కలసినచో ఇక మనస్సంతయు వికా వికలై పురోగతి యంతయు స్తంభించి పోవును. మానవునిపై అతని యుద్వేగములు సత్తన మును సంపాదించినచో ఇక ఉన్నత జీవన ప్రయత్నము లన్నియు తుడమట్టును. కావుననే మనము ప్రమాదకరములగు ప్రేరణలను, ఎంత సూక్ష్మమైన వైనను, జాగరూకతతో దూర ముగ నుంచవలెను. మనస్సును ఉత్తమములగు ఆలోచనలయందు నిలిపియుంచవలెను. నీచ ప్రవృత్తులకు ఏమాత్రపు టవకాశమును ఈయ రాదు. స్త్రీసాన్నిధ్యమును స్త్రీలు ప్రుగుమ సాన్నిధ్యమును, పరిహరించుటయే గాక నిష్క ల్మషమగు నైతిక జీవనము గడపనివారి సాంగ త్యమును కూడ, కనీసము ఆధ్యాత్మిక సాధన కాలమందు, త్యజింపవలెను.

"నీవు నిద్రలో మునిగిపోవునఱకు ఈ శరీ రము పడిపోవునఱకు మనస్సును వేదాంత భావ ములతో నింపివేయుము." ఉద్వేగములు మన లను విచలితులనుచేయుట కవకాశము కలుగ నీయరాదు. ఆలోచించుట మనస్సుయొక్క స్వభావము. కల్మష సంపర్కములను పరిహ రించి మనస్సునకు పరిశుద్ధములు ఉన్నతములు అగు భావనల నీయనిచో అది దుష్టములు కల్మషపూరితములు అగు ఆలోచనలనే చేయు

చుండును. కనుక జాగరూకుడవై యుండుము. తెలివిగాను పట్టుదలతోను ఆధ్యాత్మిక మార్గము నవలంబింపుము.

### ప్రార్థనలు

భగవన్, దినములు గడచుకొలది జీవన పరిమితి తరిగిపోవుచున్నది. గడచిన దినములు తిరిగి రావు. కాలము ప్రపంచమునే మ్రింగి వేయుచున్నది. అదృష్టము నీటిమీది యలల వలె చంచలము తాత్కాలికము. జీవితమే మెఱుపువలె క్షణికము. కనుక, సర్వేశ్వర ణ్యూడా, నీయందు శరణాగతుడ నగు నన్ను ఈ క్షణమే రక్షింపుము.

దుర్జనులు సజ్జను లగుదురు గాక. సజ్జనులు శాంతిని పొందుదురు గాక. శాంతులు ముక్తు లగుదురు గాక. ముక్తులు ఇతరులను ముక్తులను చేయుదురు గాక!

# తిరుక్కుఱళు

మూలకర్త: **శ్రీ వళ్ళువనాయనారు**

అనువక్త: **నే. భక్తవత్సలము**

## సప్తమాధికారము - పుత్రప్రాప్తి

సువివేకులగు పుత్రుల బడయగనుటే పురుషార్థములలో పురుషార్థము. తక్కిన వానిని పురుషార్థములుగ పాటించుట లేదు. 61

నింద నొందని సచ్ఛీలము గల పుత్రుల నెవడు పడయునో అతనికిని అతని వంశీయులకు ముందు వెనుకల మున్నేడు తరములవారికిని దుఃఖములు ప్రాప్తింపవు. ... 62

పుత్రులు సొమ్ము గడించి దానితో తమ పితరుల నుద్దేశించి దానధర్మాదికము సేయుదురు. అట్లు ఆ సొమ్ము పితరులకు చెందుచున్నది. కావున జ్ఞానులు 'పుత్రులు తండ్రుల సొమ్ము' అందురు. ... .. 63

నేయి వేసిన యన్నమును చిఱుచేతులతో తమ బిడ్డలు అంటి జవిరి పట్టి పిసికి మేని కంట అలదుచురేని, ఆయన్నము తీపి అమృతపు తీపిని మించి యుండును. ... ... 64

మేనికి హాయి కూర్చునది బిడ్డలమేనిస్పర్శ; చెవికి ఆనందకర మగునది ఆ బిడ్డలమాటలు వినుట. ... ... 65

తనుబిడ్డల వచ్చియు రాని ముద్దుమాటలను విననివారు వేణునాద మింపందురు, వీణానాద మింపందురు. ... ... 66

(చదువుకొన్నవారి) సభలో అగ్రశ్రేణిలో నుండునట్లుగ (విద్యావంతునిగ) చేయుటే తండ్రి కుమారునకు చేయు మేలు. 67

బిడ్డల విద్యాసంపద తండ్రులకు ప్రియమగుటే కాదు, అంతకంటె హెచ్చుగా విశాలదేశవాసులగు ప్రజల కందఱికిని ప్రియమైనది. ... ... 68

తనపుత్రుని జ్ఞానులు విద్యాపరిపూర్ణు డని చెప్పగా విన్న తల్లి, ఆ పుత్రుని తాను కని నప్పుడు సంతోషించినంతకంటె హెచ్చుగా సంతోషించును. ... ... 69

తన విద్యావినయసంపదను గుర్తించిన వారిచే 'ఇతని తండ్రి యితనిని ఎంతతపము చేసి

పడసెనో' అని అనిపించుచే పుత్రులు చదువు చెప్పించిన తండ్రికి చేయు ప్రత్యుపకారము. 70

అష్టమాధికారము - ప్రేమసంపద

ప్రీతిపాత్రుల దుఃఖమును కనిన ప్రేమవంతులకన్నుల దుఃఖాశ్రువులు వెలువడి వారి ప్రేమను వెలువఱచుచుండ, ఆ ప్రేమను మఱుగుపఱచు తలుపు తాళము ఉన్నదా? 71

ప్రేమశూన్యులసంపద పూర్తిగా తమకే; ప్రేమవంతుల సంపదమాత్రమే కాదు వారి శరీరముసైత మితరులకే. ... 72

జీవుని మనుష్యదేహప్రాప్తికి ప్రయోజనము ప్రేమ నెరపుటే—అందురు జ్ఞానులు. 73

చుట్టములపట్ల ప్రేమ నెరపుట మొదట అలవడునేని క్రమముగా అందఱిపట్ల ప్రేమ నెరపు స్వభావము సిద్ధించును. అందఱిపట్ల ప్రేమ నెరపు స్వభావముచే శత్రుత్వోదాసీనతలు నశించి (విశ్వ) ప్రేమ యనెడి నిరవధి కాతిశయము కల్గును. ... 74

గృహస్థులై ప్రేమనెరపినఫలమే వారు ఈ లోకమున ననుభవించు ఆనందమును పిమ్మట స్వర్గములో పడయు బ్రహ్మానందమును — అందురు జ్ఞానులు. ... ... 75

'ధర్మము చేయుటకు మాత్రమే ప్రేమ తోడ్పడు' ననుట ఎఱుగనివారి మాట. అధర్మమును మానుటకును తోడ్పడునది ప్రేమయే. ... ... 76

ఎముక లేని దేహమును ఎండ కాచును; ప్రేమ లేని జీవుని ధర్మదేవత కాచును. 77

ఎడారిలో ఎండిపోయియున్న చెట్టునకు చిగిరింత అసంభవము; మనస్సులో ప్రేమలేని గృహస్థునికి జీవితసుఖము అసంభవము. 78

అంతరంగమున ప్రేమలేనివారికి ధర్మానుష్ఠానమున వెలుపలి పరికరము లేమి తోడ్పడును? ... ... 79

ప్రేమగలవానిదేహమే సజీవము; ప్రేమ లేనివానిదేహము తోలు కప్పిన యెముకల గూడే. ... ... ... 80

నవమాధికారము - అతిథిసమారాధనము

గృహస్థుడు అర్థసముపార్జనము గావించి సుస్థితియందుండుటెల్ల అతిథుల నుపచరించి వారికి మేలొనర్చుటకే. ... 81

అమృతమునో మృతసంజీవనినో అయినను వాకిట నున్న యతిథుల కర్పింపక తానే ఆరగింప గోరుట తగదు. ... 82

వచ్చిన యతిథిని అనుదినమును సత్కరించి యుపచరించెడి గృహస్థుని జీవితమునకు పేదఱికము చే గాసిలుటయు చెడుటయునుండవు. 83

సమర్హుడైన యతిథిని ఎవడు వికసించిన మోముతో సత్కరించి యుపచరించునో అతని యింట శ్రీమహాలక్ష్మి సంతుష్టచిత్తయై నెలకొనును. ... ... 84

ముందుగా అతిథిని భుజింపజేసి శేషమును తాను భుజించు నాతని పంటపొలమునకు విత్తులను చల్లు నావశ్యకత కలదా? (లేదు, తనంతటనే పండు ననుట) ... 85

వచ్చిన యతిథిని సత్కరించి యుపచరించి, రానున్న యతిథితో సహపంక్తిని భుజింప నిరీక్షించుచుండువాడు (మఱుజన్మములేని దివిజుడై) త్రిదశులకు భాగ్యలబ్ధుడైన యతిథి యగును. ... ... 86

అతిథిసమారాధనయజ్ఞఫలమునకు 'ఇంతటి' దనెడి కొలత లేదు; ఆ యతిథి పెర్మియే దానికి కొలబద్ద. ... 87

నశ్వరమైన ధనముతో అతిథి నుపచరించి యజ్ఞఫలమును ప్రాపింప విధినిర్ణయము ఎవరికి లేదో వారు అధనమును శ్రమపడి కాపాడి, పిమ్మట కోల్పోయి 'అయ్యో ఇప్పుడు మాకు ప్రాపు లేక పోయెనే' అని పశ్చాత్తాప పడుదురు. ... ... 88

అతిథిసమారాధనము కావింపనివాడు సంపదగలిగియు పేదవాడే; ఆ పేదతికము సువివేకుల కుండదు; అవివేకులకే ఉండును. 89

చేత నందికొని ముక్కు కానించుకొని వాసన చూచిననే కాని అనిచ్ఛపూవు వాడదు; ఆదరశూన్యమగు మోముతో చూచిన చాలును, అతిథి వాడుపాటు చెందును. 90

(సశేషము)

# వీరులు - వీరపూజ

శిష్టా రామకృష్ణశాస్త్రి

శ్లో॥ యదా యదా హి ధర్మస్యగ్లాని ర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం॥ గీత IV-7

శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే॥ గీత IV-8

ఎప్పుడెప్పుడు ధర్మమునకు హానియు అధర్మమునకు అభివృద్ధియు కలుగునో, ఆయా కాలములందు నేను అవతరింతును (7). సత్పురుషులను రక్షించుటకును దుష్టులను సంహరించుటకును, ధర్మమును స్థిరముగా నిల్పుటకును నేను ప్రతియుగమున నవతరింతును (8).

అని శ్రీకృష్ణభగవానుడు తెల్పినాడు. కాని భగవంతు డవతారముయెత్తి రాక్షససంహార మొనర్చు కాలములు గతించినవి. ప్రస్తుత కాలమున నట్టివిశ్వాసములుకూడ క్రమముగా నశించినవి. దేశ ముపద్రవస్థితిలో నున్నప్పుడు దేవాంశసంభూతులైన వీరు లుద్భవించి అప్పుడప్పుడు దేశమును జాతిని ఉద్ధరింతురు.

అయితే వీరులనగా నెవరు? యుద్ధము చేయు యోధులుమాత్రమే వీరులుగారు. ఎవరి సత్సంకల్పము లమోఘములగునో ఎవరి జీవిత చరిత్రలు కర్మమార్గ ప్రవృత్తములో ఎవరి వాక్కులు జనుల నాకర్షించి జీవితప్రయోజనమైన మనశ్శాంతి నొనగూర్చునో ఎవని దృఢచిత్త ప్రవృత్తిచే జగమున మహాకార్యము లొనర్పబడునో ఎవరి భావములు ప్రజ్ఞావిలసితములై లోకకల్యాణ మొనర్చునో ఎవరిలో పరమేశ్వరుడు పరిపూర్ణతకు సన్నిహితముగా చేరునో ఆ దేవాంశసంభూతులందఱును వీరులే యని వ్యాఖ్యానింపవచ్చును. సత్యవాక్యపరిపాలకుడై గురుభక్తిపరాయణుడై యుద్ధభూమిని నిరుపమాన శౌర్యధైర్య పౌరుషములను ప్రదర్శించిన భీష్మాచార్యులు వీరుడు. తత్త్వరహస్యబోధ గావించి దుర్మతఖండన మొనర్చి, లోకగురువనంగ కీర్తికెక్కి సకల లోకవందనార్హుడైన ఆదిశంకరులు వీరుడు. పరమధర్మాన్వేషణమునకై దారాపుత్రరాజ్య

ములను త్యజించిన శాక్యఋషి బుద్ధుడు వీరు డనదగును. తత్త్వమును బోధించినందులకై మరణశిక్ష నాహ్వానించిన సోక్రటీసును ఏసు క్రీస్తును వీరులు కారనగలమా? మరణమునకు వెరవక సత్యాగ్రహ వ్రతమూని యనేక పర్యాయములు చెఱసాలకుంబోయి యాంగ్లేయులను భారతదేశమునుండి తరిమివేసి స్వారాజ్యమును సంపాదించిపెట్టిన గాంధీమహాత్ముడు వీరుడుకాడా? మహారాజులిచ్చు భోగభాగ్యములను తిరస్కరించి వారి ధిక్కారములను తృణీకరించి తమ మధురమైన రచనలను భగవదంకితముచేసి త్యాగవైరాగ్యములను ప్రదర్శించిన పోతన త్యాగయ్యలు వీరులు గారని యెవ్వరైన ననగలరా? యథార్థ తత్త్వమార్గదర్శకుడై యనేక సాధనలొనర్చిన పవిత్రుడు శ్రీరామకృష్ణపరమహంస వీరుడనబడడా? పాశ్చాత్యదేశములందుకూడ సనాతన హిందూమతమును ప్రబోధించిన వివేకానంద స్వామి వీరుడుకాడా! బహురీతుల దేశకాలావసరములనుబట్టి వీరు లుద్భవించి దేశము నుద్ధరింతురు.

ఏకాలమున నేదేశమం దీ మహానుభావు లుదయించినను జనులు వారి నసాధారణ ప్రజ్ఞావంతులుగా పరిగణింతురు. వారి పేర్లను పవిత్రముగ భావింతురు. వారి యమోఘసంకల్పములు కార్యరూపములుదాల్చి శాశ్వతములగును. వారి వాక్కులు మానవుల చెవులందు ఘంటానినాదములై ప్రతిధ్వనించుచుండును. కవులీ మహాపురుషుల జీవితగాథలను రసవంతముగా వర్ణించుదురు. శిల్పులీ ప్రతిభావంతుల ప్రతిమలను శిలలపై చెక్కుదురు. చిత్రకారులీ పావనమూర్తుల యాకారములను మనోహర వర్ణములతో చిత్రింతురు. వారు మాటలాడుట మానియు మానినవారుకారు. బోధించుట నాపియు ఆపినవారు కారు. ప్రపంచమును వారు వదలియు వదలినవారు కారు.

వీరారాధన ప్రపంచముండునంతకాలముండునదే కాని పోవునది కాదు. మానవులకు విజ్ఞాన నాగరికత లధికమైనకొలది మహాపురుషులందు భక్తిగౌరవాదర పూజ్యభావము పెరుగుచునేయుండును. ఆధ్యాత్మికముగ తనకంటె శ్రేష్ఠుడైన మహనీయు నభినందించి గౌరవించి పూజించుటకంటె మనుష్యునకు వేఱు ఉత్తమగుణము లేదు. పూజయనగా విగ్రహమును గంధాక్షత పుష్పములతో పూజించుటయే కాదు. మహనీయుని శరీరాకారము మనసున హత్తుకొనుటకుగాను వాని ఛాయాచిత్రమునుగాని చిత్రలేఖన రూపమునుగాని గృహమందలి గోడమీద వ్రేలాడగట్టుటో పుస్తకమునందు ముద్రింపజేసిరో ఆ రూపమును చూచినవెంటనే ఆ మహానుభావుని విశిష్టగుణాతిశయము మనసు నాకర్షించి స్ఫురింపగా వాని నభినందనపూర్వకముగా వాని యుత్తమగుణములను సాధ్యమైనంతవఱకు అనుకరింప చూచుటయే ఆ వీరుని పూజించుట యని చెప్పవచ్చును. కాని యలంకారార్థము వాని బొమ్మను గోడకు తగిలించుట చాలదు.

ప్రజ్ఞావిలసితుడైన ఈ వీరుడు జన్మచేతనే యొప్పువాడు కాని ప్రజలచే నెన్నుకొనబడువాడు కాడు. దేశకాల పరిస్థితులనుబట్టి యతడు తత్త్వవేత్తగనో రాజకీయవేత్తగనో కవిగనో రాజుగనో పరిణమించును. వీరందఱిలోను స్వార్థత్యాగము సూక్ష్మదృష్టి ఆత్మశుద్ధి నైతికభావము ప్రతిభ భూతదయ అమానిత్వమును సమానముగ భాసించుచునే యుండును. వీరందఱును కష్టపడి బాధలను సహించి పరుల కష్టనిష్ఠురముల గుర్తెఱింగిన యుదారస్వభా

వులే కాని యాంగర్భశ్రీమంతులైన యుదాసీనులు కారు. వీరు లోకకల్యాణముకొఱకు తపించువారే కాని స్వార్థపరులై క్షేమజము కలవారు కారు.

సారస్వతములేని జాతి యనాగరకపు మోటుజాతిగా పరిగణింపబడును. మానవులందఱిలో నొక రసమయ కోశముండును. దాని నుద్బోధించి రసానందానుభవమును గల్గించువాడు కవి వీరుడు. కవులు రాజాశ్రయమునగాని వర్థిల్లజాలరు. అందుచేతనే రాజులు కవుల నాదరించి పోషించుట యనూచానమైన సంప్రదాయమైనది. దానివలన రాజులు చిరకీర్తిని గడింతురు. ప్రతిదేశమందును అప్పుడప్పుడు కవివీరు లుద్భవించి జనులకు నూత్నచైతన్యమును గల్గించి యుత్తేజపరతురు. అట్టి కవులను పోషించి గౌరవించుట రాజుల ధర్మమైయున్నది. సాదరగౌరవపూర్వకముగ కవులఁ బోషించిన మహనీయుడు శ్రీకృష్ణదేవరాయలు. సామాన్యముగ రాజులు రాజ్యమదాంధులై తమ పోషణమున నున్న కవులను భట్రాజులవలె తమ్ము పొగడువారే కదా యని లోకువగ చూతురు. కవులుకూడ తమ్ము సాకెడు ప్రభువునెడ భక్తివిశ్వాసములతో బాటు భయవినమ్రగాత్రులై ప్రవర్తింతురు, కాని స్వతంత్రముగ మెలగజాలరు. కాని శ్రీకృష్ణదేవరాయల విషయమున నిది విపరీతముగ నున్నది. ఇతడు కవులకు సర్వస్వాతంత్ర్యమును చనవు నొసంగిన మహనీయుడు. అందుచేతనే రాయలవారొకమారు అల్లసాని పెద్దన కవీంద్రుని కవిత్వము చెప్పుమనికోరగా పెద్దన నిర్లక్ష్యభావముతో,

చ. నిరుపహతి స్థలంబు, రమణీ ప్రియదూతిక
తెచ్చియిచ్చు క
ప్పురవిడె, మాత్మకింపయిన భోజన,
ముయ్యెలమంచ, మొప్పు త
ప్పరయు రసజ్ఞు లూహ తెలియంగల లేఖక
పాఠకోత్తముల్
దొరకిన గాక యూరక కృతుల్ రచియింపు
మనంగ శక్యమే.

యను పద్యమును చెప్పి తన స్వాతంత్ర్యమును ప్రదర్శించెను. రసజ్ఞుడును సహృదయుఁడైన రాయలవారు పెద్దనగారిమీద నుండెడు గౌరవాభిమానములచే చిఱునవ్వునవ్వి యూరకుండెను. మఱియొకరైనచో ఆ కవిని పదభ్రష్టునిగావించి తన కసిదీర శిక్షించెడువాడే.

ఇదియేకాదు. రాయల మరణానంతరము పెద్దనగారు చెప్పిన,

సీ. ఎదురైనచోఁ దన మదకరీంద్రము నిల్పి,
కేలూత యొసగి యెక్కించుకొనియె;
మనుచరిత్రం బందుకొను వేళఁ బురమేఁగఁ
బల్లకి తనకేలఁ బట్టి యెత్తె
... ........................
..... ....................
బిరుదైన కవి గండపెండేరమున కీవ
తగుదని తానె పాదమునఁ దొడిగె

గీ. ..........................
కృష్ణరాయలతో దివికేగలేక
బ్రతికియున్నాఁడ జీవచ్ఛవంబ నగుచు.

అను పద్యమునుబట్టి శ్రీకృష్ణదేవరాయలవారే స్వయముగా పెద్దనగారి కాలికి గండపెండేరమును తొడిగిరనియు, మనుచరిత్రం బందుకొను వేళఁ బురమేఁగ పల్లకిని తనకేల పట్టి యెత్తెననియు తెలియుచున్నది. అనగా శ్రీరాయలవారు పెద్దనగారి కాళ్లనుగూడఁ బట్టుకొనెననియు, పెద్దనగారెక్కిన పల్లకిని రాయలవారు మోచిరనియు స్పష్టమగుచున్నది.

ఇది శ్రీకృష్ణదేవరాయలవారు తన యాస్థాన కవియగు పెద్దనగారియందు జూపిన గౌరవ విశేషము. ఇట్టిది ప్రపంచమున నేదేశమందును ఏకాలమందును ఏభాషాకవికిని ఏ మహా చక్రవర్తియు ఎప్పుడు చేసియుండినది కాదు. ఇట్టి దెప్పుడు నెక్కడ జరిగినట్లు ఎవరును కని విని యుండ లేదు. న భూతో న భవిష్యతి. మరియు రాయలవారు వస్తుతః మహాకవియై యుండి ఆముక్తమాల్యద యను మహా ప్రౌఢ కావ్యమును రచించియుండియు తోడికవిమీద సామాన్యముగనుండు ఈర్ష్య వహించుటకు మారుగ నిట్టి యపూర్వము అసామాన్యము లోకోత్తరమునగు గౌరవమును జూపుట రాయలవారి యౌదార్యవిశేషమును చాటును. ఇట్టి మహోదారగుణములు గలవాడగుట చేతనే రాయలవారు రాజవీరుడుగా భాసించి యతని కీర్తి యాచంద్రతారార్కము శాశ్వత మైనది. రాజగౌరవముచే అల్లసాని పెద్దన గారు కవివీరుడుగా ప్రఖ్యాతిగనెను.

(సశేషము)

# పరిప్రశ్న

(మద్రాసులోని మైలాపూరు శ్రీ రామకృష్ణ మఠమున 10-9-72 న జరిగిన అంతర్యోగము నందు జిజ్ఞాసువుల ప్రశ్నకు శ్రీమత్తపస్యానంద స్వామివారి సమాధానము)

ప్రశ్న : వారి బిడ్డలపట్ల సామాన్య మానవుల అనురక్తికిని రాధుపట్ల మాతృశ్రీశారదాదేవి అనురక్తికిని గల భేద మేమి ?

ఉత్తరము : ఈ రెండు సంఘటనలోను ఆ అనురక్తి యొక్క స్వభావము ప్రకటనలలో మాత్రమే గాక చోదనయందు గూడ స్పష్ట మగు భేద మున్నది. మాతృదేవి రాధునందు అనురక్తయై యుండుట నిజమే. కాని ఇతరుల పట్ల ఆమె ప్రేమను వారి శ్రేయము కొఱకు ఆమె ఆతురతలను రాధునందలి ప్రేమ ఎంత మాత్రము తగ్గింప లేదు. ప్రాపంచిక ప్రేమ యందు బంధుమిత్రులయందు ప్రీతి ఎంత ఎక్కువైనచో ఇతరులపట్ల అంత నిర్లక్ష్యమేర్పడును. అట్లుగాక రాధుపట్ల మాతృదేవి ప్రేమ ఇతరుల గూర్చిన ప్రేమ నెంతమాత్రమును తరుగజేయ లేదు. ఆమె జీవనమంతయు ఆమె భావప్రపంచమున ఆమె ఎల్లరకు, సజ్జనదుర్జనులకు ధనిక దరిద్రులకు ఉన్నతులకు నీచులకు ఎల్లరకు తల్లి యను భావము పూర్వరంగముగ నిలచియే యుండెను. ఆమె కడకు చనినవారెల్లరు ఆమెను తమ స్వంత తల్లిగనే భావించిరి. అట్టిప్రేమను సానుభూతిని పొందిరి. ఆమె విశ్వప్రేమను విశదీకరించుటకు ఆమె జీవితమునందలి అసంఖ్యాక సంఘటనలను ఇచ్చట సమీక్షింపవలసి యుండును. ప్రక్రియందది సాధ్యము కాదు కనుక ఆసక్తి గలుగువారు శ్రీ శారదాదేవి జీవిత చరిత్రను చదువవచ్చును.

రాధుపట్ల ఆమెయొక్క ప్రేమ ప్రారంభమునుగూర్చి కూడ ప్రాపంచిక ప్రేమయందు లేని నిగూఢార్థము కలదు. శ్రీ రామకృష్ణులు కీర్తిశేషులైన పిదప శ్రీశారదాదేవికి జీవితమునందే ప్రాపంచికోద్దేశము లేకపోయెను. అందు వలన నామెమనస్సు క్రమక్రమముగ అంతర్ముఖమును నిస్సంగముగను అయిపోవుచుండెను. ప్రాపంచికస్థాయిలో జీవింపవలెనన్నచో బాహ్యముగ నేదేనొక విషయముపై ఆసక్తి

కలిగి ఏ కోరికపైననో జీవితాశయముపైననో అది నిలువవలెను. శ్రీ గురుదేవుల నిర్యాణము వఱకును వారి సేవయే ఆమె జీవితమునకు కేంద్రమయ్యెను. అటుపిదప ఆమె పరిశుద్ధ చిత్తము ఈ లోకమున నుండుటకు పట్టు చిక్కక క్రమముగా సమాధిగతమై శరీర త్యాగము చేయబోవుచుండెను. కాని ఆమె కారణజన్మురాలు. ఆమె జీవితోద్దేశము నెరవేరుటకు శరీరము నుంచుకొనవలసి యున్నది. ఆ కారణముననే విధి ఆమె జీవితమున రాధును ప్రవేశపెట్టి ఆమెకు అత్యంతావశ్యకమైన ప్రాపంచికాసక్తిని ఆలంబనమును సమకూర్చెను. రాధు శ్రీమాతృదేవి సోదరుని కూతురు. ఆమె తల్లి పిచ్చిది. ఒకనాడు మాతృదేవి నిశ్చలధ్యానమున నుండగా రాధుయొక్క అతి దయనీయపరిస్థితి విస్పష్టముగ నామె మనః ఫలకమున మెఱసెను. శ్రీగురుదేవుల ఆజ్ఞయు ఇట్లు వినవచ్చెను. "ఆమెను ఆలంబనముగ చేసికొనుము. ఆమె యోగమాయ." ఈ సంఘటనలను మనసున నుంచుకొనినచో రాధుపట్ల మాతృదేవి ప్రేమను ప్రాపంచికుల ప్రేమతో ఎవరును సరిపోల్చరు.

రాధుపట్ల మాతృదేవి ప్రేమయొక్క విశిష్టత ఆమె దేహత్యాగము చేయుటకు కొంచెము పూర్వమే మఱియు విస్పష్టమయ్యెను. రాధుపట్ల ఆమె శ్రద్ధ వహించి చాల సంవత్సరములైన పిదప ఆమె వ్యాధిగ్రస్థురాలై మంచము పట్టెను. (ఆ వ్యాధియే చివరకు ఆమె నిర్యాణ కారణమయ్యెను.) అప్పుడు ఆమె రాధును గూర్చి పరామర్శచేయుట మానివేసి ఆమెను జయరాంబాటికి పొమ్మనెను. రాధు యొక్క పాప తనచెంత కూర్చుండుటకురాగాఆ పాపను తీసికొని పొండని యామె అనెను. రాధుపట్ల ఇట్టి అసాధారణము హఠాత్సంభవము అయిన విముఖత కేమి కారణమని వారడుగగా రాధు నుండి తన మనస్సు నుపసంహరించుకొంటి ననియు ఇక ఆమెపై ఎట్టి ఆసక్తియు నుంచజాలననియు ఆమె బదులు చెప్పెను. ఈ విషయము శారదానందస్వామివారికి చెప్పగా వారు ఆమె మనస్సును శరీరస్పృహయందు నిలుపు కారణ మిక లేదనియు త్వరలోనే ఆమె శరీరమును వదలుననియు అనెను.

ఇచ్ఛాధీనమైన ఈ నిస్సంగత్వమే మాతృదేవి కుటుంబప్రేమను ఇతర సంసారుల ప్రేమ నుండి ప్రత్యేకించు విశిష్టగుణము. ఈ విషయమును గూర్చి వివరించుచు మాతృదేవియే రాధుపట్ల తన అనురక్తిని వివరింపుమని యదే పనిగ నడుగుచుండిన యొక శిష్యునితో నిట్లనెను. "పరతత్త్వమును గూర్చి ధ్యానించు వారి మనస్సు మిక్కిలి పరిశుద్ధము సూక్ష్మము అగును. ఆ మనస్సుతో వారేమి చింతించినను గాఢముగ చింతింతురు. కనుకనే ఇతరులకు అనురక్తిగ కన్పించును. మెఱుపు మెఱసినపుడు అది గాజు కిటికీలపైనే ప్రతిఫలించును గాని చెక్క కిటికీలపై ప్రతిఫలింపదు గదా!" ఇట్లు ఆమె అనురక్త్యాభాస కారణముకూడ సాంసారిక ప్రేమకారణము కంటె భిన్నమని తెలియుచున్నది. దీనికి తోడు ఆమె చివరి రోజులలో రాధునుండి తన మనస్సు నెంత అనాయాసముగ నుపసంహరించుకొనినదో గమనించినచో ఆమె ప్రాపంచికానురక్త్యాభాసయొక్క విశిష్ట స్వభావమును తెలిసికొనగలము.

# వార్తలు - విశేషాలు

## శ్రీకృష్ణజయంతి

శ్రీరామకృష్ణమఠము (మైలాపూరు, మద్రాసు-4)న 1975 ఆగస్టు 29 వ తేది శ్రీకృష్ణజయంతి జరుపబడినది. సాయంకాలిక ఆరాత్రికము తరువాత శ్రీవిమలానంద స్వామివారు భాగవతపఠనము కావించిరి. తదనంతరము నడిరేయివరకు భజనజరుగుచుండగా పూజనడచినది. సమావిష్టులైన భక్తులెల్లరకును ప్రసాదము అంతియున పంచి పెట్టబడినది.

ఆగస్టు 31 వ తేది బహిరంగ సమావేశము జరుపబడినది. ఉదయమున భక్తజనులు స్త్రీ పురుషులందఱునుకలిసి భగవద్గీత నంతయు పారాయణచేసిరి. సాయంకాలము శ్రీ ఆర్. కోదండరామన్‌గారు తమిళమున భాగవతము నుండియు శ్రీకృష్ణకర్ణామృతము నారాయణీయము ఆళ్వారుల స్తోత్రములనుండి ఒడలు పులకరించునట్లు ఉదాహరించుచు శ్రీకృష్ణ జననముగూర్చి ప్రసంగించిరి. తదుపరి శ్రీ ఆర్. రంగాచారిగారు శ్రీకృష్ణునిగూర్చి ఆంగ్లమున నుపన్యసించిరి. అనంతవైభవము మితిలేని కలివిడి అను రెండులక్షణములు భాగవతమున ప్రతిఘట్టమునను ఉద్ఘాటింపబడినవని వారనిరి. ఎవరికెట్లు నచ్చిన అట్లు తల్లిగనో ప్రేయసిగనో తండ్రిగనో పుత్రునిగనో ప్రభువుగనో స్నేహితునిగనో ఎట్లైనను ఆరాధింపగలుగుటచేతనే ఆయన పూర్ణావతారమని వారు పేర్కొనిరి. కళారాధకులైనను సంగీతము చిత్రలేఖనము శిల్పము మొదలగువానిద్వారా అతని నారాధింపవచ్చును. అతని ద్వేషించువారికిగూడ, త్రికరణశుద్ధియున్నచో, అతనిని పొందగలుగు ఆశకలదు గదా!

అధ్యక్షులు శ్రీ విమలానందస్వామి శ్రీకృష్ణుని జననముయొక్క ప్రగాఢ విశిష్టతను సర్వకాలములందలి ఆధ్యాత్మికసాధకులకు దాని యొక్క సంబంధమును వివరించిరి.

## రామకృష్ణ వేదాంత సెంటర్ లండను

లండనునందలి ఇండియన్ హైకమిషన్ వారిచే నాహ్వానితులై శ్రీరంగనాథానంద స్వామివారు అచ్చట ఏప్రిలు '76 మాసమున లండను సెంటరున నుండిరి. ఉత్సాహపూరితులైన జనులయెదుట వారు హైకమిషన్, వరల్డ్ కాన్ఫరెన్సు అఫ్ ఫెయిత్స్ (world-conference of faiths). విల్లియమ్ పెన్ హౌస్, వెస్ట్ మినిస్టర్ స్కూల్, భారతీయ విద్యాభవన్, ఇండియన్ వై. యమ్. సి. ఏ తదితర హిందూసంఘములలో ప్రసంగించుచు పదునేడు దినములు గడపిరి. 54, హాలెండ్ పార్కున నున్న రామకృష్ణవేదాంత సెంటరునందు వారు ఏప్రిలు 20 వ తేది ప్రసంగించిరి. 250 మంది సమావిష్టులైరి కేంబ్రిడ్జి, లీడ్స్, ససెక్స్, లైసెస్టర్, బర్మింగ్‌హామ్ యూనివర్సిటీలయందును రిలిజియస్‌స్టడీస్ డిపార్ట్‌మెంట్ లందు ఉపన్యసించిరి.

## పాకాలలో శ్రీరామకృష్ణపరమహంస చిత్రపట ప్రతిష్ఠ

పాకాలలోని శ్రీరామకృష్ణ సంఘము అచ్చట శ్రీరామకృష్ణమందిరమున శ్రీరామకృష్ణపరమహంస చిత్రపటమును ప్రతిష్ఠించినది. మద్రాసు శ్రీరామకృష్ణమిషన్ స్వామి శ్రీస్వాత్మానందస్వామివారు పటము నావిష్కరించిరి. సంఘాధ్యక్షులు శ్రీసదానందగారు, కార్యదర్శి ఎన్. పరంధామనాయుడుగారు,

## శ్రీరామకృష్ణోపనిషత్తు

తమిళ రచయితలు :

శ్రీ చక్రవర్తి రాజగోపాలాచార్యులుగారు

ఆంధ్రానువాదకులు :

గౌ॥ న్యాయమూర్తి

శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావుగారు

శ్రీరామకృష్ణ దేవుని దివ్యోపదేశ వాక్యము లాధారముగాగొని, వానిని విరివి పఱచి, మనోహర కథా రూపముగను, సంభాషణరూపముగను అమర్చిబడినది.

128 పుటలు వెల : రూ. 3-75

## శ్రీరామకృష్ణ పరమహంస నీతికథారత్నములు

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వామి

మనోహరములు చమత్కారములు తత్త్వార్థబోధకములు అగు శ్రీరామకృష్ణుల నీతి కథలలో విశిష్టమగువాని నెన్నుకొని విషయానుగుణముగ విభజించి యనువదించిరి. హృద్యమగు శైలి.

పుటలు : 84 + VI వెల : రూ. 2-50

నాలుగవ ముద్రణము

## నా జీవితము జీవనకార్యము శ్రీవివేకానందస్వామి

అనువాదకులు :

శ్రీ కందుకూరి మల్లికార్జునం

భారతదేశ ప్రజలు లక్షలాదిగ వేతల పాలై కుందుచుండుటను చూచి ఆయన హృదయమెట్లు రక్తాశ్రువులు కార్చుచుండెనో తన మాతృదేశమును మరల పూర్వ తేజోవైభముతో దీపించునట్లు చేయుటకు ఆయన సంకల్పించిన మార్గ మెద్దియో ఇందు ప్రస్ఫుటముగ తెలియుచున్నది.

పుటలు : 61+II వెల : రూ. 1-25

(రెండవ ముద్రణము)

## బాలల వివేకానందుడు

బెంగాలీమూలము :

శ్రీ నిరామయానందస్వామి

అనువాదకులు :

శ్రీ కరణం రంగనాథరావు

జగద్విఖ్యాతుడైన వివేకానందస్వామి జీవితచరిత్ర బాలబాలికలకు సులభముగా అర్థమగునట్లు రచింపబడినది. స్వామివారి బాల్యవిశేషములు శ్రీరామకృష్ణుల సాంగత్యము పాశ్చాత్యదేశములకు పయనము మాతృదేశమున వారి కార్యక్రమము మనోహరముగ సంగ్రహింపబడినది.

పుటలు : 80+Viii వెల : రూ. 2-00

(రెండవ ముద్రణము)

అడ్రెసు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-600004

# శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-600004

## 1975-వ సంవత్సరము, డిసెంబరు మాసమున జరుగనున్న

## ఉత్సవ కార్యక్రమము

**మాతృశ్రీ శారదాదేవి జన్మదినోత్సవము :**

25-12-75 గురువారము : తిథిపూజ ఉదయము 5 గం.నుండి, 11 గం. వఱకు విశేషపూజ హోమము.

28-12-75 ఆదివారము : బహిరంగోత్సవము.

అపర్ణాహము 3-00 నుండి 5-30 వఱకు : గోల్డన్‌రాక్ శ్రీశారదా భజనమండలివారి భజన కార్యక్రమము.

5-30 ,, 7-30 ,, బహిరంగసభ.

అధ్యక్షులు : శ్రీమత్తపస్యానందస్వామివారు.

వక్తలు : శ్రీ సోమానందస్వామివారు (తమిళము)
డా. షణ్ముగంగారు (ఆంగ్లము)

22, 23, 26, 27-12-75 6-00 నుండి 7-00 వఱకు : తమిళమున ఉపన్యాసము.
"నాయ్‌గెయ్ ఆళ్వారుల యోగతత్త్వము"
వక్త : డా. ఆర్. బాలసుబ్రహ్మణియన్.

**క్రీస్తు జయంతి :**

24-12-75 బుధవారము : 7-00 గంటలకు : సాయంకాలిక ఆరాత్రికానంతరము క్రీస్తుదేవునిపై రెవరెండు ఫాదర్ ఎల్. కొరియా (లాయొలా కళాశాలయొక్క డైరెక్టరు)గారి ఆంగ్లోపన్యాసము

**ఆదివారములందు సత్సంగ సమావేశములు :**

అపరాహ్ణము 4-00—4-20 వఱకు లలితా సహస్రనామ పారాయణము (7-12-75, 21-12-75)

,, ,, ,, శ్రీవిష్ణు సహస్రనామ పారాయణము (14-12-75)

4-20—4-30 ,, ధ్యానము.

4-30—5-30 ,, తమిళమున ఉపన్యాసములు :—
శ్రీమద్భాగవతము : శ్రీ 'అణ్ణా' ఎన్. సుబ్రహ్మణ్యంగారు (14-12-75)
శ్రీదక్షిణామూర్తి స్తోత్రము : డా. టి. ఎమ్. పి. మహాదేవన్‌గారు (7-12-75)
శ్రీవిష్ణు సహస్రనామము : శ్రీ వి. ఆర్. కల్యాణసుందరశాస్త్రిగళ్ (21-12-75)

5-35—6-30 ,, ఆంగ్లమున ఉపన్యాసములు :—
శ్రీమద్భగవద్గీత : శ్రీమత్తపస్యానందస్వామివారు.

6-30—8.00 ,, ఆరాత్రికము - భజన.

**ప్రత్యేకోపన్యాసములు :**

6-12-75 శనివారము : 5-30 శ్రీమద్రామాయణ పఠనము : శ్రీ పి. రామకృష్ణన్, ఐ.సి.ఎస్. (రిటైర్డు)

13, 20-12-75 ,, 5-30 శ్రీమద్రామాయణము : డాక్టర్ ఎన్. వీఘ్రినాథన్‌గారు.

**ఇతర వారములందు ఉపన్యాసములు :**

సోమవారములు : శ్రీవిష్ణుసహస్రనామము (ఆంగ్లము) శ్రీ వీతమోహానందస్వామివారు.

మంగళవారములు : అధ్యాత్మరామాయణము (ఆంగ్లము) శ్రీ గభీరానందస్వామివారు.

బుధవారములు : శ్రీమద్భాగవతము (ఆంగ్లము) శ్రీ గోలోకానందస్వామి.

గురువారములు : అముదమొళ్ళి (తమిళము) శ్రీ శ్రీరంగానందస్వామి.

శుక్రవారములు : ఆత్మబోధ (తమిళము) శ్రీ ఆర్. రామకృష్ణన్.

7-12-75 ఆదివారము : అంతర్యోగ సాధన.

ఉభయ ఏకాదశులయందును సాయంకాలిక ఆరాత్రికానంతరము శ్రీరామనామ భజన (14-12-75, 28-12-75)

12-12-75 శుక్రవారము: శ్రీ ప్రేమానంద జయంతి.

28-12-75 ఆదివారము: శ్రీ శివానంద జయంతి.

శనివారములందు సాయంకాలము 6.30 గంటలకు తిరువళ్ళిక్కేణియందలి దక్షిణ మాడవీధియందు 18-వ నంబరుగల శ్రీరామకృష్ణ మందిరమున శ్రీమత్ విబుధానందస్వామివారి భగవద్గీతోపన్యాసములు.

ఈ ఉత్సవము లన్నింటియందును భక్తులెల్లరును పాల్గొని భగవంతుని యనుగ్రహభాగ్యమును బడయగోరుచున్నాము.

అధ్యక్షులు,
శ్రీరామకృష్ణమఠము, మద్రాసు-600004

# శ్రీ రామకృష్ణమఠ ప్రచురణలు

| పుస్తకము | రూ. | పై. |
|---|---|---|
| శ్రీ రామకృష్ణ సూక్తిసుధ ... | 7 | 50 |
| శ్రీ రామకృష్ణ బోధామృతము ... | 4 | 50 |
| గురూపదేశములు ... | 2 | 00 |
| శ్రీరామకృష్ణోపనిషత్తు ... | 3 | 25 |
| శ్రీరామకృష్ణపరమహంస నీతికథారత్నములు ... | 2 | 50 |
| పరమహంస శ్రీరామకృష్ణుడు ... | 0 | 25 |
| నా గురుదేవుడు ... | 0 | 40 |
| శ్రీ రామకృష్ణుడు, వివేకానందస్వామి ... | 0 | 25 |
| శ్రీ శారదాదేవి జీవిత చరిత్ర ... | 2 | 75 |
| శ్రీ శారదా ప్రసంగములు .. | 3 | 00 |
| శ్రీ శారదాదేవి ... | 1 | 25 |
| శ్రీ వివేకానంద జీవిత చరిత్ర ... | 4 | 00 |
| వివేక సూర్యోదయము ... | 4 | 00 |
| బాలల వివేకానందుడు ... | 2 | 00 |
| శ్రీ వివేకానంద సంపూర్ణగ్రంథావళి 9 సంపుటముల సెట్టు (సాదా) ... | 45 | 00 |
| ,, ,, క్యాలికో | 58 | 50 |
| * విడి సంపుటములు ఒక్కొక్కటి సాదా | 5 | 00 |
| ,, ,, క్యాలికో ... | 6 | 50 |
| సందేశ తరంగిణి (మొదటిభాగము) ... | 4 | 00 |
| ,, (రెండవభాగము) ... | 3 | 00 |
| భక్తియోగము ... | 4 | 00 |
| కర్మయోగము ... | 4 | 00 |
| హిందూమతము ... | 4 | 00 |
| భారత యువజనులారా! ... | 3 | 00 |
| ప్రబోధ రత్నాకరము ... | 2 | 50 |
| శ్రీ వివేకానందలేఖావళి (మొదటిభాగము) | 2 | 25 |
| ,, (రెండవభాగము) | 1 | 75 |
| అనుష్ఠాన వేదాంతము ... | 1 | 25 |
| ప్రాచ్యము-పాశ్చాత్యము ... | 1 | 25 |
| చికాగోనగరోపన్యాసములు ... | 1 | 00 |
| భారతదేశము ... | 1 | 00 |
| భారతీయ మహిళ ... | 1 | 00 |
| శ్రీ రామకృష్ణ సేవాసంస్థల ఆదర్శములు | 0 | 50 |
| నా సంస్కరణ యుద్ధ విధానము ... | 0 | 87 |
| నవీన భారత దేశము ... | 0 | 40 |
| పవహారి బాబా ... | 0 | 25 |
| తాపత్రయ చికిత్స ... | 0 | 60 |
| పారమార్థిక సంభాషణలు ... | 3 | 00 |
| నారద భక్తి సూత్రములు ... | 4 | 00 |
| శ్రీ దొడ్డ భాగవతము-రెండవ సంపుటము | 5 | 50 |
| ,, మూడవ సంపుటము | 7 | 50 |
| శక్తిమాహాత్మ్యము ... | 2 | 50 |
| పరతత్త్వ ప్రసంగము ... | 2 | 00 |
| శ్రీమద్భగవద్గీత (టీకాతాత్పర్య విశేషార్థసహితము) ... | 9 | 00 |
| పారాయణగీత మూలము ... | 1 | 00 |
| గిరీశచంద్ర ... | 1 | 00 |
| శ్రీరామకృష్ణ ఆరాత్రికము మరియు శ్రీరామనామ సంకీర్తనము ... | 0 | 50 |
| భక్తిమార్గము ... | 1 | 00 |
| శ్రీ రామకృష్ణ ఉవాచ ... | 0 | 80 |
| శ్రీ శారదా సూక్తి నవనీతము ... | 0 | 80 |
| శ్రీ వివేకానంద శంఖారావము ... | 0 | 80 |
| శ్రీకృష్ణవాణి ... | 0 | 80 |
| బుద్ధ ఉవాచ ... | 0 | 80 |
| క్రీస్తు సూక్తిమాల ... | 0 | 80 |
| మహమ్మదు సూక్తి మంజరి ... | 0 | 80 |
| అద్భుతానందస్వామి ... | 0 | 87 |

ఇవియేకాక ఆంగ్ల, సంస్కృత, తమిళ, హిందీ, కన్నడ గ్రంథములును,
వేదాంతకేసరి (ఆంగ్లము) శ్రీరామకృష్ణ విజయము (తమిళము)
అను మాసపత్రికలను, శ్రీరామకృష్ణ పరమహంస, శ్రీశారదాదేవి, శ్రీవివేకానందస్వామి మున్నగువారి ఛాయాచిత్రములు, త్రివర్ణచిత్రములు, తైలచిత్రములు మున్నగున వెన్నియో మాయొద్ద లభింపగలవు.

* అయిదవ సంపుటము క్యాలికోగాని అట్టబైండుగాని లేదు.

ఇట్లు వ్రాయుడు:

**శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-600004.**

సంపాదకులు: శ్రీ చిద్ఘనానందస్వామి,

శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-600021) న ముద్రింపబడి,

శ్రీ చిద్ఘనానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మద్రాసు-600004) నుండి ప్రచురింపబడినది.

# శ్రీమద్భగవద్గీత

అనువాదకులు :

శ్రీ నిర్వికల్పానందస్వాములవారు

ఇది మూలశ్లోకములు, ప్రతిపదార్థము, ధారాళమగు అనువాదము, శ్రీధరీయ టీకాసారము, విశేషాంశములు, సానువాదగీతాపాఠక్రమము, ధ్యానమాహాత్మ్యములు, సమభావాత్మకములగు ఉపనిషద్వాక్యసూచిక, వేదాంతసూత్రసూచిక, గీతాశ్లోకసూచిక, శబ్దానుక్రమణిక—ఇన్నిటితో విరాజిల్లుచున్నది.

భక్తులకు సాధకులకు మాత్రమేకాక కళాశాల విద్యార్థులకు సైతము ఉపయుక్తమయిన దివ్యగ్రంథము.

పుటలు : 58+440 (అందమయిన అష్టమ ముద్రణము) వెల : రూ 9-00

---

# 'మా దివ్యవాణి' గ్రంథమాల

నేడే కొనండి ! పదే పదే చదవండి !!

దివ్యావతారమూర్తుల విశ్వోపజీవ్యములైన అమృత మధుర సూక్తులు సర్వసుగ్రహము హృదయ సన్నిహితమునైన తేటతెనుగున వీనిలో అందజేయబడ్డాయి. ఇందులో ఒక్కొక్కటి నిరుత్సాహులకు ఉత్సాహప్రదం, అశాంతిసంక్షుభితులకు శాంతిదాయకం, సంశయాందోళితులకు సంశయాపనోదకం, జిజ్ఞాసువులకు పరమార్థజ్ఞాన సమర్పకం, అందరికీ శిక్షకం, సంస్కారకం, నిర్వృత్యాపాదకం. మువ్వన్నెల మేలి జాకెట్టుతో పాకెట్టుసైజులో చక్కని తయారింపు—

| | | | |
|---|---|---|---|
| శ్రీ రామకృష్ణ ఉవాచ | 0-80 | శ్రీ కృష్ణవాణి | 0-80 |
| శ్రీ శారదాసూక్తి నవనీతము | 0-80 | బుద్ధ ఉవాచ | 0-80 |
| శ్రీ వివేకానంద శంఖారావము | 0-80 | క్రైస్తు సూక్తిమాల | 0-80 |

మహమ్మదు సూక్తిమంజరి 0-80

---

ఇట్లు ప్రకాశకుడు :

మేనేజరు, శ్రీ రామకృష్ణ మఠము, మైలాపూరు, మద్రాసు - 600004.

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౩౨ — ౧౯౭౫ - డిసెంబరు : రాక్షస - మార్గశిరము — సంచిక ౬

## విషయసూచిక

# శ్రీ వివేకానంద జీవితచరిత్ర

(శ్రీ చిరంతనానందస్వామి ప్రణీతము)

ఇందు శ్రీ స్వాములవారి జీవితమున నింతకుపూర్వము గ్రంథస్థములుగాని ముఖ్య సంఘటన లెన్నియో శ్రీవారి సోదరశిష్యులవలన విని వ్రాయబడినవి. ఇది శ్రీ స్వాములవారి సంపూర్ణ చరిత్ర!

...శ్రీ వివేకానందస్వాములవారి యసమాన వాగ్వైభవమును మంచి నుడికారపు టొడుపుతో శ్రీ చిరంతనానందులు తెలుఁగున ప్రదర్శించిరి. వివేకానందుల వాఙ్మయ మూర్తికి తెలుఁగుసేఁత యలంకృతి...

—వేటూరి ప్రభాకరశాస్త్రి

నిర్దుష్టమైన భాష, అందమైన అచ్చు, ఆకర్షకమైన రూపము.

432 పుటలు (పదవ కూర్పు) వెల: రూ. 4-00

## భక్తిమార్గము

మూలము: శ్రీ పరమానందస్వామి

అనువాదకుడు: శ్రీ గోపేటి సత్యనారాయణ

భక్తిరేవ గరీయసీ యని నారద వాక్యము. రచయిత భక్తి పవిత్రత సుస్థిరత నిర్భయత ఆత్మసమర్పణము అను వాని ద్వారా భక్తి మార్గమును సులభగమ్యముగ చేసిరి.

పుటలు: 62 + II వెల: రూ. 1-00

నాలుగవ ముద్రణము.

## తాపత్రయ చికిత్స

శ్రీ రామకృష్ణానందస్వామి

జిజ్ఞాసువులకు భక్తులకు ఆర్తులకు శ్రీ స్వామివారు అమృతవర్షము వంటి యుత్తరములు వ్రాసి యుండిరి. వాని యందలి విశేషాంశముల సంపుటీకరణమే తాపత్రయ చికిత్స. ప్రపంచము నందలి తాపత్రయ సంతప్తులకు ఈ చిన్ని పొత్తము శాంతి ప్రదమగుట నిస్సంశయము.

పుటలు: 64+VIII వెల: రూ. 0-60

మూడవ ముద్రణము

ఇట్లు వ్రాయుడు: మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-600004.

## కర్మయోగము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వాములవారు

ఇందు శ్రీ స్వాములవారు కర్మయోగ తత్త్వమును అరటిపండొలిచినట్లు విశదీకరించియున్నారు. కర్మయోగుల యొక్క సాధనమో స్పష్టీకరించియున్నారు.

(అష్టమ ముద్రణము)

(146+8) పుటలు   వెల : రూ. 4-00

## భక్తియోగము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వాములవారు

ఆధునికుల చిత్తము నాకర్షించు రీతిని, అమోఘవచనములతో, విమర్శనాదృష్టితో శాస్త్రప్రమాణములతో భక్తితత్త్వమును శ్రీ వివేకానందస్వాములవారింకా విపులముగా ప్రదర్శించియున్నారు. మూల గ్రంథములలోని ప్రమాణవచనములును వానికి టిప్పణములును సులభశైలియందు వ్రాయబడియున్నవి.

(ఏడవ కూర్పు)

(121+4 పుటలు)   వెల : రూ. 4-00

## శ్రీరామకృష్ణపరమహంస జీవిత సంగ్రహము

శ్రీ చిరంతనానందస్వామి

మహిమాన్వితమగు శ్రీ రామకృష్ణ పరమహంస జీవిత విశేషములు ఇందు రమణీయమగు శైలిలో వర్ణింపబడియున్నవి. లోకమునకు శ్రీరామకృష్ణులు కావించిన యుపకారము వారి యుపదేశ సారముకూడ చక్కగా వివరింపబడినవి.

పుటలు : 48   వెల : రూ. 0-75

నాలుగవ ముద్రణము

## గురూపదేశములు

అనువాదకులు : శ్రీ చిరంతనానందస్వామి

శ్రీ గురుదేవుని మానసపుత్రులుగ బరగిన శ్రీ బ్రహ్మానందస్వామిని గురుముఖము నుండి వచ్చిన యుపదేశములను యథాతథముగ గ్రహించి వానియందు ముఖ్యములగు వానిని సంగ్రహించి యాంగ్లమున రచించిరి. దాని యనువాదమే ఈ గ్రంథము. ఇందు గృహస్థులకు సాధకులకు వలయు సూక్తులెన్నియో వివరింపబడియున్నవి.

పుటలు : 168   వెల : రూ. 2-00

తొమ్మిదవ ముద్రణము

ఇట్లు వ్రాయుడు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-600004

'అఖిలవిధ శరణాగతము, యా క్షణంబ యతవిశ్వప నీదు ననుభూతి కందు నక్స'.

—శ్రీ శారదామణి.


# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౩౨ } ౧౯౭౫ - డిసెంబరు : : రాక్షస - మార్గశిరము { సంచిక ౬


ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ!

## ప్రార్థన

## శ్రీ రామకృష్ణ కర్ణామృతము

హే రామకృష్ణ నిరుపాధిక తత్పదార్థ స్థానే భవాన్ గుణవిశేషణ శక్తిశూన్యః
కాన్తిం శ్రుతం సువసనం ద్రవిణం విభూతిం సర్వం విసృజ్య కృతవా నవతార లీలామ్॥

శ్రీరామకృష్ణా! దేహసౌందర్యమును మనోహరమగు వేషమును అసమానమగు పాండిత్యమును ఐశ్వర్యమును మహిమలను అన్నింటిని వదలివైచి నీవు భూలోకమున లీల నెఱపుట తగియేయున్నది. నీవు నిజముగా నిరాకారము నిరుపాధికము నిర్గుణము అగు శుద్ధ చైతన్యమవు కదా!

నూనం సుదూర మపసారయితుం సకామా నంగీచకర్థ పరిపూర్ణ మకించనత్వమ్
యస్మాత్త్వాంతిక మకామిన ఏవ భక్తా ఆయాన్తి కేవల పదార్చన మాత్ర శీలాః॥

ప్రాపంచిక సుఖములను కోరు భక్తులను దూరముగ తొలగించుటకే నీవు నిర్ధనుడ వగు యతి వైతివి. కనుకనే ప్రాపంచిక భోగములపట్ల విరక్తులును నీ పాదసేవయందే ఆనందించు వారును అగు భక్తులు మాత్రమే నిన్ను జేరుచున్నారు.

# శ్రీరామకృష్ణస్మృతులు

'ఈ శరీరము నం దుండున దెవరో మా తలిదండ్రులకు తెలియును. గయలో మా తండ్రి కొక కలవచ్చెను. ఆ కలలో రఘువీరు డాయనతో నిట్లనెను. "నేను నీ కుమారునిగ జనించెదను."

*　　*　　*

'మా తండ్రి పాదుకలు ధరించి గ్రామములో వీధి వెంబడి పోవునపుడు అంగడివాండ్రు "అదుగో, వారు వచ్చుచున్నారు" అనుచు గౌరవముతో లేచి నిలుచుండెడివారు. హల్దార్ పుకూరు చెఱువునందు ఆయన స్నానము చేయునపుడు గ్రామస్థులు నీటిలో దిగుటకు సాహసించెడివారు కారు. వారు స్నానము చేయుటకు ముందు మాతండ్రి స్నానమైనదా లేదా యని విచారించెడివారు.

'మాతండ్రి రఘువీరుని నామ ముచ్చరించునపుడు వారి వక్షము ఎఱ్ఱవారెడిది. ఇది నాకు గూడ సంభవించెను.'

*　　*　　*

'నా ప్రథమసమాధిస్థితులలో నొక దానిని, నా పది పదునొకండేండ్ల వయస్సున మైదానముపై విశాలాక్షిమందిరమున కేగుచు అనుభవించితిని. ఎట్టి దివ్యదర్శనము! బాహ్యప్రపంచ స్పృహనే సంపూర్ణముగ కోలుపోయితిని.

*　　*　　*

'నేను కామార్పుకూరున నుండిన కాలమున హృదయుని పుత్రుడు నాలుగైదేండ్లవాడు పగలంతయు నావద్దనే గడిపెడువాడు. తన బొమ్మలతో నాడుకొనుచు అతడు ఇతరములెల్ల మఱచిపోయెడువాడు. కాని సాయంకాలము కాగనే "నేను మా అమ్మవద్దకు పోవలయును" అనును. నేను అతని నెన్నోవిధముల బుజ్జగింప ప్రయత్నింతును. "ఇదిగో నీకు పావురము నిత్తును" అందును. కాని అతడిట్టి వస్తువులతో ఓదార్పబడడు; అత డేడ్చును. "నేను మా అమ్మవద్దకు పోవలయును" అని అఱచును. ఆటలయం దిక అతనికి సంతోషమే లేదు. అతని యవస్థను చూచి నేనే ఏడ్చెడివాడను.

*　　*　　*

'ఓ, నే నెట్టి భావముల ననుభవించితిని! కామార్పుకూరునందు చినీ శంకరి మొదలగు నా బాల్యస్నేహితులతో నిట్లంటిని. "మీ కాళ్లు పట్టుకొని ప్రార్థింతును. హరినామము నుచ్చరింపుడు." వారందఱి యెదుట సాష్టాంగపడబోవుచుంటిని. అప్పుడు చినీ ఇట్లనెను. "ఇది నీ దివ్యప్రేమయొక్క ప్రథమోద్గారము. అందువలన నీవు ఒకనికి ఇంకొకనికి గల తారతమ్యమును జూడలేకున్నావు. తుఫాను వచ్చి దుమ్ము రేగినపుడు మామిడిచెట్టును చింతచెట్టును ఒకలాగుననే కన్పించును ఒకదానినుండి మఱొకదానిని తెలిసికొనలేము.'

*　　*　　*

'నా సోదరి, హృదయుని తల్లి, పూవులతోను గంధముతోను నా పాదములను పూజించెడిది. ఒకనాడు నా పాదము నామె తలపైనుంచి ఇట్లంటిని. "నీవు వారణాసియందు మరణింతువు." '

*　　*　　*

'కైవర్తుల'[1] యన్నము తినవలసి వచ్చినందులకు నే నెంతయో బాధపడెడివాడను ఆ కారణముననే రాసమణి కాళికాలయమునకు మిక్కిలి

---

1. కైవర్తులు: బెస్తకులము. దక్షిణేశ్వర దేవాలయ స్థాపకురాలైన రాణిరాసమణి ఈ కులస్థురాలు. ఈ కారణమున గలిగిన శ్రీరామకృష్ణుల బాధ ఆయన దక్షిణేశ్వరమున నుండిన మొదటి రెండు మూడు నెలలు మాత్రమే నిలిచెను.

బీదవారుకూడ భోజనార్థమై వచ్చెడివారు కారు. దేవికి నైవేద్యము చేసిన యాహారమును స్వీకరించుటకు జనులు లభింపక పోవుటచే దానిని ఆవులకు వేసెడివారు ఇంకను మిగిలినది గంగలో పారవేసెడివారు.

* * *

'ఓ, నేనెట్టి బాధాతప్తదినములను గడిపితిని! కాళీమాతనుండి వియోగమువలని నా యా వేదనను మీరూహింపలేరు. అది సహజమే. ఒక గదియందు బంగారపుమూట యున్నదనుకొనుడు, ప్రక్కగదియందొక దొంగ యుండెననుకొనుడు. రెండు గదులకు నడుమ నున్నది పలుచని గోడ మాత్రమే. అతడు ప్రశాంతముగ నిద్రింపగలడా? ఇటునటు పరుగెత్తుచు గోడను విరుగద్రోచి బంగారము నందుకొనుటకు ప్రయత్నించును గదా! నా పరిస్థితి యట్టిది. అనంత శాంత్యానందమూర్తియైన అమ్మ, ఇహలోక సంపద లన్నింటిని తృణప్రాయముగ తోపించు అమ్మ, నాకు మిక్కిలి సమీపముననే యున్నదని నాకు తెలియును ఇతరము దేనితోనైనను నేను తృప్తిపడుట ఎట్లు? నేను ఆమెనే వెదుకవలసియుండెను. ఆమెకొరకై నేను పిచ్చివాడనైతిని.'

* * *

'ఆమె దర్శనమును బడయజాలనైతినని నా హృదయమున నప్పుడు భరింపరాని వేదన కలిగెను. నీటిని తువ్వాలునుండి పిండుటకు దానినెట్లు బలముగా మెలిపెట్టుదురో అట్లు నా గుండెను మనస్సును ఎవరో పట్టుకొని పిండుచున్నట్లనిపించెడిది. అమ్మ దర్శనము నాకిక కానేరదను భావముతో వ్యథితుడనై నేను నైరాశ్యముతో చచ్చిపోవుచుంటిని. ఈ బాధతో ఇక జీవించుట వలన నే ప్రయోజనమును లేదనుకొంటిని. హఠాత్తుగ అమ్మ దేవాలయమున నచట నున్న కత్తి నా కంటబడినది. దానితో ఆ క్షణమే నా జీవితము నంతము చేసికొన నిశ్చయించుకొంటిని. పిచ్చి ఎత్తినట్లు పరువిడి దాని నందుకొనగనే కాళీమాతయొక్క అద్భుతదర్శనమై స్మృతి తప్పి పడిపోయితిని. అప్పుడు బాహ్య ప్రపంచములో నేమి జరిగెనో ఆ దినము మఱుదినము ఎట్లు గడచినవో నేనెఱుగను. కాని నా హృదయాంతరాళములో నేనింతకుముందెన్నడును అనుభవింపని ప్రగాఢమగు ఆనందప్రవాహము ప్రవహించుచుండ అమ్మయగు తేజఃపుంజముయొక్క ప్రత్యక్షానుభూతి నందితిని.'

[మఱియొక సందర్భమున ఈ దృశ్యమును వివరముగ వర్ణించుచు:] 'ఇండ్లు, తలుపులు దేవాలయములు తదితర వస్తువులన్నియు ఒక్కసారిగా అదృశ్యమైనట్లైనది, ఎచ్చోటను ఏ ఒక్కటియు లేనట్లే! అప్పుడు నేను చూచినది అనంతము అపారము చైతన్యవంతము అగు కాంతి సాగరమును మాత్రమే! ఎంతదూరము ఏ దిక్కునకు చూచినను నిరంతరాయముగ ఉజ్జ్వలములగు తరంగముల పరంపర మహావేగముగ ఉద్ధృతముగ కల్లోలముగ అన్ని దిక్కుల నుండియు దూకుచుండుటను కనుగొంటిని. అతి త్వరలో అవి నాపై బడి తెలియరాని యగాధమునకు ముంచివేసినవి. నేను రొప్పితిని, గింజుకొంటిని, స్మృతి తప్పి పడిపోతిని.'

# అద్వైతవేదాంతము - లౌకికాభ్యుదయము

ఆ ఆత్మ అనంతమై అఖండమై అవినాశియై ప్రకాశించుచున్నది. ఆ ఆత్మను కత్తులు నరకజాలవు. గాలి ఆర్పజాలదు. నిప్పు కాల్పజాలదు. అది ఆద్యంతములు లేనిది. జననమరణములు లేనిది. దీనితో పోల్చినచో సూర్యచంద్రులు నక్షత్రమండలములు సముద్రములోని నీటి చుక్కలను బోలును. ఆత్మప్రభావమునెదుట ఆకాశము శూన్యమై చనును. కాలము అభావమగును. ఇట్టి మహిమాఢ్యమగు ఆత్మయందు మనకు విశ్వాసము కుదరవలెను. అందుండి మనకెంతేని బలము చేకూరగలదు. నీవేది కాగోరిన నది కాగలవు. దీనుడ ననుకొనిన దీనుడ వగుదువు, బలాఢ్యుడనని ఎంచిన బలాఢ్యుడ వగుదువు. పాపి ననుకొనిన పాపి వగుదువు. పుణ్యశాలి ననుకొంటివా, పుణ్యశాలి వగుదువు. బలాఢ్యులము సర్వశక్తిమంతులము సర్వజ్ఞులము అని మనము సంకల్పము చేయవలెను. ఆ శక్తియంతయు ఇప్పుడు నాయందు ప్రకాశమునకు వచ్చియుండక పోవచ్చును. కాని అది నాయందున్నది. నేను పరమపవిత్రుడను. నిత్యముక్తుడను. ఈ జ్ఞానమును నేను ప్రకటింపజాలక పోవుట యేల? నాకు దానియందు విశ్వాసము లేదు కనుకనే. దానియందు విశ్వాసము కుదరగనే అది ప్రకాశమునకు రాగలదు, వచ్చియే తీరును. నిర్గుణబ్రహ్మభావన ప్రబోధింపగలది ఇదియే. మీ బిడ్డలను పసితనమునుండియే పరాక్రమవంతులనుగ చేయుడు. వారికి ధైర్యమును నేర్పుడు. వారిని వీర్యవంతులను చేయుడు. ధీరులై సర్వదమనులై తితిక్షావంతులై సర్వస్వతంత్రులై నిలుచునటుల ప్రోత్సహింపుడు. మొట్టమొదట వారికి ఆత్మయొక్క మహిమను తెలుపుడు, అది మీకు వేదాంతమున మాత్రమే లభింపగలదు. ఈ ఆత్మభావన ఉజ్జీవనప్రదమైనది. ఈ ప్రపంచమును తలక్రిందులు చేయగల భావనాపటిమ వేదాంతమునుండియే బయలుదేరగలదు, అదియే జడప్రకృతిశాస్త్రములకును మతమునకును సామరస్యమును కూర్పగలదు.

—శ్రీ వివేకానందస్వామి.

"బ్రహ్మసత్యం జగన్మిథ్యా" అనునది మాత్రము అద్వైతసిద్ధాంతముగ పలువురు భావింతురు. ఇట్టి మిథ్యయగు ప్రపంచమున నుద్యమించుట కవకాశమే లేదని యను కొందరు కష్టములు కడగండ్లు ఇతరులవే యైన "అంతయు మిథ్య" యని చప్పరించుటలు తనవైనచో "కర్మ" యని వాపోవుచుండుటలు వేదాంతుల లక్షణములుగ స్వీకరింతురు. ఇక లౌకికాభ్యుదయము ఉద్యమము చేతనే సాధ్యము. కష్టములు తనకు రాకుండునట్లు ప్రయత్నించుట, వచ్చినచో వానిని తొలగించుకొను ప్రయత్నము చేయుట, అభ్యుదయ లక్షణములు. అంతేకాక సుఖములను తనకును ఇతరులకును సంపాదించుకొను ప్రయత్నము కూడ అభ్యుదయ శబ్దమున నిమిడియున్నది. ఇట్లగుటచేత సామాన్యముగ అద్వైత వేదాంతమునకు లౌకికాభ్యుదయమునకు వెలుగు చీకటులకువలె విరోధము భాసించును.

కాని స్వరూపమును విచారించినచో నిజమగు అద్వైత వేదాంతసాధనలో లౌకికాభ్యుదయము మొదటి మెట్టుమాత్రమే. అద్వైతము భౌతికముగను మానసికముగను ఆధ్యాత్మికముగను అభ్యసింపవలెను. భౌతికము మానసికము అగు అద్వైతసాధన లౌకికాభ్యుదయము నొనగూర్చును. వీనిని సాధించి, వెనుక వదలిననే తప్ప ఆధ్యాత్మికమగు అద్వైతసాధన సాధ్యము కాదు. సకృత్తుగా నొకరు అసమాన శేముషీసంపన్నులు ఒక్కసారిగా భౌతిక మానసిక సాధనలనుదాటి ఆధ్యాత్మికాద్వైతమును సాధించినను సాధారణబుద్ధులు అద్వైత భ్రాంతిని మాత్రమే చూచి ఇటు ఇహమును అటు పరమునుకూడ

కోల్పోవుదురు. కనుక ప్రథమమున అద్వైత తత్త్వమును స్పష్టపరచుకొని పిదప క్రమముగ నిదానముగ దానిని సాధించు ప్రయత్నము చేయవలెను.

"బ్రహ్మసత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవ నాపరః" అని అద్వైత సిద్ధాంతసారము. అనగా జీవుడు బ్రహ్మముతప్ప వేఱుకాడు. అట్టి బ్రహ్మమే సత్యము. జీవరూపమగు జగత్తు మిథ్య, భ్రాంతి, అని సిద్ధాంతము. మానవుడు తన బ్రహ్మత్వమును తెలియనంతవఱకు, జీవత్వమునే గుర్తించునంత కాలము, (వాస్తవమునకు బ్రహ్మమే యైన) జగత్తే సత్యము. తన బ్రహ్మత్వము తెలిసినంతనే ఇక జీవుడు కాని జగత్తుకాని భాసింపదు అంతయును బ్రహ్మమే. బ్రహ్మము చైతన్యస్వరూపము జ్ఞానస్వరూపము ఆనందస్వరూపము అనంతము. శ్రవణమనననిదిధ్యాసనలు అద్వైతసాధనకు మార్గముగా చెప్పబడినవి. బ్రహ్మమును గూర్చి మానవుడు మొదట వినవలెను, అధ్యయనము చేయవలెను, దానినిగూర్చి యాలోచింపవలెను, దానిని జీవితమున సాక్షాత్కరించుకొనవలెను.

మానవుడు తాను బ్రహ్మమునని తలచినచో అతడు చైతన్యస్వరూపుడుగను జ్ఞానస్వరూపుడుగను ఆనందస్వరూపుడుగను అనంతుడుగను ఉండవలెను. ఇందు నిజముగ విశ్వాసము కలిగినచో అతనికి ఎక్కడలేని బలమును ఆత్మవిశ్వాసమును కలుగును.

భౌతికస్థాయియందు సూర్యుడు వెలుగునది ఆ చైతన్యప్రభావమువలననే. సూర్యచంద్రులు నక్షత్రమండలములు గతులు తప్పకయుండునది ఆ చైతన్యప్రభావమువలననే. ఆ చైతన్యమే ఈ అనంతవిశ్వమును సృష్టించుచు రక్షించుచు లయము చేయుచున్నది. ఆ చైతన్యాంశమే మానవుడైనచో ఇక అతని కసాధ్యమేమి కలదు? అతడు చేయదలచినదంతయు ప్రయత్నసాధ్యమే. అతనికి ఓటమియనునది లేదు. జయము సాధించువఱకు అతడు ప్రయత్నించుచునే యుండును.

నిత్యజీవితమున ఆత్మవిశ్వాసము గలుగువారు మాత్రమే యున్నతశిఖరమెక్కుటను గమనింతుము. వారు ధనము సంపాదింపగోరి ప్రయత్నించి ధనము సంపాదింతురు. భోగభాగ్యములనుకోరి వానికై యుద్యమించి వానిని సాధింతురు. శ్రమాపనోదకములైన యంత్రములను సాధింపనెంచి వానిపై ధ్యానముంచినచో అవి స్ఫురించును. వ్యాధినివారణౌషధములపై ధ్యానముంచినచో అవి మనోవీథిని సాక్షాత్కరించును. అట్లని, ఒదిగి కూర్చుండి 'యంత్రములు యంత్రములు' అని జపము చేసినచో అవి ప్రత్యక్షమగునా? యంత్రాగారమునకుపోయి అచ్చట ననేక ప్రయత్నములను దీక్షతో తదేకధ్యానముతో చేయుచుండినచో చివరకు ఆ యంత్రము రూపొందితీరును. అట్లే ఒక దుర్వారవ్యాధి కౌషధమును కనుగొన నిశ్చయించిన మానవుడు ప్రయోగశాలలోనికి పోయి దానినిగూర్చి పర్యాలోచించుచు దానినిగూర్చిన గ్రంథముల నధ్యయనము చేయుచు తదేకధ్యానమున ప్రయోగములు చేయుచుండగా చివరికా యౌషధము తయారగుచున్నది. అట్లే ధనికుడు కాగోరువాడు వ్యవసాయమునో వర్తకవాణిజ్యమునో వస్తూత్పాదనమునో తదితరమునో గ్రహించి అనన్యమనస్కుడై ధనము నిల్వచేయుటయందే నిమగ్నుడైనచో అతడు ధనికుడగుచున్నాడు. ఇట్లు భౌతికస్థాయియందు తానే బ్రహ్మమునని విశ్వసించుటచేత, తనకు అసాధ్యమనునది లేదని

గుర్తించుటచేత ఫలితము వచ్చితీరునను నిశ్చయముచేత మానవుడు తనకేది కావలసిన దానినిగూర్చియే అభ్యసించి దానినిగూర్చియే ఆలోచించి దానికై ప్రయత్నించి దానిని సాధింపగలుగుచున్నాడు.

ఇట్లు భౌతికదృష్టితోడి అద్వైతభావన విషయబాహుళ్యమును వస్తు సంచయమును ఆనందమునకు భౌతిక కారణములనెల్ల సాధింపగలుగును. కావలసినదంతయు "నేను బ్రహ్మమును. అందువలన నాకసాధ్యమనునది లేదు" అను నచంచలము అకుంఠితము సుదృఢము అగు విశ్వాసము మాత్రమే.

క్షిప్రం హి మానుషే లోకే
సిద్ధి ర్భవతి కర్మజా॥ (భగవద్గీత 4-12)

భౌతికఫలములే ఆశయములైనచో ఉద్యమము వలన నవి అతిత్వరలో సిద్ధించును.

భౌతికస్థాయియందు అద్వైతభావన స్థిరపడిన పిదప మానసికస్థాయియందు అద్వైతభావన చేసినచో: ఎల్లయెడలను గల బ్రహ్మము తనయం దున్నాడు. తనయందున్న బ్రహ్మమే ఇతరులయందును కలదు అను విశ్వాసము స్థిరపడవలెను. నిరంతరము సకల జీవులయందు బ్రహ్మమునే దర్శింప ప్రయత్నించుటచేత ఏ ప్రాణికిని అతనివలన నపకారము కలుగదు. అతనిచే మోసపోవదు. సరికదా అన్ని ప్రాణులును అతనివలన సుఖమునే పొందును. సాటి మానవుడు కష్టపడుచుండినచో వ్యాధిగ్రస్తుడైనచో మనోవ్యథల పాలైనచో అద్వైతసాధకుడు, అతనియందుగల బ్రహ్మమే తనయందును గలదని భావించువాడు, అతని కష్టనష్టములను ఆధి వ్యాధులను మనోవ్యథలను తనవివలెనే భావించి వానిని తొలగించుటకు కాయకష్టముల ప్రయత్నించును.

తన జీవితమున జ్ఞానస్వరూపమగు బ్రహ్మమునే అభ్యసించుటచేత పరిశుద్ధజీవనమును నిష్కలంకజీవనమును నైతికజీవనమును వెలయించును. జనులు అపనీతిపాలైనచో నింద్యజీవితములను గడపుచో అది అజ్ఞానమువలననే అని యతనికి తెలియును. జ్ఞానస్వరూపమగు బ్రహ్మమైన తానట్టి నింద్యకర్మల నాచరించు టెట్లు సాధ్యము ? కనుక మానసికమగు అద్వైతభావనను నిశ్వసించిన మానవుడు నిరంతరము ప్రతిక్షణమునందును యుక్తాయుక్తములను గ్రంథాధ్యయనాదులచేత తెలిసికొనుచు వానినిగూర్చి పర్యాలోచించుచు యుక్తముల నాచరించుచు అయుక్తములను పరిహరించుచు ఎల్లెడల బ్రహ్మమునే భావించుచుండును. దీనివలన నతడు తన జీవితమున ఆత్మసంయమమును అందఱి జీవితములందును ఆనందమును సాధింపగలుగును.

సమం పశ్యన్హి సర్వత్ర
సమవస్థిత మీశ్వరమ్
నహినస్త్యాత్మ నాత్మానమ్
తతోయాతి పరాంగతిమ్॥ (భ.గీ 13-28)

ఎల్లెడలను గల ఈశ్వరుని దర్శించుచు అతడు ఆత్మను ఆత్మచే బాధింపడు.

ఇట్లు నిరంతరము కార్యశీలుడై తన సుఖమును ఇతరుల సుఖములను సాధించుకొనుచు దుఃఖముల వారించుకొనుచు జీవించుటయే లౌకికాభ్యుదయము. అదియే భౌతిక మానసిక భూమికలందు అద్వైతసాధన.

భౌతికస్థాయియందు అద్వైతభావనచే ఉద్యమశీలము, మానసికస్థాయియందు అద్వైతభావనచే యుక్తాయుక్తవివేకము ఆత్మసంయమము స్థిరపడినమీదటనే ఆధ్యాత్మికాద్వైతమున కధికారము కలుగును. సైకిలుత్రొక్కుట

బాగుగా నేర్చినవాడు ఎంత గాఢాలోచనలో మునిగియున్నను అప్రయత్నముగ నెట్లు సైకిలు నడుపుచుండునో, బాగుగా ఈత నేర్చినవాడు గాఢనిద్రలో నుండగా నీటబడినను అప్రయత్నముగ నెట్లు ఈదులాడుట మొదలిడునో అట్లే భౌతికస్థాయియందును ఉన్నత శీలము, మానసికస్థాయియందు సర్వత్ర బ్రహ్మదర్శన ప్రయత్నమును ఎవనికి అప్రయత్నముగ స్థిరపడునో, అతడే ఆధ్యాత్మికాద్వైతమున కర్హుడు. అతడే మనఃపూర్వకముగ జగత్తు మిథ్య బ్రహ్మము సత్యము అనగలడు. అట్లు దర్శింపగలడు. అతడే సుఖదుఃఖముల భేదమును గమనింపజాలడు. మానావమానముల విభజింపలేడు. జగత్తునకు బ్రహ్మమునకు భిన్నత్వమతనికి మాయమగును. అట్టివాడే అధ్యాత్మనిత్యుడై అవ్యయమగు పదమును పొందగలడు.

నిర్మానమోహా జితసంగదోషాః
అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః
ద్వంద్వైర్విముక్తాః సుఖదుఃఖసంజ్ఞైః
గచ్ఛన్త్యమూఢాః పదమవ్యయం తత్.

# మాతృదేవియొక్క అంతిమ సందేశము

## శ్రీ దయాత్మానందస్వామి

“అమ్మా నీకొక సంగతి చెప్పెదను. మనశ్శాంతిని కోరెదవా పరుల దోషముల నెన్నకుము సుకదా, నీ దోషములను నీవు గుర్తింపుము. సమస్త ప్రపంచమును నీది గావించుకొన నేర్చుకొనుము. అమ్మా, లోకమున నీకెవ్వరును పరులు కారు, సమస్త విశ్వము నీదే” అదియే లోకమునకు మాతృదేవి యొసగిన తుది సందేశము, పరమ సందేశము.

మాతృదేవిజీవిత మీ పరమోపదేశము యొక్క మూర్తీభావము. గంభీరార్థగర్భితములైన ఈ పలుకులయందు మాతృదేవియొక్క పవిత్ర జీవనరహస్య మిమిడియున్నది. తాపత్రయతప్తులై, స్వార్థమే పరమార్థముగ భావించుచు దారితెన్నుగానక అశాంతి సాగరమున మునిగి తేలుచున్న మానవకోటికీ సందేశ మెంతయు నేడు ఆవశ్యకమైయున్నది.

మొదట తామాచరించి తరువాత పరులకు నేర్పుదురు గదా మహాత్ములు! మాతృదేవియొక్క జీవితమును పరికించిన తన సందేశము నామె ప్రతిపదమున నెట్లు పాలించెనో స్పష్టము కాగలదు. పరుల దోషముల నెన్నుట కామె యేనాడును పాల్పడలేదు. సరికదా అట్లు చేయుట ఆమె స్వభావమునకే విరుద్ధము. జన్మమునుండియే మహావిరక్తుల స్వభావమైన మాతృదేవి పరుల సుగుణములనే బిందువునందు సింధువుగా చూచుచుండెడిది. భగవన్మాతృత్వమును లోకమునకు చాటుటయే తన జీవితోద్దేశమనియు, గురుదేవు లిందులకే తన నీ ప్రపంచమున నుంచి పోయిరనియు మాతృదేవి యొకప్పుడు పల్కియుండెను.

రూపుదాల్చిన మాతృభావమైన మాతృదేవికి, జగత్తంతయు తన సంతానముగ భావించెడి మాతృమూర్తికి, ఇక తనవారెవరు!

పెఱవారెవరు? గుణములేమి, దోషములేమి! జగత్తంతయు ఆమెదే కదా! పరులే లేనప్పుడు ఇక పరదోష దర్శనమెట్లు పొసగును? నిజముగా విశుద్ధ మాతృప్రేమాభిషిక్తుల నొనర్చి సమస్త ప్రపంచమును తనదిగ చేసికొనెను గదా మాతృదేవి శ్రీ శారదాదేవి!

## శాంతి ఆనందములే సమస్తజీవుల లక్ష్యము

'ఆనందమునుండియే సమస్తజీవు లుద్భవించుచున్నవి. ఆనందముచేతనే జీవించుచున్నవి. తిరిగి ప్రళయకాలమున ఆనందము నందే లయము నొందుచున్నవి' (తైత్తిరీయ ఉపనిషత్). ఆనందస్వరూపములైన ప్రాణికోటులు అజ్ఞానముచే తమ స్వరూపమును మఱచి పోయినవి. ఐనను చిరకాలము సుఖశాంతులతో జీవింపవలయుననెడి కోరిక మాత్రము కలిగియున్నవి. శాంత్యానందముల కొఱకే ఎల్లెడల వెదకుచున్నవి. కాని తప్పుదారుల నవలంబించుటచేత శాంత్యానందముల నొందజాలకున్నవి. స్వరూప జ్ఞానమును పొందిన తత్క్షణమే వాని ప్రయత్నములు సఫలములగును.

## ఆత్మసాక్షాత్కారమే శాంత్యానందములకు పాయము

'తమేవ విదిత్వా అతిమృత్యుమేతి నాన్యః పంథా విద్యతేఽయనాయ' ఆత్మ లేక భగవత్సాక్షాత్కారమే జన్మమృత్యు జరాదుఃఖముల నతిక్రమించు పరమోపాయము, వేఱొక మార్గము లేదని శాస్త్రములు ఘోషించుచున్నవి. ఈ ఆత్మయే బ్రహ్మమని, భగవంతుడని పరమాత్మయని వివిధనామములం బేర్కొనబడుచున్నది. 'నేతి, నేతి' యను మార్గము ననుసరించి జ్ఞానులు, పూజాశ్రవణకీర్తనాది మార్గమున భక్తులు, చిత్తనిరోధమువలన యోగులు అనాసక్తులై ఈశ్వరార్పణ బుద్ధితో సమస్తకర్మల నొనర్చుచూ కర్మయోగులు ఈ ఆత్మనే పొందుచున్నారు. మార్గములు భిన్నములైనను గమ్యము మాత్రము ఒకటే. సత్యద్రష్టలీ సత్యమునే గ్రహించి 'ఏకం సత్ విప్రా బహుధా వదన్తి' యని నుడికిరి.

## భిన్నత్వమునం దేకత్వదర్శనము

'ఈశావాస్యమిదగ్ం సర్వం యత్కించ జగత్యాం జగత్' (ఈశావాస్యోపనిషత్) ఈ జగత్తునందలి సమస్తము ఈశ్వరునిచేత ఆవరింపబడియున్నది. అజ్ఞానులకీ జగత్తు వేఱువేఱుగ అనేకవస్తుజాలముగ పరస్పర భిన్నముగ కన్పించుచున్నను, నిజమున కిది యంతయు ఈశ్వరుని రూపముతప్ప వేఱొకటి కాదు. అజ్ఞానముచే భిన్నముగ కన్పించెడి ఈ ప్రపంచమే ఆ అజ్ఞాననిర్మూలన మైనంతనే ఆత్మస్వరూపముగ కన్పించును. మానవుల యొక్క ఈ పృథక్‌దర్శనమే (భేదదర్శనమే) సమస్తములగు అనర్థములకు మూలకారణము 'మృత్యోః స మృత్యుం గచ్ఛతి య ఇహ నానేవ పశ్యతి'— భిన్నత్వద్రష్ట జన్మమృత్యురూపమగు చక్రమునబడి మరిమరి తిరుగాడుచుండును (కఠోపనిషత్). ఈ సంసారజాలమునుండి బయల్వెడలు మార్గమేమి? భిన్నత్వమునందు ఏకత్వమును చూచుట, సమస్తవిశ్వమున భగవంతుని దర్శించుట. ఈ ఏకత్వదర్శనముకొఱకే సాధకులు తమతమ మనస్తత్వానుగుణముగ విభిన్న దృక్పథముల ననుసరించి విభిన్న సాధనమార్గముల నాశ్రయించుచున్నారు. ఇట్లు తమ సాధనల ద్వారా గమ్యము చేరి సమస్తమునకు మూలకారణమగు ఆత్మదర్శనమొంది శోకమోహాదుఃఖా

దులతో నిండియున్న సంసారమునుండి విముక్తులగుచున్నారు. 'యస్మిన్ సర్వాణి భూతాన్యాత్మైవాభూత్ విజానతః। తత్ర కో మోహః కః శోకః ఏకత్వమనుపశ్యతః॥' (ఈశావాస్యోపనిషత్) సర్వభూతములందు ఆత్మను దర్శించువానికి శోకమోహాలు ఎక్కడ? లేనేలేవు అని స్పష్టమగుచున్నది.

## సంఘము: మాతృదేవియొక్క సందేశము

వేదాంత ప్రతిపాదితమైన ఈయాత్మతత్త్వమునే మాతృదేవి తన సహోదరభావములో నుపదేశించుచున్నది. మాతృదేవియొక్క ఈ ఉపదేశమును ఆచరణయందు పెట్టినచో ఈనాటి దోషములెన్నియో నశింపగలవు. మానవ సమాజమునందు సౌభ్రాతృత్వము వృద్ధి నొందును. స్వార్థపరత నశించును. పరస్పరము ప్రేమానురాగములు వర్ధిల్లును. ఇక పారమార్థికచింతయే పోసగని ఈనాటి ప్రజలకు మాతృదేవి యుపదేశ మెట్లుపకరించునో చూతము.

మానవుడు సంఘజీవి. ఐకమత్యమే సంఘము యొక్క బలము, శక్తి. సర్వవిధముల ఉన్నతికి ఏకైకమార్గము. పరస్పరప్రేమ సహానుభూతులే ఐకమత్యమునకు మూలభిత్తులైనచో పరచ్ఛిద్రాన్వేషణమే ఐకమత్యమునకు వేరు పురుగు. పరచ్ఛిద్రాన్వేషణముచేయు హృదయము విద్వేష ఘృణాపూరిత మగును. అట్టి హృదయమునందు ప్రేమ సహానుభూతులకు తావుండదు. ప్రేమ సహానుభూతులు లేని సంఘమునందు ఐకమత్యము ఘటింపదు. ఐకమత్యములేని సంఘమునుండి శాంతి ఆనందములు పలాయనమగును. ఉన్నతిమార్గమునకు ఆటంకము కల్గును. మఱియు దోషములు లేని మానవులరుదు. తప్పుచేయుట మానవులకు సహజము, కనుక ఇతరులలో ఐకమత్యము కలిగియుండవలెనన్న వారి దోషములను పాటింపక చేతనైనంతవఱకు వారికి సహాయము చేయుచుండవలయును. సంఘవిద్వేషవిచ్ఛిన్నతలకీ పరదోష దర్శనము మూలకారణము. రాజాధిరాజులు సైతమీ 'పరదోషదర్శనము' నుండి తప్పించుకొనినవారు కారు. 'రాజన్, సర్షపమాత్రాణి పరచ్ఛిద్రాణి పశ్యసి। ఆత్మనః బిల్వమాత్రాణి పశ్యన్నపి న పశ్యసి'— రాజా ఆవగింజలవంటి చిన్నదోషములను ఇతరుల యందు చూచుచుంటివిగాని బిల్వఫలముల వంటి నీ దోషములను మాత్రము చూచియు చూడకుంటివే అని విదురుడు ధృతరాష్ట్రునకు బుద్ధిచెప్పెను. ఏసుక్రీస్తు, 'విమర్శింపకుడు, మీరును విమర్శింపబడరు, మీరు కొలుచు కొలతతోనే మీకును కొలువబడును. నీ కంటిలో నున్న దూలము నెంచక నీ సోదరుని చూచి - నీ కంటిలో నలుసును తీసివేయ నిమ్మని చెప్పనేల? వంచకుడా మొదట నీ కంటిలోని దూలమును తీసివేయుము. అప్పుడు నీసోదరుని కంటినలుసును తీసివేయుటకు నీకు చక్కగా కనిపించునని బోధించెను. (మత్తయి 7 : 1, 2), పరుల దోషములను చక్కదిద్దుటలో అందఱును ఆరితేరినవారుకదా!

## పరదోష దర్శనమే ఒక మహాదోషము

విమర్శించి చూచినచో పరదోషదర్శనము కంటె వేఱొక మహాదోషము కన్పింపదు. దీనికి కారణముల నరయుదము.

(1) పరదోషదర్శన మొక మనోవ్యాధి. తన దోషములు తననే కలతపెట్టి అశాంతి నొందింప ఆ అశాంతి నణచుటకై ఆ దోషములనే పరులయం దారోపించి వారిని దూషించుట కల్గును. దీనికే పాశ్చాత్యమనస్తత్త్వ

వేత్తలు ప్రసారణమని (projection) పేర్కొని. తప్పు లెన్నువారు తమ తప్పు లెరుగరను సామెత ఎంత సత్యమో కదా!

(2) పరదోషదర్శనము తనకు సంతృప్తిని కలిగించి గర్వముదయజేసి ఇతరులను తేలికగా అవమానపూర్వకముగ చూచు దృష్టిని పెంచును.

(3) పరదోషదర్శనమొక వేళ మంచి యుద్దేశముతో చేసినను అది వ్యర్థమై తీరును. ఏలన, తమ దోషముల నంగీకరించు వ్యక్తు లరుదు. అంగీకరించినను ఇతరులు ఆ దోషముల నెత్తి చూపుటను సహించువారు ఇంకను అరుదు. ఆ మీద పరదోషవిమర్శనము మహోపద్రవకరమైనది. అది వారి యహంకారమున కాఘాత మొసర్చి వారిని శత్రువుల జేయును. దొంగతనము దోపిడి నరహత్యలు చేసి కారాగారస్థులైన నేరస్థులు సైతము తామట్లు చేయుటకు న్యాయమైన కారణములు కలవనియు తమ్ము జైలునం దుంచుట అన్యాయమనియు భావించునపుడు ఇక సామాన్యుల సంగతి చెప్పనేల?

(4) ఇతరులయందుగల దోషములు ఒకవేళ తనలో లేకపోయినను ఆ దోషములను భావించుటచేత క్రమముగ నవి తనయందు వచ్చి చేరును.

(5) పరదోషదర్శనము సహజముగ ఇతరులను తననుండి విడదీయును, శత్రువుల నొనర్చును. భేదమును కల్గించును. అపుడు వారితో కలిసి మెలిసి యుండుట యసంభవము. అట్టివారిపై స్నేహసానుభూతులు నశింప విద్వేషఘృణాదులుదయించును. విద్వేషఘృణాపూరిత హృదయము లశాంతికి నిలయములు. శాంతిలేని తావు నరకతుల్యము. అశాంతస్య కుతః సుఖమ్?

పరదోషదర్శన మిట్లు మహానర్థకములకు దారితీయును. కనుక పారమార్థిక సాధకుల మాట యటుండ సంఘమున సుఖశాంతుల పురోగమనమునకు సైతము పరదోషదర్శనము తగదు.

## తన్నివారణోపాయము

ఈ పరదోషదర్శన మను మహాదోషమును నివారించు ఉపాయ మొకటి కలదు. పరుల యందు గల సుగుణములను గోరంతలు కొండంతలుగ పదేపదే చూచుట. దీనికే పతంజలి మహర్షి 'ప్రతిపక్ష భావన'మని పేరిడెను. ఇట్లు పరుల సుగుణములను చూచుటవలన పరదోషదర్శనమువలన కల్గెడు దోషములు నశించుటే గాక వారియందు గల సుగుణములుకూడ ద్రష్టయందు వచ్చి చేరును. మనస్సు అపుడు ఇతరులను గౌరవాదరములతో స్నేహముతో పరికించును, అట్టి మనస్సు ప్రేమ శాంతిసుఖములతో నిండిపోవును. పరుల సుగుణములను దర్శించెడివారికి శత్రువులు కూడ మిత్రులై హితకాంక్షులుగ మారిపోవుదురు.

తరువాత తన దృష్టిని తన లోపలికి త్రిప్పి తన లోపదోషములను కనుగొని వానిని సరిదిద్దుకొనవలెను. ఇదియే సచ్చరిత్ర సచ్ఛీలతలను గడించుట కమోఘోపాయము.

మాతృదేవియొక్క ఈ ఉపదేశము ఇట్లు సాధకులకే గాక సామాన్యులకు సైతము ఎంతయో తోడ్పడును.

## మాతృదేవి జీవితమునుండి కొన్ని సంఘటనలు

ఇక ఈ సందేశము మాతృదేవియొక్క జీవితమునందు స్వాభావికమై ఎట్లలరారెనో ఈ క్రింది సంఘటనల వలన విశదము కాగలదు.

ఒకప్పుడు శ్రీరామకృష్ణుని సాక్షాత్ శిష్యులలో నొకరు ఒకానొక భక్తునిపై కోపించి అత

నిని దగ్గరకు రానీయవలదని మాతృదేవిని ప్రార్థించెను. అంత మాతృదేవి 'అదెట్లు? అతడుకూడ నా బిడ్డడే కదా, ఎవరియందెన్ని దోషము లుండినను అమ్మయని నన్ను పిలుచు వా రెంత పాపులైనను వారిని దగ్గరకు రానీయకుండుట నా కసంభవ'మని పల్కెను. మఱొకప్పుడు శిష్యుఁడొకడు నష్టచరిత్రుడైన కారణమున అతని ఆమె సన్నిధికి రానీయ వలదని కొందఱామెను కోరగా మాతృదేవి ఇట్లు తెల్పెను. 'నా బిడ్డ ధూళిలో పొరలాడుచుండిన పక్షమున వానిని శుద్ధి మొనర్చి యెత్తుకొనుట నా ధర్మము కదా?'

వేఱొకప్పుడు నూతన వస్త్రములను కొని తెమ్మని అమ్మ తన బ్రహ్మచారి సేవకు నొకని పంపించెను. ఆ దినములలో విదేశవస్త్ర నిరాకరణోద్యమము సాగుచుండెను. ఆ కారణమున బ్రహ్మచారికూడ చక్కని అంచులు గల్గి అందముగ నుండుచు చౌకగా లభించు విదేశీయ వస్త్రములను కొని రాక స్వదేశీయ ముతకవస్త్రములను కొని తెచ్చెను. ఈ వస్త్రములు ఆమె బంధువులకు నచ్చలేదు. ఆ వస్త్రములకు బదులు విదేశీయవస్త్రములను తెమ్మని మాతృదేవి చెప్ప నతడు అభ్యంతరపెట్టెను. అంత 'నాయనా! వారుకూడ నా బిడ్డలే సుమీ! నేనందఱను సమానముగ చూడవలెను కదా. పక్షపాతము చూపుట నాకు తగునా?' యని యమ్మ యనెను.

మఱియొకప్పుడు 'అంజద్' అను మహమ్మదీయ దోపిడిగానిని గూర్చి 'శరత్ (శ్రీశారదానందస్వామి నుద్దేశించి) ఎట్లో అట్లే ఈ 'అంజద్' కూడ నా బిడ్డడే' యని వచించెను. సర్వసంగపరిత్యాగియైన శారదానందస్వామిని బందిపోటును సమదృష్టితో జూచుట మాతృదేవికే సంభవము.

మాతృదేవి తన సన్న్యాసిశిష్యులను సన్న్యాసనామములతో గాక పూర్వనామములతో పిలుచుచుండెడిది. కారణమడుగ, 'నేను తల్లినై యుండి వారి నెట్లు సన్న్యాసి నామములతో పిలువగలను? అది నాకు బాధ కలిగించు'నని అమ్మ బదులాడెను. సన్న్యాసమన సర్వసంగపరిత్యాగము, తల్లిదండ్రుల యొక్కయు పరిత్యాగము. మాతృహృదయము కలలోనైన ఈ భావమును ఓర్వజాలకుండెడిది. దీనిని గమనించిన విశ్వేశ్వరానందుడను శిష్యుడు ఒకనాడు 'అమ్మా మీరు మమ్ములను ఏ భావముతో చూతు'రని ప్రశ్నించెను. 'నారాయణులు'గ నని అమ్మ పల్కెను. అంత అతడు 'మేము మీ బిడ్డలము. మీరు మమ్ము నారాయణులుగ చూచిన ఇక మీ బిడ్డలుగ తలంపజాలరు గదా' యని యడిగెను. ఆమెయు 'నేను మిమ్ము నారాయణులుగ బిడ్డలుగ సైతము చూచుచుందు'నని సమాధానించెను. దీనిచే పరమేశ్వరునికూడ సంతానభావముచే చూడగల్గు మాతృహృదయ మెంత విశాలమో ఒకింత ఊహింప నగును.

ఇట్లు దేశకులజాతి భేదములను పాటింపక అందఱియందు నారాయణుని గాంచుచూ అందఱను సమాన ప్రేమాదరములతో సేవించిన మాతృదేవి జీవితము సర్వులకు నాదర్శము. విద్వేషము ఈర్ష్య అసూయ హింసలతో నిండి అశాంతిదుఃఖసంతప్తమైన ఈనాటి మానవాళికి ఆమెయొక్క అంతిమోపదేశము పరమోపదేశము ఎంతయు గుణబోధకమై యొప్పుచున్నది.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

# వీరులు - వీరపూజ

శిష్టా రామకృష్ణశాస్త్రి

గతసంచిక తరువాయి

ఆహార నిద్రాభయమైథునములు మానవులకు పశువులకుగూడ సమానమే. కాని మానవులను పశువులనుండి వేఱుపరచునది విజ్ఞానము మాత్రమే. ఆహారాదులకు మాత్రమే ప్రాముఖ్యమిచ్చువారు చార్వాకులు. ఋణం కృత్వా ఘృతం పిబేత్ అని వారి యాదర్శము. లోకమున నూటికి తొంబదితొమ్మిదిమంది మానవులు తెల్లవారగనే ప్రతిదినము దాని కొఱకు దేవులాడువారే. వారు పశుతుల్యులు. కాని జ్ఞానహీనులగు వారు అజ్ఞానాంధకారమున నోలలాడుచు సంసారసాగర నిమగ్నులై దుఃఖముల పాలగుదురు. ఈ సంసార దుఃఖసముద్రమునుండి తరింపజేయగలవారు విజ్ఞానవంతులైన అధ్యాత్మజ్ఞానవిదులగు వీరులు మాత్రమే. ప్రతిదేశమునందును ప్రతి జాతియందును తదవసరమునుబట్టి అప్పుడప్పుడు భక్తులుగాని జ్ఞానులుగాని యుద్భవించి పామరులకు తత్త్వప్రబోధముచేసి వారి యజ్ఞానాంధకారమును బాపి వారిలో విజ్ఞాన భాస్కరు నుదయింపజేయుదురు. ఇట్టివారు మలయాళదేశమున నాదిశంకరగురుపాదులు తమిళదేశమున రామానుజాచార్యులవారు కన్నడదేశమున మధ్వాచార్యులు వంగదేశమున శ్రీచైతన్యులు మహారాష్ట్రమున తుకారాం బువా పంజాబునందు గురునానక్ మొదలైనవారు. తత్త్వజ్ఞాను లిట్లుద్భవించి జనుల నజ్ఞానమునుండి తరింపజేయనిచో లోక మజ్ఞానాంధకారమున మునిగి దిక్కుతెలియక పాపకూపమునబడి దుఃఖవివశమై కూలును. అందువలన లోకకల్యాణార్థమే జ్ఞాను లుదయించుట. గురుకటాక్షములేనిదే మోక్షము కలుగదు. ఇది సిద్ధము.

క్రీస్తుశకము 19-వ శతాబ్ది మధ్యకాలమున భారతదేశము రాజకీయముగను మతవిషయముగనుకూడ మిక్కిలి క్లిష్టపరిస్థితిలో చిక్కుకొనెను. ఈ దేశమున నాంగ్లేయ ప్రభుత్వము స్థిరపడి స్వదేశసంస్థానములను క్రమక్రమముగా న్యాయాన్యాయ విచారణలేకుండ నాక్రమించి స్వదేశీయులపై నక్రమపరిపాలన మొనర్చుచుండిరి. ఆంగ్లవిద్యావ్యాప్తిచే తత్ప్రభావమున జనులకు సనాతన హిందూమత తత్త్వముపై శ్రద్ధతగ్గి పాశ్చాత్య తత్త్వశాస్త్రమునం దధికాదరమేర్పడి, యొకవైపున క్రైస్తవమతమును మరియొకచెంత యోగమును భోగముతో సమకూర్చనెంచిన బ్రాహ్మసమాజమతమును మొలకెత్తి యాధ్యాత్మభావనిరతులను కలవరపెట్టసాగెను. భారతదేశ పశ్చిమదిశనుండి రాజకీయ వీరుడొక డుద్భవించి రాజకీయ సమస్యను పరిష్కరింపగా ప్రాగ్దిశనుండి యాధ్యాత్మిక వీరుడు మరియొక డుద్భవించి మతవిషయములను చక్కపెట్టెను.

గుజరాతు మండలమునుండి కారణజన్ముడైన గాంధిమహాత్ముడు వైశ్యకులమున పుట్టి మహారాష్ట్రవీరులగు గోఖ్లేతిలకుల సహకారమున సత్యాగ్రహదీక్ష నవలంబించి స్వార్థత్యాగముతో పలుమార్లు శ్రీకృష్ణజన్మస్థానమునకు బోయి భారతదేశము నాంగ్లేయుల నుండి విముక్తమొనర్చెను. ఇక వంగదేశము నుండి భగవదంశమున నొక సద్బ్రాహ్మణ వంశమున శ్రీరామకృష్ణు డవతారమొంది దక్షిణేశ్వరమున కాళికాలయమున నర్చకుడుగా నియమితుడై తన యనన్య భక్తి ప్రభావమున జగన్మాతయగు కాళికాదేవిని

మెప్పించి యపరోక్షానుభూతితో నామె సాక్షాత్కారమును బడసి యామె కరుణాకటాక్షమున సకలవేదాంతసార రహస్యములను గ్రహించి కామినీకాంచనములపై విరాగమొంది జితేంద్రియుడై వేదాంతబోధ చేసి జనులకు విషయములపై మోజుతగ్గించి సనాతన హిందూమతముపై స్థిరవిశ్వాసము గల్గించి యనేక సాధనల పూర్వకముగ ప్రబోధము గల్గించి తానుతరించి తన భక్తశిష్యకోటిని తరింపజేసి ధన్యజీవి యయ్యెను. శ్రీరామకృష్ణ పరమహంస శంకరాచార్యులవారివలె వేదాంత గ్రంథములగు ప్రస్థానత్రయ మనబడు బ్రహ్మ సూత్రములు ఉపనిషత్తులు భగవద్గీతలను అధ్యయనము చేసినట్లు కనబడదు. మధ్వ రామానుజులవలె పరమత ఖండన పూర్వకముగ స్వమతమును వ్యాఖ్యానించినవాడు కాడు. భక్తిసంబంధములైన కీర్తనలను మాత్రము వంగభాషలో బహుశ్రావ్యముగ పాడి ఇతరుల పరవశులం జేసెడివాడు. అయినను ఈయన అద్వైత జ్ఞానశూన్యుడైన మూఢభక్తుడు కాడు. ఈయన కద్వైతమత రహస్యము లన్నియు కరతలామలకములు, సకలమత రహస్యము లీయనకు భవతారిణీదేవి కరుణా కటాక్ష మాత్రలబ్ధములే కాని అధ్యయనము వలన సంప్రాప్తమైనవి కావు. అది సాధ్యమా యనినచో భగవద్గీతలో శ్రీకృష్ణభగవానుడు భక్తులకు బుద్ధియోగమునిచ్చి జ్ఞానము కలుగ చేయుదునని ఇట్లు తెల్పినాడు.

శ్లో॥ తేషాం సతతయుక్తానాం,
భజతాం ప్రీతిపూర్వకమ్।
దదామి బుద్ధియోగం తం,
యేన మాముపయాన్తి తే॥ (గీత. X10-)

శ్లో॥ తేషామేవానుకం పార్థం,
అహమజ్ఞానజం తమః।
నాశయామ్యాత్మ భావస్థో,
జ్ఞానదీపేన భాస్వతా (గీత. X-11)

కాన కాళికాదేవి దివ్యప్రసాదమున నీయన సకల వేదాంతరహస్యములను గ్రహించెననుట కొంతమాత్రమును సందేహింప నక్కఱలేదు. అముక్తమాల్యదలో విష్ణుభక్తుడైన విష్ణుచిత్తుడు శ్రీరంగశాయి కరుణాకటాక్షమున మధురకు బోయి శాస్త్రపండితులైన పరమతస్థుల నందఱిని వాదమున జయింపలేదా? అట్లే శ్రీ రామకృష్ణపరమహంస కూడ. అందుకనియే వివిధ మతాచార్యులతో సంభాషించునపుడు శ్రీ రామకృష్ణుడు వారి నందఱను సంతృప్తిపరచి సంతోష పెట్టగల్గెను. కాని ఈయన వేదాంతజ్ఞానము పరులతో వాక్యార్థములు వాదప్రతివాదములు సలుపుట కుపయోగించెడిది కాదు ఆచరణమాత్ర ప్రయోజనము గలది. పరమేశ్వర కటాక్షమున పొందరాని దేమున్నది?

భగవద్గీతలో భక్తుల లక్షణము లిట్లు తెల్పబడెను.

శ్లో॥ అద్వేష్టా సర్వభూతానాం,
మైత్రః కరుణ ఏవ చ।
నిర్మమో నిరహంకారః,
సమదుఃఖ సుఖః క్షమీ॥

శ్లో॥ సంతుష్ట స్సతతం యోగీ,
యతాత్మా దృఢనిశ్చయః।
మయ్యర్పిత మనోబుద్ధిః,
యోమద్భక్త స్సమే ప్రియః॥

శ్లో॥ యస్మాన్నోద్విజతే లోకో,
లోకాన్నోద్విజతే చయః॥

హర్షామర్ష భయోద్వేగైః,
ముక్తో యస్సచ మే ప్రియః॥

శ్లో॥ అనపేక్షశ్శుచిర్దక్షః,
ఉదాసీనో గతవ్యథః
సర్వారంభ పరిత్యాగీ,
యోమద్భక్త స్సమే ప్రియః॥

శ్లో॥ యో న హృష్యతి న ద్వేష్టి,
న శోచతి న కాంక్షతి
శుభాశుభ పరిత్యాగీ,
భక్తిమాన్య స్సమే ప్రియః॥

శ్లో॥ సమశ్శత్రౌచ మిత్రేచ.
తథా మానావమానయోః।
శీతోష్ణ సుఖదుఃఖేషు,
సమస్సంగ వివర్జితః॥

శ్లో॥ తుల్యనిందాస్తుతిర్మౌనీ,
సంతుష్టో యేన కేనచిత్।
అనికేతః స్థిరమతిః,
భక్తిమాన్మే ప్రియోనరః॥(గీత XII 13-19)

పై భక్తలక్షణముల కెల్లను లక్ష్యభూతుడైనవాడు శ్రీ రామకృష్ణుడు—ఇక జ్ఞానలక్షణములు గీతలో నిట్లు తెలుపబడినవి.

శ్లో॥ అమానిత్వ మదంభిత్వం,
అహింసా క్షాంతిరార్జవం।
ఆచార్యోపాసనం శౌచం,
స్థైర్యమాత్మ వినిగ్రహః॥

శ్లో॥ ఇంద్రియార్థేషు వైరాగ్యం,
అనహంకార ఏవ చ।
జన్మమృత్యు జరావ్యాధి,
దుఃఖదోషాను దర్శనం॥

శ్లో॥ అసక్తి రనభిష్వంగః,
పుత్రదార గృహాదిషు।
నిత్యం చ సమచిత్తత్వం,
ఇష్టానిష్టోప పత్తిషు॥

శ్లో॥ మయిచానన్య యోగేన,
భక్తిరవ్యభిచారిణీ।
వివిక్తదేశ సేవిత్వం,
అరతిర్జన సంసది॥

శ్లో॥ అధ్యాత్మ జ్ఞాననిత్యత్వం,
తత్త్వజ్ఞానార్థ దర్శనం।
ఏతత్ జ్ఞానమితి ప్రోక్తం,
అజ్ఞానం యదతోఽన్యథా॥
(గీత. XIII 7-11)

పై జ్ఞాన లక్షణములన్నియు శ్రీరామకృష్ణుని జీవితములో గోచరించినవి కాన ఆయన మహాజ్ఞానియని స్పష్టమగుచున్నది.

(1) ఈయన జితేంద్రియత్వము కామవిముఖతయు విస్మయము గొల్పును. భార్యతో నివాసము చేయుచుండియు, కామవిరహితుడై యామెనుకూడ జగజ్జనని కాళికాదేవిని వలెనే మాతృసమానముగ చూడగలుగుట మానవమాత్రునకు సాధ్యమగునది కాదు. శ్రీశంకరాచార్యులవారు బ్రహ్మచారి యగుట నిష్కాముడై జితేంద్రియు డయ్యెను. భక్తుడైన త్యాగరాజులవారు వివాహితుడై సంతానమును బడసెను. కాన నీ విషయమున శ్రీరామకృష్ణుడు వారిద్దరకంటె నధికుడనవలెనేమో. కాని ఈయన భార్యయందు గౌరవాభిమానములుగలిగి యామెకుం గావలసిన నగలు మొదలైన వన్నియు నిచ్చుచునే యుండెను. కాళికాదేవి ప్రసాదము చేతనే యాతడు భార్యను మాతగ చూడగల్గెను. భార్యయు నాయనకు సర్వవిధముల తగినట్లు ప్రవర్తించెను.

(2) త్యాగరాజులవారికివలెనే శ్రీరామకృష్ణునకుఁగూడ నొక భగవత్ప్రీతి వచ్చెను. ఆయన శిష్యుఁడొకఁ డాయన జీవితపు ఖర్చులకుగాను పదివేలరూపాయ లీయఁబూనెను. కాని యాయన యంగీకరింపక తిరస్కరించి, వానిని స్పృశింపనైన లేదు. అంత నా భక్తుఁడాయన భార్యకీయబోగా ఆమెయు తిరస్కరించెను. ఈవిధముగ శ్రీరామకృష్ణుఁడు కామినీకాంచనములకు విముఖుఁడయ్యెను. ఔను, భగవద్గీతలో శ్రీకృష్ణభగవానుఁడు,

శ్లో॥ అనన్యాశ్చింతయంతో మాం
యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం
యోగక్షేమం వహామ్యహమ్॥
(గీ. XI-22)

అని కదా యానతిచ్చెను! శ్రీరామకృష్ణుని వంటి భక్తున కేమి కొదువ?

(3) ఈయన యహింసాతత్త్వము వివేకశూన్యమైనది కాదు. ఒకమారు శ్రీరామకృష్ణుని భక్తుఁడొకఁడు వచ్చి దోమలబాధచే తాను ధ్యానము చేసికొనలేకుంటినని తెల్పగా, ఆయన తన దిండులోనున్న నల్లులను జూపి వానిని జంపి యట్లే దోమలబాధ తొలగించుకొనుమని బోధించెను.

(4) ఈయనకు దరిద్రులను చూచినపుడు హృదయము కరిగిపోవును—తన పోషకుఁడైన మధురునితోఁగూడ కాశీయాత్రకు పోవుచు మార్గమధ్యమున దేవఘర్ అను పుణ్యక్షేత్రమున క్షుత్పీడితులైన నిరుపేదలనుగాంచి ఖిన్నులై వారల కన్నసంతర్పణము చేసి వస్త్రదానము చేసినగాని కాశికి రానని పట్టుపట్టి మధురునిచే కలకత్తానుండి వస్త్రములను దెప్పించి వారికొసగి యన్నసంతర్పణ చేయించెను. ఇంకొకమారు మధురుఁడు శ్రీరామకృష్ణునితో తన జమీందారీయందు పర్యటించుచుండ నిట్టి సంఘటనయే జరిగెను.

(5) శ్రీరామకృష్ణుఁడు సర్వమతములకు సమన్వయముఁ గూర్చి విశ్వైకమతమునే విశ్వసించెను. ఈయన ద్వైతాద్వైత విశిష్టాద్వైతములకు చక్కని సమన్వయపూర్వకమైన వ్యాఖ్యానము చేసినాఁడు. ఈ విశ్వైకమతమునే పూర్వము కొందఱు షడ్దర్శనపరముగ ప్రతిపాదించిరని ఈ శ్లోకమునుబట్టి తెలియుచున్నది

శ్లో॥ యం శైవాః సముపాసతే శివ
ఇతి బ్రహ్మేతి వేదాంతినో
బౌద్ధాబుద్ధ ఇతి ప్రమాణ
పటవః కర్తేతి నైయాయికాః
అర్హన్నిత్యథ జైనశాసనరతాః
కర్మేతి మీమాంసకాః
సోఽయం నో విదధాతు వాంఛిత
ఫలం త్రైలోక్యనాథో హరిః॥

కాని శ్రీరామకృష్ణుఁడు పై మతములతోపాటు క్రైస్తవ మహమ్మదీయ మతములను గూడ జోడించెను. పై శ్లోకకర్త కాలమునకు భారతదేశమున క్రైస్తవ మహమ్మదీయ మతములు వ్యాపింపలేదేమో!

(6) భక్తులన్యమనస్కులై దేవాలయమును ప్రవేశించుటకు శ్రీరామకృష్ణుఁడిష్టపడక వారిని గట్టిగా మందలించువాఁడు. ఒకమారు తనను పోషించెడు రాసమణిదేవి కాళికాలయమునకు వచ్చిన తర్వాత మనస్సున కోర్టుదావాలనుగురించి యాలోచించుచుండెనట. దానిని వెంటనే కనిపెట్టి శ్రీరామకృష్ణుఁడామె నొక చెంపపెట్టు పెట్టి మందలించెనట. ఈ రీతిగనే మరియొకమారు ఇంకొకరికి చేసెనట. కాని

దీనిబట్టి యతడు భక్తశిష్యులను కఠినముగను క్రూరముగను దండించువాడని తలపరాదు. శిష్యులను తనతో సమానముగ భావించి వారితో సమముగ నాటపాటలలో పాల్గొని వాత్సల్యముతో జూచెడివాడు.

(7) ఈయన జీవన్ముక్తుడు. తోతాపురి స్వామినుండి సన్న్యాసదీక్షను గ్రహించుట కేవలము ఆచారమునకు మాత్రమే యని తలపదగినది.

ఇట్టి యాధ్యాత్మికవీరుని పూజ సల్పుటకై శతాధికమతములు భారతదేశమునను నలుబది మతములు విదేశములందును వెలసినవి పూర్వకాలమునుండియు పురాణవీరు లగు శ్రీరాముడు శ్రీకృష్ణుడు మహావిష్ణువు పరమశివుడు మొదలగువారి పూజలు బహు శ్రద్ధాభక్తులతో భారతదేశమున నిరంతరాయముగ సాగుచున్నవే కదా!

# భక్తిరత్నావళి

మూలము :
**శ్రీ విష్ణుపురి**

వ్యాఖ్యాత :
**విష్ణుచిత్తుడు**

(ప్రథమ విరచనము)

**79**

పారమార్థికజీవనమున భగవద్భక్తుల కెన్నియో విఘ్నములు కలుగును. అయినను భగవత్కటాక్షమువలన వారు వాని నన్నింటిని తరింతురని శామదేవాదు లనుచున్నారు.

త్వాం సేవతాం సురకృతా బహవోఽన్తరాయాః స్వౌకో విలంఘ్య పరమం వ్రజతాం పదన్తే
నాన్యస్య బర్హిషి బలీన్ దదతః స్వభాగాన్ ధత్తే పదం త్వమవితా యది విఘ్నమూర్ధ్ని. (11-4-10)

నిన్ను భజించి నీ పదమును చేరు భక్తులు స్వర్గాదిలోకములను తమను మించిపోదురని దేవతలకు తెలియును. అందువలన భక్తులకే దేవత లనేకవిఘ్నములను కల్పింతురు. కాని యజ్ఞయాగాదుల వలన దేవతలను తృప్తిపఱచువారికి విఘ్నములు కలుగవు ఇట్లుండినను నీవే రక్షకుడవుగా గల భక్తు లట్టి విఘ్నముల నన్నింటిని అతిక్రమింతురు.

గమనిక: తమకు హవిర్భాగములు లభించుటకై దేవతలు మానవు లెప్పుడును తమ యుపాసకులుగనే యుండ నిచ్ఛింతురు. భక్తుడు ముక్తినందినచో దేవతలకు వచ్చు హవిర్భాగము లాగిపోవును. ఈ భయముచేతను, భక్తులు తమకంటె గొప్పవా రగుదురను భయముచేతను దేవతలు భక్తుల పురోభివృద్ధి నాటంకపఱతురు. అనేకవిధముల కామోపభోగములచే వారి నాకర్షింప ప్రయత్నింతురు.

## 80-81

భక్తులెట్లు ఊర్ధ్వగతుల నందుదురో అట్లే పారమార్థిక జీవనమునకు విముఖులగు వారు అధోగతుల పాలగుదురని చమసుడను యోగి వచించుచున్నాడు.

ముఖబాహూరుపాదేభ్యః పురుషస్యాశ్రమైః సహ
చత్వారో జజ్ఞిరే వర్ణాః గుణైర్విప్రాదయః పృథక్
య ఏవం పురుషం సాక్షాదాత్మప్రభవమీశ్వరమ్
న భజన్త్యవజానన్తి స్థానభ్రష్టా పతన్త్యధః. (11-5-2, 3)

బ్రాహ్మణాది నాలుగు వర్ణములును నాలుగు ఆశ్రమములును విరాట్పురుషుని ముఖము బాహువులు ఊరువులు పాదములనుండి యుద్భవించినవి. ఈ వర్ణవిభాగము గుణముల హెచ్చుతగ్గుల వలన నేర్పడినది.

ఎల్లర కాధారమగు నీ పరాత్పరుని చతుర్విధాశ్రమములం దెవ్వ రారాధింపక తిరస్కరింతురో వా రధఃపతనము చెందుదురు. (ఆరాధనమన వారి ధర్మముల నీశ్వరార్పణ బుద్ధితో చేయుట ఇతరవిధముల భక్తి నభ్యసించుట.)

## 82-83

కలియుగమున నాధ్యాత్మికగమ్యము చేరుటకు భక్తియే సాధనమని పింగళ యను చున్నది.

ఘోరే కలియుగే ప్రాప్తే సర్వధర్మవివర్జితే
వాసుదేవ పరా మర్త్యాస్తే కృతార్థా న సంశయః
సంసారకూపపతితం విషయైర్ముషితం క్షణం
గ్రస్తం కాలాహినాత్మానం కోన్యస్త్రాతు మిహేశ్వరః. (11-8-41, 42)

సంఘమునుండి సర్వమతధర్మములు నైతికానుష్ఠానములు అంతర్ధానముకాగా పతితమైన కలియుగమునందు మనఃపూర్వకముగ వాసుదేవు నర్చించువారు నిశ్చయముగ మోక్షము నందుదురు.

యుక్తాయుక్తవివేకమను నేత్రము విషయసుఖవాంఛలచే కప్పివేయబడగా సంసారమను దిగుడుబావియందు పడి కాలమను సర్పముచేత చుట్టివేయబడిన జీవుని పరాత్పరుడగు వాసుదేవుడు తప్ప నింకెవ్వరు రక్షింపగలరు ?

# యువకులకు శ్రీ వివేకానందుల పిలుపు

## మన సారస్వతము – మన మతము

భౌతికముగగాని మానసికముగగాని నైతికముగగాని ఆధ్యాత్మికముగగాని బలహీనులుగ నుండకుడు.

భారతజాతికి సీతారాములు ఆదర్శమూర్తులు. చిన్నపిల్లలందఱును అందును బాలికలు ముఖ్యముగ సీతాదేవి నారాధింతురు. స్త్రీకి గల యత్యున్నతాశయము పవిత్రురాలు భక్తిపరాయణ సహనస్వరూపిణియగు సీతవలె నుండ గోరుట. ఈ వ్యక్తులను బాగుగా పరిశీలించినచో భారతీయాదర్శము పాశ్చాత్యాదర్శమున కెంత భిన్నముగ నున్నదో తత్క్షణమే గ్రహింపగలరు. మనజాతికి సీత సహనమునకు ఆదర్శముగ నిలుచుచున్నది. పాశ్చాత్యదేశములిట్లనుచున్నవి. ''కానిండు. పనిచేసి మీశక్తిని ప్రదర్శింపుడు.'' భారతదేశ మీ విధముగ ననుచున్నది. ''సహించుటచే మీ శక్తిని ప్రదర్శింపుడు.'' మానవు డెంత యెక్కువ సమకూర్చుకొనగలడను సమస్యను పాశ్చాత్యదేశములు పరిష్కరించినవి. మానవుడు ఎంత తక్కువతో జీవింపగల డను సమస్యను భారతదేశము పరిష్కరించినది...సీత భారతదేశమునకు, ఆదర్శ భారతదేశమునకు, మచ్చుతునక. సీత యనెడు ఆదర్శమువలె ఈ జాతియందు పూర్తిగా వ్యాపించి జాతీయజీవనమున ప్రవేశించి జాతి యొక్క ప్రతి రక్తబిందువునందును స్పందించు మఱొక పౌరాణికగాథ కనుపింపదు. భారతదేశమున మంచిది అని చెప్పబడు ప్రతిదానికి, పవిత్రతకు, పూజ్యతకు, స్త్రీయందు స్త్రీత్వమని చెప్పబడుదాని కంతకును సీతయే నామాంతరము.

మహాభారతమునుగూర్చి ప్రస్తావించునపుడు మహామేధావియు ప్రజ్ఞాధురీణుడును అగు వ్యాస భగవానునిచే అనంతముగ చిత్రితములైన రాచతీవి మెఱయు యోధానుయోధ పరంపరను వర్ణించుట కేవలము అసాధ్యమైన విషయము. దైవభీతి గలిగియు దుర్బలుడు వృద్ధుడు అంధుడు అగు ధృతరాష్ట్ర మహారాజు మనస్సునందలి ధార్మికత పుత్రవ్యామోహముల అంతర్యుద్ధము, రాచరికము చిందిపోవు భీష్మపితామహుడు, ఉదాత్తము పరిశుద్ధము అగు శీలసంపద గల మహనీయుడు యుధిష్ఠిరుడు, పరాక్రమములోనే కాక భక్తిలోను విధేయతలోను అసదృశులగు తక్కిన నల్వురుసోదరులును, మానవవిజ్ఞానమున సాటిలేనివాడు అద్వితీయమగు వ్యక్తిత్వముగలవాడు అగు కృష్ణపరమాత్మ, ఘనతలో వీరికే మాత్రమును తీసిపోని స్త్రీలు—గాంధారి మహారాజ్ఞి, ప్రేమమయి యగు తల్లి కుంతి, నిరంతరమును అనుకూలవతియు పరిపూర్ణ సహనశీలయు నగు ద్రౌపది—వీరే కాక, ఈ వీర కావ్యము యొక్కయు రామాయణముయొక్కయు నూర్లకొలది ఇతరవ్యక్తులు హైందవజగత్తు అనేక వేల సంవత్సరములుగా కాపాడుకొనుచు వచ్చిన ప్రియమగు సంపద. అదియే వారి ఆలోచనా విధానమునకు, వారి నైతికభావములకు, వారి ఆచార పద్ధతులకు పునాదియై యున్నది. రామాయణ మహాభారతములు రెండును యథార్థముగ ప్రాచీనార్యజీవనమునకును విజ్ఞానమునకును రెండు విజ్ఞాన సర్వస్వములు. అవి మానవజాతి ఇంకను అందుకొనుట కాకాంక్షింపవలసి యున్న ఆదర్శనాగరికతను చిత్రించును.

బలు లిచ్చుటలు, మోకరించుటలు, సణుగుటలు, గొణుగుటలు మతము కాదు. రమణీయములగు వీరోచితకృత్యములను సాహసముతో నాచరించుటకు ప్రేరేపించిననే, దివ్య

పరిపూర్ణతను గ్రహింపగలుగునట్లు మన భావములను ఉత్తేజపఱచిననే, అవి యోగ్యములగుచున్నవి. భగవంతుడు మన కందఱకు తండ్రి యని ప్రార్థనలలో మాత్రమే గుర్తించుచు మనదైనందిన జీవితములలో తోడి మానవుని మన సోదరునిగ చూడనిచో దానివలన ప్రయోజనమేమి ?

మతము సంగతియేమి ? అది నిలువవలెనా? లేక అంతరింపవలెనా ? అది నిలిచియుండవలసినచో దానికి సంబంధించిన నిపుణులు యోధులు కావలసియున్నారు. మతమునే తన జీవితముగ చేసికొని యున్నవాడు కావున సన్న్యాసి యనువాడు మతనిపుణుడు. అతడు భగవంతుని యోధుడు. తదేకచిత్తులైన సన్న్యాసివర్గమున్నంత కాలము ఏ మతము అంతమొందును!

భారతీయ జీవితోద్యమమునకు విషయము ఆమె శాశ్వత గీతికలకు పల్లవి ఆమె అస్తిత్వత్వమునకు వెన్నుముక ఆమె ఉనికికి ప్రాణాధారము, ఆమె జీవనకారణము—అది మానవజాతియొక్క ఆధ్యాత్మికీకరణమే.

భారతీయ జాతీయ జీవనమున ప్రపంచమును గ్రక్కదలించు ఆధ్యాత్మిక దిగ్గజములు లేని కాలము నెవ్వరు చూపగలరని నేను సవాలు చేయుచున్నాను. ఆమె ప్రభావ మెల్లప్పుడు ప్రపంచముపై చల్లని మంచు బిందువుల వలె నిశ్శబ్దముగ దాదాపు అజ్ఞాతముగ ప్రసరించుచు అందలి సుందరతమకుసుమములను వికసింపజేయుచునే యున్నది.

ఒక దృశ్యము సజీవముగ విస్పష్టముగ నా యెదుట గాన్పించుచున్నది. ఈ ప్రాచీన జనని మఱియొకమారు మేల్కాంచినది. మునుపటి కంటె శోభాయమానముగ నూత్న యౌవనముతో తన సింహాసనముపై ఆసీనయై యున్నది. చాటి చెప్పుడు. మంగళాశాసనములతోను స్వస్తివాచకములతోను ఆమెను గూర్చి విశ్వమం దంతటను చాటి చెప్పుడు.

# ముక్తి - వేదాంత సిద్ధాంతము

జి. వెంకటేశ్వరరావు M.sc.

మానవుడు సదా సంతోషముగ నుండుట కొఱకే ప్రయత్నించుచుండును. ఆదికాలము నుండి మన దేశమం దుద్భవించిన ఋషులు ఈ సంతోషమునకే పాటుపడిరి. కాని సంతోషము దుఃఖముతో కలిసియే యున్నది. 'చక్రనేమి క్రమేణ' అని కాళిదాసు అనినట్లు సంతోషము రాగనే దుఃఖము, మరల సంతోషము మారి మారి వచ్చుచున్నదను విషయము లోకసిద్ధము. కావున సంతోష మనునది అనిత్యము చంచలమునై యున్నది. మఱియు ఈ సుఖము కలుగవలెనన్న దానికి కారణముగ కొంత సామగ్రి యుండవలెను. పుష్పమాలలు, చందనము, భార్యాపుత్రాదులచే సంతోషపడుట మనము చూచుచున్నాము. అనగా ఇంద్రియ విషయ సంపర్కమువలననే వారి యానందము. ఇట్లుగాక అత్యంతపావనమై విషయసంబంధములేని శాశ్వతసుఖము వేదప్రతిపాదితమై యున్నది. దానినే మన పూర్వులు ముఖ్యముగా దర్శనకారులు వివరింప ప్రయత్నించిరి.

అందు తార్కికులు "ఏకవింశతి దుఃఖ ధ్వంసో మోక్షః" అనగా ఇరువదియొక్క దుఃఖములు లేకపోవుటయే మోక్షమనిరి. అనగా వీరి సిద్ధాంతమును విమర్శించి చూచి నచో మోక్షము పాషాణకల్పము. అందనుభ వించుట అనునదియే ఉండదు. మోక్షము దుఃఖధ్వంస మనుటచే సుఖానుభవము ఆ సమయమున ఉండునని నియమములేదు. సాంఖ్యులు పాతంజలులు ప్రకృతి పురుష వియోగమే మోక్షమనిరి. కాని విమర్శించి చూచినచో పై సిద్ధాంతమునందును లోట్లు స్పష్టముగ కనిపించును.

ముఖ్యముగ వేదములకు ప్రాధాన్యమును స్వతఃప్రామాణ్యమును ఇచ్చు మీమాంసక వేదాంతిమతములను ప్రస్తావింతము. అందు మీమాంసకులు ముక్తియన పరమసుఖరూప మనియు స్వర్గపరమనియు అభిప్రాయపడి, దానికి ప్రమాణముగ

"యన్న దుఃఖేన సంభిన్నం
న చ గ్రస్త మనంతరం।
అభిలా షోపనీతం చ
తత్సుఖం స్వః పదాస్పదం॥

అని చూపుదురు. 'స్వః' అన్నను స్వర్గమనియే అర్థము. "స్వః అవ్యయం స్వర్గనాక త్రిదివః త్రిదశాలయః" అని అమరకోశము. కావున చాతుర్మాస్యము జ్యోతిష్టోమము మొదలగు వైదికకర్మల నాచరించి తద్వారా స్వర్గలోక మునకు పోవుటయే ముక్తియని వీరి యభి ప్రాయము. మఱి మోక్షము జ్యోతిష్టోమాది కర్మసాధ్యమైనచో భూలోకమందు కర్మ సాధ్యములగు ఘటాదులు నశించినట్లు, స్వర్గ మను మోక్షముకూడ వైదికమగు కర్మ సాధ్యమే అగుటవలన నశింపగా మోక్షము అనిత్యముకాదా అని సంశయింపరాదు. ఏలన

"అక్షయగ్ం హ వై చాతుర్మాస్య యాజినః సుకృతం భవతి అపామ సోమ మమృతా అభూమ" (అథర్వ శిరస్సు-౩)

చాతుర్మాస్య యాగముచేసిన అక్షయము అనగా నిత్యమగు స్వర్గము కల్గును. మేము సోమపానము చేయుటచేత మాకు మరణమే లేదు. అనియు పై శ్రుతులు ఘోషించుట వలన వైదికమగు కర్మసాధ్యమైనను మోక్షము నిత్యమే. వేదమే పైవిధముగా స్వర్గము నిత్య మని చెప్పుచున్నది కాన ఆపైన కర్మసాధ్య మను హేతువువలన అనిత్యమగునని భ్రమింప రాదు.

"కర్మణైవ హి సంసిద్ధి
మాస్థితా జనకాదయః"

అని కృష్ణపరమాత్మ చెప్పినదియు ముక్తి కర్మ ఫలమే అని తేటపరచుచున్నది.

ఈ మతమునకు చెందినవారిలో కొందఱు 'ఐకభవికవాదము' అను పేర మోక్షమున కొక ఉపాయమును చెప్పుచున్నారు. అది యేమన సంచితములగు కర్మలు మునుపు స్వర్గ నరకాదు లనుభవించుటచే క్షీణించినవి. ప్రారబ్ధకర్మ మిప్పుడు అనుభవింపబడి క్షీణిం చును. కామ్య నిషిద్ధ కర్మల నాచరింపక యుండుటవలన పుణ్యపాపముల ఫలమగు మఱుజన్మము రాజాలదు. నిత్యకర్మలగు సంధ్యావందనాదుల నాచరించుటవలన ప్రత్య వాయము అనగా పాపము రాదు. కాన పై ఉపాయము ననుసరించిన మఱుజన్మమురాదు. జననమరణ పరంపరనుండి వదలింపబడుటయే కదా మోక్షము అందురు.

పై రెండు తెగల మీమాంసకుల మతమును సరికాదని వేదాంతుల యభిప్రాయము. వేదాం తుల మతమున బ్రహ్మజ్ఞానమువలననే

మోక్షము లభించును. కాని మోక్షమునకు వేఱుపాయము లేదు.

"జ్ఞాత్వాం దేవం సర్వపాశాపహానిః" "బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి" మొదలగు శ్రుతులే దీనికి ప్రమాణము.

మీమాంసకులు చెప్పునట్లు సంచిత కర్మలన్నియు మునుపే అనుభవించి మైనదనుటకు ప్రమాణము లేదు. అంతియగాక కర్మశేష మున్నదని శ్రుతిస్మృతులు ఘోషించుచున్నవి.

"తద్య ఇహ రమణీయాచరణాః రమణీయ యోని మాపద్యన్తే" "తతః శేషేణ" అని.

బ్రహ్మజ్ఞానము కలుగునంతవఱకు కామ్య నిషిద్ధకర్మల నాచరింపకయుండుట సంభవింపదు. ఏలన రాగద్వేషము లతనికి అవశ్యముగ నుండుటవలన, వానిచే ప్రేరేపింపబడి కామ్యాది కర్మల నాచరింపవలసి వచ్చును. కాన మఱుజన్మము అవశ్యము వచ్చితీరును.

మోక్షము స్వర్గపద వాచ్యార్థము కాజాలదు. ఏలన మోక్షము నిత్యమని సర్వవాదులు ఒప్పుకొనిన విషయము. స్వర్గలోకమో అనిత్యమైనది. కర్మలకు ఫలము. కర్మఫలము తీరగనే స్వర్గలోకవాసమును అంతమగును. "యత్కృతకం తదనిత్యం" అని న్యాయము.

మఱి "అక్షయగ్ంహవై" అని నిత్యమైన ఫలములను చెప్పు శ్రుతుల కర్థము ఆపేక్షికమైన శాశ్వతత్వమే. భూరాది లోకములతో పోల్చినచో చాలకాలముండుటచే దానిని శాశ్వత మనిరి. "కర్మణైవ హి సంసిద్ధిం" అను గీతావాక్యమునకు వైదికకర్మల చేయుట వలన చిత్తశుద్ధి కలిగి తద్వారా జ్ఞానమును పొంది మోక్షము నందిరని భావము.

కషాయ పంక్తిః కర్మాణి
జ్ఞానం తు పరమాగతిః,
కషాయే కర్మభిః పక్వే
తతో జ్ఞానం ప్రవర్తతే॥

అను స్మృతియు కర్మము లాచరించిన చిత్తమాలిన్యము తొలగునని చెప్పుచున్నది. కాన వేదాంత సిద్ధాంతమందు జ్ఞానముమాత్రమే మోక్షసాధనము. కర్మలు పరంపరగా చిత్తశుద్ధిద్వారా జ్ఞానోత్పత్తికి సహకరించును.

పై విధముగా జ్ఞానమే మోక్షసాధనమగుటచేత వేదమందు చెప్పినట్లు నిష్కామముగ నిత్యనైమిత్తికాది కర్మలనుచేసి చిత్తశుద్ధిని బడసి గురువులవద్ద బ్రహ్మతత్త్వమును తెలిసికొని శ్రవణమనన నిదిధ్యాసన మార్గమున అఖండబ్రహ్మ సాక్షాత్కారమును పొంది, అనగా తానే సచ్చిదానందరూపమగు బ్రహ్మమై శాశ్వతముగ కాలాది సంబంధములు లేక నిత్యనిరతిశయానందరూపమైన మోక్షమును సర్వప్రాణులును పొందవచ్చుననుటయే సర్వవేదాంత సిద్ధాంతము.

కావున మనమెల్లరము పై విధమున శమదమాదుల సహకారమున గురూపసదనముచేసి బ్రహ్మతత్త్వము నెఱిగి మోక్షమును పొందుదుము గాక!

శ్రీరస్తు

# పవిత్రమాత

## కేశవబ్రహ్మచారి

ప్రతి సంవత్సరమును శ్రీ శారదాదేవి జన్మ దినోత్సవము కన్నులపండువుగా ప్రపంచమున పలుచోట్ల జరుపబడుచున్నది. మనమును ఆ ఉత్సవములందు పాల్గొని ఆనందించుచున్నాము. అమ్మ ఎట్లు ఇంతటి సర్వజనపూజనీయురాలైనది? అమ్మ యందలి ఏ గుణములు ఆమె నట్లు చేసినవి? అను విషయము నాలోచించు నపుడు మనస్సున కిట్లు తోచినది.

అమ్మ జీవిత మంతటను మొదటినుండి తుది వఱకు మనల నాకర్షించునది ఆమె పవిత్రత. అమ్మ పవిత్రతా స్వరూపిణి. అమ్మ భౌతిక దేహము పవిత్రము. హృదయము పవిత్రము. మనస్సు పవిత్రము. అంతఃకరణము పవిత్రము. ఆత్మ పవిత్రము. అన్నియు పవిత్రములే. అమ్మ జీవితమున ఏ అంశమును చూచినను పవిత్రత శోభించుచున్నది. అందువలననే అమ్మ మన యందఱి పూజల నందుకొనుచున్నది. అట్టి పవిత్ర హృదయమే మన మనోమాలిన్యములను కడిగివేసి మనలను పావనులనుగా చేయగలదు. అట్లు చేయుటకే అమ్మ యవతరించుట.

అందుకే శిష్యుడొకడు అమ్మకు బాధ కలుగును తలంపుతో ఆమె పాదములను తాకుటకు సంకోచించుచున్నపుడు ఆమె ఇటు లనెను. "లేదు, నాయనా, మా జన్మ మందుకొఱకే. ఇతరులదుఃఖములను పాపములను మేము గ్రహించి జీర్ణించుకొననిచో వేరెవరికి ఆ పని సాధ్యము? వేఱెవ్వరు ఈ పాపుల బాధితుల బాధ్యతలను భరింతురు?" ఆమె అంతిమ సమయమున వ్యాధిగ్రస్తురాలై యున్నప్పుడు ఒకరు అమ్మ భౌతిక దేహ బాధల కన్నింటికి కారణము కల్మషమనస్కుల సంస్పర్శయే యనియు అమ్మ తేరుకొనిన పిమ్మట అట్టివారి నామె కడకు రానీయకుండ చూడవలయు నని చెప్పుచున్నప్పుడు అమ్మ "అట్లెందుకు మాట్లాడెదరు? శ్రీ రామకృష్ణుడు రసగుల్లాలను తినుటకోసమేనా జన్మించినది?" అని పలికెను. అనగా వారిరువురి యవతారము జనుల పూజాపురస్కారముల నందుకొనుటకు మాత్రమేగాక మన పాప భారమును వారు భరించి మనల నుద్ధరించుట కొఱకని భావము.

వారి యనుగ్రహముచే నట్లు నిష్కల్మష హృదయులైన వారికి ఆత్మసాక్షాత్కారము కరతలామలకమును గదా! భగవంతుని ప్రత్యక్షముగా దర్శించిన ఇట్టి మహనీయులకంటె అమ్మనుగూర్చి మనకు బాగుగా తెలుపు వారెవరు? వారి పలుకులను కొంత విందము. శ్రీ రామకృష్ణుల ముఖ్య శిష్యులలో నొకరగు శ్రీ అభేదానందస్వామి అమ్మ నిట్లు కీర్తించి యున్నారు.

పవిత్రం చరితం యస్యాః
పవిత్రం జీవనం తథా
పవిత్రతా స్వరూపిణ్యై
తస్యై కుర్మో నమో నమః.

"ఎవరి చరిత్రము పవిత్రమో ఎవరి జీవనము పవిత్రమో అట్టి పవిత్రతా స్వరూపిణికి మరల మరల నమస్కరించుచున్నాను."

సృష్టిస్థితిలయములను క్రీడార్థము కావించుచున్న ఆ దేవదేవియే సంసారబద్ధులగు మానవుల నుద్ధరించుటకు అప్పుడప్పుడు నరరూపమును ధరించునన్న విషయమును చెప్పుచున్నారు.

ప్రకృతిం పరమాం అభయాం వరదాం
నరరూపధరాం జనతాపహరాం

శరణాగత సేవక తోష కరీం
ప్రణమామి పరాం జననీం జగతాం॥

అమ్మా జనుల తాపమును హరించుటకు నరరూపము ధరించిన పరమ ప్రకృతివే నీవు. నిన్ను శరణుజొచ్చిన వారికి సంతోషము కాన గూర్తువు. అట్టి నీకు జగజ్జననికి ప్రమాణములు.

అమ్మనుగూర్చి పూర్తిగా తెలిసికొనుట ఎవరికి సాధ్యము! ఆమె మహాసాగరమువంటిది. ఎచ్చట చూచినను అంతులేని జలరాశి యని కాక సముద్రమును వేఱెట్లు వర్ణింపగలము. అమ్మ విషయమునగూడ నిట్లే. అమ్మ పవిత్రతా స్వరూపిణి యని మాత్రమే చెప్పగలము. ఆమె యనుగ్రహము కల్గినచో ఆమెను గూర్చి యే కొంతయో గ్రహింపగలము. 'లాంతరు చేత నున్న రక్షకభటుడు దయతలచి తన వైపునకు లాంతరును త్రిప్పుకొనిన కాని ఇతరు లాతనిని చూడజాలర'ని శ్రీరామకృష్ణులు పల్కువారు.

బహిర్ముఖములైన ఇంద్రియములు నిరంతరము బాహ్యములగు ఇంద్రియ విషయములనే యన్వేషించునుగాని లోనున్న అంతరాత్మను దర్శింపనేరవని కఠోపనిషత్తు.[1] అట్లే శ్రీశంకర భగవత్పాదులును విషయసుఖముల నెడు ముండ్ల బాటను పోవు బుద్ధిహీనుని మృత్యువు త్వరలో కబళించుననియు వివేచన చేయుచు సద్గురూపదిష్టమయిన మార్గమున జనువాడు ఫలసిద్ధిని అమృతత్వము నందుననియు బోధింతురు.[2] అభేదానందస్వామియు :

విషయం కుసుమం పరిహృత్య సదా
చరణాంబురుహామృత శాంతి సుధామ్
పిబ భృంగ మనో భవరోగ హరామ్
ప్రణమామి పరాం జననీం జగతామ్॥

మనోభృంగమా! విషయసుఖమను కుసుమమును త్యజించి సర్వదా అమ్మ పాదపద్మము లందుండు అమృతశాంతిసుధను సేవింపుము— ఇందువలన భవరోగము హరింపబడును— అనుచున్నారు. మన మనశ్శాంతికి అమ్మ పాద పద్మముల నాశ్రయించుటకంటె మంచి మార్గ మేది ?

ఇట్టి అహేతుకదయాసింధువు భక్తివిజ్ఞాన దాత్రియు నగు అమ్మను ప్రార్థింపవలసిన విధమును కోరవలసిన వరములను చెప్పుచూ మొదట అమ్మయొక్క నిర్హేతుక కృపను వర్ణించుచున్నారు.

స్నేహేన బధ్నాసి మనోఽస్మదీయం
దోషానశేషాన్ సగుణీ కరోషి
అహేతునా నో దయసే సదోషాన్
స్వాంకే గృహీత్వా యదిదం విచిత్రం॥

అమ్మా నీ దివ్యప్రేమవలన మా మనస్సులను బంధించియున్నావు. మాదోషముల నన్నింటిని నిర్మూలించి గుణవంతులనుగ చేయుదువు. దోషపూరితులమగు మాకుగూడ నీ యొడి యందు ఆశ్రయ మొసగియున్న ఈ నిర్హేతుక కృపాదానము ఆశ్చర్యకరము కాదా!

---

1. పరాఞ్చిఖాని వ్యతృణత్ స్వయంభూః
తస్మాత్ పరాఙ్ పశ్యతి నాన్తరాత్మన్॥ (కఠ 4-1)

2. విషయ విషమమార్గైః గచ్ఛతోఽనచ్ఛబుద్ధేః
ప్రతిపద మభియాతో మృత్యు రప్యేష విద్ధి॥ (వివేక చూడామణి 81)

ఇక సంసారదావానలమున చిక్కి దహించి పోయిన మనస్సునుగూర్చి అమ్మవద్ద మొఱ పెట్టుచు మనశ్శాంతికై ప్రార్థించుచున్నారు.

ప్రసీదమాత వినయేన యాచే
నిత్యం భవ స్నేహవతీ సుతేషు
ప్రేమైకబిందుం చిరదగ్ధ చిత్తే
విషించ చిత్తం కురు నః సుశాంతమ్॥

అమ్మా నీ పుత్రుల మగు మాకు ప్రసన్నురాలవు కమ్మా, నిత్యము ప్రీతితో చూడుము అని వినయముతో ప్రార్థించుచున్నాము. సంసారదావానలమున చిక్కి కాలిపోవుచున్న మా హృదయములను నీ ప్రేమబిందువు నొక్క దానితో తడిపి మాకు శాంతిని ప్రసాదింపుము.''—ఇదియే కదా మనము అమ్మను కోరవలసిన వరము!

పవిత్రతాస్వరూపిణియైన అమ్మ, మనలనుద్ధరించుటకే నరరూపము ధరించిన అమ్మ, మనల నందఱను తన పుత్రుల నందఱను తరింపజేయుటకై వచ్చియున్నది—రండు, అమ్మ పాదపద్మములకడ కేగుదము! అమృతపానము చేయుదము!! మనశ్శాంతిని సుఖమును పొందుదము!!!

# నారద భక్తిసూత్రములందు కొన్ని సాధనాంశములు

## శ్రీ రాఘవేశానందస్వామి

నిజమగు మతజీవనము నిత్యజీవితమునందు అనుష్ఠింప దగినది. నిజమునకు అనుష్ఠానమే మతజీవనమున కాధారము. శ్రీరామకృష్ణులు చెప్పినట్లు మతగ్రంథములు దైవమునకు దారిని మాత్రము చూపును. ఒకపరి మీకు దారి తెలిసినచో అటుపై గ్రంథములవలని ప్రయోజనమేమి? అప్పుడు కావలసినది ఏకాంతమున భగవంతునితోడి అనుసంధానమే, దాని వలన కలుగు ఆత్మవికాసమే. ఒకనికి వాని గ్రామము నుండి ఉత్తరము వచ్చెను. కొన్ని వస్తువులు అతని బంధువునకు పంపవలెనని అందున్నది. అతడు వానిని కొనుటకు పోవుచు ఏమేమి కావలయునో మరియొకసారి ఉత్తరమున చూడ గోరెను. అది కనుపింపలేదు. ఆతురతతో దానికై వెదకి చివరకు మహానందముతో దానిని కనుగొనెను. ''ఐదు శేర్ల మిఠాయిని వంద బత్తాయిలను ఎనిమిది గుడ్డల చాపులను పంపవలయు''నని అందున్నది. విషయము తెలిసిన పిదప ఆ ఉత్తరమును పారవేసి కావలసినవి కొనివచ్చుటకతడు బయలుదేరిపోయెను. అట్లే మతమునను సిద్ధాంతములకంటె నిత్యజీవనమునకే ప్రాధాన్యము. సరిగా మతజీవనమును జీవించినచో శీలము పెంపొందును, ఆత్మయొక్క దివ్యత్వము వికసించును. నిత్యజీవితమున ఆ దివ్యత్వము ప్రకటితమగును. ఆధ్యాత్మికస్థాయియందే నివసించుట సాధ్యమగును.

ఇట్టి నిత్యానుష్ఠేయమగు మతజీవన విధానమును ప్రాజ్ఞులు మానవప్రవృత్తుల కనుగుణముగ నాలుగురకములుగ నేర్పరచిరి. అవియే జ్ఞానయోగము భక్తియోగము రాజయోగము కర్మయోగము అనునవి. అందు భక్తియోగము ప్రేమద్వారా భగవత్సాక్షాత్కారము నందు విధానము నుపదేశించును. భక్తి యనగా దివ్య

మగు ప్రేమ. యోగమున భగవంతునితో ఆత్మ యొక్క ఐక్యము. భగవత్సాక్షాత్కారమునకు భక్తిమార్గమే అత్యంత సులభ మార్గమని నారదుడు చెప్పెను. శ్రీ రామకృష్ణులు కూడ "కలియుగ మున నారదుడు బోధించిన భక్తియే సాధన మార్గమ"ని చెప్పెదరు. కనుక శ్రద్ధావంతు లగు సాధకులకు నారదభక్తిసూత్రములు ఆప్త మిత్రములు. ఇందు భక్తిసిద్ధాంతమును గూర్చి శాండిల్యభక్తిసూత్రములందు వలె పాండితీ ప్రకర్ష కనుపింపదు. సాధకుల కవసర మగు సాధనమార్గములనుమాత్రము సూచించుమార్గ దర్శి ఇది. భక్తిమార్గము నుపదేశించు వివిధ ప్రామాణిక గ్రంథములతో గాని ఆ ఉపదేశ ముల నిగూఢార్థములు తత్త్వములతో గాని నారదునకు ప్రమేయము లేదు. అతనికి భక్తి యొక్క నిర్భరానందము తెలియును. ప్రత్య క్షానుభవము ద్వారా దానిని ఇతరులు కూడ తెలిసికొనవలెనని అతడు కోరును.

భక్తి ఇట్లు ప్రశంసింపబడుటకు కారణ మేమి? ఇతరమార్గములవలెనే భక్తికూడ దైవ సాక్షాత్కారమును కలిగించును. విశేష మేమనగా, మిగిలినవానితో పోల్చిచూచినచో భక్తిమార్గము సులభతమము. అటుపై భక్తి మార్గమున కవసర మగు ప్రాథమికము లగు ఆర్హతలు అంత కష్టసాధ్యములుకావు. మీదు మిక్కిలి జ్ఞానమార్గము ననుసరించువారు కూడ భగవత్కృపవలననే జ్ఞానమును పొందవలసి యున్నది. జ్ఞానులును భగవంతుని ప్రేమమయ సాంగత్యమున నుండగోరుదురు.

ఈ చిన్ని గ్రంథ మవతరించుటను గూర్చి ఒక జనశ్రుతి కలదు. వేదవ్యాసుడు బదరికాశ్ర మమున నుండ అచ్చటికి నారదు డొకపరి విచ్చేసెను. వేదవ్యాసుడును ఆదరముతో అతిథి సత్కారముచేసి ఇట్లనెను. "మహాత్మా, మాన వుని ఆత్మ ముక్తి నన్వేషించును. ప్రాపంచిక దుఃఖములనుండి విమోచనము నందగోరును. కాని కర్మమార్గము సూటిగా మోక్షమునకు కొనిపోవదు. అంతియగాక అది రాజసికమగు మార్గ మగుటచేత లక్ష్యమును మఱచి మాన వులు కర్మయందే చిక్కుకొని పోవుదురు. జ్ఞాన మార్గము సూటిమార్గమే యైనను అనుసరించుట మిక్కిలి కష్టము. అర్హులగు సాధకులు మిక్కిలి యరుదు. కనుక నాకు భక్తిమార్గము నుపదేశింపు డని బద్ధాంజలినై ప్రార్థించుచున్నాను" నార దుడును మందహాసముచేసి ఇట్లనెను. "మహర్షీ, మానవులపైని కృపచేతనే నీవు అవతరించితి వని నే నెఱుగుదును. వారికి నీవు చేసిన యుప కార మపారమైనది. ఈ ప్రస్తుతపు టాలోచ నకు కారణమును అదియే. నీ శిష్యుడగు జైమిని ద్వారా పూర్వమీమాంసయందు కర్మమార్గ మును గూర్చి చర్చించితివి. ఉత్తర మీమాంస యందు జ్ఞానమార్గమును పరిశీలించితివి. ఇప్పుడు భక్తిని గూర్చి ప్రస్తావించుచున్నావు. అట్లే వివరింతును. కాని దానిని పూర్తిగ నీవే శ్రీమద్భాగవతమున వివరింతువు."

నారదుని ఈ యుపదేశము ఎనుబదినాలుగు సూత్రములు గలిగి ఐదు అధ్యాయములుగ విభజింపబడినది. మొదటి అధ్యాయము పర భక్తిస్వరూపము. పరభక్తియొక్క వివిధరూప ములు స్పష్టముగను సరళముగను ఇందు నివ రింపబడినవి. సర్వోత్తమ మగు దివ్యప్రేమ దానిని సాధించు అభ్యాసములు కలిసి భక్తి యనిపించుకొనును. భక్తియందు రెండు దశలు కలవు. అపక్వదశ యగునది అపరభక్తి. పరి పక్వదశ పరభక్తి. పరభక్తియందు మరల రెండు అంశములు కలవు. ఆంతరము బాహి రము అని. దృగ్దృశ్యవిభేదములేక పరమాత్మ

యందే లీనమై బ్రహ్మానందము ననుభవించుట అంతరమగు పరభక్తి. దీనిని మాటలలో వివరించుటకు సాధ్యము కాదు. దీనినే జీవన్ముక్తి యనియు అందురు. ఇట్టి భక్తుడు ప్రపంచమున నెట్లు జీవించును? నడచుకొనును? అనునది బాహిరమగు అంశము.

పరభక్తి మహాత్మ్యము రెండవ అధ్యాయము. ఇందు నారదుడు ఇతరమార్గములకంటె భక్తిమార్గముయొక్క శ్రేష్ఠతను ప్రశంసించుచు సాధకు లందఱును భక్తినే ఆశ్రయింపుడని యుద్బోధించును. భక్తి సాధనములు మూడవ అధ్యాయము. సాధకు డభ్యసింపవలసిన నైతిక పారమార్థిక అభ్యాసము లిందు వివరింపబడినవి. ప్రేమ నిర్వచనము నాల్గవ అధ్యాయము ఈ అభ్యాసముల ద్వారా రాగభక్తిని సాధించిన భక్తుని నడవడిని వివరించును. రాగభక్తిని సాధించిన పిదప భగవత్సాక్షాత్కారము అచిర కాలముననే సాధ్యమగును.

చివరిదగు ఐదవ అధ్యాయము ముఖ్యభక్తుడు ప్రపంచమున నెట్లు జీవించునో అతనివలన ఎల్ల జీవులును ఎట్లు తుష్టినందుదురో సమాజము అతనివలన నెట్టిలాభమును పొందునో వివరింపబడినది.

దివ్యమగు పరమప్రేమ, దానిని సాధించు పద్ధతులును కలిపి భక్తి యనబడును. భక్తి యందు అపక్వము పక్వము అని రెండు అంతస్థులు గలవు. అపక్వమైనభక్తి గౌణ మనియు పక్వమైన భక్తి పరభక్తి యనియు నారదు డనును. పరభక్తి నందుకొనువఱకు సాధకునకు బాహ్యమైన సాహాయ్యకములు కావలసి యుండును. అమాయకు లగు సాధకుల మార్గమున కలుగు అభ్యంతరములను తొలగించుటకై నారదుడు ఒక సహజమైన సులభమార్గము నుపదేశించెను. శ్రద్ధతో పాటించుచో నిదియే సాధకుని భక్తిపరమావధికి చేర్చును. అన్ని భక్తి సంప్రదాయములందును భగవత్సాక్షాత్కారమే పరమగమ్య మయ్యును సాధన మార్గములందు మతభేదము లున్నవి. శ్రీరామకృష్ణు లనునట్లు ఎన్ని విశ్వాసములో అన్ని మార్గములు. విశాలహృదయుడగు నారదుడు తన యుపదేశములకు తన యనుభవమును మాత్రమే ఆధారముగ చేసికొనక ఇతర భక్త్యాచార్యుల ఉపదేశసారము గ్రహించును 83-వ సూత్రమున తన యుపదేశముల నంగీకరించుచు బలపరచు భక్త్యాచార్యులను పేర్కొనినాడు. వారిలో కొందఱు సనత్కుమారుడు, వ్యాసుడు, శుకుడు, శాండిల్యుడు, గర్గుడు, హనుమంతుడు, విభీషణుడు.

సాధనమార్గము: ఇక భగవదన్వేషకుడగు సాధకునకు నారదు డిచ్చు ఉపదేశ మేమి? సాధకుడు తనను జననమరణస్వరూప మగు సంసారమునకు తత్ఫల మగు దుఃఖములకు బంధించు సకల విషయములను బరిత్యజింపవలెను. దివ్యజీవనమందలి యానందము ప్రకటించు విషయముల నన్నింటిని అలవరచుకొనవలెను. విషయత్యాగము సంగత్యాగము అనునది నిషేధరూపమగు సాధన. దివ్యానందమును ప్రకటించు గుణముల నలవరచుకొనుట విధిరూపమగు సాధన. ఇవి రెండును అన్యోన్యాశ్రితములు. ఒకటి లేక రెండవది ఫలవంతము కాజాలదు. విషయత్యాగము చేయకయే ఆధ్యాత్మిక సాధనల నభ్యసించు సాధకుడు ఏమియు సాధింపజాలడు. పగలంతయు పొలమునకు నీరు పెట్టినను అందలి ఎలుక బొరియలగుండా నీరంతయు కారిపోయినచో పొలమెప్పటివలెనే ఎండియే యుండును కదా! అందు

వలననే నారదుడు భక్తి సాధనాధ్యాయమును "విషయత్యాగాత్ సంగత్యాగాత్ చ" అని ప్రారంభించుచున్నాడు. సాధకుడు ఇంద్రియసుఖమును సాధించు విషయములను విడనాడవలెను. వానియందలి అనురక్తిని కూడ త్యజింపవలెను.

ఈ కామినీకాంచన పరిత్యాగమును గూర్చి శ్రీరామకృష్ణులు ఒక చిన్న యుదాహరణము నిచ్చెడివారు. "మసిబారిన గదిలో ఎంత జాగ్రత్తగ నివసించినను కొంతమసి యంటుకొనక మానదు." అనగా ఇంద్రియసుఖములయెడ మెంత జాగ్రత్తగ మసలినను సంపూర్ణ త్యాగము సాధ్యము కాదని యుద్దేశము అట్లే "నూనెతో తడిసిన కాగితముపై వ్రాయుట సాధ్యము కాదు. అట్లే దుర్గుణముల చేతను విషయభోగముల చేతను పంకిలమైన ఆత్మ ఆధ్యాత్మిక సాధన కర్హము కాదు. కాని ఆ నూనె మరకల కాగితముపై సుద్దపొడి యద్దినచో దానిపై వ్రాయగలము అట్లే వైరాగ్యము చక్కగ పట్టిన ఆత్మ ఆధ్యాత్మిక సాధనలకు తగి యుండును. విషయాసక్తుడగు మానవు డెట్లు అధోగతి పాలగునది శ్రీకృష్ణు డర్జునునితో చెప్పియే యున్నాడు. "ధ్యాయతో విషయాన్ పుంసః । సంగస్తేషూప జాయతే । సంగాత్ సంజాయతే కామః । కామాత్ క్రోధోభి జాయతే ॥ క్రోధాత్ భవతి సమ్మోహః । సమ్మోహాత్ స్మృతి విభ్రమః । స్మృతి భ్రంశాత్ బుద్ధినాశో । బుద్ధి నాశాత్ ప్రణశ్యతి ॥

సుందరమగు వస్తువు నొక దానిని చూచితి వనుకొనుము, మనస్సుయొక్క స్వభావమేమన దానినే మరల మరల తలచుకొనుట. దానిని నిగ్రహింపక అట్లే తలచుకొనుచుండినచో దానియం దాసక్తి యేర్పడును. ఆసక్తి పెరుగు కొలది దానిని సమీపింపవలె నను కోరికయు దానిని స్వంతము చేసికొనవలె నను కోరికయు బలపడును. ఈ కోరిక తీరుట కభ్యంతరము లున్నచో క్రోధము కలుగును. క్రోధావేశము వలన యుక్తాయుక్త వివేకము నశించును. దాని వలన పూర్వానుభవములు దానివలన జ్ఞానము నశించును. ఇట్టి జ్ఞాననాశము వలన మానవుడు నశించును.

(సశేషము)

---

# తిరుక్కురళు

మూలకర్త: శ్రీ వళ్ళువనాయనారు

అనువక్త: నే. భక్తవత్సలము

## దశమాధికారము - ప్రియభాషణము

ప్రేమపూనియు వంచనమానియు ధర్మజ్ఞులు పల్కు మాటయే ప్రియభాషితము. ౯౧

చూచినప్పుడే సుముఖుడై ప్రీతికరముగ పల్కు పల్కు మనసు పొంగి చేయు దానమునకంటె మేలైనది. ... ౯౨

అతిథి కంటబడగానే గృహి తనమోమున ఆశ తొనకుచుండ, అతనిని ప్రీతితో చూచి, అతడు సమీపించినంతనే మనఃపూర్వక మధురవాక్కులు పల్కి చేయు ధర్మమే ధర్మము. ... ... ౯౩

అందటికిని ఆనందకరముగను ప్రియముగను భాషించువానికి దుఃఖకరమగు పేదటికముండదు. ... ... ౯౪

తక్కువవారి తక్కువతనమును చూడక, వారిని తనతో సమానులనుగ నెంచి, సాదరముగ నడచుకొనుట, ప్రియముగ మాటడుట—అను నివి రెండును ఎవనికిగాని ఆభరణములు. తక్కిన యాభరణములు ఆభరణములు కావు. ... ... ౯౫

అరసి హితములును ప్రియములు నగు పల్కుల నెవడు పల్కునో అతనికి పాపములు నశించును, ధర్మము వర్ధిల్లును. ౯౬

పరుల కుపకారము చేసి ప్రీతి తొలగని పల్కు పల్కుట ఈజన్మమునకు నీతియు మఱు జన్మమునకు ధర్మము నగును. ౯౭

బాధ కలిగింపని పల్కును ఇంపైన పల్కును పల్కుట ఈజన్మమునకును మఱు జన్మమునకునుగూడ ఆనందమును సమకూర్చును. ... ... ౯౮

ఇతరులు తనతో ప్రియవాక్కులు పల్కినప్పుడు ప్రీతుడై ఆనందించువాడు తా నితరులతో పరుషవాక్కు పల్కుట ఏలొకో! ౯౯

ధర్మసాధకములైన ప్రియవాక్కులు తన వశమం దున్నను (వానిని పల్కక) పాపవహములైన యప్రియవాక్కులను పల్కుట-తియ్యనిపండ్లు తనచేత నున్నను (వానిని తినక) పచ్చి(చేదు)కాయలను తినుటవంటిది. ౧౦౦

## ఏకాదశాధికారము - కృతజ్ఞత

తన కెన్నడును ఉపకారము చేసియుండని క్రొత్తవానికి ఒకడు తాను ముందుగా చేసిన యుపకారమునకును, ఒకనికి ప్రత్యుపకారము చేయు శక్తి లేకుండుట తెలిసియు అతనికి చేసిన యుపకారమునకును - స్వర్గమర్త్య లోకములునైతము విలువలో సమములు కావు. ... ... ౧౦౧

ఆపత్కాలమున చేసిన యుపకారము, (దానినిబట్టి చూచిన) చిన్నదే అయినను (సమయమును బట్టి చూచిన) భూలోకమున కంటె పెద్దది. ... ... ౧౦౨

'వీరి కిది చేసిన మనకు ఈలాభము కల్గును' అను తలంపు లేక ఒకరికి ఉపకారము చేయు కనికరముకలిమిని గూర్చి ఆలోచింతుమేని, దానిమేలిమి కడలికంటె విస్తారమైనది ౧౦౩

ప్రయోజనాభిజ్ఞులు తమ కితరులు చేసిన యుపకారము ఆవగింజయంతటిదైనను దానిని తాళవృక్షమంతటి యుపకారముగా భావింతురు. ... ... ౧౦౪

ఉపకార మెంతటిదో ప్రత్యుపకారము అంతటిదిగామాత్రి ముండరాదు, ఉపకారము పడసినవారి సంతోషమునకు తగినంతటిదిగా నుండవలెను. ... ... ౧౦౫

ఆపత్కాలమున ప్రాపుగ నుండినవారి స్నేహమును విడువకుండునది, జ్ఞానానుష్ఠాన సంపన్నుల మైత్రిని మఱవకుండునది. [అది ఈజన్మమునకు ఇది మఱుజన్మమునకు శ్రేయస్కరములు.] ... ౧౦౬

(సజ్జనులు) తమకు గల్గిన దుఃఖమును పోగొట్టినవారిమైత్రిని ఏడేడుజన్మములలోను స్మరించుచుందురు. ... ౧౦౭

చేసిన మేలును మఱచుట మంచిది కాదు, చేసిన కీడును అప్పుడే మఱచుట మంచిది. ... ... ౧౦౮

తొలుత నుపకారము చేసినవారు పిదప ప్రాణముతీయునంతటి యపకారము చేసినను (అది యంతయు) వారుచేసిన యుపకారమును తలంచినంతనే సమసిపోవును. ... ౧౦౯

ఏ పెద్దధర్మకార్యమును చెఱచినవారికైనను ఆ పాపము తీఱు నవకాశ మున్నది; చేసిన మేలు చెఱచినవానికి తరణోపాయము లేదు. ... ... ౧౧౦

## ద్వాదశాధికారము - పక్షపాతరహితత

మిత్రులు శత్రులు ఉదాసీనులు అనెడి ముత్తెగలవారిపట్లను సమానముగ స్వధర్మబద్ధముగ ప్రవర్తింపగన్నచో అటువంటి సమదర్శిత మంచిది. ... ... ౧౧౧

సమదర్శిత గలవాని సంపద సేగి లేక, అతని సంతతివారికిని అవిచ్ఛిన్నముగ చేకుఱును. ... ... ౧౧౨

శ్రేయమును సమకూర్చునదిగా అగపడినను, సమదర్శిత లేనందున కలుగు సంపదను అప్పుడే పూర్తిగ త్యజించునది. ౧౧౩

సమదర్శిత వీరి కున్నది వీరికి లే దనుటను వారికి వారికి సత్సంతతి ఉండుటను బట్టియు లేకుండుటను బట్టియు నెఱుగనగును. ౧౧౪

నష్టములును లాభములును పూర్వదుష్కృతసుకృతములచే నిర్ణీతములయ్యే యున్న వనుటను గుర్తించి, నష్టములను తప్పించుకొనుటకో లాభములను రప్పించుకొనుటకో పక్షపాతమునకు ఒడికట్టకుండుట జ్ఞానుల కలంకారము. ... ౧౧౫

మనస్సున మధ్యస్థవృత్తి చెడి పక్షపాతము నెఱపు తలం పొకనికి కలుగునేని, ఆ తలంపతని వినాశమును సూచించు నుత్పాత మని యెఱుగునది. ... ... ౧౧౬

పక్షపాతరహితమైన ధర్మనిష్ఠ కలవాని పేదఱికమును పెద్దలు పేదఱికముగా నెంచరు. (సంపదగానే తలంతు రనుట). ౧౧౭

రెండుతట్టలును సమములుగా గల్గి, వానియందు పెట్టబడిన బరువులు ఎక్కువయినచో తీయించి తక్కువైనచో వేయించి, సమీకరించు త్రాసువలె, ఏవైపునకును మొగ్గు లేకుండ ఇరుపక్షముల వాదములకును సమానముగ చెవియొగ్గుట జ్ఞానుల కలంకారము. ౧౧౮

పక్షపాతరహితత మనస్సులో నున్ననే మాటలలో నున్నట్లు గణింపబడును. [చెప్పిన తీర్పు ధర్మశాస్త్రానుసారముగ నున్నను చెప్పినవాని మనస్సున పక్షపాత మున్నచో, ఆ తీర్పు పక్షపాతరహితముగ అంగీకరింపబడదు — అనుట.] ... ... ౧౧౯

తక్కువ యిచ్చి యెక్కువ పుచ్చుకొనక పరధనమును తమధనమునుబోలె కాపాడు వర్తకుల వ్యాపారమే మంచి వ్యాపారము. ౧౨౦

# పరిప్రశ్న

[శ్రీరామకృష్ణమఠము (మద్రాసు) న 10-12-72 న జరిగిన అంతర్యోగమునందు జిజ్ఞాసువుల ప్రశ్నలకు శ్రీమత్తపస్యానంద స్వామివారి యుత్తరములు.]

ప్రశ్న: కొందఱు భక్తులు 'అంతర్వాణి' యందురు. అనగా, దైవమే అతనికి ఒక పరిస్థితిలో ఏమిచేయవలెనో ఏమిచేయరాదో కచ్చితముగా చెప్పునని వారి యుద్దేశము.

కాని అతనికి నిజముగా సదుపదేశమే లభించుచున్నదో లేక అతని మానసిక ప్రవృత్తులే అతనిని మభ్యపెట్టుచున్నలో తెలిసికొనుట ఎట్లు ?

ఉత్తరము: వర్ణనాత్మక మనస్తత్త్వశాస్త్రము (descriptive psychology) దృష్ట్యా ప్రతి మనఃప్రవృత్తియు మనస్సుయొక్క గహనమానస (subconscious), అవ్యక్తమానస (unconscious) భాగములయొక్క ప్రకటనగనే తేల్చవచ్చును. వర్ణనాత్మక మనస్తత్త్వశాస్త్రము మనస్సున కతీతమైన దానిని అంగీకరింపదు. కాని ఆధ్యాత్మిక ప్రపంచ దృక్పథములో మనస్సునుమించి ఆత్మకలదు. మనస్సునందు ఈశ్వరుని ప్రతిఫలనమే ఆత్మ. మనస్సున కతీతమైన ఆధారమునుండి 'అంతర్వాణి' పలుకవలసినచో మన మనస్సులు పరిశుద్ధము కావలెను. హృదయపూర్వకమగు భక్తితో భగవంతునకు సంపూర్ణముగ సమర్పింపబడవలెను. అప్పుడుమాత్రమే దివ్యమగు అంతర్వాణిని గూర్చిన మాటలు సుసంబద్ధములగును.

మనస్సునందు పాశవిక ప్రవృత్తులే రాజ్యము చేయుచున్నచో అతని వాంఛలే అంతర్వాణివలె బురఖా వేసికొని అతడు చేయగోరిన పనులన్నింటికి అనుమతులు సందేశములు ఇచ్చుచుండును. ఇట్టి వంచన నరికట్టుటకు ఈ క్రింది నియమములను విధింపవచ్చును. (1) అరమరలులేని పరిపూర్ణమైన విశ్వాసము భగవంతునియం దుండవలెను. (2) అతడు ఉపాసకుడై యుండవలెను. అనగా ఒక సంప్రదాయము ననుసరించుచు భగవంతునియందొక భావమును ఏర్పరచుకొని ప్రార్థన ధ్యానము మొదలగు ఆధ్యాత్మికసాధనలను అభ్యసించుచుండవలెను. (3) పాశవిక ప్రవృత్తుల యాధిపత్యమునుండి విముక్తుడై ధార్మిక బుద్ధిచే చోదితుడై యుండవలెను. (4) తన యభ్యర్థనలకు దార్ఢ్యము చేకూర్చుటకు ప్రతి నియమముల నాచరించుచు హృదయపూర్వకమైన ప్రార్థనభావము నభ్యసింపవలెను.

ప్రశ్న: మానవజీవితమునందు ప్రారబ్ధకర్మయు దైవసంకల్పమును ఏకకాలమందే విధింపబడుట ఎల ?

ఉత్తరము: ఈ విరోధము ప్రారబ్ధకర్మకు (ప్రస్తుత జన్మకారణమైన కర్మ) దైవసంకల్పమునకు కాదు. ప్రారబ్ధకర్మకు దైవానుగ్రహమునకు మాత్రమే. కర్మ, ప్రారబ్ధమే గాని తదితరమే గాని, నైతికనియమము (moral law) రూపముననున్న దైవసంకల్పమే. దైవసంకల్ప ప్రవర్తనము నిష్కారణము కాదనియు, అది వ్యక్తియొక్క కార్యములచేత ప్రభావితమై యున్నదనియు మాత్రమే కర్మసిద్ధాంతము తెలుపును. ఈ ప్రారబ్ధకర్మతో పోల్చినపుడు దైవానుగ్రహము నిష్కారణమైనదే. అనగా ఒక వ్యక్తి పూర్తిగా భగవంతునే శరణు జొచ్చినచో దైవానుగ్రహము అతనిని కర్మబంధమునుండి విముక్తుని చేయును. భౌతిక దృష్ట్యా కర్మ ఇంకను పనిచేయుచుండవచ్చును కాని అతని మనస్సు దైవానుసంధాన ఫలమైన శాంతిని పొందును. పరస్పర విరుద్ధము లనిపించినను, భగవంతుడు న్యాయశీలి, దయాశీలియును. కర్మసిద్ధాంతము భగవంతుని

న్యాయము. భౌతిక ప్రపంచమున సుఖదుఃఖముల రూపమున న్యాయపరిపాలనము జరుగు సమయముననే దైవానుగ్రహము శరణాగతుల మనస్సులపై పనిచేసి వారిని అన్ని కష్టనష్టముల కోర్చుకొనగలుగు శాంతిస్థాయికి ఉద్ధరించును. మహోన్నతులగు భక్తులుకూడ భౌతికముగ కష్టముల పాలగుటను గమనింతుము కాని దైవానుగ్రహమును పొందిన వారి మనస్సులు నిరంతరము భగవంతుని యందే నిక్షిప్తములై యుండును.

# వార్తలు - విశేషాలు

## రామకృష్ణ వేదాంతకేంద్రము, జెనివా, స్విట్జర్‌లాండ్

జెనివాకు 6 మైళ్ళ దూరమున కార్సియర్ (corsier) వద్ద ఒక సరోవరప్రక్కనుండు ఈ కేంద్రమునకు స్వంతభవనము కలదు. కేంద్రము యొక్క ప్రధానలక్ష్యములు రెండు. (1) ఉపన్యాసములు పుస్తక ప్రచురణలు వైయక్తిక సమావేశముల ద్వారా వేదాంత జ్ఞానమును వ్యాపింపజేయుట. (2) ప్రపంచ మతముల నడుమ సామాన్యభూమికను పరస్పరసహకారమును పెంపొందజేయుట.

కేంద్రమువద్ద ఎప్పటివలె ఫ్రెంచియందును ఆంగ్లమునందును ఉపన్యాసములు కొనసాగినవి. ఈ సంవత్సరమునను శ్రీరామకృష్ణుల జన్మదినమును దుర్గాపూజయు ఉత్సవముగ చేసికొనబడినవి. గత సంవత్సరములందువలెనే జెనివా యూనివర్సిటివారు తులనాత్మక మత వేదాంతములపై (Comparative religion and philosophy) ఉపన్యాసపరంపర నిచ్చుటకై కేంద్రాధ్యక్షులు శ్రీసత్యబోధానందస్వామి వారి నాహ్వానించిరి. విషయము : హిందూమతము – టావో మతము – సూఫీమతము. పారిసునందును రోము నందును నిర్వహింపబడిన ఇంటర్ రిలిజియస్ కాంగ్రెసులకు (Inter religious congress) ను స్వామి ఆహ్వానితు డయ్యెను.

మ్యూనిచ్ (Munich) బోర్డో (Bordeaux) నైమ్ (Nimes) నగరములందు అంతరంగికములనుకూడ స్వామి నిర్వహించెను.

రామకృష్ణ వేదాంత కేంద్రము ఇప్పటికి ఫ్రెంచిభాషయందు ఆరు పుస్తకములను ప్రచురించి యున్నది.

## శ్రీరామకృష్ణమిషన్ ఆశ్రమము, చిరపుంజి 1971 నుండి '74 వరకు నివేదిక సంగ్రహము

1924 సంవత్సరమున శ్రీ ప్రభానందస్వామి వారి నాయకత్వమున కొందఱు శ్రీరామకృష్ణ మఠసన్న్యాసులు చిరపుంజికి 13 మైళ్ల దూరమున నున్న షెల్లావద్ద సేవాకార్యమును చిన్న ఎత్తున ప్రారంభించిరి. కార్యక్రమము, ప్రత్యేకించి విద్యాదానము, ఖాసీకొండలయందు వ్యాపించి 1937 నందు షిల్లాంగ్‌నందు గల ఆశ్రమము శ్రీరామకృష్ణమిషనునకు అనుబంధింప బడినది. పదునొకండు సంవత్సరముల పిదప షెల్లావద్దను నోంగ్‌వార్ వద్దను గల విద్యాలయములతో చిరపుంజి కేంద్రము ప్రత్యేకశాఖగ వ్యవస్థీకరింప బడినది.

చిరపుంజి కేంద్రమున ఒక చిన్న పూజామందిరము ప్రార్థనగదియు కలవు. శ్రీ చండికా

నందస్వామి ఖాశీభాషలో రచించిన పాటలతో ఖాశీజనులు వారమున కొకపర్యాయము అచ్చట భజన చేయుదురు. పక్షమున కొకసారి రామనామభజన జరుగును. స్థానిక జనుల సహాకారముతో శ్రీరామకృష్ణ వివేకానంద శారదాదేవి తదితర మహాపురుషుల జన్మదినములందు ఉత్సవము చేసికొందురు. కేంద్రముచే 29 మంది ఉపాధ్యాయులుగల ఒక ఉన్నత విద్యాలయము నడుపబడుచున్నది. దానికి 10000 పుస్తకములు గల ఒక గ్రంథాలయమును గలదు. ఆటలయందు సంగీతమునందు స్థానికులగు విద్యార్థులకు ఆసక్తి మెండు. విద్యాలయమును వారిని ప్రోత్సహించుచున్నది. సాంకేతిక విభాగమున నేతపని దర్జీపని వడ్రంగము తేనెటీగల పెంపకము టైపింగ్ నేర్పబడుచున్నవి. విద్యాలయమున కొక వసతి గృహమును కలదు. వివేకానంద శతతమ జయంతి సభామంటపమున ఉపన్యాసములు చలనచిత్ర ప్రదర్శనములు మొదలగునవి నడచును.

షెల్లా ఉపకేంద్రమున స్థానికులగు ఖాశీ భక్తులు మందిరమున నిత్యపూజయు ధార్మికోపన్యాసములు భజనలు జరుపుదురు. దుర్గాపూజ వీరికి ముఖ్యమగు పండుగ. దాదాపు పూర్తిగ స్థానికులే దీనిని నిర్వహింతురు. ఒక మాధ్యమిక (ఆంగ్ల) పాఠశాలయు ఒక నర్సరీ పాఠశాలయు ప్రైమరీ స్కూలును ఉచితపఠనాలయ గ్రంథాలయములును ఈ కేంద్రముచే నడుపబడుచున్నవి. స్థానిక సమావేశములకు సభామంటప మొకటి ప్రభుత్వసహాయముచే నిర్మింపబడినది.

శోభార్ ఉపకేంద్రమున సాంకేతిక విభాగముతో కూడిన ఒక మాధ్యమిక (ఆంగ్ల) విద్యాలయము, జూనియర్ బేసిక్ విద్యాలయము, 20 మంది బాలురకు ఒక వసతి గృహము, 20 మంది బాలికల కొక వసతి గృహము కలవు. పాఠశాలలయందు 67 గురు బాలబాలికలు విద్య నభ్యసింతురు.

ఇవికాక దక్షిణఖాశీకొండల పర్యంతము 9 మాధ్యమిక పాఠశాలలను 27 ప్రైమరీ స్కూళ్లను చిరపుంజి కేంద్రము నిర్వహించును. వీనియందు 1051 బాలబాలికలు చదువుదురు. అంతియగాక ప్రభుత్వసహకారముతో తేనెటీగల పెంపకమును, శాస్త్రీయ పద్ధతులను ప్రచారింపబడుచున్నవి. 40 పశువులతో నొక గోశాలయు 50 పక్షులతో కోళ్ల పెంపకము కూడ నిర్వహింపబడుచున్నవి.

* * *

సింగపూరు శ్రీరామకృష్ణ మఠాధ్యక్షులు శ్రీ సిద్ధాత్మానందస్వామివారు నవంబరు 3 వ తేది మద్రాసు మఠమునకు వచ్చిరి. రెండు దినములుండి 5 వ తేది కన్యాకుమారికి పోయి త్రివేంద్రమునందలి మఠమునుచూచి 7 వ తేది మరలి వచ్చిరి. 8 వ తేది సభయందు అధ్యక్షత వహించి 9 వ తేది మరల సింగపూరునకు బయలుదేరి పోయిరి.

హైదరాబాదు శ్రీ రామకృష్ణ మఠాధ్యక్షులు శ్రీ రంగనాథానందస్వామివారు సిడ్నీ (ఆస్ట్రేలియా) యందు సాంవత్సరిక అంతర్యోగమును ఒక మాసము పర్యంతము నిర్వహించుటకు పోవుచు 16 వ తేది సాయంకాలము మద్రాసు మఠమును చేరిరి. 17 వ తేది ఉదయము భాగవతముపై నుపన్యసించి ఆ మధ్యాహ్నమే తమ ప్రయాణమును కొనసాగించిరి.

# శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-600004

## 1976-వ సంవత్సరము, జనవరి మాసమున జరుగనున్న ఉత్సవ కార్యక్రమము

**శ్రీవివేకానందస్వామి జన్మదినోత్సవము :**

23-1-76 శుక్రవారము : తిథిపూజ ఉదయము 6 గం.నుండి, 11 గం. వరకు విశేషపూజ హోమము.
ఉదయము 8.15 నకు మెరీనాయందలి వివేకానంద ప్రతిమకు పుష్పమాలాలంకరణము.

25-1-76 ఆదివారము : బహిరంగోత్సవము.

అపరాహ్ణము 3-30 నుండి 5-30 వరకు : శ్రీశంకర విజయముపై బ్రహ్మశ్రీ మంజక్కుడి రాజగోపాలశాస్త్రిగళ్‌యొక్క ఉపన్యాసము.

5-30 నుండి 7-30 వరకు: శ్రీమత్తపస్యానందులవారి యధ్యక్షతయందు బహిరంగసభ.

**ఆదివారములందు సత్సంగ సమావేశములు :**

అపరాహ్ణము 4-00—4-20 వరకు శ్రీవిష్ణు సహస్రనామ పారాయణము (4-1-76, 18-1-76)
„ „ „ లలితా సహస్రనామ పారాయణము (11-1-76)
4-20—4-30 „ ధ్యానము.
4-30—5-30 „ తమిళమున ఉపన్యాసములు :
శ్రీమద్భాగవతము : శ్రీ 'అణ్ణా' ఎన్. సుబ్రహ్మణ్యంగారు (4-1-76)
శ్రీవిష్ణు సహస్రనామము : శ్రీ వి. ఆర్. కల్యాణసుందరశాస్త్రిగళ్ (11-1-76)
5-35—6-30 „ ఆంగ్లమున ఉపన్యాసము :
శ్రీమద్భగవద్గీత : శ్రీమత్తపస్యానందస్వామివారు.
6-30—8-00 „ ఆరాత్రికము - భజన.

**ప్రత్యేకోపన్యాసములు :**

3-1-76 శనివారము : 5-30 శ్రీమద్రామాయణ పఠనము : శ్రీ పి. రామకృష్ణన్, ఐ.సి.ఎస్. (రిటైర్డు)
10, 31-1-76 „ 5-30 శ్రీమద్రామాయణము : డాక్టర్ ఎన్. వీఝినాథన్‌గారు.

**ఇతర వారములందు ఉపన్యాసములు :**

సోమవారములు : శ్రీవిష్ణుసహస్రనామము (ఆంగ్లము) శ్రీ వీతమోహానందస్వామివారు.
మంగళవారములు : అధ్యాత్మరామాయణము (ఆంగ్లము) శ్రీ గభీరానందస్వామివారు.
బుధవారములు : శ్రీమద్భాగవతము (ఆంగ్లము) శ్రీ గోలోకానందస్వామివారు.
గురువారములు : అముదమొழி (తమిళము) శ్రీ శ్రీరంగానందస్వామివారు.
శుక్రవారములు : ఆత్మబోధ (తమిళము) శ్రీ ఆర్. రామకృష్ణన్.
11-1-76 ఆదివారము : అంతర్యోగ సాధన.

ఉభయ ఏకాదశులయందును సాయంకాలిక ఆరాత్రికానంతరము శ్రీరామనామ భజన (13-1-76, 27-1-76)

7-1-76 బుధవారము: శ్రీ శారదానంద జయంతి.

16-1-76 శుక్రవారము: శ్రీ తురీయానంద జయంతి.

శనివారములందు సాయంకాలము 6.30 గంటలకు తిరువళ్లిక్కేణియందలి దక్షిణ మాడవీధియందు 18-వ నంబరుగల శ్రీరామకృష్ణ మందిరమున శ్రీమత్ విబుధానందస్వామివారి భగవద్గీతోపన్యాసములు.

ఈ ఉత్సవము లన్నింటియందును భక్తులెల్లరును పాల్గొని భగవంతుని యనుగ్రహభాగ్యమును బడయగోరుచున్నాము.

అధ్యక్షులు,
శ్రీరామకృష్ణమఠము, మద్రాసు-600004.

---


సంపాదకులు : శ్రీ చిద్ఘనానందస్వామి.

శ్రీ ఎమ్. బాలసుందరంగారిచే ఫ్రీడమ్ ప్రెస్, (మద్రాసు-600021) న ముద్రింపబడి,

శ్రీ చిద్ఘనానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మద్రాసు-600004) నుండి ప్రచురింపబడినది.